# నాటకములు.

మృచ్ఛకటిక

ముద్రారాక్షసము

బాలరామాయణము

ప్రద్యుమ్నపట్టాభిషేకము

వంసతరాజము

వ్యసనవిజయము

# విజ్ఞప్తి

ఈనాలుగవ సంపుటముతో మేము సంకల్పించిన ఎనిమిది సంపుటముల ప్రచురణమును పూర్తియైనది. షష్టిపూర్త్యుత్సవమునకు మున్ను శ్రీతిరుపతి వేంకటకవులు రచించిన ఆంధ్రగ్రంథములన్నియు, చిన్నగ్రంథము లేనాలుగింటితో తప్ప లెక్కనవి, మేము ముద్రించి ఆంధ్రమహాజనుల కందజేయగల్గితిమి. మొత్తము 3600 పుటలకు మించదని మేము [illegible] అంచనా యిప్పటికే మీఱిపోయి, సుమారు 5400 పుటల గ్రంథమగుటచే, కాశీసహస్రములను గీర్వాణ గ్రంథములను మేము ముద్రింపలేకపోతిమి. దేవీభాగవతము, అష్టమస్కంధము మొదలుకొని తుదివఱకును, జాతకచర్యయు, లోకాభిరామాయణమును, ఆరోగ్యభాస్కరమును, వ్యసనవిజయమును, సతీస్మృతియు, కాశీయాత్రయు మేమే తొలిసారి ప్రచురించు భాగ్యము కలిగినది. శ్రీశాస్త్రులవారు టీకల రచించుచున్న పద్యగద్యకృతులు మఱికొన్ని సంపుటములు కాగలవు. కాని పైని చెప్పిన కారణముచే మేము వానిజోలికి పోలేదు.

రెండుసంవత్సరములు [illegible] కాలము పట్టుననుకొన్న యీ ప్రచురణకార్యమునకు మూడున్నరసంవత్సరములు పట్టినది. సాధారణముగా ముద్రణకార్యము మన మనుకొన్నట్లు నెఱవేఱదు. ముద్రాలయాధికారుల అశ్రద్ధయు ఈకార్యమును [illegible] కొంత తొందరైయుండుటయే ఆలస్యమునకు కారణమైనది. ఇంతటి దీర్ఘకాలవిలంబమును సహించిన మా చందాదారులకు కృతజ్ఞులము.

ఈనాలుగవ సంపుటమున శ్రీమృచ్ఛకటికాది ఆంధ్రీకరణములు ఈకూర్పులో మార్పులు చెందినవి. వీనిని సుమారు 35 సంవత్సరములనాడు ఆంధ్రీకరించునప్పుడు ప్రత్యంతర సాహాయ్యము లేకపోవుటచేతను, సంపూర్ణమగు వ్యాఖ్యలు అప్పటికి లభ్యములు కాకపో

వ్రాటచేతను పాఠనిర్ణయమునకును అర్థనిర్ణయమునకును అంతగా అవకాశములేమి కొన్నిపొరపాటులు దొరలినవి. అవి చాలవఱకు సము దక్షిణమున సవరింపబడినవి. బాలరామాయణోత్తరార్థమున మాత్ర ముట్టిసవరణలు జరగలేదు. కార్యాంతరవ్యాపృతులయ్యు నే[illegible]కి చేసికొని పూర్వార్థమును సవరించియిచ్చిన శ్రీ వే[illegible] ప్రభాకర శాస్త్రిగారియెడ గడుంగడు కృతజ్ఞత ప్రకటించుచు, ఉత్తరార్థమును గూడ నట్లే సవరించి యిచ్చుభారమును వారిపై మోపుచు, అనతి కాలమున ఆసవరణల ననుబంధముగా ప్రకటింపగలమని ఆశించుచున్నాము. ఆయనుబంధముతో బాలరామాయణశుద్ధపత్రికనుగూడ ప్రకటింపగలము. అసూయాపిష్టులగుటచే సహృదయత్వమును గోల్పోయి, కవితారసాస్వాదనార్హతకు దూరులైన కవిపండితులు మాపి[illegible] ధరించి, బాలరామాయణమునేకాక, మేము ప్రచురించిన యితరాన ద్గ్రంథములందును, మాయజ్ఞతచేతను ముద్రాపకుల యశ్రద్ధచేతను దొరలిన స్ఖాలిత్యములనెల్ల మన్నింపుడని వేడుకొనుచున్నాము

ఆంధ్రజాతీయ కళాశాల
బందరు. 15-4-37

కాటూరి వేంకటేశ్వరరావు.
ప్రచురణ కార్యదర్శి.

శ్రీరస్తు

# మృచ్ఛకటికము

## ప్రథమాంకము

## నాంది

సీ. ఆసీనమౌకాళ్ళ సందుముట్టులుగఁ బర్యంకంబు బంధించి లో
పలియింద్రియంబుల వారించి విషయత్యాగంబు గావించి యా
త్మారామతనదంబునఁ బరమాత్మఁ గాంచుచుం దత్త్వదృ
ష్టిఁ జెందియున్న సమాధినిష్ఠ మిము రక్షించుం దయావంతమై.

గీ. నాదు చేతులగాఁ బంపుఁ గౌఁగిలింత
మెఱపుగాన్పించవదను మేటి కొఱలెడు దీర్ఘ
నీలమేఘములోఁ బోలు దాలుగల్గు
కాలకంఠుని గళము మిమ్మేలుఁగాత.

(నాందీపద్యాంతమున సూత్రధారుఁడు) చాలుఁజాలు. సభాసదుల కుల్లాసము గలిగించుటకై యీ పరిశ్రమమేల? పూజ్యులగు పండితులార! మీకొక విన్నపము. మేము నేఁడు మృచ్ఛకటికమను ప్రకరణము నభినయింపఁదలఁచి యున్నారము. ఈ నాటకము సంస్కృతమున నొనర్చిన యతఁడు—

గీ. పూర్ణచంద్రాననుండు ప్రఖ్యాతకీర్తి
ద్విజుల తలమానికము మదద్విరదగామి
రాచతెలివి చకోరవిలోచనుండు
శూద్రకుండను కవిరాజు సుందరుండు.

సీ. చదివె ఋగ్వేదంబు సామవేదము గణితంబు వైశికవిద్య దంతిశిక్ష
గాంచెఁ బర్వతకన్యకానాథు కృపచేతఁ దిమిరంబు వాసిన దివ్యదృష్టిఁ
బడసెఁ బనుం దగుఁ బాలనాచార్యమునఁ దనయంతవానిని సుకుమారుఁ
బనియించె నశ్వమేధము చేసె మేటిదక్షిణలచే సురలను క్షితిసురులను

గీ. సంప్రీతులఁ జేసెను సంయుగవ్యసని, శత్రు
గజములం గూల్చు చేలావు గలుగువాఁడు

బ్రతికె నూఱేండ్లపై నొక పదిదినములు
వ్రేల్చె మే నగ్నిలోన శూద్రకవిభుండు.

చ. సకలగుణాభిరాముఁడు ప్రశస్తయశస్సురభీభవద్దిగం
తరుఁడు గభీరుఁ డున్నతుఁ డుదారుఁడు ధీవరుఁడైన కృష్ణనృపా
వరుని కవీంద్రులైరెవరు సన్నుతమందు శతావధానులే
తిరుపతివేంకటేశ్వరులు తెల్గొనరించిరి నారు వానికిన్.

ఈనాటకమునందలికథ యేమనఁగా,

గీ. బ్రాహ్మణుఁడు పేదపడిన వ్యాపారిసుతుఁడు
చారుదత్తుఁడనంగ నుజ్జయినిఁ గలఁడు
కలదు వేశ్యయొకర్తు చక్కఁదనమున వ
సంతశోభను బోలు వసంతసేన.

గీ. వారి యిరువుర ప్రేమానుబంధ మిందు
వర్ణనీయంబు, కలదు సర్వత్రనీతి
తెలియు దుర్వ్యవహారంబు, ఖలచరిత్ర
వితము, భవితవ్యతావశ్యకతయు దీన.

(పరిక్రమించి యెదుటికిఁజూచి) ఏమిది, మాసంగీతశాలలో నొకరును లేరు! నాటకులందఱు నెచ్చటికిఁ బోయిరో! (ఆలోచించి) అవును తెలిసినది.

గీ. సుతులులేని యిల్లు శూన్యంబు, చిరశూన్య
మనుఁగుకాఁడులేని యతని బ్రతుకు,
మోఱకునకు శూన్యములు దిక్కులెల్ల, స
ర్వంబుశూన్య మర్థరహితులకును.

సంగీతముగూడ నేనేపాడితిని. ఈపాటవలన నాఁకలిచేత గ్రీష్మమునం దలి యెండవేఁడిమిని వాడినతామరగింజలవలె నల్లపాపలల్లాడ నాకన్నులు కిట కట లాడుచున్నవి. చలిదియన్నమేమైన నున్నదో లేదో నాభార్యను పిలిచి యడి గెదను. అబ్బబ్బ! ఈచిరసంగీతోపాసనము వలన నాయవయవములన్నియుం గెండి పోయిన తామరతూండ్లవలె నాఁకలిచే వ్రేలఁబడుచున్నవి (ఎదుటికిఁజూచి) ఇంటికిఁ బోయి పెండ్లము చల్దియన్నము దాఁచినదో లేదో యడుగవలయును. ఇదిగో! మాయిల్లు, ప్రవేశించెదను. (ప్రవేశించి చూచి) ఏమివింతయిది! మాగృహమం తయు నేఁడు క్రొత్తగానున్నదే! నడువపాడవునఁ గడుగునీరు కాలువలు గట్టినవి,

లోహపుఁగాఁగులు కోరగించుటచేత నుసియంటిన భూమియంతయుఁ దిలకము దాల్చిన పురంధ్రివలె శోభించుచున్నది. ముక్కుపుటములఁ బ్రవేశించిన తాలింపు వాసనలు నాయాఁకలి మఱింతవృద్ధిపఱచుచున్నవి. పూర్వులార్జించిన పాఁతేమైన బయల్పడెనా లేక యాఁకలిచే నాకు జగమంతయు నన్నమయముగాఁ గనఁబడుచున్నదా? ఇంటిలోఁ జలిదియుండదు. ఆఁకలిచే నాకుఁ బ్రాణములు పోవుచున్నవి. నేఁడిట నన్నియుఁ గ్రొత్తసన్నాహములే జరుగుచున్నవి, ఒక్కతె మైపూఁత గంధము నూరుచున్నది. ఒకతె పూవులు గ్రుచ్చుచున్నది. (యోచించి) ఎందులకో! కానిమ్ము; మాయింటిదానిని పిలచి యడిగి యథార్థము దెలిసికొనియెదను (తెరవంకఁ జూచి) ఆర్యా! యిటురమ్ము

నటి— (ప్రవేశించి) ఆర్యపుత్రా! ఇదిగో వచ్చితిని.

సూత్ర— ఆర్యా! నీకు స్వాగతమా?

నటి— నేనేమి చేయవలయునో నియోగింపుము.

సూత్ర— ఆర్యా! ('చిరసంగీతోపాసనము' అనునది చెప్పి) మనయింటిలోఁ దినుటకేమైన నున్నవా, లేదా?

నటి—ఆర్యపుత్రా! అన్నియు నున్నవి.

సూత్ర— ఏమేమియున్నవి?

నటి—గుడాన్నమున్నది, పెరుఁగున్నది, నేయియున్నది, బియ్యమున్నవి. మీరు తినఁదగినరసాయనము లన్నియు నుండునట్లు మీకులదేవతలు సమకూర్తురు గాక!

సూత్ర—నిజముగా మనయింటనున్నవా, పరియాచకమాడుచున్నావా?

నటి—(తనలో) వేళాకోళమే చేసెదను. (ప్రకాశము) ఆర్యపుత్రా! అంగడిలో నున్నవి.

సూత్ర—(కోపముతో) ఓసి! అపవిత్రురాల! నాయాశవలె నీయాశ నిరాశ గాఁగలదు. నీవు కోరినపదార్థములు దొరకకపోవును. ఏతపుబావవలె నెత్తి కుదవైచితివిగదే!

నటి—ఆర్యపుత్రా! క్షమింపుము. పరిహాసమునకంటిని.

సూత్ర—సుందరీ! మనయింటఁ గ్రొత్త క్రొత్త పనులుజరుగుచున్నవి, కారణమేమి? ఒక్కతె పిండిపిసుకుచున్నది. ఒక్కతె పువ్వులుగుచ్చుచున్నది. ఒక్కతె ముగ్గులు పెట్టుచున్నది.

నటి—నేనొక నోము నోఁచుకొనుచున్నదానను.

సూత్ర—ఈనోము పేరేమి ?

నటి—అభిరూపపతియని దీనిపేరు. ఈనోము నోఁచిన మంచిమగఁడు దొరకునఁట.

సూత్ర—ఈలోకమందా, పరలోకమందా ?

నటి—పరలోకమునందే

సూత్రి— పెద్దలార ! చూడుఁడు, చూడుఁడు. నాధనము వెచ్చించి పరలోకమున నింకొక మంచిమగని వెదకికొనుచున్నదఁట !

నటి—ఆర్యపుత్ర ! అనుగ్రహింపు మనుగ్రహింపుము. పరలోకమునఁగూడ నీవే భర్తవుకావలెనని యీవ్రత మనుష్ఠించుచున్నదానను.

సూత్రి—ఇది నీకెవ్వ రుపదేశించిరి ?

నటి—దేవర ప్రాణమిత్రుఁడగు చూర్ణవృద్ధుఁడు.

సూత్రి—ఓరి తొత్తుకొడుకా ! చూర్ణవృద్ధ ! సుగంధిలమగు వనవధూశిరోమాల మును ఛేదించిన రీతిని కుపితుండగు పాలకరాజు నీతల దఱుగుమంచఁగా నెపుడుచూచెదనో.

నటి—ప్రాణేశ్వరా ! దయయుంచుము. నీకొఱకే యీవ్రతము (అని పాదముల మీఁదఁబడును)

సూత్ర—ప్రియురాల ! లెమ్ము. ఈవ్రతమున కిందేమి కావలయునో నుడువుము.

నటి—మనయింటికిఁ దగిన యొకబ్రాహ్మణుని భోజనమునకుఁ బిలువవలయును.

సూత్ర—అటులేని నీవునడువుము. నేనుబోయి బ్రాహ్మణుని భోజనమునకుఁ బిలుచు కొనివత్తును.

నటి—దేవర చెప్పినట్లు చేసెదను (నిష్క్రమించును)

సూత్రి—(తిరిగి తిరిగి) వింతగానున్నదే ! సుసమృద్ధమైన యీయుజ్జయినీపురమున నాకుఁదగిన బ్రాహ్మణు నెట్లు వెదుకఁగలను ( ముందుఁజూచి ) ఇదిగో, చారుదత్తుని మిత్రుఁడు మైత్రేయుఁ డీవీధివెంబడి వచ్చుచున్నాఁడు. కానీ! వీనినడిగెదను, (సమీపించి) ఓమైత్రేయ! నేఁడు మాయింటికిభోజనమునకు దయచేసి మమ్ముఁ గృతార్థులనుజేయుము.

(తెరలో) ఇంకొక బ్రాహ్మణునిఁ బిల్చుకొమ్ము; నాకుఁబనియున్నది.

సూత్ర—అయ్యా ! మృష్టభోజనము పెట్టెదము, పంక్తికి రెండవవారెవ్వరునుండరు కొంచెము దక్షిణకూడనిచ్చెదము.

(మరలఁ దెరలో) ఇప్పుడేగదా రానని చెప్పితిని, నాకీనిర్బంధమేటికి? పది సారులడిగెదవు.

సూత్ర—ఇతఁడు నామాట నిరాకరించెను, కాని మఱియొక బ్రాహ్మణుని బిలిచెదను (నిష్క్రమించుచున్నాఁడు)

ఇది యాముఖము.

(పిదప నుత్తరీయము చేతఁబుచ్చుకొని మైత్రేయుఁడు ప్రవేశించుచున్నాఁడు)

మైత్రే—(ఆక్షేపముగా) మైత్రేయుఁడు పరులయింటికి నిమంత్రణభోజనమునకుఁ బోవలసిన దురవస్థకు లోఁబడవలసివచ్చెఁగదా! మహానుభావుఁడు చారుదత్తుఁడు ధనవంతుఁడై యున్నదినములలో లోగిటి లోపటిముంగిలి వైపునఁ గూర్చుండి, పరిమళద్రవ్యముల సంభారముతోఁ బ్రయత్నపూర్వకముగ సంస్కరింపఁబడిన భోజ్యములచేతనే తృప్తినొంది, విస్తరిచుట్టును బదార్థములచే నిండియున్న గిన్నెలలో, చిత్రకారుఁడు మట్టునున్న రంగుగిన్నెలలోఁ గుంచెముంచినట్లు, వ్రేళ్ళుముంచి వాచవిమాత్రము చూచుచుండువాఁడను. అచ్చువోసిన యాఁబోతు నెమరువేయుచు నడువీధిలోఁ బండుకొనునట్లు వారియింటనే నిద్రించువాఁడను. నేటికిఁ బరులయిండ్లకు నిమంత్రణభోజనములకై పోవలసివచ్చినది. భోజన మెచ్చటఁజేసినను పెంపుడు పావురమువలె నతని యిల్లుమాత్రము వదలలేకున్నాఁడను. జాజిపూవు వాసనలు గ్రమ్ము నీయుత్తరీయము దేవతార్చన చేసికొనినపిమ్మటఁ జారుదత్తున కిమ్మని యతని ప్రియమిత్రుఁడు చూర్ణవృద్ధుఁడు నాచేతి కిచ్చెను. కావున నతనిం జూచుటకై పోయెదను. (ఎదుటఁజూచి) ఇదిగో! చారుదత్తుఁడు. దేవతాపూజ గావించుకొని గృహదేవతలకు బలియిచ్చుట కీవంకకే వచ్చుచున్నాఁడు.

(పిదప యథోక్తముగాఁ జారుదత్తుఁడు రదనిక యను దాసియుఁ బ్రవేశించుచున్నారు.)

చారు—(ఆకసమువంకఁ జూచి నిర్వేదముతో నిట్టూర్చి)

గీ॥ తొల్లి యేయింటిగుమ్మము లెల్ల నిండ
బలులు తిను హంససారసకులముచేత
నట్టి నాగుమ్మముల బలిముకలు తినునె
పెరుఁగు పచ్చికలోనుండు పురుగులకట!

అని మందమందముగాఁ బరిక్రమించి కూర్చుండును.

మైత్రే— ఈయనయే చారుదత్తుఁడు ! దగ్గఱకుఁ బోయెదను. (సమీపించి) మిత్రమా ! నీకుఁ గుశలమా ? నీవు వర్ధిల్లుదువుగాక.

చారు— (చూచి) సార్వకాలిక మిత్రుఁడగు మైత్రేయుఁడా ! చెలికాఁడా ! కుశలమా ? కూర్చుండుము.

మైత్రే— మంచిది, అటులే కూరుచుందును. (కూర్చుండి) మిత్రమా ! జాజిపువ్వుల తావిఁ గ్రమ్ముచున్న యీ యుత్తరీయము దేవతాపూజయైన పిదప నీ కిమ్మని చూర్ణవృద్ధుఁడు నా చేతికిచ్చెను ఇదిగోఁ బుచ్చుకొనుము. (అందిచ్చును.)

చారు— (పుచ్చుకొని నిర్వేదముతోఁ జింతించును )

మైత్రే— స్నేహితుఁడ ! చింతించెదవేమి ?

చారు— మైత్రేయ ! చింతించుటయే లేదు.

గీ. కీడ్వడినమీఁద జనుఁడు సుఖింపవచ్చుఁ
గటికచీఁకటిలో దివ్వె గాంచినట్లు
మే లనుభవించి మీఁద లేమిపడెనేని
వాఁడు నిజముగ జీవచ్ఛవంబ చూవె.

మైత్రే— చెలికాఁడ! నీమదికి దారిద్ర్యము మేలా ? చావు మేలా ?

చారు— గీ. మగణమందును దారిద్ర్యభరమునందు
మరణమే మేలు దారిద్ర్యభరముకంటెఁ
దత్క్షణమునమాత్రదుఃఖప్రదంబు చావు
చచ్చినందాఁక దుఃఖమొసంగు లేమి.

మైత్రే— చెలికాఁడ! చింతింపకుము. ఐశ్వర్యమంతయు వర్థిజనము పాలుగావించిన నీ పేదతనము, కళలన్నియు దేవతలకిచ్చిన చంద్రునిక్షయమువలెఁ, గొనియాడఁదగినదియే.

చారు— మైత్రేయ ! నాకు ద్రవ్యము లేదనుచింత లేదు.

గీ. మదము లేకున్న వాఁడు తుమ్మెదలు దంతి
చెంతకైనను జనక త్యజించుపగిది
నతిథులందఱు మాయింటి కర్థహీనుఁ
డంచు రాకుంటఁజేసి చింతించుచుంటి.

మైత్రే— మిత్రుఁడా! అరణ్యమునఁ గంటిఁగలు గుట్టనిచోట్లఁ గ్రొల్లఁ బరుపిడు గొల్ల పిల్లవాండ్రిచట్ల, యాపనికిననిన పాడుసంపదలుగూడఁ దప్పెన్నవరు ముట్టక ముడిపెట్టుగా వారిచెంతకే పోవుచుండును. వానికై చింతింపకుము.

చారు— మైత్రేయ!

గీ. బ్రతికి చెడిపోవటంచు నే వగవ; సిరులు
వచ్చియును బోయి వచ్చుచుఁ బోవుచుండు
ధనము లేకున్న మిత్రబృందమ్ముగూడ
వదలునను దుఃఖమే నన్ను వదలకుండె.

మఱియును,

శా. దారిద్ర్యంబున సిగ్గుగల్గుఁ, దద్దపచేతం దేజముంబోవుఁ, దే
జోరాహిత్యమునం బరాభవము వచ్చుం, దాన నిర్వేద మే
పారుం, దాన జనించు వంత, మతి వమ్మైపోవు దుఃఖమ్మునన్,
గారించు స్మృతిలేమి; లేమి సకలానర్థప్రదం బక్కటా!

మైత్రే— వయస్య! పాపినకూటిపంటి ధనమును స్మరించుకొని విచారింపకుము.

చారు— మిత్రమా! పురుషునకు దారిద్ర్యమెట్టిదో యెఱుఁగుదువా?

ఉ. చేరిక చింతకుం, బరులు నేయు తిరస్కృతి, బంధుకోటికిం
దూరము, వైరిలేనిపగ, దోహద మూఱని శోకవహ్నికిన్,
దారల కీసడింపు, విపినంబులపాలగు బుద్ధి, బంధువుల్
చేరనిదారి, లోపలికిఁజేరియుఁ జంపని చిచ్చుగాదొకో.

కాని దీనికేమి. నేనీ గృహదేవతలకు బలియొసఁగినాఁడను. నీవు చతుష్పథమువందలి గ్రామదేవతలకీబలి తీసికొనిపొమ్ము.

మైత్రే— నేను బోను.

చారు— ఏమి కారణము?

మైత్రే— నీవీగతిఁ బూజించుచున్నను నీయందీదేవతల కనుగ్రహము లేకపోయెఁ గదా, యిఁక వీరికి బలియిచ్చుటవలనఁ బ్రయోజనమేమి?

చారు— అట్లనరాదు. గృహస్థులకిది నిత్యమైనవిధి.

గీ. తపముచే వాక్కుచేతఁ జిత్తమ్ముచేత
బలులచేతను బూజింపఁబడిరయేని
సంతసింతురు వేల్పులు; కమముగల్గు
వారి కేటికి వేఱువిచారణములు?

కావున నీవుపోయి గ్రామదేవతలకు బలియొసఁగిరమ్ము.

మైత్రే—నేనుబోను ఇంకొకరినెవ్వరినైనఁబంపుము. నాకంటె బ్రాహ్మణునకుఁ జేసి చేయఁబోయినను, వద్దములోని ప్రతిబింబమునకుఁ గుడివైపు ఎడమయును ఎడమ వైపు కుడియునైనట్లు, విపరీతముగాఁ బరిణమించును. ఇదిగాక యింకొక హేతువుకలదు. ఈప్రదోషవేళయందు రాజమార్గమున వేశ్యాకాంతలు విటులు చేటులు రాజానుగ్రహముగల పురుషులు తిరుగుచుందురు. కప్ప కొఱకు వేచియున్న పామున కెదురుపడిన యెలుకవలె నా కెవ్వరిచేతనో చావు నిశ్చయము. ఇక్కడఁ గూర్చుండినవాఁడవు నీ వేమిచేయఁగలవు ?

చారు—కానీ, కూర్చుండుము, నేను సమాధి నిర్వర్తించెదను.
(తెరలో) వసంతసేనా ! నిలువు నిలువుము.
( పిదప విటశకారచేటులచేఁ దఱుమఁబడుచు వసంతసేన ప్రవేశించుచున్నది)

విటు—వసంతసేనా ! నిలువు నిలువుము.

గీ. నాట్యనిపుణంబులగు చరణంబు లదర,
సౌకుమార్యంబు చెడ, భయచంచలంబు
లైన క్రీఁగంటి చూపులతో నడలుచు
నెఱుకు తరిమెడు లేడినాఁ బఱచెదేల ?

శకా—వసంతసేనా ! నిలు నిలుము.

గీ. ఏలపోయెదు, పాఱిపోయెదవు, తొట్రు
పాటుతో, దయఁజూపుము చంపకు లతాంగి !
బొగ్గు నిప్పులలోఁ బడ్డ పాలనువలెను
కాల్చుచున్నాఁడు నామది కంజశరుఁడు.

చేటు—ఆర్యులారా ! ఉండుముండుము.

గీ జంకిపోయెదవేల ! వేసంగులందు
నీడ కెఱకలు సాచిన నెమ్మివోలె
నడవిఁజొచ్చిన కోడిపుంజట్లు బిదిగొ !
తొట్రుపడుచున్న వాఁడు మాదొర మృగాక్షి !

విటు—వసంతసేనా ! నిలునిలుము.

గీ. ఉలులచేఁ జెక్కఁబడు మణిసిలకు నెట్టి
కలువలంబోలు ఘనదీప్తు లలనువగిది

చ. తెలిసినబ్రాహ్మణోత్తముఁడు దీర్ఘములాడినబావిఁ గ్రుంకఁడే
వలచనివారలుండఁగ; నెమిలి వంచినతీఁగను గాకి వంచదే;
పలుపురు వాడరే ద్విజులువాడిన యోడను; బావి తీరి, దీఁ
గలవలె, కోడజాడ వెలకామిని వైశివి పొందుమందఱన్.

వసం — అనురాగమునకు యోగ్యతకారణముగాని బలాత్కారముగాదు.

శకా — బావా! ఈగర్భదాసి కామదేవాలయోద్యానమునం దాదరిద్రబ్రాహ్మణుఁ జూచినదిమొదలు వానియెడ వలపు దగిలి నన్నుఁ గామింపకున్నది. వాని కొంప యీయెడమచేతివైపుననేయున్నది కావున నిది మనచేతులలోనుండి మరిగిపోకుండఁ జూచుచుండవలయును.

విటు — (స్వగతము) ఈమూర్ఖుఁడేది తెలుపరానిదో దానినే తెలుపుచున్నాఁడు. ఏమీ, వసంతసేన పూజ్యుఁడగు చారుదత్తుని వలచినదా! బాగుగానున్నది. రత్నము రత్నముతోఁ గలియక గాజుపాతితోఁ గలియునా? ఈమూర్ఖునితోనేమి? ఈమె యతని యింటికే పోవునుగాక. (ప్రకాశము) ఓరీ, కాణేలీపుత్రా! చారుదత్తుని యిల్లీయెడమచేతివైపున నున్నదా?

శకా — అవును, ఈయెడమచేతివైపుననే యున్నది.

వసం — (తనలో) అమ్మయ్య! బ్రదికితిని. ఈదుర్జనుఁ డపకారము చేయఁదలచియు నాప్రియుని యింటికి గుర్తుచెప్పి యుపకారమే చేసినాఁడు.

శకా — బావా, బావా? ఈయంధకారమున మినుములరాశిలోఁబడిన మసియుండవలె, నీవసంతసేన చూచుచుండఁగనే మాయమైనదోయి!

విటు — ఓహో! అంధకారము దట్టమగుచున్నది.

గీ. అంధకారమ్ము బొచ్చినయంత నా వి
శాలలోచనముల శక్తి సమసిపోయెఁ
గ్రమముగాఁగ్రమ్ము కారుచీఁకటుల కతనఁ
గనులు మూసియుఁ దెఱచినగతినె యుండె.

గీ. చదలు కాటుక గురియుచున్నదియొ, లేక
తనువునిండారఁ బూఁతపూసెనొ తమమ్ము,
వ్యర్థమైపోవుచుండె దురాత్మసేవ
చందమున నేత్రములలోని శక్తియకట!

శకా— బావా, బావా! నేను వసంతసేనను వెదకెదను.

విటు— నెవకి కనుఁగొనుటకు గుర్తులేమైన నెఱుఁగుదువా, నీవు?

శకా— బావా! ఏమి గుర్తులవి?

విటు— పూవుదండల పరిమళమును, నగలచప్పుడును.

శకా— మాల్యగంధము వినఁబడుచున్నది కాని ముక్కులలోఁ జీఁకటి తూఱుట వలన నగలచప్పుడుమాత్రము స్పష్టముగాఁ గనంబడుటలేదు.

విటు— (జనాంతికముగ) వసంతసేనా!

గీ. కన్పడవునీవు సంజచీఁకటిని మొగిలు
మబ్బుకడుపున డాగినమాదిరిఁ గాని
పూవుదండలయందలివాలుపు, నగల
చప్పుడును తెల్పుచున్నవో చకితశీల!

వసంతసేనా! వింటివా!

వసం—(తనలో) వింటిని, తెలిసికొంటినికూడ. (అందెలూడఁదీసి పూదండలు పారవైచి గోడతడవుచు) గోడతడవుటవలన నొకతలుపులుగుమ్మమొకటి దొరకినది. కాని తలుపులు మూయఁబడియున్నవి. నేనేమిచేయుదును?

చారు—చెలికాఁడా! జపముసమాప్తమైనది కావున నీవు గ్రామదేవతలకై బలినిదీసికొనిపొమ్ము.

మైత్రే—నేను వెళ్లనయ్యా!

చారు—ఎంతకష్టకాలమువచ్చినది!

గీ. మాటవినరింటిచుట్టాలు, మాఱుమొగము
వెట్టుదురు మిత్రులు, లాపదల్పెరుఁగుఁ, గాంతి
వాయు, శీలంబు దఱుఁగుఁ, బైఁ బడు నితరుల
పాపకృత్యంబులును లేదవానికకట!

చం. చెలిమియొనర్పఁ డెవ్వఁడును, జేరికచేయఁడొకండు, భాగ్యవం
తులగృహ మత్సవంబులు గనుంగొనఁబోవ నిరాకరింత్రు, పె
ద్దలదరికేగ సిగ్గుపడుదుఁ, దగుసల్వంబులేమి, నక్కటా!
యలముదరిద్రతాకలుష మాఱవపాతకమౌర గేహికిన్.

మఱియును.

గీ. సుహృదమనియెంచి నాలోనఁజొచ్చితీవు
మందభాగ్యుండనగు నేను మడియునాఁడు

ఘోరదారిద్ర్యమా! యేదిదారినీకు?
నిన్నుఁగూర్చి విచారించుచున్నవాఁడ.

మైత్రే—(తెలతెలఁబోవుచు) అయ్యో! ఇఁకనాకుఁబోకతప్పదు. ఈరదనికనుగూడ నాకుఁదోడంపుము.

చారు—రదనికా! నీవీమైత్రేయునితోఁగూడఁ జనుము.

రద—దేవా! చిత్తము. సెలవైనఁబోయెదను.

మైత్రే—రదనికా! నీవీబలియును దీపమును బుచ్చుకొమ్ము. నే నీతెక్కలతలుపు గడియఁదీసి తెఱచెదను. (తలుపులు తెఱచుచున్నాడు.)

వసం—(తనలో) ఎవ్వరో నా కుపచారముచేయు తలంపుతో తెక్కలతలుపులు తెఱచుచున్నారు; లోపలికిఁబోయెదను. (లోనికిఁబోయి) అయ్యో! అయ్యో! దీపము! దీపము! (రదనిక చేతిలోని దీపమును పైఁటకొంగుతో నార్పును.)

చారు—మైత్రేయ! అదియేమి?

మైత్రే—తెక్కలతలుపులు తెఱచినవెంటనే జయ్యిమనివచ్చినగాలిచే దీప మాఱిపోయినది. పూజ్యురాలా! రదనికా! నీవీగుమ్మమువెంట వీధిలోనికిఁబొమ్ము. నేనులోపలివరాండికలోని కరిగి దీపమువెలిగించి తెత్తును. (నిష్క్రమించును)

శకా—బావా, బావా! వసంతసేనను వెదకెను.

విటు—వెదకుము వెదకుము.

శకా—(ఇట్టటుఁదిరిగి చేతితోఁదడవుచు) బావా! దొరకినది, (విటునిబట్టుకొనును.)

విటు—ఓరిమూర్ఖుఁడ! నన్నురా, పట్టుకొంటివి.

శకా—బావా! నీవీవైపున రహస్యముగానిలిచియుండుము. (చేతులతోఁద్రోసికొని పోయి నిలువఁబెట్టి, వసంతసేనను వెదకుచు) బావా! బావా! దొరకినది (అనిచేటునిబట్టుకొనును.)

చేటు—దేవా! నేను చేటుఁడను.

శకా—ఓరిచేటా! నీవీవైపునయుండుము. (అనిమఱియొక మూలకుఁద్రోసికొనిపోయి నిల్పి) ఈవైపున బావ, ఈవైపునఁజేటుఁడు. ఈవైపునబావ (అనిపదిసారులనుకొని, గుర్తుంచుకొని, మరలవెదకుచు రదనిక కేశపాశముపట్టుకొని) బావా! ఇపుడునిజముగా వసంతసేన దొరకినది.

గీ. కటికి చీఁకటిలోఁ గన్నుగానకుండఁ
బోవుతఱిఁ బూవుదండల తావివలన

నట్టిగుఱ్ఱంచి కీల్జడ పట్టుకొంటి
యాజ్ఞసేనిని చాణక్యుఁ డట్లు నేను.

విటు—(విచారించుచుఁదనలో)

క. పసపపుసర్పమ్మనఁ గులపుకుసుము నభినరించు పూవుఁబోఁడిని గుసుమో
త్కరభూషితమగు కబరీభరముం గొని లాగుచుండె పాపుండకటా!

శకా— గీ. వారికెన్నొబాల! నీవాలభరము నీ శి
రోరుహాభరంబు నీకేశభారమిపుడు
సాగులు, మేడువు, మంగలార్పెను, తలంపు
మోఘనో శంభునో శంకరేశ్వరులనో!

రద—(భయముతో) పూజ్యులైన మీకిట్టిపని తగునా?

శకా—బావా? బావా! మీఁగడమిఁగిన పిల్లివలె నీలంజ కంఠస్వరము మార్చినది.

విటు—కాణేలీపుత్రా! కంఠస్వరము మార్చినదిగా! చిత్రముగా మన్నదే! (ఆలో
చించి) ఇందుఁ జిత్రమేమున్నది?

గీ. అభ్యసించిన దఖిలవిద్యలును, గాక
కాంతియగుచు నటించు రంగస్థలములఁ
గలుగు వంచన కలమంద; కావఁ గంఠ
రవముమార్చుట యొక విచిత్రంబుగాదు.

మైత్రే—(దీపముతోఁ బ్రవేశించి) రదనికా! ఇదయేమిచిత్రమోగాని యూపస్తంభ
మునకుఁగట్టిన మేఁకహృదయమువలె, నీప్రకోపమందమారుతముచే నీదీపము
పురపురలాడుచున్నది.

శకా—బావా! బావ! ఎవ్వరో మనుష్యులు! మనుష్యులు!

మైత్రే—(విని) ఇదితగదు. ఇదికూడదు. ఆర్యచారుదత్తునకు నేఁడు దారిద్ర్యము
వచ్చినదని పరపురుషు లింటిలోఁ జొచ్చుచున్నారా!

రద—ఆర్యా! మైత్రేయ! నాకుఁగలిగిన పరాభవముచూడవేమి?

మైత్రే— నీకా పరాభవము, మాకా?

దర— నాపరాభవము మీపరాభవము కాదా?

మైత్రే— బలాత్కారప్రసంగమా యేమి?

రద— అవును.

మైత్రే— నిజముగా !

రద— అయ్యా ! నిజమే.

మైత్రే— భయపడకుము. తనయింటిలోఁ గుక్కకుఁగూడ దారిద్ర్యమునుండి గా నుండును. ఇఁక మహాబ్రాహ్మణునకు నాకుఁ జెప్పవలయునా ? అయ్యో ! మావంటివారి యదృష్టమువలెఁ గుటిలముగానున్న యీ చేతికఱ్ఱతోఁ గొట్టి పోయిన పాతవెదురుబొంగును బగులఁగొట్టినట్లు నానెత్తిల ముక్కలుచేసెదను

విటు— మహాబ్రాహ్మణ ! సహింపుము, సహింపుము.

మైత్రే— (విటునివంకఁజూచి) ఇతఁడుకాదు దోషి. (శకారునిఁజూచి) నీవే యపరాధి. ఓరీ ! రాజశ్యాలకా ! సంస్థానకా ! దుర్జనుఁడా ! నీకిది తగునటరా, దుర్మనుష్యుఁడా ! చారుదత్తభట్టారకుఁడు నేఁడు దరిద్రుఁడైనఁ గావచ్చును గాని, యతని సద్గుణములచే నీయుజ్జయినీ పట్టనమంతయు నలంకరింపఁబడుటలేదా ! ఆమహాభాగుని యింటికి వచ్చి పరిజనము నిట్లు నిగ్రహించెదవటరా ?

గీ. పరిభవమువచ్చునె పేదవాఁడటంచుఁ
గలిమియును లేమి విధికి నొక్కటియె నూవె !
ద్రవ్యమెంతున్నఁ దగు చరిత్రంబులేని
యతఁడెపో పేదయన, ధనచ్యుతుఁడు కాఁడు.

విటు— (వెలవెలఁబోవుచు) మహాబ్రాహ్మణ ! సహింపుము, సహింపుము ! ఇది అన్యజనభ్రాంతిచే జరిగినపనిగాని పొగరుఁబోతుదనము చేఁగాదు.

గీ. వెదకుచున్నార మేమొక్కచుదిత వలచి

మైత్రే—ఈరదనిక నేనా ?

విటు—పాపముశాంతించుమనుగాక !

అంతలో అమది, పడుచుకుబ్జదియొక్కర్తు
కన్నులఁగోఁ జూచుచుండ నాకాంత ; దాని
భ్రాంతిచేఁ గల్గె నీశీలవంచనంబు.

పెక్కువిధములనిన్నుఁ బ్రార్థించుచున్నాను. నాయనునయము నిరాకరింపకుము, (కత్తిపారవైచి కాళ్లమీదఁబడి, అంజలియొగ్గును.)

మైత్రే—సత్పురుషుఁడా! లెమ్ము. ఎఱుఁగక నిన్ను నిందించిన నాతప్పుసైరింపుము. ప్రతిపాలుకొనుచున్నాను.

విటు — కాదుకాదు. మాటయేతప్పు. ఒక్కయభయమిచ్చెదవా, లే చెప్పెదను.

మైత్రే — లేచిచెప్పుము.

విటు — ఈవృత్తాంతము చారుదత్తభట్టునకుఁ దెలియఁగూడదు.

మైత్రే — నేను చెప్పను లెమ్ము.

విటు — (లేచి) గీ. ఇదిగో! నీకార్మ్యశిరసావహించుచుంటి
బ్రాహ్మణోత్తమ! నీపాదరజముతోడ,
శాస్త్రపాణులమయ్యును జంకుచుంటి
మనసు! గుణశాస్త్రభూషితులైనమీకు.

శకా — (అనసూయతో) బావా! నీవెందులకీదుష్టబ్రహ్మచారి కాళ్లమీఁదఁబడెదవో చెప్పుము.

విటు — భయపడితిని.

శకా — ఎవరివలన?

విటు — చారుదత్తునిగుణములవలన.

శకా — ఇంటిలోఁ దినుటకుఁ దిండిలేనివానికి గుణము లెక్కడివోయి?

విటు — ఛీ, అట్లనరాదురా!
గీ. మందువేసంగిలోన సమస్తజంతు
వులకు నీరిడియెండినకొలనుపగిది
రిక్తులను బ్రోవ నతఁడు దరిద్రుఁడయ్యెఁ
గాని యైశ్వర్యమదమునఁ గాదుమావె.

శకా — ఆగర్భదరిద్రపుఁ దొత్తుకొడుకెవ్వఁడోయి!
గీ. రాధకొడుకింద్రదత్తుఁడో, రావణుండో
కాక మును రామునకుఁ గుంతిగనిన ధర్మ
రాజో, లేక యశ్వత్థామయో, జటాయు
పక్షియో, శ్వేతకేతువో, పాండవుండో?

విటు — ఓరిమూర్ఖా! పూజ్యుఁడగుచారుదత్తుఁడురా.

చ. తెలివికిఁ గాఁపురంబతఁడు, దీనులపాలికి వేల్పుఁజెట్టు, సౌభా
గ్యులకుఁ గుటుంబి, త్యాగమునకుం గని, యెవ్వనినించుకేని నోఁ
బలుకని శీలముం గుణము పౌరుషముం గలమేటి, వానిచే
నిలిచెజగంబు; లట్టి రమణీయచరిత్రుని నీవెఱుంగుదే!

కావుననిచటినుండి మరలిపోవుదమురమ్ము.

శకా—వసంతసేనను వదలియేపోవుదమా ?

విటు—నీకింక వసంతసేన లేదు.

శకా—ఏలలేదు ?

విటు— గీ. గ్రుడ్డివారికి దృష్టి, రోగులకుఁ బుష్టి
యలసులకుఁ గార్యసిద్ధి, మూర్ఖులకు బుద్ధి,
వ్యసనులకు విద్య, వైరుల కాదరంబు
సరణి నీకు లేదింక వసంతసేన.

శకా—వసంతసేనను దీసికొనిరాకుండ నేను రాను.

విటు—నీవీపలుకులెన్నఁడైన వింటివా లేదా ?
గీ. కట్టుఁగట్టకుఁ గట్టినగజము దొరకుఁ
గళ్లెముబిగించుచోఁదురగంబు దొరకు
హృదయమునఁ బ్రీతిగల్గిన సుదతి దొరకుఁ
గాని, లేకున్న దానికర్యంబె పట్టు?

శకా—నీవువెళ్లిన వెళ్లుము. నేనురాను.

విటు—అటులేని నేనుబోవుచున్నాను. (నిష్క్రమించును.)

శకా—బావవెళ్లిపోయెనే. (మైత్రేయునితో) ఓరీ, ధూర్తాగ్రేసరా! కాకపాదశిఖ వంటిజుట్టుగల దుష్టబ్రహ్మచారీ! కూర్చుండుమురా, కూర్చుండుము.

మైత్రే—మేమింతకుమున్నె కూలఁబడియున్నాము.

శకా—ఎవనిచే ?

మైత్రే—విధిచే.

శకా—అటులేని నిలువుమురా, నిలువుము.

మైత్రే—నిలిచెదములే.

శకా—ఎన్నఁడు ?

మైత్రే—మాకు దైవమెన్నఁ డనుకూలమగునో నాఁడు.

శకా—అటులేని యేడువుమురా, యేడువుము.

మైత్రే—ఏడ్పుచునేయున్నాము.

శకా—ఎందుచే ?

మైత్రే—దారిద్ర్యము చేత.

శకా—ఓరీ, నవ్వ్యుమురా, నవ్వ్యుము.

మైత్రే—నవ్వెదనులే.

శకా—ఎన్నఁడు ?

మైత్రే—మరల మా చారుదత్తున కైశ్వర్యము వచ్చినప్పుడు.

శకా—ఓరీ, దుష్టబ్రహ్మచారీ ! నీవా దరిద్రుని యొద్దకుఁబోయి, 'ఓయీ ! చారుదత్త ! కామదేవాలయోద్యానమున నిన్నుఁజూచినది మొదలు నీయందు వలపు దగిలియున్న వసంతసేనయను భోగముపిల్ల, క్రొత్త నాటకమును బ్రదర్శింప నుండువచ్చిన సూత్రధారివలె, నొడలునిండ బంగారునగల నలంకరించుకొని వచ్చుచు మా చేతబలాత్కరింపఁబడి నీయిల్లు దూఱినది. దానిం దీసికొనివచ్చి చేతులార నీవే నాకు సమర్పించితివేని నధికారులతోడి వ్యవహారము మీదర కుండఁ జాలకవగాఁ గలిసిపోదువు. నాకును నీయందు దయగలుగును. లేదేని నీకును నాకును బ్రతికియున్నంతవఱకును విరోధము తప్పదు' అని నా పలుకులు బోధపఱచుము.

ఆ. కూరవరుగు చెడదు, గుమ్మడికాయయుఁ జెడదు గోమయంబుఁ దోడిమఁ బూయఁ
బోదు నీటికూడుఁ బొగచినమాంసంబు, నావిరోధ మెన్నినాళ్ళకైన.

తిన్నగాఁ జెప్పుము. కపటముగాఁ జెప్పుము. మా బాలాగ్రప్రాసాదవిటంకమున నున్న మాకు వినఁబడునట్లు చెప్పుము. లేదేని తలుపుసందునఁ బెట్టి నొక్కిన వెలఁగకాయవలె నీతల మడమడలాడించెదను.

మైత్రే—తప్పక చెప్పెదను.

శకా—(అపవారించి) ఓరీ చేటా ! నిజముగా బావ వెళ్లిపోయెనా ?

చేటు—అవును వెళ్లెను.

శకా—అటులేని మనముగూడఁ ద్వరగఁ బోదమురమ్ము.

చేటు—చిత్తము తమరి కత్తిఁ జేతఁబట్టుకొనుఁడు.

శకా—నీ చేతనే యుండనిమ్ము.

చేటు—కాదుకాదు. దేవరకత్తి దేవర చేతనే యుండనిండు.

శకా—(తలక్రిందుగాఁ బట్టుకొని)

గీ. తోల తొలంచిన ముల్లంగి దుంపఁబోలు
కత్తి యొఱనుంచి నా భుజస్కంధమందు

మోచికొనిపోదు నింటికిఁ బోయ్యనునుచుఁ
గుక్కలఱచిన భయపడ్డ పక్కివోలె.

( పరిక్రమించి నిష్క్రమింతురు. )

మైత్రే—రదనికా! నీవు జరగినయీయవమానముఁ జారుదత్తునకుఁ దెలుపకుమీ. లేమిచేఁజిక్కియున్న యాతనిమనస్సునకు మఱింత ఖేదము గలుగును.

రద—మైత్రేయ! నేనెవతెను? ఏమాటనైనఁగడుపులోదాఁచుకొనురదనికను సుమీ!

మైత్రే—మంచిది.

చారు—(వసంతసేనతో) రదనికా! గాలికొఱకు బైటపరుండిన మనరోహసేనునకుఁ జలివేయును. కావున లోపలఁ బరుండవెట్టి యీయుత్తరీయముఁ గప్పుము.
(మైత్రేయుఁడు దెచ్చియిచ్చిన యుత్తరీయము వసంతసేనకుఁ బోవును.)

వసం—(తనలో) ఈమహాభాగుఁడు నేను రదనికయనుకొనెను. ఏమిచేయుదును? (ఉత్తరీయమందుకొని, యాఘ్రాణించి తనలో) ఔరా! ఇదిజాజిపూలతావులుగుబాళించుచున్నది! ఇతనియౌవనమింకను నుదాసీనముకాలేదు.
(అపవారించి ఉత్తరీయము కప్పుకొనుచున్నది )

చారు—రదనికా! రోహసేనునిఁ ద్వరితముగాలోనికిఁ దీసికొనిపొమ్ము.

వసం—(తనలో) లోపలికిఁబోఁదగని నిర్భాగ్యకులముదాననైతినిగదా.

చారు—రదనికా! మాఱుపలుకవేమి? హా! ఎంతకష్టము!

గీ. మాలవిధిచేత, ధనిరైనమనుజుఁడకట!
భాగ్యహీనుఁడుగాఁ జేయఁబడినవాఁడు
ప్రాణమిత్రులు శత్రువులౌదు, రెంత
భక్తిగలపరిజనము విరక్తిఁజెందు.

(రదనిక, మైత్రేయుఁడు సమీపింతురు.)

మైత్రే—ఆమెరదనికకాదు. రదనిక యిదిగో!

చారు—రదనికయిదియా! మఱి యామెయెవ్వరు?

గీ. తెలియకొనఁగిన నావయిపలువ లాఁతి
చెలువదేహమునకట! దూషితము చేసె

వసం—(తనలో) దూషితముకాలేదు. భూషితమేయైనది.

చారు— తెల్లమబ్బుచే లేఁతచందురుఁడు మరుఁగు
పడినగతిఁజెన్నుమాసె నీపడఁతి మ్రింగపు.

కానీ, పరకళత్రమును జూడరాదు.

మైత్రే— అయ్యా! ఈమె పరకళత్రముకాదు. కామదేవాలయోద్యానములో నిన్ను జూచినది మొదలు నిన్ను వలచిన గుణానురక్తయగు వేశ్యాంగన.

చారు— ఆఁ! వసంతసేనయేనా! (తనలో)

గీ. విభవమంతయుఁ బోయిన వెనుక నన్ను
వలచినదికాంత, యిప్పు డీవనితమీఁద
నాకుఁగల మోహమకటా! యణంచుకొంటి
నల్పనరునల్కవోలె దేహంబునందె.

మైత్రే— అయ్యా! రాజస్యాలకుఁడు, అనగా రాజుగారి యుంపుడుకత్తెతమ్ముఁడు మీతోఁ గొన్ని మాటలు చెప్పుమనియె.

చారు— ఏమి మాటలవి?

మైత్రే— "కామదేవాలయములో నిన్నుఁ జూచినది మొదలు వలచియున్న వసంతసేన యను భోగముపిల్ల, క్రొత్తనాటకములో ముందుగానచ్చిన పాత్రధారివలె, నొడలునిండ బంగారునగ లలంకరించుకొని వచ్చుచు మాచేత బలాత్కరింపఁబడి మీయిల్లు దూఱినది."

వసం— బలాత్కరింపఁబడి యనునక్షరములే నన్ను బ్రతికించుచున్నవి.

మైత్రే— "దానిం దీసికొనివచ్చి చేతులార నీవే నాకు సమర్పించితివేని నధికారులతోడి వ్యవహారము ముదరకుండఁ జులకనగాఁ దేలిపోవును. నాకును నీయందు దయగలుగును. లేదేని నాకును నీకును బ్రతికియున్నంతవఱకు విరోధము తప్పదని."

చారు— (తిరస్కారభావములో) వాఁడా! తెలివితక్కువవాఁడు. (తనలో) ఈయువతి దేవతలకు లభింపఁదగిన స్త్రీరత్నము. కాదేని వాఁడట్టి చీఁకటి సమయమందు.

గీ. రమ్మనాయింటి కనుచు బేరమ్ములాడ
ద్రవ్యమున కాశపడి పోవఁదలఁపకున్నె?
సరసవచనంబు లెఱిఁగియుఁ బురుషపరిచ
యమ్మునకుఁ బ్రౌఢముగ మాటలాడకున్నె?

(ప్రకాశముగ) పూజ్యురాల! వసంతసేన! తెలియక పరిచారికకు నియోగింపఁదగిన పని నియోగించి యపరాధముచేసితిని. ఇదిగో! నాతలయొగ్గి బతిమాలుకొనుచున్నాఁడను.

వసం—ఇట్టియనుచితవేషముతో వీధికెక్కినందులకు దేవరపాదముల నా తల యంటించి యనుగ్రహింపఁ జేసికొనుచున్నదానను.

మైత్రే—ఓహోహో! పండినవరిచేలవలె మీరిరువురు నొకరిపై నొకరు గ నమస్కరించుకొనుచుండ నేనూరకయుందునా! లొట్టిపిట్ట మోకాలివంటి నాతల మీయిరువురి పాదములకంటించి బతిమాలుకొందును. (లేచును)

చారు—చాలు, నీచనవు నంతటనిలుపుము,

వసం—(తనలో) ఏమీ! ఈప్రౌఢోక్తిచాతుర్యము. నేనీ వేషముతోవచ్చి యితని యింటనిలువరాదు. ఇట్లుచేయెదను, (ప్రకాశము) ఆర్యపుత్రా! మీకు నాయందు దయగలదేని యీ యలంకారకము మీయింటదాఁచుఁడు. ఈనగ నాయొద్దనుండెనేని దీనికై పాపాత్ములు నావెంటఁబడుదురు.

చారు—నా యిల్లింత విలువగల నగ దాఁచుటకుఁదగినదా?

వసం—అబద్ధము. వస్తువులు దాఁచుటకుఁ బురుషులయోగ్యత కారణము గాని యింటి దిట్టతనము గాదు.

చారు—మైత్రేయ! అనగఁబుచ్చుకొనుము.

వసం—నాపై దయవచ్చినది (నగనిచ్చును.)

మైత్రే—నీకు శుభము.

చారు—మూర్ఖుఁడ! దాఁచుకొన్నదికాని నీకిచ్చినదికాదు.

మైత్రే—[illegible]టులేనిదొంగ లెత్తుకొనిపోవుదురు—

చారు—కొలదికాలములోనే.—

మైత్రే—మనకు దాఁచనిచ్చిన యీనగను.

చారు—మరలనిచ్చివేయుదును.

వసం—ఆర్య! నేనింటికిఁబోయెదను. నాతోడ నార్యమైత్రేయునిఁగూడఁ బంప వలయును.

చారు—మైత్రేయా! పోయి యామెనింట దిగవిడిచిరమ్ము.

మైత్రే—నీవుపోయిన రాజహంసవెంటఁజను రాజహంసవలెనుందువు, నేనేల, బావఁడను? కుక్కలచేఁజిమ్మఁబడిన నడువీధిలోని బలియన్నమువలె జనులచే నగుబాట్లపాలగుదును.

చారు—కానిమ్ము, నేనేచనియెదను. రాజమార్గమునఁ గొనిపోఁదగినదీపములను ప్రజ్వలింపుము.

మైత్రే—ఓరీ! వర్ధమానక! దీపము వెలిఁగింపుము.

వర్ధ—(రహస్యముగ) చమురులేనిదే నేనెట్లు దీపము వెలిఁగింతునయ్యా?

మైత్రే—(చారుదత్తునితో రహస్యముగ) మనదీపికలన్నియు, దబ్బంతయును వపహరించి కాముకుల నవతలకుఁ బాఱఁద్రోలిన భోగములంజలవలె స్నేహశూన్యములుగానున్నవి.

చారు—మైత్రేయ! దీపమే యక్కఱలేదులే.

గీ. గ్రహగణముతోడ రాజమార్గప్రదీప
మోయనఁగఁ జంద్రుఁడుదయించుచున్నవాఁడు
పలపలని పంకమందలి పాలువోలె
నిరులలోఁబడుచుండెఁ జందురుని కాంతి.

(అనురాగముతో) వసంతసేనా రమ్ము, పోదము.

(పరిక్రమించి) ఇదిగో! నీయిల్లు. లోనికిఁజనుము.

వసం—(అనురాగముతోఁజూచుచు నిష్క్రమించును.)

చారు—మైత్రేయ! వసంతసేన వెళ్లినది. మనమింటికిఁబోదము రా.

గీ. కలకలమువాసి రాజమార్గంబులెల్లఁ
బురమునిండఁ దలారులు దిరుగుచుండ్రి
మోసపోకుండఁబోవలె; దోసములకుఁ
బుట్టినిల్లుగదా యెప్పుడిట్టిరాత్రి.

(పరిక్రమించుచు) ఈసువర్ణభాండము రాత్రి నీవుదాఁచుచుఁ బగలు వర్ధమానుని చేతికిచ్చుచుండుము.

మైత్రే—మంచిది.

(ఇరువురు నిష్క్రమింతురు.)

ఇదితిరుపతి వేంకటేశ్వరాంధ్రీకృతంబగు మృచ్ఛకటికమను ప్రకరణమునఁ బ్రథమాంకము.

శ్రీరస్తు

# మృచ్ఛకటికము

## ద్వితీయాంకము

చేటి— (ప్రవేశించి) తల్లిచే వసంతసేనకడకు సందేశము పంపఁబడితిని. కావున నామెయొద్దకుఁ బోయెదను. (ఎదుటఁజూచి) ఇదిగో నాయ్యరాలు వసంతసేన మనములో నేదియో యాలోచించుకొనుచుఁ గూరుచున్నది. దగ్గఱకుఁ బోయెదను.

(పిదపఁబీఁటమీఁదఁ గూర్చుండి వసంతసేనయు మదనికయుఁ బ్రవేశించుచున్నారు)

వసం— మదనికా ! తరువాతఁ దరువాత ?

మద— అమ్మా ! నేనేమియుఁ జెప్పుచుండుటలేదు. తరువాతఁదరువాత యనెదవేమి ?

వసం— చేటికా ! నేనేమంటిని ?

మద— తరువాతఁ దరువాతనంటివి.

వసం— ఆఁ ! (ఆలోచించి) అగును. అంటిని.

చేటి— (సమీపించి) అమ్మా ! మీయమ్మ స్నానముచేసి దేవతాపూజ చేసికొమ్మని చెప్పుమన్నది.

వసం— చేటీ ! 'నేనీనాఁడు స్నానము చేయను. బ్రాహ్మణునిచేతనే పూజచేయింపు' మని మాయమ్మతో మనవిచేయుము.

చేటి— చిత్తము. (నిష్క్రమించును.)

మద— అమ్మా ! స్నేహముచేనడుగుచున్నానుకాని నీదోషములు వెదకుటకుఁ గాదు. 'తరువాతఁ దరువాత' యేమిటి ?

వసం— మదనికా ! నేను నీకెట్లుకనఁబడుచున్నదానను.

మద— శూన్యహృదయురాలవై మనసులో నెవనినో కామించి వానికై విచారించుచున్నట్లున్నావు.

వసం— చక్కఁగాఁ దెలిసికొంటివే ! పరహృదయగతమును దెలిసికోఁజాలిన మదనికవుగదా.

# ద్వితీయాంకః

మద — అమ్మా! సంతోషము. పడుచువాండ్రకుఁ బంధువైనమదనుఁ డనుగ్రహింపఁ బడినవాఁడు నీవు సేవ్యుఁ డైన యాపురుషుఁడు రాజా, రాజవల్లభుఁడా?

వసం — చేటీ! నేను కోరునది భోగము గాని సేవకాదు.

మద — చదువుకొన్న బ్రాహ్మణునిఁ గోరితివా యేమి?

వసం — నాచే బ్రాహ్మణులు పూజింపఁదగినవారు.

మద — అనేక దేశములు తిరిగి వర్తకము చేసి డబ్బు సంపాదించిన కోమటిఁ గోరితివా?

వసం — వర్తకులతో స్నేహము చేసిన వారు ప్రణయిజనులనందఱి స్నేహము వదలి వాణిజ్యమునకై దేశాంతరము పోవునప్పుడు వియోగదుఃఖ మనుభవించుట కష్టము.

మద — అమ్మా! రాజు కాఁడు, రాజవల్లభుఁడు కాఁడు, బ్రాహ్మణుఁడు కాఁడు కోమటి కాఁడు; ఇంకెవరినిఁ గోరితివి?

వసం — నీవు నాతోఁ గామదేవాలయములోనికి వచ్చితివా?

మద — వచ్చితిని

వసం — వచ్చినచో నీకుఁ దెలిసియే యుండును. నన్నడిగెదవేల?

మద — ఎఱుఁగుదును నీవు నమస్కరించిన దీవించినయతఁడే కాదా!

వసం — అతని పేరెఱుఁగుదువా?

మద — అతఁడు కోమటివీధిలోఁ గాఁపురమున్నాఁడు

వసం — అతని పేరు నే నడిగినది.

మద — అతఁడా జగత్ప్రసిద్ధమైన పేరుగల చారుదత్తుఁడే కదా!

వసం — మదనికా! బాగు! లెస్సగాఁ దెలిసికొంటివి.

మద — అయ్యగారాలా! అతండు దరిద్రుఁడని వింటిమే!

వసం — కనుక నే కోరితిని. దరిద్రునిఁ గోరిన భోగముది లోకములో దూష్యరాలు కాదు.

మద — భర్తృదారికా! పూవులులేనిమామిడిచెట్టునిఁకది కాఁదుతుమ్మెదలు పోవునా?

వసం — అవి మధుకరులు గనుక మకరందము లేదని పోవు.

మద — వానిఁ గామించితివేని, ఏల వారియింటికిఁ బోరాదు; ఏల యింటికిఁ దీసికొని రారాదు?

వసం — ఓసీ! నే నీకార్యము తొందరపడి చేసితి నేని నతఁడు ప్రత్యుపకారము చేయలేకపోయితి ననుసందేహముచేఁ దరువాతఁ గంటికి కనఁబడఁడేమో?

మద— అందుచేతనే సువర్ణభాండ మతని కిచ్చితివా ?

వసం— చెలీ ! నీవు బాగుగాఁ దెలిసికొంటివి.

(తెరలో) ఓరీ ! భట్టారక ! పదిసువర్ణము లప్పుపడి యీజూదగాఁడు పలా గత్తుచున్నాఁడు. పట్టుకొనుము. పట్టుకొనుము. ఓరీ ! నిలువుము రా. నిలువుము.

(పిదప సంవాహకుఁడు అపటీక్షేపముగాఁ బ్రవేశించును)

సంవా— అబ్బబ్బ ! ఈజూదమాడుటకంటెఁ గష్టమయిన పని లేదు.

గీ. కట్టుగిం ద్రెంపికొని తన్ను గర్దభివలె
మించి గర్దభి నన్ను వంచించె నేఁడు
కర్ణశక్తిచే నలఘుటోత్కచుఁడు వోలె
ఘాతితుఁడనైతి శక్తిచే ద్యూతమందు.

గీ॥ పద్దులను వ్రాయు సభికుని బారినుండి
ఎట్లొతప్పించుకొనివచ్చి యిపుడు రాచ
బాటఁ బడినంత నడ్డమై వచ్చె వాఁడు
అకట ! యెవ్వరి రక్షింపుమందు నిపుడు.

ఈసభికుఁడు ద్యూతకారుఁడు నన్ను వెదకుచు వచ్చుచున్నారు. కావున నేనిపు డెదురునడకతో నీపాడుదేవాలయముఁ జొచ్చి యమ్మవారు నవుదును. (అని యట్లు వెనుకకునడచుచు గుడిలోఁ బ్రవేశించి దేవియుండుచోటఁ గూర్చుండెను.)

(అంతట మాథురుఁడు, జూదగాఁడును బ్రవేశించుచున్నారు)

మాథు— ఓరీ ! భట్టారక ! పది సువర్ణముల కొఱకుఁ దగవుచేయఁబడి జూదగాఁడు పాఱిపోయెఁ బాఱిపోయె. నీవువానిం బట్టుకొనలయును, బట్టుకొనలయును.

జూద— గీ. వెదరిపాతాళబిలము దూఱుదువు గాక
స్వర్గమున కేగి దేవేంద్రు శరణమనుచు
వేఁడెదవు గాక నిముఁ బ్రోచు వీరుఁ డెవఁడు ?
పోవఁదలఁచిన సభికుఁడే ప్రోవవలయు.

మాథు— గీ. జూదరికొలంబునకు నెల్ల వాదు దెచ్చి
పాఱిపోయెద వేమిరా పాపి ! భీతి
నొడలు వడఁకఁగ నింక దురోదరంబు
మొనకుఁ జను దెంతె సభికుని మోసపుచ్చి.

జూద— (అడుగుజాడ పరీక్షించి) ఇదిగో యడుగులజాడ ! (కొంతదూరము చూచి) అడుగులజాడ కనఁబడదేమి ?

మాధు— (చూచి యాలోచించి) ఓరీ! యడుగులిచ్చట నెదురుగానున్నవి. దగ్గర పాడుదేవాలయముకూడ నున్నది. వాఁడు మిగుల మోసగాఁడు. వెనుక వడకతో నీదేవాలయము ప్రవేశించియుండును.

జూద— మనము ప్రవేశించి చూతము

మాధు— మంచిది. (అని యిరువురును దేవాలయములోనికిఁ జొచ్చి యొకరికొకరు సంజ్ఞ చేసికొని)

జూద— తలబొమ్మ కన్నిబొమ్మ.

మాధు— కన్నిబొమ్మ కాదురా, తలబొమ్మయే (అనికొంతసేపువివదించి) కానీ, యేదియైనా యొకటే. మనము జూదమాడుకొందము రా. (యిరువురును జూదమాడుదురు)

సంవా— (జూదమాడవలయునను తలంపుచేఁ బుట్టినవికారముల నణంచుకొని తనలో)

గీ. రాజ్యమును గోలుపోయిన రాజుమనము
భేరికాధ్వనిపోలెఁ గంపింపఁజేయు
నాసపుట్టించి, జూదంబునందు ధనము
చెడినవానికి మఱల పాచికలరొదయు.

అ. పైఁడికొండనుండి పడఁద్రోయు నెక్కించు జూదమింక నాడరాదటంచు
నొట్టుపెట్టుకొనియు నడుగఁడు కోకిలారవముఁ బోలు నక్షరవమువిన్న.

జూద— నాదిపందెము, నాదిపందెము.

మాధు— నీదికాదు. నాదిపందెము, నాదిపందెము.

సంవా— (లోపలినుండి పరుగెత్తుకొనివచ్చి) నీదియుఁ గాదు, నీదియుఁ గాదు, నాది పందెము.

జూద— దొరకితివిరా! దొంగ!

మాధు— (సంవాహకుని బట్టుకొని) ఓరీ! లుబ్ధదండక! నావదిసువర్ణములు నాకిమ్ము.

సంవా— ఇచ్చెదనులే.

మాధు— ఇప్పుడిమ్ము?

సంవా— అయ్యా! ఇచ్చెదను. అనుగ్రహింపుము.

మాధు— నాకుఁ బనికిరాదు. ఇప్పుడిమ్ము.

సంవా— అయ్యా! నాతల తిరుగుచున్నది. (అని నేలమీఁదఁబడును) (ఇరువురును గొంతసేపు తన్నుదురు)

మాధు—ఓరీ! జూదరుల కందఱికి లోకువైతివి కా.

సంవా—(లేచి, యేడ్చుచు) అయ్యో! నేనింక జూదమునకు వెళ్ళిపోతినిగదా? నిజము. ఇదిజూదగాండ్రసిద్ధాంతము. దాటరానిది. నేనిప్పు వెళ్ళఁజాలను.

మాధు—ఓరీ! ఎవ్వరినైన జామీ నిమ్ము.

సంవా—మంచిది. (జూదగానియొద్దకువచ్చి) సగమిచ్చెదను. సగమునీవిచ్చుకొమ్ము.

జూద—మంచిది. ఆసగమే తెమ్ము.

సంవా—(సభికునొద్దకువచ్చి) అయ్యా! సగమునకు జామీనిప్పించెదను. సగము నీవు వదలుకొనుము.

మాధు—మంచిది. ఆలాగే కానిమ్ము.

సంవా—అయ్యా! నీవు సగము వదలుకొంటివిగదా?

మాధు—ఆఁ! వదలితిని.

సంవా—(జూదగానితో) అయ్యా! నీవు సగమిచ్చుకొంటివికదా?

జూద—ఔను. ఇచ్చుకొంటిని.

సంవా—అటులేని నేను బోయెదను.

మాధు—ఎక్కడికేగెదవు. నాపది సువర్ణము లిచ్చియేగుము.

సంవా—అయ్యా! పెద్దలార! చూడుఁడు. చూడుఁడు. ఇప్పుడే సగమునకు జామీనిచ్చిన సగము వదలుకొందుమని మొదల సొమ్మంతయుఁ దెమ్మనుచున్నాఁడు.

మాధు—(పట్టుకొని) ఓరి ధూర్తుఁడా! నేను మాధురుఁడను. నేర్పరివగు నాచెంత నీజిత్తులు పనికిరావు. నాసొమ్ము నాకిచ్చి కదలుము. నాకు జామీ నక్కఱలేదు. నేను వదలుకొనను.

సంవా—ఎక్కడనుండి తెచ్చియిచ్చెదను?

మాధు—నీయబ్బనమ్మి తీసికొనిరా.

సంవా—నాకుఁ దండ్రిలేఁడు.

మాధు—నీయమ్మ నమ్మితీసికొనిరమ్ము.

సంవా—నా కమ్మయులేదు.

మాధు—నీవే అమ్ముడువోయి యిమ్ము.

సంవా—అనుగ్రహించి నన్ను రాజవీధికిఁ గొనిపొమ్ము.

మాధు— పదపద. ( పరిక్రమించుచున్నారు. )

సంవా— కానిండు. ఆర్యులార ! ఎవరైన నన్నుగొని యీసభికునకుఁ బది సువర్ణము లిచ్చెదరా ? ( ఆకసమువంకఁజూచి ) నీ వేమిచేయఁగలవని యడుగుచున్నారా ? మీయింటఁగల పనులన్నియుఁ జేసెదను. అడిగి మాటలాడక పోవుచున్నాఁడే ! కానీ, యింకొకని నడిగెదను. ( మరల నట్లేయడిగి ) ఇతఁడుఁగూడ నామాట వినకయే పోవుచున్నాఁడు, హా ! మహాభాగుఁడగు చారుదత్తుని విభవ మంతరించుటఁజేసికదా, యీమంద భాగ్యున కిట్టి దుస్థితి వచ్చినది ?

మాధు— ఓరీ ! తెమ్ము.

సంవా— ఎక్కడనుండి తెచ్చియిచ్చెదను ? ( నేలపైఁబడును. మాధురుఁడులాగును. ) ఆర్యులారా ! రక్షింపుఁడు, రక్షింపుఁడు.

(పిదప దర్దురకుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

దర్దు— ఆహా ! జూదమనఁగాఁ బురుషునకు సింహాసనములేనిరాజ్యముగదా !

గీ. ఎవ్వఁడైనఁ బరాభవం బెన్నఁ, డొకని
కిచ్చు నొక్కనివలన గ్రహించు ధనము,
ఆయమును గూడఁబెట్టిన యధిపుమాడ్కి
ద్రవ్యవంతులు చుట్టును దవిలియుంద్రు.

గీ. అర్థమబ్బిన జూదంబునంద యబ్బు,
నాలు జూదరికే పత్న్యురాలు, కుడువ
నొరుల కీయఁగఁ జెల్లు జూదరికె, జూద
గానికే పోవు ధనమెల్ల గడియలోన.

గీ. త్రేత సర్వధనమ్ముహరించె, మేను
పావరమ్మన కుస్కించె ; బాటఁజూపె
నర్దితమ్మక్కటకట ! అంతమున నిటులు
కటముచేఁ గోలుపోయి పొకాలుచుంటి.

(ముందుకుఁజూచి) మాపూర్వసభికుఁడు మాధురికుఁ డిదిగో నిచటనే యున్నాఁడు. కానిమ్ము. తప్పించుకొనవీలులేదు. కావున ముసుఁగువైచుకొని యెద. (అనేకవిధముల నుత్తరీయము గప్పికొని దానిజూచి)

గీ. నూలుపోగులు లేవిందు నూఱుచిల్లు
లున్నవెటు గప్పుకొందు నీయుత్తరీయ

మున్న చందమ్మునసె దీని నుంచవలయు
మడతవిప్పిన శోభ కన్పడదు దీన.

ఏల యీప్రయాసము ? ఈదీనుఁడు నన్నేమి చేయఁగలఁడు ?

గీ. ఆకసముమీఁదికై యొక్క యడుఁగుఁ జాచి
ధరణిమీఁదను నొక్క పాదంబు నిలిపి
ద్యుమణుఁడెందాకనుండునో యంతదాఁకఁ
గదలకుండెదఁ జిత్రింబుగతిగ నేను.

మాధు— ఓరీ ! యిప్పింపుమురా, యిప్పింపుము.

సంవా— నేనెవరిచే నిప్పింతునయ్యా ? (మాధురుఁడు లాగుచున్నాఁడు.)

దర్దు— (ముందుఁజూచి) ఇదియేమి ? (ఆకసమువంకఁ జూచి) ఈసభికుఁడీ జూదరి నమ్మ జూప నెవ్వరును సొమ్మిచ్చి విడిపింపరైరనుచున్నారా ? ఈదర్దురుఁడు విడిపింపఁగలఁడు. (సమీపించి) తొలఁగుఁడు. తొలఁగుఁడు. (చూచి) ధూర్తుఁడగు మాధురుఁడే ! ఈలాగఁబడు దీనుఁడు సంవాహకుఁడే !

శా. వేలన్ జాలునొ కొమ్మలందొదిగి యీభీరుండు వజ్రాములన్
దాళన్ జాలునొ వీపుగాయపడఁ గ్రిందన్ రాళ్లపై లాగఁగా
జాలిం జెందఁడొ లోదొడల్ గఱచుచున్ శ్వానమ్ములీడ్వంగ, ని
ట్లేలా ? కోమలగాత్రుఁడీతనికి ద్యూతేచ్ఛాపరత్వమ్ము హా !

కానీ, యీమాధురునిబ్రతిమాలుకొనియెద. (సమీపించి) మాధురకా ? దండము

మాధు— (ప్రతి నమస్కారమొనర్చుచున్నాఁడు.)

దర్దు— ఈగడబిడ యేమిటి ?

మాధు— ఈసంవాహకుఁడు మాకుఁ బదిసువర్ణము లప్పుపడియెను.

దర్దు— ఇంతియే కదా.

మాధు— (దర్దురుని చంకలోని వస్త్రపుమడత లాగి చూపుచు) చూచితివా ? అయ్యారె ! ఈచినుఁగులబొంత తాల్చిన యీతనికిఁ బదిసువర్ణములన నెంత తేలికగా నున్నవో ?

దర్దు— ఓరి మూర్ఖుఁడా ! నీపదిసువర్ణములు రేపొక్క పందెములోఁ దీర్చివైచెదను. ధనమున్నవారు మాత్రము సొమ్ము కొంగునఁ గట్టుకొని తిరుగుదురా యేమి ?

గీ. సొమ్ము, నీవెంత నీసువర్ణమ్ములెంత ?
ఏమి పోఁగాలమిది ? ఎవ్వరెవ్వరికిని

నప్పనడరో కోర్కె? యీమాత్ర కకట! నిందు
పాణిని నధయింతువే? సాటివాని నిట్లు.

మాధు — నాయనా! పదిసువర్ణములను నీకంటె చులకనగా నున్నవేమో కాని నా కవియే మహాభాగ్యము.

దర్దు — అటులేని నామాటవిని యింకొక పదిసువర్ణములప్పిచ్చి మరలజూదమాడుము

మాధు — ఆడిన నేమి ప్రయోజనము?

దర్దు — గెలిచిన నీయప్పు దీర్చును.

మాధు — గెలువలేక పోయిన యెడల?

దర్దు — ఇవ్వఁడు.

మాధు — ఇట్టితగవు చెప్పకుము. ఇంత నమ్మకమున్నవాఁడవు నీవప్పియరాదా? నేను జూదములో నీకంటె సమర్థుఁడను నే నరువాట లాడుదుమనటరా? నీతిమాలినవాఁడా! ఎచ్చుతగ్గుమాట లాడకుము. నీకు జడియువాఁడనుగాను.

దర్దు — ఓరి! నీతిమాలినవాఁడెవ్వఁడురా? మరల ననుము.

మాధు — నీవు నీతిమాలినవాఁడవు.

దర్దు — నీతండ్రి నీతిమాలినవాఁడు. (సంవాహకుని బాటిపొమ్మని సన్న చేయును)

మాధు — లంజకొడుక! నీవీలాగున నే జూదమాడితివా?

దర్దు — అవును. ఇటులే యాడితిని.

మాధు — ఓరీ, సంవాహక! నాపది సువర్ణములు నాకీరా?

సంవా — ఇదిగో! ఇచ్చుచున్నాను. (మాధురుఁడు వానిని లాగును.)

దర్దు — ఓరిమూర్ఖ! నాముందే వాని నిట్లు బాధించెదవేమిరా?

మాధు — ఆఁ! బాధించెదను. (సంవాహకునిలాగి ముక్కుమీఁద గ్రుద్దును. సంవాహకుఁడు ముక్కున నెత్తురుగాఱ మూర్ఛిల్లును. దర్దురుఁ డడ్డమురాఁగా మాధురుఁడు వానిని దన్నును. దర్దురుఁడు మరలఁ దన్నును.)

మాధు — లంజకొడుకా! దీనికిఁదగిన ఫలమనుభవించెదవులే.

దర్దు — దురాత్మా! నాదారిని నేను బోవుచుండ నన్నుగొట్టెదవుగా! రేపు రాజసభలోఁ గొట్టుదువుగాని.

మాధు — నేను జూచెదనులే.

దర్దు — ఎట్లు జూచెదవు?

మాథు— ఇట్లు (కన్నులు తెఱచును. దర్దురుఁడు వానికన్నులలో దుమ్ముఁ జల్లి సంవాహకునిఁ బాఱిపొమ్మని సన్న చేయును. సంవాహకుఁడు పాఱిపోవును. మాథురుఁడు కన్నులు నులుముకొనుచు నేలపైఁబడి యేడ్చును.)

దర్దు— (తనలో) పరిధానసభికుఁడగు మాథురునితో విరోధము దెచ్చుకొంటిని. కావున నేనిచట నిల్వరాదు. ఆర్యకుఁడను గొల్లపిల్లవాఁడొకఁడు ముందు రాజు కాఁగలఁడని యొకయోగి చెప్పినట్లు నాప్రియమిత్రుఁడు శర్విలకుఁడు చెప్పెను. నావంటివారందఱు నా గోపాలబాలకు నాశ్రయించుచున్నారు. నేనుగూడ వానియొద్దకే పోయెదను. (నిష్క్రమించును.)

సంవా—(భయముతోఁ బఱువెత్తుచు నెదుటికిఁజూచి) ఎవరిదో యీయిల్లు? ప్రక్క తలుపు తెఱచియున్నది. ఇందుఁబ్రవేశించెదను (ప్రవేశించి, యెదుట వసంతసేనంజూచి) అమ్మా! శరణు శరణు.

వసం— భయములేదు రమ్మా. చేటీ! నీవు తలుపుమూయుము. (చేటి మూయుచున్నది.) అయ్యా! నీకెవనివలన భయము?

సంవా— అప్పులవాని వలన.

వసం— చేటీ! ఇఁకఁ దలుపులు తెఱవవచ్చును. తెఱవుము.

సంవా— అప్పులవాని భయమన నీకెంత యలక్ష్యమేమో! అవును లోకమున నిట్లు చెప్పుకొందురుగదా!

ఆ. తనబలంబెఱింగి దానికిఁ దగినంత బరువుమోయుచున్న పురుషుఁడెట్టి
గహనమునకుఁ బోవుఁగాక విపన్నుండుగాఁడు తొట్రుపడఁ డొకానొకప్పుడు.

మాథు—(కన్నులలోదుమ్ము తుడిచికొని జూదగానితో) ఓరీ! నా పదిసువర్ణము లీరా!

జూద—అయ్యా! మనము దర్దురకునితో కలహమునకు డీకొన్నప్పుడే వాఁడు పాఱిపోయెను.

మాథు—వానిముక్కు చితుక గ్రుద్దితిని. రక్తము కాఱుచున్నది. ఆయానవాలు చూచుకొనుచుఁ బోదమురమ్ము (వెదకుదురు.)

జూద—అయ్యా! వాఁడిదిగో వసంతసేనయింటిలోఁదూఱెను.

మాథు—అటులేని మనసొమ్ము పోయినది.

జూద—పోవుటయేమి? రాజకులమునకుంబోయి తెల్పుకొందము.

మాథు— మనమిటనుండి కదలితిమా వీఁడు మనకు దొరకఁడు. వీనిం బొంచి యుండియే పట్టుకొందము.

వసం — (మదనికతో సన్న చేయుచున్నది.)

మద — అయ్యా! మీ రెందుండి వచ్చితిరి? ఎవ్వరు? ఎవ్వరివారు? ఏవృత్తివారు?

సంవా — అమ్మా! నేను బుట్టినది పాటలీపుత్రపురము. నే నొక సంసారిబిడ్డను. సంవాహనవృత్తిచే జీవించువాఁడను.

వసం — అతిసుకుమారమైన విద్య నేర్చుకొంటివి.

సంవా — అదియు నొకవిద్యగా నెంచి నేర్చితిని. ఇప్పు డదియే జీవనాధారము.

మద — మీరు మిగుల విచారించునట్లు పలుకుచున్నారు. తరువాతఁ దరువాత?

సంవా — నేను మా యింటికి వచ్చువారివలన బోధింపఁబడి, క్రొత్త దేశములు గాంచు తలంపుతో నీ దేశమునకు వచ్చి, యీ యుజ్జయినీపురమునం దొక మహాభాగుని యింటఁ గొలువునకుఁ గుదిరితిని. మా యేలికవంటి ప్రియదర్శనుండును, ప్రియవాదియు, నుపకారము చేసి తలఁపనివాఁడును, యాచకుల కిచ్చి కొండాడుకొనని వాఁడును లోకమున లేఁడు. పెక్కుమాట లేల. అతఁడు దాక్షిణ్యముచేఁ దన శరీరమును సంపదను నొరులకై వినియోగపఱిచినవాఁడు. శరణాగతవత్సలుఁడు.

మద — అమ్మా, వసంతసేన! ఇన్ని సుగుణములను దొంగిలించి యీపురమలంకరించువారు నీమనోరథముకంటె నితరు లెవరున్నారు?

వసం — ఔను, చేటికా! ఔను. నా డెందము తలంచినటులే తలంచితివి.

మద — అయ్యా, తరువాతఁ దరువాత?

సంవా — దీనులయెడ జాలిపడి యిచ్చిన దాతృత్వముచే నాతఁడిప్పుడు —

వసం — వైభవము గోలుపోయెనా యేమి?

సంవా — అమ్మా! చెప్పకయే తెలిసికొంటివి.

వసం — ఇందుఁ దెలిసికోఁదగిన దేమున్నది? గుణసంపత్తియు ధనసంపత్తియు నొక్కచో నుండుట యరుదుగదా. మంచినీళ్ల చెలువులో నీళ్లు మిగులునా?

మద — అయ్యా! ఆయన పేరెవ్వరు?

సంవా — అమ్మా! భూలోకచంద్రుఁడగు నా యేలిక పేరెఱుఁగనివా రెవ్వరు? కోమటివాడలోఁ గాఁపురమున్న అనుగృహీతనామధేయునిఁ జారుదత్తుఁ డందురు.

వసం — (సంతోషముతోఁ బీటదిగి) అయ్యా! ఈయిల్లు తమదియే. చేటీ! పీఁట వేయుము. వింజామర పుచ్చుకొనుము. అయ్యఁడు మిగుల డస్సియున్నవాఁడు.

మద — (అట్లు చేయుచున్నది.)

సంవా—(తనలో) ఆర్యచారుదత్తుని పేరుచెప్పినంతలో నీ మెనాకెంత గౌరవము చేయుచున్నదో! సెబాసు, చారుదత్తా! సెబాసు. బ్రదుకన్న నీ యుపకారము బ్రదికియుఁ జచ్చినవారెందఱులేరు? (ప్రకాశము) అమ్మా! నాకీయుపచారము చాలు; నీవింకఁగూరుచుండుము.

వసం—(కూర్చుండి) అయ్యా! అట్టిపుణ్యులకు సంపదకుఁ జాలదవ్వుగదా!

సంవా— గీ. సంపదలుచూడ నెవరికి శాశ్వతములు?
యోగ్యులకుఁ గీర్తియొక్కటే యుండు ధనము
పరులఁబూజించువాఁడెపో యొరులచేత
నతివిశేషంబుగాఁ బూజలందువాఁడు.

మద—తరువాత నేమిజరగినది?

సంవా—నేనామహాభాగునికాళ్లు పిసుకుచు జీవించుచుండువాఁడను. ఆయన దరిద్రుఁడైనపిదప దిక్కులేక యీజూదముచే జీవించుచుంటిని. అజూదము నందు నదృష్టములేమిఁ బదిసువర్ణములప్పువడితిని.

మాథు—మోసముచేసి దాఁటిపోయితివిగదరా!

సంవా—అమ్మా! అదిగో వారిరువురు నన్ను వెదకుచువచ్చుచున్నారు. నీవేనాకుదిక్కు.

వసం—మదనికా! నివాసవృక్షము మొఱడగుటచే దానిమీఁదిపక్షులు నాలుగుదిక్కులకును జెదరిపోయినవి. నీవు పోయి ఆసభికద్యూతకరులకు సంవాహకుఁడే యిచ్చినాఁడని యీనగనిమ్మా. (కంకణముదీసియిచ్చును.)

మద—(పుచ్చుకొని) అమ్మా! చిత్తము. (నిష్క్రమించును)

మాథు—మోసముచేసి దాఁటిపోయితివిగదరా.

మద—వీరెవ్వరో మీఁదికిఁ జూచుచునిట్టూర్పు పుచ్చుచున్నారు. ద్వారముపంకకుఁ జూచుచు నేమేమోయనుకొనుచున్నారు. వీరే ఆసభికద్యూతకరులని తలఁచెదను. (సమీపించి) అయ్యా. నమస్కారము.

మాథు— గీ. మగనిపలునాట్లుగల మోవి సొగసుతోడఁ
బలుకరించితివిటుఁ జిన్నపడుచువయ్యుఁ
జూచుచుంటివి క్రీఁగంటిచూపుచెదర
నెవతె? వెవ్వరిదానవే, యిగురుబోఁడి!

మేము దరిద్రవంతులముగా, మింకొకచోటికిఁ బొమ్మా.

మద—నీమాటలుజూడ నీవు జూదగానివలె లేవు. మీకెవ్వరైన ఋణపడిరా?

మాథు— ఆఁ, నాకొకఁడు పదిసువర్ణము లీయవలెను. వానికేమి?

మద— వానియప్పుఁ దీర్చుటకై మాయేలికసాని యీయుఁగరము నిచ్చినది. కాదుకా, యతఁడే యిచ్చినాఁడు. (ఇచ్చుచున్నది.)

మాథు— (పుచ్చుకొని) మంచిది. వానియప్పుతీరినదని చెప్పి మరల జూదమాడ రమ్మనుము. (నిష్క్రమింతురు.)

మద— (వసంతసేనయొద్దకువచ్చి) అమ్మా! వారుసంతసించుచుఁ బోయిరి.

వసం— అయ్యా! నీవింక మీవారి నూరార్పఁబొమ్ము.

సంవా— అమ్మా! మీపరిచారకుఁడు నేర్చినవిద్య నీయింట సార్థకము చేయించుకొనుము.

వసం— (ముక్కునవ్రేలిడి) ఎవ్వనినిమిత్తము మీవిద్య నేర్చితివో, యింతదనుక నెవ్వని శుశ్రూష చేసితివో ఆయనయొద్దనే సార్థకపఱచుము.

సంవా— (తనలో) ఆర్యురాలు నాయనునయము నిపుణముగా నిరాకరించినది. ఈమెకు నేనింక నెట్లు ప్రత్యుపకారము చేయఁగలను. (ప్రకాశము) అమ్మా! నేనింక జూదమాడను. నాకీయవమానము చాలును. నేనింక బౌద్ధసన్యాసినై తిరిగెదను. ఈసంవాహకుఁడు బౌద్ధసన్యాసియయ్యెనన్నమాట మాత్రము మఱవకుము.

వసం— అయ్యా! ఇట్టిసాహసము చేయకుఁడు.

సంవా— నే నిశ్చయించుకొంటిని. ఇంకమానను.

గీ. జూదమాడుచు నిందన్కఁ జోరునివలెఁ
చాటుచాటునఁ దిరిగితి సభ్యులకును;
బౌద్ధసన్యాసినై నేను భయముదీఱి
మసలుచుండెద నిఁక రాజమార్గమంద.

(నేపథ్యమునఁగలకలమువిని) ఇదియేమి! (ఆకసముజూచుచు) ఖుంటమోడక మను వసంతసేన దుష్టగజము తిరుగుచున్నదనుచున్నారా? అమ్మయ్యో. మావసంతసేన మదపుటేనుఁగును జూచెదను. (ఆలోచించి) నాకీమత్తగజముతో నేమిపని? తలఁచుకొన్నపని నెఱవేర్చెదను. (నిష్క్రమించును.)

(సంతసముతో నపటీక్షేపమున వికటోజ్జ్వలవేషుఁడు కర్ణపూరకుఁడు ప్రవేశము)

కర్ణ— వసంతసేన యెక్కడ? వసంతసేన యెక్కడ?

మద—ఓరిదుర్మనుష్యుఁడా ! నీకేమి యుపద్రవము వచ్చినదిరా? ఎదుటనున్న సేటికొ సానియే కనుపడకున్నది.

కర్ణ—(చూచి) అమ్మా ! నమస్కారము.

వసం—కర్ణపూరకా ! సంతోషించుచువచ్చితివి, కారణమేమి ?

కర్ణ—(సగర్వముగా) అమ్మా ! జాగ్రత్తగా వినుము. ఘంటమోదకమను మదించి కట్టుఁగట్టు పెకలించుకొని మావటీనిఁజంపి జనులెల్ల గందరగోళముచెందఁ రాజమార్గమునఁబడినది.

క. వడివడిగఁ జెట్లుపైకెక్కుఁడు పిల్లల వీధివాడుకో నీకుఁడు, పో వుఁడు మేడలలో పలికిరి విడివడియెకా మత్తగజము వీధి కవశమై.

ఆ. అందెలూడిపోవ నల్లాడిమొలనూలు జాఱిపోవ మణులుజాఱిపోవ కాలిపోవుచుండె రతనంపువలయముల్ పఱచుచుండె దంతి పణ్యవీథి.

అనుచుఁబ్రజలందఱు గోలయెత్తసాగిరి. పిదప నామత్తగజము వికసించిన పద్మమువలెనున్న యుజ్జయినీపురమునఁ జొచ్చి, కాళ్లచే దంతములచేఁ దొండముచేఁ గలచివేయుచుండ నొకబౌద్ధసన్యాసి యెదురుపడియె. వానిచండ కమండలువులు పోనడఁచి శీకరములు మొగమునిండఁ జిమ్ముచు దంతముల సందున నిఱికించుకొని పోవుచుండఁ బ్రజలు 'సన్యాసిచచ్చెఁ జచ్చె' నని యుద్ఘోషించిరి.

వసం—(తొందరతో) అయ్యో, ప్రమాదము ప్రమాదము.

కర్ణ—అమ్మా ! మఱియేమియుఁ బ్రమాదముకాలేదు. తొందరపడక వినుము. పిమ్మట నామత్తగజము, తెగిపోయి కాళ్లవ్రేలాడు సంకెలలతోడను, దంతములసందునఁ జిక్కిన సన్యాసితోడను నిర్విరోధముగా విజృంభింప, నీకర్ణపూరకుఁడు-కాదు కాదు- మీయన్నము దిని బలిసిన యీదాసుఁ డంగడిలోనుండి యొక యినుపకోలఁదెచ్చి యాయేనుఁగును మొత్తెను.

వసం—తరువాతఁ దరువాత ?

గీ. వింధ్యగిరిశృంగమునుబోలె వీథిఁబడ్డ
దంతిని మరల్చి దానిదంతముల నడుమఁ
జిక్కికొనియున్న సన్యాసి జీవనంబు
నిల్పినాఁడు గదమ్మ ! యీ నీభటుండు.

వసం—కర్ణపూరక ! చాల దొడ్డపని చేసితివి.

కర్ణ— తరువాత నీవిశాలాపురమంతయు, బరువంతయు నొక్క పక్కనున్న యొడవలె నాపక్కకొరగినది. అందొక పుణ్యాత్ముఁడు తన యొడలంతయుఁ దడవికొని యొక్కనగయైనను లేకుండుట యరసి, నిశ్వసించుచు దనమేననున్న యీయుత్తరీయము నామీఁదఁ బడవైచెను.

వసం— కర్ణపూరకా! ఆయుత్తరీయము జాజిపూవులవాసన గ్రమ్ముచున్నదేమో కను పెట్టితివా?

కర్ణ— అమ్మా! ఈమదగజగంధమున నేనా పరిమళము గుఱుతింప నేరకున్నాను.

వసం— చిగురునఁ బేరున్నదేమో చూడుము.

కర్ణ— ఏదియో యున్నది. నాకడను (చేతికిచ్చును.)

వసం— (చదివి) చారుదత్తుఁడుగారిదే (సంతోషమున మీఁదఁ గప్పుకొనును)

మద— కర్ణపూరక! ఈయుత్తరీయ మమ్మగారిమేన నెంత బాగున్నదో!

కర్ణ— ఔను. చాల బాగుగా నున్నది.

వసం— కర్ణపూరక! ఇదిగో నీకు బహుమానము (ఒకనగ నిచ్చును.)

కర్ణ— మదనికా! ఇప్పుడది మఱింత బాగున్నది నుమా!

వసం— ఈసమయమునఁ జారుదత్తుఁడుగారెచటనుందురో?

కర్ణ— ఈవీధిదారినే యింటికిఁ బోవుచున్నారు.

వసం— మదనికా! మేడముంగిలి మీఁదికెక్కి ఆమహాభాగుని జూతమురా!

(నిష్క్రమించు చున్నారు)

ఇది శ్రీ తిరుపతి వేంకటేశ్వరాంధ్రీకృత
మృచ్ఛకటికమను ప్రకరణమున
ద్యూతకర సంవాహకంబను
ద్వితీయాంకము.

---

శ్రీరస్తు

# మృచ్ఛకటికము

## తృతీయాంకము

(పిదపఁ జేటుఁడు ప్రవేశించును.)

చేటు— (ప్రవేశించి)

గీ. సుజనుఁడై భృత్యులను దయఁజూచెనేని
పేదవడియును శోభించుఁగాదె నృపతి
పిసినిగొట్టును విత్తగర్వితుఁడు నేని
పరమదారుణుఁడతఁడు దుష్కరుఁడతండు.

మఱియును,

గీ. దొంగచేల్మేయునాఁబోతు, దొంగరతుల
కాసపడు బోజుంగును, జూదమాడువాని,
దుష్టులకు సహజంబగు దుర్గుణంబు
బ్రహ్మకైనను మానిపింపఁగఁదరంబె?

చారుదత్తుఁడుగారు సంగీతము వినఁబోయి చాలసేపైనది. యింకను రాలేదు నడిరేయి కూడదాఁటుచున్నది. వచ్చుదనుక గుమ్మము వెలుపలనున్న సాలలోఁబరుండెదను.

(పిదపఁ జారుదత్తుఁడును విదూషకుఁడుఁ బ్రవేశింతురు.)

చారు—ఆహాహా! రేభిలుని పాటసొగసు, వీణయనఁగా సముద్రములోఁబుట్టని రత్నమే. ఏలన, ఈవీణయే.

మ. ఎదుటన్వర్తిలుకాంతపో విరహవహ్నిం గ్రాఁగుచో రాగికిన్
మదికింపైన వయస్యునుమ్మ వలప్రేమం గుందుచోఁ గామికిన్
ముద మిచ్చుం బ్రియవిప్రలబ్ధయయి వ్యామోహించుచోఁ గాంతకున్
మదనాటోపము పెంచు నౌషధమునుమ్మా యీగృహస్థాళికిన్.

విదూ—చాలుఁజాలు, రావయ్యా! యింటికిఁబోదము.

చారు—ఔరౌరా! రేభిలుఁడు చాల మంచిపాటఁ బాడెనోయీ.

విదూ— నాకాఁడుదాని సంస్కృతము విన్నను మగవాని కాకలీగీతము విన్నను నవ్వులాలగా నుండును. ఆఁడుది సంస్కృతభాషఁ జదివినప్పుడు ముక్కు-

తాఁడుఁగోసిన గూఁబెయ్యవలె సూ సూ సూ యనును. మగవాఁడు సంగీతము పాడినచో వృద్ధపురోహితుఁడు మెడనిండ నెండిన పూవుదండలు దాల్చి వేదమంత్రములు చదివినట్లుండును.

చారు.— నీవు సంతోషించితివిగావుగాని యీనాఁటి రేభిలునిపాట చాలమంచిపాట

గీ. రక్తిగాఁ దీపుగ మనోహరమ్ముగ లలి
తముగ సమముగ భావాన్వితంబుగాఁగ
స్ఫుటముగాఁ బాడె రేభిలుఁ బొగడ నేల
యువతియే సుమ్ము చాటుగా నుండెనేని.

చ. మృదువగు తంత్రిమ్రోఁతకును మేళముగాఁ దగు నోటిపాటతోఁ
గదిసిన స్వరపరిచారముల మార్పులయందును దారమధ్యమం
బ్రిదిశల మీఱి పాడె నతఁ డా యనువొ ద్విగుణంబు సేయుచున్
మది సుద మొందెదన్ వినుట మానియు నే వినుచున్న యట్టులన్.

విదూ.— చెలికాఁడా! రచ్చపట్టెలలోని యంగళ్లలోఁ గుక్కలుగూడ సుఖముగా నిద్రించుచున్నవి. ఇఁక నింటికిఁబోదముర! ఇటు చూడుము. చీఁకటికిఁ గూడఁ గొంతయనకాశ మిచ్చుచున్నవాఁడుంబోలె భగవంతుండగు చంద్రుఁ డాకాశస్థానమునుండి దిగుచున్నాఁడు.

చారు.— నిజము.

గీ. తమమునకుఁ దావొసంగ నస్తంగమింప
సాగుచున్న తకోటియై చంద్రరేఖ
నీటిలోమున్గు నడవి యేనిక కొమ్ము నీటి
మీఁద దంతపుఁగొన కొంత మిగిలినట్లు.

విదూ.— అయ్యా! యిదిగో మనయిల్లు. (తలుపుదగ్గఱకుఁబోయి) వర్ధమానకా! వర్ధమానక. తలుపు తెఱవుము.

వర్ధ.— (లేచి) మైత్రేయుని కంఠధ్వనివలె నున్నది. చారుదత్తుఁడుగారు వచ్చిరి. తలుపు తెఱచెదను. (తెఱచి) అయ్యా! దండములు. మైత్రేయా! నీకును. ఇదిగోఁ బీఁట. ఇందుఁ గూర్చుండుఁడు.

( చారుదత్త మైత్రేయు లిరువురును గూర్చుందురు. )

విదూ.— వర్ధమానకా! రదనికను బిలువుము. కాళ్లు కడుగవలయును.

చారు.— (దయతో) నిదురబోవుచున్నదాని లేపవలయును పోనీ.

వర్ధ—మైత్రేయా! నేను నీళ్లు తెచ్చెదను. నీవు కాళ్లుకడుగుము

విదూ—(కోపముతో) మిత్రమా! చూడుము మాతొత్తుకొడుకు నీళ్లిచ్చునఁట, నేను బ్రాహ్మణుఁడను కాళ్లుకడుగవలెనఁట.

చారు—మైత్రేయా! నీవు నీళ్లు తీసికొనిరా. వర్ధమానకుఁడే కాళ్లు కడుగును.

వర్ధ—ఏవయ్యా! నీళ్లు తీసికొనిరమ్ము.

(విదూషకుఁడు నీళ్లు తెచ్చిపోయఁగా వర్ధమానకుఁడు చారుదత్తుని కాళ్లు కడుగును.

చారు—వర్ధమానకా! మైత్రేయునికిఁ గూడఁ బాదోదకము తీసికొనిరమ్ము.

విదూ—నాకుఁ బాదోదకమేల? మరల దెబ్బలుతిన్న గాడిదవలె భూమిమీఁదనే కదా దొరలవలసినది.

చారు—మైత్రేయా! నీవును బ్రాహ్మణుఁడవే కదా.

విదూ—అవును. పాములలో దుండుపామున్నది, బ్రాహ్మణులలో నేనున్నాను.

వర్ధ—ఐనను గాళ్లు కడుగకమానను (కాళ్లుకడిగి) అయ్యా! ఇదిగో సువర్ణభాండము పుచ్చుకొనుము. పగలు నేదాఁచవలసినది, రాత్రి నీవు దాఁచవలసినదికదా. (అని చేతికిచ్చి నిష్క్రమించుచున్నాఁడు)

విదూ—(పుచ్చుకొని) ఈదిక్కుమాలిన సువర్ణభాండ మింకను బోకున్నది. నా నిద్ర నపహరించుచున్న యీతొత్తుకొడుకునగను నపహరించుటకు [illegible] యుజ్జయినీ పట్టనములో నొక్కదొంగకే కఱవై పోయినదికదా (ప్రకాశముగ) మిత్రమా! దీనిని మన నాలుగిండ్ల బవంతిచావడిలో దాఁచెదను.

చారు—వలదు. వలదు.

క. ఈనగ బోగముదానిది గానం దాఁచకుము లోనఁ, గనుగల్గి మెయిక్రా
బూనఁదగునోయి! కర్మ్మఱి దానితోడవు దాని కిచ్చుదాఁక ననుంగా.

(అని ఆవలించుచు "మృదువగు తంత్రిమోతకు" అను పద్యము జదువును.)

విదూ—చెలికాఁడా! నిదుర వచ్చుచున్నదా యేమి?

చారు—అవును. వచ్చుచున్నది.

గీ. నొసలిపైనుండి మెల్లఁగన్నులకు దిగుచుఁ
బ్రామికొనుచుండె నొడలెల్లఁ బాపినిద్ర
పసుజాలకుఁగల్గు బలమెల్ల మాయఁజలుపఁ
జాలు జరవోలెఁ దా నదృశ్యతవహించి.

హాయీ... అటులే నొక్కుకొనుము కునుకుదము రా (అని లోనికిం బోయి నిదురింతురు.)

(పిదప శర్విలకుఁడను దొంగ ప్రవేశించును.)

గీ. ఒడలు సుఖముగఁ జొరఁజాలు వెడఁదగల బి
లంబుబలమున శిక్షాబలమునఁ ద్రవ్వి
సీద్రమూడిచి చనుపాముమాడ్కి ప్రక్క
గిరుకొనిపోవుచుండఁగఁదూఱువాఁడ.

(ఆకసము వంకకుఁజూచి సంతోషముతో) చంద్రభగవానుఁడు గూడ నస్తమించు చున్నాఁడు.

గీ. యామికులు చూతురన్న భయంబుతోడ
నూఁచముట్టుగ నొరులను దోచుకొనఁగఁ
జూచు నను రాత్రి తల్లియై కాచుచుండె
మబ్బుచీఁకట్లఁ జుక్కలు మఱుఁగుపఱచి.

వృక్షవాటికాసమీపమునం జుట్టుప్రహరికి సొరంగముత్రవ్వి లోపలికిం బ్రవేశించితిఁ గదా. ఇఁక నాలుగిండ్లముంగిటిలోనికిం దూఱవలయును.

ఉ. నమ్మినవారిపట్ల శయనస్థులపట్లఁ బరాభవంబు నీ
చమ్మని యెంచి పల్కుదురు చౌర్యము శౌర్యము కాదటంచు; నే
నమ్మను, మున్ను ద్రౌణి రిపునాశమొనర్పఁడే రాత్రిపూఁట ని
క్కమ్ముగ నొక్కనింగొలుచుకంటెను దొంగతికంబు తక్కువే.

ఇంకఁ గన్నముఁద్రవ్వుటకుం దగిన ప్రదేశముఁ గనుఁగొనవలయును.

చ. తడిసినచోటు త్రక్కుదలఁ ద్రవ్వఁగ జప్పుడు కానిచోటు నె
వ్వఁడు గనుఁగొనిచోటు సులభంబుగ సంధికిఁ బెద్దరూప మే
ర్పడఁగలచోటు చౌడురలిరాలెడు చోటును మేలు స్త్రీలు క
న్పడని ప్రదేశముల్ మిగులఁ బాడగుపొందయుఁ గార్యసిద్ధికిన్.

(గోడఁదడవి) ఎల్లప్పు డెండ సెండి వానను దడిసియుండుటచే నిచట గోడకుఁ జవుడురలుచున్నది. ఎలుకలు కూడఁ దొలచినవి. వహవా! నాకార్యము సానుకూలమగును. స్కందపుత్రులమగు మాకు ముందిటువంటివే కార్యసిద్ధిసూచకములు. ఇఁక సొరంగ మేరూపముగాఁ ద్రవ్వవలయునో యాలోచింపవలయు. భగవంతుఁడగు కనకశక్తి "పండిటికలూపదీయుము, పచ్చియిటికలు పగులఁ గొట్టుము. మంటిముద్దలగోడ తడుపుము. బల్లలకూర్పు చీల్చుము" అని కన్నముఁ

ద్రవ్వుటకు నాలుగుపాయములు చెప్పియున్నాఁడు. అందిది పండితికలందే కావున నిటికలూడదీయవలయు. పద్మవ్యాకోశము, భాస్కరము, బాలచంద్రము, వాపి, విస్తీర్ణము, స్వస్తికము, పూర్ణకుంభము నని యేడుపేర్లుగల కర్మమార్గ ములలో నిందుఁ బూర్ణకుంభనామధేయంబగు సొరంగమే త్రవ్వవలయు.

గీ. ఇరుగు పొరుగుల యిండ్లవారెల్లఁజూచి,
బళిర యీదొంగ నేర్పని ప్రస్తుతింపఁ
దొల్లి నేనెన్ని గోడలు దొలిచినాఁడ,
నాల్గువిధముల నేడు కన్నములుఁగూడ.

వరదులగు కుమారకార్తికేయులకు నమస్కారము. బ్రహ్మణ్యదేవుండును దేవవ్రతుండునగు కనకశక్తికి నమస్కారము. భాస్కరనందికి నమస్కారము. యోగాచార్య గురుచరణారవిందములకు వందనములు. నే నా మహానుభావునకుఁ బ్రథమ ప్రియశిష్యుఁడ నగుటంజేసి యోగరోచనయను నొకవిద్యను నాకుదయచేసె.

గీ. రక్షకుల కంటఁ బడకుండ రాత్రులందుఁ
గాచుచున్నది యీవిద్య గాదె నన్ను
బాకుదెబ్బయు మేనిపైఁ దాఁకకుండఁ
గాచుచున్నది యీవిద్య గాదె నన్ను.

(కన్నముఁ ద్రవ్వుచు) అయ్యయ్యో! కొలదారము మఱచిపోతిని (ఆలోచించి) ఇదిగో జందెమున్నదిగదా! దీనినే కొలదారముగాఁ జేసికొనియెదను. బ్రాహ్మణులకు యజ్ఞోపవీతము పరమోపకారమగు వస్తువు. అందులో నావంటి వానికి మగుల నుపయుక్తమైనది.

గీ. దీనిచేఁ దల్పుగడె లూడఁదీయవచ్చు
దీనిచే సీల నగలకుఁ ద్రిప్పవచ్చు
దీనిచేఁ గొల్వవచ్చుభిత్తికి సురంగ
దీనిచే పామువిషమును దింపవచ్చు.

కావున దీనిచేఁ గొలుచుకొని కర్మమార్గము ప్రారంభింతును (కొలిచి కన్నముత్రవ్వి దెసలుఁబరికించి) గోడ యింక నొక యిటికవరుస మిగిలినది (అని మరలఁ ద్రవ్వఁబోవుచు) అబ్బబ్బా! పాముకాఁబోలు గఱచినది. (జందెమూడఁదీసి వ్రేలికిఁ జుట్టపెట్టి విషబాధపడుచు దానికిఁ దగిన చికిత్సగావించి) విషబాధ పోయినది. (మిగిలినకన్నము త్రవ్వుచు) ఔరా! యింటిలోదీపము వెలుఁగుచు నున్నది. ఎంతకష్టమెంతకష్టము.

గీ. చత్వరంబుననుండి యీసందిగుండఁ
దెరలి వెలుఁగుచునున్నది దీపకాంతి
నట్టనడివీథిఁ జీఁకటినడుమ మచ్చు
రాతిపైవెల్గు బంగారుగీఁతఁబోలె.

(మరల దరువాతిపనిచేసి) సంధి సమాప్తమైనది. కానిమ్ము లోనికిం బ్రవేశించెద. పోనీ! ముందీ కృత్రిమపురుషాకృతిఁ బ్రవేశపెట్టి చూచెదను. (అట్లుచేసి) ఎవ్వఁడును లేఁడు. కార్తికేయదేవా! నమస్కారము (ప్రవేశించిచూచి) వీరె యిరుగురు పురుషులిందు నిదురించుచున్నారు. కానీ! ముందు ఆత్మసంరక్షణార్థము గుమ్మములన్నియుఁ దెఱచియుంచెదను (తలుపు తెఱవఁబోయి) ప్రాఁత యిల్లగుటచేఁ దలుపు కిఱ్ఱుమనునేమో, నీళ్లెక్కడనున్నవో (నాల్గుదెసలు పరికించి నీళ్లు తెచ్చి తలుపుమీఁదఁ జిమ్మఁబోవుచు సందేహముతో) నేలమీఁదఁబడి చప్పుడు కాకయుండునా! కానీ! వీఁపు తలుపునకానించి యెత్తెదను, (అట్లుచేసి) ఇఁక వీరిది మంచినిద్రయో దొంగనిద్రయో పరీక్షింపవలయును (సమీపించి భయపెట్టి) వీరు నిజముగ నిద్రపోవుచున్నారు. ఏమన,

చ. గుఱక సమాంతరం బగుచుఁ గొంకక వెల్వడుఁ, గంటిఱెప్పలుం
దఱఁగవు హెచ్చ వింతయును, దారక లల్లలనాడ, వంగముల్
పఱచిన శయ్యదాఁటి వికలత్వముఁ జెందె, నివిట్టులుండ ముం
దుఱఁగల దీపకాంతి నయనంబులు సైచునె దొంగనిద్రకున్.

(నాల్గువైపులుఁజూచి) ఇచ్చటమర్దలయున్నది. ఈవైపున వీణయున్నది, ఆవైపునఁ బణవమున్నది, ఇవి పుస్తకములు, అమూల పిల్లనగ్రోవులున్నవి, అప్రక్క దస్త్రమున్నది. ఇది నాట్యాచార్యుని యిల్లయియుండునాయేమి. ఇంటిగొప్పఁజూచి మోసపోతిని. ఈయజమానుఁడు పరమార్థదరిద్రుఁడగునా? లేక రాజభయముననో తస్కరభీతినో ధనము భూస్థాపితముఁ జేసియుండునా. అబ్బే! భూమిలోఁ బాఁతియుంచిన శర్విలకుఁడు కనుఁగొనలేకయుండునా! ఐనను బరిశీలించెదను (విత్తులు చల్లి) చల్లినగింజలెక్కడను పెరుఁగకున్నవి. కావున ధనము పాఁతియుంచలేదు. నిజముగా నితఁడు పరమదరిద్రుఁడే, పోనీ, వెడలిపోయెదను.

విదూ — మిత్రమా! మిత్రమ! ఎవఁడో దొంగ కన్నముత్రవ్వి మనయింటిలోఁ జొరఁబడినట్లున్నాఁడు. నీసువర్ణభాండము నీవు పుచ్చుకొనుము (పలవరించును.)

శర్వి — నేనింటఁమాఱితినని తెలిసికొని దరిద్రునియింటికి వచ్చితివేమిరాయని నన్నుఁ బరిహసించుటకాదుగద! (ఆలోచించి) తేలికమానిసి యగుటంజేసి

వలవరించుటలేదుగదా! (దగ్గఱకుఁబోయి పరిశీలించి) ఇదిగో! [illegible], [illegible] దోవతికొంగున ముడివైచియున్న సువర్ణభాండము దీపకాంతిచే [illegible]లాడుచున్నది. ఇది దొంగిలించెద. ఛీ! తుల్యావస్థయుఁ దుల్య[illegible]తియుఁగల వీని బాధింప నేటికి? ఇంకొకయిల్లు దోఁచుకొనెద.

విదూ—నీకు నీవు పుచ్చుకొన్న గోవుమీఁదను బ్రాహ్మణునిమీఁద నొట్టు పెట్టుచున్నాను.

శర్వి—గోబ్రాహ్మణులమీఁది యొట్టు దాఁటరానిది. కావునఁ బుచ్చుకొనియెదను. దీపము వెలుఁగుచున్నదే. దీని నుందార్పవలయు, నందుకై నాయొద్ద నాగ్నేయకీటకమున్నదికదా, దీని వదలెదను. లేకున్నఁ గీటకమును వెంటఁ దెచ్చిన ఫలమేమి. (పురుగును వదలి) వదలినంతనే యీ పురుగు మండలాకారముగా దీపముపయిం దిరిగితిరిగి ఱెక్కలగాలిచే దీపమార్పినది. ఛీ. ఛీ. యీయింటికంతయుఁ జీఁకటి తెచ్చిపెట్టితిని. ఈయిల్లేయననేల, యోగ్యమగు బ్రాహ్మణకులమంతయుఁ గటికచీఁకటి పాలుగావించితిని. చతుర్వేదపారంగతుఁడను బ్రాహ్మణుఁడను; ఆభోగముతొత్తు మదనికకొఱకుగదా యిట్టిదుష్కార్యము చేయుచున్నాను- కానీ యీవిప్రుని కోరిక తీర్చెదను. (సువర్ణభాండమును గ్రహింపఁబోవును)

విదూ—మిత్రమా! నీచేయి చల్లఁగానున్నదేమి.

శర్వి—ప్రమాదమాయెఁగదా! నీళ్లు తగులుటచేత నాచేయి చల్లఁబడినది- కానీ చంకలోఁబెట్టుకొని వెచ్చఁజేసెదను. (అట్లుచేసిన గ పుచ్చుకొనును.)

విదూ—పుచ్చుకొంటివా!

శర్వి—నీవొట్టు పెట్టితివని పుచ్చుకొంటిని.

విదూ—ఇఁక సరకులమ్ముకొన్న కోమటివలె సుఖముగా నిద్రించెదను.

శర్వి—ఓ మహాబ్రాహ్మణుఁడ! నూఱేండ్లు నిదురవొమ్ము, ఛీ గణికాదాసికొఱకు నాకులమంతయుఁ గళంకితముఁ జేసితిని. నాకులమున కేమి నాయాత్మను పాపకూపములోఁ బడఁద్రోసికొంటిని.

గీ. పరుల కెపుడు మానాభిమానములఁ జంపు
లేమికంటెను పాపంబులేదు జగతిఁ
గూడదనుచును నిందించుకొనుచు మరలఁ
జేయుచుంటిని గటకటా [illegible]

ఇప్పుడు మదనిక దాస్యవృత్తిమాన్పుటకై వసంతసేన యింటికిఁబోదును. (ఆలించి) చప్పుడువలెనున్నది. వీథిలో యామికులు తిరుగుచున్నారేమో ! తిరుగనీ! శర్విలకుఁడ నన్ను యామికు లేమిచేయఁగలరు.

సీ. దాఁగెదఁ బిల్లిచందమునఁ బ్రాఁకెదఁ బాము పగిది మృగంబు నాఁబఱవఁగలను
గుక్కవోలిక మెలకువయు నిద్రయు గుర్తుపట్టెద డేగ నాఁ బట్టుకొందు
మాయకైవడి రూపమార్చెద మాటలాడెద భాషలెల్ల శారదవిధమునఁ
గలము మాదిరిఁ బోవఁగల నీటిలో ధరాతలముపై గుఱ్ఱమువలె నడచెద

గీ. చేయిఁ జోరనేర్తు పెనుదీపరేఖలల
సంకటములోర్తు దుడుమంబు సరణిఁ బ్రాఁచు
కొదమగతిఁ బోదు గిరిచాయఁ గదలకుండఁ
బలిగపతిభాతి నింటిపైఁ బఱవనేర్తు.

గీ. పటువిగ్రహియుంచఁ గోడేలువంటివాఁడ
బలిమిమై మృగరాజును బట్టువాఁడ
సర్వదేశావలోకనసమయమందుఁ
జెవులపిల్లిని నాకేమిచెయిదికొదవ.

రద— (ప్రవేశించి) అయ్యో ! అయ్యో, వెలుపటిగుమ్మము పాలలోఁ బరుండు వాఁడు వర్ధమానకుండు కన్పడఁడు ! మైత్రేయుని బిలిచి యడిగెదను.

శర్వి— (రదనికను జూచి) దీనిం జంపుదునా ? (ఆలోచించి) ఆఁడుది పోనీ (నిష్క్రమించును.)

రద— (ముంగిలిచొచ్చి భయముతో) అమ్మయ్యో ! మనయింటిలో దొంగ కన్నము త్రవ్వి పాఱిపోవుచున్నాఁడు. మైత్రేయుని లేపెదను. మైత్రేయా ! లే. లే. మనయింటికెవ్వఁడో దొంగ కన్నము త్రవ్వి పాఱిపోవుచున్నాఁడు.

విదూ— (లేచి) ఓసి తొత్తుకూఁతురా ! ఏమంచున్నావు ? దొంగవానివి త్రవ్వి కన్నము పాఱిపోవుచున్నదా !

రద— నీయాశ కూలిపోను, వేళాకోళము లాడెదవేమి, నీకంటికిఁ గన్పడఁదా ఏమి !

విదూ— తొత్తుకూఁతురా ! ఏమంటివి ! రెండవగుమ్మమంత గన్నముఁ ద్రవ్వినాఁడా ఓమిత్రమా ! చారుదత్త ! లేలెమ్ము. మనయింటఁ గన్నము త్రవ్వి దొంగ పాఱిపోయినాఁడు.

చారు— చాలు నోర్మూయి పరిహాసము చాలు.

విదూ— పరిహాసము కాదు నీవే చూడుము.

చారు — ఏ ప్రదేశమందు?

విదూ— ఈప్రదేశమందు [అని చూపుచున్నాఁడు]

చారు— [చూచి] ఆహా! ఈసొరంగము చూడఁదగి యున్నది.

గీ. నడుమ వెడఁదగ మీఁద సన్నముగఁ గుంభ
జాడఁ బైనుండి యిటికల నూడఁదీయు
గోడ సంధిచ్చి పగిలెను కుశలసంగ
భీతుఁడగు నీతిమంతుని చేతమట్లు.

ఇటువంటి సొరంగములు త్రవ్వుటయందుఁ గూడ నేర్పుండవలె నౌను.

విదూ— అయ్యా! ఈకన్నము దొంగతనము సేయ్పఁగానువాఁడో [illegible] వాఁడో త్రవ్వియుండును. కాదేని యీయుజ్జయినీపురియందు మన విభవ మెఱుఁగని వారెవరు?

చారు— ఉ. కన్నముఁ ద్రవ్వెఁ దస్కరుఁ డొకం డెవఁడో పొరుగూరియూరఁ డిం
దున్న జనంబు స్వేచ్ఛగఁ బరున్న తెఱంగు నెఱుంగఁడాయె సం
పన్నుల మన్న యాశ మెయి వచ్చి శ్రమంపడి యిల్లుఁ జొచ్చి తుం
జిన్నతనంబుఁ జెంది తన చేసిన చేఁతకు నెంతకుందెనో.

ఈదీనుఁడు తనస్నేహితులతో "నొకపత్తకునియింటికి రాత్రి దొంగతనము నకుఁబోతి నేమియు దొరకలేదు" అని యేమని చెప్పునో పాపము!

విదూ— ఏమయ్యా! ఇప్పటికి నాదొంగచచ్చినవానికై వగచుచున్నావు. వాఁడీ యిల్లు గొప్పది, సువర్ణభాండమో రత్నభాండమో మనకు దొరకునను పేరాసచేఁ గన్నము త్రవ్వినాఁడు (తలపోసి సవిషాదముగ తనలో) ఇంతకు మన సువర్ణభాండ మెచటదాఁచితివి (మరలఁదలపోసి ప్రకాశము) "మైత్రేయుఁడు మూర్ఖుఁడు తెలివిమాలినవాఁడు" అని యెల్లప్పుడు నన్ను నిందించుచుందువు వాఁడవుగదా! ఈరాత్రి సువర్ణభాండము నీచేతి కొసంగుట తెలివిగలపని గాదా! నాయొద్ద నేయున్నచో నాదొంగతొత్తుకొడుకు తప్పకదొంగిలువాఁడే

చారు— చాలులే వేళాకోళము.

విదూ— నేను తెలివిమాలినవాఁడనే కాని పరిహాసమునకు దేశకాలపాత్రము లెఱుఁగనుకొంటివా యేమి?

చారు— నాకా సువర్ణభాండ మెప్పుడిచ్చితివి?

విదూ— నీ [illegible]చేయి చల్లఁగానున్న దేమని యడిగితినే, అప్పుడిచ్చితిని.

చారు — అటులే కావచ్చును. (నలుదెసలు పరికించి సంతోషముతో) మిత్రమా! నీకొక ప్రియవాక్యము చెప్పెద వాలించెదవా!

విదూ — వాఁ డపహరింపలేదుకద.

చారు — అపహరించెను.

విదూ — అటులేని ప్రియమా యిది!

చారు — వాఁడు కృతార్థుఁడై చనెను.

విదూ — అది మనది కాదు కది?

చారు — ఓహో! న్యాసమా! (నిర్ఘాంతపడును)

విదూ — అయ్యో! దొంగిలించినను, దొంగ లెత్తుకొనిపోయిన నీవేమి చేయఁగలవు.

చారు — (కొంచ డిల్లి) మిత్రమా!

గీ. సత్య మెవ్వని కెఱుక నిజముగఁ బ్రజలు
నదయఁ బోతులు తూలనాడుదురు నన్ను
లేమికంటెను లోటుప లేదు జగతి
బడుగుతనమున కొక పరితాపంబు కలదె.

ఔరా కష్టదినములలోఁ గష్టము.

గీ. ఘాతుకుండగు విధి నన్నుఁ గలిమియెల్లఁ
బాపి, కాపించెఁగాక జీవచ్ఛవంబు
నేఁడు శుద్ధచరిత్రంబు గూడఁ బాపె
బ్రతికియుండుట కింకేది పట్టు నాకు.

విదూ — యిచ్చినవాఁ డెవఁడు? పుచ్చుకొన్నవాఁ డెవఁడు? చూచినవాఁ డెవఁడు? అని నేనపలాపము చేయఁగలను, నీవూరకొనుము.

చారు — ప్రకృతాపన్నకుం దోడనృతము కూడఁ బలుకుచుంటివా.

గీ. చివర కే భిచ్చమెత్తి యార్జించియైన
దానివగ విల్చు దవ్యంబు దానికిదుదుఁ
గాని శుద్ధచరిత్రంబు గంగలోనఁ
గలుపఁజాలు నసత్యంబుఁ బలుకఁజాల.

రద — ఈవృత్తాంతము ధూతాదేవికి విన్నవింతును (అని వెళ్ళిపోవును.)

(పిదపఁ జారుదత్తుని భార్య ధూతాదేవియు రదనికయుఁ బ్రవేశింతురు.)

ధూత — (సంభ్రమముతో) చేటికా! ఆర్యపుత్రునకును మైత్రేయునకు గాయము లేదియుఁ దగులలేదుకద.

రద— అమ్మా! తగులలేదు. కాని భోగముది యయ్యగారి [illegible] సువర్ణభాండము పోయినది.

ధూత— (నిర్ఘాత పోవుచున్నది)

రద— అమ్మా! ఊరడిలు మూరడిల్లుము.

ధూత— చేటీ! ఏమంటివి. ఆర్యపుత్రుని శరీర మపరిక్షతమని యా! [illegible] పరిక్షతమగుకంటె శరీరము పరిక్షతమగుటయే మేలు. నేఁడు [illegible] యందలి జనులందఱు దారిద్ర్యముచే నార్యపుత్రుఁడే యీకార్యము [illegible] నని తలంతురు. భగవంతుఁడా! కృతాంతుఁడ! తామరాకుమీఁ[illegible] బిందువులవలెఁ జంచలములగు పేదవారి అదృష్టముతోఁ డనా, [illegible] మాడెదవు! మాసంసారమునకెల్ల మాపుట్టింటివా రిచ్చిన యీ [illegible] హారమొకటియే మిగిలియున్నది, అది మనస్వియగు నార్యపుత్రున కిచ్చి నను బరిగ్రహింపఁడు. చేటికా! మైత్రేయు నొకసారి పిలువుము.

రద— అమ్మా మంచిది! (విదూషకుని సమీపించి) ఆర్య మైత్రేయ! [illegible] దేవి సెలవైనది రమ్ము.

విదూ— (సమీపించి) అమ్మా! నీకు శుభమగుఁగాత.

ధూత— అయ్యా! నమస్కారము. పూర్వాభిముఖముగాఁ గూర్చుండుము.

విదూ— పూజ్యురాల! ఇదిగోఁ గూర్చుంటిని. (అని చతికిలంబడును)

ధూత— అయ్యా! యిది పరిగ్రహించుము.

విదూ— ఇది యేమి?

ధూత— నేఁడు రత్నషష్ఠియను వ్రతముఁజేసితిని. అందు, విభవము [illegible] బ్రాహ్మణునకు దక్షిణ యీవలెను. కాన నీరత్నాలహారమును దక్షిణగాఁ బరిగ్రహింపుము.

విదూ—(పరిగ్రహించి) నీకు స్వస్తి, నేనుపోయి మాప్రియమిత్రునితోఁ దెలిపెదను.

ధూత— మైత్రేయా! నన్ను సిగ్గుపడుదానిఁగాఁ జేయకుమా (అని వెడలిపోవును)

విదూ— ఔరా! యీమహానుభావురాలి యోగ్యత! (విస్మయపడును)

చారు— మైత్రేయుఁ డింకను రాలేదు. మనోదుఃఖముచేత నకార్యమేదైనఁ [illegible] యుండఁడుగద! మైత్రేయ! మైత్రేయ!

విదూ—(సమీపించి) ఇదిగో! పచ్చితి, నిది పుచ్చుకొనుము

చారు—ఇదియేమి?

విదూ — తగినపెండ్లమును బెండ్లాడినందులకు ఫలము.

చారు — ఏమీ! బ్రాహ్మణి నన్ను ననుగ్రహించుచున్నదా? ఎంతదుర్దశ వచ్చినది! నేను నేఁడుగదా దరిద్రుఁడనైతిని.

గీ. నిందుదురదృష్టమున దరిద్రుండనైన
నాకు దిక్కయ్యెనే స్త్రీధనంబు తుదకు
ధనము లేకున్న పురుషుండుఁ దరుణి సమము
పురుషుఁడే ద్రవ్యవతియైన పూవుబోఁడి.

పక్షాంతరమున నేను దరిద్రుఁడనే కాను

గీ. కల్మిలేములు సరిచూడఁగలుగు భార్య
కష్టసుఖములు పంచుకోఁగల సఖుండు
నాకు దొరకిరి; రిక్తులు నడవలేని
సత్యమార్గంబుఁ గాపాడఁజాలినాఁడ.

మైత్రేయా! నీవీరత్నావళిం దీసికొని, వసంతసేనయొద్దకుంబోయి 'సువర్ణభాండము నాదేయనునమ్మకముతో జూదమందోడితిని, దానికిఁబ్రతినిధిగా నీరత్నావళిం బంపితి' నని నామాటలుగాఁ జెప్పి యిచ్చిరమ్ము.

విదూ — తింటిమా, కుడిచితిమా! దొంగలెత్తుకొనిపోయిరి. అల్పమూల్యమగు నా సువర్ణభాండమునకై చతుస్సముద్రసారభూతంబగు నీరత్నావళి నిచ్చెదవా?

చారు — మిత్రమా! అట్లనరాదు.

గీ. విలువగల గొప్పనగ దరిద్రులకు మనకుఁ
దరుణి యేనమ్మకంబున దాఁచనిచ్చె
వారకామిని; దానివిశ్వాసమునకు
నింతద్రవ్యంబు మరల నే నిచ్చుచుంటి.

నీవుపట్టుకొనిపోయి యీకున్న నన్ను జంపుకొన్నట్లే. ఎట్లైన నయ్యాతివ దీనిం బరిగ్రహించునట్లు చేయవలెను. వర్ధమానకా!

గీ. ఎల్లి ప్రొద్దువొడు నీయూరియెల్లవారుఁ
జేతి పరిపరివిధములఁ జెప్పికొందు
రీడఁ బదిమంది పదిమాటలాడకుండ
సంది పూడ్పింపు వేగ యిష్టకలచేత.

మైత్రేయ! నీవామెతో నకృపణముగా మాటలాడిరావలెనుసుమా.

విదూ—దరిద్రుఁడెప్పుడు నకృపణముగానే యాలోచించును.

చారు—నేను దరిద్రుఁడనుకానోయి! (కల్మి లేములను పద్యముమరలఁ జదువును.) నీవు తడయకపొమ్ము. నేను కల్యకరణీయంబులు ముగించి సంధ్య నుపాసించెద.

(అందఱునిష్క్రమింతురు)

ఇది శ్రీ తిరుపతి వేంకటేశ్వరాంధ్రీకృతంబగు
మృచ్ఛకటికంబను ప్రకరణంబున
సంధిచ్ఛేదమను పేరుగల
తృతీయాంకము.



శ్రీరస్తు

# మృచ్ఛకటికము

## చతుర్థాంకము

చేటి—(ప్రవేశించి) అమ్మగారు, చిన్నమ్మగారి చెంతకేగుమని పంపినది. ఇదిగో! ఆర్యురాలు చిత్రఫలకముంజూచుచు మదనికతో నేమేమో మంతనములాడుచున్నది. సమీపించెదను (పరిక్రమించును.)

(యథానిర్దిష్టముగ వసంతసేనయు మదనికయుం బ్రవేశింతురు)

వసం—చేటీ! మదనికా! ఈచిత్రాకృతి యార్యచారుదత్తుని యథార్థప్రతికృతి యేనా?

మద—నిజముగా నార్యునింబోలియున్నది.

వసం—నీవెట్లు గుర్తించితివి?

మద—నీవు పరమాభిలాషతోఁ జూచుటచేతనే.

వసం—వేశ్యావృత్తిఁజూచుచు, వేశ్యలతో సహవాసము చేయుచుండుటచే నిట్లనుటలేదుగదా?

మద—అమ్మా! వేశవాటిలో నున్నంతమాత్రమున నందఱుచ్చకము లాడుదురా? వేశ్యలుమాత్ర మందఱును గృత్రిమప్రేమఁ జూపుదురా?

వసం—కాదుకాదు. నానాపురుషసాంగత్యముఁ జేయువారగుటచే వేశ్య లలీకప్రేమముఁ జూపువారే.

మద—అమ్మా! నీదృష్టియు హృదయము నీచిత్తరువునందట్లు వ్రాలుచుండ నన్నువేఱ యడుగవలసిన కారణమేమి?

వసం—చెలికత్తెలు పరిహసింతురేమో యని శంకించుచున్నాను.

మద—చెలికత్తె లెప్పుడును జెలి యాంతరంగికభావము ననుసరించియే వర్తింతురు.

చేటి—(ప్రవేశించి) ఆర్యురాలా! వసంతసేన! 'గవిసెన కప్పియున్న బండి వాకిట నిలిచియున్నది, కావునఁ దడయక పో' మ్మని మీయమ్మ నిన్ను నియమించుచున్నది.

వసం—ఆర్య చారుదత్తుఁ డంపెనా యేమి!

చేటి— అమ్మా! ఆబండినంపిన వారెవరో పదివేల సువర్ణముల వెలగల యొక నగ కూడఁ బంపిరి.

వసం—ఆపంపిన దెవ్వరని యడుగుచున్నాను.

చేటి— రాజుగారి యుంపుడుకత్తె తమ్ముఁడు సంస్థానకుఁడేనట పంపినది.

వసం— (కోపముతో) ఛీ ఛీ లేచిపొమ్మా; నాయొద్ద నిట్టిమాట లింకనెన్నఁడు నుచ్చరింపకుము.

చేటి— అమ్మా! అనుగ్రహింపుము, మీయమ్మ చెప్పుమన్నమాటలుః దాయని నే జెప్పితిని.

వసం— నేమను నీయం దలుగలేదు; మాయమ్మ మాటలకే కోపించితిని.

చేటి— అటులేని మీయమ్మతో నేమని చెప్పుమనియెదవు?

వసం— నే బ్రతికియుండుట యిష్టమేని యిటువంటి సందేశమెన్నఁడుఁ బంపవల దని చెప్పుము.

చేటి— చిత్తము (నిష్క్రమించును.)

శర్విల— (ప్రవేశించి)

ఆ. రాత్రికప్రతిష్ఠ రప్పించి రాజభృత్యులను నిద్రతోడ గెలిచియున్న
నాకు శీతభానునకుఁ బోలె భాస్కరోదయమునందు రశ్మి తగ్గె; మఱియు

గీ. పరుఁడు తనయంత నడచుచుఁ బాఱఁజూచె
నేని నాయొద్దకరుదెంచెనేనిగాని
యంతరాత్మ భయంపడు; నకట జగతి
తనకృతంబైన దోషంబు తన్నుఁగలఁచు

నేను మదనికకొఱకు గొప్పసాహసముఁ గావించితిని.

ఉ. విడచితి నాఁడువాండ్రుగల వీఁడనియొక్క గృహంబు, నేవకుల్
గొడగొడలాడ నింటి నొక కొంతకుఁ బోయి, తలార్లఁ జూచి యొ
క్కెడనిలుచుంటిఁ గొయ్యవలె, నిట్టివి కష్టము లెన్నియెన్నియో
పడి, నిశి తెల్లవాఱెడి యుపాయమొనర్చితి నల్లనల్లనన్.

( పరిక్రమించుచున్నాఁడు )

వసం— మదనికా! యీచిత్రఫలకముఁగొని నాపడుకటింట శయ్యపై నునిచి తాళవృంతముఁ గైకొని వేగ రమ్మా.

మద— మంచిది. (ఫలకము చేతంగొని నిష్క్రమించును)

శర్వి— ఇదియే వసంతసేన యిల్లు. లోనికిం బోయెద (ప్రవేశించి) మదనిక నా కెచటం గన్పడునో! (పిదప వినసకఱ్ఱ చేతఁగొని మదనికవచ్చుటచూచి) ఇదిగో మదనిక.

క. మదనాగ్నితప్తమగు నా మదికిం జందనపుఁజర్చ మానవమూర్తిన్
బొదలు రతిదేవి సొగసున మదనునకుం బరువుదెచ్చు మదపతి యిదిరా!

మదనికా! మదనిక!

మద— (చూచి) ఏమిచోద్యము, శర్విలకుఁడే! శర్విలకా! కుశలమా, ఏలవచ్చితివి?

శర్వి— చెప్పెదను, (ఒకరినొకరు గాఢానురాగముతోఁ జూచుకొందురు.)

వసం— మదనిక యింకను రాలేదు. ఎచటికిఁ బోయెనో! (కిటికిగుండఁజూచి) ఇదిగో, నొకపురుషునితో నిది మాటలాడుచున్నది, అందును నిశ్చలమగు స్నిగ్ధదృష్టిచే నాతనిం ద్రాగుచున్నటులున్నది. దీనిం బెండ్లాడి దీని దాస్యము మాన్పింపఁదలఁచిన దీతఁడేకాఁబోలు, చూచుఁగాక, చూచుఁగాక, యిటువంటి కార్యములయం దెవ్వరికి నెవ్వరును బ్రతిబంధకులు కాఁగూడదు, పిలువక కొంతకాల మూరకొందును.

మద— శర్విలకా! చెప్పుము.

శర్వి— (భయశంకతో నలుదెసలు పరికించుచున్నాఁడు.)

మద— శర్విలక! భయగ్రస్తునివలె నున్నావు, కారణమేమి?

శర్వి— నీతో నొకరహస్యముఁ జెప్పవలెను. ఈదాపువం దెవ్వరును లేరుగద?

మద— ఎవ్వరును లేరు.

వసం— ఏమి పరమరహస్యమో, నేను వినఁదగదు.

శర్వి— మదనికా! ద్రవ్యమొసఁగినచో వసంతసేన నిన్ను వదలునా?

వసం— వీరేదో నాపేరెత్తుచున్నారు, ఈగవాక్షము చాటుననుండి విందును.

మద— నేనీమాట వసంతసేన నడిగితిని, ఆపె యిచ్చయే సొగసేని పరిచారికల బందల నూరకయే విడిపింతుననెను. కాని శర్విలకా! నీకు నన్ను వసంతసేనయొద్దనుండి విడిపించుటకుం దగిన ధన మెక్కడిది?

శర్వి—క. పడఁతీ నీయెడఁగలప్రేమమడియును లేవడియు నాకు ముప్పలరయొసంగన్
నడిరేయి నొక్కపాపం బొడిగట్టితిఁ గాని తెరువ యుదయింపంగన్.

వసం— సహజప్రసన్నమగు నితని యాకృతి కానిపని చేయుటచే భయంకరముగా నున్నది.

మద— పనికిమాలిన యొకయాఁడుదానికై రెంటిని సంశయములో నుంచితివి.

శర్వి— రెండనఁగా నేదియేది ?

మద— శరీరము, పవిత్రత్వము.

శర్వి— తెలివితక్కువదానా ! సాహసమే లక్ష్మికిఁ గారణము కాదఁటే.

మద— నీ విందనుకు సచ్చరితుండ వనిపించుకొంటివి. ఇపుడు నాకొఱకై నిరస్తకార్య మేదియుఁ జేయలేదుకద?

శర్వి— ఉఁ. సొమ్ములు దాల్చుట స్వీకచనూనలతం బు శోభించు స్త్రీలవి
వ్యమ్ముకై హరింపను సవాగ్రము మ్రొచ్చిల భూమిదేవని
త్తమ్ములు దొంగిలఁ నగలు దాల్చినపిల్లలకోలి కేగఁ, కా
ర్యమ్మునఁ గూడ నాకుఁ గనరా నవివేకపుఁ గుప్పమార్గముల్.

గీ. ఇది మొదలి కాది యిచ్చి చేయించినట్లు
నీకుఁదగియున్న వస్తువో నీరజాక్షి
కాన దీనినిఁగడు నవ్రకాశముగ ధ
రింపుమా ! వారొడలఁగల్గు పెంపుజేసి.

అని వసంతసేనతో విన్నవింపుము.

మద— అలంకారము బయటఁ బెట్టునది కాదనియు నది దాల్చునది వసంతసేన యనియు నడుపుచున్నావు. ఈరెండును నసంబద్ధములే. ఏదీ! చూపు మానగ యొకసారిచూచెదను.

శర్వి— ఇదే యలంకారము (అని బెదరుచుఁ జూపుచున్నాఁడు)

మద— యీనగ యెన్నఁడో చూచినట్లే యున్నది. నీవెచటనుండి తెచ్చితివో వాకృచ్చుము ?

శర్వి— మదనికా ! నీ కదియంతయు నేల ? యిది స్వీకరింపుము.

మద— (కోపముతో) వాయందంత నమ్మక మేలేనియెడల నన్నెట్లు పెండ్లాడెదవు

శర్వి— ఇది చారుదత్తుఁడను విప్రవణిజుని నగయని నేను ప్రొద్దుటఁగోమటివాండ్లలో వింటిని.

(వసంతసేనయు మదనికయు నిరువురును మూర్ఛిల్లుచున్నారు.)

శర్వి— మదనికా ! ఊరడిల్లు మూరడిల్లుము.

గీ. ఒడలు విడిపోవఁగ విషాదపడెదవేల
వడఁకుదున్నదోయి ఖిడిగ్రుడ్లుపడఁగనేల

దాస్యపుం జెఱమాన్పింపఁ దలఁచినాఁడఁ
గంపమేల ససుం గటాక్షింపవేల.

మద—(తెలివి తెచ్చుకొని) సాహసికా, నానిమిత్త మీయకార్యముఁ గావించిన నీవాయింటి నెవ్వరినేనిఁ జంపలేదుకదా? యెవరి కాయమేనిఁ గాయము చేయలేదుకద?

శర్వి—మదనికా! ఈశర్విలకుఁడు భయపడ్డవానిని నిదురవోవు వానినిఁ దాడింపఁడు సుమా! నేనెవ్వరినిఁ గొట్టలేదు చంపనులేదు.

మద—నిజమేనా!

శర్వి—నిజము. నిజము.

వసం—(తెలివి తెచ్చుకొని) బ్రతుకు జీవుఁడా! నీకేమియాపదయు జరుగలేదంట

మద—ప్రియమే.

శర్వి—(అసూయతో) మదనికా! ప్రియమే యనఁగా నర్థమేమి?

గీ. సజ్జనశ్లాఘ్యమగువింట సంభవించి
చరిపినాఁడఁ గువృత్తి నీవలపుఁదగిలి
మాన మున్నది సుగుణంబు మాయమైన
వదసెదే? మిత్రి నను లాఁతివలపుఁదగిలి.

క. ఆమూలాగ్రము పండిన భూమీజము లౌర ధనికపుత్రులు వేశ్యా
భామాబకములు సేరినచో మొండులు గావు టేమిచోద్యము జగతిన్?

గీ. ఇంధనంబులు ప్రేమానుబంధనములు
పైకెగయుచుండు నిధువనజ్వాలలెందు
నట్టిఘనమైన కామాగ్నియందు యౌవ
నములు ధనములు వేల్చుచున్నారు జనులు.

వసం—వీని కసమయావేగము కలుగుచున్నదేలొకో!

శర్వి—ఎన్నివిధముల చేరినైనను—

గీ. కొమ్మలందును సిరులందు నమ్మకంబు
పూనువారలెపో బుద్ధిలేనివారలు
పడఁతులైనను సిరులైనఁ బాపరూప
కన్నియలయట్లు దిరుగు పకరింపునడల.

గీ. వలపు నిలుపఁగరాదు కోమలులయందుఁ
బరిభవింతురు వలచినవాని స్త్రీలు
తరుణియే తన్ను వలచిన దానివలపు
నడఁపవలయును లేదేని గడపవలయు.

ఈమాట మిగుల లెస్సమాట:—

క. సొమ్మిచ్చిన నవ్వింతురు నమ్మింతురుగాని ప్రియులనమ్మరు కులటీ
లమ్మలు గలవారికి రోకొమ్మలు కట్టా! శ్మశానకుసుమము లేలా!

మఱియును-

క. వలపునకు సంజచాయలు, నిలుకడకుం గడలి యలలు నిరసింతురు వే
శ్యలు కలధన మడిపి నిరర్థుల లత్తుక పిడుచుకొనిన దూచవిధమునన్.

స్త్రీ లనఁగాఁ గేవలము చంచలస్వభావము కలవారు.

గీ. హృదయమున నొక్కపురుషుని నిచ్ఛగింతు
చూపుచే నొక్కపురుషుని జూచుచుందు
రొకనియందు మదప్రేకోదయంబు
తుదకు వే ఱొకఁ డొందు సంగమువిందు.

ఇది యేకవి నుడివినసూక్తమో మిగులఁ గొనియాడఁదగినది.

గీ. కమలలత మొల్వ దద్రిశిఖరమువందు
బరువు మోయవు ఖరము లశ్వములపగిది
యవలు పండవు శాలిధాన్యంబువలనఁ
బడుపుగూడెములోఁ బతివ్రత కలుగదు.

ఓరీదురాత్మ! చారుదత్తహతక! నీ వెంతవాఁడవైన వసదుపురా! (అని కొన్ని యడుగులు నడుచును.)

మద—(ఉత్తరీయము కొంగు లాగుచు) ఓయీ! అసంబద్ధప్రలాపము సేయుము గోపింపఁ దగనివారిపైఁ గోపించెదవేల?

శర్వి—ఇందసంబద్ధప్రలాపము లేవి? కోపింపఁ దగనివా రెవరు?

మద—ఈయలంకారము మాయమ్మగారిదిసుమా.

శర్వి—అయిన నేమి?

మద—దాని నాయనయొద్ద దాఁచనిచ్చినది.

శర్వి—ఎందులకు దాఁచనిచ్చినది?

మద — (శర్విలకుని చెవిలో రహస్యముఁ జెప్పుచున్నది.)

శర్వి — (తెలతెల్లఁబోవుచు) హా రా! ఎంతపని చేసితిని!

గీ. ఎండవేఁడి సహింపలేక కట్టకేల
కాశ్రయించితి నేనొక్క విశ్రమింప
దాని రెమ్మలనే పత్రహీనములుగఁ
జేసికొంటిని కటకటా! చెడుగ నగుచు

వసం — ఏలాగో యితఁడు సంతప్తుఁడగుచున్నాఁడు. ఆర్య[illegible]గుని యిల్లని యెఱుఁగకే యీ కొంగతనముఁ గావించియుండును.

శర్వి — మదనికా! యిఁకఁ జేయవలసిన దేమి?

మద — అంశములకును నీవే పండితుఁడ వాలోచింపుము.

శర్వి — కాదు కాదు. నీకన్న నాకెక్కువ తెలియదు.

గీ. కూడునీపని యీపని కూడదని వి
చారణము సేయఁజాలిన చతురిమంబు
ముదితలకు సాజమైయుండుఁ; జదువువలనఁ
గాని పురుషులెఱుంగరో కమలనయన.

మద — నా తలంపు దోఁచినగతిఁ జేసెదవేని నగల నీవగ యీ మహానుభావునకే సమర్పింపుము.

శర్వి — అటులేని నన్నితఁడు న్యాయాధిపతియొద్దకిం గొనిపోయి శిక్షింపఁజేయునేమో?

మద — వెఱ్ఱివాఁడా! చంద్రుఁ డెండ కాయునా!

వసం — సెబాసు, మదనికా! సెబాసు.

శర్వి — మదనికా!

చ. అతనిగుణంబు లెలకొని యాడెదవే! నగయిచ్చుపట్ల దు
ర్గతి యగునంచు లోఁజడుపుగాని విషాదముగాని లేదు; కు
చ్చితమగు సాహసంబునకు సిగ్గు చిరంబునుండి లేదు; దు
ర్మతులగు మాదృశాధముల రాజు లిఁకేమి యొనర్తు రంగనా!

అయినను జోరనీతి కీపని విరుద్ధము కావునఁ గొండొకయుపాయ మాలోచింపుము.

మద — అటులే నిది రెండవ యుపాయము.

వసం — ఈ రెండవయుపాయ మేమయియుండునో!

మద— ఆమహానుభావుని సంబంధియై యీనగ వసంతసేనకే యిమ్ము.

శర్వి— అటులిచ్చిన నేమగును?

మద— నీవు దొంగవు కాకపోవుటయేకాక చారుదత్తభట్టారకుఁడు ఋణవిముక్తుఁ డగును. వసంతసేననగ వసంతసేనకు దొరకును.

శర్వి— ఇది మఱింతసాహసకార్యము కాదా!

మద— కాదు. ఇంకొకవిధ మేమైనను సాహసకార్యము.

వసం— మేలే మదనికా! పరిచారికకుం దగనియూహ యూహించితివి.

శర్వి— బాపురే మదనికా!

గీ. నిన్ననుసరించుటంజేసి నెలఁత నాకుఁ
గూడ దుర్మతి వదలి చేకూరె సుమతి
సులభముగ వచ్చునే దారిఁ జూపువాఁడు
నష్టచంద్రాతపంబగునాఁటిరాత్రి.

మద— నీ వీమదనదేవాలయంబున ముహూర్తము నిలువుము, నేనుపోయి వసంతసేనకు నీరాక యెఱింగించెద.

శర్వి— మంచిది.

మద— (వసంతసేనను సమీపించి) అమ్మా! చారుదత్తభట్టారకునియొద్దనుండి తత్సంబంధియగు బ్రాహ్మణుఁడొకఁడు వచ్చి ద్వారమందున్నాఁడు.

వసం— మదనికా! ఆర్యపుత్రుని సంబంధియని నీవెట్లెఱింగితివి?

మద— మనవారి నే నెఱుఁగనాయేమి?

వసం— (తనలోతలయూఁచి నవ్వుచు) సెబాసు! (ప్రకాశము) రమ్మనుము.

మద— (పోయి) రావయ్యా శర్విలక! (పిలిచియతనితోఁ బ్రవేశించును.)

శర్వి— (తెలతెల్లపోవుచు) ఆర్యురాలా! నీకు శుభమగుఁగాత!

వసం— ఆర్యా! నమస్కారము, ఆపీఁటమీఁదఁ గూర్చుండుము.

శర్వి— "నాయిల్లు పాఁతదగుటచేత రక్షించుటకష్టముగానున్నది, నీవేపుచ్చుకొని కాపాడుకొనుము" అని చెప్పి చారుదత్తభట్టు నీ నగ నీకిచ్చిరమ్మనిరి (అని మదనికచేతి కానగయిచ్చి వెడలిపోఁబోవును)

వసం— అయ్యా! నేనుగూడనొకవార్త చెప్పెద. అది యార్యపుత్రునితోఁ విన్నవింపవలయును.

శర్వి—(తనలో) అక్కడకుఁ బోవువాఁ డెవఁడు? (పైకి) ఆసందేశ మేమని?

వసం—మదనికను మీవెంటఁదీసికొనిపొండు.

శర్వి—నీభావము నాకు గ్రాహ్యమగుటలేదు.

వసం—పోనీ! నేనే తెల్పెదను లే.

శర్వి—ఏమని?

వసం—ఈయలంకార మేపురుషుఁడు నీకుఁ దీసికొనివచ్చియిచ్చెనో వానికీమదనిక నిచ్చి పెండ్లిచేయుమని ఆర్యపుత్రుఁడు నాతోడ సెలవిచ్చెఁగావున దీనిం బరిగ్రహించి పరిగ్రహించితి నని విన్నవింపవలయును.

శర్వి—(తనలో) ఈవసంతసేన నావృత్తాంత మెఱిఁగెనా యేమి (ప్రకాశముగ) బళా! చారుదత్త!

గీ. సద్గుణంబులులేని భూజానిరేని
సద్గుణంబులు గలయకించనుని తోడఁ
బురుషు కాఁజాలునే? కాన పురుషుఁ డెల్లఁడు
సద్గుణములకె యత్నంబు సలుపవలయు.

గీ. మంచిగుణములు గల్గిన మనుజులకు న
సాధ్యమగుకార్యముండునే జగతియందు
అట్టి మాక్కంటితలకుఁ బూవగుటయందుఁ
గారణము చంద్రునిగుణగణము కాదె.

వసం—ఎవఁడురా బండివాఁడు?

బండివాఁడు—(ప్రవేశించి) అమ్మా! బండి సిద్ధము చేసియుంచినాను. ఏమిసెలవు?

వసం—చేటీ! మదనికా! నన్నుదృష్టపతినిజేయుము. నిన్నివిప్రునకిచ్చితిని. పోయి బండియెక్కుము. నన్ను మాత్రము మఱవకుము.

మద—అమ్మా! నన్ను వదలుచుంటివా. (యేడ్చుచుఁ బాదములపైఁబడును)

వసం—(లేవఁదీసి) మదనికా! నేఁడు నీవే వందనీయవైతివి. యేప్యానము పొమ్ము. బండియెక్కుము. నన్ను మఱవకుము

శర్వి—భగవతీ! నీకు శుభమగుంగాత. మదనికా!

గీ. ఎవతెఁ బారికవైయున్న పోతువుఁ బ
ట్టసమున్యోగ్యను నీకుఁ గౌఁడలకు వనవని

పరమపావని యాభాగ్యవతికి ముందు
వందనముఁజేసి సౌభాగ్యవతివి కమ్ము.

(మదనికతో బండినెక్కును.)

(తెరలో) ఎవరురా అచ్చట ? "గోపాలబాలకుం డార్యకుఁ డనువాఁడు రాజగునని సిద్ధుఁడు నుడివిన పలుకులను జడిసి పాలకమహారాజతని ఘోషపల్లెనుండి రావించి కారాగారమునందు బంధించెనని మీరందఱెఱింగినదియే కదా. కావున మీరు మీమీపనులయందు జాగరూకులైయుండుఁడు" అని రాష్ట్రియుఁడు శాసించుచున్నాఁడు.

శర్వి— (విని) ఏమీ ! పాలకమహారాజు నాప్రియమిత్రు నార్యకుని బందీకృతుఁ గావించెనా ! హా ! హా ! ఎంతకష్టము ! అతనియుద్ధకుఁ బోకుంపఁ గళత్రసహితుఁడనై యుంటిని. కానిమ్ము.

గీ. స్నేహితుం డొక్కరుఁడుఁ దరుణియు నొకర్తు
నిర్వురే కద జనుల కీయుర్విఁ బ్రియులు
మానినీమణు లొక వేయిమందికంటె
నిట్టివేళలఁ బ్రియుఁడు సుహృత్తముఁడు. (అని బండిదిగును.)

మద— (కన్నీరుజాఱ) ఆర్యపుత్రా ! పోఁదగదు. నన్ను గురుజనులయొద్ద డించి పిదపఁ జనుము.

శర్వి— బాగు ప్రియురాలా ! బాగు. నామదినున్నట్లే పలికితివి బండివాఁడా నీవు రేభిలుని యిల్లెఱుఁగుదువా ?

బండి— అయ్యా ! యెఱుఁగుదును.

శర్వి— ఈమె నాయిల్లు చేర్చుము.

బండి— చిత్తము. చిత్తము. సెలవు తప్పక కావించెదను.

మద— ఆర్యపుత్రుఁడు మాత్రము అప్రమత్తుఁడై యుండవలయును (నిష్క్రమించును)

శర్వి— నేనిపుడు—

ఉ. అవమతి నొందిచేఁ గనిన యయ్యాయిభృత్యులఁ, గోపకాంద్ర, బం
ధువుల, భుజార్జితాత్మీయమదోర్బలశాలుర, మిత్రవర్గముం
రవ్వులఁగఁజేసి మున్నుదయనప్రభుఁ దల్చివుందువో తె, బం
దీ వసతిఁ గొందు నార్యకుని నే విడిపింతు జగమ్ము మెచ్చఁగన్.

గీ. ఎగ్గు రాఁబోవునంచు నిశ్శ్వాతుకముగఁ
దివిరి మన్మిత్రు నెవఁడు బంధీకరించె
వాని చెఱనుండి విడిపింతు వాని నేఁడు,
రాహుముఖముననుండి చంద్రముని వగిది (నిష్క్రమించును.)

చేటి— (ప్రవేశించి) అమ్మా! నీ పుణ్యము మంచిది. చారుదత్తభట్టారకుని యొద్ద నుండి యొక బ్రాహ్మణుఁడు వచ్చినాఁడు.

వసం— చేటీ! నేఁడెంత సుదినమో! సాదరముగాఁ దోడి తెమ్మా, బంధులునిఁ గూడ వెంటఁ గొనిరమ్మా.

చేటి— సెలవు నిర్వర్తించెదను. (అని నిష్క్రమించును.)

(పిదప బంధులునితోడను చేటితోడను మైత్రేయుఁడు ప్రవేశించును)

మైత్రే— ఆహాహా! మున్ను రాక్షసరాజగు దశవదనుఁడు చిరకాలము తప మాచరించి పుష్పకమను విమానము సంపాదించి తిరిగెను. నే నేతపముఁ జేయకుండఁగనే పరనారీమయమగు విమానము మీఁదఁ దిరుగుచున్నాను.

చేటి— అయ్యా! ఇది యింటి సింహద్వారము. ప్రవేశించుము.

మైత్రే— (ప్రవేశించి యబ్బురముతో) ఔరౌరా! వసంతసేనయింటి సింహద్వారము సొగసు! ఈ ప్రదేశమంతయు సలిలముతోఁ దడిపి, తుడిచి, పచ్చగానలికి, వివిధపుష్పోపహారము లుంచిన పగిదిఁ జిత్రించిరి. దీని శిఖర మాకాశమును దలయెత్తి చూచుచున్నటులున్నది. ఐరావతము తొండ మంత లేసి మల్లెపూలదండలు ముత్యాలపేరులవలె వ్రేలాడుచున్నవి. ఈ ద్వారతోరణమంతయు దంతిదంతమయమే! రత్నమయంబులగు పరివేషములతోఁ గూడిన యూర్ధ్వజపటంబు లనిలవశమున నల్లలాడుటఁ జూడఁ జూడరమ్మని నన్నుఁ జేరఁబిలుచుచున్నట్లున్నవి. పచ్చని మావిచివుళ్లతోడి మంగళకలశములు నిలువు రతనంపుఁ గంబములు నిల్పిన యరంగులపై నిలిచి కన్నులపండువు వొనర్చుచున్నవి. పెద్దరాక్షసుని బొమ్మవలె దుర్భేద్యమైన యీ తలుపుచెక్కలపై సందులేకుండ వజ్రములు తాపిరి. బాపురే! దరిద్రులకు మనోరథంబులను గుప్పకూరలుగా నుప్పతిలఁజేయుచు మావంటి మధ్యస్థుల చిత్తములనుగూడ నాకర్షించు దీనియందు నేమిచెప్ప!

చేటి— అయ్యా! యిది మొదటియంకణము. ఇందుఁ బ్రవేశింపుఁడు.

మైత్రే— (ప్రవేశించి నాల్గుపంకలఁ గలయంకణముఁ జూచి) బాపురే! చంద్రునివలె శంఖ మూపగిదిఁ దామరతూఁడులవలెఁ దీర్చి సింగారించిన మ్రుగ్గులచేతను నడుమ

వడుమ నవరత్నములు తాపడము చేసిన బంగారుసోపానములచేతను బ్రకా శించుచున్న యీ మేడలు ముత్యాలదండలచే నలంకరింపఁబడిన స్ఫటిక శిలామయవర్తులవాతాయనముఖంబుల నుజ్జయినీ సౌందర్యము నవలోకించు చున్నవని తలంచెదను. సుఖపడు వృద్ధశ్రోత్రియునివలె [illegible] వారికుఁడు కునుకుపాట్లుపడుచున్నవాఁడు. పెరుఁగుతోఁ గలిపిన యీ బల్యన్నమును గూడ నున్న పుల్లములనిరయించి కాకు లాదరికేగకున్నవి చేటికా! యింక ను లోపలికి దారిఁ జూపుము.

చేటీ—అయ్యా! ఇది రెండవ మొగసాల; ప్రవేశింపుఁడు.

మైత్రే—(ప్రవేశించి) అయ్యారే! లెస్సఁగ బలిసిన బండిగిత్తలు మెసవుచున్న యవసబుసమును దగ్గఱనుండి తత్సంరక్షకులు పోగ్రుచేయుచున్నారు. కొంచ ఱాగిత్తల కొమ్ములకు నునుపుగాఁ నూనియరాయుచున్నారు. ఉన్న పోతు అవమానముఁ జెందిన కులీనుని వగిని బిట్టు నిట్టూర్పు నిగుడించుచున్నది. ఇచట యుద్ధము మానిపించిన మల్లునికింబోలె నీపొట్టేలు మెడ తోము చున్నారు. ఇందు గుఱ్ఱాలకుఁ జక్కఁగా నొడలినిమీఁద నోముదులు [illegible] రించుచున్నారు. వితిచికట్టిన దొంగవానివలెఁ గూర్చున్న దిచట నీకోఁతి. మావటీలిచ్చ్చట భక్తతైలఘృతమిళితంబులగు ముద్ద లేనుగులనోటి కందించు చున్నారు. చేటీ! యింకఁ బైతోవఁ జూపుము.

చేటి— అయ్యా! ఇట్టిటురమ్ము, ఇది మూఁడవ మొగసాల. ప్రవేశించుము.

మైత్రే— మఝ్ఝూరే! ఈమూఁడవ మొగసాలయందము! ఇందుఁ గులపుత్రికులు కూర్చుండుటకుం దగిన యాసనము లమర్చియున్నవి. ఏదియో సగముచదివి పుటలు విప్పియుంచిన పుస్తకము రత్నమయశారికాసారితం బగు నెత్తపుం బలకపై నున్నది. స్త్రీపురుషులకుఁ గలయిక కావలసిన గల యికను నెడఁబాటు కావలసిన నెడఁబాటును జేయఁజాలిన సామలును, వృద్ధవిటులును బెక్కురంగులు చిత్రించిన చిత్రపటములు కేలంగీలించి యిట్టటుఁదిరుగుచున్నారు. పరిచారికా! యింక నింకొకమొగసాలకు దారిఁ జూపింపుము.

చేటి— అయ్యా! ఇది నాలవచత్వరము ప్రవేశింపుము.

మైత్రే— (ప్రవేశించి) బాగుకే! యువతికరతాడితంబు లగుమద్దెలలు మేఘము లుఱిమినట్లు మోగ్రుచున్నవి. కంచుతాళములు పుణ్యము చాలక నింగి నుండి పడుచున్న చుక్కలవలె మెఱయుచున్నవి. మధుకరీనాదము వలె మధురముగాఁ బిల్లనగ్రోవి వినఁబడుచున్నది. ప్రణయకుపిత యగుకామినిం

జోలెం దొడమీఁద నిడుకొని నఖరపరామర్శంబున వీణను సారించుచున్నారు. మకరందము గ్రోలి మదించిన యాఁడుతుమ్మెదలవలెఁ జెవులకుఁ జవులు పుట్టునట్లు పాడుచు గణికాబాలిక లాడుచున్నారు. సింగారముగ నృత్యాభినయంబులు నేర్చుకొనుచున్నారు. వాతాయనంబులయందు వ్రేలాడఁ గట్టిన సలిలగర్గరియలు వాయువు నాకర్షించుచున్నవి. చేటికా! యిఁకఁ బైత్రోవ నడుపుము.

చేటి — అయ్యా! ఇటురమ్ము. ఈపంచమప్రకోష్ఠమును బ్రవేశించుము.

మైత్రే — బాగుకే! ఈప్రకోష్ఠమునందింగువనూనితాలింపు గుమగుమ దరిద్రులను నోరూరించుచున్నది. రాత్రిందివ మెడ తెగకుండ నగ్నిచే సంతప్యమానంబగు వంటయిల్లు సురభిమాంసోద్గారచ్ఛలంబున నూర్పుచ్చుచున్నది. వండుచున్న భక్ష్యములయు భోజ్యములయుఁ బరిమళము నా నాసాపుటములందగుల్కొని నన్నువ్విళులూరఁ జేయుచున్నది. చినుఁగుబట్టవంటి పశూదర పేశిని జేతఁబట్టుకొని కటికవాండ్రపిల్లవాఁడు కడుగుచున్నాఁడు. వంటవాఁడు చిత్రములగు పెక్కువంటలు వండుచున్నాఁడు. మోదకములు కట్టుచున్నారు. అపూపములు వండుచున్నారు. (తనలో) ఇప్పు డెవ్వరైన మడిగట్టుకొమ్మని కాళ్లుకడుగుకొనుటకు నీళ్లుతెచ్చి యిచ్చిన బాగుండును. వివిధాలంకారశోభితులగు గంధర్వాప్సరోగణములవలె నున్న గణికలచేతను బంధులులచేతను నిజముగా నీగేహ మింద్రమందిరమును మించియున్నది. బంధులు లనఁగా నెవరురా మీరు?

బంధు — మే మెవరమా,

చ. పరపురుషానురక్తలగు భామినులందు జనించినాము; కాఁ
పురము సదా పరాలయము, భుక్తి పరాన్నము, మాధనంబులే
పరులధనంబు, లార్యుల కవాచ్యులమై చరియింతు మెప్పుడుం
గరికలభంబులట్ల నవకంబున బంధులు నన్న పేరునన్.

మైత్రే — చేటికా! దారిచూపుము దారిచూపుము.

చేటి — అయ్యా! ఇది ఆఱవముంగిలి ప్రవేశించుము.

మైత్రే — (ప్రవేశించి) ఏమివింత! ఈయాఱవముంగిట నీలరత్నమునకుం గట్టిన సువర్ణమణితోరణంబు లింద్రాయుధమును బురణించుచున్నవి. మణివణిక్కు లన్యోన్యము వైదూర్యమౌక్తికప్రవాళపుష్యరాగేంద్రనీలకర్కేతర పద్మరాగమరకతప్రభృతి మణివిశేషములు విచారించుచున్నారు. కొంద

ఉంగసాలలు కుందనపుఁబని చేయుచున్నారు. మఱికొందఱు వగలు చేయుచున్నారు. కొందఱు ముత్యము లెఱ్ఱదారములకు గ్రుచ్చుచున్నారు. కొందఱు వైదూర్యములకల్ల నల్లన మెఱుఁగు పెట్టుచున్నారు. కొందఱు శంఖములు దొలుచుచున్నారు. కొందఱు పగడములు సానబెట్టుచున్నారు. కొందఱు కుంకుమపువ్వు నెండఁబోయుచున్నారు. కొందఱు కస్తూరి సాదంచుచున్నారు. కొందఱు మంచిగంధము తీయుచున్నారు. కొందఱగురు వత్తిక లంటించుచున్నారు. కొందఱు గణికాకాముకులకు సకర్పూర తాంబూల మందిచ్చుచున్నారు. కొందఱు జవరాండ్రఁ క్రీఁగంటిచూపులఁ జూచుచున్నారు. కొందఱు నవ్వుచున్నారు, కొంద ఱెడతెగకుండ మద్యము నెగబీల్చుచున్నారు. వీండ్రు పరిచారకులు, వీండ్రు పరిచారికలు. ఈ పురుషులు దారపుత్రాదులను విడచి సర్వదా యిచటనేయుండి గణికాపేక్ష శేషమగు మదిరారసము త్రావి యొడలెఱుంగక పడియున్నారు. చేటీ! యింకఁ బైప్రకోష్ఠమునకు దారిచూపుము.

చేటి—అయ్యా! ఇటురమ్ము. ఇది సప్తమాంగణము ప్రవేశించుము.

మైత్రే—(ప్రవేశించి) ఆహాహా! యీపావురాపిట్టల జోడులు పరస్పరము ముద్దు పెట్టుకొనుచు గట్టిగఁ గట్టఁబడిన విహంగవాటికయందు సుఖమనుభవించుచున్నవి. పంజరమునందున్న చిలుకలు పెరుఁగు కూడు కడుపునిండ మెసవి పాఠకులవలె సూక్తములు పఠించుచున్నవి. ఇదిగోఁ బెంపుడుగోరువంక యొడయురాలి సన్మానమునిండఁగల దాసివలెఁ గురకురలాడుచున్నది. ఆ పేశలఫలములు తినుటవలనఁ గషాయకంఠము గలకోయిల కుంభదాసివలెఁ గూయుచున్నది. నాగవాసములకుఁ బెక్కు పంజరములు వ్రేలాడఁగట్టినారు. లావకములను పోరాడించుచున్నారు. పచ్చతీతువులకు మాటలు నేర్పుచున్నారు. పంజరకపోతములను బైకెగుర వేయుచున్నారు. ఈగృహమయూరము నవరత్నములు తాపడముచేసినగతి నున్నపింఛము విప్పి విసరుచు నొక మేడనుండి యింకొక మేడకు దుముకుచున్నది. ప్రోవుచేసిన చంద్రకిరణముల వలె రాజహంసమిథునములు కామినుల గమనసౌందర్యము నేర్చుకొనుటకుం బోలె నిట్టటుఁ దిరుగుచున్నవి. ఈపక్షిజాతు లన్నియు నీగణికలశోభ నినుమడింపఁ జేయుచున్నవి. బాపురే! నాకు నిజముగా నీభోగముదాని యిల్లు నందనవనమువలెనున్నది. చేటికా నడువుము, దారిచూపుము.

చేటి—రారమ్ము. ఇదిగో నెనిమిదవ మొగసాల ప్రవేశించుము.

మైత్రే—(ప్రవేశించిచూచి) చేటికా! వీడెవఁడు పట్టుబట్టలు గట్టుకొని యొడలు నిండ విలువలేని బంగారునగలు దాల్చి మేను విఱుచుకొనుచు నిట్టట్టుఁ బరిభ్రమించుచున్నాఁడు.

చేటి—ఇతఁడు వసంతసేనయన్న.

మైత్రే—వీఁడు వసంతసేనకు నన్నయగుట కెంతపుణ్యము గావించెనో! ఛీ, ఛీ, వీఁడు పుణ్యశాలియనరాదు. వీఁ డెంత యుజ్జ్వలవేషభాషలు కలవాఁడైనను నెంతసుకుమారుఁ డైనను నెంత సిరియనుభవించుచున్నను శ్మశానవాటికయందు జనించిన చంపకవృక్షమువలె లోకులకు మాననీయుఁడు మాత్రము కాఁడు.(ఇంకొకదెసజూచి) చేటీ! కాళ్ళనిండ దిగజాఱ నూని రాచుకొని యట్టచెప్పులు తొడుగుకొని మీఁద నీఁగలు ముసరకుండఁ బువ్వులచీర కప్పి యెత్తుపీఁటమీఁదఁ గూర్చున్న ఆముసలిది యెవరు ?

చేటి—ఈమె వసంతసేనతల్లి.

మైత్రే—ఓహోహో యీపికాచి బొజ్జకడుపు! మహాదేవునివలె ముందు దీని నీయింటఁ బ్రవేశ పెట్టి తరువాత నే యింటికి ద్వారబంధములు తలుపు లెత్తించినారాయేమి ?

చేటి—ఓరీచచ్చినవాఁడ! చాతుర్థికజ్వరముచేత బాధపడుచున్న మాయమ్మగారిం జూచి నవ్వకుము.

మైత్రే—(పెద్దపెట్టున నవ్వి) తల్లీ! చాతుర్థికజ్వరమా! బ్రాహ్మణుఁడను నాపైఁగూడ నిట్టియనుగ్రహము చేయ రానిమ్మా.

చేటి—నీయూళ కూలిపోను, చత్తువు.

విదూ—తొత్తుకూఁతురా! ఇంత లంబోదరముతో బ్రతుకుటకన్నఁ జచ్చుటయే మేలు

గీ. ఆసవము కల్లు మద్య మెల్లపుడుఁ ద్రావి
చెంద నీదురవస్థ యీచెవఁటితొత్తు
త్వరఁగ నిది చచ్చెనేని సంతర్పణంబు
కడుపునిండ సహస్రసృగాలములకు.

ఓసీ! మీకు నోడలేమైన నున్నవా ?

చేటి—మాకోడలు లేవు.

మైత్రే—ఔను, ప్రేమ యనునిర్మలజలము గలయీమదనసముద్రమందుఁ దిరుగుటకు మీస్తనజఘననితంబములుండ వేఱునావ లేల ? మీవసంతసేన యింటివిభవ

మఱఁజూచిన నాకు ముల్లోకము లొకచోటనే కాన్పించుచున్నవి. కొనియాడుటకు నాకీనోరు చాలదు; ఇది గణికాగృహమా! లేక కుబేరభవనమా! మీవసంతసేన యెక్కడ?

చేటి—ఆయుద్యానవనములోఁ జెట్లగుంపునడుమ నున్నది. ప్రవేశింపుము.

మైత్రే—(ప్రవేశించిచూచి) ఆహా! ఈవృక్షవాటిక యెంతసొగసైనది! ఇందలి వృక్షజాతు లన్నియుఁ జిత్రవిచిత్రకుసుమములు కలవి. దట్టముగా నున్న చెట్లనీడ నొక తూఁగుటుయ్యేల బడఁతులపిఱుందులకుఁ జాలునట్లుగా నిర్మింపఁబడి యున్నది. తమంతట నేలరాలిన బంగారుబంతిగురివిందపూవులును శేఫాలికా కుసుమంబులును మల్లెలు మొల్లలు జాజులు గోరంటలు మొదలగు సుమరాజంబులును నందనవనమును గ్రిందుపఱచుచున్నవి. (వేఱొకచోటఁజూచి) ఈ దిగుడుబావి యుదయించుచున్నసూర్యునివలె నెఱ్ఱనైన కలువపూవులవలన సంజవలెనున్నది.

గీ. క్రొత్తగాఁ గొంతపుష్పించి కొంతననిచి
కాలుచున్న దశోకవృక్షంబుచూడ
రక్తధారలచేత సంసిక్తమైన
భటుని నెమ్మేని రమ్యభావంబుజాడ.

కానిమ్ము, మీవసంతసేన యెచ్చోటనున్నదో చూపుము.

చేటి—అయ్యా దృష్టివంచి చూడుము. అదిగో మావసంతసేన.

మైత్రే—(చూచి సమీపించి) పూజ్యురాలా! నీకు శుభము.

వసం—మైత్రేయుఁడా! (లేచి) స్వాగతమా! ఇదె పీఁట; యిందుఁ గూర్చుండుము.

విదూ—నీవును గూర్చుండుము. (యిరువురును గూర్చుందురు.)

వసం—మీసార్థవాహకుమారునకుఁ గుశలమా!

మైత్రే—కుశలము.

వసం—ఆర్యమైత్రేయా! ఇప్పటికిని-

గీ. గొనములు చిగుళ్ళు వినయంబు కొమ్మగములు
మొదలు నమ్మిక యోగ్యత పువులు చేయు
పనులు పండ్లుగఁ జెలఁగు సజ్జననగమును
జేరుచున్నదె మిత్రపక్షిప్రజంబు?

మైత్రే-(తనలో)ఈదుష్టవిలాసిని ఎంతచక్కఁగఁ బరిశీలించినది! (ప్రకాశము)ఔను.

వసం—ఆర్యా! నీవువచ్చిన పనియేమి?

మైత్రే— వినుము. మాచారుదత్త భట్టారకుఁడు శిరంబున దోసిలియొగ్గి నీకిట్లువిన్న వించుకొనుచున్నాఁడు.

వసం— (దోసిలియొగ్గి) ఏమని యాజ్ఞాపించిరి?

మైత్రే- నేను నీసువర్ణభాండమును విశ్వాసమువలన నాదే యనుకొని జూదములో నోడిపోతిని. ఆగెలిచిన జూదరి రాజుగారిచారుఁడు. ఎచటి కేగెనో తెలియదని.

చేటి— ఆర్యశాల! నీయదృష్టము మంచిది. ఆర్యపుత్రుఁడు జూదరి యయ్యె.

వసం— (తనలో) దొంగ యెత్తుకొనిపోయిన నగ జూదములో నోడిపోతి నని నుడువుచున్నాఁడు. కనుక నే కోరఁదగినవాఁడు.

మైత్రే— దానికి మారుగా నీరత్నావళిఁ బుచ్చుకొనుము.

వసం— (తనలో) ఆసువర్ణభాండ మిత్తునీఁ గనఁబఱతునా, ఇప్పుడు వలదా?

మైత్రే— ఈరత్నావళి గ్రహింప నిష్టములేదా యేమి?

వసం— (నవ్వుచుఁ జెలివంకఁ జూచుచు) మైత్రేయ! ఏల గ్రహింపను, (తీసుకొని చెంతనుంచుకొని తనలో) పువ్వులు రాలిపోయిన తియ్యమామిడిచెట్టునకు మకరందబిందువు లెక్కడివి? (ప్రకాశము) ఆర్య! ఆజూదరితో నేను ప్రదోషసమయమున దర్శనమునకు వత్తునని చెప్పుము.

మైత్రే— (తనలో) ఇది యింటికి వచ్చి మాత్రమింక నేమి సంపాదించును? (ప్రకాశముగా) అట్లే చెప్పెదను (తనలో) ఈగణికాప్రసంగము చాలింపుమని (నిష్క్రమించును.)

వసం- చేటీ! ఈయలంకారము గ్రహింపుము. మనమార్యపుత్రు నభిసరింపఁబోదము.

చేటి— ఆర్యా! చూడుము చూడుము. అకాలదుర్దినము తటస్థించుచున్నది. ఎంత మబ్బు పట్టినదో.

వసం— ఆరత్నావళిఁ దీసికొని వేగ రమ్ము.

గీ. రాత్రి వడుఁగాక యటు కారుక్రమ్ముఁగాక
చినుకు ఘనమయి మిగుల వర్షించుఁగాక
నేను లెక్కింప నివి యెల్ల నిజము నాదు
మనము తగుల్కొనెఁ బ్రియాభిగమనమందు.

చేటికా! నీవీరత్నావళిం దీసికొని వేగరమ్ము.

(అని నిష్క్రమించు చున్నారు.)

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వరాంధ్రీకృతంబగు మృచ్ఛకటికంబు నందు మదనికాశర్విలక మను చతుర్థాంకము.

శ్రీరస్తు

# మృచ్ఛకటికము

## పంచమాంకము

(పిదప నుత్కంఠితుఁడగు చారుదత్తుఁ డాసనస్థుఁడై ప్రవేశించును.)

చారు — (నింగివంకకుం జూచి) అకాలదుర్దినము తటస్థించుచున్నది! ఇచట!

గీ. పెంపుడు నెమిళ్ళు తమిఁ బురివిచ్చి చూడ
నాత్రపడి పోఁదలంచి రాయంచ లెడయు
దుర్దినం బౌర యిది హఠాత్తుగ వియోగి
జనులహృదయము పంతరింతుమనుగ ప్పె.

మఱియును —

గీ. బెగ్గురులబారు తెలిసంకు నిగ్గుజూప
మెఱపు నెమ్మేని పుట్టంబు మిసిమిఁగ్రమ్మ
నాక్రమించెఁ ద్రివిక్రముఁడట్లు ఉదక
సిక్త మహిషోదరానీలజీవనదము.

మఱియును —

గీ. కరఁగఁబోసిన వెండివాఁ గారు మొగులు
నుండి పడునీటిధార లందుండు మెఱపు
పసిమిచే నిమాసం బగుపడక భిన్న
గగనచేలాంచలంబుల గతిఁదనర్పు.

సీ. కలసిన చక్రవాకంబులగతి, రెక్కలల్లార్చి యెగురు రాయంచలట్లు
జలములోఁ దిరుగు చేఁపలరీతి, జవపరిభ్రాంతంబులగు మకరములవగిదిఁ
గమనీయశృంగజంగమసౌధముల భాతిఁ, బరుగిడుచున్న యశ్వములచాయ
మట్టి పైకెత్తిన లొట్టిపిట్టలమాదిరి. గుమురుగాఁ బోవు నేస్తులవిధమున

గీ. వాయువిశ్లేషితంబులౌ వారివాహ
ఖండములు పెక్కురంగులు కలవి పడువఁ
జదలు భాసిల్లుచున్నది చారుచిత్ర
శిల్పనఁ గన్పించు దౌసంగు వస్త్రంబువగిది.

గీ. అంబికేయుని బలఁగపట్లయ్యె మిన్న
పొంగుచుండెను రారాజుపోల్కి నెమిలి
యోడి చనసాగె ధర్మజుజాడఁ బికము
డాఁగె రాయంచగములు పాండవులపగిది.

(ఆలోచించి) మైత్రేయుఁడు వసంతసేన యింటికింబోయి చిరకాలమైనది. ఏలొకో రాలేదు.

మైత్రే— (ప్రవేశించి) ఔరా! ఆభోగము లంజె నిదాక్షిణ్యము లౌభ్యము తలఁచిన నాకచ్చెరువగుచున్నది. రెండవప్రస్తావనయైనఁ దెచ్చినదికాదు. తనచెలిమికిఁ దగినమాటలెన్నియో చెప్పి తుదకు రత్నావళి హరించినది. మైత్రేయా! కొంచెము విశ్రమించు మనుమాటయేని దానినోట రాలేదు కదా! ఇన్ని మంచినీళ్లైన త్రాగిపొమ్మన్నదికాదే! ఇఁక నేనెన్నఁడు వాతోస్తుకూఁతు వెంగమైనఁ జూడను. (నిర్వేదముతో) దుంపలేని పద్మలతయు వంచకుఁడుగాని కోమటియు, దొంగకాని యగసాలివాఁడును, వివాదలేని పల్లెఅచ్చరయు దుర్భాగ్యాశలేని సానిదియు సుందరనుమాట లసత్యములుకావు. కావున మిత్రుండగు చారుదత్తుని గణికా వ్యాపారమునుండి మరలించెద (యెదుటికిఁజూచి) ఏలొకో ప్రియమిత్రుఁ డుద్యానవృక్షవాటికయందొంటరిగా నున్నాఁడు. సమీపించెద. (సమీపించి) అయ్యా! వృద్ధిఁజెందుము. నీకు శుభమగుఁగాత.

చారు— (చూచి) వీఁడుగో నాప్రియమిత్రుఁడు! మిత్రమా! కుశలమా! కూర్చుండుము.

మైత్రే— కూర్చున్నాను. (అని చతికిలఁబడును.)

చారు— వయస్యా! ఆకార్యమేమైనది?

మైత్రే— ఆకార్యము భగ్నమైనది.

చారు— అది రత్నావళి పుచ్చుకొన్నది కాదాయేమి?

మైత్రే—మనకాపాటి యదృష్టమా? నవనళినకోమలంబగు కోసిలియొగ్గి పుచ్చుకొన్నది.

చారు— అటులేని కార్యము భగ్నమైన దనియెద వేమి?

మైత్రే— ఏల భగ్నముకాలేదు? కుడిచితిమా! నుడిచితిమా! దొంగలెత్తుకొని పోయిన మాలనుపణ్యభాండముకొఱకు చతుస్సముద్రముద్రితధరావలయ సారభూతంబగు రత్నావళి పోయినది.

చారు— మిత్రమా! అట్లనకాధు-

గీ. పడపువగలాఁడి యయ్యు విశ్వాసముంచి
దానినగ తెచ్చి మనచేత దాఁచనిచ్చె
నయ్యలంకార మల్పమూల్యమగుఁగాక
దానినమ్మిక విలువఁగాఁ దలఁచె మనకు.

మైత్రే— మిత్రుఁడా! నాకు దానిమీఁదఁ గోపము మనరత్నావళి హరించిన దనియే కాదు. చెలికత్తెలకుఁ గంటిసైఁగ చేసి మొగము పైఁటకొంగుచాఁటునం బెట్టుకొని నన్ను పరిహసించినది. నేను బ్రాహ్మణుఁడనయ్యు నీపాద ములంబడి వేఁడుకొనుచున్నాను. పెక్కుసిలుఁగులు కలుగఁజేయు సాని కూట మీపాటికిఁ గట్టిపెట్టుము. గణికలు చెప్పులోఁదూఱిన రాయివలె జాలఁ గష్టపెట్టుదురు. ఇదియునుంగాక యోసుహృద్వరా! భోగముది యేనుఁగు కాయస్థుఁడు సన్యాసి వంచకుఁడు గాడిద—యివి నిలిచినచోటఁ బూరియైన మొలవదు.

చారు— మిత్రమా! వేశ్యలమీఁది దోషోద్ఘాటన మింకఁ జాలించుము. గణికా పరిసంగము నీవు మానిపింపనక్కఱలేదు. నాప్రస్తుతావస్థయే మాని పింపఁగలదు.

గీ. వతువనేచూచుఁ బ్రాణముల్ గడచునవ్వు
డైన జాత్యశ్వ, మడుగులు పడవు గాని
కోర్కు లెన్నేని దలపోసికొనఁగనచ్చుఁ
గాని యవి బీదహృదయంబు గడువలేవు.

మఱియును—

గీ. ధనముగలవారి సొంత మాతరుణి, వాండ్రి
జాతియే రొక్కములు లాగు జాతియగుట

(తనలో) యీవసంతసేన మాత్రము సుగుణహార్య. (ప్రకాశముగ)
మనల నెన్నఁడు వదలెనో ధనము నాఁడె
వదలితిమిగాదె యాకుందరదన మనము.

మైత్రే— (క్రిందికిఁ జూచుచుఁ దనలో) ఇతఁ డాకసమువంకకు దృష్టినిగిడ్చి నిట్టూర్పువిడుచుట చూడ గణికాప్రసంగము మానుమని నేను బోధించుటం జేసి యుత్కంఠ మఱింత హెచ్చినదని తలపోసెదను. కనుక నే కామము చెడ్డదని పెద్దలు నుడువుదురు (ప్రకాశముగ) మిత్రమా! అలంజెకూఁతురు ప్రదోషకాలమున్న నీయింటికి వచ్చెదనని నీతోఁ జెప్పుమన్నది. సువర్ణ—

భాండమునకు రత్నావళి చాలదని మెఱ్ఱవెట్టి యింకేదేని లాగికొనిపోవుట కని నే నూహించెదను.

చారు— కానిమ్ము, సంతోషపఱచియే మఱలఁ బంపుదములే.

చేటుఁడు— (ప్రవేశించి) అయ్యలారా! వింటిరా?

గీ. చెనకి యీవాన దిమ్మరించినకొలంది
నెత్తితిమ్మిరి యెత్తె నావీఁపు తోలు
విసరుచున్నది వలిగాలి విసమువోలె
నాదుహృదయంబు వడఁకుచున్నదిగదొర.

గీ. ఊఁదఁగల వేడు రంధ్రంబు లున్న వెదురు
మీటఁగల నేడుతంత్రుల మేటివీణ
పాడఁగాఁగల గీతంబు గాడిదవలె
నారదుఁడు తుంబురుండును నాకు సరియె.

'కుంభిలకా! నీవుపోయి చారుదత్తభట్టుతో నేను వచ్చుచున్నానని మనవి చేయు'మని వసంతసేన నా కాజ్ఞాపించినది. కావున నేను జారుదత్తుఁడుగారి యింటికిం జనుచున్నాఁడ. (పరిక్రమించి చూచి) వాడుగో! చారుదత్త భట్టారకుఁ డాచెట్లగుంపుక్రిందఁ గూర్చున్నాఁడు. కానీ సమీపించెదను (పోయి) యీయువవనద్వారము మూసియున్నది. ఎట్లుపోదును? కానిమ్ము, ఆదుష్టవటువునకు సైఁగఁ గావించెదను. (బెడ్డలు వానిమీఁద విసరుచున్నాఁడు.)

మైత్రే— ఎవఁడురా! ముళ్ళకంచెవైచిన వెలఁగచెట్టుమీఁదికి ఱాళ్లువిసరినట్లు నామీఁదికి ఱాళ్ళు విసరుచున్నాఁడు.

చారు— ఈయుపవన సౌధముమీఁదఁ గ్రీడించుచున్న పావురా లేమో ఱాళ్లు క్రిందికి దొరలించినవి.

మైత్రే—తొత్తుకొడుకు పావురమా! ఉండుండుము. ఈకఱ్ఱతో మేఁడమీఁదనుండి ముగ్గినమామిడిపండువలె నిన్ను నేలఁగూలనేసెద. (కఱ్ఱతీసికొనిపరువెత్తును.)

చారు—(యజ్ఞోపవీతము పట్టుకొనియాఁపి) మిత్రమా! నిలువుము-సాధు మాపావురములు జోడుగట్టి తిరుగుచున్నవి వానిజోలి కేగకుము.

కుంభి—ఇతఁడు పావురమనుకొనుచున్నాఁడు గాని నేనని యెఱుఁగఁడు మరలనొక బెడ్డ విసరెదను (అని విసరుచున్నాఁడు.)

మైత్రే—(దశదిశలుపరికించి) పావురము కాదు.కుంభిలకుఁడు.ఓరీకుంభిలక! (సమీపించి) రారా! నీకుఁగుశలమా! (తలుపుతెఱచును.)

కుంభీ—(ప్రవేశించి) అయ్యా ! నమస్కారము.

మైత్రే—ఇట్టియంధకారమయుంబగు దుర్దినమందు దెటనుండి వచ్చుచున్నావురా !

కుంభీ—ఆమె వచ్చినదయ్యా !

మైత్రే—ఆమెయెవరురా ?

కుంభీ—ఆమెయే ఆమె.

మైత్రే—తొత్తుకొడుక ! కసాయి యంగడిలో ముసలి మేంకవలె మెమెమే యనెద వెవరామె ?

కుంభీ—తోలుకరిలోం గప్పవలె నెవరెవరెవరని అట్లుఅడెదవేల నీవు ?

మైత్రే—నాకుందెలియలేదు చెప్పుము.

కుంభీ—(తనలో) ఇట్లాడించెదను (ప్రకాశముగ) నేనొకపొడుపుకథ యడిగెదను జెప్పెదవా !

మైత్రే—నేను నీనెత్తిమీందం గాళ్ళు పెట్టెదను. అంగెదవా!

కుంభీ—సరిరే కాని మామిడిచె ట్లేకాలమునం బుష్పించును ?

మైత్రే—తొత్తుకొడుక! గ్రీష్మఋతువులోం గాదటరా!

కుంభీ—(నవ్వుచు) కాదయ్యా కాదు.

మైత్రే—(తనలో) గ్రీష్మఋతువు కాక యేఋతువో! పోనీ చారుదత్తు నడిగెదను (ప్రకాశము) కుంభీలక ! మహూర్తకా మోపిక చేయుము. (చారుదత్తునొద్దకుం బోయి) మిత్రమా! మామిడిచె ట్లేఋతువులోం బుష్పించును ?

చారు—మూర్ఖుండ ! వసంతఋతువులో.

మైత్రే—(కుంభీలకునిసమీపించి) మూర్ఖుండ ! వసంతఋతువులో.

కుంభీ—ఇంకొకటి యడిగెదను. సమృద్ధములగుగ్రామములను రక్షించునది యెవరు ?

మైత్రే—వీథి.

కుంభీ—(నవ్వుచు) కాదయ్యా కాదు.

మైత్రే—(తనలో)అవును నాకును సంశయముగానే యున్నది. చారుదత్తునడిగి తెలిసికొనెదను. (అని చారుదత్తునొద్దికింబోయి యడుగును.)

చారు—మిత్రమా! సేన.

మైత్రే—(చేటునితో) తొత్తుకొడుక ! సేన.

కుంభీ—ఈరెంటును గలిపి చదువుము.

విదూ—సేనా వసంత.

కుంభీ—తలక్రిందుగాఁజెప్పుము.

విదూ—(తల క్రిందుగాఁజేసి) సేనావసంత.

కుంభీ—ఓమూర్ఖబ్రాహ్మణ ! పదములు తలక్రిందుగాఁజేయుము.

విదూ—(కాళ్లుపైకెత్తి) సేనా వసంత.

కుంభీ—ఓమూర్ఖబ్రహ్మచారి! నీపదములు కాదు, ఆమాటలో నున్నపదములు తలక్రిందుగాఁ జేయుము.

విదూ—(ఆలోచించి) వసంతసేన.

కుంభీ—ఆమెయే వచ్చినది.

విదూ—అటులేనిఁ జారుదత్తునితో నివేదించెదను (సమీపించి) ఓచారుదత్త! మీ ధనికుఁడు వచ్చినాఁడు.

చారు—మాయింటికి ధనికుఁడెవఁడు వచ్చును?

విదూ—ఇంటికిరాకపోయినను ద్వారమునందున్నాఁడు, వసంతసేన వచ్చినది.

చారు—నన్ను వంచించుచుంటివా !

విదూ—నామాట నమ్మవేనిఁ గుంభీలకు నడుగుము. ఓలంజకొడుక! కుంభీలక, యిటురమ్ము.

కుంభీ—(వచ్చి) అయ్యా ! దండము

చారు—కుశలమా ! నిజముగా వసంతసేన వచ్చినదిరా ?

కుంభీ—వచ్చినమాట సత్యమే.

చారు—(సంతోషముతో) ఓరీకుంభీలక ! ప్రియవచనము నివేదించినవాని నేనెన్నఁడూరక పంపలేదు. కావుననీయుత్తరీయమును గ్రహింపుము. (యుత్తరీయమిచ్చును.)

కుంభీ-(గ్రహించిదండముపెట్టి సంతోషముతో) ఆమెతో నివేదించెదను. (పోవును)

విదూ—మిత్రుఁడా ! ఎఱుఁగుదువా, ఇట్టిదుర్దినమునం దెందులకు వచ్చెనో !

చారు—నేనెఱుఁగను.

విదూ—నేనెఱుఁగుదును. సువర్ణభాండమునకు రత్నావళిచాలదని మొత్తపెట్టియుంకేదిరో లాగుటకు.

చారు—(తనలో) రానిమ్ము. సంతోషముతోనే పోవును.

(పిదప నుజ్జ్వలాభిసారికావేషముతో వసంతసేనయు ఛత్రధారిణియగు చేటియు విటుఁడును ప్రవేశింతురు.)

విటు—(వసంతసేన నుద్దేశించి)

చ. కమలము కేలలేనిసిరి కాముని చేతిమృదుప్రహేళి త్రో
కము మగనాండ్రకుందఱకుఁ గంజశరాగమపుష్పమార చి
త్రముగ రతిప్రదేశమగు రంగమునన్ రతినాఁటి సిగ్గుపో
డిమి గలమూర్తితోఁ జనియెడిం బ్రియపాంసులు వెంబడింపఁగన్.

వసంతసేనా! యిటు చూడుము.

మ. ఉఱుమం జొచ్చెఁ బయోదమండలము సారోప్పార వేళ్లాడుచున్
గిరిశృంగంబులపై వియుక్తకమలాక్షీహృత్సమానంబులై
పురులన్ విప్పిన నెమ్మిగుంపులును సొంపున్నింపుచున్ రత్నచా
మరముల్ గైకొనియో యనం దనరెఁ దన్మార్గంబున న్వీచుచున్.

మఱియును,

చ. బురద మొగంబునిండ, జలపూరము ధారలదెబ్బ తించు ద
ర్దురములు గ్రోలెడుం; గడిమి తోరముగాఁ గుసుమించెఁ; గప్పెఁ జం
దిరునిఁ బయోదజాలము యతిం గులదూషణులట్లు; కేకి కం
ఠరుతి సెలంగెఁ; గ్రొత్తకులటల్ వలెఁ జంచలలయ్యెఁ జంచలల్.

వసం—బావా! మిగుల మంచివర్ణనఁ జేసితివి.

ఉ. ఉన్నతముల్ నిరంతరపయోధరముల్ గలవన్నెఁ గాక ని
న్నన్నన సేయు నే బయిసిమాలినదాన ప్రియుం డటంచు గ
ర్జన్నవనీరదధ్వనిమిషంబున నన్ను నిశాపురంధ్రి నా
తె న్నరికట్టుచు న్మిగులఁ దిట్టుచునుండె సపత్నిపోలికన్.

విటు— అవును. నీచెప్పినట్లే, రాత్రిని నిందింపుము.

వసం— బావా! స్త్రీస్వభావ మగుటంజేసి తెలివిమాలిన పనిసేయుచున్న దీని నిం
దించిన నేమిఫలము? నేనొకమాట సిద్ధాంతీకరించెదను వినుము.

గీ. ఉఱుముఁగాక పయోదముల్ కురియుఁగాక
పిడుగు పడుఁగాక యగుఁగాక పుడమి కదలి
చలియు వేఁడియుఁ జూడరు లలన లకట
రమణసాన్నిధ్యమున కేగుసమయమందు.

విటు— వసంతసేనా! చూడు మిది యింకొక చిత్రము.

గీ. ఉఱుము దప్పులతోడ విద్యుద్ధ్వజాళి
తోడ జలధారలనుసంపదోమాదోడఁ

## పంచమాంకము

ఇంద్రుకరములు హరియించె జలదపటలి
నృపతి శత్రులకరముల్ హరించునట్లు.

వసం — బావా, నీవు నుడివినది చిత్రమేకాని యింకొక విచిత్రముఁ జూడుము.

చ. ఉఱుముచు దంతినీలవికటోదరజాలము లల్లలాడ బె
గ్గురులు మెఱుంగులం గలసి కోరములయ్యె మొగిళ్ళు డెందమం
దురిపిన పుండుమీఁదటఁ జలోక్తిక్షిఁ గారము చల్లినట్లు బి
ట్టుఅవఁడొడంగెఁ బ్రొవ్వడని యంబరమందు బకంబు లక్కటా.

విటు — వసంతసేనా అది యట్టిదేకాని యిదిగో నింకొక విచిత్రముఁ జూడుము

కం. మెఱుఁగులు చామరములు బెగ్గురులే తలపాఁగ గాఁగఁ గొలువంబడు చం
బరమాతంగంబు పయిం దిరుగుచునున్నాఁడు జలదభూపుఁడు బళిరే.

వసం — బావా! యిటుచూచు మిటు గనుఁడుము.

ఉ. అంబుదపాళి మ్రింగె రవి, నావలకుఁ బెడలించె దుర్బల
త్వంబునఁ గుందు ధర్తగల తన్వివటుల్ శశికాంతి, నధ్రస్తా
ధంబున పైఁడివిచ్చలవిధంబున శంపలు మించె, నీరధా
రం బడి నీల్కరించెముఁ గరంబుఁ గరివ్రజమట్లు పుట్టలుఁ బో.

విటు — వసంతసేనా! చూడుము.

సీ. మెఱుపుపగ్గముల్ గట్టిన కరులు నాఁగ
నొండొటిఁ బోటి యామట్ట్ర లుదకధార
లీనుచున్నవి, సురపతియానఁ బుడమి
వెండికొలుసులఁ జైకొద్దుచుండె ననఁగ.

మరియుం జూడుము.

ఉ. కారెనుబోతునిగ్గుగల కందచయంబు, ప్రచండమారుత
ప్రేరితమాచుఁ, జంచలలచేరి గరుల్ గల వార్ధులోయనఁ బో
బా ఱెడుమింట, వజ్రశరపాతములో యన వారిధారలుఁ బో
జేయవసాగె దూర్వలను జెన్నయి తావి వెలార్చు మేదినిఁ బో.

వసం — బావా! ఇది యింకొకవిచిత్రము.

శా. రా రారమ్మని కేక వేయుమ మయూరస్తోమము ల్బెల్వఁ గాఁ
జేరంబోయి బలాకలెల్ల రభసశ్రీ వక్కనం జేర్పఁ గా
నీరేజంబులు పీసి హంసలు భయోన్మేషంబునం జూడఁ గా
ఘారాద్ధంబులు పూసె నంజనమషీధామంబు వర్ణిక్కు...

విటు— అది యట్టిదే కాని యిటుచూడుము.

ఉ. నీరజనేత్రసంపదలు నిశ్చలభావముఁ జెంద సాంద్రశో
పారుచి దివ్వెలట్లు క్షణమాత్రము చీఁకటిఁబాప జోఁబవల్
నేరక దిక్కులం దెలియనేరక నిద్దురవోవు ధారికా
గారమునందు లోకము వికస్వరనీరధరాతపత్రమై.

వసం— బావా! చూచితిఁగాని యీచిత్ర మాలోకింపుము.

ఉ. తారక లంతరించెను కృతఘ్నునియం దుపకారమట్లు ది
గ్వారము కాంతిఁబాసెఁ బథికప్రమదాజనమట్లు లంబగం
బౌర సురేశ్వరాయుధమహాశిఖిచేఁ బరితప్తమై ధరిత్రా
కారముఁ జెంది నేలఁ బడఁగా గమకించెమునట్లు తోఁచెడిన్.

మఱియుం జూడుము.

కం. ఎగురుచుఁ గ్రిందికి దిగబడుచుఁ గురియుచున్ వగ్గ ముఱుముచుం జీఁకటిగా
మొగులు దిరుగు బహురూపములుగ నడమంత్రింపుసిరి గలుగువానిగతిన్.

విటు— ఔను.

చ. శరములఁ గ్రుమ్మరించు హరిచాపముఁ దాల్చి నటించునట్లు, క్రొ
మ్మెఱుఁగుల మండినట్టులు, భ్రమించినయట్లనిలంబుచేత, బె
గ్గురుల హసించిన, ట్లశనిఁగూసినయ, ట్లహినీలనీరద
త్వరఁ బొగచూరినట్లు గనుపట్టుచునున్నది మిన్ను చూచితే.

వసం— ఆ. నీకు సిగ్గులేద నీరదమా! యేను దయితునింటికేగఁ దలఁచుమంచఁ
దడవఁజొచ్చి తీవు ధారాశరంబుల గజితముల నడలుఁ గలుగఁ జేసి.

ఓ దేవేంద్రుఁడా!

గీ. తొల్లి నా కున్నయదియె నీతోడిపొందు
జలదసింహారవంబులఁ గొలువఁ దగునె
ప్రియునిచేఁ గోరఁబడి పోవువేళఁ దారి
వానచే నరికట్టుట వరుసకాదు.

ఇంకొకమాట యాలకింపుము.

గీ. ఎఱుఁగవే శక్ర! మునిదారకోఱకుఁ దొల్లి
కోడివైతివి కాల్కంటివాఁడ వైతి
వేల నిరపేక్ష మరలింపు మీమొగిళ్ళ
నేను సెలము నీవంటిదానఁ జూవె.

మఱియు నింకొకమనవి విను ము.

క. ఉఱుములు పెల్లుఱిమించుచు కురిపించుచు వానలు పిడుగులతో (గూడన్
మఱలించుట నీతరమా, తెఱవలు ప్రియులను గలయుమతిం బోవు నెడన్.

గీ. ఉఱుము లుఱిమిన నీరదం బుఱుముఁగాక
పురుషు లెందును బరమనిష్ఠురులు కాన
మెఱుపులతసూనరో నీవు మెలఁతవయ్యు
నువిదవలవంత లెఱుఁగకయుండఁదగునె.

విటు — భవతీ! వసంతసేన! నిందింపకుము నిందింపకుము. శంపాలత నీ కుపకారిణి కాని యపకారిణి కాదు.

ఉ. వేలుపురేనివక్షమున బిట్టుచలించు సువర్ణరజ్జువుం
బోలె, మహీధ్రమూర్ధమున బొల్చెడి శ్వేతపతాకయట్లు, స్వః
పాలకమందిరాంతరవిభాసితదీపనుమాడ్కి నీకు శం
పాలత దారిఁజూపెడునుమా! ప్రియునింటికి; నేలతిట్టెదే?

వసం. — అవును ఆదియె ప్రియతమునియిల్లు.

విటు — సకలకళావిశారదవగునీ కుపదేశింపవలసిన దేదియులేదుగాని నీయందలిస్నేహముచేఁ బలుకుచున్నాను. లోనికేగినపిదపఁ దగనికోపము దాల్పఁజనదుసుమా.

గీ. అలిగితివయేని లేదు సౌఖ్యంబు, కోప
గింపకున్నను మదనుండు కీర్తిఁ దేఁడు
అలుగు మలిగింపు మొకవేళ నతనిఁగూడఁ
వంతనె ప్రసన్నవై తేర్పుమాత్మవిభుని.

ఎవరయా? అచట; ఆర్యచారుదత్తునకు విన్నవింపుఁడు.

ఉ. నీపసుగంధియైనరజనీముఖమందలి వానలో స్మరో
త్తాపితచిత్తయై కురులు ధారలచేఁ దడువం దటిద్ధ్వని
ప్రాపితభీతి గడువంబడి దేవరదర్శనార్థమై
నూపురలగ్నపంక మపనున్నమొనర్చుచు నిల్చెవాకిటన్.

చారు — (విని) మిత్రమా! అదేమో తెలిసికొనుము.

మైత్రే — చిత్తము. (పోయి వసంతసేనం జూచి) వసంతసేనా! కుశలమా!

వసంత — ఆర్యా! నమస్కారము. మీకుఁగుశలమా! (విటునితో) బావా! యీ ఛత్రధారికను నీయొద్ద నిలుపుకొని గొడుగు పట్టించుకొనుము.

విటు—(తనలో) ఈయుపాయమున నన్నుఁ జక్కఁగా వెడలి పొమ్మన్నది (ప్రకాశముగ) మంచిది. వసంతసేనా!

శ. రతికయి యిల్లుఁ గట్టుకొని రాగము తీపుచు మాయదంభము
దతి కపటం బసత్యము మొదల్లలవానికి జన్మభూము లై
రతిసుఖ మమ్మఁజూపు పెను రక్కసు లీధనకాంత లెల్ల నీ
గతి నుజనత్వనిష్క్రియముగా వలపింతురు గాత లోకులన్. (నిష్క్రమించును)

వసం—మైత్రేయ! మీజూదగాఁ డెక్కడను న్నాఁడు!

మైత్రే—(తనలో)! ఏమి యీయబ్బురము! పాపియమిత్రునను జూదగాఁడని పేరుపెట్టి వర్ణిచెప్పుచున్నది. (ప్రకాశముగ) భవతీ! ఆ యెండు చెట్లగుంపులో నున్నాఁడు.

వసం—ఆర్యా! యెండుచెట్లగుంపు వనియెద రేమి?

మైత్రే—తిండిపెట్టునా నీరిచ్చునా? ఎందుల కీచెట్లగుంపు? (వసంతసేన నవ్వుచున్నది.) రా ప్రవేశింపుము,

వసం—(జనాంతికముగ) ప్రవేశించి నే నేమిమాటలాడ వలయునో?

చేటి—ద్యూతకరుఁడా ఈప్రదోషకాలము సుఖకరమే నా అని యడుగవలయును

వసం—అడుగ లేనేమో?

చేటి—అవసరమే అడిగించును లెమ్ము.

మైత్రే—రా ప్రవేశింపుము.

వసం—(ప్రవేశించి చేరఁబోయి పువ్వులు రువ్వుచు) జూదగాఁడా! ఈప్రదోషకాలము సుఖకరముగా నున్నదా!

చారు—(చూచి) ఇదిగో వసంతసేన వచ్చినది। (సంతసముతో లేచి) ప్రియురాలా

గీ. సంజ జాగ్రదవస్థచేఁ జనుచునుండెఁ
దమియు నూర్పులచేతనే తరలుచుండె
నేఁడు నీరాకచేత నోనీరజాక్షి
కాఁగలదు నాకు సంధ్య సుఖప్రదంబు.

నీకు స్వాగతమా? ఇదే పీఁట, యిందుఁగూర్చుండుము.

మైత్రే— ఇదిగోఁ బీఁట యిందుఁ గూర్చుండుము.

(వసంతసేన పీఁటమీఁదఁ గూర్చుండును. అందఱును గూర్చుండుదురు.)

చారు— వయస్యా! అవలోకింపు మవలోకింపుము.

గీ. కలికి చెవిమీఁద నిడుకొన్న కడిమిపువ్వు
నుండి జాఱెడు వర్ష బిందువుల చేత
దడుపఁబడుచున్న దీపయోధరము రాచ
బిడ్డ యభిషేక మొనరింపఁబడ్డరీతి.

మిత్రమా! వసంతసేన వస్త్రములు తడిసియున్నవి కావున మంచి చీరలు తెప్పించి యిప్పింపుము.

మైత్రే— చిత్తము.

చేటి— మైత్రేయ? నీవు వలదు. నే నార్యురాలికి సేవగావించెదను. ( చీరలు తెచ్చియిచ్చును. )

మైత్రే— (జనాంతికము) మిత్రమా! నే నీమె నొకమాట యడుగఁదలఁచి యున్నా నడిగి చూచెదనా?

చారు— అడుగుము.

మైత్రే— (ప్రకాశముగా) వసంతసేనా! వెన్నెలలేని యీ దుర్దినాంధకారమున నెందులకై వచ్చితివి?

చేటి— ఆర్యురాలా! ఈ బ్రాహ్మణుఁ డమాయకుఁడు.

వసం— మంచి నైపుణ్యము కలవాఁడనుము.

చేటి— ఈమె నీవిచ్చిన రత్నావళికి మూల్యమెంతయో యడుగవచ్చినది.

మైత్రే— ( జనాంతికము) నేను చెప్పలేదా! రత్నావళి యల్పమూల్యమనియు సువర్ణభాండము బహుమూల్యమనియుఁ దగవిడి యింకేదియో లాగికొని పోవుట కని.

చేటి— ఆరత్నావళి తనదే యనుకొని యీమె జూదములో నోడిపోయినది. ఆ గెల్చినవాఁడు రాజుచారుఁ; డెకడకుఁ బోయెనో తెలియదు.

మైత్రే— నే నన్నమాటలే నా కొప్పఁజెప్పుచున్నావా యేమి!

చేటి-ఆసభికుఁడు కానవచ్చుదనుక నీసువర్ణభాండము నీయొద్దనుంచు. (చూపును)

( విదూషకుఁడాలోచించును. )

చేటి— మైత్రేయా! మిగుల నాలోచించుచున్నావు. దీనిని నీవు మున్నెఱుఁగుదువా యేమి?

మైత్రే— వని నేర్పరితనముచే నాదృష్టి నది చక్కఁగా నాకర్షించుచున్నది.

చేటి— నీదృష్టి నిన్ను వంచించుచున్నది. అనువర్ణభాండమే యిది.

మైత్రే— (సంతసముతో) చెలికాఁడా! మనయింటఁబడి దొంగ దోఁచుకొని పోయెనే యాసువర్ణభాండమే యిది.

చారు— సుహ్మాత్మా!

గీ. బదులు తీర్పుటకై యేసెపంబు మనము
పన్నినారము యోజించి మున్ను; మరల
నదియ మనయెడ విపరీతమయ్యె నిందు
నెంతనిజమొ, విడంబన మెంతయొ కద!

మైత్రే— నాబ్రాహ్మణ్యము తోఁడు. నిజముగా నిది యాసువర్ణభాండమే.

చారు— అగుచోఁ బ్రియమే ప్రియమే.

మైత్రే— (జనాంతికముగా) ఇది యెవరియొద్దనుండి యీమెకు దొరకినదో యడిగెదను.

చారు— తప్పేమి యడుగుము.

మైత్రే— (చేటి చెవిలో నేమేమో నుడివి) అవునా?

చేటి— (మైత్రేయుని చెవిలో మరల నేదియో గొణిగి) అవును.

మైత్రే— చేటీ మైత్రేయులారా! మీరేమో చెప్పుకొనుచున్నారు, రారహస్యము నకు మేము వెలుపలివారమా! వినఁదగదా!

మైత్రే— (చారుదత్తుని చెవిలో నారహస్యము నుడువును.)

చారు— భద్రురాలా! యిది యాసువర్ణభాండమే?

చేటి— దేవరా! అవును.

చారు— చేటీ! నేనెన్నఁడును బ్రియనివేదనమును వ్యర్థపఱచలేదు కావున నీయుంగరము బహుమతిఁగాఁగైకొనుము (యుంగరములేనిబ్రేలుచూచుకొనిసిగ్గుపడును)

వసం— (తనలో) నిన్నుఁ గామించుటకుఁ గారణమే యిది.

చారు— (జనాంతికముగ) ఆహా! యెంతకష్ట మెంతకష్టము.

గీ. ఆగ్రహానుగ్రహంబులు వ్యర్థములగు
నర్థహీనున కెందును నందులోన
ధనముఁ బాసిన నరుజీవితంబు కంటె
ధనము లేకున్న నరుజీవితంబమేలు.

గీ. ఎండిపోయినచెట్టు నీ రెడసియున్న
చెఱువు రెక్కలులేని పక్షియును కో

యూడ్చిన బిలేశయంబు నీయుర్విలోన
సమము లగు మిత్రమా ! యకించనునితోడ.

ఆ. పాడువడ్డయిల్లు మోడైన చెట్టు నీర్లేనినూయి ధనములేని నరుఁడు
విస్మరింతు రాత్మవృత్తమ్ము పరిచితు ల్గూడినపుడు వేడ్క గూలిపోన.

విదూ— సువ్యాదవ్రా ! అత్యంతము వంతమానుము. ఓవసంతసేనా ! నాయంగ
వస్త్రము గూడ నిచ్చివేయుము.

వసం— ఆర్యపుత్ర ! ఈమానిసిని రత్నావళిచేఁ బరీక్షించుట యుక్తమా ?

చారు— (తెల్లఁబోయి నవ్వుచు) వసంతసేనా !

గీ. సత్య మెవ్వరికెఱుక యీజగమునందుఁ
జులకనగఁజూతు రెల్లవారలును నన్ను
శంక సేతురు రిక్తుల సర్వజనులు
బడుగుఁదనమున శోకపరితాపంబు గలదె.

విదూ— చేటీ ! నీవు నిచ్చటనే పన్నుండెదవా ?

చేటి— (నవ్వి) మైత్రేయా ! నీమాటలు చూడ నట్టియనుమాయమునఁడ వనిపించును.

మైత్రే— మిత్రమా ! ఈపర్జన్యుఁడు సుఖమునగాఁ గూర్చున్నవారలను మరల లేవఁ
గొట్టుటకుం బోలె వారిధారలను విస్తరింపఁజేయుచున్నాఁడు చూడుము.

చారు— నెచ్చెలీ ! లెస్సగాఁ బలికితివి.

గీ. బురదనుండి సూచీబిసాంకురము లోదవు
పగిది జలదాంతరమునుండి వారిధార
లురలుచున్నవి చంద్రవియుక్తయైన
నిశి వియోగాగ్ని నోడ్చు కన్నీరనంగ.

మఱియును.

గీ. మునలిచేలమునఁ బురణించు పెంయిలు వృత్రి
రిపునిగని మాత్రముల క్రమ్మరించినట్లు
సజ్జనుల చిత్తముల పార్థుశరచయముల
కొమరుగల వారిధారలు కురియసాగె.

ప్రియుఁరాలా ! వసంతసేన ! యిటు చూడుము

ఉ. చీఁకటిపూలపిండివలెఁ జెల్వగుమబ్బు దివంబు గప్పె, శై
త్యాకరమైనతావులు బయల్పడ వీచుఁ బ్రదోషమారుతం,

శాసనముం బయోధరసమాగమకాంక్షిణి యైనమించు బ
ల్వేడ్కఁ గవుంగిలించుకొనుఁ బ్రియను నత్యమరక్త చాద్పునన్.

వసం—(శృంగార మభినయించుచుఁ జారుదత్తుని గౌఁగిలించుకొనును)

చారు—(స్పర్శసుఖ మభినయించుచుఁ బ్రత్యాలింగనమిచ్చి)

గీ. అంబుదమ! బిట్టు గర్జించుమమ్మ నీ య
నుగ్రహంబున వలవంత నుగ్రమైన
నాఁక దవిలిన నామేను కడిమిపువ్వు
పోలికగ నేఁడు రక్తిమైఁ బులకరించె.

విదూ—తొత్తుకొడుకా! దుర్దినమ! యిప్పటికి నీవు దౌర్జన్యముంజూపుచున్నావా! మెఱపులు చూపి మావసంతసేనను భయపెట్టెదవా!

చారు—వయస్యా! నిందింపకుము.

గీ. ఎడతెగక వానయిట్లు నూఱేండ్లదాఁకఁ
గురియుఁగాక తళుకుబ్రభల్ మెఱయుఁగాక
దొరకని నావంటి వరమర్త్యులకు దొరక
రానిప్రియురాలగు వసంతసేనపొందు.

మఱియు నో మిత్రమా!

గీ. ప్రియులయిండ్లకుఁ దార వరించి సంజ
వానలోఁ దడిసిన చలిమేన వచ్చు
కులుకులాఁడుల చక్కలక్కలకుఁ దార్చు
వారిజీవితమే ధన్యమౌర జగతి.

ప్రియురాలా వసంతసేన!

గీ. పీఁట లురలియు స్తంభాల మీటుమీఁద
నొట్టునకు నిల్చియున్న దీపమల్లభంబు
దొరలిపోయిన గచ్చుబెత్తికలు గల్గు
చిత్రభిత్తిక లివానచేతఁ దడిసె.

(ఊర్ధ్వముగాఁ జూచి) అదిగో నింద్రచాప మగపడుచున్నదికనుంగొనుము.

గీ. మెఱపుసాలుక వెల్పురామేటివింటి
చేతులును కార్మొయిళ్లను సెలవులును బ

యల్పుడఁగ నంబరం బివ్వ డావలించు
చున్నటులనున్నదో యన్నుమిన్న! కనుమ.

కావున నభ్యంతరము లేకుండ నభ్యంతరగృహంబునకే పోదము రమ్ము.

(అని లేచి పరిక్రమించుచు నిష్క్రమింతురు.)

ఇది శ్రీ......తిరుపతివేంకటేశ్వరాంధ్రీకృతంబగు మృచ్ఛకటికంబునందు
దుర్దినమను పంచమాంకము.



శ్రీరస్తు.

# మృచ్ఛకటికము

## షష్ఠాంకము

(పిదపఁ జేటి ప్రవేశించును.)

చేటి—ఇప్పటికిని వసంతసేన మేల్కొలేదు. కానిమ్ము పోయి లేపెదను (అని నాట్యముతోఁ బరిక్రమించును)

(పిదప ముసుఁగు పెట్టుకొని నిద్రపోవుచున్న వసంతసేన ప్రవేశము.)

చేటి—(చూచి) అమ్మా! లేలెమ్ము, తెల్లవాఱినది

వసం—(లేచి) రాత్రిగడవకుండఁగనే తెల్లవాఱినదా!

చేటి—నీకింకను రాత్రి గడవలేదుగాని మాకుఁ దెల్లవాఱినది.

వసం—దాసీ! మీసభికుఁడెక్కడ?

చేటి—అమ్మా! వర్ధమానకునితో నేమేమో సెలవిచ్చి చారుదత్తార్యుఁడు పుష్పకరండకమను జీర్ణోద్యానములోనికిం బోయెను.

వసం—ఏమి సెలవిచ్చెను?

చేటి—వసంతసేన పోవుటకు గాను బండి పూంచి తీసికొని పొమ్మని.

వసం—నే నెచటికిఁ బోవలసినది?

చేటి—ఆర్య చారుదత్తుఁ డున్నయుద్యానమునకే.

వసం—(చేటిని కౌఁగిలించుకొని) ఓసీ! రాత్రి తిన్నఁగాఁ జూడలేదు, ఇప్పుడు నాప్రియతముని రూపు కన్నులారఁ జూచి యానందించెదను. నేను లోపలి మొకరాలలోనికిం బ్రవేశించితినా యేమి?

చేటి—మొకరాల లోపలికే కాదు. అందఱిడెందములలోపలికిని ప్రవేశించితివి.

వసం—ఆర్యపుత్రుని పరిజను లందఱుఁ బరితాపపడుచున్నారా యేమి?

చేటి—ముందు పరితాపపడుదురు.

వసం—ఎన్నఁడు?

చేటి—నీవిచ్చటినుండి వెళ్ళినప్పుడు.

వసం—నాఁడైన నేనేమందు సంతాపపడవలసినది. (సానునయముగా) చేటీ! ఈ రత్నావళిం దీసికొనుము, తీసికొనిపోయి మాయక్క ధూతమ్మగారికి సమర్పించి "నేను మీభర్తఁగారి గుణనిర్జితవగుదాసిని కావున మీకును పరిచారికనే. ఈయమూల్యాభరణము మీకంఠము నలంకరింపవలసినదే కాని నేను ధరింపఁ దగినదికాదు." అనినామాటలుగా మనవిచేయుము.

చేటి—చారుదత్తుఁడుగారు కోపపడెదరేమో?

వసం—కోపపడరు.

చేటి—మంచిది (అని అనగ పుచ్చుకొని పోయి మరల వచ్చి) అమ్మా! వసంతసేన! "ఆర్యపుత్రుఁడు మీకది యనుగ్రహముగా నిచ్చినారు. అది నేను ప్రతిగ్రహించుట తగవు కాదు. ఆయుత్తమచరితుఁడే నాకలంకారమని తెలిసికొనుము" అని ధూతమ్మగారు సెలవిచ్చినారు.

(పిదపఁ గుఱ్ఱవానిం దీసికొని రదనిక ప్రవేశించును.)

రద—రా బాబూ! రా! యీబండితో నాడుకొందము.

కుఱ్ఱ—రదనికా! నాకీమట్టిబండి యక్కఱలేదు. ఆబంగారుబండి కావలయుఁ దెమ్ము

రద—(నిట్టూర్పున నిర్వేదమునుసూచించును) నాయనా! మనకు బంగారుగోడవ యెక్కడిది? మీతండ్రిగారికి మరల నైశ్వర్యమువచ్చిననాఁడు బంగారు బండి చేయించుకొందువులే. అప్పు డాబండితో నాడుకొందువు. అదిగో వసంతసేన! ఆమెయొద్దకుం దీసికొనిపోదునా! (తీసికొనిపోయి) అమ్మా! దండము.

వసం—రదనికా! కుశలమా! ఇతఁ డెవరిపిల్లవాఁడు, నగ లేమియు లేకున్నను జందురునివంటి యీమొగమొక్కటియే నన్నానందపఱచుచున్నది.

రద—అమ్మా! చారుదత్తుఁడుగారి కుమారుఁడు రోహసేనుఁడు.

వసం—రావోయి నాతండ్రీ రా! కౌఁగిలించుకొనుచు (తొడమీఁద నిడుకొని) రదనికా! రూపమే హెచ్చుతగ్గులేకుండ నంతయుఁ దండ్రిపోలికయేసుమీ!

రద—రూపమే కాదు స్వభావమునైన నాయనపోలికయే. ఈయవస్థయం దీబాలకుని వలననే యాయనకుఁ గాలయాపనము.

వసం—ఎందుల కేడ్చుచున్నాఁడు?

రద—ఇతఁడిముందు పొరుగింటి యజమానుని కొడుకుతోఁగూడి బంగారుబండితో నాటలాడుకొన్నాఁడు. పిదప నది వారు దాఁచుకొనిరి. నన్నాబండి తెమ్మని యేడ్వఁగా నేనొకమట్టిబండి గావించి యాడుకొమ్మంటిని, నాకిది పనికిరాదు బంగారుబండి కావలెనని పోరుపెట్టి యేడ్చుచున్నాఁడు.

వసం—అన్నన్నా! యెంతకష్టము! అటువంటి చారుదత్తునికొడుకు పరుల వస్తువులు చూచి తెమ్మనిన నేడిపించు దుష్కాలము వచ్చినది. హా! హతవిధీ! తామరాకుమీఁది జలబిందువులవంటి పురుషభాగధేయములతో నాడుకొనుచుందువా! (అనికన్నీళ్లు తెచ్చుకొని) అబ్బాయీ! యేడువకుము, బంగారు బండితో నాడుకొందువులే.

కుబ్జ—రదనికా! ఇది యెవరు?

వసం—మీతండ్రిగారి గుణవిజిత యగు దాసిని.

రద— బాబు! నీ కమ్మయగును.

కుబ్జ—రదనికా! అబద్ధా లాడుచున్నావు. ఇది మాయమ్మ యైన నిన్నగ నెక్కడివి?

వసం—తండ్రీ! సుందరవదనారవిందమున ముద్దులొలుకు దీనములగు జిలిబిలిపలుకులు తానిచ్చుచున్నావా! (అని యేడ్చుచు నగలన్నియుఁ దీసి) ఇదిగో యిపుడు మీయమ్మనైతిని చూడుము. ఈనగలు పుచ్చుకొనుము. బంగారుబండి చేయించుకొనుము.

కుబ్జ—పొమ్మా, నాకక్కఱలేదు. నీవేడ్చుచుంటివి.

వసం—(కన్నీరు దుడిచికొనుచు) నాయనా! ఏడ్వను పెళ్ళుము, ఆడుకొనుము తండ్రీ! సువర్ణశకటిక చేయించుకొనుము. (అని నగలు మట్టిబండినిండఁ బడవేయును పిదప బాలకుని వెంటబెట్టుకొని రదనిక నిష్క్రమించును.)

(వర్ధమానకుఁడు బండి తోలికొనివచ్చును.)

వర్ధ—రదనికా! వసంతసేనతో వర్ధమానకుఁడు బండి సిద్ధపఱచుకొని వచ్చినాఁడని మనవిచేయుము.

చేటి— అమ్మా! వర్ధమానకుఁడు బండి తోలికొని వచ్చినాఁడఁట.

వసం—ముహూర్తము నిలువుమనుము, నే నొడలు కైసేసికొని వచ్చెదను.

చేటి—(మరలిపోయి) వర్ధమానక ముహూర్తమాఁగుము, వసంతసేన యాత్మ నలంకరించుకొనుచున్నది.

వర్ధ—ఓహోహో! నేనును బండిలోని యాస్తరణము మఱచిపోయి వచ్చినాను. అది పట్టుకొని వచ్చెదను. ముక్కుత్రాళ్ళువోసిన పొగరుగిత్తలివి యిక్కడ నిలువవు. కావున బండితోనే పోయి మరల వత్తును (నిష్క్రమించును.)

వస—చేటీ! నాయలంకారము లన్నియుఁ దెమ్ము అలంకరించుకొనవలె.

(అంతట స్థావరకుఁడను చేటుఁడు బండితోలుకొని వచ్చును.)

స్థావ — రాజస్యాలకునిచే నిట్లు నియోగింపఁబడితిని. "స్థావరకా! బండితోలికొని పుష్పకరండక మనుజీర్ణోద్యానవనమునకురమ్ము" ని. కానీ! అచ్చటికే పోయె దను గిత్తలారా! లాగుఁడు లాగుఁడు (బండితోలుచు నెదుటఁజూచి) రాజ మార్గమునిండ మారిబండ్లు కిటకిటలాడుచున్నవి. ఇప్పుడేమి చేయుదును! ఓరోరి శాకటికులార! యొత్తిగిలుండొత్తిగిలుండు. (పాటోపముగా) ఇది యెవరిబండియని యడుగుచున్నారా! ఇది రాజస్యాలకుఁడగు సంస్థానకునిఁ బండి కావునఁ ద్వరగా నొసరిలుండు. వీఁడెవఁడో, సభికునిఁజూచి జూద ములో నప్పుపడిన జూదగాఁడు పాఱిపోయినట్లగిది నన్నుఁజూచి పరువెత్తు చున్నాఁడు. వీఁడెవఁడో! ఎవఁడైన నేమి, నేను త్వరగాఁ బోవలయును. ఓరోరి గ్రామ్యులార! ప్రక్కలకుఁబొండు ప్రక్కలకుఁబొండు! ఓరీ బండి వాఁడ! నీబండి తప్పించుము (విని) ఏమీ! చక్రము కదలుటలేదా! ఆచక్రి ముఁద్రిప్పుటకు నన్ను రమ్మనియెదవా! రాజస్యాలకుని సారథిని నేను నీకుఁ జక్రిముఁ ద్రిప్పుటకు సాహాయ్యము చేయవలయునా! పోనీ! పాపము! వీఁడొంటిగాఁడు దీనుఁడైయున్నాఁడు. వీనికిఁ జక్రమెత్తి పెట్టెద, నంతదనుక నీబండిని చారుదత్తుఁడుగారి పుష్పకరండకపక్షద్వారమునం దాఁపెదను. (బండివానితో) ఇదిగో వచ్చుచున్నానురా! (నిష్క్రమించును.)

చేటి — అమ్మా! చక్రధ్వనివలె నున్నది. బండివచ్చినదని తలంచెదను.

వసం — నాహృదయము వేగిరపడుచున్నది. పక్షద్వారమునకుఁ ద్రోవఁజూపుము.

చేటి — అమ్మా నీవు త్వరగా రమ్ము.

వసం — (పరిక్రమించి) మంచిది నీవు రవంతసేపు విశ్రమించుము.

చేటి — సెలవునకు బద్ధురాలను. (నిష్క్రమించును.)

వసం — (కుడికన్నదరుట సూచించుచు స్థావరకుని బండియెక్కి తనలో) ఏమీ! కుడికన్నదరుచున్నది. నా దుశ్శకునము లన్నియును నాప్రియుని ముఖారవింద మే పోనడఁచుఁగాక.

స్థావ — (ప్రవేశించి) బండ్లన్నియుఁ దప్పించితిని. ఇఁక వెళ్లుదును. (బండియెక్కి తోలుటనభినయించి తనలో) బండి బలు వెక్కినదేమో! బలువెక్కుటగాదు. చక్రముఁద్రిప్పుటచేత నాయాసపడియున్న నాకు బండి బలు వెక్కినట్లు కనుపట్టుచున్నది. కానీ! గిత్తలారా! నడువుఁడు నడువుఁడు.

(తెరలో) ఓరోరి దౌవారికులార! మీమీ గుల్మస్థానములయందు జాగరూ కులైయుండుఁడు. పాలకమహారాజుచే బందీకృతుండగు గోపాలదారకుఁడు బంధన

గృహకవాటముంబగులఁగొట్టి కాలిగొలుసులు తెగ్రెంచుకొని పాఱిపోయినాఁడు. పట్టుకొనుండు పట్టుకొనుండు.

(ఒకకాలియందు సంకిలియు గలగలలాడఁ దొందరగా నపటీక్షేపముగా నార్యకుఁడు ప్రవేశించును.)

స్థా — పురమంతయు గగ్గోలుగానున్నది. తొందరగాఁ బోవలయును.

గీ కట్టు పెకలించుకొని పాఱుగజముపోల్కి
రాజబంధనవిపదంబు రాశి గడచి
ఒంటికాల జీరాడుచునున్న నిగళ
మీడ్చుకొనుచిట్లు దెసమాలి యేగుచుంటి.

సిద్ధునిమాటలు విని భయంపడి పాలకుఁడు నన్ను వ్రేపల్లెనుండి రప్పించి బందీకృతుం గావించె. నాప్రియమిత్రుఁ డగుశర్విలకుని యనుగ్రహంబున నాకారాగారంబునుండి ముక్తుండ నైతిని (కన్నీరుఁ దుడిచికొనును)

శా. నాకుఁ భాగ్యము లబ్బునేని యచటన్ నాదోసమేమున్న ; దే
లా కట్టైకవనాగమట్టు పతి దల్పాదించి ; భాగ్యంబు రా
మోకాలొడ్డినఁ బోవునే ? నృపతితోఁ బోరాడఁగా నేర్తునే
యేకాకిన్ ; సకలాభిగమ్యుఁడుగదా పృథ్వీశుఁడూహింపఁగన్.

భాగ్యహీనుఁడ నగు నేనిప్పు డెచ్చటికిఁ బోదును. (ఎదుటఁజూచి) ఈయిల్లె మహానుభావునిదియో, వీథిగుమ్మపు రెక్కలతలుపులు మూయకయే యున్నది.

గీ. ప్రాఁతయిల్లిది దూలముల్ వ్రయ్యలయ్యెఁ
బాడువడియెను శీర్ణకవాటయుగము
బాధపడుచుండెఁ బరమనిర్భాగ్యుఁ డగుచు
నెవ్వఁడో నన్నుఁ బోలిన యీకుటుంబి.

యీయింటిలోనికిం బోయి విశ్రమించెదను.

(తెరలో) నడువుం డాఁబోతులారా నడువుండు.

ఆర్య — (విని) ఇక్కడనేదో బండివచ్చుచున్నదే! ఎవరైనసజ్జను లెక్కిపోవుచున్న గోష్ఠీయానమైయుండునాయిది? లేక నూత్నవధువును గొంపోవుటకై వచ్చియిచట నిలచియుండునా? కాక, నాయదృష్టవశమునఁ బ్రవరజను లెవరికొఱకైన నూరివెలుపలికేగుచున్న బండియైయుండునా? బరిజనము వెంటలేమిచూడ నీవట్టిబండిని దైవము నాకొఱకంపియుండవలెను.

వర్ధ— (బండితోఁ బ్రవేశించి) ఇది యేమివింతయో! ఆస్తరణమే మఱచితిని; రదనికా! వసంతసేనతో నివేదింపుము, 'బండి వచ్చినది, త్వరగా నుద్యానవనమునకుఁ బోదు' వని.

ఆర్య—(విని) ఇది భోగముదాని బండి, వెలుపలికే పోవుచున్నది. కానీ! పోయి యెక్కెదను. (అని బండిని సమీపించును.)

వర్ధ—(గలగల ధ్వనివిని) అదిగో! అందెల చప్పుడు; వసంతసేన వచ్చినట్లున్నది. అమ్మా! ఈయెద్దులకుఁగ్రొత్తగా ముక్కుత్రాళ్లు పోసినాను. పొగరుకొని యున్నవి. కాన వెనుకనుండి యెక్కుము. (ఆర్యకుఁడు వెనుకనుండి యెక్కును.)

వర్ధ—ఎక్కినప్పుడు కదలు నూపురముల చప్పు డడఁగినది, బండియు బలువెక్కినది. కావున వసంతసేన బండి యారోహించె నోపు, నింక నడపించెదను. పదుం డాఁబోతులార పదుండు. (బండితోలుకొని నిష్క్రమించును.)

వీరకుఁడు (ప్రవేశించి) ఓరోరి జయ జయమాన చందనక మంగళ పుష్పభద్రప్రముఖులార!

గీ. మీరలేమైరి నమ్మియున్నార వాని
బద్ధు గోపాలదారకు; వాఁడు రాజ
బంధనంబును మనమును బగులఁగొట్టి
తుఱ్ఱుమని యొక్కయంగలో దూఁటినాఁడు.

ఓరీ! నీవు తూర్పుదెసఁ గాచుము, నీవుత్తరదిక్కున నుండుము, నీవు పశ్చిమమున నుండుమురా, నీవు దక్షిణద్వారమునఁ జూడుము. ఈపడిపోయిన ప్రాకార మెక్కి యేనును జందనకుండును జూచెదము. రారా చందనక రా! వేగముగా రా

చంద—(సంభ్రాంతుఁడై ప్రవేశించి) ఓరోరి! వీరకవిశల్య భీమాంగద దండకాల దండశూరప్రముఖులార!

గీ. రండు వేగము నమ్మిన రాచబంటు
లైనమీరంద ఱిగుఁడు వానిఁ జేర
నితరగోత్రోద్భవునిఁ జేరనీకుఁ డట్టె
మనన్నపాలుని సుచిరసామ్రాజ్యపదవి.

క. తోఁటలు నగళ్లు రచ్చలుఁ బేటలు ఘోషములు విపణివీధులు సభలుం
గాటించి సందియమునఁగల చోటులనన్నింటి నరసిచూడుండెదు పానక.

గీ. ఏమిరా వీరకా! గొల్లఁడెచట డాఁగె
నెవఁడు చెఱవిడిపించెరా యిట్లు వాని
సందియము మాని మనసిచ్చి జాడ దెలుపు
మెచట గాలింపుమందువో యేను చూతు.

ఆ. ఎన్మిదింట సూర్యుఁ డేనింటఁ గుజుఁడు నాల్గింట శశియుఁ దొమ్మిదింట శనియు
గురువు లగ్నమున భృగువు షష్ఠమందుండు జాతకంబువాఁడు చందనకుఁడు.

ఆ. బ్రతికియుండ నెవఁడు వచ్చి గోపాలదా
రకు హరించె వాఁడు బ్రదుకఁగలఁడె
వాని వానిఁగూడ బలియిత్తు మనయూరి
యమ్మవారి కేను నమ్ము మోరి.

వీర— గీ. పొద్దుసామైనఁ బొడవకమున్నె వాని
నెవఁడొ తరలించుకొనిపోయె; నింతకెంత
దూరమేగిరో; నిజము నీతోడు నమ్ము
చందనక! వాఁడు మన కొట్టులందు నింక.

వర్ధ— పొండు గిత్తలారా పొండు.

చంద—(చూచి) ఓరి! వీరక! చూడు చూడు.

ఆ. నడుమఁబడుచునుండె నడిబాట తెరవున మూఁతబండి యొకని చేత నదిగో
ఎవరి, దెవ్వరెక్కి, యెచ్చటి కేగుచున్నదియు యది కనుంగొనంగవలయు.

వీరక—(చూచి) ఓరీ బండివాఁడ! బండితోలకు మాపుము. ఈబండి యెవరి, దెక్కినవారెవ రెచ్చటి కేగుచున్నదిరా!

వర్ధ—అయ్యా! ఈబండి చారుదత్తుఁడుగారిది. ఇందు వసంతసేన యున్నది. చారుదత్తుఁడుగారి పుష్పకరండకములోనికి విహారణార్థమై పోవుచున్నది.

వీర—(చందనకునితో) బండి చారుదత్తునిదఁట, వసంతసేన యెక్కినదఁట, పుష్పకరండకములోనికిఁ బోవుచున్నదఁట.

చంద—అట్లయినచోఁ బోనిమ్ము.

వీర—చూడకుండఁగనే పోనిత్తుమా!

చంద—చూడనక్కఱలేదు.

వీర—ఎవనిమీఁది నమ్మకమున?

చంద—ఆర్య చారుదత్తునిమీఁది నమ్మకమున.

వీర—ఆచారుదత్తుఁ డెవరు? ఆవసంతసేన యెవరు?

చంద—ఓరీమూర్ఖ! ఆర్యచారుదత్తు నెఱుఁగవు. వసంతసేన నెఱుఁగవు. వీరివురి నెఱుంగనివారు మింటిమీఁది చంద్రుని చంద్రికను గూడ నెఱుఁగనివారే.

గీ. గొనములకు నీరజము మంచితనమునందు
చంద్రుఁ డాపన్నదుఃఖమోక్షకుఁడు చతుర
దధులలో సారమైనరత్నం బయారె
చారుదత్తు నెఱుంగనిజనులు కలరె.

గీ. వేలకొలఁది జనంబులు గ్రాలు మన న
గరికి వారిద్దరే తిలకంబులోరి
నిండుయోగ్యుండు చారుదత్తుండొకండు
మాననీయయగు వసంతసేన యొకతె.

వీర—ఓరీ చందనక!

గీ. చారుదత్తు నెఱుంగుదుఁ జారుశీల
నెఱుఁగుదు వసంతసేన నాయెఱుక కేమి
రాజకార్యభరంబు సంప్రాప్తమైన
చో నెఱుంగను నేఁ దండ్రినైన నిజము.

ఆర్య—(తనలో) ఈతఁడు నా పూర్వవైరియు, నాతఁడు నా పూర్వబంధువు గా నొప్పుదురు. వీరిద్దరు నేకకార్యనియుక్తులైనను, బెండ్లిలో పల్లకాటిలోఁ బెట్టిన యగ్నులందువలె వీరియందును శీలభేదము కాన్పించుచున్నది.

చంద—నీవు రాజునకు నమ్మిన సేనాపతివి, విచారశీలుఁడవు. నీవుపోయి బండి పరీక్షింపుము. నేను బలీవర్దంబుల నాపెదను.

వీర—నీవును రాజునకు నమ్మిన బలపతివేకదా! నీవే విలోకింపుము.

చంద—నేను చూచిన నీవు చూచినట్లేనా?

వీర—నీవు చూచిన రాజుగారే చూచినట్లు, కావున నీవే చూడుము.

చంద—ఓరీ బండివాఁడ! కాడినెత్తుమురా!

(వర్ధమానకుఁడు బండియాఁపి కాడినెత్తుచున్నాఁడు.)

ఆర్య—(తనలో) ఈభటులు నన్నుఁ జూచెదరేమోకదా! చేతఁ గత్తియైనలేదు. సర్వవిధముల దురదృష్టవంతుఁడ నైతిని. కానీ!

గీ. బాహువే నాకు శస్త్రంబు బలముమీఱ
బాహాబాహిసమరంబు గావింతు భీమునివలె

బ్రహ్మహత్యాగతమునఁ బ్రాణిఁ బ్రాయకుంటె
యర్ధ్వమునరించి విడుచుట యుత్తమంబు.

కాని సాహసమున కిది తరిగాదు

(చందనకుఁడు బండిలోనికెక్కి చూచును)

ఆర్య—శరణు శరణు.

చంద—శరణుఁ జెందినవాని కభయ మిచ్చితిని.

ఆర్య— గీ. శరణు శరణన్నవాని రక్షణము సేయ
బట్టివానిని జనులత్యాదరింప
రాదరింపరు నెచ్చెలు లాత్మబాంధ
వులును బదిమంది కూడి నవ్వెదురు వాని.

చంద—ఆర్యకుఁడా! గోపాలదారకుఁడా! డేగకు జడిసినపక్షి యుచ్చులొగ్గువాని చేతంబడినది. (ఆలోచించి) ఇతఁడనపరాధి. చారుదత్తుని బండియెక్కి యున్నాఁడదియునుంగాక ప్రాణప్రియుఁడగు నాప్రియమిత్రుఁడు శర్విలకు నికిం బ్రియమిత్రము. ఈవల మిత్రుఁడు; ఆవల రాజనియోగము; ఏమి చేయుట యుక్తమో తెలియకున్నది. ఏల యీవిచారము? ముందే యభయ మిచ్చితిని, కానున్నది కాకమానదు.

గీ. పరుల కుపకార మొనరింపఁ బాటుపడెడు
వాఁడు శరణాగతత్రాత కీడుఁ జెందె
నేనిఁ జెందునుగాక తాదృశుని లోకు
లెన్నుదురు గాని నిందింప రిందు వందు.

(భయ మభినయించుచు దిగి) ఆర్యవిం జూచితిని—, కాదు కా దార్యరాలగు వసంతసేనను. ఆర్యచారుదత్తు నభిసరింపఁ బోవుచున్న నన్ను రాజమార్గమధ్యమునం బరాభవించుట తగదన్ని యీమె నన్నుఁ గ్రక్కకు లిద్దుచున్నది.

వీర—చందనక! నాకు సంశయముగా నున్నది.

చంద—ఏమి? సంశయమా?

వీర— గీ. భయముఁ జెందుచు గద్గదస్వరముతోడ
నార్యఁ డనియుండు తరువాత నార్యరాల
టంటి వర్ణద్వన సంశయం బుండె నాకు
నంబు రేకున్నయది నాకు నమ్మకంబు.

చంద—ఓరీ! నీకు విశ్వాసము లేకపోనేల. మేము దాక్షిణాత్యులము. విస్పష్టముగా మాటలాడ నేరము. ఖస ఖత్తి ఖస ఖడక్టబిడ కర్ణాటక కర్ణప్రావరణ ద్రావిడచోళ చీన బర్బర శేర ఖాస ముఖ మధుఘాతప్రభృతు లగు మ్లేచ్ఛభాషలలో మేమనేకభాష లెఱింగినవారము గావున యథేష్టముగా మాటలాడుదుము. ఆర్యుఁడో యార్యురాలో. చూడఁబడినాఁడో చూడఁబడినదో యేదియో యొకటి.

వీర— నేనును జూచెదను. అది రాజుగారియానతి. లేనిచో నాయందు నమ్మకము.

చంద—అయిన నేను నమ్మనివాఁడనా!

వీర—రాజకార్యముగదా?

చంద—(తనలో) గోపాలదారకుఁడు చారుదత్తునిబండియెక్కి పాఱిపోవుచున్నాఁడని రాజెఱిఁగినఁ జారుదత్తునకు మాటవచ్చును. దానియందు నుపాయమేదియో! (ఆలోచించి) కర్ణాటకలహములోనికి దింపెదను తరువాతిమాట చూతము (ప్రకాశము) ఓరీ! చందనకుఁడు చూచినతరువాత నీవు చూడవలయునా! నీవెవఁడవురా!

వీర—ఓరి నీవెవఁడవురా!

చంద—ఓరీ! వీరక! రాజు చనువిచ్చె నని కోఁడిసార్లు పిలుచుచుండు ననియు గర్వించి నీజాతి నీవెఱుఁగకున్నావురా.

వీర—(కోపంబుగా) నాజాతి యేదిరా?

చంద—ఎవ్వఁడు చెప్పఁగలఁడు?

వీర—నీవే చెప్పుము.

చంద—నేను జెప్పను.

గీ. ఎఱిఁగియుండియు నీజాతి యేను నుడువఁ
దత్త్వముగ, నాస్వభావంబు తాద్భశంబు,
నామనంబున నుండని మ్మిఫలము
వచ్చివెలగ పగిల్చినఁ బరువు గలదె.

వీర—కాదు కాదు నుడువుము నుడువుము.

చంద—(సంజ్ఞ చేయును)

వీర—ఏమిరాయది?

చం— గీ. చేతఁబట్టిద వ్రాక నూఱుచూరిమక్క
కత్తియును గత్తెరయు, జుట్టు కళయ దువ్వి

సంస్కరించెద విది నీదు జాతి; యిట్టి
వాఁడవీవును సేనాధిపతివయితివి.

వీర—ఓరీ! చందనక! నీజాతి నీకును దెలియకుండనున్నది.

చంద—చంద్రునివలె స్వచ్ఛమైన నావంశమునుగూడ నాక్షేపించెదవఁటరా! చెప్పుము చూతము.

వీర—ఎవఁడు చెప్పఁగలఁడు.

చంద—నీవేచెప్పుము.

వీర—(చేతితో సైఁగ చేయును)

చంద—అదేమిరా!

వీర—వినుము వినుము.

గీ. జాతి పరిశుద్ధమైన దే; మాత నీకు
భేరి పటహంబు నీతండ్రిగారు తలఁప
గరటకంబెన్న నీయన్న కాన రాజు
నొద్ద సేనాధిపతి వయి యుంటి వీవు.

చంద—(కోపముతో) ఓరీ చందనకుఁడు చర్మకారుఁడా? కానీ! పోయి బండి చూడుము.

వీర—ఓరీ! బండివాఁడ! బండి త్రిప్పుము, నేను బరీక్షింపవలయును. (చేటుఁడట్లు బండి త్రిప్పుచున్నాఁడు వీరకుఁ డెక్కఁబోవుచున్నాఁడు. చందనకుఁడు జుట్టుపట్టుకొనిలాగి తన్నుచున్నాఁడు.)

వీర—(కోపముతో లేచి) ఓరోరి చందనక! నేను విశ్వాసముతో రాజుగారియాజ్ఞ శిరసావహించి చేయుచుండఁగా నాజుట్టుపట్టుకొని వంచి తన్నితివిగా! చూడు. ధర్మసభ యెదుట నిన్ను బొండ వేయించకున్న నే వీరకుఁడను గానురా.

చంద—రాజసభకుఁ బొమ్ము, లేదా రాజకులమునకుఁ బొమ్ము. కుక్కవు నీవేమి చేయఁగలవురా.

వీర—మంచిది (అని నిష్క్రమించును.)

చందా—(దిక్కులు గలయం జూచి) ఓరీబండివాఁడ బండితోలుము బండితోలుము. ఎవ్వరేని నిన్నడిగిన "చందనక వీరకులు పరీక్షించిరి" అని నుడువుము. ఓవసంతసేనా! నీ కీగుఱ్ఱు తొసంగుచున్నాను (ఖడ్గము గోపాలదారకున కిచ్చును.)

ఆర్య—(కత్తిఁ గైకొని సంతోషముతోఁ దనలో)

గీ. కత్తి చేతికి దొరకెను గంపమాన
మఱియు దక్షిణభుజము భయంబు లేదు
సర్వ మనుకూల మగునింకఁ జందనకుని
మితికి మీఱిన దయచేతఁ బ్రతికినాఁడ.

చంద—ఆర్యురాలా! వసంతసేన!

గీ. మనవి యాలింపుమమ్మ చందనకు నెపుడు
మఱచిపోవలదమ్మ సంపదలనాఁడు
ఇంత మాటాడరాదు మీయెదుటఁ గాని
స్నేహరసమున నిట్లు వచించినాఁడ.

ఆర్య— గీ. చంద్రశీతలశీలుఁడీ చందనకుఁడు
హితుఁడు నాకయ్యె నాభాగ్య మేమనందు
నాఁటి యోగీశ్వరుని వచనములు నిజము
లైననాఁడు చందనమును నేను మఱవ.

చంద–క. రవిచంద్రులును ద్రిమూర్తులు, శివయెటు శుంభుని నిశుంభు ఛేదించెనో, యట్లై విపక్షక్షయముం జేసి, విధిగ నీకు నభయంబుఁ జేతురు గాక.

(చేటుఁడు బండితోలికొని పోవును.)

చంద—(తెరవంకకుఁ జూచి) నెచ్చెలి యగునార్యకుని కాపుదరాకుండ నావలకు దాఁటించితిని. శర్విలకుఁడుగూడ వాని ననుసరించుచున్నాఁడు; కానీ! ప్రధానదండధారకునితో రాజానకుఁ జనవరితోఁ బగ తెచ్చికొన్నాఁడ. కావునఁ గొడుకులును దమ్ములును నేనును గలసి యీయార్యకునే యనుసరింతుము. (అని నిష్క్రమించును.)

ఇది.. శ్రీతిరుపతివేంకటేశ్వరాంధ్రీకృతం బగునాంధ్ర
మృచ్ఛకటికం బను ప్రకరణంబునఁ బ్రవహణవిపర్యాస
మను పేరుగల షష్ఠాంకము.

---

శ్రీరస్తు.

# మృచ్ఛకటికము

## సప్తమాంకము.

(పిదప చారుదత్తుఁడును మైత్రేయుఁడును బ్రవేశింతురు.)

మై—మిత్రమా ! ఈపుష్పకరండకజీర్ణోద్యానము సొబగు చూడుము.

చారు—అగును మిగులఁజక్కఁగా నున్నది.

గీ. పువ్వులను బణ్యములు కుప్పఁబోసియుఁ జట
వగకిరాటులు తూఁచుచున్నారు చూడు
తిరుగుచున్నారు కొనఁగ బంభరపురుషులు
వెలసె నారామమిది పణ్యవీథి యట్లు.

మైత్రే—అయ్యా సంస్కరింపఁ బోయినను రమణీయమైన యీశిలాతలమునం గూరుచుండుము.

చారు—(కూరుచుండి) వయస్యా ! వర్ధమానకుఁ డింకను రాలేదేమో !

మైత్రే—నే చెప్పినాఁడ, వర్ధమానకా! శీఘ్రముగ వసంతసేనం దీసికొనిరమ్మని.

చారు—ఏలాకో తడసినాఁడు.

మ. తనమెం దల్లన పోవుబండి నెటులో దాఁటింపనో, తల్లులూ
డిన సంధింపనో, భగ్నచక్రమును వెండిన్ గూర్పనో కాక, దా
టను దారుల్కరమడ్డమైనఁ బెరబాటన్ బట్టఁగానో, మరే
మవనీశా; కదిలింపఁడో పనుల వాఁడల్లల్ల నీతేరఁగన్.

(పిదప గోపాలదారకుఁ డెక్కినబండి తోలుకొని వర్ధమానకుఁడు ప్రవేశించును.)

చేటు—గిత్తలారా ! నడువుఁడు నడువుఁడు.

ఆర్య—(తనలో) గీ. నృపతిభటు లెదురైనచో నెంతో భయమున
గదుర, నొకకాల నిగళరేఖ గ్రాలఁ, దలియ
కుంద నెక్కితి నితరులబండి కాక
గూట రక్షింపఁబడియున్న కోకిలగతి.

అహో! నగరము వదలి చాల దవ్వు వచ్చితిని. ఈబండి దిగి చెట్లగుంపులో దాఁగియుందునా ! లేక బండిమీఁదనే యుండి బండియొడయనిం జూతునా ! చెట్ల

చాటున డాఁగుట మంచిది కాదు. పోయి మహానుభావుని నాచారుదత్తునిఁ గనుం గొనెదను. అతఁడాపన్నవత్సలుఁడని విందును.

గీ. అతఁడు నాపదుమరవస్థ నరసెనేని
నిరుపమానపుఁగరుణ కన్పింపఁగలఁడు
చిరతరాపదలో మున్గి చివికియున్న
నాయొషలు నిల్పినవి తద్గుణములు కావె.

చేట — ఇదిగోఁ బుష్పకరండకము, లోపలికి బండిఁ దోలుదురా! (తోలి) ఓ మైత్రేయా మైత్రేయ! (అని పిలుచును.)

విదూ — మిత్రమా! నీకొక ప్రియము నివేదించెదను. వర్ధమానకుఁడు పిలుచుచున్నాఁడు వసంతసేన వచ్చియుండును

చారు — ప్రియము ప్రియము.

మైత్రే — వర్ధమానకా! తొత్తుకొడక, యింతసే పేమి చేయుచుంటివిరా?

చేటు — అయ్యా! కోపింపకుము, యానాస్తరణము మఱచి రెండుమూఁడు సార్లట్టిటు తిరుగపలసివచ్చినది. దాన విలంబమాయె.

చారు — వర్ధమానకా! బండి త్రిప్పుము. మైత్రేయా! వసంతసేనం దింపుము.

మైత్రే — కాలికి సంకెళ్ళు దగిలించినారా యేమి, అది యేలదిగలేదు (లేచిబండిఁ జూచి) వసంతసేన కాదయ్యో! వసంతసేనుఁడయ్యా.

చారు — మైత్రేయా! వేళాకోళములు చాలును. స్నేహము కాలవిలంబము నపేక్షింపదు. నీవు దింపుము. లేదా నేను దింపెదను (లేవఁబోవును.)

ఆర్య — (స్వగతముగా) ఇతఁడే చారుదత్తుఁడు కాఁబోలు; వినుటకే కాదు చూచుటకును రమణీయుఁడే (ప్రకాశముగా) ఇఁక బ్రదికితిని.

చారు — (బండి యెక్కిచూచి) మైత్రేయా! ఇతఁడెవ్వరు?

ఉ. ఏనుఁగుఁగున్న తొండమున కెక్కువ చేతులయంద, మున్నతా
పీనపుటంసభాగముల పెక్కువ, రక్తసరోజపత్రముల్
బోనివిలోచనంబులు, సమున్నతవక్షము గల్గియున్న యీ
ప్రాణికి నేలొకో నిగళబంధ మొనర్చిరి కాలికక్కటా.

అయ్యా! నీవెవ్వఁడవు?

ఆర్య — శరణాగతుఁడ, నార్యకుఁ డనువాఁడ, గోపాలదారకుఁడ.

చారు — ఘోషపల్లెనుండి రప్పించి పాలకమహారాజు కారాగారమునం బెట్టించెనఁట యాతఁడవా నీవు?

ఆర్య — అగును

చారు — గీ. దైవయోగంబున లభించెఁ దావకాగ
మనము కందోయి కానందజనక మయ్యెఁ
బ్రాణముల నైన వదలెద నంతెకాని
వదలఁజాలను శరణన్నవాని నేను.

ఆర్య — (సంతస మభినయించును.)

చారు — వర్ధమానక! యతని కాలిసంకెల యూడఁదీయుము.

చేట — చిత్తము. (అట్లు చేసి) అయ్యా! నిగళ మూడఁదీసితిని.

ఆర్య — మహాత్మా! కాలిసంకెలి యూడఁదీయించి హృదయమునందు దృఢతరం బైన స్నేహనిగళముం దగిలించితివి.

విదూ — ఆబంధనము గ్రహింపుము. ఈతఁడు ముక్తుఁడాయెఁగదా; మనమింక నేగుదము.

చారు — నిదానించుమోయీ!

ఆర్య — మిత్రమా! చారుదత్త! నేను బ్రణయమున మీబండి యెక్కితిని క్షమింపుము.

చారు — స్వయముగా స్నేహదానము గావించిన నీచే నలంకరింపఁబడితిని.

ఆర్య — సెలవిచ్చినం బోయెదను.

చారు — మంచిది.

ఆర్య — బండి దిగెదను

చారు — మిత్రమా బండి దిగవలదు. ఇంతదనుకఁ గాళ్ళకు బంధనము గావించి యుండుటచే నిపుడు వడిగా నడువఁజాలవు. రాజభటు లిట్టటుఁ దిరుగు నీమార్గమున బండి విశ్వాసమును గలిగించును గావున బండిమీఁదనే పోవుము.

ఆర్య — తమసెలవునకు బద్ధుఁడను.

చారు — ఉ. మేలుగఁ జేరుమా చెలుల

ఆర్య — మిత్రుఁడ నీవె మ మెవ్వరయ్యా?

చారు — నీ ప్రోలఁ బ్రసంగమైనఁ దలపోయుదె?

ఆర్య — నామనమే నెఱుంగనే!

చారు — యేలుము కల్లచోట్ల నురకే నిను

ఆర్య — జేరితి నీవె నన్ను

చారు— నింతేల తెమల్చె నిక్క భవదదృష్టమె

ఆర్య— దానికి హేతు వీవకా!

చారు— పాలకుఁడు విశ్రమించినచో నీకుం దగిన రక్షకులు లేరు కావున శీఘ్రముగా పావలకు దాఁటుము.

ఆర్య— పునర్దర్శనము లభించునుగాత. (నిష్క్రమించును)

చారు— మిత్రమా! మనము రాజున కప్రియంబొనర్చి యిటఁ! ఉండఁజనదు. ఆ నిగళము నాపాదమునుండిఁ బడవేసిరమ్ము. లేనిచో రాజులు చారచక్షువులచే గుర్తింపఁగలరు. (ఎదురుకన్నదయుట సూచించి) మిత్రమా! వసంతసేన యే మాయెనో కదా?

క. అదరెడు వామవిలోచన, మెదమల్లడిగొనుచు దందడించెడుఁ గత మె
య్యదియుఁ గనరాకయే, నా హృదయేశ్వరి గాంచనైతి నీవాఁడకటా!

పోవుదమురమ్ము. (పరిక్రమించి) ఇదేమి! అమంగళము. శ్రమణకుఁ డెదురైనాఁడు (ఆలోచించి) వీని నీమార్గమున నే రానిమ్ము. మనమాదారిని బోవుదము.

(అని నిష్క్రమించును.)

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వరాంధ్రీకృతమగు
మృచ్ఛకటికమను ప్రకరణమున ఆర్యకాపహరణమను
సప్తమాంకము.

శ్రీరస్తు.

# మృచ్ఛకటికము

## అష్టమాంకము.

(పిదప దడిపంచె జేతఁబూని బౌద్ధసన్న్యాసి ప్రవేశించుచున్నాఁడు)

భిక్షు—అజ్ఞులారా! ధర్మసంగ్రహముఁ గావింపుఁడు.

గీ. ఆఁకలియు దప్పికయుఁ బాసి ధ్యానపటహ
మెల్లకాలంబులందు వాయించుకొనుచు
మేలుకొని కాచుకొనుఁ డింద్రియాఖ్యచోర
తస్కరులపాలు గాకుండ ధర్మధనము.

మఱియు ననిత్యమగు నీదేహాదికము నమ్మక మేము ధర్మమునే [illegible]యించుచున్నాము.

గీ. ఒడలి పేరిటి గ్రామముం దున్న దొంగ
లైదుగుర నొంచియును మాయ యవలఁ ద్రోచి
చిత్తచండాలు నిగ్రహించిన సురక్షి
తమగు గ్రామంబు దొరకు స్వర్గము నిజమ్ము.

గీ. మొగముఁ దలయును ముండితంబులగుఁ గాక
మనసు కాదేని ఫలమేమి? మన సెవనికి
ముండితంబగు వానికి మొగముఁదలయు
ముండితములైనఁ గాకున్న ముండితములె.

జేగురురంగునీళ్ళలో ముంచినయీచీవరమును రాష్ట్రియస్యాలకు నుద్యానములోని పుష్కరిణియందు జాడించికొని శీఘ్రముగా లేచి పోయెదను.

(తెరలో) శకా—నిలువుమురా! దుష్టశ్రమణక! నిలువుమురా!

భిక్షు—(చూచి భయముతో) వీఁడె రాజస్యాలకుఁడు సంస్థానకుఁడు వచ్చుచున్నాఁడు. మున్నొకసన్న్యాసి వీనికపరాధము చేసెఁగాన వీఁడు తనకంటఁబడిన సన్న్యాసులనెల్ల వాఁబోతులకువలె ముక్కుకుట్టి పొలఁద్రోలుచున్నాఁడు. ఇక్కడ నాకెవరు దిక్కు? ఎవ్వరిని శరణందును! కానీ, బుద్ధభట్టారకుఁడే నాకు దిక్కు.

(శకారుఁడు ఖడ్గమును బూనినవిటునితోఁ గూడఁ బ్రవేశించును.)

శకా—నిలువుమురా! దుష్టసన్న్యాసి! నిలువుమురా! కల్లంగడిలోనికి తెచ్చిన మాల్లంగిదుంపవలె నీతల చితుకఁగొట్టెదను (సన్న్యాసిని దన్నును)

విటు—నిర్వేదమువలనఁ గావిగుడ్డలు ధరించిన సన్న్యాసిని దన్నుట న్యాయముకాదు. వీనితోనేమి సుఖోపగమ్యమగు నీయుద్యానము సొబగుగనుంగొనుము.

శ్లో. దుఃఖవంతుల కేనియు నీదుఃఖ మెడపి
సౌఖ్యము నొసంగఁజాలు వృక్షములకలిమిఁ
గుజనులమనంబుఁబోలె నగుప్తమగుచుఁ
గోత్రాచక్రంబునాఁ గూన్య మగును.

భిక్షు—స్వాగతము! ఉపాసకా! యనుగ్రహింపుము!

శకా—బావా! చూడు చూడు. వీఁడు నన్నుఁ దిట్టుచున్నాఁడు.

విటు—ఏమని తిట్టుచున్నాఁడు?

శకా—ఏమనియా! నన్నుపాసకా యన్నాఁడు. నేను మంగలివాఁడనా!

విటు—కాదు కాదు. నీవుబుద్ధోపాసకుఁడ వని నుతించినాఁడు.

శకా—శ్రమణకా! నుతింపుము! నుతింపుము!

భిక్షు—నీవు ధన్యుఁడవు. నీవు పుణ్యుఁడవు.

శకా—బావా! ధన్యుఁడవు పుణ్యుఁడవు నని నన్ననుచున్నాఁడు. నేను చార్వాకుఁడనా కోష్టకుఁడనా! కుంభకారుఁడనా!

విటు—కాదు కాదు. నీవు ధన్యుఁడవు పుణ్యుఁడవు నని కొనియాడుచున్నాఁడు.

శకా—వీఁ డెందుల కిచ్చటికి వచ్చినాఁడు?

భిక్షు—ఈచీవరము జాడించుకొనుటకు వచ్చితిని.

శకా—ఓరి దుష్టసన్న్యాసి! ఈయుద్యానముల కన్నింటికిఁ దలమానికమగు నీపుష్పకరండకమును మాబావగారు నాకిచ్చిరి. ఇందలి పుష్కరిణిలోఁ గుక్కలు నక్కలును నీళ్ళు త్రాగునుగాని యుత్తమపురుషుఁడ నగు నేను స్నానము చేయనుగదా! ఆచెఱువులోఁ బాసితయులవగుగ్గిళ్ళవంటి రంగుగల యీకుటికి గుడ్డ యుతికెదనా! నిన్నొక తాఁపు తన్నెదను.

విటు—కాణేలీమాతా! వీఁడు క్రొత్తగా సన్న్యసించి నట్లున్నాఁడు.

శకా—నీ వెట్లు గుర్తించితివి?

విటు—గుర్తింపవలసిన దేమున్నది.

ఉ. ఫాలము తొల్లి యున్నటులఁ బచ్చఁగనే తనరారుమంజె ఘూ
ర్వాలకమయ్యెఁ, జీవరక్తాంకము కన్పడ దంసకంబులన్
జాలదు కావిశాటికయుఁ జక్కమెయిన్ ధరియించు నేరుపున్
జేలఘటంచు నిల్వడు విశీర్ణకమై సరిగా భుజంబులన్.

భిక్షు—ఉపాసకుఁడా! నిజము. నేను గొలఁదిదినముల క్రిందటనే సన్న్యసించితిని.

శకా—నీవు పుట్టినవెంటనే యేల సన్న్యసింపలేదు (అని తన్నుచున్నాఁడు.)

భిక్షు—బుద్ధదేవుఁడా ! నమస్కారము (అని యేడ్చును.)

విటు— ఏల యీడీనునిఁ దన్నెదవు? పోనీ! వదలుము.

శకా—ఓరీ ! ఉండుమురా యాలోచించెదను.

విటు —ఎవనితో నాలోచించుట ?

శకా—నాహృదయముతోనే.

విట—అయ్యో ! వీఁడు పోఁడాయెనే.

శకా—పుత్రికుఁడా ! హృదయమా ! భట్టారకా ! పుత్రకా ! ఈసన్న్యాసిని వద లుదువా మానుదువా ! (తనలో) వెళ్ళను నలదు. ఉండను వలదు. (ప్రకాశముగ) బావా ! హృదయముతో నాలోచించితిని. నాహృదయ మేమని యాలోచన చెప్పినదనఁగా:—

విట—ఏమని చెప్పినది ?

శకా—ఏమనియా ! వెళ్ళనీకుము. ఉండనీకుము. దిగయూపిరికాని యెగయూపిరి కాని విడువనీకుము. వీఁడిక్కడనే పడిచావవలసినదని.

భిక్షు—దేవరా బుద్ధా ! శరణంటిని రక్షింపుము !

విటు—పోనిమ్ము

శకా— ఒక ప్రతిన గావించినఁగాని వదలను.

విటు—ఏమని !

శకా—నీళ్ళు కలఁగకుండ బురదనుకలుపవలయును. లేదా నీళ్ళమూటగట్టి బురదలోఁ బోయవలయును.

విట—ఆహాహా మూర్ఖత్వము !

గీ. బుద్ధి విపరీతకృతులపైఁ బోదలువారు
వల్ల శిలఁబోలునొడ లుల్లసిల్లువారు

కాడఁ బెరిగినట్టి మాంసపుంజెట్టులైన
మోరకుల చేతనిండె నీభూమి యకట.

(సన్న్యాసి తిట్టుటనటించును.)

శకా—ఏమనుచున్నాఁడు ?

విట—నిన్నుఁగొనియాడుచున్నాఁడు.

శకా—ఓరీ కొనియాడుము గొనియాడుము !

(సన్న్యాసి యీపగిదిఁ దిట్టుచునే వెళ్ళిపోవును.)

విట—కాణేలీమాతృకా ! ఈయుద్యానవనము సొబగుఁ గనుంగొనుము.

గీ. పండ్లచేఁ బూలచేనొప్పి, పసవమైన
వల్లరులబిగి కొఁగిండ్ల నుల్లసిల్లి
రాజభటరక్షితములగు భూజములివి
యొందుఁగల్గుగృహస్థులోయన సుఖించు.

శకా—బావా ! లెస్సగా వర్ణించితివి.

గీ. కుసుమచిత్రితమయ్యె నీ వసుధ, తరులు
కుసుమభారమ్ముచే వంగెఁ గ్రోఁతిగములు
భూమిజాతాగ్రశాఖికల్ పూని వ్రేలు
చున్నయవి చూడు పనసపండ్లో యనంగ.

విట—కాణేలీమాతృకా ! యీరాతిపలక మీఁదఁ గూర్చుండుము.

శకా—ఇదిగోఁ కూర్చుంటిని. (అనివిటునితోఁ గూర్చుండును) బావా ! ఆవసంత
సేన మఱపు రాకున్నదోయి, దుర్జనవచనమువలె హృదయమునుండి లేచిపో
కున్నది సుమా !

విట—(తనలో) అప్పగిది నిరాకృతుండయ్యు వీఁడు మరల దానినే స్మరించుచు
న్నాఁడు. గీ. స్త్రీలు తన్ను నిరాకరించినకాలందిఁ
గుజనులకు హెచ్చుఁ గామంబు ; సుజనతతికి
వంతకంతకుఁ జలచల్లనగుట కద్దు
మొట్టమొదటికి శమియించిపోకకద్దు.

శకా—బావా ! బండితీసికొని త్వరగరమ్మని స్థావరకునితోఁ జెప్పి చాలసేపాయెఁ
గదా! ఇంకను రాలేదేమో ! నాకాఁకలి మిక్కుటమగుచున్నది. నడచి
పోదమన్నను రెండుజాములైనది. మిడిమిడియెండకుఁ గాళ్ళు కాలఁగలవు.

గీ. మింటినడిమికిఁ జనుదెంచెఁ గంటె సూర్యుఁ
డానరంబున రవిభగవానులిపుడు
భూమిసంతప్తమయ్యెను బుత్రశతము
పొలియఁ బొగిలెడుగాంధారపుత్రివోలె.

విట—అవు నిది యిట్టిదియే.

సీ. నెమరువేయుచు గోగణములు నిద్రింపఁగ సాఁగె భూమీసహాస్రాయులందుఁ
గాసారములలోని కాఁగియున్న జలంబు దప్పిఁజచ్చమృగాలు త్రాగఁ[illegible]
దరుణారుపరిభ్రాంతప్తంబులైన రథ్యలును మనుష్యశూన్యంబు లయ్యె
జలశీతలోశీరదళవేష్టితములైన పసుకటిండ్ల సుఖించెఁ బతియు సతియుఁ

గీ. నెండవేఁడికి జడిసియో యేమొ నీడ
చెట్లక్రిందన యుండె నిట్టట్లు చనక
గిత్తలాయాసపడుచుఁ దొత్తుకొడుకు
శకటమాపెనుగాఁబోలు స్థావరకుఁడు.

శకా—బావా! గీ. శకుని ఖగవిహంగంబులు శాఖలందు
దాఁగె, రవిరశ్మి నాదు మూర్ధమున దాఁగె
నరులు పురుషమనుష్యు లుష్ణంపుటూర్పు
గదుర గృహగేహముల నెండఁ గడపుచుండ్రు.

బావా! యిప్పటికిని జేటుఁడు రాలేదు. ఆత్మకు వినోదమునకై కొంచెము పాట పాడెదను (వెఱ్ఱిపాట పాడి) బావా! బావా! వింటివా నాపాట.

విటు—ఏమని నుతింతును! నీవు గాంధర్వాంశమునం బొడమితివి.

శకా—బావా! నేను గంధర్వుఁడ నేల కాను?

గీ. వసయు నగుడంబు శొంఠియు భద్రముస్త
లింగువయు జీలకఱ్ఱయు నేను గంధ
యుక్తముగఁ జేసి భక్షించియుంటి నాస్వ
రంబు కాకుండునే మధురంబు బావ.

బావ! మరలఁ బాడెదను (గానముఁజేసి) బావ! వింటివా?

విటు—ఓహో! గంధర్వుఁడవుగదా!

శకా— గీ. మిరియ మింగువ పొడిచేసి మేళగించి
తొల్చి ఘృతమున వేఁచి ముద్దగ నొనర్చి

పరభృతపు కంఱకుట్లతో పాటు తింటి
నాకు రాకున్నె మధురకంఠస్వరంబు.

బావా! యిప్పటికిని జేటుఁడు రాలేదుకద!

విటు—స్వస్థుఁడవగుము. ఇప్పుడే వచ్చును.

(పిదప వసంతసేన యెక్కినబండి తోలుకొని స్థావరకుఁడు ప్రవేశించును.)

స్థావ—మట్టమధ్యాహ్నమైనది. రాజస్యాలకసంస్థానకుఁడు కోపగించునేమో! నాకు భయము పొడముచున్నది. త్వరగా నడువుండు గిత్తలారా! నడువుఁడు.

వసం—అమ్మయ్యో! అమ్మయ్యో! ఇది వర్ధమానకుని కంఠస్వరమువలె లేదు. ఇది యేమో! ఆర్యచారుదత్తుఁడు ఎడ్లయొక్క పరిశ్రమము బాపుటకై వర్ధమానకుఁడు తోలుబండి నిలిపి యింకొక బండియు నింకొక బండివానిని బంపించె నేమో! కుడికన్నదరుచున్న దేందులకో! హృదయము గందరగోళపడుచున్న దేమో! దిక్కులు శూన్యములగుచున్నవి. సర్వము విపరీతముగా నున్నది. ఏమి కానున్నదో!

శకా—(చప్పుడువిని) బావా! బావా! బండివచ్చినది.

విట—ఎట్లు తెలిసినది?

శకా—నీకు వినఁబడుటలేదా! ముసలిపంది వలె గురగురలాడుచున్నది.

విట—(చూచి) బాగుగఁగని పెట్టితివి. నిజమే, వచ్చినది.

శకా—స్థావరకా! చేట! కొడుకా! వచ్చితివా?

చేటు—చిత్తము వచ్చితిని.

శకా—బండికూడ వచ్చినదా?

స్థావ—చిత్తము వచ్చినది.

శకా—గిత్తలు వచ్చినవా?

స్థావ—చిత్తము చిత్తము.

శకా—నీవుకూడ వచ్చితివా?

స్థావ—(నవ్వుచు) భట్టారకా! నేనును వచ్చితిని.

శకా—బండి లోనికిం దీసికొనిరమ్ము.

స్థావ—ఏతోవను?

శకా—ఆప్రాకారము పడిపోయినచోట నుండి.

స్థావ-అయ్యా! గిత్తలు చచ్చిపోవును; బండివిఱుగును; ఈమీనౌకరును చచ్చిపోవును.

శకా—ఓరీస్థావరక! నేనెవఁడను! రాజస్యాలకుఁడను; గిత్తలు చచ్చిన నింకొక గిత్తజోడు కొందును. బండివిఱిగిన మరలఁజేయించుకొందును. నీవు చచ్చిన మా కింకొకఁడు దొరకును.

స్థావ—అన్నియు మీకుదొరకును గాని నాకుమాత్రము నేను మిగులను

శకా—సర్వము నశించిన నశింపనిమ్ము. నీ వాతోవ నే బండిఁ దీసికొనిరమ్ము.

స్థావ—పదవే బండీ! నీస్వామితోఁగూడఁ జదిసిపొమ్ము. నీతాతవంటిబండి యింకొకటి వచ్చును. నేనీసంగతి అయ్యగారితోఁ జెప్పుదును. (ప్రవేశించి) ఎట్లు! బండి విఱుగనేలేదే! భట్టారకా! బండి వచ్చినది.

శకా—ఏమిరా! గిత్తలు తెగలేదు. త్రాళ్ళు చావలేదు నీవును విఱుగలేదటరా!

స్థావ—చిత్తము ఏమియు జరుగలేదు.

శకా—బావా చూతము బండి, రా రమ్ము, బావా! నీవు నాకు గురువవు పరమ గురువవు. ఆంతరంగికుఁడవు, పూజ్యుఁడవు, పురస్కరణీయుఁడవు గాన నీవే ముందు బండియెక్కుము.

విట—కానిమ్మట్లే కానిమ్ము, (అని బండియెక్కుచున్నాఁడు.)

శకా—బావా! నీవుండుము. ఈబండి నీయబ్బసంపాదించెనా, నీతాతసంపాదించెనా చట్టన యెక్కుచున్నావు. దిగు దిగు; బండి నాది. నేనే ముందెక్కెదను.

విట—నీవే యెక్కు మంటివిగదా!

శకా—నేను నిన్నెక్కుమనినను "అయ్యా నీవే ముందెక్కుము" అనవలయును; నిది యాచారము, ఏగోలయు నెఱుఁగవు.

విట—అయ్యా! నీవే ముందెక్కుము.

శకా—ఇదిగో నెక్కుచున్నాను. పుత్రికా! స్థావరక! బండి త్రిప్పుము.

స్థావ—(బండి త్రిప్పి) భట్టారక! ఎక్కుము.

శకా—(ఎక్కిచూచి భయపడి గుభాలునఁ గ్రిందికుఱికి విటుని కంఠము గట్టిగాఁ గౌఁగిలించి) బావా బావ! చచ్చిపోతివి చచ్చిపోతివి. బండిమీఁద రక్కసియో దొంగయో యున్నది. రాక్షసియైన మనల దోఁచుకొనును దొంగ యయిన భక్షించును.

విట—భయపడకుము. ఎద్దులబండిమీఁద రాక్షసియుండునా? మిట్టమధ్యాహ్న మగుటచే నీదృష్టి చెదరినది. చొక్కా తొడుగుకొనిన స్థావరకుని నీడఁ జూచి యట్లు భ్రాంతిపడలేదుగద?

శకా— బాబూ ! స్థావరక! బ్రతికియున్నావా !

స్థావ—బ్రతికియున్నానయ్యా !

శకా—బావా ! బండిలో నెవ్వతెయో స్త్రీ యెక్కి యున్నది. చూడుము.

విట—ఆఁడుదియా ?

గీ. మొగముపై జల్లుకొట్ట నాఁబోతు లేదు
పగిదిఁ బోదము వడిఁ దలవంచికొనుచు
గౌరవంబాసపడునాదు కన్నుకోయి
భయముఁజెందుఁ గులస్త్రీలపట్ల నెపుడు.

వసం—(ఆశ్చర్యముతోఁ దనలో) ఏమి ! నాకంకోయి కాయాసముఁ గలుగఁజేయు రాజస్యాలకుఁడే వీఁడు. మందభాగ్యురాలను చిక్కుఁబడిపోతినికదా ! ఊసరక్షేత్రపతితము లగువిత్తువలె నాపడినప్రయాస మంతయు నిష్ఫలమైనది. నే నేమి చేయుదాన !

శకా—ఈముదిపంద చేటుఁడు భయపడుచున్నాఁడు. బావా నీవు బండిలోనికిఁ జూడుము.

విటు— ఇందు దోస మేమున్నది ? అటులనే చూచెదను.

శకా—ఓహో ! నక్క లెగురుచున్నవి. కాకులు పఱువిడుచున్నవి. బావ నారా తుసి దంతములతోఁ జూచి నేత్రములచే భక్షించునంతలో నేను పాఱిపోయెదను

విట—(వసంతసేనం జూచి విషాదముతోఁ దనలో) కటకటా ! లేడిచెలువ పెద్దపులి వెంటఁదగిలినదేమి ! ఎంతకష్ట మెంతకష్టము !

గీ. పూర్ణశారదచంద్రుని బోలి పులిన
మందు శయనించియున్న రాయంచతోడఁ
గలసి సుఖమొందఁ దగునంచకలికి యకట
కాకిపాలను బడెఁ గాలకర్మవశత.

(జనాంతికముగ) వసంతసేనా ! ఈపని అయుక్తము. నీకుఁ దగినదిగాదు.

గీ. మొదట నభిమానపడియును బిదపఁ దల్లి
వచనమున నిట్లు లకట ద్రవ్యంబు కొఱకు

వసం—లేదు లేదు (అని తల త్రిప్పుచున్నది)

విట— ధైర్య మెదనిల్పుకోలేనిదాని నిన్ను
వేశభావంబు తుదకుఁ బ్రవేశపెట్టె.

నేను నీతో నాఁ డంటినిగదా. “కలిగెంబోభువిఱంకుగూడెములు మాకై సుంతయోజింపుమా” అని (ఆపద్యము చదువును)

వసం — బండి మార్పుడలచే నిట్లువచ్చితిని. శరణాగతురాలను రక్షింపుము.

విట — భయపడకుము. కానీ, వీని నే మోసపుచ్చెదనులే (శకారుని సమీపించి) కాణేలీమాతృకా! నిజముగా నిందున్నది రాక్షసియే సుమీ!

శకా — బావ! నిజముగా రక్కసియైన నిన్నేల దోచుకొనలేదు, లేక దొంగయైనచో నిన్నేల మ్రింగలేదు.

విట — ఏల యీవివేచనము. ఈయారామముల నడుమనుండి యుజ్జయినీపురమునకు నికఁ గాలినడకనే పోవుట మేలు.

శకా — అట్లు చేసిన నేమియగును?

విట — వ్యాయామము కలుగును, గిత్తల శ్రాయాసము తీఱును.

శకా — మంచిది. అట్లేకానిత్తము. స్థావరకా! నీవు బండి తీసికొనిపొమ్ము. వలదు వలదు తీసికొనిపోకుము. దేవతలముందఱను బ్రాహ్మణులముందఱను నేను గాలినడక నేలవత్తును? వలదు వలదు. బండియెక్కియే వచ్చెదను. నేను శకటముమీఁదఁ బోవుచుండఁగా వారందఱు "వీఁడె రాజస్యాలకుఁడు భట్టారకుఁ" డని దవ్వులనిలిచి చెప్పుకొనవలెను.

విట — (తనలో) విషము నౌషధము చేయుట కష్టముకదా! ఇట్లగుఁగాఁక (ప్రకాశముగ) కాణేలీమాతృకా! యీబండిమీఁద నున్నది వసంతసేన. నిన్నభిసరించుటకై వచ్చినది.

వసం — పాపము శాంతించును గాక, పాపము శాంతించును గాక.

శకా — బావ! నేను ప్రవరపురుషుఁడననియు మనుష్యుఁడననియు వాసుదేవుఁడననియైనా వచ్చినది?

విటు — అవును. అవును.

శకా — నాకపూర్వమైన యదృష్టము పట్టినది. నాఁడామెను కోపగింపఁజేసితిని నేఁడు పాదములంబడి బ్రతిమాలుకొనెదను.

విటు — మంచిమాట నుడివితివి.

శకా — ఇదె కాళ్ళపైఁ బడుచున్నాను (అని వసంతసేనను సమీపించి) అమ్మా. తల్లీ! నామనవి యాలింపుము.

గీ. స్థూలలోచన! దశనఖా! శుద్ధదంతి!
చరణములమీఁదఁ బడుదు నంజలిఘటింతు
నీకు దాసుఁడ మదనార్తి నేను నాఁడు
నీకుఁజేసిన తప్పు మన్నించవమ్మ. (పాదములమీఁదఁబడఁబోవును)

వసం—(కోపముతో) ఛీ మూర్ఖా! అయుక్త ప్రశంస చేయకుము (కాలితోఁ దన్నును)

శకా— (కోపమున)

గీ. అమ్మలును దల్లులును ముద్దులాడినట్టి
దెన్నఁడును దేవునకునైన నెరఁగనట్టి
దీశిరముఁ గాలఁదన్నితివే లెమ్మ! యడవిఁ
బీనుఁగుతల జంబుకము దన్నువిధము గాఁగ.

ఓరీ స్థావరక, చేట! నీకిది యెచ్చట దొరకినదిరా?

స్థావ—అయ్యా! రాజమార్గ మూరి బండ్లచే సందులేక యుండఁగా నేనీబండి చారుదత్తుని వృక్షవాటికాద్వారంబునం దాఁపి మఱియొకని బండి చక్రములు త్రిప్పఁబోయితిని ఆసమయమున నీమె యింకొకబండి యెక్కఁబోవునదియై యిదియే యదియని యెక్కెఁగాఁబోలు నే నెఱుంగను.

శకా—ఓహో! శకట విపర్యాసమున వచ్చితివా! నన్నభిసరించుటకు రాలేదు. అటులేని నాబండిదిగు దిగు. దరిద్రుఁడగు నా సార్థవాహపుత్రు నభిసరించుటకుఁ బోవుచుంటివా? నిన్ను నాగిత్తలు మోయవలెనా! దిగు దిగు గర్భదాసికానా! దిగుము.

వసం—ఆర్యచారుదత్తు నభిసరింపఁ బోవుచున్నాననుమాట సత్యము. ఆపలుకువలన మిగుల నలంకరింపఁబడితిని. ఇప్పుడు కానున్నది కాకమానదు. కానిమ్ము.

శకా— గీ. కుముదపత్రంబులనుబోలు గోళ్లుపదియు
నీయొడల గ్రుచ్చిగ్రుచ్చి జటాయువపుడు
వాలిపెండ్లము నీడ్చిన పగిది నేఁడు
బట్టి పడలాగువాఁడ నిఁక బండినుండి.

విటు— గీ. గుణసమన్వితలై యున్న కుసుమపత్రి
నేత్రలను గొప్పువట్టుట నీతిగాదు
పూవుఁదోటలలోనున్న భూమిజముల
పల్లవంబులు త్రుంచుట భావ్యమగునె?

కావున నీయుద్యోగము విడువుము, నీవిటురమ్ము, నేనామెను బండినుండి దింపెదను. వసంతసేనా! బండి దిగుము.

(వసంతసేన దిగి యేకాంత స్థలమున నిలుచును)

శకా—(తనలో) వెనుక నామాట నిరాకరించుటచే జేసిన కోపాగ్ని నిప్పుడు పాద ప్రహారముచేఁ బ్రజ్వలింపఁజేసినది కావున దీని నిప్పుడుచంపెదను కానీ! యిట్లు చేసెదను. (ప్రకాశము) బావా! బావ!

గీ. మహుమహు మహూమహూ యంచు సొక్కుచుఁ బల
లంబు నాతోడఁ దినఁగఁ దలంచితేని
కుమ్మల్లాడు నెనకంపుఁగొమ్మయుంగు
టుత్తరీయంబు ధరియింప నూహయేని,—

విటు—ఉన్నచో నేమందువు?

శకా—నా చెప్పిన మాట వినుము, నాప్రియ మొనరింపుము.

విట—అకార్యము కాకున్నఁ దప్పక కావింతును.

శకా—అకార్యము లేశమైనను లేదు, ఇది రాక్షసియుఁ గాదు.

విట—అటులేని వాక్రుచ్చుము.

శకా—వసంతసేనం జంపుము.

విట—(చెవులు మూసికొని.)

ఉ. ఆఁడుది బాల యీనగరి కంతయు మేలిభూషణంబు రో
చేడియయయ్యు దాని కులచేష్టలు లేనిది నాకుఁ జంపఁజే
యాడునె? యాడెఁబో యిటు నిరాగసురాలికి నెగ్గుసేయు నా
కోడ లభింపనేర్చునె యయో పరలోకనదిం దరింపఁగన్.

శకా—నీకు నే నోడనిచ్చెద, వనియుమంగాక జనశూన్యమగునీ యుద్యానంబునం జంపినచో నిన్నెవఁడు చూచును.

విట—ఎవరు చూతురా,

గీ. దెసలు ధర్మానిలులు వనదేవతలును
చంద్రసూర్యులు నంతరిక్షంబు నంత
రాత్మయును భూమి పాపపుణ్యములనెపుడుఁ
జూచుచుందు రిఁకెవ్వరుఁ జూడకున్న.

శకా—అటులేని బట్టచాఁటుచేసి చంపుము.

విటు—మూర్ఖుఁడా! చెడిపోవుచుంటివిరా?

శకా—ఈముసలినక్క యధర్మమునకు జడియుచున్నాఁడు కావున స్థావరకునిం బ్రతిమాలుకొనియెదను. స్థావరకా! చేట! పుత్రకా! నీకు బంగారుకడియములు బహుమతి యొసంగెదను,

స్థావ—ధరించెదను.

శకా—నీకు బంగరుపీఁట చేయించి యిచ్చెదనురా!

స్థావ—నేను గూర్చుందును.

శకా—నే దినఁగా మిగిలినది నీకిచ్చెదను.

స్థావ—తిందును.

శకా—నిన్నందఱి చేటులలోఁ బ్రధానునిఁ గావించెదను.

స్థావ—పరిధాని నయ్యెదను.

శకా—అగునో నా మాటవిను.

స్థావ—అకార్యము కాకున్నచోఁ గావించెదను.

శకా—ఇందకార్యము లేశమయిన లేదు.

స్థావ—అటులేని సెలవిండు.

శకా—వసంతసేనను జంపుము.

స్థావ—అయ్యా! శకట విపర్యాసమున నామె నిచ్చటికిఁ దీసికొనివచ్చుటయె నాది
మొదటితప్పు.

శకా—ఓరిచేటా! నీ చేతఁగూడ మాట వినిపింప లేకున్నానురా.

స్థావ—మీరు నాశరీరమునకుఁ బ్రభువులు కాని శీలమునకుఁగాను. కావున ననుగ్రహింపుఁడు. నేను భయపడుచున్నాను.

శకా—నాపరిచారకుఁడవైన నీకు భయ మెవరివలనరా?

స్థావ—పరలోకము వలన.

శకా—పరలోకమనఁగా నెవరు?

స్థావ—అయ్యా సుకృత దుష్కృత పరిణామమే పరలోకము.

శకా—సుకృత పరిణామ మనఁగా నేమి?

స్థావ—నీకు బంగరు సొమ్ములు మురిడీలు లభింపఁజేసినదే సుకృతపరిణామము.

శకా—దుష్కృత పరిణామ మనఁగా నేమి?

స్థావ—నాచే వారులకు సేవచేయించుమఁ బరపిండమును దినఁజేసినదే దుష్కృతము
కావున నే నీయకార్య మొనరింపను.

శకా—చంపవఁటరా! (అని పెక్కుభంగులఁ దన్నుచున్నాఁడు.)

స్థావ—భట్టారకా! తన్నుము చంపుము. నే నకార్యముఁ మాత్రము చేయఁజాలను.

గీ. తొల్లినా యొనరించిన దుష్కృతంబు
గర్భదాసునిఁగావించెఁ గాదె నన్ను
నీభవంబున నైత మల్లే యొనర్చి
యేమికాఁబోవువాఁడనో యింక నేను.

వసం—అయ్యా! శరణుఁజెందినదానను, రక్షింపుము.

విట—కాణేలీమాతృకా! సహింపుము సహింపుము. స్థావరకా! సెబాసు.

గీ. దళ తొలఁగి లేమి జెందియు దాస్యవృత్తి
నేయునీకంటె నధముండు నీయొడయుఁడు
ఏల చెందరు నాళ మీాద్భృశులు చెట్ట
నేయుచుందురు శుభకృతి సేయరెపుడు.

మఱియును.

గీ. నీకుఁ బ్రభుత దాస్యంబు వీనికి నొసంగి
నట్టి రంధ్రానుసారి కృతాంతుఁ డకట!
విషమబుద్ధినుమీ! నిన్ను వీని, వీని
నిన్నుగాఁ జేసికద వర్ణనీయుఁడగును.

శకా—(తనలో) యీాముసలినక్క యాధర్మమునకు జడియుచున్నాఁడు. ఈగర్భ
దాసుఁడు పరలోకమునకు భీతిలుచున్నాఁడు. నేను రాష్ట్రియస్యాలకుఁడను
పరపురుష మనుష్యుఁడను నాకేమి భయము (ప్రకాశముగా) ఓరిగర్భదాస
చేట! పోరా పామ్మురా! తలుపుబిగించుకొని గదిలోఁబూటి విశ్రమింపుమురా!

స్థావ—దేవర సెలవిచ్చినట్లే కావించెదను. (వసంతసేనను సమీపించి) వసంతసేనా!
నాశక్తియింతవరకే (నిష్క్రమించును.)

శకా—(నడికట్టుకట్టి) వసంతసేనా! నిన్ను చంపెదను నిలుచుండుము.

విట—ఓరీ దురాత్మర్గుఁడ! నాయెదుటనే చంపెదవురా? (కంఠము పట్టుకొనును.)

శకా—(భూమిపైపడుచున్నాఁడు) బావా! నన్నుఁజంపెదవా! (మోహమును జెంది
మూర్ఛతెలిసి)

గీ. పుట్టువాఁడగనీవు నాపెట్టినట్టి
నేతినంజుళ్ల పాలిచేతనే పెరిఁగియుఁ
దగినసమయంబు వచ్చిన తఱిని నాకుఁ
బ్రతిఘటించెదవా? బావ! వైరుఁడవగుచు,

(తనలో) కానీ నాకుపాయము దొరకినది. ఈవృద్ధసృగాలము తలయూఁచి నన్ను హెచ్చరించినాఁడు కావున వీనింబంపి వసంతసేనం గడతేర్చెదను. ఇట్లు గావింతును. (ప్రకాశముగా) బావా! మల్లక(ప్రమాణంబగు కులంబునం బొడమిన నేనుమాత్ర మకార్యము గావింతునా! దీనిని లోబఱచుకొనుట కట్లంటిని

విట- గీ. ఉత్తమకులంబుతోడఁ బ్రయోజనంబు
లేదు సచ్ఛీలమొకటి కల్గినను జాలు
మంచిక్షేత్రంబునందు జన్మించి కంట
కద్రుమంబులు నభివృద్ధిఁగాంచకున్నె.

శకా—బావా! ఈలంజె నీయెదుట సిగ్గుపడుచున్నది. నీవు పోయినఁగాని నామాట వినదు. పొమ్ము; స్థావరకుని దన్ని సాగదోలితిని. వరుగెత్తుచున్నాఁడు. వానిం దీసికొని మరల రమ్ము.

విట— (తనలో) గీ సిగ్గుపడెనేమొకో వసంతసేన నా స
మీపమున మూర్ఖు వీని గమింపఁబోదు
కాన నీప్రదేశము వివిక్తంబొనర్తు
మరుఁగుచోటే గదా కాముఁ డరుగుచోటు.

(ప్రకాశముగా) మంచిది. నేబోదును.

వసం—(విటుని యుత్తరీయము కొంగులాగి) అయ్యా! శరణంటిని గదా! దీనురాలైన నన్ను వదలుట న్యాయమా!

విటు—వసంతసేనా! భయపడకుము! (శకారునితో) కాణేలీమాతృకా! వసంత సేనను నీచేతుల నిడిపోవుచున్నానుసుమా! నీదే భారము.

శకా—నిజము. బావా! నాచేతి కప్పగించితివి.

విటు—నిజమేనా?

శకా—నిజము

విటు—(కొన్నియడుగులు నడిచి) ఈనృశంసుఁడు నే నావలకుఁ బోయినవెనుక నిది యంగీకరింపనిచోఁ జంపునేమో! కావునఁ జాటునుండి వీఁడు చేయఁదలఁచిన పనిఁ జూచెదను. (అని మరుఁగున నిలుచును.)

శకా—కానీ! దీనిం జంపెదను. ఈకపటబ్రాహ్మణుఁడు, ముసలినక్క చాటున నుండునేమో! పోయి నక్కజిత్తులు చేయఁగలఁడు. వీనిని మోసపుచ్చుటకై యిట్లు చేసెదను. (పువ్వులుకోసి తన్నలంకరించుకొని) బాలా! బాలా! వసంతసేన! యిటురమ్ము.

విటు— వీఁడు కాముకుఁడైనాఁడు. ఇఁకనకార్యము జరిగింపఁడు నేను పోవచ్చును.

(నిష్క్రమించును.)

శకా— గీ. పైఁడి యొసఁగుదు నేఁబ్రియభాషిణిగను
పాదములఁబడెదను దలపాగతోడ
సేవకుఁడ నాదుమనవిని జిత్తగింప
వునికిఁ, బురుషులు కష్టభాజనులుగారె!

వసం— సందేహమేమి ? రవంత సేపుశోభమూ. (తలవంచుకొని)

గీ. చాలు దుర్మార్గుఁడా ! దుష్టచరిత ! నన్ను
లోభపఱచెదవా ధనప్రాభవమునఁ
జారుదత్తుఁ ద్యజింపఁగాఁ జాలనేను
గమలమును నాఁడుతుమ్మెదకరణి నెపుడు.

గీ. కులము శీలంబుఁ గలవాని లలన లెందుఁ
గూడవలె వాఁడు శుద్ధరిక్తుఁడగుఁగాక
పానికొమ్మలు పైతము సదృశజనస
మాగమముఁ గోరఁగా వలదనునె మరుఁడు.

మఱియును సహకారవృక్షము నాశ్రయించినదానను బలాశవృక్షము నాశ్రయింతునా !

శకా— తొత్తుకూఁతుర ! దరిద్రచారుదత్తుఁడు సహకారవృక్షమా ! రాష్ట్రియస్యాలకుఁడు పలాశవృక్షమా ! కింశుకవృక్షమైనను గాఁడుగా ! నీవు నన్ను పరిభవించుచు దరిద్రచారుదత్తునే స్మరించుచున్నావా !

వసం— నేను స్మరింపనక్కఱలేదు, సర్వదా నాహృదయమంద యున్నాఁడు.

శకా— అటులేని నీహృదయమందున్నవాని నిన్నుఁగూడ రూపుమాపెదను జూడు. దరిద్రసార్థవాహకకాముకీ ! నిలునిలుము.

వసం— అనుమనుము. మరల ననుము. నీ నామహానుభావుని పేరెన్నిసారు లుచ్చరించినను నాకు సంతోషమే.

శకా— ఆదరిద్రుఁగొట్టు తొత్తుకొడుకువచ్చి యడ్డుపడునేమో చూత మిదిగో నిన్నుఁ జంపుచున్నవాఁడను.

వసం— నన్ను జూచినయేని రక్షించును.

శకా— లంజె ! మరల నిట్లా దరిద్రచారుదత్తునకై పలవించెదవు ?

గీ. ఆతఁడు దేవేంద్రుఁడో వాలినుతుఁడు స్వర్గ
పాలుఁడో రంభకొడుకైన కాలనేమి
ద్రోణినుతుఁడు జటాయువో ధుంధుమారుఁ
డో త్రిశంకువో చాణక్యుఁడో శివుండో.

కాక యీనుడివినవారందఱుఁ జనుదెంచి నిన్ను రక్షింపలేరు.

గీ. భారతయుగానఁ జాణక్యవీరుఁడెట్లు
చంపెనో సీతను, జటాయు వంపగముల
ద్రుపదపుత్రిక నేరీతిఁ ద్రుంచినాఁడొ
నేఁడు గడతేర్తు నట్లనే నిన్ను నేను. (తన్నుఁబోవుచున్నాఁడు)

వసం — హాతల్లీ! యెచటనున్నావు? హాచారుదత్త! ఈనీప్రియవిటు యసంపూర్ణ మనోరథావస్థలోనే చచ్చిపోవుచున్నది. ఎలుఁగెత్తి యేడ్చెదను. ఛీ! వసంతసేన యెలుఁగెత్తి యేడ్చుచున్నదన సిగ్గుగాదా! ఆర్య చారుదత్త! నీకిదియే తుదినమస్కారము.

శకా — ఈగర్భదాసి యిప్పటికి నాపాపిచారుదత్తునే స్మరించుచున్నది. (మెడ నొక్కిపట్టుకొని) గర్భదాసీ! తలంపుము తలంపుము.

వసం — చారుదత్తా! నమస్కారము.

శకా — చావుము, గర్భదాసీ! చావుము. (అని మెడఁబిసుకును)

వసం — (మూర్ఛితురాలై నిశ్చేష్టురాలై క్రిందఁబడును)

శకా — (సంతోషముతో)

గీ. దోసముల కూఁత, మదినయావాసభూమి
కాలవశగత దుష్ట యీకాంత నన్య
రక్తఁ జంపి చూపితిని శూరత్వమిదిగో
చచ్చె భారతమున సీత చచ్చినట్లు.

గీ. మేము కామింప మున్మున్ఁగామింప దనెడు
కోపమునఁ జంపినారమీ కుటిలగణిక
నహహా పుష్పకరండకోద్యానమందు
మెడ నదిమిపట్టి యొకకంటఁ బడకయుండ.

గీ. ఇట్టినాదగు సాహసకృత్యమునకు
ద్రౌపదీదేవిఁ బోలు మాతల్లియేని

తండ్రియేనియు మఱి యన్నదమ్ము లేని
నెంతగా సంతసింతురో యిచటనున్న.

కానీ, ముసలి వఱదు వచ్చునేమో చాటున డాఁగెదను. (అని డాఁగును)

విటు—(చేటునితోఁ బ్రవేశించి) స్థావరకుని బ్రతిమాలి తీసికొనివచ్చితిని. ఈ కాణేలీపుత్రుఁ డెచటనున్నాఁడో చూచెదను. (పరిక్రమించి చూచి) దారికడ్డముగ నిచట చెట్టుగాలి యొకయాఁడుది మడసినది. ఓసి పాపిష్ఠుఁడా! ఎంతయకార్య మొనర్చితివే ఈహతస్త్రీవధముచే, నీతోపాటు మేమును పతితులమైతిమి. ఈయపశకునముచే వసంతసేన విషయమున నాహృదయము మారాటము చెందుచున్నది. సర్వవిధముల దేవత లామెకు శుభము గావింతురుగాక. (శకారుని సమీపించి) కాణేలీమాతృకా! వీఁడె స్థావరకుఁడు బతిమాలి తీసికొనివచ్చితిని.

శకా. బావా సుఖముగ వచ్చితివిగద! పుత్రకా! స్థావరక చేటుఁడ! నీకు స్వాగత మేకద!

స్థావ—దేవా! చిత్తము.

విటు—నే నింతసమయము నీచేతి కప్పగించితి నే, దానిని మరల నొప్పగింపుము.

శకా—నీవప్పగించిన దేది?

విటు—వసంతసేన.

శకా—పోయినది.

విటు—ఎక్కడికి?

శకా—నీవెన్వెంటనే పోయినది.

విటు—(సవితర్కముగ) నేను బోయినదెస కామె రాలేదే!

శకా—నీ వేదెసకుఁ బోయితివి?

విటు—తూర్పుదెసకు.

శకా—అది దక్షిణదిక్కునకుఁ బోయినది.

విటు—నేను దక్షిణదిక్కునకే యేగితిని.

శకా—అది ఉత్తరదిక్కునకుఁ బోయినది.

విటు—ఆకులపాటుతోఁ జెప్పుచుంటివి. నాయంతరాత్మకు నమ్మిక లేదు నిజము చెప్పుము.

శకా—బావా!. ఒట్టునుమీ, నీనెత్తిమీఁద నాకాళ్లు పెట్టినట్లే. నీపాదమ్ముల పదిలపఱచుము, దానింజంపితిని,

విటు—(దుఃఖముతో) నిజముగాఁ జంపితివా ?

శకా—నామాటయందు నమ్మకము లేదేని పద రాష్ట్రియశ్యాలకసంస్థానకుని శూరత్వమును గనుఁగొందువు (పడియున్న వసంతసేనం జూపును.)

విటు—(చూచి) హాహా! ఎంతనిర్భాగ్యుఁడను. (అనిమూర్ఛపోవును)

శకా—హీహీహీ! బావయుం జచ్చెనా యేమి ?

స్థావ—ఆర్యా! విచారింపకుము చూడకుండ బండితోలుకొని వచ్చిన నేనే వసంతసేనను జంపినవాఁడనైతిని.

విటు—(మూర్ఛ తెలిసి) హావసంతసేనా! వసంతసేన!

సీ. దాక్షిణ్యజలమున దరులు ముంచుచుఁ బాఱు పొడుపుటేరా! యెండిపోతివయయొ
తవలోకమత్యజించి చనుదెంచినరతీపతీ! పోతివటవె స్వదేశమునకు
నడుగంటిపోతివా యకట సౌభాగ్యరత్నాకరమా! మన్మథాపణంబ!
చిఱునవ్వుసుధతిన్నె చెన్నుఁ గైకొన్న సౌజన్యనదీ! పూర్ణచంద్రవదన!

గీ. నగలు మెయినిండఁబూని మందగతిమీఱ
నొలుకుశింగారమునఁ బేర్మిచిలుక నీవు
నడచి యేతెంచు టింకఁగన్పడకయుండఁ
జేసెనే మాలపెనువేల్పు చెద్దయకట

(కన్నీరుఁదుడుచుకొనుచు) హాహా! ఎంతకష్ట మెంతకష్టము!

గీ. పాపకల్పంబు వీఁడు నిర్భాగ్యుఁడకట
పాపమింతేని నెఱుఁగక పట్టనమున
కెల్లమండన మగునిన్ను నేపుమాపె
వీని కేమెగ్గు నీవు గావించినావొ.

(తనలో) ఈపాపాత్ముఁ డీయకార్యమును నామీఁదికిఁ ద్రోయఁగలఁడు. కావున నిట నుండి పోయెదను. (పోవుచున్నాఁడు)

శకా—(వెళ్లనీకుండఁ బట్టుకొనును)

విటు—ఓరీపాపాత్మ! నన్ను ముట్టకుము! నీజోలి నాకింకవలదు. నన్నుబోనిమ్ము.

శకా—ఓసీ! వసంతసేనను నీవు చంపి నామీఁద నారోపణమారోపించి నన్ను దిక్కుమాలినవానింజేసి యెక్కడికిఁ బోయెదవురా ?

విటు—ఛీ పొమ్ము. చావుము.

శకా— గీ. కాను లిచ్చెద నీకు బంగార మిచ్చు
వాఁడ వందలకొలఁది నావాఁడవగుము

లంకలోపలి ప్రాకారలంఘనంబుఁ
జేయుఁగతి గోడదాఁటెదఁ జిత్రముగను. (నిష్క్రమించును.)

భిక్షు — (అపటీక్షేపముగాఁ బ్రవేశించి) ఈకాషాయవస్త్ర ముతికికొంటిని గదా. ఇది చెట్టుకొమ్మ కాఱఁగట్టుకొందునా! చెట్టుకొమ్మకుఁగట్టుకొన్న దుష్టవానరములు చింపి చీలికలు చేయునేమో! నేలఁబఱచిన దుమ్ముపడి మాసిపోవును. నాకు గుడ్డయెండఁగట్టుకొనుటకుఁ దావే కన్పడకున్నది. కానిమ్ము. (చూచి) ఇదిగో గాలిచేఁ బ్రోగు చేయఁబడిన పండుటాకులున్నవి. ఇంగాఁబఱచెదను. (అట్లుచేసి) బుద్ధదేవా! నమస్కారము. (కూరుచుండి) ధర్మాక్షరములు పారాయణము చేయుదునా! (అంకారంభమందలి పద్యములుచదువును) అయినను నాకేటికీసుగతి? బుద్ధోపాసకురాలగు వసంతసేనకుఁ బ్రత్యుపకారము గావించినంజాలు, నాకదియే స్వర్గము. నాఁడు జూదరులు నన్ను బాధింపం బదినాణెము లిచ్చి నన్ను విడిపించిన దామెయేకదా! నాయాత్మ యామెకు నాఁడే యమ్మఁబడినది. (చూచి) ఈయాకులగుంపులో నేదియో యూర్పుచ్చుచున్నట్లున్నదే. ఆకులు కదులుచున్నవి నిశ్వాసముకాదేమో!

ఆ. గాలికొండకాఱి కదలుచుఁ గదలుచుఁ జీవరోదకంబుచేతఁ దడిసి
యాకులివి ప్రసారితాండజపక్షచ్ఛదాళివోలెఁ గదలి చూడఁబోలు.

వసం — (కొంత మూర్ఛ తెలిసి చేయి సాచుచున్నది)

భిక్షు — హాహా! శుద్ధాలంకారభూషితంబగు స్త్రీహస్తము బయటికి వచ్చుచున్నది. ఇదిగో రెండవచేయికూడ! ఈచేతులెవరివో గుర్తించెదను. (చూచి) గుర్తింపనక్కఱలేదు. ఏచేతులు నాకభయమిచ్చినవో యాచేతులే యివి. కానీ! చూచెదను. (ఆకుగుంపుతొలఁగించి చూచి గుర్తించి) ఈమె ఆ బుద్ధోపాసకురాలే!

వసం — (భిక్షువునుజూచి నీళ్ళిమ్మని సన్న చేయుచున్నది.)

భిక్షు — పాప మీమె నీరిమ్మని యాచించుచున్నది. దిగుడుబావి దూరముగానున్నది. ఏమిచేయుదును. కానీ! ఈకాషాయార్ద్రవస్త్రమును మీఁదఁగప్పెదను. (అని అట్లుచేయును.)

(వసంతసేన తెలివితెచ్చుకొని లేచుచున్నది సన్న్యాసిపటాంతము చేవిసరుచున్నాడు)

వసం — ఆర్యా! నీవెవ్వఁడవు.

భిక్షు — అమ్మా! నన్ను మఱచితివా! నాఁడుపదిసువర్ణము లిచ్చి నన్ను విడిపించుకొన్న బుద్ధోపాసికవుకావా నీవు.

వసం—మఱవలేదు. కాని యార్యుఁడు వచించినది సరికాదు. నేను చచ్చిపోయిన బాగుండెడిదికదా.

భిక్షు—బుద్ధోపాసికా! ఏమి యీ మాపద యేల వచ్చినది ?

వసం—(నిర్వేదముతో) ఇది వేశ్యాజన్మమునకుం దగినదే కదా.

భిక్షు—అమ్మా! యీచెట్టునవ్రేలాడుతీవ పట్టుకొనిలెమ్ము. (అని తీఁగె చేతికందిచ్చుచున్నాఁడు.)

(వసంతసేన పట్టుకొని లేచుచున్నది.)

భిక్షు—ఇచటికి దగ్గఱనున్న విహారమున నాధర్మభగిని బౌద్ధసన్న్యాసిని యున్నది. ఆమెచే వసంతసేన పునహరింపఁబడి యాయాసము పోయిన పిదప నీయింటికి నీవు పోదువుగాక. రమ్ము అల్లనల్లన నడచిరమ్ము. (పరిక్రమించి చూచి) అయ్యలారా! తొలఁగుఁడు, దారినిండు. ఈమె వయసులోనున్న స్త్రీ, నేను సన్న్యాసిని; అయ్యు నాకిదియే పరిశుద్ధమైన ధర్మము.

కం. కలుకుల నేఁతల నేమముగల నిగృహీతేంద్రియునకుఁ గరగతమౌ పే
ల్పులలోకమనఁగ భూమీశుల శాసనభీతి నతఁడు సుక్రిక్కుంబడునే.

(అని నిష్క్రమించుచున్నారు.)

ఇది...శ్రీతిరుపతివేంకటేశ్వరాంధ్రీకృతంబగు నాంధ్రమృచ్ఛకటికంబు నందు వసంతసేనామోడనమను నష్టమాంకము.



శ్రీరస్తు.

# మృచ్ఛకటికము

## నవమాంకము

(పిదప శోధనకుఁడు ప్రవేశించును.)

శోధ — అధికరణాధికారులచే "ఓరీ! శోధనక! వ్యవహారమండపములోని యాసనము లన్నియు సిద్ధపఱుపు" మని నియోగింపఁబడితిని గావున నధికరణమండపము బాగుచేయుటకై వెళ్ళుచున్నాను. (పరిక్రమించి) ఇదిగో! అధికరణమండపము, ప్రవేశించుచున్నాను. (ప్రవేశించి బాగుచేసి యాసనములన్నియు వాయత్తపఱచి) అధికరణమండపమంతయు వివిక్తముగా వించితిని. ఆసనము లన్నియు సిద్ధపఱచితిని. ఈవృత్తాంత మధికరణికులకుఁ దెలుపువాఁడను. (పరిక్రమించి యెదుటఁజూచి) వీఁడె రాష్ట్రియస్యాలకుఁడు, దుష్టజన మనుష్యుఁడు వచ్చుచున్నాఁడు. వీనియెదుటఁ బడఁగూడదు. చాటుగాఁబోయె దను. (అని యేకాంతస్థలమున డాఁగుచున్నాఁడు)

(పిదప నుజ్జ్వలవేషధారియై శకారుఁడు ప్రవేశించుచున్నాఁడు)

శకా — గీ. సలిల జల నీరములచేత జలకమాడి
సువిహితంబగు నంగకశోభతోడ
స్త్రీలు యువతులు తరుణులు తివిరికొలువ
నుపవనోద్యానములఁ గూరుచుంటి నహహా.

గీ. క్షణము ముడి, చూలిక క్షణమ్ము, క్షణము జాఱు
దలయు, క్షణ మూర్ధ్వచూడంబు దనరునటుల
వాలకుంతలములు కూర్చువాఁడ, రాజ
స్యాలకుఁడఁ జిత్రచిత్రపుఁ జర్యవాఁడ.

కుటీయును విషగ్రంథి గర్భప్రవిష్టంబగు కీటకమువలెఁ దగిన యంతరము వెదకొని బయటఁబడితిని. ఇప్పుడీ కుట్ట యెవనితలపైఁ ద్రోయుదును? (ఆలోచించి) ఆఁ! స్మృతికివచ్చినది. దరిద్రచారుదత్తుని మీఁదనే త్రోసెదను. ఇంకొకటి, వాఁడు దరిద్రుఁడు కావున వాఁడీ పని చేసియుండునని అందఱు నమ్మెదరు. కానీ! అధికరణమండపములోనికింబోయి చారుదత్తుఁడు వసంతసేనను బలాత్కారముగా గొంతు పిసికి చంపినాఁడని వ్యవహారపత్రము నేనే ముందొసంగెదను. కావున నధికరణమండపముఁ జొచ్చెదను. (పరిక్రమించి చూచి) ఇదే అధికరణమండపము. ఇందుఁబ్ర

వేశించెదను. ఆసనములన్నియు సాయత్తపఱచితి. అధికరణ భోజకులు చనుదెంచు దనుక ఈద్వారాభ్యంతరమునందుండి పరిశీలించెదను. (అట్లు చేయుచున్నాఁడు.)

శోధ—(మఱియొక వంకనుండి వచ్చిచూచి) అధికరణికు లందఱుఁ జనుదెంచుచున్నారు. నేను సమీపించెదను (సమీపించుచున్నాఁడు.)

(పిదప శ్రేష్ఠికాయస్థాది పరివారముతో నధికరణికుఁడు ప్రవేశించును.)

అధిక—ఓ శ్రేష్ఠికాయస్థులారా!

శ్రేష్ఠికాయస్థులు—అయ్యా యేమి సెలవు.

అధిక—వ్యవహారము పరాధీనము కావున నధికరణికు లొరులచిత్తము గ్రహించుట దుష్కరము కదా! న్యాయమార్గములకు ప్రచ్ఛన్నకార్యములను అధికరణమునకుఁ గొనివచ్చు పురుషులు స్వప్రయోజనపరులై యిచటఁదమ దోషములు కప్పిపుచ్చుచుందురు. ఉభయపక్షములును దమతమ దోషములనట్లు కప్పిపుచ్చి పరదోషోద్ఘాటనమొనర్చి వాదించుటచే న్యాయపరిశీలనము దుష్కరమై రాజునకుఁ బాపమును, మాకు నిందయు సులభముగా సిద్ధించును. గుణగ్రాహులెచ్చుటనో కాని యుండదుకదా. కావున శాస్త్రజ్ఞుఁడు, కాపట్యగ్రహణకుశలుఁడు, వక్త, అక్రోధనుఁడు, స్వపరభేదరహితుఁడునై, ముందుగనే కార్యనిశ్చయ మొనర్పక, సధర్ముఁడు లోభదూరుఁడునై, దుర్బలులకు నండయై, శఠులకు గుండె తల్లడమై, సత్యబద్ధహృదయుఁడై, రాజభీతి లేనివాఁడే అధికరణికుఁడై యుండఁదగును.

శ్రేష్ఠికాయస్థులు—తమగుణములయందుఁగూడ దోషమారోపించువారు వెన్నెలలో చీఁకటి నారోపించువారే..

అధికర—శోధనకా! అధికరణమండపము లోనికి దారిచేయుము.

శోధ—అయ్యా! ఇటు దయచేయుఁడు. అధికరణ మంటపమిదే.

(అందఱును మండపము ప్రవేశింతురు.)

అధికర—శోధనకా! బైటకుఁబోయి వ్యవహారమునకు వచ్చినవారినందఱం బిలువుము.

శోధ—చిత్తము. (బైటకుఁబోయి) కార్యార్థులెవ్వరో తమతమ కార్యములను మనవి చేసికొనుఁడు (అనిపిలుచును.)

శకా—(సంతసముతో) అధికరణికులు వచ్చిరి (సాటోపముగాఁ బరిక్రమించి) వరపురుషుఁడను మనుష్యుఁడను వాసుదేవుఁడను రాష్ట్రియశ్యాలుఁడను రాజశ్యాలకుఁడను నేనే కార్యార్థిని.

శోధ— (సంభ్రమముతో) మొదటనే యీ రాజస్యాలకుని కార్యము నివేదించుటా! కానీ, ఆర్య! ముహూర్తమాఁగుము. అధికరణికులతో నివేదించివత్తును. (లోనికింబోయి) అయ్యా! రాష్ట్రియస్యాలకుఁడు కార్యార్థియై ద్వారమందున్నాఁడు.

అధికర—మొదటనే రాష్ట్రియస్యాలకుని వ్యవహారమా! సూర్యోదయమునందలి యుపరాగమువలె నేఁడియొక మహోపద్రవమునకు నిమిత్తమైయుండవచ్చును. శోధనక, నేఁడువ్యవహారములు వ్యాకులత గూర్చునని తెలంచెదను. పోయి వానితో "నేఁడు నీవ్యవహారము చూడరు పో" మ్మని చెప్పుము

శోధ-(పోయి) అయ్యా, శకార! నీవ్యవహారము నేఁడు కాదు పొమ్మని అధికరణికు లానతిచ్చుచున్నారు.

శకా—(క్రోధముతో) ఏమీ నావ్యవహారము వినరా! నావ్యవహారము లేకేని మా యావుత్తుఁడు భగినీపతి పాలకమహారాజుతో విన్నవించి, మాయప్పతోడను మాయమ్మతోడను జెప్పి యీయధికరణికుని యుద్యోగ మూడఁదీయించి యింకొకని నిందుఁబ్రవేశ పెట్టించెదనని చెప్పుము. (అనివెళ్లఁబోవుచున్నాఁడు)

శోధ—అయ్యా! ముహూర్తమాఁగుము; నేనుపోయి యధికరణికులతో విన్నవించెదను. (పోయి) అయ్యా వానికిఁ గోపమువచ్చినది. (అని శకారుఁడన్న మాటలన్నియుఁ జెప్పును.)

అధిక— ఈమూర్ఖుఁడేమి చేసినఁ జేయఁగలఁడు. శోధనకా! రమ్మనుము.

శోధన—అయ్యా! రమ్మని, నీవ్యవహారము విచారించెద మనుచున్నారు.

శకార—మొదట నీకు వ్యవహారము లేదనియుఁ దరువాత కలదనియు నీయధికరణికుఁడనుచున్నాఁడు. వాఁడు భయపడినట్లేయున్నాఁడు. కావున నేనుజెప్పినదెల్ల నమ్మును. కానీ! లోనికిం బోయెదను. (ప్రవేశించి) మీకు సుఖము, మాకును సుఖము. పోనీ సుఖము మీకేల? మాకే సుఖము.

అధిక—(శకారుంజూచి తనలో) ఏమీ వ్యవహారార్థియైవచ్చిన వీనికీపొగరుపోతుతనము (ప్రకాశముగా) కూర్చుండుము.

శకా—ఈభూమియంతయు నాదియే! నాయిచ్చవచ్చినచోటఁగూర్చుండెదను (శ్రేష్ఠితో) ఇచటఁగూర్చుండునా (శోధనకునితో) ఇచటఁగూర్చుండునా (అని పలుచోట్ల గూర్చుండి లేచి అధికరణికుని నెత్తిమీఁదఁ జేయిపెట్టి) ఇచటఁ గూర్చుండును (అని భూమిమీఁదఁ జతికిలఁబడును)

అధి—నీవా కార్యార్థివి?

శకా—నేనే కార్యార్థిని.

అధి—ఆకార్యమేదియో నుడువుము ?

శకా—రహస్యముగాఁ జెవిలోఁ జెప్పెదను. నేను మల్లకప్రమాణంబగు పెద్దకులమున జన్మించినవాఁడను.

గీ. భూమిజానికి నాతండ్రి మామగారు
వాడు తండ్రి కల్గుండు భూనాయకుండు
బావమఱఁదిని నేను భూపాలకునకు
భూమిపతి భర్త నాతోడఁబుట్టువునకు.

అధి—సర్వము యథార్థమే. (ఉత్తమకులంబు అను పద్యమును చదువును.) కార్యమేదియో నుడువుము.

శకా—ఇదిగోఁ జెప్పుచున్నాను. నాయందుఁ దప్పున్నను నన్నేమియుఁ జేయరుగదా! మద్భగినీపతియగు రాజు నాకుఁ గ్రీడించుకొఁటకును రక్షించుకొఁటకును సర్వోద్యానములకు శిరోభూషణమగు పుష్పకరండక జీర్ణోద్యానమునొసంగె. నేను ప్రతిదిన మాయుద్యానములోనికిఁ జూచుటకు నెండఁబెట్టుటకు దుదుచుటకుఁ బువ్వులుకోయుటకుఁ జిన్నర్క్షు త్రుంపుటకుఁ బోవుచుందును. దైవయోగంబున నాకొక స్త్రీశవముచట గన్పించినది.- లేదు కన్పించలేదు.

అధికరణి—అచచ్చిపోయిన స్త్రీ యెవరో నీవెఱుఁగుదువుగదా !

శకా—అధికరణభోజకులారా ! ఈపట్టణమునకంతకు నలంకారమగునదియు వేల కొలఁది బంగారునగలు కలదియు నగు నాస్త్రీని నేనెఱుఁగనా ! వసంతసేనను డబ్బుకొఱకు కొకదుర్మార్గుఁడు నాపుష్పకరండకజీర్ణోద్యానమున నొంటరిగ మెడపిసికి చంపినాఁడు. నేను కాను- (అర్ధోక్తిలో నోరుమూసికొనును.)

అధి—ఆహా ! తలారుల యజాగ్రత్త ! శ్రేష్ఠికాయస్థులారా ! వ్యవహారమున కుపయోగించునది "నేను కాను" అను పదము ముందు వ్రాసికొనుఁడు.

కాయస్థు—చిత్తము (ఆమాటవ్రాసి) అయ్యా వ్రాసినాము.

శకా—(తనలో) తొందరపడి వేడిపాయసము మ్రింగిన వానివలె నాకే యాపదప్రమముఁ దెచ్చిపెట్టుకొన్నాను. కానీ ఇట్లుచేసెదను (ప్రకాశముగా) అయ్యా అధికరణభోజకులార ! పెద్దకోలాహలము చేసెదరేమి. దానిని నేనే చూచితినంటిని. ఆమాట వ్రాసికొనుఁడు. (యింతకుమున్ను వ్రాసినది కాలితోఁ దుడిచివేయుచున్నాఁడు)

అధి—దరిద్ర్యము కొఱకు బాహుపాశమునఁ జంపిరని నీకెట్లు తెలిసినది ?

శకా—మెడవాచినది, ఆభరణస్థానములన్నియు శూన్యములై యున్నవి.

శ్రేష్ఠికాయ—ఈమాట లెస్సగనే యున్నది.

శకా—(తనలో) అమ్మయ్యా ! బ్రతికితిని.

శ్రేష్ఠి—ఈవ్యవహారము ఎవని నవలంబించినది ?

అధి—ఇక్కడ వ్యవహారము రెండువిధములు.

శ్రేష్ఠికాయ—అవి యేవి ?

అధి—వాక్యానుసారమని, అర్థానుసారమని. మొదటిది వాది ప్రతివాదుల వాదము నవలంబించినది, రెండవది యధికరణికుని బుద్ధి నవలంబించినది.

శ్రే-కా—అటులైన నీవ్యవహారము వసంతసేన తల్లి నవలంబించుచున్నది.

అధి—అవును. శోధనకా ! వసంతసేన తల్లిని భయపెట్టకుండఁ దీసికొనిరమ్ము.

శోధన—(పోయి ముసలిదానితోఁ బ్రవేశించి) అమ్మా ! అటునడువుము.

వృద్ధ—(తనలో) నాకూఁతురు యౌవనసుఖ మనుభవించుటకు మిత్రగృహమునకుం జనియె, వింకను రాలేదు. ఈదీర్ఘాయుష్మంతుఁడధికారులు పిలుచుచున్నారు రమ్మ రమ్మని పిలుచుచున్నాఁడు. దైవమా ! యేమి యుపద్రవమోగదా ! నామది మోహపరవశమగుచున్నది గుండె లదరుచున్నవి ( ప్రకాశము ) నాయనా! అధికరణ మంటపమునకు దారి చూపింపుము ?

శోధ—ఇటు రమ్మిటురమ్ము (యిరువురు ప్రవేశింతురు)

వృద్ధ—(సమీపించి) అయ్యలారా ! మీకు సుఖమగుం గాత.

అధి—స్వాగతమా ! అందుఁ గూర్చుండుము.

వృద్ధ—మంచిది (అని కూర్చుండును)

శకా—(ఆక్షేపముగా) వచ్చితివా? ముసలిలంజె! వచ్చితివా?

అధి—వసంతసేన తల్లివా నీవు?

వృద్ధ—అవును.

అధి—ఇప్పుడు మీవసంతసేన యెచటికి వెళ్ళినది.

వృద్ధ—మిత్రునింటికిఁ జనియెను.

అధి—ఆమిత్రుని పేరేమి?

వృద్ధ-(తనలో) అబ్బబ్బా! ఈవిషయమతి లజ్జనీయముకదా! (ప్రకాశముగ) ఈ ఘాష్టి నితరులవలెఁ దఱుకంటి ప్రభువు లడుగఁదగినదికాదు.

అధి—సిగ్గేల ? వ్యవహార మడుగుచున్నది.

శ్రేష్ఠి-కా—వ్యవహారమడుగుచున్నది, దోసములేదు. సిగ్గుపడక చెప్పుము.

వృద్ధ—ఇది వ్యవహారమా ! అటులేని వినుఁడు. అతఁడు సార్థవాహవినయదత్తుని మనుమఁడు. సాగరదత్తుని కొడుకు సుగృహీతనామధేయుఁడు చారుదత్తభట్టారకుఁడు. కోమటివాడలోఁ గాఁపురమున్నాఁడు. అతనితో నాకుఁ జతురయౌవనసుఖ మనుభవించుచున్నది.

శకా—అధికారులు! వింటిరా? యీమాటలు తప్పకవ్రాసికొనుఁడు. ఆచారుదత్తునితోనే నాకు వివాదము.

శ్రేష్ఠికాయ—చారుదత్తుఁడు మిత్రుఁడనుచున్న దిందు దోసమే మున్నది.

అధి—ఈవ్యవహారమంతయుఁ జారుదత్తు నవలంబించి యున్నది.

శ్రే-కా—అవును. అట్లే కన్పించుచున్నది.

అధి—ధనదత్తా ! వసంతసేన చారుదత్తునింటికి వెళ్లినది. అనివ్రాసికొనుము. ఇదియే వ్యవహారమునకు మొదటిపాదము. ఆర్యచారుదత్తునిఁగూడఁ బిలిపింపవలయును గా ! వ్యవహారముకడా పిలిపింపక తప్పదు. శోధనక ! నీవుపోయి చారుదత్తునిఁ దొందరపెట్టకుండ భయపెట్టకుండ సాదరముగా స్వేచ్ఛగాఁ దీసికొనిరమ్ము. ఎందులకో అధికరణికులు మిమ్ముఁజూడఁగోరుచున్నారని చెప్పి తోడ్కొనిరమ్ము.

శోధ—చిత్తము (పోయి చారుదత్తునితోఁ బ్రవేశించి) ఆర్యా ! ఇటురమ్మిటురమ్ము

చారు—(ఆలోచించి)

గీ. నాకులము నానువృత్తము నానడవడి
యెఱిఁగియుండియు రాజు నన్నేలపిలుచు
నీయకాలసమాహ్వాతి నాయవస్థ
కేదియో వైపరీత్య మూహింపఁజేయు.

(సవితర్కముగాఁదనలో)

క. సంకెల్లు ద్రెంచుకొని నిశ్శంకం బరుగిడిన గోవళాబకు శకటీ
సంకలితుం జేసితినని కంకోష్ఠులు చాఁడి చెప్పఁగా వినెనేమో.

ఏల యీవిచారము. అధికరణమండపములోనికే పోవుచున్నానుగదా ! శోధనకా. మండపములోనికిం దారిచూపుమురా !

శోధ—అయ్యా యిటురం డిటురండు (ఇరువురును బరిక్రమింతురు)

చారు—(సందియముతో) ఇఁకేమున్నది !

గీ. కాకమఱవఁగఁదొడఁగె రూక్షస్వరముగఁ
బిలుచుచున్నారు నను మంత్రిభృత్యులెల్ల
నదరుచున్నది వామనయనముఁగూడ
దుశ్శకునముల డెంద మాందోళపడియె.

శోధ — అయ్యా దయచేయుము.

చారు — (పరిక్రమించి ముందుఁజూచి)

గీ. ఎండుమ్రానుపయిం గూరుచుండి కాకి
యెఱుపదొరకొని నెడమక న్నురిమిచూచెఁ
గాఁదలఁచియున్న దేదియో కఠినమైన
యాపదయటంచు నాడెంద మదలుచుండె.

చ. అదె! నడిత్రోవ నంజననిభాసితమై తను పుబ్బ చుట్టలై
పొదలఁగఁ గూర్కుచెందు ఫణి బుస్సుమటంచును లేచి గాంచుచు
న్నది నను రూక్షవీక్షణభయంకరమై, నిడునాల్క సాచుచు
న్నది, వికవిమ్ములైన రదనమ్ములు నాలుగు గానుపింపఁగన్.

శోధ — తొందరపడకుండ దయచేయుండు.

చారు — (నలుప్రక్కలుం జూచి) ఇంతియకాదు.

గీ. కర్దమము లేనిపుడమిపైఁ గాలుజాఱు
చుండెఁ, గంపించుచుండె వామోరునయన
భుజము, లఱచుచున్నవి పులుఁగు లకట
ఘోరతరమైనకీడు నాకుం ఘటించు.

సర్వవిధముల నాకులదేవతయే నాకు శుభ మొనరించుంగాత!

శోధన — అయ్యా! రమ్ము రమ్ము. ఇదె యధికరణమండపము ప్రవేశించుము.

చారు — (ప్రవేశించి నాలుగుప్రక్కలు గలయంజూచి) ఔరా! ఈయధికరణమండప మెంతచక్కఁగా నున్నది. ఇచట—

సీ. చింతానిమగ్నసచివలంఘుసలిలంబు దూతోర్మిజాలశంఖాకరంబు
సవిధస్థితానేకచరనక్రమకరంబు నైకనాగాశ్వహింస్రకులంబు
ప్రచురవాకకకంకపత్రిపక్షికులంబు కాయస్థకాకోదరాయతంబు
నీతిశాసనపద్ధభూతోద్భయతటంబు కమలాక్షరూపాధికారిపీత

గీ. మైనయీసభచూడ క్షీరాబ్ధిమాద్రిఁ
దోఁచె నావామోరుభుజము లదుర్వఁదొడంగు

టరయును సర్పంబు కన్పడుటయును జూడ
స్వస్తియస్వస్తియును నాకు సంభవించు.

కానీ (ప్రవేశించుచు గుమ్మముతలకుఁ దగులుట యభినయించి) మరల నిది యొకటి. (ప్రవేశించును)

అధిక—(తనలో) ఇతఁడా చారుదత్తుఁడు !

ఉ. ఉన్నత మైనవాసయు సమున్నతచారువిలోచనంబులు
న్నున్నగులక్షణంబులు కనుంగొని యీతఁడు దోషియంచు నే
నెన్నుట యెట్లు? గుజ్జములు నేన్గులు గోవులు మర్త్యు లెన్నఁడు
న్నన్నతలక్షణంబులు కనంబడియుండినఁ గావు దుష్టముల్.

చారు-అధికారులారా ! మీకుస్వస్తియగుంగాత! ఓనియుక్తులారా! మీకుఁ గుశలమా?

అధిక—(సంభ్రమముతో) ఆర్యా ! స్వాగతము. శోధనకా ! ఆర్యున కాసన మొకటి తీసికొని రమ్ము.

శోధ—(ఆసనముఁ దీసికొనివచ్చి)ఇదిగో నాసన, మార్యా! యిందుఁ గూర్చుండుము.

చారు—(కూర్చుండును.)

శకా—(క్రోధముతో) ఓరీ, స్త్రీఘాతుక ! వచ్చితివిరా ! వచ్చితివా ! ఈవ్యవహారమునం దేమిపరిశీలన ! యెంతటిధర్మము ! ఆహా ! స్త్రీఘాతుకున కాసన మిచ్చెదరా ! కానిండు కానిం డాసన మిండు.

అధిక—ఆర్య చారుదత్త ! ఈముసలిదాని కూఁతుతో నీకుఁ బ్రసక్తిగాని పరిణయము కాని ప్రీతికాని యున్నదా ?

చారు—ఏముసలిది ?

అధికర—ఈముసలిది (అని వసంతసేనతల్లిం జూపించును.)

చారు—(లేచి) ఆర్యురాలా ! అభివాదనము గావించుచున్నాను.

వృద్ధ—నాయనా ! చిరకాలము జీవించుము. (తనలో) ఇతఁడా ! ఆచారుదత్తుఁడు. ఆహా ! నాకూఁతురు తనయౌవన మితనియందు వినియోగించి సార్థక మొనర్చుకొన్నది.

అధి—అయ్యా ! నీకు లంజెసాని స్నేహితురాలు కలదా ?

చారు—(సిగ్గుపడును.)

శకా— గీ. జంకుచేతనో లేక లజ్జావశతనో
తనయసత్యప్రవర్తన దాఁచు నితఁడు

ధనముకొఱకీతఁడే చంపె దాని నిజము;
నమ్మకుండయ్య యీతని నడత మీరు.

శ్రేష్ఠికాయస్థ—ఆర్య చారుదత్త ! చెప్పుము సిగ్గేల, యిది వ్యవహారముకదా !

చారు—(సిగ్గుతో) ఓయధికృతులారా ! గణిక యొకతె నాకుమిత్రి మనుమాట నే నెట్లు నుడువుదును ! యౌవనకృతమగు గణికాసంగ్రహమువలనఁ జరిత్రకు లోపమా !

అధిక— గీ. విఘ్నములు రెండు వ్యవహారవిషయమందు
మదిఁ గలఁచుచున్న లజ్జయు వదలవలయు
వలదు జాలము తథ్యంబు పలుకవలయుఁ
గాక యనృతంబు గ్రహియింపలేకపోము.

సిగ్గు వదలుము, వ్యవహార మడుగుచున్నది గాని మేముకాదు.

చారు—అధికరణికా ! యెవ్వనితో నాకు వ్యవహారము ?

శకా—(సాటోపముగా) నాతోరా వ్యవహారము

చారు—నీతోడి వ్యవహారము నాకుఁ జాల దుస్సహమే.

శకా—ఓరీ స్త్రీఘాతుక ! అనేకరత్నమయభూషణంబులు దాల్చిన నిరుపమానసౌందర్యవతి యగు వసంతసేనం జంపి కపటకాపటికుఁడవై యిపుడు లేదని బొంకి చెప్పఁబోవుచుంటివా !

చారు.—నీవు కేవల మసంబద్ధప్రలాపివి.

అధిక—అయ్యా ! చారుదత్త ! నీకు వానితోనేమి. నిజము నుడువుము, నీకా సానితో స్నేహమున్నదా లేదా?

చారు—అవును ; ఉన్నది.

అధిక—అయ్యా ! వసంతసేన యిపుడెక్కడ నున్నది ?

చారు—ఇంటికేగినది.

శ్రేష్ఠికాయ—ఎట్లు వెళ్ళినది ? ఎప్పుడు వెళ్ళినది ? ఎవరితో వెళ్ళినది ?

చారు—(తనలో) ప్రచ్ఛన్నముగా వెళ్లినదని చెప్పుదునా !

శ్రేష్ఠి—అయ్యా త్వరగాఁ జెప్పుము

చారు—ఇంటికేగినది; యింకేమి చెప్పుదును.

శకా—నాపుష్పకరండకజీర్ణోద్యానమునకుం దీసికొని వచ్చి ద్రవ్యముకొఱకు మెడ పిసికి చంపి యింటికిఁ బోయినది నేనెఱుఁగ ననుచున్నావా !

చారు.—ఓరీ! అసంబద్ధప్రలాపీ!

ఆ. పాలపిట్టమీఁది పత్రింబువలె నిన్ను మించజేలరోరి మొగులు వాన
వన్నెతమాడు నీదువానవమ్మది హైమవాంబుజాతసదృశమయ్యెనదిగో.

అధిక—(జనాంతికముగా)

క. అదిప్రపటం గదలుచుట సముద్రము దాఁటుటయు ననిలముం బట్టుట యీ
భద్రుని మీఁదం దూషణము దిక్క వైచుటయుఁ దుర్లభము లని తలంతుక్.

(ప్రకాశముగా) ఇతఁడు చారుదత్తుఁడు కదా! ఇంతటియకార్య మాచరించునా! (అని "ఉన్నతమైన" అను పద్యమును జదువును.)

శకా—వ్యవహారంబునఁ బక్షపాత మగపడుచున్నది.

అధిక—ఛీ మూర్ఖా! అవలను లేచిపొమ్ము.

సీ. ప్రాకృతుఁడవు నిగమార్థముల్ తెల్పెద వేలొకో నీనాల్క వ్రీలకుండె
నడిమింటి వెలుఁగులయొడయుఁ జూడఁగ నెంతు వేలొకో నీదృష్టి మాలకుండెఁ
బావకజ్వాలలోపల నుంచఁజూచెద వేలొకో నీకేలు కాలకుండెఁ
జారుదత్తుచరిత్ర దూఱుచున్నాఁడ వీ వేలొకో దహియింప దీధరిత్రి

గీ. సలిలమాత్రావశిష్టంబుఁ జలిపె నెవని
యీఁగి వార్ధిని నర్థుల కిచ్చువేళ
నతఁడు గుణనిధి తుచ్ఛధనాశ నిట్టి
నీచకృతిసల్ప నొడిగట్టునే దురాత్మ!

వృద్ధ—ఓరీ చచ్చినవాఁడా! తనయొద్ద దాఁచినసువర్ణభాండమును దొంగ లెత్తుకొనిపోఁగా దానికై చతుస్సముద్రసారభూతం బగురత్నావళి యొసఁగిన మహాత్ముఁడు ధనమునకై కుకార్య మొనరించునా! చాలుఁజాలు నిట్టిపలుకులు పలుకకుము. హా బిడ్డా! హా వసంతసేన! (అని యేడ్చును)

అధిక—ఆర్య చారుదత్తా! ఆవసంతసేన మీయింటనుండి బండిమీఁదఁ బోయెనా లేక నడచిపోయెనా?

చారు—నేనుండఁగా వెళ్లలేదు; నడచి వెళ్ళెనో బండిమీఁదనో నేనెఱుఁగను.

వీరక—(కోపముతోఁ బ్రవేశించి)

గీ. చందనకుఁ డొర చేతితోఁ జఱచి నన్ను
కాలితోఁ దన్నె నన్నయాగ్రహముకతన
నంటికిం గూర్కురామి దీర్ఘమయినట్టి
యా నిశీథము తెలవాఱె నెట్లొ నాకు

ఈ యధికరణమండపములోనికిం బ్రవేశించెదను (ప్రవేశించి) ఆర్యమిశ్రులారా కుశలమా?

అధిక—తలారియగు వీరకుఁడా! వీరకా నీవు వచ్చిన కార్యమేమి?

వీరక—దేవరా! సంకెల లూడఁదీసికొని పాఱిపోయిన గోపాలదారకు నార్యకుని వెదకుచుఁ బోయి దారిలో నొక పెట్టెబండిం జూచితిమి. దానిలో పలికి దిగి చందనకుఁ "డిందార్యకుఁడు లేఁ" డనియు "నేను జూచితిని గావున నీవు చూడనక్కఱలే" దనియు వాదించెను, నేను జూడకమాననని బండి యెక్కఁబోఁగా నన్నుఁ గ్రిందికి లాగి పెద్ద మొద్దువంటి కాలితోఁ దన్నెను. పైన దేవరచిత్తము!

అధిక—ఓరీ ఆబండి యెవరిదో యెఱుఁగుదువా?

వీరక—ఈ చారుదత్తునిదే. వసంతసేనను బుష్పకరండకజీర్ణోద్యానమునకుం గొంపోవుచుంటి మని యాబండి త్రోలువాఁడు చెప్పెను.

శకా—అయ్యా! వింటిరా? నేనన్నమాటకే సరిపోయినది.

అధిక— గీ. తెలిపివెన్నెల కాయు చంద్రమునిఁ జేరు
చున్న దక్కట మ్రింగ రాహుగ్రహంబు
నిర్మలంబగుజల మొడ్డునేల విఱిగి
పడుటచేఁ గలుషంబు గాఁదొడఁగె నకట!

వీరకా! మీయిరువురితగ వావలఁ జూచుకొందము. అధికరణమండపద్వారంబునం గుఱ్ఱమున్నది; దాని నెక్కి పుష్పకరండకోద్యానమునకుం బోయి యచటఁ జచ్చిపోయిన యొకయాఁడు దున్నదో లేదో చూచి రమ్ము?

వీర—చిత్తము. (పోయి మరలఁ బ్రవేశించి) అయ్యా! చూచివచ్చితిని. స్త్రీకళేబర మందొకటి యున్నది. నక్కలచే నట్టిటు కొరలింపఁబడుచున్నది.

శ్రేష్ఠి—అది స్త్రీకళేబరమని నీవెట్లు గుర్తించితివి?

వీరక—నక్కలు తినఁగా మిగిలిన కరచరణాద్యవయవములచేతను నిడుపైన తల వెండ్రుకలచేతను గుర్తించితిని.

అధిక—అక్కటా! వ్యవహారమంతయు నెంతవిషమముగా వచ్చుచున్నదో!

గీ. వరుసఁ జర్చించినకొలంది వచ్చుచుండెఁ
జారుదత్తునిమీఁదికే సంకటంబు
మీఱరానిది యీవ్యవహారనీతి
బురదలోఁబడ్డ గోవయిపోయె బుద్ధి.

చారు—(తనలో)గీ. మొదటఁ గ్రొవ్విరికి విరాన మొదవునపుడు
భ్రమరములు వందలకొలంది వ్రాలునట్లు
వరున కాపద వచ్చినతరుణమంద
వందలకొలంది లోపముల్ వచ్చుచుండు.

అధిక—అయ్యా ! చారుదత్త ! సత్యము వక్కాణింపుము

చారు— గీ. కలుషితాత్మకుఁడును హంతుకామబుద్ధి
గుష్టరాగాంధుఁ డైన మర్త్యుం డనృతమె
సత్యమని చెప్పు జాతికోపంబువలనఁ,
జెవినిడక దాని విఁగులఁ జర్చింపవలయు.

అది యెట్లనగా —

గీ. పుష్పితంబగు లతనైనఁ బువులకొఱకు
వంచి కోయఁగ నే జాలిపడెడువాఁడ
భ్రమరపక్షంబులను బోలు ప్రమదకురులు
పట్టి చంపుదు నే యెట్లు పట్టిదాని !

శకా—ఓహోహో ! అధికరణభోజాలార ! మీరు వ్యవహారమునఁ బక్షపాతమే చూపించుచున్నారుగదా ! హంతానన కీచారుదత్తున కిప్పటికిని నాసన మేటికిఁ జెప్పుఁడు.

అధిక—శోధనకా ! యిటురమ్ము (అని పిలిచి వానిచెవిలో నేదియో చెప్పును.)

శోధ—(అధికరణికుఁడు చెప్పినట్లు చేయును.)

చారు—(ఆసనముమీఁదనుండి దిగి భూమిమీఁదఁ గూర్చుండి) అధికృతులారా ! పరిశీలింపుఁడు!

శకా—(సంతోసముతో గంతులువైచుచుఁ దనలో) హీహీ ! నేను జేసినపాతకము వీనినెత్తిమీఁదఁ బెట్టితిని. ఈచారుదత్తుఁడు విడిచిన యాసనమున నే కూర్చుందును (అట్లుచేసి) చారుదత్త ! నన్నుఁ జూడు చూడు. చంపితి నని చెప్పు చెప్పు.

చారు—("కలుషితాత్మకుఁడు" అనుపద్యముఁ జదివినతరువాతఁ దనలో)

గీ. ఏమియిది నాకు మైత్రేయ యిటులువచ్చె!
హా విమలవంశజాత బ్రాహ్మణి ! కుమార
కాంచవేమి నాయాపద ? కష్టమెట్టి
దో యెఱుఁగ కాడు నీమోద మిట్టులగునె !

శకటికనిమిత్తము రోహసేనునకు వసంతసేన యిచ్చిన నగలన్నియు మరల దాని కిచ్చివేయుమనియు దానివృత్తాంత మరసిరమ్మనియు మైత్రేయుం బంపితిని. అతఁడింకను రాలేదు. ఏలొకో తడపినాఁడు.

(పిదప నగలు మూటతో మైత్రేయుఁడు ప్రవేశించును)

విదూ—(తనలో) ఆర్యచారుదత్తుఁ డీనగలమూట యిచ్చి వసంతసేనయొద్దకుఁ బొమ్మని చెప్పి "మైత్రేయా! వసంతసేన రోహసేనుని మొదలునిండ నీనగ లలంకరించి తల్లియొద్దికిఁ బంపెనఁట. మనము వానిని గ్రహింపరాదు. కావున దాని నగలు మరల దానికిచ్చిరమ్ము" అని యానతిచ్చెఁ గదా! కావున వసంతసేనయొద్దకే పోయెదను (పరిక్రమించి వింటఁజెవియొగ్గి) భావ, రేభిలుఁడా! ఏమనుచున్నావు? ప్రియవయస్యుఁ డగు చారుదత్తుఁ డధికరణమండపము లోనికిం బిలువఁబడియె ననియా! (ఆలోచించి) యేదియో యల్పకార్యమైయుండదు. కానీ తరువాతనే వసంతసేనయింటి కేగెదను. ముం దధికరణమండపమున కేగెదను. (పరిక్రమించి యవలోకించి) ఇదె యధికరణమండపము, ప్రవేశించెదను (ప్రవేశించి) అధికరణభోజులారా! మా ప్రియవయస్యుఁ డెచ్చటనున్నాఁడు?

అధిక—అచ్చటఁ గూర్చుండెను.

విదూ—మిత్రమా నీకు స్వస్తి.

చారు—కాఁగలదు.

విదూ—వయస్యా, క్షేమమేకదా?

చారు—అదియుం గాఁగలదు.

విదూ—చెలికాఁడా! ఏల నుద్విగ్నుఁడవై యున్నావు? నీ వీయధికరణమండపము లోనికి రాఁగారణమేమి?

చారు—నెచ్చెలీ!

గీ. ఘాతుకుఁడవగుచుఁ బరలోకం బెఱుఁగక
ధనమునందాశ నేనొక్కవనిత— నకట!
వనిత నేకాదు, రతిదేవివంటిదాని—
నతఁడె నుడువును మిగత వృత్తాంత మెల్ల.

విదూ—ఏమేమి!

చారు—(చెవిలో నిట్లని చెప్పును)

విదూ— ఇటు లన్నవాఁడెవఁడు!

చారు—(సన్నచే శకారునిం గనఁబఱచుచు) ఈదీనుఁడు నిమిత్తముగా నాప్రతికూల విధియే యట్లు చెప్పుచున్నది.

విదూ— (జనాంతికముగా) వసంతసేన యింటి కేగెనని యేల చెప్పవైతివి ?

చారు—చెప్పితిని. చెప్పినను బ్రతికృతావస్థవలన వారు వినకున్నారు.

విదూ—ఆర్యులారా ! పేటలు కోటలు విహారము లారామములు దేవాలయములు తటాకములు యూపములు కూపములు మున్నగువానిచే నీయుజ్జయినీనగర మంతయు నలంకరించిన మహానుభావుఁడు చారుదత్తుఁడు దైవయోగమున దరిద్రుఁడే యగును గాక,- ధనమునకై యింతటి యకార్య మొనరించునా ! (కోపముతో) ఓరీ లంజకొడుక ! రాజస్యాలక ! సంస్థానక ! అడ్డు లేకుండ నరులందు లేనిపోనిదోసము లారోపించు దుర్మార్గుఁడ ! బంగారునగ లలంకరించుకొనిన మర్కటమా ! నాయెదుట నుడువుము. పుష్పించిన మాధవీలతను సైతము పల్లవచ్ఛేద మగునేమో యని వంచి పువ్వులు కోయని దయాళువు నాప్రియవయస్యుఁడు చారుదత్తుఁ డీయుభయలోక విరుద్ధమైన యకార్య మొనరించునఁట రా ! ఓరీ ! కారుపుఁగత్తెకొడుక ! నిలువుము రా నిలువుము. నీహృదయమువలెఁ గుటిలమగు నాదుడ్డుకఱ్ఱతో నీబుఱ్ఱ వేయి ముక్కలు గావించెదను.

శకా—(కోపముతో) ఆర్యమిత్రులారా ! వినుండు వినుండు. వ్యవహారము కాని వివాదముగాని చారుదత్తునకును నాకును గలదు; వడుగ వీఁడెవ్వఁడు ? కాకపదమువంటి తలసెత్తితో నగుచులాడుచు నీతల వేయిముక్కలు కావించెద నని వాఁగుచున్నాఁడు వలదురా తొత్తుకొడుక ! దుష్టబ్రహ్మచారీ ! వలదురా నీకింతపొగరు !

(విదూషకుఁడు దుడ్డుకఱ్ఱ యెత్తి ఓరీ కారుపుఁగత్తెకొడుక; అనునది చదువును. శకారుఁడు కోపముతోఁ దాడించును. విదూషకుఁడు మరలఁగొట్టును. ఇరువురకును ముష్టియుద్ధము జరుగుచుండ విదూషకుని చంకనుండి నగలమూట క్రిందఁబడును.)

శకా—(నగలుతీసి చూచుచు భయముతో) ఆర్యులారా ! చూచితిరా ! పాపము వసంతసేన నగలివిగో ! (చారుదత్తుని చూపుచు) ఈ పాడుసొమ్ము కొసమే యీతఁడు దాని గొంతుపిసికి చంపెను.

(అధికృతులందఱు నధోముఖులగుదురు.)

చారు—(జనాంతికముగా)

గీ. సంకటంబైన యిట్టి దుస్సమయమందు
నీ నగలమూట నీచెంత నిట్లుదొరక
నాదురదృష్ట మీరీతి నన్నుఁ గోతఁ
ద్రోయుచున్నది మాంద్యము ద్రోయఁగలదు.

విదూ—మిత్రమా! వీరితో యథార్థ మేలచెప్పవు?

చారు—మిత్రమా! మైత్రేయ!

గీ. దుర్బలంబైన నృపతికందోయి యీ ని
జంబుఁ బరిశీలనము సేయఁజాల దయ్యె
మనము మొఱపెట్టి నెవ్వఁడు వినును? తప్ప
దీకరణి దైన్యమరణంబు నాకు నేఁడు.

అధిక—అన్నా! యెంతకష్ట మెంతకష్టము!

గీ. ఔర! యంగారకవిరుద్ధుఁడయిన యమర
దేశికుని క్షీణదశయందు దివిని ధూమ
కేతు వుదయించినట్లుగా నీతఁడొకఁడు
వచ్చె నకట యమాయికబ్రహ్మచారి.

శ్రేష్ఠికా—(వసంతసేనతల్లితో) ముసలిదానా నీవవహితురాలవై యీనగల నవలో
కించి యివి నీకూఁతు నగలో కావో చెప్పఁగలవా!

వృద్ధ—(చూచి) ఇవి నాకూఁతునగలవంటివే కాని యవిమాత్రముకావు.

శకా—ఓసీ ముసలిలంజె! కన్నులచే నవునని నోటితో కావనుచున్నావా!

వృద్ధ—(చూచి) ఛీ ఛీ చచ్చినవాఁడా! లేచిపొమ్ము!

శ్రేష్ఠికాయ—బాగుగాఁ బరిశీలించి నుడువుము! అనగ లగునా కావా!

వృద్ధ—ఈనగలయందలి పనివాసితనము నాదృష్టి నాకర్షించుచున్నదే కాని యివి
యీనగలుకావు.

అధిక—భద్రురాలా! నీవానగలు గుర్తింపఁగలవా?

వృద్ధ—లేదు. నేనావానిం బట్టలేదు. అపనివాఁడే యీనగలుగూడఁ జేసి
యుండునేమో?

అధిక—శ్రేష్ఠీ

గీ. సదృశవస్తువు లుండవే జగతిఁ గృత్రి
మమ్ములగునగలందు రూపమ్ములందు

శిల్పివర్గంబు నగఁజూచి చేయఁగలరు
నగను దొల్లింటిదే యనఁదగినరీతి.

శ్రేష్ఠికాయ—ఈనగలు మీరు చారుదత్తునివే యందురా యేమి?

చారు—కావు కావు.

శ్రేష్ఠికాయ—మఱి యెవరివి?

చారు—ఈముసలియామె కూఁతువే.

శ్రేష్ఠికాయ—ఇవి యీమెవియోగము నెట్లుచెందినవి?

చారు—ఇట్లు చెందినవి (అనిచెప్పఁబూనుచుఁ దొందరపడును)

శ్రేష్ఠికాయ—అయ్యా! చారుదత్త! యిాకట్ల సత్యము నుడువవలయును.

గీ. సత్యమునయందు నిలిచెంబో సకలసుఖము
పాతకము రాదునుమి సత్యభాషణమున
సత్యమను నక్షరము లనశ్వరములగును
సత్య మనృతంబుచేత దాఁచంగవలదు.

చారు—నగలగొడవ యేమో నేనెఱుఁగను గాని యివిమాత్రము మాయింటినుండి తెచ్చినవే.

శకా—ఉద్యానముం బ్రవేశింపఁజేసి చంపినేఁడు కపటకాపటికుండ వైతేదనెవవా!

అధిక—ఆర్యచారుదత్త! యథార్థము చెప్పుము.

క. సుకుమార మైననీమే నకటా కర్కశములగుకశాఘాతము లో
ర్వక కూలు నిపుడు మాకాతంకములతోఁబాటు సత్యదూరుఁడవైనన్.

చారు—అధికరణభోజులారా! నామనవి యాలింపుఁడు.

గీ. పాప మెఱుఁగనియింట సంభవముఁజెంది
వాఁడ నేపాపమెఱుఁగనివాఁడ నేను;
చిత్తమునఁ బాపి నని తలంచితిరమేని
నేను పాపిని కాకుండి యేమిఫలము?

(తనలో) వసంతసేన లేని నేను బ్రతికిచేయునదియే లేదు. (ప్రకాశముగా) ఆర్యులారా! పలుపలుకులేల?

గీ. ఉభయలోకంబు లెఱుఁగకయున్న నేను
ఘాతకుఁడనై యొకకాంతకామినీమ

ణినిఁ గృతాంతునివగిది దుర్ణీతి మెఱయ,-
నాతఁడే చెప్పు మిగతవృత్తాంత మెల్ల.

శకా—చంపితివి. ఓరి! నీవుఁగూడఁ జంపితి నని చెప్పుమురా!

చారు—నీవే చెప్పితివి కదా!

శకా—భట్టారకులారా! వినుండు వినుండు. ఇతఁడే చంపెను. ఇతఁడే సంశయచ్ఛేదముఁ గావించెను. ఈదరిద్రిచారుదత్తునిఁ గొట్టు వైచిచంపింపవలెను.

అధికర—శోధనక! రాష్ట్రియుఁడు చెప్పినట్లు చేయించుము. రాజపురుషులార! చారుదత్తునిం బట్టుకొనుఁడు. (రాజపురుషులు బట్టుకొందురు)

వృద్ధ—ఆర్యమిశ్రులారా! అనుగ్రహింపుఁ డనుగ్రహింపుఁడు. నాకూఁతురు చచ్చిపోయినఁ జచ్చిపోనిండు. ఈచారుదత్తుఁడు చిరంజీవి యగుంగాత! వ్యవహారమర్థిప్రత్యర్థుల ననుసరించును గదా. నే నర్థిని; వదలుమంటిని గావున వదలుఁడు.

శకా—గర్భదాసీ! లేచిపొమ్ము. నీకు వీనికి నేమిసంబంధము పోపొమ్ము.

అధిక—ఆర్యురాలా! నీవేగుము. రాజపురుషులార! మీరామెను గొంపొండు.

వృద్ధ—అయ్యో! నాబిడ్డా! అయ్యో (యేడ్చుచు నిష్క్రమించును.)

శకా—(తనలో) వీనికిఁ దగినపాత్రియశ్చిత్తముఁ గావించితి నిఁకఁ బోయెద.

(నిష్క్రమించును.)

అధిక—ఆర్యచారుదత్త! మేము నిర్ణయము చేయుదు మేకాని తక్కినదంతయు రాజాధీనము. శోధనకా నీవు పోయి పాలకభూపతితో నిట్లు విన్నవింపుము.

గీ. భూసురుఁడు పాతకుండైనఁ బొలియఁజేయఁ
దగఁదనుచుఁ దొల్లి మనువుశాస్త్రంబు చెప్పెఁ
గాన వధ్యునిఁ జంపుట మాని వాని
నన్యదేశంబులకు సాగనంపుటొప్పు.

శోధ—చిత్తము (అని నిష్క్రమించి మరలఁ బ్రవేశించి) అయ్యా! పాలకమహారాజుగారు "ద్రవ్యముకొఱ కెవ్వఁడు వసంతసేనను జంపెనో వానికానగలు మెడకుఁగట్టి చాటింపుతో నూరేగఁజేసి దక్షిణశ్మశానంబునకుం దీసికొనిపోయి యచట శూలారోపమునం బ్రాణములు పాపవలయును. ఎవ్వఁడేని యిట్టి దుష్కార్య మొనరించినచో నిట్టిరాజదండము కలుగు నని జను లందఱకుం దెలియవలయు" నని సెలవిచ్చినారు.

చారు—ఆహా! పాలకమహారాజవిమృశ్యకారిగదా! (ఆలోచించి) అతనిందూఱ నేటికి?

గీ. అకట! యీదృశమగు వ్యవహారపావ
కమున మంత్రిలు ద్రోవ భూరమణు లందుఁ
గూలి రెందుకుఁ గొఱగానికూరనీచ
దశకుఁ బాల్పడిచెడుట తథ్యముగుఁగాదె.

గీ. తెల్ల కాకంబు కలదన్నఁ దెలివిలేక
నమ్మ నీదృశమంత్రిగణమ్ము చేతఁ
జంపఁబడుచుండి రెందఱో చంపఁబడిరి
చంపఁబడుదు రపాపులు జగతియందు.

మిత్రమా! మైత్రేయ! నీవు పోయి మాయమ్మకు నాచరమనమస్కారము మనవిచేయుము. కుమారుని రోహసేనునిం గాపాడుము.

విదూ—మొదలు విఱిగిపడినఁ జెట్టును గాపాడుకొను టెట్లు!

చారు—చెలీ! అటుకాదు

గీ. ఇహమువిడిచెడి ప్రాణులకెల్లరకు శ
రీరముల మాఱటనుమీ కుమారుఁ డనఁగ
నీకు నాయందుఁ గలప్రేమ నాకుమారు
నందుఁజూపించి వానిఁ గాపాడవయ్య.

విదూ—మిత్రరత్నమా! నీను నింతకాలము స్నేహితుఁడనై నీవులేకుండ నీప్రాణములు రక్షించుకొందునా!

చారు—రోహసేనునిమాత్ర మొకసారి చూపింపుము.

విదూ—ఇది బాగున్నది. అట్లు కావించెదను.

అధిక—శోధనక! ముం దీబ్రాహ్మచారి నావలకుం బంపుము.

(శోధనకుఁ డట్లు కావించును)

అధిక—ఎవఁడురా యక్కడ! చండాలుర కాజ్ఞయొసఁగుఁడు

(అధికరణికాదు లందఱును జారుదత్తుని విడిచి నిష్క్రమింతురు)

శోధ—అయ్యా! ఇటురమ్ము.

చారు—(కరుణముగా, "ఏమి యిటువచ్చె మైత్రేయ" అనుపద్యమును జదువుచు మింటిసంకఁజూచి)

ఉ. విసమును నీరు నిప్పు తుల వీనిక తానఁ బరీక్ష చేసి నా
దెస దోసఁగుంట నిక్కమని తేలినచోఁ గ్రకచంబుతోడ నా
యూసురులుగొన్నఁగాని కడునొప్పనుగా ; కరిమాటఁబట్టి యే
దోసఁగునులేని పాఱు నిటుదున్మిన మీకులమెల్లఁ ద్రుంగదే.

ఇదిగో ! వచ్చుచుంటిని.

(అందఱును నిష్క్రమింతురు)

ఇది శ్రీతిరుపతి వేంకటేశ్వరాంధ్రీకృతంబగు మృచ్ఛకటికంబునందు
వ్యవహారమను నవమాంకము.



శ్రీరస్తు.

# మృచ్ఛకటికము

## దశమాంకము

(పిదప నిరువురు చండాలురచే ననుగమ్యమానుఁడగు చారుదత్తుఁడు ప్రవేశించును.)

చండా.— గీ. బిఱ్ఱబిగఁకట్టి వధ్యస్థలి దఱియఁజేర్చి
తలదరిగికాని కొఱ్ఱుపై నిలిపిగాని
యచిరమున వధ్యులను జంపునట్టి నేరు
పలవడియె మన; కద్దియే యగుఁ గతమ్ము.

ఆర్యులారా! ఒత్తిగిలుం డొత్తిగిలుండు. ఇతఁ డార్యచారుదత్తుఁడు

గీ. హింసకులమగు మాచేత నిపుడు కంఠ
సీమ గన్నేరుదండ కైసేయఁబడిన
యితఁడు నిస్తైలమగు దివ్వెవితముగాఁ బ
రిక్షయముఁ జెందు నింక వసక్షణంబ.

చారు—(విషాదముతో)

ఉ. తోరఁగుదిలోచనాంబువులఁ దోఁగుచు నాదు ధరావరాగధూ
సర మగుచుఁ శ్మశానసుమసంతతి పైఁబడ రక్తగంధభం
గుర మగు నాదు మేను బలికూడ నిరోయించి శివం దలంచి యం
బరమున మూఁగుచున్నవి రవంబులతోఁ బలిభుక్కు లక్కటా.

చండాలు—ఆర్యులారా! ఓసరిలుం డోసరిలుండు!

గీ. సుజనశకునాధివాసమై సొంపుఁగాంచి
ఖ్యాతిఁబూనిన యొక సజ్జనాగమంబు
నఱకుచున్నార మిదె కాలపరశుధారఁ
జూడవచ్చెదరేటికి చోద్యపడుచు.

చారుదత్త! రారమ్ము

చారు—పురుషుని యదృష్టవ్యాపారము లచింత్యములు కదా! నావంటివాని కిట్టి దుర్దశ సంప్రాప్తమైనది.

గీ. రక్తచందనహస్తముద్రలిడి మీఁదఁ
బిండి వెదజల్లినారు మేనిండ నాకు
నెంతలో నెంతమార్పయ్యె! నిపుడు నేను
పశువుగా మాఱితిని దైవవశతఁజేసి.

(ముందువంకకుం జూఁచి) ఆహా! ప్రజలయొక్క తారతమ్యజ్ఞానము!

గీ. 'మనుజుఁడై పుట్టరా' దంచుఁ గనులనీర
మొలుకఁగొందఱు శోకించుచున్నవారు
నన్నుఁ గావ నశక్తులై 'నాక మేగు
మా' యనుచు నన్ను దీవించి పోయినారు.

చండా—పోం డయ్యలారా! పొండు.

గీ. భ్రష్టరాజ్యుఁడై పోయెడి రాజుపాటు
తారకాపతనంబు వత్సప్రసూతి
సజ్జనప్రాణహానియు జనులు చూడ
రాని వీనాల్గు కావున మానరయ్య.

ఒకచండా—ఓరీ! ఆహింతా! చూడు చూడు.

గీ. ఉజ్జయినిలోఁ బేరొందు సత్తముండు
నేఁడు వధియింపఁబడునను నెగులు కతన
నోయనఁగ మిన్ను కన్నీరునోడ్చు జలద
రహితమయ్యును బిడుగులు రాల్చెఁదొడఁగె.

రెండవ చండా—ఓరోరీ! గోహ!

గీ. అంతరిక్షము చలవించు టన్నతమోరి
చాలుఁ జాలు నసత్ప్రవ్రజపశింస
తరుణు లందఱుఁ గూడి సౌధములమీఁద
నేడ్చుచున్నారు కంట నీరోడ్చియోడ్చి.

మఱియును.

గీ. వధ్యుఁడగువీనిఁ గొంపోవఁ బౌరులెల్ల
నల్లకల్లోలముగ గోల్లుగోల్లు మనుచు
గోలపెట్టఁగ వారి కన్గొనలనుండి
జాఱు కన్నీట భూమిరజం బడంగె.

చారు—(చూచి కరుణముగా)

గీ. అకట యీస్త్రీలు సౌధవాతాయనార్ధ
గతములయి వన్నెదలుఁగు మొగములతోడఁ
దూముకాల్వలఁ గన్నీరు దొరుచట్లు
లడలుచున్నారు చారుదత్తాయటంచు.

చండా—ఓరీ చారుదత్త ! రా రా. ఇదే ఘోషణస్థానము. డిండిమము వాయించి చాటుదుము (అని మోగించుచు) ఆర్యులారా ! వినుండు వినుండు. ఇతఁడు సార్థవాహుఁడగు వినయదత్తుని మనుమఁడు, సాగరదత్తుని కొడుకు. చారుదత్తుఁడను పేరివాఁడు. వీఁడు కాలకర్మవశమున వసంతసేన యను లంజెసానిని జనశూన్యమగు పుష్పకరండక జీర్ణోద్యానమునకుం గొంపోయి ధనము కొఱకు మెడ పిసికి చంపినాఁడు. దొంగిలిన సొమ్ముతో పట్టుబడి ఇతఁడు నేరము నొప్పుకొన్నాఁడు. దానివలన రాజుగారు శూలారోపణమునం జంపుఁడని మా కానతిచ్చినారు. మఱి యెవ్వరే నెప్పుడేని దుష్కార్య మిటువంటి దాచరించిరేని వారికి నిట్టిశాస్తియే యని తెలిసికొనుఁడు. (అని డప్పు వాయించుచు ఘోషణ మోగింతురు.)

చారు—(నిర్వేదముతోఁ దనలో)

గీ. జన్నముల వేదఘోషప్రశస్తిఁజేసి
మున్ను నాకుల మెంతయు వన్నెకెక్క
నదియె నేఁడంత్యదశను నాయఘముకతన
నసదృశజనంబు చాటింపనయ్యె నకట.

(ఒడలు కంపింపఁ జెవులు మూసికొని) హాప్రియురాలా ! వసంతసేన !

గీ. తరుణచంద్రికఁ బోలు దంతములతోడఁ
బగడపుంజిగి గలమోవిసొగసుతోడఁ
దనరునీమోము నమృతంబు ద్రావి నేఁడు
దుర్యశోవిషమెటు త్రావుదును లతాంగి.

చండాలు—ఆర్యులారా ! ఒత్తిగిలుండొత్తిగిలుండు.

క. గౌరవము లనురతనములకుం గని సజ్జనతాపహారుఁడు కారుణికుఁడు వ
ట్టనమునకుఁగా వెలియగుచుండెను పైఁడిదిగాని యొక్కటే నగ పురికిఁగా.

మఱియును—

గీ. సిరియు సంపద సౌఖ్యంబుఁ జెలఁగు నరుల
కష్టసుఖము లాలోచింపఁగలర పెక్క

రంతియేకాని దైవోపహతుల యాప
దల నివారింపఁజాలువా రిలఁ గలారె.

చారు—(నాలుగుదిక్కులుఁ గలయం జూచి)

గీ. అనుఁగుకాండ్రందఱు ఉత్తరీయాంతపిహిత
వదనులై పోవుచున్నారు వారె తొలఁగి
మంచిదశనున్న నరియుఁ బ్రేమించు నరుని
విషమదశ మిత్రుఁడేనియు విడిచిపెట్టు.

చండాలు—ప్రజలందఱుఁ దొలఁగిరి. రాజమార్గము విజనంబయ్యె. దత్తవధ్యచిహ్నుం డగు వీనిని శీఘ్రముగాఁ దీసికొనిరమ్ము.

(ఏమియిటువచ్చె మైత్రేయ అను పద్యము చారుదత్తుండు చదువును)

(తెరలో) హాతండ్రీ! హాప్రియవయస్య!

చారు—(విని దైన్యముగా) ఓయీ స్వజాత్యగ్రేసర! నీవలన నేనొకటి ప్రతిగ్రహింపఁ దలఁచుచున్నాను.

చండా—మాచేతినుండి నీవు ప్రతిగ్రహింపవలసిన దేమున్నది?

చారు—పాపము శాంతించును గాక! చండాలుఁడుఁగూడఁ గార్యపరిశీలనలేని పాలక మహారాజునంతటి చండాలుఁడు కాఁడు; పరలోకసుఖావాప్తికొఱ కవసాన కాలమునఁ బుత్రముఖముఁ జూపింపుమని ప్రార్థించెదను.

చండాలు—అటులనే సేయుము.

(తెరలో) ఓతండ్రీ! ఓనాయనా!

చండాలు—పౌరులారా! సందిండు సందిండు. పాపమీచారుదత్తుఁడు పుత్రుని మొగము కనుంగొనునఁట. ఆర్య! ఇటురమ్మిటురమ్ము. అబ్బాయీ! యీలాగునరా! బాబూ! యీలాగున రా (అని పిల్లవానిం బిలుతురు.)

(పిదప రోహసేనునితో విదూషకుఁడు ప్రవేశించును)

విదూ—తండ్రీ! రోహసేన! త్వరగా నడువుము. త్వరగా నడువుము. నీతండ్రిని జంపుటకై కొంపోవుచున్నారు.

రోహ—హాతండ్రీ! హానాయనా!

విదూ—ఓప్రియమిత్రమా! నిన్నెక్కడఁ జూతును.

చారు—(మిత్రునిఁ బుత్రునిఁ జూచి) హాకొడుకా! హానెచ్చెలీ! (కరుణముగా) ఎంతకష్టకాలము సంప్రాప్తమయ్యెనోయీ!

కం. పరలోకంబున నేనుం జిరకాలంబుం బిపాసచేఁ బొగులుదు నీ
చిఱుతని చిన్నారి కరాంబురుహంబిచ్చెడి నివాపభోజన మెంతో!

ఈపుత్రున కేమి యొసఁగుదునో (తనశరీరముఁ జూచుకొని) ఈ యజ్ఞోపవీతఁ మొకటియున్నది.

గీ. కనకమయమును గాక ముక్తామయంబుఁ
గాక చెలఁగున దీయలంకార మార
విప్రకోటుల కిదికదా వేల్పులకును
బితరులకుఁ గూడ భాగ మర్పించుచుండు.

(అనియజ్ఞోపవీతమును దీసి యిచ్చును)

చండా—ఓరీ చారుదత్త, రారా!

రెండవచండా—ఓరి! ఆర్యచారుదత్తుని నిరుపపదముగాను నోరీ యనియుఁ బిలుచుచున్నా వేమిరా!

గీ. సంపదలవేళ నాపత్తిసమయమందుఁ
దేజరిల్లుచునుండు రాత్రిందివంబు
దివ్యతేజంబుతోడఁ బ్రతిష్ఠయను కి
శోరి కెక్కడఁ గలదురా మారకదశ.

ఇంతేకాదు.

కం. ఇతఁ డపవాదార్ణవమునఁ బతితుండైనంత గౌరవము చెడెనె? నమ
స్కృతికిఁ దగఁడె? రాహుగ్రస్తత దొలఁచునె శీతరుచికి జనులసపర్యల్?

రోహ—ఓరీ చండాలురారా! మానాయన నెక్కడకురా తీసికొనిపోయెదరు?

చారు—అబ్బాయీ రోహసేన!

ఉ. స్కంధమునందు శూలమును గంఠమునం గరవీరమాల బ్రా
ద్బంధిత మైనశోకమును దాలిచి పోవుచు నుంటి మారణ
గ్రంథము విన్పుచోటికి వికారముగా శమిత్రృప్రబంధసం
బంధము కల్గుచోటికి సవంబునఁ బోయెడు మేకచాడ్పునన్.

చండా—పిల్లఁడా! గీ. మాది చండాలకులము జన్మంబుచేతఁ
గాని చండాలురము మేము కాము సూవె
ఎవరు నిష్కారణంబు సాధువుల హింస
నం బొనర్తురో వారు చండాలు రనఁగ.

రోహసే—అటు లైనచో మాతండ్రి నేల చంపుచున్నారు ?

చండా—చిరంజీవీ ! ఇది రాజనియోగము. మాయం దేదియు నపరాధము లేదు

రోహ—మా నాయనను వదలుఁడు నన్నుఁజంపుఁడు.

చండా—మాతండ్రీ ! అట్లనకుము. నీవు చిరకాలము జీవింపుము.

చారు—(కన్నీరోడ్చుచు పుత్రునిఁగవుంగలించుకొని) ఆహా ! ఇది యుశీరగంధాను లేపనంబును జందనానులేపనంబునుగూడ నతిశయించుచున్నది.

గీ. ప్రేమ సర్వధనంబు దరిద్రులకును
భాగ్యవంతులకును దుల్యభాగ మార
పుత్రగాత్రపరిష్వంగమున జనించు
సుఖముకంటెను వేఱొండుసుఖము కలదె.

("స్కంధమునందు శూలమును" అను పద్యమును మరలఁ జదువును. ముందుకుఁజూచి "అనుఁగుకాండ్రందఱు" అను పద్యమును జదువును.)

విదూ—ఓభద్రముఖులారా! నాప్రియమిత్రుని వదలుఁడు నన్నుజంపుఁడు.

చారు—(చూచి) పాపము శాంతించునుగాక. (తనలో) ఇప్పుడు తెలుసుకొనుచున్నాను. (ప్రకాశముగా 'అకట యీస్త్రీలు' అనుపద్యమునుజదువును.)

చండా—ఒత్తిగిలుం డయ్యలారా యొత్తిగిలుండు !

గీ. ఏలచూచెద రయ్యరో యితని, దుర్య
శంబు చే మేనువాయుసజ్జనుని మీరు
పలుగురకు నుపయోగమౌ పైఁడిఘటము
త్రాఁడు తెగి మున్గుచున్నది నేఁడు నూఁత.

చారు—(దైన్యముగా 'తరుణచంద్రికఁబోలు' అనుపద్యముఁ జదువును.)

రెండవచండా—ఓరీ మరల దప్పువాయించి చాటింపుమురా ?

మొదటిచండా—(దప్పువాయించి 'ఆర్యులారా ! వినుండు, వినుండు' అను మొదలైనది చదివి చాటించును )

చారు—కటకటా !

గీ. ఆఁడుదానిని జంపితినన్న దుష్ట
వార్త చాటింపఁగా వినవలసివచ్చె
వ్యసనశల్యమును గడునపూజ్యంబునగు ద
రిద్రదశకును జోడీ యుపద్రవంబు.

(పిదప మేడమీఁద సంకెళ్ళతో స్థావరకుఁడు ప్రవేశించును.)

స్థావ—(చాటింపు విని) కటకటా యేపాప మెఱుఁగని చారుదత్తునిఁ జంపుచున్నారు! నాస్వామి నన్నుఁ గాళ్ళకు సంకెలలుగూడం దగిల్చినాఁడు కానీ; పెద్దగోల పెట్టెదను. ఆర్యులారా వినుండు వినుండు! పాపాత్ముండ నగు నేను ప్రవహణవిపర్యాసమునఁ బాప మావసంతసేనను బుష్పకరండక జీర్ణోద్యానంబునకుం దీసికొనిపోయితిని. అచట మాస్వామి తనతోడిపొత్తున కంగీకరింపలేదను దురాగ్రహంబున మెడ పిసికి యావసంతసేనం జంపినాఁడు. కాని యీమహానుభావుఁడు చారుదత్తుఁడా పాప మెఱుఁగఁడు. అక్కటా దూరముగా నున్నారు నామాట లెవరికిని వినఁబడవు కాఁబోలు. ఏమిచేయఁగలను (ఆలోచించి) క్రిందికి దుమికెదను. ఇట్లు చేసితినేని చారుదత్తార్యుఁడు చావక బ్రతుకఁగలఁడు. కావున నీప్రాసాదాగ్ర ప్రతోళికయందుండి యీజీర్ణగవాక్షద్వారంబునఁ గ్రిందికి దుమికెదను. నేను జచ్చినను కులపుత్రవిహంగంబుల కెన్నింటికో నివాసవృక్షం బగుచారుదత్తుఁడు బ్రతుకును. ఒకసజ్జనునికొఱకుఁ జచ్చినను నాకుఁ బరలోకము రాఁగలదు. (అని క్రిందికిదుమికి) ఆశ్చర్యము! నేను జావకుంటయే కాక నాకాలిసంకెలలు గూడ విడిపోయినవి! కానీ, యీచండాలఘోషము వీతెంచుచోటికిఁ బోయెదను (పోయి) ఓచండాలురారా! దారియిండు, దారియిండు

చం—ఓరీ! ఎవఁడు వీఁడు? దారియిమ్మనుచున్నాఁడు?

స్థావ—(వినుండు వినుండు మొదలుకొని ...చారుదత్తుఁడా పాపమెఱుఁగఁడు... దాఁకఁజదువును.)

చారు— గీ. కాలపాశంబు బిగువుగాఁ గంఠమునకుఁ
దగులుకొనియున్న నామీఁదిదయ నితం డె
వండొకో చిమ్ముచున్నాఁడు వానలేక
మాడుసస్యంబుపైఁ బెద్దమబ్బుకరణి.

అయ్యలారా! వింటిరా!

గీ. మగణ మన్నను నేభయంపడుట లేదు
దూషితంబయ్యె నాకీర్తి దుష్పదమున
సజ్జనులకు విశుద్ధమౌ చావుతోడఁ
బుత్రసంభవ మైనను బోలఁబోదు.

క్షంతియ్యే కాడు.

గీ. నిజమునకుఁ దాను దోషియై నిర్నిమిత్త
వైరమూనిన నీచుని కారణమున
దూషితుఁడనై యరుగుచుంటి దుర్విపాక
శరముచే విద్ధుఁడై చను జనునిఁబోల్కి.

చండా—స్థావరకా! నీవు చెప్పునది సత్యమేనా?

స్థావ—నిజము నిజము. ఎవ్వరితోడనైన నీయుదంతము జెప్పెద నేమోయని నన్ను బాలప్రాసాదాగ్రప్రతోళికయందు బొండవేసెను.

శకా—(ప్రవేశించి సంతోషముతో)

గీ. ఒట్టిగారమ్ము పులుసు గుడోదనమ్ము
కుడుములుం జేపలును బచ్చఁగూరతోడ
పలలయుక్తమ్ముగా నేను భక్షణమ్ము
సలిపివచ్చితి నాగృహసద్మమందు

(చెవియొగ్గి) పగిలిపోయిన కంచువలె ఖణఖణలాడుచుఁ జండాలురు మాటలాడుచున్నారు. వధ్యస్థానమున డిండిమము మ్రోగించుచున్నారు. ఆదరిద్రచారుదత్తుఁడు వధ్యస్థానంబునకుం గొంపోఁబడియె నని తలంచెదను. పోయి చూచెదను. శత్రువినాశము గన్నారఁగని యానందించెదను. ఎవఁడు శత్రువును జంపుచుండఁ గన్నులారఁ గాంచునో వానికి జన్మాంతరమున నక్షిరోగము రాదని పెద్దలు చెప్పఁగా వింటిని. విషగ్రంథి కడుపులోఁ దూఱినకీటకమువలె నేనాదరిద్ర చారుదత్తునిఁ జంపుటకుఁ ద్రోవ వెదకి వెదకి తద్వినాశమునకుం దగిన యుపాయము గూరిచి యట్లు కావించుచున్నాను కావున నాబాలప్రాసాదాగ్రప్రతోళికయందుం గూర్చుండి నాపరాక్రమముఁ జూచి యానందించెదను. (మేడమీఁది కెక్కి చూచి) హీహీహీ! ఈదరిద్రచారుదత్తుని వధ్యస్థానమునకుఁ దీసికొని పోవుచున్నప్పుడే యింతమంది గుమిగూడినారే, యిఁక నావంటి నరమనుష్యుఁడు చంపఁబడునప్పు డెంతమంది గుమిగూడుదురో కదా! వీనిం గ్రొత్తగిత్తవలె నలంకరించి శ్మశానమునకుం గొనిపోవుచున్నారు (మగలఁ గనుఁగొని) ఏమిది నామేడక్రింద డప్పులమ్రోఁత మాన్పించినారేమో! (చూచి) స్థావరకుఁడు సైత మిందుఁ గానరాఁడు. వాఁడు పోయి మంత్రభేదముఁ గావింపలేదుకద! వీనిని ముందు వెదకెదను. (వెదకి) వీఁడె స్థావరకుఁడు. ఈమందిలోనున్నాఁడు (మేడదిగి వాని సమీపమునకుం బోవును)

స్థావ—అయ్యలారా! వీఁడె వాఁడు వచ్చినాఁడు. (అనిచూపును)

చండా— గీ. ఒత్తిగిలుఁడయ్య దారి యిం డొత్తిగిలుఁడు
మూసికొనుఁడయ్య తలుపులు మూసికొనుఁడు
దుర్ణయం బనుకొమ్ములు దులపరించు
కొనుచు దుష్టబలీవర్ద మేనయుచుండె.

శకా—ఓహోరి జనులార ! సం దిండు సం దిండు. పుత్రికా ! స్థావరక చేట ! యిటురమ్మిటు రమ్మ. పోదముర.

స్థావ—హీహీ ! దురాత్మ ! పురమున కంతయు నలంకార మగువసంతసేనం జంపి నది చాలక పరిణయిజనకల్పవృక్షం బగు నార్యచారుదత్తునిం గూడఁ జంపింప నుంకించు చుంటివా !

శకా—రత్నాలకుండ వంటివాఁడ నే నాఁడుదానిం జంపుదునఁటరా !

అందఱు—నీవే చంపితి; వార్యచారుదత్తుఁ డేమియు నెఱుఁగఁడు.

శకా—ఇటు లన్నవాఁ డెవఁడు ?

అందఱు—(చేటునిజూపుచు) ఈసజ్జనుఁడు చెప్పుచున్నాఁడు.

శకా—(భయముతోఁ దనలో) అయ్యో యీస్థావరకుని ద్రాళ్ళతోఁ గట్టిగాఁ గట్టి పెట్టలేను కాఁబోలు. నాదుష్కృత్యము నెదుటనుండి చూచినవాఁడే వీఁడు. (ఆలోచించి) కానీ ! యిట్లు బొంకెదను. (ప్రకాశముగా) అయ్యలారా ! అబద్ధమబద్ధము. వీఁడు నాదాసుఁడు; నాదగ్గఱ నున్న బంగారము దొంగిలించెను. దానంజేసి వీనిం దన్ని చావమోఁది సంకెళ్ళువైచి కట్టిపెట్టితిని. ఆకోపమున వీఁ డీయసత్యమాడుచున్నాఁడు. (ప్రక్కకుఁదిరిగి రహస్యముగా) నాయనా స్థావరక ! నీకీబంగార మిచ్చెదను లేదనుము. (బంగారమిచ్చును.)

స్థావ—(అది పుచ్చుకొని) ఆర్యులారా! చూడుఁడు. నాకు బంగారము లంచమిచ్చి న న్నసత్య మాడు మనుచున్నాఁడు. (అని బంగారముఁ జూపించును.)

శకా—(ఆబంగారము లాగికొని) అయ్యో ! నాదగ్గఱ దొంగిలించినదే యీబంగారము. దీనికొఱకే నేను వీనిం దన్నితిని గట్టిపెట్టితిని. ఓచండాలురారా! వీని నానగలపెట్టెకుఁ గాపువెట్టితిని. వీఁ డందులోని దీబంగారము దొంగిలించెను. దానిచే వీనిం దన్నితిని చూడుఁడు వీనివీఁపు.

చండా—(చూచి) నిజమే చెప్పుచున్నాఁడు, దెబ్బలు తిన్నవీఁ డేమటయైన ననఁగలఁడు.

స్థావ—అహా! దాసభావ మనఁగా నిట్టిది! నిజముఁ జెప్పినను నెవ్వరును నమ్మరు. (విచారముతో) ఓచారుదత్తా! నే నేమి చేయఁగలను? నావిధ మింతటిదే (పాదములపైఁ బడుచున్నాఁడు)

చారు—(కరుణముగా) గీ. సాధుబాధానుకంపివి, సచ్చరితుఁడ
వన్న! నను గావ నీసల్పవట్టి యత్న
మేది? నాకర్మమిటులుండ నేమిసేతు?
లెమ్ము; నా కనిమిత్తమిత్రమ్మవైతి.

చండా—ఈచేటునిఁ దన్ని యావల కీడ్చుము.

శకా—ఛీ, నీవు లేచిపోరా! (నిష్క్రమింపఁజేయును) ఓచండాలురారా! యేల విలంబము. ఈచారుదత్తుని వేగఁ జంపుఁడు.

చండా—నీ కంతతొందరగానున్న నీవే చంపుము.

రోహ—ఓచండాలురారా! మాతండ్రిని వదలి నన్నుఁ జంపుఁడు.

శకా—అటులేని వీనితోఁగూడఁ జారుదత్తునిం జంపుఁడు.

చారు—తండ్రీ! వీఁడేమి చేయించినను చేయింపఁగలఁడు. నీవింటికిఁబోయి మీ యమ్మదగ్గఱ నుండుము.

రోహ—నేను బోయి చేయవలసినదేమున్నది?

చారు—క. మీయమ్మవెంటరాఁజనుమీ యాశ్రమమునకుఁబోయి మెలఁగుము మునివై
మీయయ్య మొనర్చినపాపాయతి నినుగూడ వెంట నంటునోయేమో?
మిత్రమా మైత్రేయ! నీవు వీని వెంటంగొనిపొమ్ము.

విదూ—నీవెట్లనుకొనుచుంటివి? నీవు చనిపోయినవెనుక నేను ప్రాణములు ధరింతునా?

చారు—చెలికాఁడా! నీప్రాణము నీయధీనమైయున్నప్పుడు నీవు ప్రాణత్యాగముఁ గావింపవలసిన యవసర మేమి వచ్చినది?

విదూ—(తనలో) ఇది బాగున్నది. కాని ప్రియవయస్యవిరహితుండనై ప్రాణము లెట్లు నిల్పుకొందును! యీపిల్లవానిం దల్లికప్పగించి యేనును బ్రియవయస్యునితోఁ బ్రాణములు పాసెదను (ప్రకాశముగా) నెచ్చెలీ! పిల్లనిం గొంపోయి బ్రాహ్మణి కప్పగించెదను. (జారుదత్తుని కంఠాలింగన మొనర్చి కొని కాళ్లపైఁబడును.)

(పిల్లవాఁడును నేడ్చుచుఁ దండ్రికాళ్లఁపైఁబడును)

శకా—ఓరీచండాలురార! పుత్త్రునితోఁగూడఁ జారుదత్తునిం జంపుఁడని నే ననలే దఁటరా!

చారు—(గజగజవడఁకును)

చండా—మాకు రాజాజ్ఞ యట్లులేదు కావున మేమీయార్యకునిం జంపము. అబ్బాయీ! నీవు పొమ్ము నీవు పొమ్ము (అని యావలకుం బంపుదురు) ఇది మూఁడవఘోషణాస్థానము. డిండిమము మోగ్రింపుము! (మోగింపుము. (మరల చాటింతురు)

శకా—(తనలో) ఈపౌరు లిప్పటికి నమ్మకున్నారు (ప్రకాశముగా) ఓరీ! చారుదత్తహతక! ఈపౌరులు నమ్మకున్నారు. నీనాలుకతో నీవే "వసంతసేనం జంపితి" నని చెప్పుము రా!

చారు—(ఊరకుండును)

శకా—ఓరీచండాలురారా! ఈచారుదత్తహతకుఁడు చెప్పఁడు. మీ రీవెదురు కఱ్ఱతో మొత్తి చెప్పింపుఁడు.

చండా—(కఱ్ఱయెత్తి) ఓరీ చారుదత్త చెప్పుమురా!

చారు—(కరుణముగా)

గీ. ఘోరవిపదబ్ధి మున్గియుఁ గొంచెమైన
భయముఁజెందను మదిపలవంతఁజెంద
చెలియ నేన చంపితినంచుఁ బలుక దుర్య
శోగ్ని నను గాల్చునని మాత్ర మలుకుచుంటి.

శకా— ఓరీ చారుదత్త! నీనాలుకతో నీవే వసంతసేనం జంపితి ననుమురా లేకున్న నీపౌరులు నమ్మకున్నారు.

చారు— ఓపౌరులారా! (అని “ఘాతుకుఁడ నగుచుఁ బరలోకం బేఁగక” అను పద్యముం జదువును.)

శకా— చంపఁబడినది.

చారు— కానిమ్ము.

ఒకచం— ఓరీ! యీదిన మితని వధించుట నీవంతురా?

రెండవచం— నీదేరా.

ఒకచండా— చీట్లు వైచుకొందము, (అని చీట్లువైచి) సాశే వచ్చినయెడల ముహూర్త మాఁగుదము.

రెండవచం— ఎందునిమిత్తము!

మొదటిచం — నాతండ్రి స్వర్గమునకుఁ బోవుచు "ఓరీ వీరకా! నీకు వధ్యపాలిక వచ్చిన రవంతనే పోఁగు" మని చెప్పిపోయెను.

రెండవచం— ఎందునిమిత్తము ?

మొదటిచం— ఎప్పుడైన నేసాధువైన ద్రవ్య మిచ్చి వధ్యుని వదలింపఁగలఁడేమో రాజునకుఁ గొడుకు పుట్టునేమో, ఆమహోత్సవకాలమున వధ్యులందఱికిని విమోచనము కలుగును. హస్తి బంధమును ద్రెంచుకొనునేమో, ఆతొందరలో వధ్యుఁడు విముక్తుఁడగును. రాజు మాఱిపోవునేమో, అప్పుడు వధ్యు లందఱకును విముక్తి కలుగును.

శకా— ఏమేమి రాజపరివర్తనమగునా ?

మొదటిచండా— ఓరీ వధ్యపాలికకుఁ జీట్లు వైచుకొందము.

శకా— త్వరగాఁ జారుదత్తుని జంపుఁడు. త్వరగాఁ జంపుఁడు. (చేటునితో నొకప్రక్కకేగి నిలుచును.)

మొదటిచం— ఆర్యచారుదత్త! రాజనియోగము నీకపరాధముఁ జేయుచున్నది కాని మేము కాము. కావున నీవు తలఁచుకోఁదగిన దేదియో తలంచుకొనుము.

చారు— గీ. అధికృతులవాక్యములచేత విధివశమున
దూషితుఁడనయ్యు ధర్మవంతుండ నేని
స్వర్గమునకే నిఁ కెటకేనిఁ జన్న తన్వి
నాకళంకంబుఁ బోకార్పఁగాక వచ్చి.

ఓ చండాలురారా! నేనెచటికిఁ బోయియుండవలెను.

చండా— (ముందుఁ జూచి) ఓరి యిదె దక్షిణశ్మశానము. దీనింజూచినంతనె వధ్యులు చంపఁబడకయే ప్రాణములు వదలుదురు.

క. పక్షులు మెయిసారించున నఱపాద్రిగలాగి మెసవ, నదె! కొట్టుకొనన్
దిరమయి నిలిచినది కళేబర మఱసా లట్టహాసభయదాకృతితోన్.

చారు— హా! యెంత దురదృష్టవంతుఁడనైతిని! (పోయి యుండెకూర్చుండును.)

శకా— నేను చారుదత్తుని చావు చూచిగాని వెళ్లను. (పరిక్రమించిచూచి) వీఁడే చారుదత్తుఁ డెట్లుకూర్చున్నాఁడో.

చండా—ఏమి చారుదత్తా! భయంపడుచుంటివా యేమి ?

చారు—(శీఘ్రముగా లేచి) ఛీమూర్ఖ! ('మరణమన్నను' అనుపద్యముఁ జదువును.)

చండా—చారుదత్తా! ఆకాశమునందున్న సూర్యచంద్రులు సైతము విపత్తినిబొందు

చున్నారు. మరణభీతువు లగు మానవుల కాపదలు రాకుండు నా! లోకమున నుచ్ఛస్థితుఁడు పడుచుండును, నీచస్థితుఁడు లేచుచుండును.

గీ. పాతవస్త్రమ్ము విడనాడి నూతనమగు
వన్యవస్త్రముదాల్చిన ట్లాత్మ దేహ
మన్యము గ్రహించుచుండు; నీ యర్థ మెఱిఁగి
ధీరులగువారు మృతికి విచారపడరు.

ఇదిగో నాలవసారి చాటించుచున్నాము (అని వెనుకటియట్ల చాటింతురు.)

చారు— హా ప్రియురాల వసంతసేన! ('తమోరాజవిద్రిక బోలు' అను పద్యముఁ జదువును.)

(పిదపఁ దొందరగా వసంతసేనయు భిక్షువును బ్రవేశింతురు.)

భిక్షు— ఔరా! నే నీసన్న్యాసాశ్రమము స్వీకరించుటచేతంగదా, యస్థానమూర్ఛిత యగు వసంతసేనకుఁ బరిచర్య గావించి యూఱడింపఁ గలిగితిని. ఓ బుద్ధోపాసికా! నిన్నెచటికిఁ గొనిపోవలయును?

వసం— ఆర్య చారుదత్తు నింటికే. ఆయనకుఁ దర్శనముఁ జేయించి నన్ను చంద్రునిఁ జూచిన కుముదినిం గావించి యానందింపఁ జేయుము.

భిక్షు— (తనలో) ఏదారినిబోదునో! (ఆలోచించి) ఆదారియు నీదారియు నేల రాజమార్గముననే పోదును, (ప్రకాశము) ఉపాసికా! రమ్ము. (ఆలకించి) రాజమార్గమునఁ బెద్దకోలాహలము జరగుచున్న దిది యేమయి యుండును?

వసం— (ఎదుటఁజూచి) చాలమంది గుమికూడిరి. ఆర్య! ఇదియేమయి యుండునో కనుఁగొనుము వసుంధరకుఁగూడ బరువగున ట్లుజ్జయిని యంతయు నొక్కచోటికే యొరగినది.

చండా-ఇదిగో నైదవఘోషణాస్థానము. ఐదవసారి డిండిమము మ్రోగింపుమురా! (మరల డప్పు మ్రోగించుచు వెనుకటియట్లే చాటింతురు) చారుదత్తా! సిద్ధముగా నుంటివా? భయపడకుము మెుక్కుతుత్రిలోఁ గడతేర్తుము.

చారు—ఓ భగవతు లగు దేవతలారా!

భిక్షు—(విని తొందరపడి) ఉపాసికా! నీవు చారుదత్తునిచేఁ జంపఁబడితి వని తగవు లేఁబడి చారుదత్తుఁడు చంపఁబడుచున్నాఁడు.

వసం—(సంభ్రమముతో) అమ్మయ్యో! దురదృష్టవతి నగు నాకై యార్యచారుదత్తుఁడు చంపఁబడుచున్నాఁడా! అయ్యా! త్వరగ దారిచూపుము త్వరగ దారిచూపుము.

భిక్షు—అమ్మా వేగరమ్మా వేగరమ్మా. బ్రతికియుండఁగాఁ జారుదత్తుం గనుఁగొందము.
ఆర్యులారా! దారియిండు దారియిండు

వసం—ఆర్యులారా దారి దారి!

చండా—అయ్యా! చారుదత్త! రాజనియోగము నెఱపకతీఱదు. నీవు తలఁచుకోఁ దలఁచినది తలంచుకొనుము.

చారు—వెయ్యేల ("అధికృతుల వాక్యముల చేత" అనుపద్యముం జదువును)

చండా—(కత్తియెత్తి) అయ్యా! వెల్లకిలంబడి సమముగఁ బరుండుము. ఒక్క వ్రేటుతో నీతల నఱికి నిన్ను స్వర్గమునకుఁ బంపించెదను.

చారు—(చండాలుఁడు చెప్పినట్లు చేయుచున్నాఁడు.)

చండా—(నఱకఁబోయి చేతినుండి కత్తి జాఱిపోవుటనభినయించి) హా! యెంత కష్టము.

క. పిడి రోసముగా లాగియుఁ, బిడి గట్టిగఁ బట్టుకొనియుఁ బిరుతివియక నే
వడినెత్తినఖడ్గం బిలఁ బడియెనహో యశనిసన్నిభం బిదియకటా.

ఇది యిట్లగుటఁ జూడ నార్యచారుదత్తున కీయాపద దాఁటునని నేననుకొని యెదను. ఓయమ్మా సహ్యవాసినీ! అనుగ్రహింపు మనుగ్రహింపుము. చారుదత్తున కీయాపదదాఁటించితివా నీవు మాచండాలకులము నెల్ల ననుగ్రహించినట్లే.

ఒకచం—మనము రాజాజ్ఞ నెఱవేర్చుకొందము.

రెండవచం—కానీ, యట్లే కావింతము.

(అని యిరువురును జారుదత్తుని శూలారోపము చేయఁదలఁతురు)

చారు—("అధికృతులవాక్యములచేత" నను పద్యముం జదువును)

వసంత / భిక్షు—(చూచి) వలదు వలదు. ఆర్యులారా! చంపవలదు. ఏనిమిత్తమున నీ మహానుభావుఁడు వధింపఁబడియెడినో యాదురదృష్టవతి ఇదిగో వచ్చినది.

చండా—(చూచి)

గీ. కురులు వీడి బుజమ్ములపైఁ బొరలుచుండ
మృదుతరంబైనకుడిచేయి మింటికెత్తి
యీమె యెవ్వరో కో యిటులేగుదెంచు
చుండె వలదంచు ఘోషించుచుండెనకట.

వసం—ఆర్యపుత్రా! చారుదత్త! ఇదియేమి. (అని యురముపైఁ బడును.)

భిక్షు—ఆర్యా! చారుదత్త! ఇది ఏమి? (అని కాళ్లపైఁబడెను)

చండా—(భయంపడుచుఁ దొలంగి) ఈమె వసంతసేనయే నా ? మనమీసజ్జనుని చంపకుంట మేలాయెను.

భిక్షు—(లేచి) ఓరీ ! చండాల ! చారుదత్తుఁడు జీవించియుండెనా !

చండా—నూరేండ్లు బ్రతుకును.

వసం—(సహర్షముగ) నేను బ్రతికితిని.

చండా—యాగవాటమునకుం బోయిన రాజుగారితో నీవృత్తాంతముఁ దెలిపెదము. (అని నిష్క్రమింపుచుండ)

శకా—(వసంతసేనం జూచి భయముతో) ఈగర్భదాసి బ్రతికియేయున్నది. ఇఁక నా ప్రాణముల కాస వదలుకోవలయు కానీ, పాఱిపోయెదను. (పాఱిపోవును.)

చండా—(శకారుని సమీపించి) ఓరీ మనకు వసంతసేన నెవరు చంపిరో వానిం జంపుమని రాజుగా రానతిచ్చిరి కావున మనమీసంస్థానకుని బట్టికొందము రా (కూడఁబరుగెత్తుదురు.)

చారు—(అబ్బురముతో)

గీ. చంపుటకు మీఁది కెత్తిన శస్త్రముండ
మృత్యుముఖమున నేనుండ వృష్టిలేక
యెండుసస్యంబునకు ద్రోణవృష్టిపగిది
నిపుడు నన్నుఁగాచినది యీమె యెవ్వరొక్కొ.

(చూచి గుర్తించి) ఆహా ! యీమె వసంతసేనయే (వితర్కించి)

గీ. నాకు విభ్రాంతి పట్టులున్నయది యేమొ
కానిచో రెండవవసంతసేన యేమొ
చచ్చిపోయియు దివినుండి వచ్చినదియొ
మరల; లేకున్న నన్నుతమో మరణవార్త.

అదియునుం గాదు.

గీ. నాకలోకంబునుండియు నన్ను బ్రతుకఁ
జేయఁగా నిటు వెండి వచ్చినదియామె;
కాదుకాదీమె యెవతెయో కాని యామె
రూపువహియించి నాసిల్లఁ బాపవచ్చె.

వసం—(కన్నీరు దిగజాఱ లేచి కాళ్లపైఁబడి) ఆర్యపుత్ర ! నీ కిన్నిపాట్లు తెచ్చిపెట్టిన యాపాపాత్మురాలను నేనే,

(తెరలో) చిత్రము! చిత్రము! వసంతసేన బ్రతికియున్నది (అని యేక స్వరముగా పలుదఱును బలుకుదురు)

చారు—(విని వేగ లేచి స్పర్శసుఖ మభినయించి కనులు మూసికొనియె హర్షగద్గద స్వరముగా) హా ప్రియురాలా! వసంతసేన! నీవేనా!

వసం—ఔను నేనే యాపాపాత్మురాలను.

చారు—(చూచి సంతోషముతో) వసంతసేనయే (ఆనందముతో)

గీ. మృత్యుముఖమున నే నున్నయిపుడు నీవు
తరలు కన్నీట నక్కున దడుపుకొనుచు
బ్రతుకఁగాఁ జేయ నెటనుండి వచ్చినావు
చెలువ పుట్టింపఁగా మంత్రవిద్య వోలె.

ప్రియురాలా! వసంతసేన!

గీ. నీకొఱకుఁ జంపఁబడు మేను నీవు వచ్చి
ప్రోచితివి కాన నిదియు నీపుణ్య మతివ
పహహ! ప్రియసంగమప్రభావంపుగరిమ!
మరల బ్రతుకునె చచ్చినమానవుండు.

మఱియు నోకాంతామణీ! చూడుము—

గీ. చావుకొఱకైన రక్తవస్త్రంబ రక్త
కుసుమమాలయు నను బెండ్లికొడుకుఁ గాఁగఁ
జేసినవి నేఁడు మరణసూచిత ప్రతోద్య
రావమే నాకు మంగళరావ మయ్యె.

వసం—ఆర్యుని యతిదాక్షిణ్యము కతమున వాటిల్లిన యీముప్పునకు మూలమెట్టిది?

చారు—ప్రియురాలా! నీవు నాచేఁ జంపఁబడితివని.

గీ. పూర్వవైరంబు మదిలోనఁ బొదల రాజు
గారి శేస్యాలకుఁడనంచు గర్వపడుచుఁ
బాపి యగువాఁడు నేరంబు మోపె, దాని
కధికృతులు శిక్షవిధియించి రవలవిట్లు.

వసం—(చెవులు మూసికొని) పాపము శాంతించును గాక; వానిచే మీరు కారునేఁ జంపఁబడితిని.

చారు—(భిక్షువుం జూచి) తరుణీ! యితఁడెవ్వఁడు?

వసం—ఆపాపాత్ముఁడు ఛంపఁగా నన్ను బ్రతికించిన పుణ్యాత్ముఁ డితఁడు.

చారు— ఈయకారణబాంధవులు మీ రెవరయ్యా!

భిక్షు— ఆర్యా! నన్ను మీరు గుర్తింపనైతిరి. దేవరకాళ్ళు పిసుకు సంవాహకుండను. జూదమాడి యోడిపోయి ఋణపడి వారిచేఁ దఱుమఁబడి యీబుద్ధోపాసికయింటఁ దూఱితిని. ఈమె మీవాఁడనని జాలిపడి తనబంగారునగ యొకటి యొసఁగి నన్ను ఋణవిముక్తునిఁ గావించినది తదాది ద్యూతనిర్వేదంబున బౌద్ధసన్యాసినైతి. ఈమె బండి మార్పుడువలనఁ బుష్పకరండక జీర్ణోద్యానమునకుఁ గొంపోఁబడియె. ఆపాపాత్ముఁడు తనపొత్తున కంగీకరింపలేదని బాహుపాశబలాత్కారంబునం జంపె; పిమ్మట నేఁజూచితిని.

(తెరలోఁ గలకలము)

కవిరాజవిరాజితము.

జయమగు దక్షునిజన్నముఁ ద్రోచినస్వామికి గోపతికేతునకున్
జయమగుఁ గ్రౌంచరసాధరభేత్తకు షణ్ముఖముల్ గలదేవరకున్
జయమగు శాత్రవసంతతి నెల్లప్రజల్ జయపెట్ట జయించిన య
ద్వయమగు విశ్రమవత్త తగంధరఁ దన్పెడు నార్యకభూపతికిన్.

శర్విలకుఁడు—(ప్రవేశించి)

ఉ. పాపనృపాలకుండయిన పాలకునిం గడతేర్చి యార్యకుం
భూపరిపాలనోచితుని భూపతిఁజేసి తదాజ్ఞ మోయుచున్
బాపమతుల్ మహాపదకుఁ బాలొనరించిన చారుదత్తునం
తాపముఁ బాపఁగా మనము తద్దయు నన్ బురికొల్ప నేగెదన్.

కం. బలమంత్రహీను శాత్రవుఁ బొలియించి, ప్రజాళి నెగులు బోకార్చిన మా
కిలయెల్లఁ గైవసంబై యలరుఁ ద్రిలోకాధిపత్య మమరపతికిటుల్.

కావున వేగమపోయి చారుదత్తుం గాపాడవలయును. (ముందు చూచి) ఇదె జనసమవాయ; మూతఁడిందుండవలయు. క్షితిపతియగు నార్యకుని మనోరథ మీకార్యము గావించిన సఫలం బగును. (త్వరగా నడచి) జాల్ములార! యొత్తిగిలుండు (చూచి సంతోషముతో) ఇదిగోఁ జారుదత్తుఁడు వసంతసేనతోఁగూడ బ్రతికియే యున్నాఁడు. ఏమిపుణ్య మేమిపుణ్యము! మాస్వామియగు నార్యకభూపతి మనోరథములన్నియు నేఁటికి సంపూర్ణములైనవి.

చ. వ్యసనమహార్ణవాంతరమునందు మునింగియు, శీలమున్ గుణ
ప్రసరముచేఁ జెలంగు సుధువంబనఁ బొల్చు వసంతసేనచే
ననువులు బాల్చి నాప్రియవయస్యుఁడు కంటఁబడెన్ విధుంతుద
గ్రసనము దాఁటి రేనెలుఁగు కౌముదితో నలరారుచాడ్పునన్.

ఇయ్యనఘునియింట దొంగతనముఁ గావించిన మహాపాతకిని నే నెట్లీతని సమీపింతును! కానీ; ఇతడు సర్వసముఁడుకదా! (దగ్గఱకుఁబోయి దోసిలియొగ్గి) ఆర్యా చారుదత్త!

చారు—అయ్యా మీరెవరు?

శర్విల— గీ. అపహరించెనో నిశివేళ న్యాసమిడిన
నగను మీయింటి కేఁడు కన్నంబుత్రవ్వి
యామహాపాతకుఁడ నేన యనఘ నిన్ను
శరణమంటిని నన్ను రక్షణము సేయుము.

చారు—సఖా! అట్లుకాదు. నీవు నా కుపకృతియే చేసితివి (అని కౌఁగిలించును)

శర్విల— అయ్యా యిం కొకమనవి చిత్తగింపుము.
గీ. ఆర్యనుతచర్యుఁ డైన యా యార్యకుండు
కులముమానంబు రక్షించుకొనుచు నేఁడు
యజ్ఞవాటంబునందు దురాత్ముఁ డైన
పాలకుని రూపుమాపె దోర్లీల మెఱయ.

చారు— ఏమి!

శర్వి— క. నీబండి యెక్కి యెవ్వఁడు తా బైటికిఁబోయి యాపదం దరియించెం దాబయుగు పాలకుం బలిగాఁ బోరిఁగొనె నాతఁ డార్యకక్ష్మాపతియే.

చారు— శర్విలకా! పాలకుఁడు వేపల్లెనుండి రప్పించి నిష్కారణముగఁ గారాగారమునం దుంచఁగా నీవు విడిపించిన యార్యకుఁ డను గోపాలదారకుఁడా!

శర్వి— భట్టారకు లానతిచ్చిన యతఁడే.

చారు— మనకుఁ బ్రియము మనకుఁ బ్రియము.

శర్వి— ఉజ్జయినీరాజ్యమందుఁ బ్రతిష్ఠింపఁబడినవెంటనే మీమిత్రుఁ డార్యకుఁడు, వేణానదీతటమునందలి కుశావతీరాజ్యము మీకు సమర్పించెను. మిత్రుని యీప్రథమ ప్రణయము మన్నింపఁబడుఁగాక. (వెనుకకుఁదిరిగి) ఓరోరి పాపాత్ముఁడగు రాష్ట్రియశరు నిటు కట్టితెండురా!

(తెరలో) శర్విలకాజ్ఞకు బద్ధులము.

శర్వి— ఆర్యకమహారాజు 'మీగుణోపార్జితమగు నా యీరాజ్యము మీ చిత్తానుసారముగ నుపయోగింపుఁడని' ఆర్యునకు విన్నవించుచున్నాఁడు.

చారు— ఏట్లు! రాజ్యము మద్గృహోపార్జితమా ?

(తెరలో) ఓసీ! రాష్ట్రియస్యాలక రారా! నీవు చేసిన దుర్ణయంబునకు ఫలము ననుభవింపుమురా.

(తరువాత రాజపురుషులచే చెక్కిళ్లు విఱిచికట్టఁబడిన శకారుఁడు ప్రవేశించును)

శకా— ఆశ్చర్య మాశ్చర్యము !

గీ. పరుగిడితి దూరముగ గర్దభంబుమాద్రి,
గట్టితెచ్చిరి కుక్కరమ్మ కరణిమరల
దిక్కు కాన్పింప రెవ్వరు దిక్కునాకు,
శరణుఁజొచ్చుట కెవ్వారు శరణునాకు.

(ఆలోచించి) కానిమ్ము శరణాగతత్రాతయగు చారుదత్తునే శరణందును (అని చారుదత్తునిసమీపించి) రక్షించుమయ్యా! రక్షింపుము (అని కాళ్ళపైఁబడును)

(తెఱలో) ఆర్య చారుదత్త! వదలుము వదలుము. వీనిం జంపెదము.

శకా— అయ్యా! అశరణశరణ! నన్ను రక్షింపుము.

చారు—(దయతో) శరణాగతునక భయము మిచ్చితిని.

శర్వి—(వేగముగా) వీనిం జారుదత్తునొద్దనుండి యావలకుం దీసికొనిపొండురా !

(చారుదత్తునితో) అయ్యా! ఈపాపాత్మునకుఁ జేయఁదగినశిక్ష విధింపుము.

క. శూలారోపము చేయుదుమా ? లే కశ్వింతుమా శ్వమండలికిం ? బా
శాలం గట్టుదుమా ? ఱంపాలం గోయుదుమ ? చెప్పు త్వరగా మాకుఁ.

చారు—వీనికి విధింపవలసినశిక్షఁ జెప్పెదను అట్లు చేసెదరా.

శర్వి—సందేహ మేమున్నది ?

శకా—భట్టారక ! చారుదత్త ! శరణంటిని. నన్నుఁ గాపాడుము, కాపాడుము. మీకుఁదగినట్లు చేయుఁడు. ఇఁక నెన్నండిట్టి దుష్కృత్య మాచరింపను.

(తెరలో) చంపుఁడు చంపుఁడు. పాతకి నేల బ్రతుకనిచ్చుచున్నారు.

వసం— (చారుదత్తుని కంఠమునుండి వధ్యమాలందీసి శకారునికంఠమున వైచును.)

శకా— గర్భదాసీపుత్త్రి! అనుగ్రహింపు మనుగ్రహింపుము. నిన్ను మరల నెన్నఁడును జంపను; రక్షింపుము.

శర్వి— దూరముగాఁ దీసికొనిపొండురా! అయ్యా చారుదత్త! వీనికేమిశిక్షఁ గావింపవలయునో వేగ సెలవిమ్ము.

చారు— చెప్పెదను. నేను జెప్పినట్లు చేయుదురా ?

శర్వి— సందేహమేమి!

చారు— సత్యమేనా?

శర్వి— సత్యము.

చారు— అటులేని శీఘ్రముగా—

శర్వి— చంపుమనియా?

చారు— కాదు కాదు. వదలుఁడు.

శర్వి— ఏల విడువవలయును?

చారు— గీ శత్రువపరాధి యగుగాఁక శరణ మనుచుఁ
చరణములమీఁదఁ బడెఁగాన శస్త్రమెత్తి
చంపరాదయ్య—

శర్వి— అటులేని గుక్కలచేఁ గఱపింతమా.

చారు— వలదు.

ఉపకృతి సలిపి వానిఁ బ్రాణములతోడ విడుచుటేయగును శాస్తి.

శర్వి— ఎంత యాశ్చర్యముగా నున్నది? ఏమి చేయుదు నార్యుఁడిట్లు పలుకుచున్నాఁడు.

చారు— నీవేమియుఁ జేయవలదు, వీనిని వదలుము.

శర్వి—కానీ; వదలెదను.

శకా—అమ్మయ్య! బ్రతికితిని. (అని నిష్క్రమించును.)
(తెరలోఁగలకలము)

కటకటా! చారుదత్తుని భార్య ధూతాంబ, చీర చెఱఁగు పట్టిలాగుచు కాళ్ల కడ్డుపడుచున్న దారకునినైతె మావలకుం ద్రోచివైచి నీరునిండిన కనులతో వలదని వేఁడు వారులఁబాటింపక, పావకజ్వాలలోఁ బ్రవేశించుచున్నది. ఎవ్వరువలదన్నను మానకున్నది.

శర్వి—(విని తెరవంకఁ జూచి) చందనకా! ఏమది?

చంద—(ప్రవేశించి) శర్విలకా! నీకుఁ గనఁబడుటలేదా! మహారాజసదనమున కెడమవైపున గొప్ప జనసమూహము కలదు చూడుము. నేను ధూతాంబగారితో 'నమ్మా! సాహసము వూనకుము. మాచారుదత్తభట్టారకుఁడు బ్రతుకు' నని విన్నవించితిని. దుఃఖసముద్రములో మునిఁగి యున్నయామె కెవ్వరు నమ్మకము చెప్పఁగలరు?

చారు—(ఉద్వేగముతో) హా! ప్రియురాలా! కాంత! నేను బ్రతికియున్నను నీకీ సాహసకృత్యమేల! (మింటికంకఁజూచి గాఢముగా నూర్పుచ్చి.)

గీ. చారుచరితరో! తావకచరితములు ధ
రాతలంబున నుండఁగా రాని దైనఁ
బరమసాధ్వివి నీవిట్లు పతిని విడిచి
స్వర్గలోకసుఖంబు గాంచంగఁ జనెదు.

(అని విలపింపఁ దగుచున్నాఁడు)

శర్వి—ఓహో! ప్రమాద మగుచున్నదే!

గీ. ఆర్యుఁ డిప్పుడు సమ్మోహ మధిగమించె
నడుపుమర వేగ నీవు చందనక యటకు
లేకయున్నఁ గటా! యీ మహోపకరణ
వ్యర్థమైపోవుఁ గాని మనయత్న మెల్ల.

వసం—అయ్యా! [illegible] మాణిక్యము! అచ్చటికిఁ బోయి యాపూజ్యురాలిం బ్రతికింపుము. ధైర్యము వహింపుము. లేనిచో ననర్థము వచ్చును.

చారు—(వేగ మెదురేఁగి) ప్రియురాలా! ఎచటనుంటివి! నాకుఁ బ్రతివచనమీయవేమి?

చంద—అయ్యా! ఇటు దయచేయుము.

(అందఱును బరిక్రమింతురు.)

(పిదప నగ్నిజ్వాలయందుఁ బ్రవేశింప ధూతాంబయు నామె చెఱఁగులాగుచున్న రోహసేనుఁడును వారి ననుసరించుచున్న విదూషక రదనికలును బ్రవేశింతురు.)

ధూతా—(కన్నీటితో) తండ్రీ! నన్ను వదలుము. నాకు విఘ్న మొనరింపకుము. ఆర్యపుత్రుని యమంగళవార్త నేను వినఁజాలను. (లేచి [illegible] చెఱఁగు లాగికొని అగ్ని నిసమీపించును.)

రోహ—అమ్మా! నన్నుఁ గాపాడుము! నిన్ను వదలి నే నెట్లు బ్రదుకుదును?

(అని చేలాంచలమును మరల గ్రహించిలాగును)

విదూ—పూజ్యురాల! బ్రాహ్మణి యొంటరిగాఁ జితాధిరోహణము చేయఁగూడదు. అట్లు చేసినఁ బాపమనియు ఋషులు చెప్పుచున్నారు.

ధూతా—అయ్యా! ఆర్యపుత్రుని యమంగళవాక్యమును వినుటకంటెఁ బాపమైనను మేలుగదా!

శర్వి—(ముందుఁజూచి) ధూతాంబ యగ్నిజ్వాలను సమీపించుచున్నది. కావునన్ యార్య ! త్వరగా నడువుము త్వరగానడువుము !

చారు—(గబగబ నడుచుచున్నాఁడు)

ధూతా—రదనికా ! పిల్లవానిం బట్టుకొనుము. నాకొంగు నెవఁడో నేర్పుకొనుచున్నాఁడు.

రద—(దైన్యముతో)అమ్మా ! నీయుపచేళమే నేనును అనుసరించుచున్నాను.

ధూతా—[విదూషకుంజూచి] ఆర్యా ! నీవు పిల్లవానిం బట్టుకొనుము.

విదూ—[ఆవేగముతో] సమీహితసిద్ధికొఱకు యత్నించువారొక యోగ్యబ్రాహ్మణుఁ బురస్కరించుకొని పోవలయుఁ గావున నీకు ముందు నే నగ్నిలోఁ బ్రవేశింతును.

ధూతా—వీరిరువురును నివారించుచున్నారే ! [పుత్రునిఁ గౌఁగిలించి] అబ్బాయి ! రోహసేన ! నీయాత్మను నీవే కాపాడుకొనుము లేనిచో మాకుఁ దిలోదక మిచ్చువా రెవ్వరు ? అతిక్రాంతమనోరథులమగు మాకింక నేమి కావలయును ? ఇఁక నార్యపుత్రుఁడు వచ్చి నన్నుఁ గాపాడుట యబద్ధము.

చారు—(విని శీఘ్రముగా దగ్గఱి) నేనే బాలకుని రక్షించువాఁడను. ఇదిగో వచ్చితిని. (అని పిల్లవాని నెత్తి కౌఁగిలించుకొనుచున్నాఁడు)

ధూతా—[చూచి] అమ్మయ్యా! ఆర్యపుత్రుని కంఠధ్వనివలె నున్న దే ! [మరలనిపుణముగాఁజూచి సంతోషముతో] ఆర్యపుత్రుఁడే! ప్రియము! ప్రియము!

రోహ—(తండ్రింజూచి సంతోషముతో) మాతండ్రియే నన్నుఁ గౌఁగిలించుకొనుచున్నాఁడు. ఇదియేమి యాశ్చర్యము ! అమ్మా! మనము బ్రదికితిమి. తండ్రి నన్నుఁ గాపాడుచున్నాఁడు. (తండ్రిని మరలఁ గౌఁగిలించుకొనుచున్నాఁడు)

చారు—(భార్యతో) గీ. ప్రియుఁడు నీదుభర్త జీవించియుండ
నిట్టి ఘోరప్రయత్న మిదేల నీకు
మింటిమానిక మస్తంగమింపకుండఁ
బద్మిని మొగుడ్చునే నేత్రపద్మములను.

ధూతా—ఆర్యపుత్ర ! కనుక నే దాని నచేతనమందురు.

చారు—(ముద్దు పెట్టుకొనుచున్నాఁడు.)

విదూ—(చూచి సంతోషముతో) హీహీహీ ! ఈకన్నులతోనే నాప్రియవయస్యునిఁ జూచుచున్నాఁడను. ఆహా ! పతివ్రతాప్రభావము. జ్వలనజ్వాలాప్రవేశప్రయత్నముచేతనే ప్రియసమాగమును బొందినది. నానెచ్చెలికి జయము జయము !

చారు— మిత్రమా! రమ్ము (కౌఁగిలించుకొనును.)

రద—ఆహా! ఏమి సంఘటనము! ఆర్యా! నమస్కారము. (పాదములపైఁ బడును)

చారు— (వీఁపు చేతితో నిమురుచు) రదనికా! లెమ్ము. (లేవఁ దీయును.)

ధూతా— (వసంతసేనం జూచి) చెల్లెలా! పుణ్యమూలమున జీవించితివి!

వసం—నే నప్పుడు గా దిప్పుడు జీవించితిని. (ఇరువురును గౌఁగిలించుకొందురు.)

శర్వి— దైవయోగమున నార్యుని సుహృద్వర్గ మంతయు జీవించినది.

చారు—మీయనుగ్రహముచేతనే

శర్వి— ఆర్య! వసంతసేన! రాజు పరితుష్టుఁడై నిన్ను వధూశబ్దముచే సత్కరించుచున్నాఁడు.

వసం.— అయ్యా! కృతార్థురాలనైతిని.

శర్వి— (వసంతసేనకు మేలిముసుఁగువైచి బహూకరించి చారుదత్తునితో)
ఆర్య! యీసన్న్యాసి కేమిచేయవలయును?

చారు— భిక్షు! నీయభిమత మేది?

వసం— శరీరములయందలి యనిత్యత్వమునిట్లు చూచుచున్న నాకుఁ బ్రవ్రజ్యాశ్రమమునందె యత్యాశ కలుగుచున్నది.

చారు—వీని నిశ్చయము దృఢము, కావునితండు బౌద్ధవిహారముల కన్నిటికిఁ గులపతి యగుఁగాక.

శర్వి— ఆర్యుఁడు చెప్పినట్లు చేయుదము.

భిక్షు— నాకది ప్రియమే.

వసం— నాకిప్పుడు నిజముగాఁ బ్రాణములు వచ్చినవి.

శర్వి— స్థావరకునకుఁ జేయవలసిన యుపకారమేమి?

చారు— వానికి దాస్యము వదలుఁగాక. ఆచండాలు రందఱుఁ జండాలరాజులగుదురుగాక! చందనకుఁడు పృథివికి దండపాలకుఁడై యుండుఁగాక! రాష్ట్రియస్యాలకుఁడు తనపదవి యందుండుఁగాక!

శర్వి—అన్నియు బాగుగ నున్నవి గాని శకారుని మాత్రము చంపవిందు.

చారు—శరణాగతున కభయమిచ్చితినిగదా. ('శత్రువపరాధియగుఁగాక' యను పద్యముం జదువును.)

శర్వి—అయ్యా! తమ కింకేమి ప్రియ మాచరింపవలయును?

చారు — నా కింకేమి ప్రియము కావలయును ?

శా. చారిత్రంబు పవిత్రమయ్యె రిపుఁ డస్మత్పాదము ల్వ్రాలె ము
త్తారాతిం బరిమార్చి యార్యకుఁడు రాజయ్యెన్ సుహృన్మైత్రి ఈ
స్త్రీరత్నంబగు ప్రేయసిం జెలిమికాని న్నిన్నుఁ గన్గొంటి నే
గోరంగాఁ దగునట్టి దేది యిఁక నాకుం జెప్పుమా మిత్రమా !

ఉ. కొందఱ లోఁ జొప్పనర్పు మఱికొందఱ హెచ్చొప్పనరించుఁ గొందఱ
న్నందఁగఁ జేయుఁ గొందఱ గనూనముదంబు ఘటిల్లఁ జేయు ని
ట్లందఱ కన్నిరీతుల మహావ్యసనోదయము ల్పొనర్చుచు
న్నందునఁ జెప్పుచుంద్రు విధియాటల నేతపుఁగుండన్యాయమున్.

అయిన నిట్లగుఁగాక !

స్రగ్ధర.

పాలింపంబడుఁగాత గోవుల్ వసుమతి ఫలసంపత్తిచే మీఱుఁగాతన్
గాలంబందున్ సువృష్టుల్ గలుగుత నలరుంగాత మందానిలంబుల్
క్రాలుంగాతన్ సుఖంబుల్ జనుల కభిమతుల్ గావుత న్నెల్లవేళ్ళన్
పాలింతుర్గాత భూమిం బ్రశమితరిపులై పార్థివుల్ ధర్మనిష్ఠన్.

(అందఱును నిష్క్రమింతురు.)

ఇది శ్రీ తిరుపతి వేంకటేశ్వరాంధ్రకృతం
బగు మృచ్ఛకటికంబను ప్రకరణంబున సంహారమను పేరుగల

దశమాంకము.

సర్వము సంపూర్ణము.



## ముఖ్యముగా సవరించుకొనఁదగినవి.

వదువ, లోఁగిటి, వేల, గ్రుంకఁగ, డాగిన, రదనికనుసుమా, అమ్మవారు, యురువురు, లోకువ, ఎందాక, వదుచు, జూచుచు, కసుపెట్టి, ఆఁబెయ్యి, పానుకూలమా, మగుల, సంస్థానకుఁడేనట, విడచితి, నిశి, కర్యి, కాలుర, దుర్భేద్యమైన, చక్ర్యగా, యొదయుంరాలి, బడఁతుల, గాడిదె, వాఁటి, దూషణులు, ఒండొటికి, అవలించు, బలువు, సంకిలియు, కాచుము, పెండ్లిలో వల్లకాటిలో, తత్యము, దత్తుఁడు ఎడ్ల, వరకే, హృదము, బైటకు, ప్రూసువయి, మీయిరువురి, స్నేహితుఁనై, వలకున్, మేక, దుష్పదమున, బోకార్చి, చుంద్రి, మానునివేతి, మైత్రే, యుద్రిభా,

చదువరులారా ? పై నుదాహరించిన 52 చోట్లను గల వ్యత్యాసములు మేము చూపకున్నను సవరణ కాఁదగినవే, కాని కొందఱిప్పుడు కొత్తరకపు విమర్శకులు బయలు దేరినారు వారిలో నిద్దఱు శిరోమణులు కలరు. వారిసాహసము వర్ణనాతీతము.

ఇట్టి శిరోమణులిద్దఱు నుపాధ్యాయులు. ఇఁక విద్యార్థుల భాగ్యము నేమని వర్ణింతును, ఆశిరోమణులవంటివా రింకను గొంద ఱుండకపోదురా అని కొన్ని స్థలములు ప్రమాదపడినవి చూపఁబడినవి, ఆప్రమాదములు ముద్రాప్రమాదములన్నను ఆ శిరోమణు లంగీకరింపరు, కావున గ్రంథకర్తలవే అని వారిని సంతసపెట్టక తప్పదు- సజాతీయములు కొన్ని చూపనేలేదు- ప్రుటియు, దుర్ణయ, దుర్ణీతి, అనుశబ్దములు టవర్గ పంచమాక్షరముతోడనె గూర్చితిని. భారత మహాకవులు ప్రాసస్థానమందు వాడుటయే కాక, వారినిబట్టి శ్రీనాథాదులుకూడ ప్రాసస్థానమున వాడియున్నారు, వారికాలమునాఁటికి ఆశబ్దములయందలి ణత్వము నిర్బాధముగాని యిటీవల నందలి ణత్వమునకు బాధకల్గినది. అయినను ఆంధ్రకవులకు పరమ ప్రమాణమైన భారతము నుల్లంఘించినచో గత్యంతరము లేదుగాన నాంధ్రకవులందఱును ణకారఘటితము గనే వ్రాసికోవలయునని భారతవిశేషములలో మేము వ్రాసియున్నారము శిరోమణులలో నొకరు దానిమీఁద నేమోకొంత తన పాండిత్యమును బ్రకటించి ఖండించెను. ఆయన మాకుఁ దెలియని విషయమును బోధించినట్లు సంతసపడుటకలదు. పోవము, ఆయన సంతోషము నేల తగ్గింపవలెను. ఆయన అట్లే సంతసపడుఁగాక,

అంతతో తృప్తిపడిన బాగుండును. తృప్తి లేదు. ఆయన నోటిని వర్ణించుటకు శక్తి నాకేకాదు, వేయోకరికిని లేదనుకొందును. భగవంతుఁడాయనకు సద్బుద్ధిప్రదాత యగుఁగాక. ఇఁక గ్రంథకర్తృప్రమాదములుగానున్నవి రెండు వ్రాసి సవరణ నుపపాదింతును.

(1) ప్రాకృతుండవు నిగమార్థమేల తెల్పెద వేలోకో॥

ఇచ్చట యతి చెడినది. ప్రకృతిశబ్దమునకంటె అణ్ప్రత్యయమువచ్చి ఆది వృద్ధి వచ్చిన ప్రాకృతశబ్దమున స్వరము విలుగదుకదా? అందుచేత—

సీ॥ ప్రాకృతుండవునీవు ప్రాబల్యములను విప్పెదేలోకో, అని సవరించుకోఁదగు—

మఱియు నా పద్యమునందే—

నడిమింటి వెలుఁగులరొయిదయుఁజూడఁగ—

అనుచరణమును—

నడిమింటి వెలుఁగుల నాథుఁజూడఁగ॥ అనియు

మఱియు దశమాంకమున మొదటిపద్యములో తుదిభాగమునయున్న. "నేరు! పలవడిగెను మన ; కద్దియేయగుఁగతమ్మ." అనుదానిని.

నేర్పుకలదమా ; కింకశంకలు వలదు నీకు.

అని యు సవరించుకోఁదగు. ఆయావిషయములు నాకిదివఱకుఁ దెలియకుండగనే కాలక్షేపముగుచుండెడిది నిన్నమొన్నటినుండి గుణవులు తెల్పుటకారంభించినారు. దానివల్లనే 67 వ వత్సరమున నీ పరమరహస్యములు బోధపడినవి కావున వారికి నా కృతజ్ఞతను దెల్పుచున్నాఁడను— ... గురువుల విషయమున నింతకన్న నేమి వ్రాయఁగలను—

వెం॥ శా॥

శ్రీరస్తు.

# ముద్రారాక్షసము

## ప్రథమాంకము

చ. తలపయి నున్న దేమి యది ధన్య? శశాకరరేఖ; పేరో?
తెలిసియు విస్మృతింగనితె దేవి! వెలందిని గూర్చి దేవ! నా
పలుకుట; యైనచో విజయపల్కెడి నుత్తరమంచు జాహ్నవిన్
జిలిబిలిపల్కులన్ మఱుఁగుసేయు శఠాత్ముఁడు మిమ్ముఁ బ్రోవుతన్.

ఉ. మేదిని క్రుంగకుండ మెలమెల్లఁ బదంబులు మోపి, స్వర్గలో
కాదులు దాఁటువం చభినయంబునఁ జేతులు కుంచుచుం, గనం
గా దహియించు నంచు సెగకన్నును మూయుచుఁ జోటు చాలమిన్
ఖేదమునం బురారి గమనించిన నృత్యము మిమ్ముఁ బ్రోవుతన్.

సూత్రధారుఁడు — ( నాంద్యంతమందు ప్రవేశించి ) అతిప్రసంగమేల! సామంత వటేశ్వరదత్తుని పౌత్రుండును మహారాజపృథుదత్తుని కుమారుండును నగు విశాఖదత్తునిచే రచింపంబడిన ముద్రారాక్షస నాటక మభినవాంధ్రమహాకవు లెవ్వరిచేనైన నాంధ్రీకృతంబైనచో నది ప్రయోగించి మమ్మానందపఱుచు మని పండితసభ నాకాజ్ఞాపించినది. కాని యాంధ్రీకృతప్రబంధములు రెండుగలవు. ఆరెంటిలో—

చ. తిరుపతి వేంకటేశ్వరులు తెల్గొనరించినదానియందు నా
కరయఁగ గౌరవంబు కలదయ్యదియే మృదుపద్యగద్యబం
ధుర మగుటన్ గవిత్వరసపూర్వ్యహితం దగుఁ గృష్ణరాయభూ
వరుఁడు సరస్వతీసఖికుపాయనమన్నటు లాదరించుటన్.

ఆకృతిరత్న మీకావ్యవిశేషవేదిని యగు పండితసభయందు వినియోగించుటం జేసి యేనును గృతార్థుండ నగుదును.

గీ. తెలివితక్కువవాఁడు విత్తినను మంచి
నేలపైఁ బడ్డ విత్తన మేల చెడును?
పొలము బలమైనదై యుండవలయుఁగాని
విత్తుగుణమేల పరివేళ్లు పాఱుటకును.

ఏ నిప్పుడు గృహంబునకుం బోయి గృహజనటియును బిలిచి సంగీతము పాడెదను. ( పరిక్రమించి తిరిగి ) ఇదిగో మాయిల్లు; లోనికిం బోయెదను. (నాట్య

మతో౯ (ప్రవేశించి చూచి) ఏమిది! నాయింట నేఁడేదియో యొక గొప్ప యుత్సవ మగుచున్నట్లున్నదే! పరిజను లందఱు వేవేగఁ దమతమకృత్యములు నెఱవేర్చుకొనుచున్నారు.

ఆ. వె. ఒకతె నీరుతెచ్చు నొకతె గంధముతీయు
నొకతె పూలుగ్రుచ్చు నొకతె యింక
నొక్కరితను గలసి హుంహుంహుమ్మను కల
ధ్వానమలరఁ బిండి దంచుచుండె.

అవుఁగాక! యిల్లాలిం బిలిచి యడిగెదను. (నేపథ్యముపంక జూచి)

క. రావే యుపాయశాలిని! రావే! గుణవంతురాల రాకార్యగురూ
రావే త్రివర్గసాధని! రావే గృహనీతివిద్య! రావే గృహిణీ!

నటి— (వచ్చి) ఆర్యపుత్ర! వచ్చితిని. ఆనతి దయచేసి నన్నుఁ గృతార్థురాలిం జేయుఁడు.

సూత్ర— ఆర్యురాలా! ఆజ్ఞా నియోగ మటుండనిమ్ము. నేఁడు పూజ్యులగు బ్రాహ్మణోత్తములం బిలిచి మనకుటుంబమును బావనము చేయఁదలఁచుచున్నావు, ఏమికార్యము? చెప్పుము. అభిమతు లగు నతిథులు దయచేసిరా! నేఁడు పాకవిశేషములు చేయించుచున్నావు.

నటి— ఆర్యపుత్ర! భగవంతులగు భూసురులం బిలిచితిని.

సూత్ర— నిమిత్త మేదియో చెప్పుము.

నటి— ఈనాఁడు చంద్రగ్రహణమఁట కాదా!

సూత్ర— నీకెవరుచెప్పిరి?

నటి— పురజను లంద ఱనుకొనుచున్నారు.

సూత్ర— ఆర్యా! అఱువదినాలుగంగములుగల జ్యోతిశ్శాస్త్ర మంతయుఁ దుద ముట్టఁజదివితిని. నాకుఁ దెలియదా! చంద్రోపరాగ మని నిన్నెవరో మోసపుచ్చిరి. దానికేమి, బ్రాహ్మణసమారాధన మాఁగక కావింపుము.

గీ. క్రూరపుంగాము కేతువు దారిచంద్రు
నిపుడసంపూర్ణ మండలు నింతి! యభిభ
వంబొనర్పంగఁ జూచెడు బల్మి మెఱయఁ—

(తెరలో)

ఆఁ. ఎవఁడురా! నేనుండఁగనే!

సూత్ర— గాచుచుండెను బుధసమా గమము యతని.

నటి— ఆర్యా! ఎవఁడతఁడు? భూమియందుండియే చంద్రుని క్రూరగ్రహాభియోగమువలన రక్షింపఁదలఁచుచున్నాఁడు.

సూత్రి— సత్యమె! నేనును గుర్తింపలేదు. కాని మరల నతనిచే ననిపించి మాట గుర్తించెద. ("క్రూరగ్రహసంగాము" అను పద్యముఁ జదువును)

(తెరలో)

ఎవఁడురా! నేనుండఁగనే చంద్రగుప్తు నభిభవింపఁ దలంచుచున్నాఁడు!

సూత్ర— ఆర్యా! తెలిసినది. కౌటిల్యుఁ డతఁడు.

నటి— (భయము నటించును.)

సూత్రి— ఆర్యా! భయపడకుము.

గీ. నందవంశంబు క్రోధాగ్ని యందు వ్రేల్చె
నతఁడు కౌటిల్యుఁ డను కుటిలాత్ముఁ డతివ!
మనము చంద్రగ్రహణ మనుకొనఁగ నతఁడు
మౌర్యచంద్రగ్రహణమని మదిఁదలంచె.

కావున మన మిటు పోదమురా. (నిష్క్రమింతురు.)

(ఇది ప్రస్తావన)

---

(పిదప ముడి విడిపోయిన జుట్టు సవరించుకొనుచుఁ జాణక్యుఁడు ప్రవేశించును.

చాణ— ఎవఁడురా! నేనుండఁగాఁ జంద్రగుప్తు నభిభవించువాఁడు.

గీ. ఆవులించిన మృగరాజు నాననంబు
నందుఁ గబళితగజరక్తసుందరమయి
సంజ జాబిల్లి రేకతో సామ్యమొందు
కోఱ నెవ్వాఁడు పెకలింపఁ గోరు బలిమి!

మఱియును—

ఆ వె. అలుకనిప్పునుండి వెలువడు పొగలీఁగ
నందకులమణచిన నల్లత్రాఁచు
ఈమదీయశిఖ మఱెవ్వఁడో వధ్యుఁడై
యిప్పుడైన ముడువ నీనివాఁడు!

ఆ నే నిపుడు ప్రతిన సమాప్తి నొందించుకొనియు వృషలుని యందలి యపే
క్షచే మరల శస్త్రముం జేపట్టుచున్నాను.

చ. పుడమికి ఱొమ్ముజబ్బు లనఁబోలిన నందుల నాలుమూఁగురన్
గెడపితిఁ, జెర్వునందు నలినిన్ బలె లక్ష్మిని జంద్రగుప్తునం
దిడితిని, నిర్వ్యరంబుఁ గల యెక్కువతక్కువ లెన్న నేల? పా
ల్పడిన దయాగ్రహంబుల ఫలంబులు రెండును బంచిపెట్టితిన్.

అదికాదు. రాక్షసుఁడు పట్టువడకుండ నందవంశ మున్మూలింపఁబడిన దన నెట్టిది! చంద్రగుప్తునకు రాజ్యమిచ్చుటన నెట్టిది! ఆహా! రాక్షసునకు నందవంశమునం గలభక్తిగుణము! నందాన్వయాంకుర మెవ్వఁ డున్నను రాక్షసునిచే వృషలునియొద్ద మంత్రిత్వముఁ జేయింపలేము. కావున మనము నిరుద్యోగులమై యుండఁగూడదు. నందవంశీయుఁ డెవ్వఁడేని జీవించియున్నంతమట్టుకు రాక్షసుఁడు చంద్రగుప్తునకు మంత్రి కాఁ డనియే కదా తపోవనమునం దున్నను దపస్వి యైనను సర్వార్థసిద్ధిం జంపించితిని. ఇపుడు రాక్షసుఁడు మలయకేతు నొకని సహాయునిగాఁ జేసికొని యస్మదుచ్ఛేదము కొఱకు గొప్పప్రయత్న మాచరించుచున్నవాఁడు (ప్రత్యక్షమైనగతి నాకాశమునందు లక్ష్యముంచి) మంచిది, మంత్రీ! రాక్షసా! మంచిది. సెబాసు, శ్రోత్రియుఁడా సెబాసు! బాగురే! మంత్రి బృహస్పతీ! బాగు!

ఉ. కొందఱు ద్రవ్యకాంక్షమెయిఁ గొల్తురు రాజుల ద్రవ్య మున్నచోఁ;
గొందఱు రాజు లాపదలఁ గూరిననాఁడు భవిష్యదాశచే
నుందురు వీడకుండ; నిటు లుర్వికిఁ బాసిన రాజులందు నీ
చందము భక్తిఁ జూపఁగల సాధులు మాత్రము దుర్లభుల్గదా!

కావుననే నీవు వృషలున కేపగిది మంత్రిత్వముఁ గావింతువో యని నిన్ను సంగ్రహించుటకై విశ్వప్రయత్నము చేయుచున్నాము.

ఉ. ప్రజ్ఞయు విక్రమంబుఁ గలవారల కుండదు స్వామిభక్తి; య
ప్రాజ్ఞులుఁ గాతరాత్ములగు వారల కుండిన లేదు లాభమున్;
ప్రజ్ఞయు విక్రమంబుఁ గలవారయి భక్తియుఁ గల్గియున్న కా
లజ్ఞులె భృత్యు; లన్యులు కళత్రముపోలికఁ బోష్యు లెప్పుడున్.

కావున నేనును బ్రస్తుతవ్యాపారమునం దుదాసీనుఁడనై యుండను. యథాశక్తి రాక్షసగ్రహణముం గుఱించి ప్రయత్నము సలుపఁబడుచున్నది. ఎట్లనఁగా:— వృషలపర్వతకులలో నెవ్వరు మడిసినను జాణక్యున కపకారమగును గదా యని రాక్షసుఁడు విషకన్యచే మాకుఁ బరమమిత్రుండును దపస్వియు నగు పర్వతకునిం జంపించె నని జనాపవాదముఁ బ్రచురింపఁ జేసితిని. లోకము

విశ్వసించుటకును నీవృత్తాంతమే యభివ్యక్త మగుటకును నీతండ్రిని రాక్షసుండే చంపించెఁ గాని చాణక్యుఁడు చంపింపలేదని భాగురాయణునిచే రహస్యముగ మలయకేతువునకుం జెప్పించి భయపెట్టించి పట్టణమునుండి యావలకుం బంపించితిని. రాక్షసునివలలోఁ బడి యున్నను నెటులేని మలయకేతువును నిగ్రహించెదను. మలయకేతువును నిగ్రహించినచోఁ బర్వతకునిం జంపించెనని రాక్షసునకు వచ్చిన యపకీర్తి మాసిపోవునేమో యనియును సంశయించుచున్నాను. అది మాయుట నా కిష్టము కాదు. స్వపక్షపరపక్షములయం దనురక్తాపరక్తులగు జనులను దెలిసికొనవలయునని బహువిధదేశవేషభాషాచార సంచారములయం దాఱితేఱిన వేగులవాండ్రఁ బనిచితిని గదా! వారు కుసుమపురమున నందామాత్యులు గాని నందమిత్రులుగాని చేయు గూఢాలోచనము లన్నియు గాలించి తెలిసికొనెదరు. పెక్కుకారణములు కల్పించి చంద్రగుప్తున కాబాల్యమిత్రులగు భద్రభటప్రముఖు లగు ప్రధానపురుషులను గృతకృత్యులం జేసితినిగదా! శత్రువులచేఁ బంపఁబడు విషదాయకులగు చారులం గనిపెట్టి తత్ప్రతివిధానము చేయఁగల యాప్తపురుషులను వారిభక్తి పరీక్షించి క్షితిపతి సమీపమునం గావుంచితిని. నాసహాధ్యాయియు మిత్రుండునగు నిందుశర్మ యను బ్రాహ్మణుఁడు శుక్రదండనీతియందును జతుష్షష్ట్యంగములు గల హోరాశాస్త్రమునందును బ్రవీణుఁడు కదా! అతని నందవధప్రతిజ్ఞానంతరము నందే బౌద్ధసన్యాసి వేషముతోఁ గుసుమపురమున కంపితి. అతఁడు నందమంత్రు లందఱితోడను విశేషసఖ్యము సంపాదించియే యున్నాఁడు. రాక్షసునకతనియందు మిక్కిలి విశ్వాసము కలదు. వానిచేఁ జేయింపఁ దగిన గొప్పకార్య మొకటి కలదు. అతఁడు నాకంటె నెంతయు దక్కువ కాఁడు. చంద్రగుప్తునివలెఁ బ్రధానప్రకృతుల మగు నస్మాదృశులయందు రాజ్యతంత్రభార మంతయు వదలి యుదాసీనుఁడై యుండువాఁడు కాఁడు. కాదు, అభియోగదుఃఖములన్నియు నన్యులచే వదలింపించుకొని యనుభవించు రాజ్యమే రాజులను సుఖపెట్టునది.

గీ. ఎంతబలవంతు లైన నరేంద్రులును గ
జేంద్రులం దమకుం దామ యెందు నేని
యార్జనముఁ జేసికొన్న దే యనుభవించి
రేని దుఃఖముపాలౌదు రిది నిజంబు.

( పిదప యమపటముతో నొకచారుఁడు ప్రవేశించును )

చారు—

గీ. యముని చరణంబులకు దండ మాచరింపుఁ
డితరదేవతలను గొల్వ నేమిఫలము ?

అన్యథక్షుల జీవంబు లపహరింప
నాతఁడే గద చాలిన యట్టివాఁడు.

గీ. క్రూరుఁడైనను యము మనసారఁ గొలిచి
భక్తి వశుఁ జేసికొన్నచో బ్రదుకవచ్చు
నందటికి మారకుండైన యమునివలన
బ్రదుకుమన్నాము మేము నిర్భయము గాఁగ.

ఇదిగో నొకయిల్లు; ఇందుఁ బ్రవేశించి యమపటముంజూపించి పాటపాడెదను
(పరిక్రమించును)

శిష్యు— (చూచి) భద్రుఁడా! నీవు లోనికి రాఁ గూడదు.

చార— ఓహో బ్రాహ్మణుఁడా! ఈ యిల్లెవరిది?

శిష్యు— సుప్రసిద్ధనాముఁడైన మా యుపాధ్యాయుఁ డార్యచాణక్యునిది.

చార— (నవ్వి) ఓరీ బ్రాహ్మణుఁడా! మాధర్మభ్రాత, మావాఁడు, మాచాణక్యునిదే యీయిల్లు; కావున నన్నుఁ బోనిమ్ము. మీయుపాధ్యాయునకు యమపటముం జూపించి కొన్ని ధర్మము లుపదేశించెదను.

శిష్యు— (కోపముతో) ఓరీ! మూర్ఖుఁడా! నీవు మాయుపాధ్యాయునికంటె ధర్మములు తెలిసినవాఁడవురా!

చార—అయ్యా! బ్రాహ్మణోత్తమ! కోపగింపకుము, అందఱ కన్నియుఁ దెలియవు; మీయొజ్జ కొన్ని యెఱుఁగును, మేము కొన్ని యెఱుఁగుదుము.

శిష్యు—మూర్ఖుఁడా! మాయుపాధ్యాయుల సర్వజ్ఞత్వమును దొంగిలించుటకు వచ్చితివఁటరా!

చార—ఓ బ్రాహ్మణుఁడా! మీయుపాధ్యాయుఁడు సర్వముం దెలిసినవాఁడేని చంద్రుఁ డెవ్వని కనిష్టుఁడో చెప్పుమనుము.

శిష్యు—మూర్ఖ! ఇది తెలిసిన నేమి తెలియకున్న నేమి.

చార—ఇది తెలసిన నేమి ఫలమో మీయయ్యవారికే తెలియఁగలదు. చంద్రుఁడు కమలముల కనిష్టుఁడని మాత్రము నీకుఁ దెలియును.

గీ. సరసిజాతంబు లవి మనోహరములైన
జంద్రరూపంబుఁ జూడఁగాఁ జాలవెపుడుఁ
బూర్ణమండలశాలియై పొలుచు చంద్రు
నకు విరుద్ధంబులింటఁ గానమె జగమున.

చాణ—(విని తనలో) ఓహో! చంద్రగుప్తునియం దిష్టములేని జనుల నేనెఱుంగుదు నని యితఁడు ప్రస్తావించుచున్నాఁడు.

శిష్య—ఛీ, పొమ్ము. ఎందుల కీయసంబద్ధప్రలాపములు.

చార—బావఁడా! ఇవియన్నియు సుసంబద్ధములే యగును.

శిష్య—అయిన నేమి?

చార—వినుటకుఁ దెలిసినవారిం గోరుచున్నాఁడను.

చాణ—భద్ర! విశ్వాసముతోఁ బ్రవేశింపుము. వినువానిని దెలియువానిం గూడఁ జూడఁగలవు.

చార—ఇదిగోఁ బ్రవేశించుచున్నాఁడను. (ప్రవేశించి సమీపించి) ఆర్యా! జయము జయము!

చాణ—(చూచి తనలో) ఇతఁడు ప్రకృతి చిత్తపరిజ్ఞానంబునకై పంపిన నిపుణకుఁడా! (ప్రకాశముగా) భద్రుఁడా! స్వాగతము! కూర్చుండుము.

చార—ఆర్యుని యానతిం గావించెదను. (అని భూమిమీఁదఁ గూర్చుండును)

చాణ—భద్ర! నీవుపోయి తెలిసికొనిన వృత్తాంతమును వర్ణింపుము. జనులందఱు నృపులునియం దనురక్తులై యున్నారా?

చార—అగును, ఉన్నారు ఆర్యుఁడు ప్రజలందఱు విరక్తులగుటకుం దగినకారణములన్నియుఁ బరిహరించి సుగృహీతనామధేయునింజేసిన చంద్రగుప్తునియందుఁ బ్రజలేల యనురక్తులై యుండరు! కాని యానగరమునందు ముగ్గురు పురుషులు మొదటినుండియు రాక్షసునితోడ స్నేహము గలిగి యతని సన్మానమును వడయువారు కలరు. వారు ప్రభువగు చంద్రగుప్తుని యైశ్వర్యమును సహింపకున్నారు.

చాణ—(కోపముతో) వారు బ్రతికియుండుటకు సహింపకున్నారనుము. భద్ర! వారిపేరులు తెలియునా?

చార—దేవా! పేరులు తెలియకుండ ముగ్గురున్నారని తమతో నేల నివేదింతును.

చాణ—అటులైనఁ దెలుపుము.

చార—దేవరా! వినుము. మొదటినుండియు మన శత్రుపక్షంబునఁ బక్షపాతముగల క్షపణకుఁడగు జీవసిద్ధి యొకఁడు.

చాణ—(సంతోషముతోఁ దనలో) క్షపణకుఁ డస్మచ్ఛత్రుపక్షంబునం బక్షపాతము కలిగియుండెఁ గాఁబోలు.

చార—జీవసిద్ధికింకొక యానవాలు చెప్పెదను. రాక్షసప్రయుక్తమగు విషకన్యనితఁడే దేవరయొద్దికిఁ బంపఁగాఁ దమరు దానిం బర్వతకునిపైఁ బ్రయోగించితిరి.

చాణ — (తనలో) ఇతఁడా! జీవసిద్ధి! అతఁడేని మన ప్రణిధియే. (ప్రకాశముగ) రెండవవాఁ డెవ్వఁడు?

చారు — అయ్యా! రెండవవాఁ డమాత్యరాక్షసునికిఁ బ్రియహితుఁడు, శకటదాసుఁ డను కాయస్థుఁడు.

చాణ — (నవ్వి తనలో) కాయస్థుఁడన నెంతవాఁడు! అయిన నల్పశత్రుప్రునైన నుపేక్షింపఁదగదు. (ప్రకాశముగ) భద్రా! మూఁడవవాని పేరు చెప్పుము.

చారు — మూఁడవవాఁ డమాత్యరాక్షసునకు రెండవప్రాణము, పుష్పపురనివాసి రత్నవ్యాపారి, చందనదాసుఁ డనువాఁడు. అతనియింటనే తన కళత్రముం దాఁచి రాక్షసుఁడు పట్టణమునుండి వెడలిపోయినాఁడు.

చాణ — (తనలో) నిజముగా వీఁడు రాక్షసునకు ముఖ్యస్నేహితుఁడే. ఎంత మిత్రుఁడును గానిచో రాక్షసుఁడు తనభార్య నతనియింట వదలిపోవునా! (ప్రకాశముగ) బిడ్డా! చందనదాసునింట రాక్షసుని కళత్రమునుంచె నని నీకెట్లు తెలిసినది?

చారు — ఆర్యా! ఇదిగో నుంగరము. ఇదియే దేవరకు వృత్తాంత మంతయుఁ జెప్పఁ గలదు. (అని చేతికిచ్చును)

చాణ — (ముద్రఁజూచి పుచ్చుకొని రాక్షసునిపేరు చదివి సంతోషముతోఁ దనలో) రాక్షసుఁడే మన వ్రేలికి దొరకినట్లు సంతోషింపవచ్చును. (ప్రకాశముగ) బిడ్డా! ఈ యుంగరము దొరకిన వృత్తాంతము సవిస్తరముగఁ జెప్పుము.

చారు — ఆర్యా! వినుము, దేవరచే నేను పౌరజనచరిత్రాన్వేషణంబునకై నియోగింపఁబడి పరగృహప్రవేశమునకుం దగినదియుఁ బరులచే సందేహింపఁ బడనిదియు నగు నీయమపటప్రదర్శకవేషము నవహించి తిరుగుచుఁ జందనదాసునింటికిం బోయితిని. అచట యమపటము విప్పి గీతములు పాడుట కారంభించితిని.

చాణ — తరువాత?

చారు — పిదప నొక గర్భగృహమునుండి యైదేండ్లప్రాయముగల దర్శనీయాకృతి యగు బాలకుఁడు చిన్నతనంపువేఁడుకచే నీవలకు వచ్చుటకుఁ బ్రయత్నించె. తర్వాతఁ “బోవలదురా పోవలదురా” యనుస్త్రీని వినఁబడెను అది యితఁ డొరులకుఁ దెలియఁగూడదను శంకను స్ఫురింపఁజేయుచున్నది. పిమ్మట నచటనే స్త్రీజనకలకలను బైలుదేఱెనది. కదంపడి కొంచెము ద్వార

దేశమునకు మొగముఁ జూపించు నొకకాంతచేతఁ గోమలమగు బాహులత చాఁచి యాబాలకుఁడు లాగఁబడియె. ఆకుమారుని లాగుటయందలి తొందరచే విసురున వ్రేలినుండి పురుషుని వ్రేలియందిగల యీయుంగరము జాతి గుమ్మముమీఁదఁబడి, యటనుండి దొరలి నాకాళ్ళదరికివచ్చి, నమస్కారముచేసి నిలువఁబడిన కులకాంతవలెఁ గదలకుండెను. నేను నమాత్యరాక్షసుని పేరుగలది యగుటచే దేవర పాదమూలమునకుఁ గొనితెచ్చితిని. ఇదియే యంగులీయక సమాగమవృత్తాంతము.

చాణ—బిడ్డా! వింటిని, పొమ్ము. కొలఁదికాలములోనె నీవుచేసిన యీపరిశ్రమమునకుం దగినఫల మనుభవింతువులే.

చారు—దేవా! చిత్తము. ( నిష్క్రమించును )

చాణ—శార్ఙ్గరవా! శార్ఙ్గరవా!

శిష్యు—(ప్రవేశించి) ఆజ్ఞాపింపుము.

చాణ—వత్స! మషీపాత్రియుం బత్రముం దీసికొనిరమ్ము.

శిష్యు—(అట్లు చేయును)

చాణ—(పత్రముగ్రహించి తనలో) దీనిమీఁద నేమివ్రాయుదును? వ్రాఁతచేతనే రాక్షసుఁడు జయింపఁబడవలయును.

ప్రతీహారి—( ప్రవేశించి ) జయము జయము!

చాణ—(సంతోషముతోఁ దనలో) జయశబ్దము కూడఁ దటస్థించినది. (ప్రకాశముగ) శోణోత్తరా! నీవచ్చినపనియేమి?

ప్రతీ— దేవా! చంద్రగుప్తుఁడు తలపైఁ గమలముకుమార మగునంజలి ఘటించి దేవరవారితో "దేవర సెలవిచ్చితిర యేని పర్వతేశ్వరునకుఁ బారలౌకిక కృత్యములు చేయించి యతఁడు ధరియించిన నగలు బ్రాహ్మణులకుఁ బంచి పెట్టెద" నని విన్నవించుచున్నాఁడు.

చాణ— ( సంతోషముతోఁ దనలో ) సాధు! వృషలా! సాధు! నామనముతో నాలోచించి వార్తయంపించినట్లే పంపించితివి! ( ప్రకాశముగ ) శోణోత్తరా! "బిడ్డా! తెలివిగలవాఁడవు" లోకవ్యవహారము లెఱింగినవాఁడవు. నీ యభిప్రాయప్రకారము నడుపుము. కాని పర్వతేశ్వరుఁడు ధరించిన నగలు మాత్రము గుణవంతులగు బ్రాహ్మణులకే యీవలయు. నేను స్వయ

ముగాఁ బరీక్షించి తొదృశులగు బ్రాహ్మణుల నీయొద్దికిఁ బంపించెదను’ అని నామాటలుగా వృషలునితో నుడువుము.

ప్రతీ— ఆర్య యానతి యిచ్చినట్లు నడచెదను. ( నిష్క్రమించును )

చాణ— శార్ఙ్గరవా !

శిష్య— ( ప్రవేశించి ) ఆజ్ఞాపింపుఁడు.

చాణ— శార్ఙ్గరవా ! విశ్వావసు ప్రభృతులగు నన్నదమ్ములు మువ్వురు బ్రాహ్మణులదగ్గఱకుఁబోయి నామాటలుగాఁ జెప్పి వృషలునివలన నాభరణములు పరిగ్రహించి పిదప నన్నుఁ జూడవలయు నని నుడువుము.

శిష్య— చిత్తము. ( నిష్క్రమించును )

చాణ— ఈజాబున కుత్తరార్ధము వ్రాసితిని. పూర్వార్ధ మేమని వ్రాయుదునో ! ( ఆలోచించి ) ఆఁ తెలిసినది. చారులవలన మ్లేచ్ఛరాజలోకమునడుమ నుండి యయిదుగురు రాజులు ప్రధానులు రాక్షసు ననుసరించుచున్నారని తెలిసినదిగదా !

సీ. కౌలూతదేశాధికారంబుఁగావించు వసుమతీశుఁడు చిత్రవర్మయొకఁడు
మలయదేశీయసామ్రాజ్య మనుభవించు నరసింహుఁడగు సింహనాదుఁడొకఁడు
కాశ్మీరదేశభూకాంతుఁడై వాసికై రియగుచుఁబొల్పగుపుష్కరాక్షుఁ డొకఁడు
సింధుదేశంబేలు క్షితిపతి రిపుకులప్రాణమృత్యువు సింధుషేణుఁ డొకఁడు

గీ. పారసీకక్ష్మాపతి బహుళతురగ
సేనకధిపతి మేఘాభిధానుఁ డొక్కఁ
డేనుగురు వీరిపేరులు దీనవ్రాఁతుఁ
దుడిచివేయుదు చిత్రగుప్తుండువాని.

( ఆలోచించి ) వీరిపేరులు వ్రాయు టుచితము కాదు. ముందుఁ దెలియరాదు. (నాట్యమున నేదియో వ్రాసి) శిష్యా !

శిష్య— ( ప్రవేశించి ) అయ్యా ! వచ్చితి నేమి సెలవు ?

చాణ— శుద్ధశ్రోత్రియుండను నేనెంతజాగ్రత్తగా వ్రాసినను నక్షరములు స్ఫుటముగానుండవు గావున నామాటలు విని ‘ యొకానొక రెవ్వరికో యీ యుత్తరము పంపించవలయు నఁట, బాహ్యనామములు వ్రాయనక్కఱలేదు, ఈయుత్తరములే స్ఫుటముగాఁ జక్కఁగా వ్రాయవలయు’ నని చెప్పి శకటదాసునిచే నీకమ్మ వ్రాయించి నాయొద్దకు మరలఁ దీసికొనిర ” మ్మని

సిద్ధార్థకునితో నుడువుము. చాణక్యుఁడు వ్రాయించు మనియె నని చెప్ప వలదనుము.

శిష్యు—చిత్తము. ( నిష్క్రమించును )

చాణ— ఓహో! మలయకేతువుం జయించితి.

సిద్ధార్థకుఁడు— ( కమ్మ చేతఁ బూని ప్రవేశించి ) జయము జయము. అయ్యా! శకటదాసునిచే జాబు వ్రాయించి తీసికొనివచ్చితిని.

చాణ— ( ఉత్తరముఁ జూచి ) ఆహా! అక్కరము లెంతసొంపుగా నున్నవి! ( చదివి ) బిడ్డా! సిద్ధార్థ! ఈముద్రతో దీని ముద్రింపుము. ( ముద్ర చేతికిచ్చును. )

సిద్ధా— (అట్లుకావించి ) ఆర్యా! యీలేఖపై ముద్ర ముద్రించితిని. ఇంకఁ జేయఁ దగినపని యేమి ?

చాణ— వత్సా! పరమాప్తుఁడు చేయఁదగిన యొకానొక కార్యమున నీవు సహాయుఁడవై వ్యాపారముఁ జేయవలయు.

సిద్ధా—( సంతోషముతో ) గురూత్తమా! అనుగ్రహింపఁబడితిని. ఆజ్ఞాపింపుము. ఈ దాసుఁడు దేవరకుఁ జేయఁదగిన సాహాయ్యక మేమికలదు ?

చాణ— కలదు. ముందు వధ్యస్థానమునకుం బోయి యచట నున్న ఘాతుకుల సరోషదక్షిణాక్షిస్పందనంబున సన్నచేసి వశపఱచుకొనుము. వారు సంకేతము గ్రహించి భయచ్ఛలంబున నెచటివా రచటినుండి పాఱిపోయిన వెనుక వధ్యస్థానమునుండి శకటదాసునిం దీసికొని రాక్షసున కప్పగింపుము. దానివలన సంతసించి రాక్షసుఁడొసంగు పారితోషికముఁ బుచ్చుకొనుము. ఆరాక్షసునియొద్దనే కొంతకాలము సేవఁగావించుచు నుండుము. తరువాత నీకాఁదగిన పరులందఱు వచ్చినతరువాత నీప్రయోజనము నెఱవేర్పుము. ( చెవిలో నేమేమో చెప్పును)

సిద్ధా— దేవరయానతి శిరసా వహించెదను.

చాణ—శిష్యా! శార్ఙ్గరవ!

శిష్యు—(ప్రవేశించి) ఉపాధ్యాయ! ఆజ్ఞాపింపుము!

చాణ— నీవు కాలపాశిక దండపాశికులయొద్దికిఁ బోయి నామాటలుగా నిట్లు చెప్పుము. 'క్షపణకమతస్థుఁడు జీవసిద్ధి రాక్షసప్రేరేపణమున విషకన్యచేఁ బర్వతకేశ్వరునిం జంపించెఁ గదా! వానియం దదేదోస మారోపించి తిగ

సాకార వాక్యములతో నావలకు లేవఁగొట్టుఁడని చంద్రగుప్తుఁడు మాకాజ్ఞా పించినాఁడని.

శిష్యు—మంచిది. (అని పోఁబోవును)

చాణ—వత్సా! ఇంకొకమాట. నిలుము నిలుము. కాయస్థుఁడు శకటదాసుఁ డనువాఁ డుండెనే, వాఁడును రాక్షసుని ప్రేరణచే నిత్యము మనశరీరములకు ద్రోహము చేయుటకే ప్రయత్నించు చున్నాఁడఁట. వానియం దీరాజ ద్రోహదోషమునే ప్రకటించి శూలారోపముఁ గావింపుఁడని చెప్పుము. వానిభార్య మొదలగు గృహజనముం గారాగారంబున వేయింపు మనియుఁ జెప్పుము.

శిష్యు—మంచిది. ( నిష్క్రమించును)

చాణ—(చింతించుచుఁ దనలో) ఆదురాత్ముఁడగు రాక్షసుఁడు గ్రహింపఁబడునా!

సిద్ధా—ఆర్యా! గ్రహింపఁబడియె, గ్రహింపఁబడియె.

చాణ—(సంతోషముతోఁ దనలో) రాక్షసుఁడు దొరకెనా! (ప్రకాశముగా) వత్సా! ఎవ్వఁడు గ్రహింపఁబడియె?

సిద్ధా—దేవరయానతి గాని మఱి యెవ్వరును గారు. కార్యసిద్ధికై పోయెదను.

చాణ—(ముద్రాముద్రిత మగుకమ్మ చేతికిచ్చి) నీకుఁ గార్యసిద్ధియగుఁగాత పొమ్ము.

సిద్ధా—మంచిది. ( నిష్క్రమించును)

శిష్యు—(ప్రవేశించి) ఆర్యా! చంద్రగుప్తుని శాసనము శిరసా వహించి చేయుచున్నామని కాలపాశిక దండపాశికులు తమతో మనవి చేయుచున్నారు.

చాణ—శోభనము. వత్సా! మణికారశ్రేష్ఠి చందనదాసు నొకసారి చూడవలయు ననుకొనుచున్నా నోయీ!

శిష్యు—అట్లమేమి! ( పోయి చందనదానుతోఁ బ్రవేశించి ) సెట్టీ! యిటు రమ్మిటు రమ్ము.

చందనదాసు—చాణక్యుఁ డకారణంబుగాఁ ద్వరగా రమ్మని పిలిపించెనా దోసము లేనివానికిఁ గూడ భయశంక కలుగును. దోసయుకల నాబోఁటివానియవస్థ యడుగ వలయునా! కనుకనే యింటనున్న ధనసేనప్రముఖు లందఱి తోడను చాణక్యహతకుఁడు మనయిల్లెప్పుడేని వెదుకక మానఁడు, కావున నమాత్యరాక్షసుని గృహజనమును మిగుల జాగరూకతతోఁ గాపాడవలయుఁ జుఁడీ యని చెప్పియే యుంటిని. నాకుఁ గాఁదగ్గ దేదియో కానిమ్ము.

శిష్యు— అయ్యా! సెట్టీ! ఇటు రమ్మిటు రమ్ము.

చందన— ఇదె వచ్చుచున్నాను.

( ఇరువురును నడతురు )

శిష్యు— ( సమీపించి ) ఆర్యా! చందనదాసునిం దీసికొనివచ్చితిని.

చంద— ఆర్యా. జయము! జయము!

చాణ— సెట్టీ! క్షేమమా! ఇదె ఆసనము నధిష్ఠింపుము.

చంద— ( నమస్కరించి ) ఆర్యా! దేవరకుఁ దెలియదా! అనుచితోపచారము హృదయమునకుఁ బరాభవముకన్న నధికదుఃఖముఁ గలుగఁ జేయును. నాకాసనమేల? నాకుఁ దగినది భూమియే, యిందుఁ గూర్చుండెదను.

చాణ— అట్లనెదవేమి? నావంటివాండ్రు పెక్కుమంది నీ కిటువంటి యుపచారము లింతకుమున్న చేసియే యున్నారు. ఆసనమునందె కూర్చుండుము.

చంద— ( తనలో ) అప్పుడే యీదురాత్ముఁడు దేనికో ప్రస్తావన చేయుచున్నాఁడు. ( ప్రకాశముగా ) తమచిత్తము వచ్చినట్లే కావించెదను. ( కూర్చుండును )

చాణ— ఓ సెట్టీ! నీచేయు వ్యవహారము లన్నిటియందును వృద్ధియు లాభంబును లెస్సగానున్నవా!

చంద— ( తనలో ) అత్యాదరము శంకింపవలసినదే! ( ప్రకాశముగ ) తమ యనుగ్రహమువలన నా వ్యాపారము లన్నియు నఖండములుగా నున్నవి.

చాణ— చంద్రగుప్తుని యందలి దోసములు వెనుకటి రాజులను ప్రజలచే స్మరింపఁ జేయుట లేదుకద!

చంద— ( చెవులుమూసికొని ) పాపము శాంతించునుగాక! పాపము శాంతించునుగాక! శరత్కాలచంద్రునిచేతం బోలెఁ జంద్రగుప్తునిచేఁ బ్రజలందఱు మిగుల సంతసించుచున్నారు.

చాణ— సెట్టీ! తనచే నానందింపఁజేయఁబడిన ప్రజలవలన రాజులు ప్రత్యుపకారముం గోరుచుందురు సుమీ!

చంద— ఆర్యా! మావంటివాండ్రు చేయఁదగిన దేదియో యానతిండు.

చాణ— సెట్టీ! ఇది చంద్రగుప్తరాజ్యముగాని నందరాజ్యము కాదుకదా! ద్రవ్యాసక్తికలనందునకు మీయందఱియందును ద్రవ్యసంబంధముచేఁ బ్రీతి

పుట్టుచుండెడిది. చంద్రగుప్తునకో, మీవలనఁ గ్లేశము కలుగకుండుటయే కోరికి గాని యొండులేదు.

చంద— అటులేని ననుగ్రహింపఁబడితిమి.

చాణ— అట్లు క్లేశము కలుగకుండుట యెట్లు ఘటిల్లించు నని యడుగవేమి ?

చంద— చిత్తము చిత్తము, దేవరయే సెలవీయవలయును.

చాణ— రాజునకు విరుద్ధములగు కార్యము లేవియును బ్రజలు చేయరాదు.

చంద— రాజద్రోహులని తమ చిత్తమునకు వచ్చిన యధము లెవరయ్యా !

చాణ— అందు మొదటివాఁడవు నీవే.

చంద— పాపము శాంతించుఁగాక. గడ్డిపరకలకు నిప్పుతో విరోధ మెట్టిది !

చాణ— విరోధమిటువంటిదే. నీవిప్పటికిని రాజాపథ్యకారి యగు నమాత్య రాక్షసుని గృహజనము నింటిలో దాఁచి సంరక్షించుచున్నావఁట కాదా !

చంద— ఇది కేవల మసత్యము. ఎవఁడో తెలియనివాఁడు తమకు విన్నవించెను.

చాణ— నీవు శంకింపకుము. భీతులగు విజితరాజపురుషులు పౌరులవల దను చున్నను దమ గృహజనమును వారియింట డించి పాఱిపోదురు. వారిని దాఁచుట మాత్రము తప్పు.

చంద—ఆయుద్ధపు గడబిడ దినములలో మాత్రము రాక్షసునిగృహజనము మాయింట నుండెడిది. కాని యిపుడు లేదు.

చాణ— సెట్టీ ! యేల యబద్ధము లాడెదవు ? చంద్రగుప్తుఁడు రాజ్యమేలుచుండఁ గపటములు పనికిరావు. రాక్షసునకు గృహజనమును సమర్పింపుము. నీవు కపటము లేనివాఁడ వగుదువు.

చంద— ఏను గపటిని గాను. పూర్వ ముండెడిది, నేఁడు మాయింట రాక్షస గృహజనము లేదు.

చాణ— మొదట మాయింట లేనే లే దంటివి. ఇప్పుడు పూర్వ ముండెడిది ప్రస్తుతము లే దంటివి. నీమాటలే పరస్పర విరుద్ధములుగా నున్నవి.

చంద— మాట పొఱపాటు తప్ప నాయందింకేమియుఁ గపటము లేదు. మాయింటఁ బూర్వ మున్నమాట నిజము.

చాణ— ఇప్పు డెక్కడకుఁ బోయినది ?

చంద— నే నెఱుఁగను.

చాణ— (చిఱునవ్వునవ్వి) ఏల తెలియకుండును సెట్టీ! నెత్తిమీఁద భయముంచు కొని దూరముగాఁ బ్రతీకారము చేసిన నేమి ఫలము?

చంద—(తనలో)

గీ. ఆకసంబునఁ బెద్ద ఘనారవమ్ము,
దూరమున భార్యయును నేమి దారియొక్కొ ?
త్రాఁచు తలమీఁద నున్నది, దానిఁబాపు
నోషధులు మంచుఁగొండపై నున్నవకట.

చాణ— ఇంతేకాదు. నందుని విష్ణుగుప్తుఁడువలె- (అని సగముమాట యని సిగ్గుపడుచు) చంద్రగుప్తు నమాత్యరాక్షసుఁ డున్మూలింపఁజేయఁగలఁ డని నీ వెన్నఁడును దలఁపకుము.

మ. నయముం బౌరుష మున్న మంత్రు లయియున్న న్వక్రనాసాదులెం
తయుఁ జాంచల్యము బాపలేని యలనందశ్రీకి నైక్యంబుఁ ద
ద్దయుఁ గల్గించితిఁ జంద్రగుప్తునకు ; జ్యోత్స్నాచంద్రులంబోలు వా
రియెడ న్భేదము సేయనోపు నెవఁ డుర్వీస్థలిం దుర్మతియుండఁగన్.

("ఆవలించిన ద్విజరాజు ♦ నాననంబు నందు" అనుపద్యము మరలఁ జదువును)

చంద-(తనలో) అదృష్టము ఫలించినది కావున నితనియాత్మస్తుతి పనికివచ్చుచున్నది.

(తెరలోఁ గలకలము)

చాణ— శార్ఙ్గరవా! ఆకోలాహలమేదియో తెలిసికొనుము.

శిష్యు— మంచిది. (నిష్క్రమించి మరలఁ బ్రవేశించి) ఉపాధ్యాయ! రాజద్రోహకారియగు జీవసిద్ధి యనుక్షపణకుఁడు చంద్రగుప్త భూపాలుని యను మతింజేసి తిరస్కారపురస్సరంబుగాఁ బురమునుండి వెడలఁ గొట్టఁబడు చున్నాఁడు.

చాణ— జీవసిద్ధీ! నీ కెంత యాపదవచ్చె! రాజద్రోహముఁ గావించినదానికి ఫలమనుభవింపక తీఱునా! (సెట్టివంకఁ జూచి) చందనదాస! మారాజు రాజద్రోహముఁగావించినవారియెడల నీవగిది మిక్కుటముగ నాగ్రహించి కఠినశిక్షలు విధించుచున్నాఁడు, కావునఁ బథ్యమగు మిత్రవాక్య మనుష్ఠింపుము. రాక్షసగృహజనమును సమర్పింపుము. చిత్రవిచిత్రమగు రాజానుగ్రహమును జిరకాల మనుభవింపుము.

చంద— అయ్యా! రాక్షసామాత్యుని గృహజనము మాయింట లేదు.

( తెరలో మరలఁ గలకలము )

చాణ— శార్ఙ్గరవా! ఈకలకలమేదియో తెలిసికొనుము ?

శిష్య— మంచిది. ( అనిపోయి మరలఁ బ్రవేశించి ) గురువర్యా! వీఁడును రాజాపథ్యకారియే. శకటదాసుఁడను కాయస్థుఁడు; శూలారోపముఁ జేయుటకుం గొనిపోఁబడుచున్నాఁడు.

చాణ— తాఁ జేసినకర్మమునకు ఫల మనుభవించుంగాత! (సెట్టితో) సెట్టీ! చందనదాస! చూచితివా! మారాజు ద్రోహబుద్ధికలవారి నెంతమాత్రమును సైఁచుటలేదు. రాక్షసుని కళత్రమును నీయింటఁ గాపాడుచున్నావు. నీకును ముప్పు వచ్చును సుమీ! ఒకని పెండ్లమును గాపాడి నీపెండ్లామును బిడ్డలను దిక్కుమాలినవారినిఁగాఁ జేసికొనకుము.

చంద— ఆర్యా! నన్నేల భయపెట్టెదవు. అమాత్యుని గృహజనము నాయింట నున్నను సమర్పింపను. లేనిదే యెచ్చటినుండి తీసికొనివత్తును.

చాణ— ఇది నిశ్చయమేకదా ?

చంద— అవును, గట్టిగా ముమ్మాటికి నిశ్చయము.

చాణ— (తనలో) సెబాసు! చందనదాసా! సెబాసు!

గీ. పరుల సంరక్షణము సేయుకొఱకుఁ గాదె
వదలుచున్నావు స్వార్థలాభంబు నీవు;
ఇట్టి దుష్కరకార్య మింకెవఁడు సేయు
వాఁడు భువిలోన శిబిచక్రవర్తి తప్ప.

( ప్రకాశముగా ) చందనదాసా! ఇది నీనిశ్చయమే ?

చంద— నిశ్చయము.

చాణ— ( క్రోధముతో ) ఓరీ దురాత్మా! దుష్టవణిక్కుఁడ! ఉండుము. రాజక్రోధమునకు ఫల మనుభవింతువు లే.

చంద— సిద్ధుఁడనై యున్నాను. సర్వము మీయధికారము. మీ చిత్తమునకు వచ్చినట్లు కావింపుఁడు.

చాణ— ఓరీ శార్ఙ్గరవా! దండపాశికునితోడను గాలపాశికునితోడను "దుష్టవణిక్కుని శీఘ్రముగాఁ బట్టుకొనుం" డని నామాటగాఁ జెప్పుము. పోసీ!

ఉండుముండుము. దుర్గపాలకుండగు విజయపాలకునితో "ఇంట నున్న ధనమంతయు వశపఱచుకొని వీనిని పుత్రమిత్రకళత్ర సహితముగా బంధించి యుంచుమని చెప్పుము. నేను వృషలునితోఁ జెప్పి తరువాతి కర్తవ్యముఁ దెలియఁజేసెదననియును జెప్పుము. వృషలుఁడే యితనికిఁ బ్రాణాపాయకర మగు దండన విధించుంగాత !

శిష్య— ఆర్యా ! చిత్తము. ( సెట్టితో ) సెట్టీ! యీవైపునకు రమ్ము.

చంద— అయ్యా ! ఇదిగో వచ్చుచున్నాఁడను. నాచేసిన తప్పునఁగాక మిత్ర కార్యమునకై నాప్రాణములను గోల్పోవుచున్నాను. నాయదృష్టమే.

( పరిక్రమించి శిష్యునితోఁగూడ నిష్క్రమించును )

చాణ— (సంతోషముతో) ఔరా! నేఁటికి రాక్షసుఁడు పట్టుపడినాఁడు. ఏలన: —

గీ రాక్షసామాత్యునకుఁ గీడురా నితండు
ప్రాణములు వాయుటకు సిద్ధపడినయట్లు
వీనియాపద వాఁడు విన్న నిదపఁ
బ్రాణములు వాయకుండఁగ బ్రదుకఁగలఁడె !

( తెరలోఁ గలకలము. )

చాణ— శార్ఙ్గరవ ! శార్ఙ్గరవ !

శిష్య— ( ప్రవేశించి ) గురూత్తమ ! ఏమి సెలవు !

చాణ— ఏమి యీకలకలము ?

శిష్య— ( ఆలోచించి ) దేశిక ! వధ్యస్థానమునఁ జంపఁబడుచున్న శకటదాసుని వదలించి సిద్ధార్థకుఁడు వానితోఁ గూడఁ బాఱిపోవుచున్నాఁడు.

చాణ— ( తనలో ) సాధు ! సిద్ధార్థ ! సాధు ! కార్యమునకుఁ బ్రారంభము చేసితివి ! ( ప్రకాశముగ ) బలాత్కారముగాఁ బాఱిపోవుచున్నారా ? ( కోపముతో ) వత్స ! భాగురాయణునితో శీఘ్రముగఁ గర్తవ్యము నాలోచించుమని నామాటలుగఁ జెప్పుము.

శిష్య— ( నిష్క్రమించి, ప్రవేశించి విషాదముతో ) ఉపాధ్యాయ ! ఎంతకష్ట మెంతకష్టము ! భాగురాయణుఁడును బాఱిపోవుచున్నాఁడు.

చాణ— ( తనలో ) పోనీ. కార్యసిద్ధికొఱకే పోవుచున్నాఁడు. ( ప్రకాశముగఁ గ్రోధమున్న ట్లభినయించుచు ) వత్స ! భద్రభటపురుషదత్తడింగరాతబల

గుప్తరాజసేనకు లోహితాక్షవిజయవర్మలతో శీఘ్రముగాఁ బోయి దురాత్ముఁడగు భాగురాయణుం బట్టుకొనుండని నామాటలుగాఁ జెప్పుము.

శిష్యు — (పోయి మరలవచ్చి దుఃఖముతో) అబ్బా! ఎంతకష్టమెంతకష్టము! తంత్రమంతయు వ్యాకులమైనది. భద్రభట ప్రముఖు లందఱుఁ దెల్లవాఱక మునుపే పాఱిపోయిరి.

చాణ — (స్వగతమున) సర్వవిధముల మనమార్గమునకు శుభములు ఘటించునుగాత! (ప్రకాశముగ) వత్స! ఏడువకు మేడువకుము!

చ. హృదయమునందు నేనొ యొక టెంచుచుమఁ బోయిరి పోవువారు; పో
వుదు రిఁక నున్నవారలును బోవుటకుం దలఁపూనిరేని; న
న్నదిగద నందవంశమును నాశముచేసి యశంబు గొన్నయ
ట్టిదియగు నాదు ప్రజ్ఞయొకటే యది సేనలకెల్ల నెక్కుడై.

(లేచి యాకసమునం దృష్టి నిగిడ్చి) దురాత్ములగు భద్రభట ప్రభృతుల నిదిగోఁ జంపుచున్నాఁడను. (తనలో) దురాత్మ! రాక్షస! ఇం కెచటికిఁ బోదువురా! కొలఁదికాలములో—

ఉ. ఊర్జితదానశక్తివయి యొక్కఁడవై చరియించుచు న్మద
నూర్జితమైన యాత్మబలముంగొని పొంగెదు నిన్ను బుద్ధిసం
తర్జితుఁ జేసి, యే విపినదంతివిధంబునఁ గట్టివైచి, మా
కర్జముఁ దీర్చికొందుఁ బెఱకార్యము లేల మురాన్వయార్థమై.

(నిష్క్రమించుచున్నాఁడు)

ఇది శ్రీతిరుపతి వేంకటేశ్వరాంధ్రీకృతంబగు ముద్రారాక్షసమునం

బ్రథమాంకము.



శ్రీరస్తు.

# ముద్రారాక్షసము

## ద్వితీయాంకము

( పిదపఁ బాములవాఁడు ప్రవేశించును )

పాము —

గీ. ఎవరు తంత్రంబు లెఱుఁగుదు, రెవరు యంత్ర
చింతనము సర్వకాలముఁ జేయుచుంద్రు,
మంత్రములఁ బ్రోతు రెవ్వరు మనుజనాథ
సర్పములకు నుపచరించు జనులు వారు.

( ఆకసమునం జెవియొగ్గి ) అయ్యా! 'నీ వెవఁడ' వని యడుగుచున్నారా! నే నాహితుండికుఁడను. నా పేరు జీర్ణవిషుఁ డందురు. 'ఏమఁ బాములతో నాడుకొనవలయు' ననుచున్నారా! మీ రేవృత్తి యవలంబించి జీవించుచున్నారు? రాజగృహంబున సేవకావృత్తిచే జీవించుచున్నారో! మీరు పాముల నాడింపఁగలరా? మంత్రౌషధంబు లెఱుంగని వ్యాళగ్రాహియు, నంకుశములేని మావటీఁడును, లబ్ధాధికారుండును *జితకాశియు నగు రాజసేవకుండును దప్పక చెడిపోదురు. ఆఁ. ఏమీ! వీఁడు కన్పడినంతలోనే మాయమైపోయెనే! ( మరల నాకాశము వంకఁ జూచి ) ఈ పెట్టెలలో నేమి యున్నవని యడుగుచున్నారా! అయ్యా! మాకు జీవికాధారములగుపాములున్నవి. చూడవలయు ననుచున్నారా! అనుగ్రహమే కదా! చూపించెదను గాని యిది తగినచోటు కాదు. అంతటి కౌతూహల మున్నచో నీ లోనికి రానిండు చూపించెదను. 'ఇది మంత్రిరాక్షసుని యిల్లు, మాకువలె మీబోటుల కిందుఁ బ్రవేశము లేదు పో' మ్మనుచున్నారా! కానిండు, ఇది నావృత్తి గావున ప్రవేశమేయగును. అయ్యో! వీఁడుఁ గూడ దాఁటి పోయెనే!

ఆహా! ఏమాశ్చర్యము! చాణక్యమతిపరిగృహీతుఁడగు చంద్రగుప్తునిం జూచిన రాక్షసుని ప్రయత్న మంతయు విఫలమగు నని తలంచెదను. మఱి, రాక్షసమతిపరిగృహీతుఁడగు మలయకేతునిం గనుఁగొన్నఁ జంద్రగుప్తుని రాజ్యము పోయినట్లే యూహింపవలసియున్నది.

* జితకాశి :— జయగర్వము గలవాఁడు.

గీ. కదలకుండఁ జాణక్యుండు కట్టెఁ దెల్వి
త్రాళ్ళచేఁ జంద్రగుప్త సామ్రాజ్యలక్ష్మి;
నీవలను దాని లాగఁగా నెంచుచుండె
రాక్షసుండు నుపాయకరములచేత.

కావున బుద్ధిమంతులగు నీ యిరువురిమంత్రులకుఁ గలిగినవిరోధమువలన నందకులరాజ్యలక్ష్మి సంశయగ్రస్తురాలై యున్నది.

గీ. అడవిలో నేనుఁగులరెంటినడుమ నాఁడు
యేనికకుఁ గష్టపాటుదయించినట్లు
బుద్ధిశాలురు మంత్రులిర్వురకు నడుమ
నందకులలక్ష్మి కష్టంబుఁ జెందుచుండె,

ఇపు డమాత్యరాక్షసునిం జూచెదను. (పరిక్రమించి కూర్చుండును)

(పిదపఁ జింతాగ్రస్తుఁడై రాక్షసుఁడును, గూడ నొక పరిచారకుఁడును బ్రవేశింతురు)

రాక్ష— (కన్నీరు తెచ్చుకొని) అక్కటా! యెంతకష్ట మెంతకష్టము!

చ. నయమును విక్రమంబు సుగుణంబులు కల్గియు నేఁడు యాదవా
న్వయమునుఁ బోలి దైవగతి నందకులంబు వినాశ మొంద రే
యియుఁ బవలుం బ్రశోకమున నీగతి బ్రుంగు మనంబుతోడ న
య్యయొ! యిటు సేయఁబూనితిఁ బ్రయత్నము భిత్తికలేనివ్రాఁతకున్.

అదియునుంగాక—

సీ. అంతరించినను నందాన్వయంబునఁ బూజ్యభావము లేకపోయి కాదు
అన్యరాజులమంత్రినై యధికైశ్వర్యలాభంబుఁ గాంచఁ దలంచి కాదు
అరిరాజులు వధింతురని భీతి నీపాడుజీవంబుపైఁ దీపిఁ జెందికాదు
కడచిపోయినదానికంటె నెక్కువపేరు గౌరవంబు లభింపఁగోరి కాదు

గీ. శత్రువులనెల్లఁ జంపిన స్వర్గమేఁగి
యున్నయొడయుండు మదమొందు నన్నయాశ
చేత నొరులకు దాస్యంబు సేయుచుండె
రాక్షసామాత్యుఁడును నీత్యపేక్షఁ దవిలి.

(ఆకసము వంకఁ జూచుచుఁ గన్నీరోడ్చుచు) భగవతి! పద్మాలయా! నీవు నంతయు గుణజ్ఞురాలవు కావుసుమా! ఏమన:—

గీ నందుఁడానందపెట్టుచున్నను ద్యజించి
చంద్రగుప్తునిఁ గూడెదే చపలురాల!

*పాఠాంతరము:-య్యయొయిటువ్రాయువాఁడనిదె యంబరమందున నేకచిత్రముల్.

గంధగజము వశించును గాక దాని
దానజలరాశి యింకదా దానియందె?

అదియుంగాక, నీవు సత్కులప్రసూతురాలవు కావు.

చ. మడిసిరో కో! శుద్ధకులమండను లైన నరేంద్రులెల్లఁ గాం
పడర పరించితిట్టు లకటా కులహీనుని జంద్రగుప్తు; నే
ర్పడ నల కొల్లుపూవు చివరల్వలె నల్లలనాడుచుండు నీ!
పడఁతులచిత్తవృత్తి మగవారిగుణంబు గ్రహింపనేర్చునే.

కాని మోమ్మ యవినీతురాలా! నీయాశ్రయోన్మూలంబుఁ గావించి నీకోర్కు లన్నియు మంటిపాలు గావించెదను. (ఆలోచించి) ఏను మిత్రత్రయముండగు చందనదాసునింట గృహజనము నుంచి నగరము విడచి వచ్చుటమాత్రి మొక న్యాయమగు కార్యము జరగినది. ఏమన :— కుసుమపురమును జయించుటకై మాత్రము రాక్షసుని ప్రయత్నము మారకుండలేదని నాకార్యమునకు సాహాయ్య మాచరింప సన్నద్ధులై కుసుమపురమునందున్న రాజపాదోపజీవులగు భృత్యులెల్లఁ దమతమ ప్రయత్నములయం దుదాసీనులై యుందురు. చంద్రగుప్తునిఁ జంపుటకై విషము మొదలగు మరిఁ సాధనంబులు ప్రయోగింపుఁడని పంపించినవారిసెల్లఁ బైకాపు కానుటకును, బరుల కృత్యములు తెలిసికొనుటకును తగినంతి ధనమొసఁగి శకటదాసుని కుసుమపురమునందే యుంచితిం గదా. మఱియుఁ బ్రతిక్షణము శత్రురాజుల వృత్తాంతము దెరయుటకును దత్ప్రయత్నభేదంబుకొఱకును జీవసిద్ధి మున్నగు మిత్రుల నంపించితినిగదా! వెయ్యేల :—

చ. కొడుకుల నెల్లవారి నొకకూరిమిఁజూచు నరేంద్రుఁ డీతనిన్
బెడసరివాని బెద్దపులిపిల్లవిధంబునఁ బెంచి, వీనిచే
మడిసెను సాన్వయం; బితని మర్మములెల్లఁ బరిష్కరింతు దే
వుఁడు దయఁజూచి శత్రుశము పోలిక నేఁడును గావకుండినన్.

కంచుకి— ( పిదపఁ బ్రవేశించి )

ఉ. నందమునఁగూల్చి విప్రకులనాయకునీతి మురాన్వయంబునం బురం
బందువలె న్ననున్నిలిపెనా జర కామమడంచి ధర్మమున్;
దందు పచీయమానుఁడగునాతని గెల్వఁ దలంచుఁ గాక గె
ల్వందగు నోటు రాక్షసుఁడు లబ్ధసహాయుఁ డటు లృదాశయున్.

(పరిక్రమించి సమీపించి) అదిగో! అమాత్యరాక్షసుని గృహము. ప్రవేశించెదను. (ప్రవేశించి చూచి) దేవా! నీకు శుభము.

రాక్ష.— ఆర్య! నమస్కరించెదను. ప్రియంవద! ఆసనముం దీసికొనిరమ్ము.

ప్రియం— ఇదిగో నాసనము. అయ్యా! కంచుకి! దయచేసి కూర్చుండుము.

కంచు— (కూర్చుండి) మంత్రివరా! కుమారుండగు మలయకేతువు "చిరకాలమునుండి యార్యుఁ డుచితసంస్కారము లన్నియు వదలి యలంకారములు పరిత్యజించి యున్నాఁడని నాహృదయ మత్యంతము పీడఁ జెందుచున్నది. ఆలోచింపఁగా స్వామిగుణములు మఱచిపోఁదగినవికావు. అయినను నావిన్నప మాలింపవలయును. ఈ యాభరణములు ధరింపవలయు" నని మీతో విన్నవించు మనినాఁడు. (యాభరణములుచూపి) ఇవె యాభరణములు. తనశరీరమునుండి తీసి పంపినాఁడు దేవర ధరింపవలయును.

రాక్ష— ఆర్య! జాజలి! నామాటలుగాఁ గుమారునితో "నీగుణములయందలి పక్షపాతముచే నందమహారాజు గుణములన్నియు మఱచిపోయితి" ననియే విన్నవింపుము. అదియుం గాక—

చ. హతసకలాభిభూవరుఁడనై తగు నీమృగరాజపీఠి వ
ర్జితమతినై సుగాంగమున నిల్పినదాఁక నరాతిరాణ్ణిరా
కృతికృపణంబులై బలవిహీనములైన మందంగకంబు లే
గతిధరియించు సిగ్గిలక కాంచనరత్నవిభూషణంబులన్.

అనియును జెప్పుము.

కంచు— అమాత్యుఁడు కార్యసాధకుఁడై యుండఁ గుమారున కీకార్య మొకదుర్లభము కాదు! కాని కుమారుని ప్రథమానునయము మాత్రము దేవర యంగీకరింపవలయును.

రాక్ష— అయ్యా! జాజలి! కుమారుని మాటవలె నీమాటయు జవదాఁటరానిదే. కావునఁ గుమారుని యానతి శిరసావహించెదను.

కంచు— (నాట్యమున నగలన్నియు ధరింపఁజేసి) నీకు శుభమగుఁగాక! ఏను బోయివచ్చెదను.

రాక్ష— అయ్యా! నమస్కారము.

కంచు— (నిష్క్రమించుచున్నాఁడు)

రాక్ష—ప్రియంవద! దర్శనార్థ మెవ్వరో ద్వారమున వేచియున్నారు కనుఁగొనుము.

ప్రియం— చిత్తము (పోయి పాములవానిని వాకిటంజూచి) నీవెవ్వఁడవోయి!

పాము—భద్ర! యేను పాములవాఁడను. నా పేరు జీర్ణవిషుఁ డందురు. అమాత్యుని ముందటఁ బాములనాడింపఁ దలంచుచున్నాఁడను.

ప్రియం— ఉండు ముండుము. అమాత్యునకు విన్నవించి వచ్చెదను. (అని రాక్షసుని సమీపించి) మంత్రిసత్తమ! పాములవాఁ డొకఁడు మీయెదుటఁ బాముల నాడించుటకు వేఁడుచున్నాఁడు.

రాక్ష— (ఎడమకన్నదరుట సూచించి తనలో) ముందుగా సర్పదర్శనమా! (ప్రకాశముగ) ప్రియంవద! నాకుఁ బాములాటమీఁదఁ గుతూహలము లేదు. వాని కేమైన నిచ్చి పంపివేయుము.

ప్రియం— చిత్తము! (నిష్క్రమించి పాములవానితో) ఆర్య! నీవు వచ్చితివని యమాత్యుఁ డనుగ్రహించినాఁడు కాని సర్పదర్శనమాయన కిష్టము లేదు.

పాము— భద్రముఖ! ఏను కేవలము సర్పజీవినే కాను. ప్రాకృతకవిని. నా కమాత్యుఁడు దర్శన మిప్పింపఁదలఁపఁడేని యీపత్రము చదువుకొను మనుము. (కాగితమిచ్చును)

ప్రియం— (కాగితము పుచ్చుకొని రాక్షసుని సమీపించి) అమాత్యా! 'యేను కేవలము సర్పజీవినే కాను, ప్రాకృతకవిని. నాకమాత్యుఁడు దర్శన మిప్పింపఁ దలంపఁడేని యీపత్రము చదువుకొనుమను' మని విన్నవింపుమని నాఁడు.

రాక్ష— (పత్రము పుచ్చుకొని చదువును)

గీ. ఎందుఁ గుసుమస్థమగు మకరందమెల్లఁ
గుశలమతిఁ గ్రోలి తుమ్మెదల్ కొసకు దానిఁ
గ్రక్కు, యొకపట్టుగాఁగ నేర్పఱచుకొనుట
పరులకొఱకేగదా! తమకొఱకుఁగాదు.

(తనలో) ఈ గాథ కర్థము కుసుమపురవృత్తాంతజ్ఞుఁడనగు నీచారుఁడ నని [illegible]చున్నది. కార్యవ్యగ్రుఁడ నగుటచేతను జారుల ననేకులఁ బంపినవాఁడ నగుటను మఱచిపోయితిని. ఇప్పుడు జ్ఞప్తికివచ్చినది. నిజముగాఁ బాముల వానివేసమున విరాధగుప్తుఁడు వచ్చియుండును. (ప్రకాశముగ) ప్రియం

వద! వానిం దీసికొనిరమ్ము. వీఁడెవ్వఁడో సుకవి. వీనివలన మఱియుం గొన్ని సుభాషితంబులు వినఁగోరుచున్నాను.

ప్రియం — చిత్తము. (పోయి) అయ్యా! దయచేయుఁడు (అని పాముల వానితోఁ బ్రవేశించును)

పాము — (నాట్యమున సమీపించి రాక్షసుం జూచి తనలో) ఇదిగో, రాక్షసామాత్యుఁడు! ఏదియో యాలోచించుచున్నాఁడు.

చ. ఎడమకరమ్ము గంతమున నెట్టులొ తార్చును, మాఱుమోమిడుఁ గ్రుడికర మంసభాగమునఁ గూర్చును ప్రీతిగ, జార్చునంతలో నడలుజనించి; యీతని ప్రయత్నము లాసిరి నిప్పుడేనియుఁ గుడిచను మోవ మార్యవిభుగుత్తపుఁగొఁగిటఁ జొక్కనీవుగా! .

(ప్రకాశముగ) దేవా! జయము జయము!

రాక్ష — (చూచి) ఓయి విరాధ — (అని నగమొపల్కి) వయసువచ్చినవాఁడె! ప్రియంవద! పాముల నాడింపుమనుము. వినోదించెదను. పరిజనమందఱు విశ్రమింతురుగాక. నీవును నీకార్యమును జూచికొనుము.

(ప్రియంవదాది పరిజను లందఱు నిష్క్రమించుచున్నారు.)

రాక్ష — సఖా! విరాధగుప్త! ఇదే! పీఁట, కూర్చుండుము.

విరా — (కూర్చుండును)

రాక్ష — (చూచి) ఓయీ! స్వామిపాదపద్మోపజీవులగు మనయవస్థ యిట్లున్నది. (అని యేడ్చును)

విరా — ప్రధానశేఖర! దుఃఖమేటికి. కొలదికాలములోనె దేవర మతిప్రభావము మమ్మందఱను బ్రాచీనావస్థ కెక్కింపఁగలదు.

రాక్ష — సఖా! కుసుమపురవృత్తాంతముఁ జెప్పుము.

విరా — అమాత్య! కుసుమపురవృత్తాంతము చాలఁ బెద్దది. అం దేది మొదలుకొని చెప్పవలయునో యానతిమ్ము.

రాక్ష — మిత్రమా! చంద్రగుప్తుఁడు నగరము ప్రవేశించినది మొదలు మనము పంపిన తీక్ష్ణరసదాయకులు మొదలగువా రేమిచేసిరో యాసంగతు లన్నియు వినఁదలఁచి యున్నాఁడను.

విరా — ఇదిగోఁ జెప్పుచున్నాఁడను. కుసుమపురమంతయుఁ జాణక్యమతిప్రభావముచేఁ గైవసము చేసికొఁబడిన శకయవనకిరాతకాంభోజపారసీక బాహ్లీక

ప్రభృతులగు చంద్రగుప్త పర్వతేశ్వర సైన్యంబులచేఁ బ్రళయకాలోచ్ఛలిత సముద్రంబులచేతంబోలె ముంచఁబడియున్నది.

రాక్ష—(కత్తిలాగి తొందరతో) ఓరీ! నేనుండఁగనే కుసుమపురము నరికట్టు వారెవ్వరురా! ప్రవీరక! ప్రవీరక! నీవు త్వరగఁబోయి యిట్లు చెప్పుము

గీ. కోటచుట్టు భటులు లిరుగుదురుగాక
ద్వారముల నిల్చుఁగాక దంతావళములు
చావనిన జంతులేక యశంబుఁగోరు
వారు నాతోడ నేతెంచు వైరివధకు.

విరా—అమాత్య! ఏల యీయావేగము? జరిగిన వృత్తాంతము విన్నవించుచుంటిని.

రాక్ష—(నిట్టూర్చి) ఎంతకష్టమగు వృత్తాంతమోయి! ఏ నెఱుఁగుదును! ఇది దానికిం దగినకాలమే. (శస్త్రమువదలి) హా దేవ! నందమహారాజ! నీకు రాక్షసునిపైఁ గల ప్రేమాతిశయము మఱచిపోయితివా! నాఁటి సంగ్రామకాలంబున నీవు—

చ. 'జలదవినీల మైన గజసంతతి మాపఁగ నీవ పోవుమా
జలధితరంగజాల మనఁజాలుతురంగము లీవ మాపుమా
బలమును నీవ కూల్పు' మని పల్కెడు రాక్షను లున్నయట్లు నా
కలఘుదయాస్వభావమున నానతియిచ్చినవాఁడ వయ్యెదో.

విరా—తరువాతఁ గుసుమపుర మాప్రాకారముగ శత్రుసేనచే నాక్రమింపఁబడుట చూచి చిరకాలమునకుఁ దనపౌరులకుఁ దటస్థించిన యీమహోపద్రవము సహింపలేక తాదృశానస్థయందును బౌరజనానుమతివడసి సురంగాద్వారమున సర్వార్థసిద్ధి తపోవనంబునకుం బాఱిపోవుటయు, మీసైనికులందఱు స్వామివిరహమున శిథిలీకృతప్రయత్నులగుటయు, నంతర్నగరవాసు లందఱు జయఘోషణావ్యాఘాతము మొదలగు సాహసకృత్యములచే సందేహ పడుటయు, మీరందఱు నందరాజ్యము మరల సంపాదించుటకును జంద్రగుప్తుని వధించుటకును దగిన యాలోచనంబులతో బయలువెడలుటయు, పైనతరువాత మీచేఁ బ్రయోగింపఁబడిన విషకన్యకచేఁ జాణక్యహతకుండు దీనుం డగు పర్వతేశ్వరునిం జంపించెను.

రాక్ష—మిత్రమా! ఎంతయాశ్చర్యమో చూడుము!

శా. క్రీడిం జంపఁగ శేకహంత్రి యగు శక్తిం గర్ణుఁ డార్జింపఁగా
హైడింబేయుని దానిచేత హరి మాయంజేసిన, ట్లేను నీ
సాఁడామార్యుని జంప నొక్కవిషకన్యం బంపఁగా దానిచేఁ
బాడుంబాపఁడు పర్వతేశ్వరున కాపాదించెనే మృత్యువుల్.

విరా— ప్రధానశేఖర! దైవతంత్రము కామచారము. మన మేమి చేయఁగలము.

రాక్ష— తరువాతఁ దరువాత ?

విరా— తరువాతఁ బితృవధత్రాసంబునఁ గుమారుం డగు మలయకేతువు పాఱి పోఁగాఁ బర్వతకభ్రాత యగు వైరోచకునకు రాజ్యమిప్పించెద నని నమ్మకము పుట్టించి చాణక్యహతకుఁడు చంద్రగుప్తునిచే నందగృహప్రవేశంబు చేయింపం దలంచి 'యీ యర్ధరాత్రమునఁ జంద్రగుప్తుఁడు నంద భవనప్రవేశము చేయును గావున మీరందఱుఁ బూర్వద్వారము మొదలు రాజభవనములన్నియు నలంకరింపుఁ' డని శిల్పివర్గమున కాజ్ఞాపించెను. వారును 'నార్యా! యింతకుమున్నె దారువర్మయనుశిల్పి చంద్రగుప్తుఁడు నందగృహప్రవేశము చేయఁగలఁ డని యూహించి బంగారు తోరణములు మొదలగు నలంకారములచేఁ బ్రథమరాజద్వారభవన మలంకరించియుంచెను. మేమింకఁ దక్కినభవనముల నలంకరింపవలయును' అని విన్నవించిరి. చాణక్యబ్రహ్మచారియు రాజశాసనములేకుండ మునుమున్న దారువర్మయను శిల్పి రాజభవన మలంకరించినందులకు సంతోషించినట్లు నటించి 'శిల్పివర! దారువర్మ! కొలఁదికాలములో నీకుఁగల రాజభక్తికిం దగిన ఫలమనుభవింతువుగాక' అని పెద్దకాలము దారువర్మ యెదుట నతని సామర్థ్యమును శ్లాఘించెను.

రాక్ష— (ఉద్వేగముతో) మహాత్మా! ఈచాణక్యవటువున కింతసంతోష మెందులకోయి! ఈదారువర్మ ప్రయత్నమునకు ఫలాభావమో యనిష్టఫలమో కలదనియూహించెదను. ఇతఁడు బుద్ధిమోహముచేతనో రాజభక్తిప్రకర్షవలననో నియోగకాలమును బ్రతీక్షింపకయే చాణక్యుని చిత్తమునకు గొప్పవికల్పముం గలుగఁ జేసినాఁడు. తరువాతఁ దరువాత ?

విరా— పదంపడి చాణక్యహతకుఁ డర్ధరాత్రిసమయమున మంచిలగ్న మనియుఁ జంద్రగుప్తునకు నందగృహప్రవేశమగు ననియు సాటించి, శిల్పివర్గమునకును బౌరనికాయంబునకును బహులార్థసత్కారంబు గావించి యర్ధరాత్రమునంద

చంద్రగుప్తుని సింహాసనముపైఁ గూర్చుండఁబెట్టి తదర్ధాసనంబునఁ బర్వతేశ్వర భ్రాతయగు వైరోచకుని సత్కరించి పృథివీరాజ్యవిభాగము చేసెను.

రాక్ష— వైరోచకున కీచాణక్యవటువు మున్ను ప్రతిజ్ఞచేసినట్లు రాజ్యభాగము వదలిపెట్టునా ?

విరా— వదలిపెట్టును.

రాక్ష— ( తనలో ) నిజముగా ధూర్తుఁడగు చాణక్యుఁ డీ దీనుఁడగు విరోచకునకుఁ గూడ రహస్యముగ నేదియో వధోపాయ మాలోచించి, పర్వతేశ్వరునిం జంపుటవలనఁ గలిగిన యపకీర్తిని దుడిచివైచికొనుటకై ప్రస్తుత మీలోకప్రసిద్ధి బలపఱచెనని తలఁచెదను. ( ప్రకాశముగ ) తరువాతఁ దరువాత ?

విరా— తరువాత, మొదటఁ జెప్పినప్రకారము చాణక్యుఁ డర్ధరాత్రంబున మురాతనూజునకు నందభవనప్రవేశము చేయించు సమయంబున దట్టముగ నమర్పఁబడిన మణిమయ కిరీటమును ముత్యాల కూర్పు గలిగిన విచిత్రపటమయమగు వారవాణంబును ముక్తాహారములును బూలదండలను నలంకరించిన విరోచకు, నెఱిఁగినవారుఁగూడ గుర్తుపట్టరాని యాకారముగలవానిని జంద్రగుప్తుఁ డెక్కుందగిన చంద్రలేఖ యను నాఁడయేనుఁగుపైఁ జాణక్యానతుని యాజ్ఞచొప్పున నెక్కించిరి. తరువాత విరోచకుఁడు జంద్రగుప్తానుయాయి యగు రాజలోకముతో నందభవనప్రవేశము చేయుచుండ మీరు పంపిన దారువర్మయను సూత్రధారుఁ డతఁడే చంద్రగుప్తుఁ డని తలఁచి యంత్రతోరణ మతని మీఁదికి విఱిఁగి పడఁదగినంత ప్రయత్నము చేసి యుంచెను. ఈనడుమ రాజులందఱు వాహనములు డిగ్గి చంద్రగుప్తుతోఁ గూడ లోనికిం బోవుచుండఁ జంద్రగుప్తుని జంపించుటకై మీరుపంపిన బర్బరకుఁడు సువర్ణదండములోఁ గూర్పఁబడిన కత్తిని హఠాత్తుగ లాగుటకుం దగినప్రయత్నముతో నాదండమును గేలధరించి నిలువఁబడెను.

రాక్ష— ఇరువురి ప్రయత్నములు నయుక్తములే.

విరా— పిమ్మట జఘనాభిఘాతమగునో యని యూహించి యారోహుఁ గంతకు మున్ను నడుచు నడక వదలి యతివేగముగు నడక మొదలుపెట్టినది. మొదట నడిచివచ్చు గజగమనము ననుసరించి పడఁద్రోయఁబడిన యాయంత్రతోరణము గుఱితప్పి పడుటచేఁ జంద్రగుప్తునితోఁగూడ వైరోచకునిం జంపక, కత్తి లాగి పొడుచుటకుం దొందరపడుచున్న బర్బరకునిమీఁదఁ బడుటచే వాఁడుచచ్చెను. అనంతరము దారువర్మ యంత్రతోరణనిపాతంబునఁ దనగుట్టు

బయలుపడుటంజేసి తనకుఁ జావు మూఁడునని యూహించి యంతకు మున్న తోరణముపై నెక్కియున్నవాఁడు గావున నందున్న యంత్రఘట్టన బీజం బగు నినుపమేకొకటి లాగి హస్తినీగతుండగు వైరోచకునిం జంపెను.

రాక్ష— ఎంతకష్ట మెంతకష్టము! చంద్రగుప్తుఁడు చావకుండుటయు వైరోచక బర్బరకులు చచ్చుటయు నీరెండనర్థములు సంభవించినవి. తరువాత దారు వర్మ యేమయ్యెను?

విరా— వైరోచకుని యేనుఁగుముందఱ నడుమ పదాతులచే బెడ్డలు విసరి చంపఁబడెను.

రాక్ష— (కన్నీరు విడుచుచు) అబ్బబ్బ! ఎంతకష్టము! హాదైవమ! వత్సలుండును మిత్రతముండునగు దారువర్మ నెడచేసితివిగదా! విరాధగుప్త! అచట నున్న వైద్యుఁ డభయదత్తుఁడేమిచేసెను?

విరా— సర్వమ్ముం గావించెను.

రాక్ష— (సంతోషముతో) దురాత్ముఁడగు చంద్రగుప్తుం జంపెనాయేమి?

విరా— అమాత్య! అదృష్టవశమునఁ జావలేదు.

రాక్ష— (విషాదముతో) ఇదియేనా సర్వమ్ముం గావించుట!

విరా— అమాత్య! అతఁడేమిచేయును! చంద్రగుప్తునికై యోగచూర్ణమిశ్రితమగు నౌషధముం గావించెను గాని చాణక్యహతకుఁ డది కనిపెట్టి బంగారు గిన్నెలో నుంపించి, వర్ణాంతరము కలుగుట గ్రహించి, చంద్రగుప్తునితో 'వృషలా! యిది విషముతోఁగూడిన మందు. దీనిం దినకుము' అని చెప్పెను.

రాక్ష— ఈబ్రహ్మచారి పరమధూర్తుఁడుగదా! ఆవైద్యుని గతియేమైనది?

విరా— ఆయౌషధమే వానిచేఁ దినిపించి చంపిరి.

రాక్ష— (శోకముతో) ఎంతటిబుద్ధిమంతుఁడు చచ్చెనోయి! కాని చంద్రగుప్తునికిఁ బక్కలు వేయుటకై నియోగింపఁబడిన ప్రమోదకుని వృత్తాంతమేమైనది?

విరా— అందఱికిం జరగినపనియే వానికిం జరగినది

రాక్ష— (ఉద్వేగముతో) ఏమగిదిని జరగినది?

విరా— వాఁడు శుద్ధమూర్ఖుఁడు. మీరిచ్చిన ద్రవ్యమంతయును వెచ్చించి సుఖమనుభవింప మొదలు పెట్టెను. 'నీకీ ధన మెక్కడిదిరా' యని యడిగినవారికి గుట్టు బయలఁబడునని పరస్పర భేదముగాఁ దెలుపుటచేఁ జాణక్యుఁడది గుర్తించి వాని జిత్రవధగాఁ జంపించెను.

రాక్ష— ( దిగులుతో ) ఇందుఁగూడ మనము దైవోపహతుల మైతిమా ? చంద్రగుప్తుఁడు శయనించిన తరువాత నతనిఁ జంపుటకై మనచే నంపఁబడి ముందే సొరంగముగుండ రాచయింటి గోడలనడుమ నివసించియున్న భీభత్సకాదుల వృత్తాంత మేమయ్యె ?

విరా—అదియే దారుణమైనది.

రాక్ష—ఏమీ ! ఆవృత్తాంతము దారుణమయ్యెనా! చాణక్యుఁడు వారు గోడల నడుమ నుండిరని కనిపెట్టలేదు గద ?

విప్ర—ప్రధానవర ! అది యట్లేజరగినది. చంద్రగుప్తుఁడు ప్రవేశింపక పూర్వమే చాణక్యహతకుఁ డాశయన గృహముం బ్రవేశించి, నిపుణముగా నాల్గువంక్కలుంజూచి, యొకానొక భిత్తిరంధ్రముగుండ నూకలుగొని యేతెంచిన చీమల బారుంజూచి, యీగోడలనడుమ మనుష్యులున్నారని నిశ్చయించి, యాయిల్లు తగులఁబెట్టించెను. అది కాలునపుడు లేచిన పొగచే దృష్టులు కానరాక, మొదట తాము వచ్చిన ద్వారముం గుర్తింపలేక భీభత్సకాదులు యగ్నిం బడి చచ్చిరి.

రాక్ష—(కన్నీటితో) అయ్యయ్యో ! ఎంతకష్ట మెంతకష్టము ! చెలికాఁడా ! చూడుము ! దురాత్ముఁడగు చంద్రగుప్తహతకునికి దైవ మెట్లు తోడుపడు చున్నాఁడో ?

మ. అతనిం జంపుటకోస మొక్కవిషకన్యం బంపఁగా దానఁ బ
ర్వతకుం జంపి తదర్థ మీఁదగినసామ్రాజ్యంబు మాన్పించె, శ
స్త్రతతిం దీక్ష్ణరసంబులం బ్రబలులం జంపించెఁ దద్యుక్తి; నా
మతియుం నీతియుఁ గూడ మౌర్యునికె సంపాదించె శ్రేయోగతుల్.

విరా—అమాత్య ! ఎట్లయినను మనము ప్రారంభించిన కార్యమును వదలరాదు.

గీ. మొదలిడరు విఘ్నభీతిచే మూర్ఖజనులు
విడిచెదరు మధ్య మధ్యముల్ విఘ్నవిహతి
మొదలిడిరయేని యడి తుదముట్టువఱకు
వదలిపెట్టరు కార్యంబు ప్రాజ్ఞతములు.

మఱియును—

ఉ. ఎన్నఁడు భూమి దింపని యహీంద్రుఁ డెఱుంగునె బర్వు? కల్గునే
యెన్నఁడు నిల్వనేరని దినేంద్రునకున్ భ్రమణశ్రమం? బిఁకే
మన్న, బుధాళి పూనిన ప్రయత్నము మానుట సిగ్గు; బుద్ధిసం
పన్నులకుం గులవ్రతము ప్రస్తుతకార్యము వీడకుండుటే.

రాక్ష—సఖా! ప్రారబ్ధకార్యము పరిత్యజింపలేదని నీకుఁ బ్రత్యక్షముగనే కనఁబడుచున్నదిగదా! తర్వాతఁ దర్వాత?

విరా—తర్వాత నది మొదలు చంద్రగుప్తుని శరీరమును వేయికన్నులచేఁ గాపాడుచుఁ జాణక్యహతకుఁడు వీరిచే నీయాపదలు మూఁడుచున్నవని నీసంబంధులని యనుమానము తగిలినవారినెల్ల నిగ్రహించినాఁడు.

రాక్ష—(ఉద్వేగముతో) ఎవ రెవరు నిగ్రహింపఁబడిరో చెప్పు చెప్పుము.

విరా—మొట్టమొదట క్షపణకుఁడగు జీవసిద్ధిని సతిరస్కారముగ నూరువెడలం గొట్టించినాఁడు.

రాక్ష—(తనలో) ఇంతవట్టు సహింపఁ దగినదియే. పుత్రమిత్రకళత్రాదులతోడి స్థానభ్రంశము పీడాకరము గాని యొక్కని స్థానభ్రంశము కాదు. (ప్రకాశముగ) వయస్యా! ఏయపరాధము మోపి యావలికి తోలం గొట్టించినాఁడు.

విరా—రాక్షసప్రయుక్త యగు విషకన్యచేఁ బర్వతేశ్వరుం జంపించినవాఁడు వీఁడేయని.

రాక్ష—(తనలో) మేలు కౌటిల్యా! మేలు!

గీ. చంద్రగుప్తుని సగమురాజ్యము హరించు
వాని మాచేతఁ జంపించి మానిపించు
కొంటి వీవపకీర్తిని గంటె! నీతి
బహుముఖంబుగ నిటు ఫలింపంగవలయు.

(ప్రకాశముగ) తరువాతఁ దరువాత?

విరా—చంద్రగుప్త శరీరమునకు ద్రోహము చేయుటకై యీశకటదాసుఁడే దారువర్మాదులను బంపించినాఁ డని నగరమునిండఁ బ్రకటించి యతనికి శూలారోపము విధించెను.

రాక్ష—(కన్నీరువిడుచుచు) హా! మిత్రమా! శకటదాస! నీకిట్టిచావు తగనిది కదా! కాని! స్వామినిమిత్తము చచ్చిన నీకొఱకు దుఃఖింపరాదు. నందకుల మంతయు నశించినను జావక బ్రతికియున్న మేమే శోచనీయులము.

విరా—అమాత్య! స్వామి కార్యమే సాధింపఁ దగిన దని యత్నించుచున్నావు!

రాక్ష—చెలికాఁడా!

గీ. బ్రతికియున్నాము స్వామికార్యంబు నిర్వ
హింపఁ గల మనునాసచే నింతదాఁకఁ
జచ్చి స్వర్గమునందున్న స్వామి దరికిఁ
దరలకుందుముగాక కృతఘ్నులమయి.

చెప్పుము! ఇతరస్నేహితుల వ్యసనముం గూడ వినుట కీచెవులు సిద్ధముగా నున్నవి!

విరా— ఇది విని చందనదాసుఁడు దేవరకళత్రము నావలకుం బంపించినాఁడు.

రాక్ష— క్రూరుఁడగు నీ చాణక్య వటువునకు విరుద్ధముగ నయుక్తమునగు కార్యమును జేసినాఁడు.

విరా— సుహృద్ద్రోహము మిక్కిలి యయుక్తమైనదికదా!

రాక్ష— తరువాతఁ దరువాత?

విరా— పిమ్మట నెంతబతిమాలిన నెంత బెదిరించినను దేవరకళత్రము జాడమాత్రము చందనదాసుఁ డాబ్రహ్మచారికిం దెలియనీయలేదు.

రాక్ష—(ఉద్వేగముగ) ఆకోపమునఁ జందనదాసుం జంపింపలేదుగద!

విరా— లేదు. ఇంటఁ గల ధన మంతయుఁ బుచ్చుకొని పుత్రమిత్ర కళత్రాదులతో నతనిం బంధనాగారమునం బడవైచినాఁడు.

రాక్ష— రాక్షసకళత్రము రక్షింపఁబడినదని యెట్లు సంతోషించుచున్నావు? చందనదాసుఁడు కాఁడు, రాక్షసుఁడే పుత్రమిత్రకళత్రాదులతో బంధనాగారమునం బడియె నని తలపోయుము.

పురుషుఁడు—(ప్రవేశించి) అమాత్యా! జయము జయము! శకటదాసుఁడు ద్వారమున వేచి యున్నాఁడు.

రాక్ష— భద్రముఖ! నిజమేనా!

పురు— దేవర కసత్యమును విన్నవింతునా!

రాక్ష— సఖా ! విరాధగుప్త ! ఇది యేమిటి !

విరా— మిత్రమా ! ఇది యిట్లయి యుండును. అదృష్టము శుభములం జేకూర్చుచుండుం గదా !

రాక్ష— ప్రియంవద ! ఇంక నాలస్యము చేసెదవేమి ? త్వరగాc దీసికొని రమ్ము.

పురు— చిత్తము. ( నిష్క్రమించును )

( పిదప సిద్ధార్థకుcడును శకటదానును బ్రవేశించుచున్నారు )

శక— ( తనలో )

చ. ధరణిపయిం బ్రతిష్ఠితపదంబున మౌర్యునిబోలు శూలము,
స్థిరమున వానిలక్ష్మివలెc జిత్తము వేచు ప్రజంబుc జూచి, భూ
వరపరిరోధకార్ద్రములు వాద్యముల ధ్వని, ప్రాక్తనవ్యథా
భరకఠినంబు నామనము వ్రయ్యక యుండుట కేమివింతయో.

( సమీపించి యమాత్యునిం జూచి) ఇతcడె! యమాత్య రాక్షసుc డిందుc గూర్చున్నవాcడు.

గీ. నందులు నశించినను నాశనంబుcగనని
శక్తిచే స్వామికార్యంబుc బగిలపుచు
నితcడెపో స్వామిభక్తులకెల్ల జగతిc
బరమసృష్టాంతమై యిట్లు పరcగుచుండె.

( సమీపించి ) అమాత్య ! జయము జయము !

రాక్ష— ( చూచి సంతసముతో ) నెచ్చెలీ శకటదాస ! దైవయోగమునc జాణక్యహతకుని కంటcబడియు నాకగుపడితివి. ఒక్కసారి కౌcగిలించుకొనుము

శక— ( కౌcగిలించుకొనును )

రాక్ష— ( చిరకాలము కౌcగిలించుకొని ) మిత్రమా ! ఇందుc గూర్చుండుము ( పీటc జూపించును )

శక— ( కూర్చుండును )

రాక్ష— సఖా ! శకటదాస ! ఏకారణమున మా కీయాహ్లాదసంపదము తటస్థించినది?

శక— ( సిద్ధార్థకుని జూపించి ) ఈప్రియమిత్రుcడు ఘాతుకుల నెల్ల భయపెట్టి పాఱcదోలి వధ్యస్థానమునుండి నన్నుc దీసికొని వచ్చినాcడు.

రాక్ష—(సంతోషముతో) భద్రుఁడా! సిద్ధార్థుఁడా! నీవు చేసిన ప్రియమున కీబహుమానము చాలదు. (తన యొడలినుండి యాభరణములు తీసి యిచ్చును)

సిద్ధా—(పుచ్చుకొని నమస్కరించి తనలో) ఇదియే కదా యార్యుని యుపదేశము! కానీ యట్లే చేయుచున్నాఁడను. (ప్రకాశముగ) మంత్రిశ్రేష్ఠ! దేవర యొసంగిన యీనగలు దాఁచుకొనుటకుం దగిన పరిచితుఁడు నాకెవ్వఁడును లేఁడు కావున నీముద్రికతో ముద్రవైచి యివి తమభాండాగారంబుననే దాచుకొనుటకు సెలవీఁగోరుచున్నాను. నాకెప్పుడు వీనితోఁ బని పడునో యపుడు మరలఁ బుచ్చుకొందును.

రాక్ష—ఇందేమి దోషమున్నది! శకటదాస! అట్లు చేయించుము.

శక—చిత్తము. (ముద్రికంజూచి జనాంతికముగ) అమాత్య! యీముద్రికయందు నీపేరున్నదేమి!

రాక్ష—(చూచి తనలో) నిజము. నే నగరమునుండి వెడలి వచ్చినపుడు మాబ్రాహ్మణి వినోదార్థముగా నావ్రేలినుండి లాగి పుచ్చుకొన్నది. అది యితని చేతి కెట్లు దొరకినదో! (ప్రకాశముగ) సిద్ధార్థక! యీముద్రిక నీకెక్కడ దొరకెను?

సిద్ధా—కుసుమపురమున మణివర్తకుఁడు చందనదాసుఁ డని యొకఁ డుండెను. ఈముద్రిక వాని యింటి ముంగిటఁ బడియుండి నాకు దొరకినది.

రాక్ష—బాగుగనే యున్నది.

సిద్ధా—మంత్రివర! బాగుగనే యున్న దనుచున్నా వేమి?

రాక్ష—మిగుల ద్రవ్యముగలవారి యిండ్లలో నిటువంటివి పడియుండుట సహజమే కదా యని యంటిని.

శక—సఖా! సిద్ధార్థక! యీముద్రిక యమాత్యనామాంకితము కావున నీ కింతకంటె నెక్కుడు ద్రవ్య మిచ్చి సంతోషపెట్టును. అమాత్యున కొసఁగుము.

సిద్ధా—అనుగ్రహమే కదా! ఇది రాక్షసామాత్యుని యంగుళినే యలంకరించును గాక. (ముద్రిక నిచ్చును)

రాక్ష—మిత్రమా! శకటదాస! నీ వీముద్రికతోనే నీయధికార మంతయును నడుపుము.

శక—దేవర యానతి నడపెదను.

సిద్ధా— ఇంకొకటి విన్నవించుచున్నాఁడను.

రాక్ష—నమ్మకముగాఁ జెప్పుము.

సిద్ధా—ఆకౌటిల్య బ్రహ్మచారి కపకారము చేసి మరలఁ బాటలీపుత్రపురమునఁ గాఁపురము సేయుట కష్టమని దేవరకుఁ దెలిసిన సంగతియే. కనుక తమపాద సేవ చేయుచు నిచ్చటనే యుండఁ గోరెదను.

రాక్ష—భద్ర! మాకు మఱింత ప్రియము గదా! మేమే ముందు కోరవలసినది నీయభిప్రాయ మిట్లుండగక యట్లుకోరలేదు. నీవు నీయిచ్చవచ్చినట్లే చేయ వచ్చును.

సిద్ధా—(సంతోషముతో) అనుగ్రహింపఁబడితిని.

రాక్ష—శకటదాస! సిద్ధార్థకుని విశ్రమింపఁజేయుము.

శక—మంచిది. (సిద్ధార్థకునితో నిష్క్రమించును)

రాక్ష—చెలికాఁడ! విరాధగుప్త! మిగిలిన వృత్తాంతమును జెప్పుము. చంద్రగుప్తుని మంత్రులు భద్రభటాదులు మనయుపజాపమును నమ్ముచున్నారా!

విరా—మిక్కిలి నమ్ముచున్నారు. నమ్ముటయే కాదు. ప్రకాశమైనదాని ననుసరించి నడచుచున్నారు.

రాక్ష—ఇప్పుడు ప్రకాశమైనదేమి?

విరా—మలయకేతువును గైవసము చేసికొనినప్పటి నుండియుఁ జంద్రగుప్తునకుఁ జాణక్యునిపైఁ గోపము వచ్చిన దనియుఁ, జాణక్యుండు నెక్కుడు జితకాశిత వలనిగర్వముచేఁ జంద్రగుప్తుని యాజ్ఞకు భంగములగు పనులు చేయుచు నతని చిత్తమును బీడించుచున్నాఁ డనియు. ఇది నాయనుభవము.

రాక్ష—(సంతోషముతో) మిత్రమా! మరల నీవీ వేసముతోనె కుసుమపురమునకుఁ బొమ్ము. అచ్చట మన ప్రియస్నేహితుఁడు స్తనకలశుఁడు వైతాళిక

వేషముతో నివసించుచున్నాఁడు. వానితోఁ జంద్రగుప్తుని యానతికి వ్యతిరేకముగ నడచుచున్న చాణక్యుని పను లన్నియు నుద్బోధము చేయు శ్లోకములతోఁ జంద్రగుప్తుని స్తోత్రము చేయుచుండు మని నా వచనంబులుగాఁ జెప్పుము. అత్యవసరమైన కార్యమున్న యెడలఁ గరభకునిచే నాకుఁ దెలియఁ బంపుము.

విరా—చిత్తము. ( నిష్క్రమించును )

పురుషుఁడు—( ప్రవేశించి ) అయ్యా! యీమూఁడలంకారము లమ్ముచున్నారు తాము చూడవలయు నని శకటదాసుఁడు విన్నవించు మనినాఁడు.

రాక్ష—( చూచి ) ఆహా! గొప్పవిలువగల నగలు! భద్ర! అమ్మువానిని సంతోషపెట్టి పుచ్చుకొమ్మని శకటదాసునితోఁ జెప్పుము.

పురు—చిత్తము. ( నిష్క్రమించును )

రాక్ష—నేనును గరభకుని కుసుమపురమునకుం బంపించెదను. ( అని లేచి యాలోచించుచు ) ఎప్పటికేని దురాత్ముఁ డా చాణక్యునకును జంద్రగుప్తునకును విరోధము తటస్థించునా! ఎప్పటికో యన నేల? తటస్థించుటకు సిద్ధముగనే యున్నది.

మ. ప్రజ లెల్లం జయవెట్ట మౌర్యునకు సామ్రాజ్యమ మేతెంచెఁ, దా
నజగన్నేత నటంచు గర్వపడెఁ జాణక్యుండు గాన న్సదా
నిజకార్యంబు కృతార్థ మయ్యె నని దుర్నీతిం బ్రవర్తించుఁ ద
ద్విజయుం బే విడఁదీయ వారిరువురన్ వీలైనకాలంబునన్.

ఇది శ్రీతిరుపతి వేంకటేశ్వరాంధ్రీకృతంబగు ముద్రారాక్షసమున

ద్వితీయాంకము.



శ్రీరస్తు.

# ముద్రారాక్షసము

## తృతీయాంకము

( అంతటఁ గంచుకి ప్రవేశించుచున్నాఁడు. )

కంచు—( నిర్వేదముతో )

మ. తనురూపాది నిరూపణంబునఁ గడున్ ద్వల్లాభముంగూర్చి పె
ల్చనఁ జూపించిన చక్షురాదులకు స్వస్వార్థావబోధంబు లె
ల్ల నశించెన్ గతపాటవం బగుచు నుల్లంఘించె నంగంబు లా
జ్ఞ; నిఁకేలా మదిలోనఁ బొంగెదవు తృష్ణా! యిట్టి పెన్ముప్పునన్.

( తిరిగి యాకసమువంకఁ జూచి ) ఓరోరి సుగాంగప్రాసాదాధికారు లగుపురుషులార !

సుగృహీతనాముండగు చంద్రగుప్తమహారాజు మీకందఱికిఁ గుసుమపురమంతయుఁ గౌముదీమహోత్సవరమణీయముగాఁ జేయఁ జూడఁ దలఁచియున్నాఁడ ననియు సుగాంగప్రాసాదముమీఁది భాగము లన్నియు నలంకరింపవలయు ననియు నాజ్ఞాపించుచున్నాఁడు. ( మింటివంకఁ జూచి ) 'కౌముదీ మహోత్సవము చేయింపఁ గూడ దని కౌటిల్యుఁడు నిషేధించినాఁ డనువార్త రాజుగారికిఁ దెలియలేదా' యని యడుగుచున్నారా ? ఓరోరి దురదృష్టవంతులార ! విన్నంతనే ప్రాణములు పోవఁగల యావృత్తాంతము మీకేల ! మీరు మీపనిం జేసికొనుఁడు. శీఘ్రముగా నిప్పుడు—

చ. అనుపమధూపధూపితములై తనరారెడి స్తంభపాళిఁ దె
ల్లనిమృదుచామరంబుల నలంకృతి సేయుఁడు పూలమాలలున్
గనకమృగేంద్రపీఠవహనంబున మూర్ఛిలెనేమొ యంచు నుం
డిన భువిఁ బుష్పవాసితపటీరజలప్రసరంబుఁ జిల్కుఁడీ!

'ఆర్యా ! మహారాజు శాసనము నీవు నుడివినప్రకారము నెఱవేర్చుచున్నా' మనుచున్నారా ! భద్రులారా ! త్వరపడుఁడు ! ఇతఁడే చంద్రగుప్తమహారాజు దయచేయుచున్నాఁడు. ఇతఁడు—

శా. గాఢాంగంబుల బల్మిచే విషమమార్గంబందుఁ దొట్రిల్లకే
ప్రౌఢుండై తనవారు మోసిన ధరాభారంబుఁ దా మోయుఁగా
బాధవ్యాపృతి సేయుచు న్నవవయఃప్రారంభుఁడై యుంట న
ప్రౌఢుం డౌట మనస్వి యౌట సుఖదుఃఖాక్రాంతుఁ డౌచుం డెడున్.

( తెరలో ) దేవా! యిట్టిటు.

( అంతటఁ రాజును బ్రతీహారియుఁ బ్రవేశించుచున్నారు )

రాజు— ( తనలో ) రాజ్య మనఁగా రాజధర్మముల ననుసరించి నడుచురాజున కెన్నఁడును బ్రీతిస్థానము కానేరదు. ఏలన—

మ. తనకు న్సౌఖ్యము లేదు భూపతి ప్రజార్థంబే ప్రయత్నించినం
దనకు న్సౌఖ్యము లేకయున్నయెడ వ్యర్థంబౌ నృపాలత్వ మ
న్యనిమిత్తంబు ప్రయత్నముం జలుప నన్యాయత్తుఁ డౌ మానవుం
డనరా దెప్పటి కస్వతంత్రునకు సౌఖ్యస్ఫారసౌభాగ్యముల్.

మఱియు నెంతటి యాత్మవంతుల కైనను రాజులకు రాజ్యలక్ష్మి దురారాధ్య మైనదే కదా! ఏలన—

మ. భయమందుం గతినాత్మఁ జూచినఁ, బరీభావంబుఁ జూపించు నెం
తయు శాంతాత్ముల, మూర్ఖులం గినియు, విద్వన్మౌళిరత్నంబుపై
దయఁ జూపింపదు, జంకు శూరులకు, భీతస్వాంతుల న్నవ్వు లం
జియఁబోలెన్ నృపలక్ష్మి నేరికయినం జేఁజేర్పఁగా శక్యమే.

మఱియును 'నాతోఁ గృతకకలహము పెంచిస్వతంత్రుండవై కొంతకాలము వ్యవహరించు' మని యార్యచాణక్యుని యుపదేశముగదా! నే నీమహాపాతకము చేయవలసివచ్చినది. ఆర్యునిచే సంస్కరింపఁబడిన చిత్తముగల మేము సర్వదా అస్వతంత్రులమే.

శా. అంతేవాసి తనంత సాధుకృతి సేయంగా స్వతంత్రుండె? కా
సంతేనిం గృతి చెడ్డదైనయెడ నాచార్యుండు శిక్షించు ను
స్వాంతుల్ సత్కృతికర్త లెప్పుడు నిజేచ్ఛావర్తులే గాని య
త్యంతం బే మిపు డున్న వారలముస్వాతంత్ర్యనకుం దూరమై.

( ప్రకాశముగ ) ఆర్య! వైహీనరి! సుగాంగమునకు మార్గమును జూపింపుము,

కంచు — అయ్యా! యిటుర మ్మిటురమ్ము. (పరిక్రమించి) ఇదియే సుగాంగ ప్రాసాదము. మెల్లఁగ నారోహింపుము.

రాజు — (నాట్యముతో నెక్కి దిక్కులు కలయంజూచి) ఆహా! శరత్కాలముచే దిక్కు లెంత సుందరముగా నున్నవో!

సీ. నీరువాసిన తెల్ల నీరదంబుల గుంపు లినుకతిన్నెలవంటి వసఘటింపఁ
గలకలారావసౌకర్యంబుఁ జూపించు సారసద్విజకోటి సౌరు వెంపఁ
బెక్కురంగులమించు చక్కందనము పెంచు మక్కులు కలువల ధిక్కరింప
సంపూర్ణచంద్రికాసారంబు వేవేగఁ బ్రవహించు నిర్ఝరపరిభవహింప
వెడఁదలై మెల్ల మెల్లఁగా విస్తరించి వేలుపుందారియను కొండవీథినుండి
యేఱు లట్లుగ దశదిక్కులేఱుపడుచు నుండెఁ గనువారి కన్నులపండువుగను.

మఱియును —

సీ. ఉద్వృత్తు లగువారికుండ దెంతైశ్వర్యమే నంచుఁ దటినుల కృశత దెలుప
ఫలము సిద్ధించినకొలఁది సత్పురుషులు వంగియుందు రటంచు వరులు నొడువ
నొడలెఱుంగక దానమొనరింప వెల్లఁబా టబ్బునంచును దెల్లమబ్బు నుడువఁ
గలుషితంబైనను ఘనులచిత్తము క్రమంబుగఁ దేఱునని జలంబులు వదింప
ఘనులఁ గన్గొని మిగులఁ గేకలిడువారి పొగరు నిల్వంబడ దటన్న పోల్కి మత్త
కేకిమదహాని తెల్ప నీలోకమునకుఁ గఱపుచున్నది వినయ మీశాల మిపుడు.

గీ. కాంత బహువల్లభత్వంబుఁగాంచి కలఁగి
సన్నగిలుచున్న దానిఁ బ్రసన్నఁజేసి
రతికథాభిజ్ఞయగుదూతి గతిగ శరదృ
తువు గలిపె జహ్నుసుతను సింధుపతితోడ.

(నాల్గుదిక్కుల నాట్యముతోఁ జూచి) ఏమిది! కుసుమపుర మెచ్చటఁ జూచినను గౌముదీమహోత్సవము లేకయేయున్నదే! వైహీనరీ! నామాటచొప్పున మనవీటఁ గౌముదీమహోత్సవము జాటింపఁబడినదా లేదా?

కంచు — దేవా! చాటింపఁబడెను.

రాజు — అటులే నేల నాశాసనముం బౌరులు వినలేదు?

కంచు — (చెవులు మూసికొని) పాపము శాంతించుచునుగాక! పృథివియం దెవ్వరును, దాఁటరాని మీశాసనమును మీపౌరు లతిక్రమింతురా!

రాజు— అట్లైన నిప్పటికిని మనపట్టనమునఁ గౌముదీమహోత్సవ మారంభింపకున్నారేమి ?

చ. పిఱుఁదుల బర్వు మందగతి వెంప భుజంగులతోడ రొక్కపుం
దెఱవలు వీథివెంటఁ జను దేఱిచి యేలొకో మేలమాడుచుం
గరితలతోడ గేస్తులు నొకళ్ళను మించు విభూషణాదు లం
బరములుఁ దాల్చి యుత్సవముపట్టున కేలొకొ రారు తెంపునన్ ?

కంచు— చిత్తమట్లే.

రాజు— ఏమిది ?

కంచు— దేవా ! ఇదియే.

రాజు— స్పష్టముగాఁ జెప్పవేమోయి.

కంచు— కౌముదీ మహోత్సవము నిషేధింపఁబడినది.

రాజు— ( క్రోధముతో ) ఏమీ ! ఎవ్వనిచేత ?

కంచు— దేవా ! తరువాతి వృత్తాంతము మాకు మనవిసేయ శక్యమైనది కాదు.

రాజు— చూచువారి కందఱకు మిగుల నేత్రానందకర మగు నీవిషయమును నిషే
ధించినవాఁ డార్యచాణక్యుఁడు కాఁడు గద !

కంచు— దేవా ! చాణక్యుఁడే కాక బ్రదికియుండఁ దలఁచినవాఁ డిం కెవ్వఁడు
నీశాసనమును నిషేధింపఁగలఁడు ?

రాజు— శోణోత్తర ! కూర్చుండెదను.

ప్రతీ— దేవా ! యిదె సింహాసనము.

రాజు— ( నాట్యముతోఁ గూర్చుండి ) ఆర్య ! వైహీనరి ! చాణక్యునిఁ జూడఁ
దలఁచుచున్నానోయి !

కంచు— దేవా ! చిత్తము. ( నిష్క్రమించును )

( తరువాతఁ దనయింట నాసనముమీఁదఁ గూర్చుండి కోపముతో
నేదియో యొక మహావిషయ మాలోచించుచున్న
చాణక్యుఁడు ప్రవేశించుచున్నాఁడు)

చాణ— ఏమీ దురాత్ముఁడగు రాక్షసుఁడు నాతో విరోధపడుచున్నాఁడా ?

శా. కౌటిల్యుండు కృతాగసుం డయి భుజంగంబట్లు బైల్దేఱి యీ
వీట న్నందులఁ జంపి చేసె నెటు వృషలీనాథుఁగా మౌర్యు, నీ
నాఁట న్వాని నిరుల్వారింతు నని ప్రతిజ్ఞల్వల్కు నారాక్షసుణ్
గోటన్మీటి మఱింతగా మతికి వెల్గుందేఱ నున్నాఁడటుల్.

( ఆకాశమున లక్ష్యముంచి ) రాక్షసా ! రాక్షస ! నీ వీదుర్వ్యసనము మానుమురా !

గీ. క్రూరమంత్రినిహితకార్యభారుఁడైన
నందుఁ డనుకొంటివో కొక్కొ నాచంద్రగుప్తు
ఈవు చాణక్యుఁడవొ నన్ను నెనయఁగాఁ బ్ర
ధానవైరంబు కో తుల్యధర్మమరయ.

(ఆలోచించి) ఈపాటివిషయమునకై నామది నింతఁగా ఖేద పెట్టుకొనుటకగదు ఏమన :—

మ. తెలుపం బోయిరి పర్వతాత్మజుని మద్భృత్యు ల్పరివిష్టాన్యులై,
యలరె న్స్వప్రనియోగదక్షుమయి సిద్ధార్థాదిదూతౌఘు, మే
నల మౌర్యేందునితో నసత్యకలహవ్యాపారినై నేఁడు శ
త్రులతోడ న్విడఁదీతు రాక్షసుని నా దుస్తంత్రముం జూడుఁడీ !

కంచు—(ప్రవేశించి) సేవ కష్ట మైనదిగదా !

సీ. భూపతివలననే మొదట భయంపడవలయుఁ బిమ్మట మంత్రివలన భయము
తరువాత రాజమిత్రులన్న భీతి పవంపడి రాజబాంధవుల జంకు
ఆవల నింట రాజానుగ్రహముఁజెంది విఱ్ఱవీఁగెడు దుష్టవిటుల బెదరు
దైన్యంబు, చూచిన తప్పైనఁ జూడలేదని బొంకుటయు, నసత్యము పలుకుట

గీ. మున్ను గాఁగల కార్యంబులన్న వెనుక
దీయఁగూడదు పిండంబు దినుటకొఱకు
యత్న మొనరించి సేవచేయుటంగఁ, గాన
ననిరి పరసేవను శ్వవృత్తియనుచు బుధులు.

(పరికించి చూచి) ఇదె యార్యచాణక్యనిగృహము. ఇందుఁ బ్రవేశించెదను. (ప్రవేశించి చూచి) అహా ! యేమిది ! రాజాధిరాజ మంత్రిగృహమున కున్న దైశ్వర్యము !

క. మటములు చూర్ణముగాఁజేయుటకై రొయికలాయి, పేడేఁదున్నవి దర్భ,
ల్పటలము వంగిన మద్యము లిటనున్నవి శుష్కములగు నింధనములతోఁ.

మహారాజగు చంద్రగుప్తునిఁగూడ వృషలుఁడు వృషలుఁడనుట యింతటి నిస్పృహుఁడగుటచే యితనికిఁ దగినది!

మ. గుణశూన్యుండగు రాజునైనఁ గృపణుల్ గొండాడుచున్నారు, నీ
యణులాభంబునకే మహాత్ములు వసత్యాలాపు లౌచుందు రీ
గుణి తృణ్యావకృతి ప్రిభావమున కీకోలాహలం బంతయుం
దృణముంగాఁగఁదలంతు రాశవదలన్ దేవేంద్రునైనన్ బుధుల్.

(చూచి భయముతో) ఆర్య చాణక్యుఁడించే కూర్చున్నాఁడే!

గీ. నందమౌర్యప్రిభాకరచందిరులకు
నొక్కపరి యస్తమానంబు నుదయమును ఘ
టింపఁ జేసినవాఁడు కడిందిమహిమ
వెల్గుచున్నాఁడు మిగుల వేవెల్గుభాతి.

(మోకరించి నమస్కరించి) ఆర్య! జయము జయము!

చాణ—వైహీనరీ! నీవువచ్చినపని యేమి?

కంచు—ఆర్య! ససంభ్రిమప్రణతభూమిపాలమౌళిమాలామాణిక్యశకలపిశంగీ కృతపాదపద్మయుగళుండును సుగృహీతనామధేయుండు నగు చంద్రగుప్త మహారాజు దేవరకు శిరసా నమస్కరించి కార్యాంతరమున కంతరాయంబుగా దేని నొకసారి చూడఁదలఁచినాఁడ నని విన్నవింపుమనియె.

చాణ—వృషలుఁడు నన్నుఁ జూడఁదలఁచు చున్నాఁడా! వైహీనరీ! నే నియోగించిన కౌముదీమహోత్సవప్రతిషేధము వృషలుని కర్ణపథమునం బడలేదుగద!

కంచు—పడినది.

చాణ—(క్రోధముతో) ఆఁ! ఎవ్వఁడు చెప్పెను?

కంచు—(భయముతో) దేవా! అనుగ్రహింపుము. సుగాంగప్రాసాదమారోహించి ప్రితిషిద్ధకౌముదీమహోత్సవ మగుపుర మంతయు మహారాజే చూచెను.

చాణ—ఆఁ! తెలిసినది. మీరంద ఱాసమయమున దుస్తంత్రిములు పన్ని వృషలునకుఁ గోపము వచ్చునట్లు చేసితిరా?

కంచు—(భయమును వడఁకుచుఁ దలవంచుకొని యూరకుండును.)

చాణ—ఏమీ! రాజపరిజనములకుఁ జాణక్యునిమీఁద ద్వేషము! అవృషలుఁ డెచ్చట నున్నాఁడు?

కంచు—(భయమునటించుచు) సుగాంగప్రాసాదంబుమీఁద. అచ్చటనుండియే నన్ను దేవరసమీపమునకుం బంపించెను.

చాణ—(లేచి) నన్ను సుగాంగమునకుఁ దీసికొనిపొమ్ము.

కంచు—ఇట్టిటు. ( యిరువురుం బరిక్రమించుచున్నారు. )

కంచు—ఇదె సుగాంగప్రాసాదము. మెలమెల్ల నారోహింపుఁడు.

చాణ—(నాట్యముతో మేడ యెక్కి—చూచి) ఆహా! వృషలుఁడు సింహాసనము మీఁద నున్నాఁడు. మంచిది! మంచిది!

గీ. రాజరాజుల నెల్ల నిరాకరింపఁ
దగిన నందుల కెడమయి ధరణిపాల
వృషభమైనట్టి వృషలుని వెదకికొనిన
యీమృగేంద్రాసనము ఘటియించె ముదము.

(దగ్గఱకుఁ జని) వృషలా! విజయము!

రాజు—(ఆసనమునుండి లేచి) ఆర్య! చంద్రగుప్తుండు నమస్కరించుచున్నాఁడు.

( పాదములమీఁదఁ బడుచున్నాఁడు. )

చాణ—(రెండుచేతులు పట్టుకొని) వత్సా! లెమ్ము లెమ్ము!

సీ. ఉపలసంఘట్టనగ్లపితగంగానదీశీకరాసారంబు శీతనగము
నైకరాగస్ఫురన్నవమణిస్థగితతీరాంతరాళము దక్షిణార్ణవంబు
వానరానీకసంవలితోరుకుంభీనురావాసితములు తాళీవనములు
నందనందనకథానందైకమగ్ననాగరికవారము ద్వారకాపురంబు

గీ. హద్దుగాఁగల భూవలయంబునుండి
వచ్చి రాజులు భవదీయపాదయుగళి
కాంగుళీగర్భముల నుత్తమాంగగతమ
ణిప్రభాతతిచేత నిండింత్రు గాత!

రాజు—ఆర్యప్రసాదమువలన సర్వము జరుగుచునే యున్నది. ఆర్యా! ఇందుఁ గూర్చుండుము.

(అని యిరువురు యథోచితముగఁ గూర్చుందురు.)

చాణ—వృషలా! మమ్ముఁ బిలిపించిన ప్రయోజనమేమి?

రాజు—దేవరదర్శనంబున నన్ననుగ్రహింపఁ జేసికొనుటకు.

చాణ—(నవ్వుచు) చాలుఁ జాలులే యీవినయము; నిష్ప్రయోజనముగ నధికారులను బ్రభువులు పిలిపింపరు కదా?

రాజు—ఆర్యా! కౌముదీమహోత్సవప్రతిషేధంబునఁ దమకుఁ గలిగిన ఫలమేమి?

చాణ—(నవ్వి) అటులేని మమ్ము నిందించుటకై పిలిపించితివా?

రాజు—పాపము శాంతించును గాక ! కాదుకాదు ; విన్నవించుకొనుటకు.

చాణ.—నీవు విన్నవించుకొనువాఁడవే యైనయెడల స్వతంత్రులగు గురువులు శిష్యులు నిరోధింపఁ దగినవారు కారు.

రాజు—ఔను. ఇందు సందేహమేమున్నది ? ఇంకేమన—ఆర్యుని ప్రవృత్తి యెన్నఁడు నిష్ప్రయోజనము కాదుగదా యని మేము ప్రశ్నించుట కవకాశము గలిగినది.

చాణ—వృషలా ! ప్రయోజనములేకుండఁ జాణక్యుఁడేకార్యముం జేయఁడని నీవు బాగుగఁ దెలిసికొంటివి.

రాజు—కావున శిష్యవాత్సల్యము నన్నుఁ బ్రేరేపణ చేయుచున్నది.

చాణ—వృషలా ! వినుము. అర్థశాస్త్రాధికారులు కార్యసిద్ధిని మూఁడువిధములుగా వర్ణించియున్నారు. అందొకటి రాజాయత్తము ; ఒకటి సచివాయత్తము ; ఒకటి యుభయాయత్తము. ఆందీకార్యసిద్ధి సచివాయత్తమైనది. దానికిం దగిన ప్రయోజనము నీవడుగం బనిలేదు. అందులకు నియుక్తులమైన మేమే తెలిసికొనఁగలము.

రాజు—(కోపముతో మొగము త్రిప్పుకొను చున్నాఁడు)

(తెరలో వైతాళికులు)

ఒకఁడు—

సీ. కాశపుష్పము రంగుగల్గు భస్మంబుచే దేవతామార్గంబు తెల్లఁబడఁగ
జలధరచ్ఛవిగల్గి పాలుపారు గజచర్మ ముడురాజు కిరణము లుడుపుచుండ
వాలవిప్పినపిండి యనఁజాలు వెన్నెల గ్గాపాలమాలికాశ్రియముఁ దెలుపఁ
దలమీఁది మిసువాఁక తరగలవలెఁ జలచ్ఛదతరుచ్ఛాయలు సంచలింప

గీ. రాజహంసలు హాసంబునోజఁదెలుపఁ
గొత్తముక్కంటి మైచాయ కొమరుఁ దెగడు
నీశరత్కాల మో యవనీంద్రతిలక !
నీతనుక్లేశ మడఁగించుఁగాత మెపుడు.

మఱియును—

సీ. బలవంతముగ మూఁతపడు తెప్పదోయి విప్పుటచే జడీభావమును వహించి
విస్ఫురత్కాంతితో వెలుఁగొందు రత్నదీపశ్రేణిఁ గాంచఁగాభయముపడుచు
మనమిందియముఁగూడఁజవఁబోయినను బురోవస్తుగ్రహణమందుఖారపడుచు
నిద్రావినిచ్ఛేదనియతార్ధుణిమమ్ముయి కడకన్నులకు వింతకాంతి దవర

గీ. సోగియు నాకేకరంబగు చూపుతోడఁ
బడగలు తలాడఁగాఁ గల పాఁపరాచ
పాన్పుపైనుండి లేచు శ్రీపద్మనాభుఁ
డరసి నిన్నెల్లవేళఁ గాపాడుఁగాత.

రెండవవాఁడు—

సీ. అమితసత్త్వమ్మున కాలవాలములుగా బ్రహ్మచే సృజియింపఁబడినవారు
స్వప్రభావముచే మదప్రసారముగల్గు నిభయూథపతుల జయించువారు
నాలుమూరైన నవ్యాయుపవర్తన మైనఁ దమమాటఁ జెల్లింపఁదలఁచువారు
నాపదమూఁడుకార్యంబైన సువ్యక్తమానావలేపముల్పూనువారు
గీ. మిమ్ముఁబోలిన సర్వభూమీశశత్రు
లెన్నఁడేనియుఁ దమయాన కెదురుచున్న
వారిని సహింపఁబూనరు కోఱలూడ్చఁ
గాఁదలఁప సైఁపలేని సింగములపగిది.

మఱియును—

గీ. నగలు ప్రస్కందనాదు లనంతములుగఁ
దాల్చువారిని బ్రభువు లం దగదు చూవె ;
యాజ్ఞ యెల్లెడ నప్రతిహతము గాఁగ
నడపు వాఁడవు నీవపో పుడమిపతివి.

చాణ—(తనలో) మొదట విశిష్టదేవతాస్తుతిరూపముగ శరద్గుణప్రఖ్యాపనము గావించి యాశీర్వదించినాఁడు, సరియే తరువాత స్తుతించుట యెందు కొఱకో నాకుఁదెలియకున్నది. (ఆలోచించి) ఆఁ! తెలిసినది. ఇది రాక్షసునిప్రయోగమై యుండును. ఓరీ! దురాత్మ రాక్షస! చూచుచుంటినిలే! కౌటిల్యుఁడు మేల్కనువాఁడు గాని నిద్రపోవువాఁడు గాఁడు.

రాజ—ఆర్య! వైహీనరీ! ఈవైతాళిక లిరువురలో నొకనికి సువర్ణశతము నొకనికి సువర్ణ సహస్రము నిప్పింపుము.

కంచు—చిత్తము, (లేచి పరిక్రమించును).

చాణ—(క్రోధముతో) ఓరీ! వైహీనరీ! నిలువుము.నిలువుము. పోకుము. వృషలా! నీ కీసమయమునం దింతసొమ్ము వినియోగించుట యెందుకు ?

రాజు—(కోపముతో) నీకార్యము చేయఁబోయిన నార్యుఁడేయిట్లు నిషేధించుచున్న నా కీరాజ్యము బంధనాగారముగాని రాజ్యము గాదు.

చాణ—వృషల! తెలుచుగఁ బండితులుగాని రాజుల కున్న క్రోధము లే యివి. నే నిట్లు చేయుటయే నీవు సహింపవేని నీయిచ్చవచ్చినట్లే చేయుము.

రాజు—అట్లే, మాపని మేమే చేసికొందుము.

చాణ—నా కిష్టమే, మాపని మేమును చేసికొందుము.

రాజు—కానిండు, మొదటఁ గౌముదీమహోత్సవప్రతిషేధమునకుం బ్రయోజనము విన దలఁచి యున్నాఁడను.

చాణ—వృషల ! కౌముదీమహోత్సవము చేయించుటకుఁదగిన ప్రయోజనము నేనును నీవలన వినఁదలఁచి యున్నాఁడను.

రాజు—మొదట నాయానతికి వ్యతిరేకముగా నడువకుండుటయే ప్రయోజనము.

చాణ—నాయానతికి వ్యతిరేకముగా నడువకుండుటయే కౌముదీమహోత్సవ ప్రతిషే ధమునకుఁ బ్రయోజనము. ఏలన:—

ఉ. చీఁకటిచెట్లు పల్లవరుచి న్నలు పెక్కిన తీరకాననా
నీకముతోఁ దిమిత్సుభితనీరము లై తగు నాల్గుసంద్రముల్
దాఁకి నృపుల్ తలం బ్రిసవదామ మటు ల్గొను తావకాజ్ఞయున్
నాకుఁ బగొట నీదొరతనంబునకున్న వినీతి దెల్పెడిన్.

ఇంకొక ప్రయోజనము కూడఁ గలదు. వినఁ దలఁచితివేనిఁ జెప్పెదను.

రాజు—చెప్పుఁడు.

చాణ—శోణోత్తర ! నీవుపోయి యచలదాయస్థునితో 'నిక్కడినుండిపోయి మలయ కేతువు నాశ్రయించిన భద్రభటప్రముఖులు వ్రాసిన లేఖ్యపత్ర మిమ్మంటి' నని తీసికొనిరమ్ము.

ప్రతీ—చిత్తము. (నిష్క్రమించి మరలఁ బ్రవేశించి) అయ్యా! ఇదిగోఁబత్రము.

చాణ—(పుచ్చుకొని) వృషల ! ఇది చూడుము.

రాజు—(తనలోఁ జదువుకొనుచున్నాఁడు) సుగృహీత నామధేయుండవగు చంద్ర గుప్తమహారాజ ! నీకు స్వస్తి. నిన్నువదలి పట్టుఁడగు మలయకేతువు నాశ్ర యించిన ప్రధాన పురుషులగు భద్రభటాదులు వ్రాసికొనిన ప్రమాణపత్రిక యేమనఁగా:- ఇచ్చట గజాధ్యక్షుం డగు భద్రభటుండును నశ్వాధ్యక్షుఁ డగు పురుషదత్తుండును ద్వారపాలాధికారి యగు చంద్రభానుని మేనల్లుఁడగు డింగరాతుఁడును, మీయాత్మబంధువులలోఁ జేరిన మహారాజు బలదేవగుప్తుఁ డును, మీకుమారసేవకుండగు రాజసేనుండును, సేనాపతి యగు సింహాబలు నకుఁ జిన్నతమ్ముఁ డగుభాగురాయణుండును; మాలవరాజపుత్రుండగు లోహి

తాక్షుండును, క్షత్రిగణప్రధానుం డగు విజయవర్మయు నగునీ మందఱును దేవర కార్యమునం దవహితులమై యున్నారము. (ప్రకాశముగ) ఆర్యా! యీయుత్తరమునం దింతే యున్నది. వీరందఱు మనలను వదలి యతని నాశ్రయించుటకుం గారణ మేమి తెలుపుఁడు.

చాణ—వృషలా! వినుము. గజాధ్యక్షాశ్వాధ్యక్షులగు భద్రభటపురుషదత్తు లిరువురును స్త్రీమద్యమృగయావ్యసనములం దగుల్కొని తమ యధికారమును జక్కఁగా నిర్వర్తింపఁజేయకుండుటఁ గని నే నాయధికారము వారికిం దగ్గించి తిండియు వస్త్రము మాత్ర మిచ్చుచు నుంచుటం జేసి వారిద్దఱును మలయకేతువు నాశ్రయించి తమయధికారము లతనియొద్ద సంపాదించిరి. డింగరాతబలగుప్తు లిరువురును దమకిచ్చు జీతము చాలదని లోభాక్రాంతులై యంతకన్న నెక్కుడు బహుమాన మతనియొద్దఁ బొందఁదలఁచి మలయకేతువు నాశ్రయించిరి. నీకుం జిన్నతనంబున సేవకుండగు రాజసేనుఁడు నీయనుగ్రహంబున హస్త్యశ్వరథపదాతిబహుళంబగు మహైశ్వర్యము సంపాదించినవాఁడగుటం జేసి యది మరల లాగికొందురేమో యనుభయంబునం బోయి వాని నాశ్రయించెను. సేనాపతియగు సింహబలుని చిన్న తమ్ముండగు భాగురాయణుండును పర్వతకుని కాలమం దతనితో మిగుల మైత్రికలవాఁ డగుటం దత్ప్రణయంబున 'నీతండ్రిని జాణక్యుఁడు చంపించె నిన్నుఁగూడఁ జంపింపఁగలఁ' డని రహస్యమున భయము పుట్టించి మలయకేతువును మనల నుండి విడఁదీసి యావలకుం బంపి, చందనదాసాదులు మనచే నిగ్రహింపఁ బడినపిదప స్వదోషముగూడ బయలుపడునేమోయని భీతిల్లి మలయకేతువునే యాశ్రయించె. అతండును దనకుం బ్రాణరక్షకుండని చేసిన మేలు మఱువక వానికి మంత్రిపదమిచ్చి గౌరవించెను. లోహితాక్ష విజయవర్మ లిరువురును నత్యంతమానవంతులగుట నీవు తమకు దాయాద మిచ్చుచుంట సహింపలేక పర్వతాత్మజు నాశ్రయించిరి. వీరందఱు లేచిపోవుట కివే కారణములు.

రాజు—ఈగతి నపరాగకారణంబులు తెలిసియుండియు నార్యుఁ డేల ప్రతివిధాన మాచరింపలేదు.

చాణ—వృషలా! ప్రతివిధానము చేయ వీలులేదు.

రాజు—చేతఁగాక! లేక ప్రయోజనముండియా?

చాణ—చేతఁగాకేమి? ప్రయోజనముండియే.

రాజు—ఆప్రయోజన మేదియో వినఁదలంచినాఁడ.

చాణ—అవహితుండవై వినుము. విరక్తులగు ప్రకృతులకుం బ్రతిక్రియ సలుపుట రెండువిధములు. ఒకటి యనుగ్రహించుట, రెండవది నిగ్రహించుట. అధికారమునుండి తొలఁగించిన భద్రభటపురుషదత్తులకు మరల నధికారపద మొసంగుటయే యనుగ్రహము. అటువంటి వ్యసనపరాయణులకుఁ దాదృశాధికారము లిచ్చుట రాజ్యమునకు మూలములగు గజతురంగబలముల నశింపఁ జేసికొనుటయే. డింగరాతబలగుప్తు లతిలుబ్ధులు, రాజ్యమెల్ల నొసఁగినను వారికి సంతుష్టి లేదు. వారి ననుగ్రహించుట మనతరముకాదు. రాజసేన భాగురాయణులు సంపాదించినధనము మరల నపహరింతురేమో యని భీతికలవారు; వారి ననుగ్రహించుట కేయవకాశము లేదు. అభిమానవంతులగు లోహితాక్షవిజయవర్మలు దాయాదమే సహింపనివారు; వారిననుగ్రహించుట యెట్లు? కావునఁ బూర్వపక్షము నిరాకృతమయ్యెఁ గదా! యిక నిగ్రహము విషయమై విచారింతము. మనకుఁ గొలఁదికాలమున నేకదా నందరాజ్యము సంప్రాప్తమైనది. చిరకాలము నందులయొద్దఁ గొలువుచేసి వారల యైశ్వర్య మనుభవించిన ప్రధానపురుషులయెడ మన ముగ్రదండ ముపయోగించితిమేని నందకులాభిమానులగు ప్రకృతి వర్గమునకు మన మవిశ్వాస్యులమేయగుదుము. కావున నిగ్రహంబును బనికిరాదు. రాక్షసునియుపదేశమునకు లోఁబడి మనపక్షమువారినెల్లఁ దయఁజూచి గొప్పమ్లేచ్ఛబలముతోఁ గూడి పర్వతకపుత్రుండగు మలయకేతువు మనపై దాడివెడలుట కుద్యుక్తుఁడై యున్నవాఁడు. కావున మనకిది యలజడిసమయముగాని మహోత్సవసమయము కాదు. కోటకాపాడుకోవలయుఁ గాని యీకౌముదీమహోత్సవ మేల యని నిరాకరించితి.

రాజు— ఆర్యా! నేనడుగవలసినది విస్తారమున్నది.

చాణ— వృషలా! నేఁ జెప్పవలసినదియుఁ జాల నున్నది కావునఁ జనువుగా మాటలాడుము.

రాజు— ఇన్ని యనర్థములకుఁ గారణమగు మలయకేతువు లేచిపోవునపు డార్యుఁ డేల యుపేక్షించినాఁడు.

చాణ— ఉపేక్షింపకపోవుటకు రెండు హేతువులుండవలయును. అం దందులకు నిగ్రహింపలేదనియా? ప్రతిశ్రుతంబగు నర్ధరాజ్య మేల యీలేదనియా నీయభిప్రాయము. నిగ్రహించినచోఁ బర్వతకుని మనమె జంపించితిమని,

వేఱె నోటితోఁ జెప్పనక్కఱలేదు. మనకృతఘ్నత్వము బయటపడుటకు సందేహమును లేదు. అర్ధరాజ్యమే యొసఁగెదమన్నచోఁ బర్వతకవినాశము నకుఁ గృతఘ్నత్వమే ప్రయోజనము కాని రెండవప్రయోజనమే లేకపోవును ఇవి యన్నియు నాలోచించి మలయకేతువు లేచిపోవుచుండఁగా నూరకుంటిని.

రాజు — కానిండు. రాక్షసుఁ డీనగరమునుండి లేచిపోవుచుండ నుపేక్షించుట కేమి సమాధానము చెప్పెదరు?

చాణ — రాక్షసుండును స్వామియెడల స్థిరానురాగము కలవాఁడగుటను జిరకాల మీనగరమందు వసించినవాఁ డగుటను సౌశీల్యముగల నందప్రకృతివర్గమున కెల్ల విశ్వాసపాత్రమగుటను బుద్ధిబలపౌరుషంబులలో స్వతంత్రుఁ డగుటను ద్రవ్యబలము నంగబలమును గలవాఁడగుటను మన నగరమునందే యుండెనేని గొప్ప కుటుంబకలహమును బుట్టింపఁగలఁడు. దూరీకృతుఁడైనచో నితరులవలని యుపకారముఁ గలిగించుఁగాక. కలిగించినను దగిన సామాద్యుపాయములచేఁ గైవసముఁగావించుకొనుటకుఁ దగును. ఇచ్చట నుండెనేని హృదయములో నాఁటిన మేకగునని దూరముగా వెడలఁ గొట్టింపఁబడియె.

రాజు— ఆర్యా! పరాక్రమించి యేల రాక్షసుని నిగ్రహింపలేదు?

చా— వాఁడు రాక్షసుఁడే. పరాక్రమించితి మేని మన బలంబులఁ గొన్నింటిని జంపును, లేదా తానే చచ్చును. మన కీయుభయపక్షములును మంచివికావు. ఏమన :-

గీ. వేగము వహించి యతనిఁ జంపితిమయేని
పిదప దొరకునె యంత తెల్విగలనుంతి?
వదల దావ్యథయును భవద్వర్గములకు
వనకరింబోలెఁ బట్టంగవలయుఁగాన.

రాజు— అయ్యా! మేము నీమాటల కడ్డుచెప్పుటకుఁ దగిన మతిమంతులము కాము కదా! ఏవిధమునఁ జూచినను రాక్షసామాత్యుఁడే కడుంగడు ప్రశంసింపఁ దగినవాఁడు.

చాణ— (క్రోధముతో) నీవు కా వనియేకదా తరువాతఁ బూరించ చేయఁదగిన వాక్యము. కానీ! వృషలా! ఏదీ, యాతని యోగ్యత యెట్టిదో తెల్పుము.

రాజు— అయ్యా! వినుము. మహానుభావుఁడగు రాక్షసమంత్రి :-

సీ. అస్మద్వశీకృతంబైన యీవీట వసించెఁ గాల్మెడమీఁద నుంచినట్లు
జయఘోషణాదినిస్వనము లస్మద్బలంబులు సేయకుండఁగఁ గలఁచివైచె*
అస్మదేశత్రాస్థ మరుదెంచువేళఁ గృత్రిమతోరణము సమర్థించి యుంచె
శయ్యాగృహంబువజ్జను సొరంగంబుఁ గల్పించి చారులను బ్రవేశపెట్టె

తే. గీ. మారణోపాయములు పన్నె మఱియు నెన్ని
యేనిఁ; దన్నీతి వంచితులైన మనము
నమ్మఁదగు భృత్యులెవ్వరో నమ్మఁదగని
వారలెవ్వరొ యెఱుఁగ కున్నారమిపుడు.

చాణ— రాక్షసుఁడిట్లు చేసెనా ? (నవ్వి) వృషల! ఏను నందుల నడంచి రాజ్య భారము నీకుఁ గలుగఁజేసినట్లే నిన్నడంచి రాజ్యము మలయకేతువున కిడెద నని ప్రతిజ్ఞ చేసినాఁడనియు నాకుఁ దెలిసినది.

రాజు— నందరాజ్యము నశింపఁజేసినది దైవము, అందులకు మీరెవ్వరు?

చాణ— ఓరీ మత్సరీ ! యేమంటివి !

ఉ. కొంచెముగానియల్క తోఁకఁకుల్ వడు వ్రేళుల జుట్టువిప్పి కా
వించిన నాప్రతిజ్ఞ నెఱవేర్పఁగ నెవ్వదియొక్క వేయిగాఁ
బెంచిన ద్రవ్యకోటిగల వీరుల నందుల నెల్ల నేను దుం
పించఁగలేదె యంతకునివీఁటికి రాక్షసమంత్రి చూడఁగన్.

మఱియును.

సీ. ఆబద్ధచక్రంబులై మింట గద్దలు తెక్కలల్లార్చి పరిభ్రమింప
నినకాంతు లడఁగింపఁ జనఁజాలు ధూమ మభ్రమున నీరదమండలములు పెనుప
సంగులేతించి రానందమే యని పితృవనభూతములు తాండవంబుసలుప
నెఱపులేక తెగించి విప్రాపకృతి సేయఁ దగదంచు సర్వభూధవులు తలఁప

తే. గీ. బ్రాహ్మణులకున్న నీతిశాస్త్రప్రభావ
మెల్లలోకంబులకుఁ దేట తెల్లముగను
నందరాజశవంబులక్రిందఁగల చి
తాగ్ని యిప్పటికైనఁ జల్లారలేదు.

రాజు— ఇదియంతయుఁ గావించినవాఁడును మఱియొక్కఁడే.

---

* నిలిపివైచె పాఠాంతరము.

చాణ—ఓ ఎవఁడురా వాఁడు?

రాజు— నందకులద్వేషియగు దైవము.

చాణ— దైవముకావించె ననుకొనువారు విద్వాంసులే కారు.

రాజు— ఆత్మస్తవముఁ గావించుకొనువారును విద్వాంసులు కారు,

చాణ—ఓరీ వృషల ! నన్నుఁగూడ నొక భృత్యమాత్రునిగాఁ దలపోయుచుంటివిగా! కానిమ్ము.

చ. పరుగిడుచున్న దోరి! ముడివైచిన జుట్టు సడల్పఁ గేలు క్రి
మ్మఱఁ ( భూమి కాలితోఁదన్ని )
జలియించుచున్నదిసుమా వలకాలు ప్రతిజ్ఞసేయఁగా
నరుదుగ నందులం గెడపి యాఱిన మామకకోపవహ్నికిన్
మరల ఘటింపఁజేయుదువె మంటలు! కాలము దాపరించుటన్.

రాజు— (ఆవేగముతోఁ దనలో) ఆర్యునకు నిజముగానే కోపము వచ్చినట్టున్నదే!

మ. నియతక్రోధచలద్విపక్ష్మవిగళన్నేత్రోదకక్షాళితం
బయియున్ బింగళలోచనద్యుతిభ్రుకుట్యాక్షేపధూమోద్గమ
క్రియమై ముందఱ మండునట్లు ధృథశక్తిం దన్నఁ గోపాకులం
బయి భూదేవి స్మరించె నృత్యకృతరుద్రాంఘ్రిప్రహారంబులన్.

చాణ— (కోపముఁ జాలించి) వృషలా ! వృషల ! ఉత్తర ప్రత్యుత్తరము లెందుకు. నాకంటె రాక్షసమంత్రినే మతిమంతుండని తలఁచితివేని యిదిగోఁ కత్తి; యతనికేయిమ్ము. (అని శస్త్రము విడచి లేచి యాకాశమందు లక్ష్యమిడి తనలో) రాక్షసా ! రాక్షస ! ఇదియంతయుఁ జాణక్యుని బుద్ధి నతిశయింపఁ దలఁచు నీబుద్ధిప్రకర్షణము !

తే. గీ. ఏజయింం చెదఁ జాణక్యునెడల భక్తి
లూన్యుఁడౌ చంద్రగుప్తుని సుఖముగ నని
తలఁచి నీసేయు దుష్టకృత్యంబులెల్ల
భవదనర్థంబునకె యిట్లు పరిణమించె.

(నిష్క్రమించును)

రాజు—ఆర్యవైహీనరీ! నేఁడు మొదలు చాణక్యుని లెక్కింపకయే చంద్రగుప్తుఁడు తనరాజ్యమును దానేలుకొనఁదలఁచి యున్నాఁడని యితరమంత్రు లందఱికిఁ దెలుపుము,

కంచుకి— (తనలో) ఏమిది! ఆర్యచాణక్యుఁడనక నిరుపపదముగాఁ జాణక్యుఁడనియే ప్రయోగించుచున్నాఁడే! అవురా! అధికారపిశాచ మావేశించినది. పాప మిది యితని దోసముకాదు. ఏమన :—

తే. గీ. నృపతిచేసిన దుష్కృత్యమేదియేని
బ్రగడచేసినయదిగానె పరిణమించు;
నంత పొరపాటుచేతనే హద్దుమీఱి
యుడరుగల్పించునట్టిదియగును దంతి.

రాజు— వైహీనరీ! ఏమాలోచించుచున్నావు.

కంచుకి— దేవా! ఏమియును లేదు. దైవవశమునఁ దమరిప్పుడు ప్రభువులైరి.

రాజు— (తనలో) మేమందఱము నిట్లు తలఁచుచుండ నార్యకౌటిల్యుఁడు కృతార్థుఁడగుఁగాత. (ప్రకాశముగ) శోణోత్తరా! ఈశుష్కకలహంబున నాకుఁ దలనొప్పివచ్చినది. శయనగృహమునకు దారిచూపుము.

శోణో— అయ్యా! చనుదెండు చనుదెండు.

రాజు— (తనలో)

ఉ. గౌరవముం ద్యజించుచు ముఖాముఖి నార్యు నను జ్ఞచేతనే
దూరితి నార్యు, నెట్లయిన దోసమె; భూవివరంబు దూరఁగాఁ
గోరెడు బుద్ధి దానికయి; కూళతనంబున నిక్కపుందిర
స్కారము సేయువారి కెటుగాఁ బ్రదవ దెందము వ్రీల్పకుండునో.

(అందఱును నిష్క్రమింతురు.)

ఇది—శ్రీ తిరుపతి వేంకటేశ్వరాంధ్రీకృతంబగు ముద్రారాక్షసమునందు ద్వితీయాంకము.



శ్రీరస్తు.

# ముద్రారాక్షసము

## చతుర్థాంకము

( తరువాతఁ బధికవేషముతో నొకపురుషుఁడు ప్రవేశించును )

పురు— ఆశ్చర్యమాశ్చర్యము.

తే. గీ. నరపతి యనుజ్ఞ తా నకాండప్రయాణ
దుర్భరము కాకయున్నచో దుఃఖమనక
సుఖమనక యెవఁడు భయపడుచుఁ భ్రమించు
ప్రభుశాసనము నిగమప్రాయమౌర.

అమాత్యరాక్షసుని యింటికిం బోయెద. (అలయికతోఁ బరిభ్రమించి) ద్వార పాలకులలో నెవఁడురాయున్నది? రాక్షసమంత్రితోఁ గరభకుఁడు పాటలీపుత్ర పురమునుండి కార్యత్వరితుండై వచ్చినాఁడని విన్నవింపుము రా!

దౌవా— (ప్రవేశించి) అయ్యా! నెమ్మదిగా మాట్లాడుము. మంత్రిగారు తెల్ల వాఱుదనుకఁ గార్యాలోచనముఁజేయుచు, మేల్కొని యుంటచేఁ బొడమిన తలనొప్పిచే శయనాగారమునందే యున్నారు. కావున ముహూర్త కాల మాగుము. అవసరముఁజూచి నీరాక తెలిపెదను.

పురు— భద్రముఖా! అట్లేచేయుము.

( తరువాతఁ జింతాక్రాంతుఁడై రాక్షసమంత్రియు నాసనస్థుఁడగు శకటదాసుఁడు ప్రవేశింతురు )

రాక్ష —(తనలో)

తే, గీ. పని మొదలువెట్టుచో విధిప్రాతికూల్య
మటుపిదపఁ జాణక్యు కుటిలబుద్ధి;
నాకృతులు వ్యర్థమౌట యనారతంబు
తలఁపనే నాకు నిశల నిద్రయు గతించె.

మఱియును,

మ. తొలుతం గార్య మొకింతయుం బిదప నెంతో పెద్దయుం జేసి, యా
వల బీజంబునకుఁ నిగూఢదశ పోవంజేసి, యాపైని విమ

ర్మలు గావించియు విస్తృతంబయిన కార్యంబున్ ముగింపించు వారలు క్లేశంబు సహింపఁ దృశ్యకృతికర్తల్ తోడు మాబోంట్లకున్.

దురాత్మకుండగు బ్రహ్మచారి చాణక్యుఁడు—

దౌవా— (సమీపించి) జయముఁబొందుఁగాక—

రాక్ష— మోసపుచ్చుటకు శక్యుఁడగునా!

దౌవా— రాక్షసామాత్యుఁడు.

రాక్ష— (వామాక్షిస్పందనము సూచించి తనలో) యీ ద్వారికుని పలుకులను నా పలుకులను కలిపినచో 'దురాత్మకుండగు బ్రహ్మచారి చాణక్యుఁడు జయముఁ బొందుఁగాక, మోసపుచ్చుటకు శక్యుఁడగును రాక్షసామాత్యుఁడు' అను నర్థము తేలినది. ఎడమకన్ను దరుటకూడ దాని నే ద్రఢీకరించుచున్నది. అయినను నాయుద్యమము నేను మానను. [ప్రకాశముగా] దౌవారికా! ఏమో చెప్పఁదలఁచివచ్చితివి.

దౌవా— దేవా! కరభకుఁడు ద్వారమందున్నాఁడు.

రాక్ష— త్వరగాఁ బ్రవేశపెట్టుము.

దౌవా— మంచిది. (నిష్క్రమించి పురుషుని సమీపించి) అయ్యా! లోనికిం బొమ్ము సెలవైనది. (నిష్క్రమించును)

కరభ— (సమీపించి) అమాత్యశేఖరా! జయము జయము!

రాక్ష— కరభకా! కూర్చుండుము.

కరభ— చిత్తము. (నేలపైఁ గూర్చుండును)

రాక్ష— (తనలో) ఇతని నే నేప్రయోజనమునకుం బంపితినో ప్రయోజన బాహుళ్యముచే స్ఫురింపకున్నది. (ఆలోచించును. పిమ్మట బెత్తము చేతఁబూని రెండవ పురుషుఁడు ప్రవేశించును.)

రెండవపురు— ఒత్తిగిలుం డొత్తిగిలుండు. లేచిపొండు లేచిపొండు. మీకుఁ గనపడుటలేదా!

తే. గీ. చూడఁ గళ్యాణకులధరుల్ సురలతో స
మానులగుదురు నరదేవులైనవారు,
దర్శనమె దుర్లభము; వారిదయకుఁ బాత్రు
లగుదు రేరీతిఁగ నధన్యులైన జనులు?

( ఆకసముపంకఁజూచి ) 'ఆర్యా! మేమెందునిమిత్తమొత్తిగిలవలయు' నని యడుగు చున్నారా ? ఆర్యులారా! కుమార మలయకేతు మహారాజు రాక్షసామాత్యునకుం దలనొప్పి వచ్చినదని విని చూచుటకై యీవైపునకే వచ్చుచున్నాఁడు. కావున నొత్తిగిలుండంటిని. ( నిష్క్రమించును )

( తరువాతఁ గంచుకియు భాగురాయణుండును మలయకేతువును బ్రవేశింతురు)

మలయ— ( ఊరుపుచ్చి తనలో ) నేటికిఁ దండ్రిగారు పరలోకమునకు గతించి పదిమాసములైనది. వృథాపురుషాభిమానముగల నే నిప్పటికినిఁ దర్పణము లిడకయే యున్నాను.

అందఱ ముందఱ నేనిట్లు ప్రతిజ్ఞఁ గావించితినిగదా!

సీ. ఎదుఱొమ్ము కేల నెంతే బాదుకోఁగ భిన్నములౌచు హారరత్నములు చెదర
నోడ లెఱుంగని వంత నడలఁగా దిగజాఱి యుత్తరీయాంశుకంబొదిగిపోవఁ
బలిచర్య లెగ్గెత్తి కలుమాఱుఁ దలఁపఁగా హాహారవము దిక్కులందు నిండఁ
బుడమిపైఁబడి యేడ్చునెడఁజూర్ణ కుంతలంబులు! బూదెలోఁబ్రుంగి పొలుపువాయఁ

తే. గీ. బొగులు చున్నట్టి తల్లులపగిదిఁ బగఱ
వెలఁదులనుగూడ నేనేడిపింపకుండ
నూర కే మని యిడుదుఁ దిలోదకములు
వచ్చి స్వర్గస్థుఁడైన మజ్జనకునకును.

వేయుమాటలేల—

గీ. తల్లి కన్నీరు తుడిచి క్షాత్రవకళత్ర
నేత్రములయందుఁ జేర్చుట నేర నేని
కాపురుషుఁడన్న ప్రఖ్యాతి కలుగకుండఁ
దండ్రికడకేనిఁబోదు యుద్ధమునఁ జచ్చి.

(ప్రకాశముగ) జాజలీ! అనుయాయులగు రాజులందఱితోడను 'నతర్కితోపపన్నుం డనగు నన్నుం గని యమాత్యరాక్షసుఁ డానందపడవలయునని యిపుడే నతని దర్శనమునకుఁ బోవుచుంటిని; గాన మీ రెవ్వరు రావల' దని నామాటలుగాఁ జెప్పుము.

కంచుకి— మంచిది. ( పరిక్రమించి) ఓరాజులార! నాతోఁగూడ మీరె వ్వరును రా వలదని కుమార మలయకేతువు మీకందఱకు నానతిచ్చుచున్నాఁడు. (చూచి సంతోషముతో) దేవా! నీవానతిచ్చితి వన్నంతమాత్రముననే రాజు లందఱును మరలిపోయినారు. కుమారా! చూడుము...

మ కవికాకర్షణవిస్తృతాంసముగ డెక్కల్ మిన్ను ఖండించుచున్
లివడిం బోవు గుఱ్ఱాల సాదిశతి మళ్ళించెం, గజారోహకుల్
జవనీరోధ మొనర్ప నాఁగెఁ గరులెల్లన్ మూకఘంటంబుగా;
నవురా దాఁటరు వారిధుల్ పగిది మర్యాదన్ ధరాపాలకుల్.

మల— ఆర్యా! నీవు కూడఁ బరిజనముతో మరలిపొమ్ము. భాగురాయణుఁ డొక్కరుఁడును నాతోడ వచ్చును.

కంచుకి— మంచిది. (నిష్క్రమించును.)

మల— సఖా! భాగురాయణ! భద్రభట ప్రభృతు లంద ఱిటకు వచ్చి నాతో నొక విన్నపముఁ జేసికొనిరి. ఏమన, కుమారా! మే మమాత్యరాక్షసునిద్వారా ఆశ్రయణీయుఁడవగు నిన్నాశ్రయించుట లేదు. దుష్టామాత్యపరిగృహీతుఁ డగు చంద్రగుప్తు నెడల విరక్తులమగుట చేతను భవదీయ సుగుణ సంపద చేతను నీసేనాపతి యగు శిఖరకునిద్వారా నిన్నాశ్రయించుచున్నా మనిరి. కాని యెంత విచారించినను వారివాక్యములకు నాకర్థము తెలిసినది కాదు.

భాగురా— కుమారా! ఈవాక్యముల యర్థ మంత దుర్బోధముగా లేదే! అభిరామగుణ సంపన్నుండై యాశ్రయింపఁదగినవాఁ డగు విజిగీషువును ప్రియహితునిద్వారా యాశ్రయింపవలయుఁ గావున వారి వాక్యములు న్యాయము లైనవే.

మలయ— అమాత్యరాక్షసుఁడే మనకుఁ బ్రియతముఁడును హితతముండును గదా!

భాగు— రాక్షసమంత్రికిఁ జాణక్యుఁడు వైరి కాని చంద్రగుప్తుఁడు వైరి కాఁడు. ఒకప్పుడు చాణక్యుఁ డతిజయగర్వితుం డగుట సహింపక చంద్రగుప్తుఁ డతని మంత్రిపదమునుండి తొలఁగింపఁగలఁడు. అట్లు తొలఁగించె నేని రాక్షసుండు నందవంశమునందలి భక్తి చేతఁ జంద్రగుప్తుఁడు కూడ నందవంశజాతుఁడే కదా యని యతనితో సంధిచేసి తన్మంత్రిపదము వహింపఁగలఁడు. చంద్రగుప్తుఁడును పితృపక్షపాతి కదా యని రాక్షసునితో సంధిచేయుటకు సంశయింపఁడు. అమాత్యరాక్షసునిద్వారా నిన్నాశ్రయించినచో భద్రభట ప్రభృతు లందు నీ కంత విశ్వాసముండ దని వీరిట్లు విన్నవించిరి. వీరి వాక్యమున కిదియే యర్థము,

మల— మంచిది, అమాత్యునింటికి దారి చూపుము.

భాగు— ఆర్యా! ఇటు చనుదెమ్ము.

(ఇరువురును బరిక్రమింతురు)

భాగు— కుమారా! ఇదే యమాత్యరాక్షసుని గృహము. ప్రవేశింపుము.

రాక్ష— (తనలో) స్మృతికి వచ్చినది. (ప్రకాశముగా) భద్రా! కుసుమపురం బున స్తనకలశునిఁ జూచితివా?

పుర— అమాత్యశేఖర! చూచితిని.

మలయ— (విని) భాగురాయణ! కుసుమపురవృత్తాంతమును బ్రస్తావించుకొను చున్నారు. మనము లోనికిం బోఁగూడదు; ఇచటనే యుండి విందము. ఏమన :—

గీ. మంత్రిపుంగవు లెందు భూమండలాధి
పతులముందఱ నొకరీతిఁ బల్కుచుంద్రు;
అర్థమది తెల్లముగ మాటలాడునపుడు
మఱొకవిధముగ జరగు సంభాషణంబు.

భాగు— చిత్తమట్లే చేయుదము.

రాక్ష— భద్ర! ఆకార్యము సిద్ధ మయినదా!

పుర — దేవర యనుగ్రహంబున సిద్ధమయినది.

మలయ— సఖా! ఆకార్య మేదయి యుండునో?

భాగు— రాక్షసమంత్రి చరిత్ర మతిగహన మయినది. ఇంతమాత్రమునఁ దెలిసి కొనుటకు శక్యము కాదు. ఇంకను సావధానుండవై వినుము.

రాక్ష— భద్రా! సవిస్తరముగాఁ జెప్పుము.

పుర— దేవా! వినుము. తమరు నాతోఁ గుసుమపురమునకుఁబోయి వైతాళికుఁ డగు స్తనకలశుఁడు చాణక్యహతకుఁ డొనర్చిన నిజశాసనాతిక్రమణము తెలియఁదగిన భావగర్భితము లగు శ్లోకములచేఁ జంద్రగుప్తుని గొనియాడు నట్లు చేయించుమని చెప్పితిరి గదా!

రాక్ష— అవును చెప్పితిని.

కరభ— తరువాత నేనును బాటలీపుత్రపురంబున కేగి దేవర సందేశ మాస్తనకలశు నితోఁ జెప్పితిని. అప్పుడే నందకులము నశించుచున్నదని పరితపించుచున్న పౌరుల సంతోషపెట్టుటకై చంద్రగుప్తుఁడు కౌముదీమహోత్సవము చేయఁ దలఁచి పురమంతటఁ జాటింపఁజేసెను. ఆచాటింపును పౌరు లందఱు విని చిరకాల పరిచితమగు వధూజనము దూరదేశమునుండి వచ్చినట్లు సంతోషించిరి.

రాక్ష— (కన్నీరు నించుచు) హా! దేవా! నందమహారాజ!

గీ. జగము లన్నియు రంజింపఁజాలు రాజ
చంద్రుఁడవు నీవులేకున్న సమయమందుఁ
జంద్రుఁ డున్నను గౌముదీజనితమయిన
ముదము చేకూరునే కల్వపూవులకును.

కర— తరువాత లోకలోచనానందకర మగు తత్కౌముదీ మహోత్సవము చాణక్య హతకుఁడు రాజున కిష్టము లేకపోయినను జేయఁగూడ దని నిషేధించెను. ఆసమయమందు మన స్తనకలశుఁడు భావగర్భితంబు లగు శ్లోకములతోఁ జంద్రగుప్తు నుద్వేగింపఁజేసెను.

రాక్ష— ఆ పద్యములేవి? నీకు వచ్చునా?

పురు— ("అమితసత్త్వమ్మనకాలవాలము" అను పద్యము, 'నగలు సక్పందనాదు' లను పద్యమును జదువుచున్నాఁడు)

రాక్ష— (సంతోషముతో) సెబాసు! స్తనకలశా! సెబాసు! మంచిసమయమున భేదబీజమును నాటితివి. తప్పక ఫలింపఁగలదు.

తే. గీ. తాను జేయఁదలంచు నుత్సవము చేయ
వలదనిన సహించుఁడు ప్రాకృతుండు;
సకలలోకాధిక మగు తేజంబు గలుగు
నృపతి యేరీతిగా సహింపనేర్చు?

మలయ— ఆమాట నిజమే

రాక్ష— తరువాతఁ దరువాత?

కర— తరువాతఁ దనమనోరథభంగము గావించె నని కోపించి చంద్రగుప్తుఁడు తమ సద్గుణములుకొన్ని ప్రశంసించుచుఁ జాణక్యహతకుని మంత్రిపదము నుండి తగ్గించినాఁడు.

మలయ— సఖా! భాగురాయణా! వింటివా? రాక్షసునియెడలఁ జంద్రగుప్తునికి భక్తి లేదేని రాక్షసునిగుణము లతఁ డేల ప్రశంసించును?

భాగు— రాక్షసగుణప్రశంసయుఁ జాణక్యనిరాకరణమువంటిది కాదు సుమా.

రాక్ష— కరభకా! చంద్రగుప్తునకుఁ జాణక్యునిపైఁ గోపమువచ్చుటకుఁ గారణము కౌముదీ మహోత్సవప్రతిషేధ మొక్కటియేనా? యింకొక టేదేనియుం గలదా?

మల— సఖా! చంద్రగుప్తుని కోపమున కితరకారణ మన్వేషించుటవలన నితనికిఁ గలుగు ఫలమేమి?

భాగు— మతిమంతుఁడగు చాణక్యుఁడు నిష్ప్రయోజనముగఁ జంద్రగుప్తుని గుపితుని జేయఁడు. కృతజ్ఞుండగు చంద్రగుప్తుఁడు నీమాత్రముచే గౌరవమా నుల్లంఘింపఁడు. సర్వవిధములఁ జాణక్య చంద్రగుప్తులకు భేదమును గల్పించిన యీమహాకారణ మెడలెగనిదిగా నుండఁగలదని.

కర— కలదు. దేవరయు మలయకేతువును బురము విడిచి వచ్చుచుండఁగాఁ జాణక్యుఁ డుపేక్షించె నఁట. అదియు నొక కొంత కోపమునకుఁ గారణ మయ్యె.

రాక్ష— (హర్షముతో) సఖా! శకటదాస! అటులేని చంద్రగుప్తుఁడు నాకుఁ గైవసమగుటకు సందియములేదు. చందనదాసునకు బంధనమోక్ష మింకఁ గాఁగలదు. నీవును నీయాలుబిడ్డలతోఁ గలసికొందువు.

మలయ— సఖా! భాగురాయణ! చంద్రగుప్తుఁడు కైవసమగున నెఁగదా! ఇతని యభిప్రాయ మేమయియుండును?

భాగు— అభిప్రాయమున కేమున్నది. చాణక్యునిచే విసర్జింపఁబడిన చంద్రగుప్తు నుద్ధరించుటకంటె నొండుకార్యమేమియు నుండదు.

రాక్ష— అధికారమునుండి తొలఁగింపఁబడిన చాణక్యుఁడిప్పుడెక్కడను న్నాఁడు.

కర— ఆపాటలీపుత్రమునందే యున్నాఁడు.

రాక్ష— (సావేగముగా) భద్ర! అక్కడనే యున్నాఁడా? తపోవనమునకుఁ బోలేదా? మరలఁ బ్రతిజ్ఞనైనఁ జేయలేదా?

కర— తపోవనమునకుం బోవునని వినికి.

రాక్ష— శకటదాసా! చంద్రగుప్తుఁడు చాణక్యుని ధిక్కరించుట యుక్తమయినది కాదు. ఏమంటివా, వినుము—

మ. అపరేంద్రుండగు నందభూవరుఁడు మున్నగ్రాసనభ్రష్టుఁ జే
సి పరాభూతు నొనర్ప సైఁపకెకదా ఛేదించెఁ దద్వంశ మ;
ట్టిపుడేరీతి సహింపనేర్చుఁ దనచేఁ బృథ్వీధవుండై పరం
తపుఁడై మించిన చంద్రగుప్తుఁ డిటు లన్యాయంబుఁ గావించినన్.

మలయ— సఖా! చాణక్యుఁడడవికి లేచిపోయినను లేక ప్రతిజ్ఞారోపణంబు గావించినను నితనికిఁ గార్యసిద్ధి యెట్లగు?

భాగు.— ఇది యెంత తెలియఁదగని యంశముగాదు. చాణక్యహతకుఁడు చంద్రగుప్తునకు దూరమయినకొలఁది రాక్షసునకుఁ గార్యసిద్ధికి దారి గన్పడుచుండును.

శక.— అమాత్య! తమరు మఱొకవిధముగ నాలోచించుచున్నారు. చంద్రగుప్తుఁడు చాణక్యునిఁ దిరస్కరించుట న్యాయమే.

శా. చూడారత్నరుచిస్ఫురచ్ఛిరులు రాజుల్ ప్రొక్కఁగా నిక్కురా
లోఁడై మౌర్యుఁడు నేఁడు నెట్లు తమవారే తన్నుఁ గ్రోధించుచో?
నేఁ డల్కం జణకాన్వయుం డమరలన్ జేయంగ నాజ్ఞాప్రతి
జ్ఞాడంబం బొనరించినట్టిదియె కష్టంబై సహింపఁ దగున్.

రాక్ష.— శకటదాస! నీ వనినది నిజమే. పోయి యీకరభకుని విశ్రమింపఁజేయుము.

శక.— మంచిది. (పురుషునితో నిష్క్రమించును)

రాక్ష.— నేను కుమారమలయకేతువుం జూడఁదలఁచియున్నాఁడ.

మల.— ఆర్యా! నేనే మిమ్ముఁజూచుటకై చనుదెంచితిని.

రాక్ష.— (నాట్యముతోఁ జూచి) తండ్రీ! నీవా! (పీఁటనుండి దిగి) కుమారా! ఇదె! యాసనము కూర్చుండుము.

మల.— కూర్చుండుదును. ఆర్యుఁడును గూర్చుండవలయు.

(ఇరువురును గూర్చుందురు.)

మల.— ఆర్యా! తలనొప్పి పోయినదా!

రాక్ష.— కుమార! నీకుఁ గుమారశబ్దముపోయి మహారాజశబ్దము రాకుండ నాకుఁ దలనొప్పి యెట్లు పోవును?

మల.— ఆర్యా! తమరు తలఁచిన నది యెంతటికార్యముకాని, బలము లన్నింటిని సమకూర్చుకొనియు నెంతకాలమిట్లు శత్రువ్యసన మనుభవించుచు నూరకుండవలయును.

రాక్ష.— ఇప్పటికినిఁ గాలహరణమున కవకాశమేది! విజయమునకై ప్రయత్నించుము.

మల.— ఆర్యా! శత్రువునకు వ్యసనకాలము తటస్థించినదా!

రాక్ష.— అవును వచ్చినది.

మల.— ఎటువంటిది?

రాక్ష.— మంత్రితోడి విరోధమే. ఇంకేమికావలయును? చంద్రగుప్తుఁడు చాణక్యునిపలుకు తేఁకగొట్టినాఁడట;

మల— ఆర్యా! సచివవ్యసనము వ్యసనమువంటిదికాదు.

రాక్ష— ఇతరరాజులకు మంత్రితోడివిరోధ మంతగా లెక్కింపరాదు కాని చంద్రగుప్తునికిమాత్ర మట్లుకాదు.

మల— ఆర్యా! అది తగిన యూహకాదు. కౌటిల్యునియందలి దోషములే యితర మంత్రులందఱు నుదాసీనులగుటకుఁ గారణములైనవిగదా, ఆచాణక్యుఁడే నిరాకృతుఁడైనప్పుడు తక్కినమంత్రులెల్ల మిగుల సభినివేశము పూనకపోరు. చంద్రగుప్తుని కేమిలోపము?

రాక్ష— అట్లుకాదు. ఆప్రకృతులందు రెండుతెగలవారు కలరు. కొందఱు చంద్రగుప్తసహోద్ధాయులుఁ, గొందఱు నందకులానురక్తులు. చాణక్యునియందలి దోసములు చంద్రగుప్తసహోద్ధాయులు విరక్తులగుటకే కారణములు కాని నందకులానురక్తులు విరక్తులగుటకుఁ గారణములు కావు. నందకులాభిమానుల కసూయాపరాగములున్నప్పటికిని జంద్రగుప్తుని వదలినచోఁ బ్రస్తుత మాశ్రయింపఁ దగినవా రొరులు లేనందున నతనినే యాశ్రయింపక తీరదు. శక్తిమంతుఁడగు నీవంటివాఁ డెవ్వఁడేనిఁ జంద్రగుప్తద్వేషియొక్కఁ డెదురొక్కన్నచో వానిని వదలి నిన్నాశ్రయింపఁగలరు. ఈవిషయమున మేమే దృష్టాంతము.

మల— ప్రస్తుతము మనము దాడివెడలుటకుఁ జంద్రగుప్తకౌటిల్యులకుఁ దటస్థించిన విరోధ మొక్కటే కారణమా, లేక యింకొకహేతు వున్నదా?

రాక్ష— వేయి యితరకారణములున్నను ఫలమేమి? ఇది యొక్కటియే ప్రధానతమంబగు కారణము.

మల— ఆర్యా! ఏల ప్రధానతమ మైనదో నుడువుము. ఇప్పుడు చంద్రగుప్తుఁడు మంత్రిపద మింకొకరిమీఁద నుంచి కాని లేక తానె నిర్వహించుకొనుచుఁ గాని మనకుఁ బ్రతివిధాన మాచరించుట కసమర్థుఁడా?

రాక్ష— తప్పక యసమర్థుఁడు, ఏలన :— మొదటినుండియుఁ స్వతంత్రుఁడైన రాజునకు లోకవ్యవహారములు తెలియునుగాని మంత్రిమీఁదనే సర్వభారము లుంచినవానికి లోకవ్యవహారము లెట్లు తెలియును? ఎట్లు సమర్థుఁడగును?

గీ. ప్రగడయును రాజు సర్వతంత్రస్వతంత్రి
వర్తనులయేని సిరి వారి పదము విడదు
భారమంతయు నొక్కని పైనయున్న
వదలు బరువంచు శ్రీస్వభావంబుకతన ;

గీ. భారమంతయు మంత్రిపై జాఱవిడిచి
లౌకికజ్ఞాన మిసుమంత లేక తిరుగు
ధరణిపాలుండు తత్పరిత్యక్తుఁ డేని
జెడును మాతృస్తనత్యాగి శిశువువగిది.

మలయ— (తనలో) దైవవశమున నేను సచివాయత్తతంత్రుఁడనై యుండక పోవుట. (ప్రకాశముగ) యోజింపఁగా వర్ణింపఁదగును గాని యభియోగ కారణంబులు పెక్కులుండఁగా వ్యసనము నే ముఖ్యము గాఁగ మనిందు శత్రువునకుఁ గార్యసిద్ధి తప్పకగునా ?

రాక్ష— తప్పకగును. నీకార్యసిద్ధి తప్పకగునది యనియే తలంపుము, ఏమన :-

సీ. అభియోక్తయఁట చతురంగసైన్యంబుల యభివృద్ధిగల పర్వతాత్మజుండు
శక్తిమంతంబఁట పౌరమండలమెల్ల నందభూపాలకాన్వయమునందుఁ
దొలఁగింపఁబడెనఁట ధూర్వహాగ్రణియైన చాణక్యుఁడధికారసరణినుండి
నడిపించువాఁడఁట నవనవోన్మేషధీరప్రజ్ఞగల మంత్రిరాక్షసుండు

(సిగ్గునటించి)

గీ॥ క్రొత్తభూపాలుఁడంట మూర్యుం డయారె !
కోర్కె పొడముటయే యొక్క కొదవగాని
సాధ్యసాధనమున కిఁక జంకనేల?
మలయకేతునృపాల ! సంపద్విశాల !

మల— ఆర్యుఁడే దాడివెడలుటకిది తగుసమయమనెనేని నేనేల యూరకొందును.

సీ. తమయున్నతినిలోనఁదలపింపఁజేయుచు నుత్తుంగకూలంబు లొలయుదాని
తమగళన్నిశ్రమదధారలఁ బోలిన సలిలప్రసారంబు వెలయుదాని
తమమేనియొక్క వర్ణమురీతి శ్యామోపకంఠద్రుమంబులు గలుగుదాని
తమ మనోహరగర్జితమ్ముల వడువునఁ గల్లోలముఖరయై కదలుదాని

గీ. నంబుఖాశతీరమూ శోణనదమును
దంతపటిమ గట్లు త్రివ్వికొనుచుఁ
జేరి నీరుద్రావు సిందూరశోణముల్
వేలకొలఁది సాకు వెలయఁ గరులు;

గీ. కరములందుండి జాఱుతుంపురులతోడఁ
గలసి మదజల మాసారగతిఁగురియుచు
నాగజేంద్రము లరికట్టు నగరమెల్ల
వారిదంబులు వింధ్యపర్వతము వోలె.

( భాగురాయణునితో నిష్క్రమించును. )

రాక్ష— ఎవఁడురా యక్కడ !

పురు— ( ప్రవేశించి ) దేవా ! సెలవిండు.

రాక్ష— సాంవత్సరికులలో నేఁడు ద్వారమం దెవ్వఁ డున్నాఁడురా !

పురు— క్షపణకుఁడు.

రాక్ష— ( తనలో నవిమిత్తమును సూచించి ) ముందుగనే క్షపణకుఁడా !

పురు— జీవసిద్ధి.

రాక్ష— భయంకరాకారము లేకుండఁ బ్రవేశపెట్టుము.

పురు— మంచిది. ( నిష్క్రమించును )

క్షప— ( ప్రవేశించి )

గీ. మోహరోగంబునకు మందు ముందొసంగి
మొదటఁ గటుతరమైనను బిదప సుఖక
రంబయిన పథ్య మొసఁగు సర్వజ్ఞబుద్ధ
శేణ్యుల యనుజ్ఞ శిరసా ధరింపవలయు.

( సమీపించి ) శ్రావకులకు ధర్మసిద్ధి యగుఁగాక !

రాక్ష— భదంత ! మాప్రయాణమునకు మంచి దివస మాలోచించుము.

క్షప— ( ఆలోచన నటించి ) శ్రావక ! ఆలోచించితిని ! నేఁడు సంపూర్ణ చంద్రుఁడు గల పౌర్ణమాసితిథి, మధ్యాహ్నము పఱకు నున్నది. ఇందుఁ బ్రయాణము చేసినవారి కేశుభమును జేకూరదు. ఉత్తరదిక్కునుండి దక్షిణదిక్కునకుఁ బోవువారికి నక్షత్రముకూడఁ బ్రతికూలమైనది.

గీ. సూర్యుఁ డస్తంగతుండు కాఁజొచ్చువేళఁ
బూర్ణమండలుఁ డయి చంద్రుఁడు వెలుంగఁ
గేతు వుదయాస్తమయము లేక భవించు
బుధునిలగ్నంబు నీయానమునకు శుభము.

రాక్ష— భదంత ! తిథియే మంచిది కాదు.

క్షప— శ్రావక !

క. ఒకగుణము కలది తిథి, దానికి నాల్గింత లగుఁ జుక్క, నిశ్చయముగ ల
గ్నక మఱువది నాల్గింతలు ప్రకటించిరి గణకులిట్లు గ్రంథములందున్.

గీ. లగ్న మెన్నఁగ మిగుల దుర్లగ్నమైన
సౌమ్యవీక్షిత మగుటచే సౌమ్యమయ్యె ;
నదియునుం గాక చంద్రబలాదికంబు
గల్గుటంజేసి నీకగుఁ గార్యసిద్ధి.

రాక్ష— భదంత ! ఇతర జ్యోతిష్కులతోఁ గూడ నాలోచింపుము.

క్షప— అయ్యా ! నీవే పిలిపించి కనుఁగొనుము. నేఁ బోవలయును.

రాక్ష— భదంత ! నీ నట్లుంటి నని కోపంబు రాలేదుగద ?

క్షప— మీభదంతుఁడు కోపగింపఁడు.

రాక్ష— మఱి యెవ్వరు కోపగించును ?

క్షప—స్వపక్షము వదలి పరపక్ష మంగీకరించుటచేఁ గృతాంతుఁడు కోపగించును.

( క్షపణకుఁడు నిష్క్రమించును. )

రాక్ష—ప్రియంవదక ! వేళ యెంతయినదో చూచిరమ్ము.

ప్రియం—సూర్యుఁ డస్తమింపఁబోవుచున్నాఁడు.

రాక్ష—( లేచి చూచి ) ఆ ! భగవంతుఁడగు భాస్కరుఁ డప్పుడే యస్తమించు చున్నాఁడే !

గీ. ఏగె మునుముంద రవి యుదయించువేళఁ
దరులనీడలు భక్తిమంతులువోలె
నస్తమయ మొందుచో వెన్క కరిగెనకట
భృత్యులు త్యజింత్రుగాదె నిశ్శ్రీకు నృపతి.

( అందఱును నిష్క్రమింతురు )

ఇదిశ్రీ...తిరుపతివేంకటేశ్వరాంధ్రీకృతం బగుముద్రారాక్షసనాటకంబునఁ జతుర్థాంకము.

---

శ్రీరస్తు.

# ముద్రారాక్షసము

## పంచమాంకము

( పిదప ముద్రాముద్రితమగు నగల పెట్టెయు నొకకమ్మయుఁ జేతధరించి సిద్ధార్థకుఁడు ప్రవేశించును.)

సిద్ధా— ఆశ్చర్య మాశ్చర్యము !

గీ. దేశకాలంబు లనెడుబిందెలఁ జెలంగు
మతి యనెడునీటిచే సిచ్యమానమగుచుఁ
బెరిఁగి మౌర్యద్రుమాశ్రయస్ఫీతమై ఫ
లించుఁ జాణక్యనీతివల్లీమతల్లి.

ఆర్యచాణక్యునిచే మొదట వ్రాయఁబడి పిదప నమాత్యరాక్షసుని ముద్రచే ముద్రితంబగు లేఖపత్రంబును నగలపెట్టెయుఁ బట్టుకొని పాటలీపుత్ర నగరమునకుం బ్రయాణమైతింగదా ! పోయెదను. ( ఎదుటఁజూచి ) వీఁడె క్షపణకుఁడు వచ్చుచున్నాఁడు. వీఁడెదురౌట శకునముకాకపోయినను నాకు మంచిదే. కావున మొగము తప్పింపను.

క్షప— (ప్రవేశించి)

గీ. లోకసంపూజ్యమగుత్రోవలో మెలఁగుచు,
బుద్ధిగాంభీర్యమునఁ గార్యసిద్ధిపడయు
సజ్జనులు శిష్యులందు వత్సలులునైన
బుద్ధులపదంబులకుఁ గరంబులు మొగుడ్తు.

సిద్ధా— భదంతా ! నమస్కారము.

క్షప— శ్రావక ! ధర్మసిద్ధియగుంగాత ! ఎచటికో ప్రయాణమై పోవుచుంటివని తోఁచుచున్నదేమి ?

సిద్ధా— నీవెట్లెటింగితివి ?

క్షప— తెలియఁదగినదేమున్నది ? శకునముఁ బరీక్షించుటయుఁ జేతిలోనికమ్మయుఁ బేటికయు నాకుఁ దెలిపినవి.

సిద్ధా—సత్యమే తెలిసికొంటివి. పరదేశమున కేగుచుంటిని. కాని భదంతా ! ఈదివస మెటువంటిది ? నక్షత్ర మేమి ?

క్షప— (నవ్వి) తల గొఱిగించుకొన్న తరువాత నా నక్షత్ర మడుగుట !

సిద్ధా— ఇప్పుడేమి మించిపోయినది. ఎన్నఁడనుకూలమైనదో యానాఁడే ప్రయాణ మొనరించెద.

క్షప— ఇప్పుడీ మలయకేతుకటకంబున కనుకూలమైనది కాదు.

సిద్ధా— ఏల కాదో చెప్పుము ?

క్షప—వినుము. మున్ని కటకంబున కెవ్వరి రాకపోకలకును నడ్డములేకుండనుండునది. ఇప్పుడు ముద్రాలాంఛితుండు కానివాఁ డెవ్వఁడును బోఁగూడదు, రాఁగూడదు. నీవు భాగురాయణుని ముద్రిక యేదేనున్నచోఁ బోవచ్చును. లేదా మానుము. మానవేని యీగుల్మాధికారులు నిష్కారణముగఁ గాళ్లు చేతులు కట్టి రాజకులంబునకుం గొంపోవుదురు.

సిద్ధా— భదంత ! అమాత్యరాక్షసునియొద్ద నుండువాఁడ ననుమాట యెవ్వ రెఱుఁగరు ! కావున ముద్రిక లేకపోయినను న న్నెవ రాఁపఁగలరు ?

క్షప— రాక్షసుని పేరు చెప్పిన నొకటే, పిశాచము పేరు చెప్పిన నొకటే. ముద్రిక లేని వారికి రాకపోకల కుపాయము లేదు.

సిద్ధా— భదంత ! కోపగింపకుము. కార్యసిద్ధి యగునులే.

క్షప— శ్రావక ! పొమ్ము నీకుఁ గార్యసిద్ధి యగుఁగాత ! నేనును భాగురాయణు నడిగి యొక యానవాలు తెచ్చికొనియెద. ( నిష్క్రమింతురు )

( పిదప నొకపురుషుఁడు వెంటరా భాగురాయణుఁడు ప్రవేశించుచున్నాఁడు )

భాగు— ( తనలో ) అహా ! చాణక్యనీతి వైచిత్ర్యము.

సీ. అరయ లక్ష్యోద్భేదమై మాటిమాటికి నధిగమాభావగహనము నగుచు
మాటికి నతిపూర్యమాణాంగి యగుచుఁ గార్యవశంబుచే మాటి కతికృశయయి
యనవరతంబు నశ్యద్బీజమై మాటిమాటికి సుఫలసంప్రాప్తిఁ గనుచుఁ
జిత్రవిచిత్రాకృతిఁ జెలఁగును నీతివిన్నతి యెప్పుడు దైవనియతి వోలె

తే. గీ. నరిగఁ జాణక్యుఁడన బృహస్పతిసమానుఁ
డతని యాలోచన మగాధమైన; దందు
మునిఁగిపోవని వారలు ముజ్జగముల
లేరు నిక్కము నిక్కము లేరు లేరు.

(ప్రకాశముగ) భాసురకా! కుమారుఁడు నేను దూరముగానుండుట కంగీకరింపఁడు. కావున నీయాస్థాన మండపంబున నాకుఁ గూడ నాసన మాయత్తపఱుపుము.

పురు— ఇదె యాసనము. ఇందుఁ గూర్చుండుము.

భాగు— ముద్రార్థియై నాకొఱ కెవ్వఁడేని వచ్చిన లోనికి రానిమ్ము.

పురు— ఆర్యుఁ డానతి యిచ్చినట్లు చేసెదను. (నిష్క్రమించును)

భాగు— (తనలో) ఇప్పగిది మనయందు దయఁ జూపించు కుమార మలయకేతువును మోసపుచ్చుట తగనిపని కదా! పక్షాంతర మాలోచించిన-

మ. కులముం గీర్తియు సిగ్గు మానమును సంకోచంబు వోనాడి యి
భ్యులకుం బ్రాణములమ్మి పైచి పరతంత్రోద్యోగముం జేయుచుం
గలకాలంబుఁ దదాజ్ఞ సేయుటయె ముఖ్యం; బంతియేకాక యెం
దులకో మంచిది చెడ్డదంచు మదిలో దుఃఖంబు భృత్యాళికిన్?

(పిదపఁ బ్రతీహారిచే ననుగమ్యమానుఁడగు మలయకేతువు ప్రవేశించును)

మల— (తనలో) రాక్షసునిప్రస్తనముం గుఱించి పెక్కువికల్పములు పుట్టుచుండుటచే నామది కేదియు నిశ్చయంబు తోఁచకున్నది.

ఉ. నందుల మీఁది గౌరవము నందకులానుగతంబుగా మురా
నందకులార్భకున్ సచివనాయకవర్జితు నాశ్రయించునో,
నందులమీఁది భక్తిఁ జలనంబొలయింపక సత్యసంధతం
జెందునొ రాక్షసుండనుచుఁ జేతము కుమ్మరిసారె యయ్యెడున్.

(ప్రకాశముగ) విజయా! భాగురాయణుఁ డెక్కడ?

ప్రతీ— కుమారా! నగరమునుండి వెలుపలికిం బోవువారికి ముద్రాముద్రిత మగు నానవా లిచ్చుచున్నాఁడు.

మల— విజయా! ముహూర్తకాల మట్టిటుఁ దిరుగకుము. అతఁ డొండు దెసకుఁ జూచుచుండఁ బోయి కన్నులు మూసెదను.

ప్రతీ— చిత్తము.

పురు— (ప్రవేశించి) ఆర్య! భాగురాయణ! క్షపణకుఁడు ముద్రానిమిత్తమై ద్వారమున వేచియున్నాఁడు.

భాగు— ప్రవేశ పెట్టుము.

ప్రతి—చిత్తము. (నిష్క్రమించును)

క్షప—(ప్రవేశించి) శ్రావకులకు ధర్మసిద్ధి యగుఁగాత!

భాగు—(చూచి తనలో) రాక్షసుని స్నేహితుఁడగు జీవసిద్ధి యూ! (ప్రకాశముగ) ఏకేని రాక్షసునికార్యము నుద్దేశించి వెళ్లుట లేదుకదా?

క్షప—పాపము శాంతించుఁగాక! పాపము శాంతించును గాక! శ్రావకా! రాక్షసుని పేరును పిశాచము పేరును వినఁబడని చోటికే పోవుచున్నాను.

భాగు—స్నేహితునిపైఁ బ్రణయకోపము విస్తారముగా నున్నదే! భదంతా! రాక్షసుఁడు నీ కే మపరాధముఁ గావించె?

క్షప—రాక్షసుఁడు న న్నేమియుఁ జేయలేదు. దిక్కుమాలిన నిర్భాగ్యుఁడ జచ్చిన వాఁడను నేనే నేఁజేసినపనికి సిగ్గుపడుచున్నాను.

భాగు—నాకుం గుతూహల మెచ్చించుచున్నావు, ఆపని యేదో వినఁదలఁచితిని.

మల—నేనును వినఁదలఁచియుంటి.

క్షప—శ్రావక! ఆపని వినిన నేమి, వినకున్న నేమి?

భాగు—అది రహస్యమేని మానుము.

క్షప—రహస్యము కాదుకాని క్రూరమైనది.

భాగు—రహస్యము కాదేని నుడువుము.

క్షప—రహస్యము కాకపోయినను జెప్పను.

భాగు—నీవు చెప్పవేని నేను ముద్రికనొసఁగను.

క్షప—(తనలో) అడుగుచున్నాఁడు కావునఁ జెప్పుటయే మంచిది. (ప్రకాశముగ) ఇంక నాకు గతి యేది? చెప్పకతీఱదు. వినుము. నిర్భాగ్యుఁడ నగు నేను పాటలీపుత్రనగరంబునం దుండఁగా రాక్షసునకును నాకును స్నేహమైనది. ఆసమయమందే రాక్షసుఁడు గూఢముగా విషకన్యకం బ్రయోగించి పర్వతేశ్వరునిం జంపించె.

మల—(కన్నీరు నించుచుఁ దనలో) ఏమీ! మాతండ్రినిఁ జంపినవాఁడు రాక్షసుఁడా! ఇంతదనుకఁ జాణక్యుఁ డనుకొంటిని.

భాగు—భదంతా! తరువాతఁ దరువాత?

క్షప—తరువాత నేను రాక్షసుని మిత్త్రుఁడ నని యెంచి చాణక్యహతకుఁడు నగరమునుండి నన్నుఁ దిట్టి లేవఁగొట్టినాఁడు. అనేకకార్యకుశలుం డగురాక్షసుఁ

డటువంటివే యింత శోకచండాలకార్యముఁ జేయఁదలఁచి యున్నాఁడు. దీనిచేనే నీవుమనుష్యలోకమునుండియే లేవఁగొట్టఁబడియెద.

భాగు—ప్రతిజ్ఞ చేసినప్రకార మర్ధరాజ్య మీవలసివచ్చునని చాణక్యహతకుఁడే పర్వతేశ్వరునిఁ జంపించెఁ గాని రాక్షసమంత్రి చంపించలే దని మేము విన్నారము.

క్షప—రామరామ! చాణక్యుఁడు విషకన్యక పేరైన వినలేదు.

భాగు—రమ్ము, ముద్రిక నొసఁగెద. పోయి కుమారునితో నీవృత్తాంతము విన్నవింపుము.

మల—(సమీపించి)

గీ. వింటిఁ జెలికాఁడ! నీవలు ప్రేల్చుమాట
నెచ్చెలి మొగంబుగా శత్రునిగదితంబు:
ఎన్నఁడో మండి చల్లాఱియున్న జనక
మరణశోకాగ్ని యిబ్బడి మండె మఱల.

క్షప—(తనలో) ఈ మలయకేతుహతకుఁ డీమాట వినియెఁగదా! ఇంకఁ గృతకృత్యుండనైతి. (నిష్క్రమించును)

మల—(ఎదుటనున్నట్లు రాక్షసునిపై లక్ష్యముంచి) రాక్షసా! రాక్షస! మంచిది మంచిది.

తే. గీ. అఖిలరాజ్యభరంబు నీయంద యుంచి
నమ్మి చెలికాఁడ వని యెంచు నాయనంగు
జనకునిం జంపితివె బంధుజనములేద్వ
రాక్షసా! నీవు నిక్కము రాక్షసుఁడవె.

భాగు—(తనలో) రాక్షసుని ప్రాణములు తీయఁగూడదని చాణక్యుని యాదేశము కదా! కానీ. ఇట్లగుఁగాక (ప్రకాశముగ) మలయకేతుకుమారా! విచారింపకుము. ఈయాసనము మీఁదఁ గూర్చుండుము. నీకొకసంగతి విన్నవింపవలయు.

మల—(కూర్చుండి) సఖా! యేమో చెప్పెదనంటివే చెప్పుము.

భాగు—కుమారా! నీతిశాస్త్రమునుచే వ్యవహరించువారల కరిమిత్రోదాసీనవ్యవస్థ కార్యవశంబున మాఱుచుండుఁ గాని లౌకికులకువలె నిచ్ఛవచ్చి నట్లుండదు. ఆకాలమందు సర్వార్థసిద్ధిని రాజునుగాఁ జేయఁదలంచిన రాక్షసునకుఁ

చంద్రగుప్తునకంటె బలవంతుండును సుప్రసిద్ధుండు నగు పర్వతేశ్వరుఁడే కార్యప్రతిబంధి యగుటంజేసి విరోధియయ్యెను గావున రాక్షసుం డీపని యొనర్చుట యొకదోషము కాదని నేను దలంచుచున్నాను.

మ. పగఱ న్మిత్రులఁ జేయు మిత్రతతితో వైరంబు గావించుఁ గా
ర్యగతి న్నీతివిదుండు; మానవుల నాహా! ప్రాఁతి జన్మంబు నీ
తిగ వర్తింపఁగఁజేయుఁ దత్తదుపయుక్తిం బూర్వవృత్తంబు బో
ల్కిగఁ జూపింపదు నీతి; భూపతుల కేడీ దోష మెంచఁగన్ ?

కావున నీతండ్రిని జంపించినాఁడని రాక్షసుఁడు నిందింపఁదగినవాఁడు కాఁడు, నందరాజ్యము నీకు సంప్రాప్తించుదాఁకఁ జేరదీయఁదగినవాఁడు. తరువాతఁ బరిగ్రహింతువో పరిత్యజింతువో నీయిష్టము.

మల— సఖా! భాగురాయణ! ఈ నీ యాలోచన బాగుగానున్నది. అమాత్యుని జంపితిమేని ప్రకృతిక్షోభము కల్గును. దానివలన విజయము సందేహాస్పదమే.

పురు— ( ప్రవేశించి ) కుమారా! జయము జయము! గుల్మస్థానాధ్యక్షునిచేఁ గావలి యుంచిన దీర్ఘరక్షుని విన్నపమాలింపుము. వీఁడెవ్వఁడో యొకఁడు మన కటకమునుండి ముద్రికలేకుండఁ బోవుచుండఁగాఁ బట్టుకొని దేవర పాదమూలంబునకుఁ దీసికొనవచ్చితి, సెలవయిన దేవర సన్నిధికిఁ దీసికొనివచ్చెద.

భాగు— తీసికొనిరమ్ము.

పురు— చిత్తము. ( నిష్క్రమించును )

( తరువాతఁ బురుషునితోఁ బాశములచేఁ గట్టఁబడిన సిద్ధార్థకుఁడు ప్రవేశించును )

సిద్ధా— ( తనలో )

గీ. దుష్కృతి చేయఁ జేసియు దోషమంట
నీక సుగుణంబ యందుఁ గన్పింపఁజేయు
స్వామిభక్తియె మావంటివారికెల్ల
మాతవంటిదిగాన నమస్కరింతు.

పురు— అయ్యా! ఇతఁడేవాఁడు.

భాగు— (చూచి) ఓరీ! యితఁ డాగంతుకుఁడా, లేక యిచ్చట నున్నవారి కెవ్వరి కేని సేవకుఁడా?

సిద్ధా— అయ్యా! నే నమాత్యరాక్షసుని సేవకుఁడను.

భాగు— అటులేని ముద్రిక లేకుండఁ బట్టనమునుండి యేల లేచిపోవుచున్నావు ?

సిద్ధా— కార్యగౌరవముచేతఁద్వరగా వెళ్ళవలసివచ్చి పోవుచుంటిని.

భాగు— ఆకార్య మేది ? రాజశాసనముఁ గూడ నతిక్రమించుచున్నావు.

మల— సఖా! వానిచేతిలోని కమ్మ లాగికొనుము.

భాగు— ( సిద్ధార్థకుని చేతిలోనున్న లేఖ పుచ్చుకొని యందలి ముద్రఁజూచి ) కుమారా! ఇదే యుత్తరము. ఇందు రాక్షసునిపేరి ముద్రగలదు.

మల— ముద్రిక చెడకుండ నుత్తరము చింపి చూడుము.

( భాగురాయణుఁ డట్లు చింపి చూపెంచుచున్నాఁడు )

మల— ( చదువుచున్నాఁడు ) "శుభము. ఇందువ్రాసిన మాటలచేతనే యెక్కడ నుండి యెవ్వరికెవ్వరు వ్రాసినారో తెలియనగు. మనపగవాని నిరాకరించి లేనఁగొట్టి సత్యవాదివగు నీవు సత్యమును జూపించితివి. మొదట సంధి చేయుమని ప్రోత్సాహపఱచిన మన స్నేహితుల కెల్లరకు నొసఁగెదనని ప్రతిజ్ఞ చేసిన ద్రవ్యమంతయు నొసఁగి యిప్పుడు మమ్ము సంతోషపెట్టుము. వారును నీచే నిట్లనుగ్రహింపఁబడినవారై స్వాశ్రయ వినాశంబువం జేసి యుపకారి వగు నిన్నే యాశ్రయింపఁగలరు. ఈవృత్తాంతము నీవే మఱవ, వయినను మరల వ్రాయుచున్నాను. వీరిలోఁ గొందఱు శత్రుదంతి కోశములను మఱికొందఱు రాజ్యమును గోరుచున్నారు. నీవు పంపిన నగలు మూఁడును నాకుఁ జేరినవి. లేఖ యూరక పంపఁగూడదని యీ పారితోషికముఁగూడఁ బంపితిని. మనకాప్తతముండగు నితనిచే వాచికము గూడఁ బంపితి, నదికూడ వినవలయు."

సఖా! భాగురాయణ! ఈ యుత్తరము సంగతియేమి ?

భాగు—సిద్ధార్థకా! ఎవరియుత్తరమిది ?

సిద్ధా—అయ్యా! నే నెఱుఁగను.

భాగు—ఛీ! ధూర్త! ఉత్తరముతీసికొనివెళ్ళుచున్నావు, ఎవ్వరికో యెఱుఁగవా? కానీ, యిది యిటుండనిమ్ము. నీవలనఁ గొన్నిమెమాటలు వినవలసినదఁట; యావినఁదగిన వారెవరు ?

సిద్ధా—(గజగజవణఁకుచు) మీరే.

భాగు—మేమేనా ?

సిద్ధా—మీచేఁ బట్టుపడుటచే నే నేమనుచున్నానో నాకుఁ దెలియకున్నది.

భాగు—(కోపముతో) ఇదిగో తెలియఁగుదువులే ; భాసురకా ! వీనిం బైటకుఁ దీసికొనిపోయి చెప్పునందాఁకఁ దన్నుఁడు.

పురు—చిత్తము. (అతనితో నిష్క్రమించి మరలఁ బ్రవేశించి) అయ్యా ! ఈముద్రాలాంఛితమైన పెట్టె యొకటి వీనిచంకలోనుండి క్రిందఁబడినది.

భాగు—(చూచి) కుమారా ! ఇదియు రాక్షసముద్రాంకితమే !

మల—సఖా ! ఈపెట్టెలోనిది పంపినవారితో షికమయి యుండును. ఈముద్ర చెడకుండ నీపెట్టెగూడఁ దెఱవుము.

భాగు—(అట్లుచేసి పెట్టె చూపించును)

మల—(చూచి) సఖా! ఇందలినగలు నాశరీరమునుండియూడఁదీసి నేను రాక్షసునికిఁ బంపించినవేసుమా ! ఈయుత్తరము నిశ్చయముగా రాక్షసుఁడు చంద్రగుప్తునకు వ్రాసినది.

భాగు—నీసంశయ మిదిగో విడిపోవు చున్నది. భాసురకా ! మరల వీనిం దన్నుఁడు.

పురు—చిత్తము. (నిష్క్రమించి మరల సిద్ధార్థకునితోఁ బ్రవేశించి) అయ్యా! వీఁడు మాతాఁపులకు సహింపలేక సత్యము కుమారునకే విన్నవించెద నన్నాఁడు.

మల—మంచి దాలాగే చేయుమనుము.

సిద్ధా—(పాదములపైఁ బడి) దేవా ! నా కభయ మొసఁగి యనుగ్రహింపుము.

మల—దూత కభయముకాక భయ మేమి యున్నది? విన్నవింపుము.

సిద్ధా—దేవా ! వినుము, అమాత్యరాక్షసుఁ డీయుత్తర మొసఁగి నన్నుఁజంద్రగుప్తుని కడ కంపెను.

మల—వాచిక మేదియో వినిపింపుము.

సిద్ధా—కుమరా! అమాత్యరాక్షసునిచే నిట్లు నియోగింపఁ బడితిని. ఏమనగా— "నీవు పోయి చంద్రగుప్తునితో నా సందేశ మిట్లు విన్నవింపుము." నాకు స్నేహితులగు కులూతాధిపతి యగు చిత్రవర్మయు, మలయనగరాధిపతి యగు సింహనాదుండును, కాశ్మీరదేశనాథుండగు పుష్కరాక్షుండును, సింధురాజగు సింధుసేనుండును, పారశీకుండగు మేఘనాదుండును నీయందును బరమమైత్రి కలవారు. వీరిలో మొదటి మువ్వురును మలయకేతువు రాజ్యమును

గోరుచున్నారు. తక్కినవారిరువురును మలయకేతువు హస్తిబలమును గోశమును గోరుచున్నారు. మహాభాగుండవగు నీవు చాణక్యుని లేవఁగొట్టి నాకు సంతోష మెట్లు చేసితివో యట్లే యీరాజులకుఁ గూడఁ బ్రతిజ్ఞ జేసిన యర్థ మొసఁగుటకుఁ బ్రయత్నింపవలయును." నాచేతఁ బంపించిన వాచిక మిదియే.

మల— (తనలో) ఏమీ! చిత్రవర్మాదులు గూడ నాకు ద్రోహము చేయఁదలఁచుచున్నారా! వారే నిజముగా ద్రోహము చేయుచున్నారు. వారికీ రాక్షసునియం దధికప్రీతి కలదు (ప్రకాశముగా) విజయా! రాక్షసునిఁజూడ వలయును. తీసికొనిరమ్ము.

ప్రతీ— చిత్తము. (నిష్క్రమించును)

(తరువాత నాసనస్థుఁడై తన యింట నున్న రాక్షసుఁడు పురుషునితో విచారించుచుఁ బ్రవేశించుచున్నాఁడు.)

రాక్ష— (తనలో) నాసైన్యమంతయుఁ జంద్రగుప్తుని సైన్యముతో నిండియున్నది. కావున నామనస్సు సంశయించుచునే యున్నది. ఎందుచేత ననఁగా—

సీ. సాధ్యంబునందు నిస్సందిగ్ధమై యన్వయవ్యాప్తిచే యుక్తమయి సపక్ష
మందుండియు విపక్షమందు నివృత్తమౌ సాధనం బది సిద్ధిసాధనంబు;
ఏది తానేసాధ్య, మేది సపక్షవిపక్షంబులను సమభావ, మేది
పక్షంబున విరుద్ధభావంబు తాదృశసాధనం బొప్పిన బోధకులకు

తే. గీ. నపయశము దెచ్చు; నట్లే నయంబుగూడ
స్వోక్తలక్షణలక్షిత మున్నయెడల
స్వామికి జయంబు నట్లుగా సంభవింప
కున్న ప్రభువున కగు నిగ్రహోదయంబు.

చంద్రగుప్తుని పక్షము విడచి మనపక్షమాశ్రయించిన వారి కందఱికిఁ దత్పక్షము న్విడుచుటకుం దగిన కారణముండుటచేతను మొదటినుండియు నతనియందు ద్వేషబుద్ధియు నుపజాపంబును గలవారగుటచేతను వారివిషయమై నే నంత సందేహింప నవసర ముండదు. (ప్రకాశముగా) ప్రియంవదకా! కుమారానుచరులగు రాజులతో "దినములు గడచినకొలఁదిఁ గుసుమపురప్రయాణము సమీపించుచున్నది. కావున మీరందఱు విభాగము తేర్పఱచుకొని సిద్ధపడవలయు.

ఆవిభాగ మెట్లనఁగా: మగధసైన్యంబును ఖశసైన్యంబును నన్ననుసరించి ముందుఁ బ్రయాణము చేయవలయు. శకసైన్యంబును హూణసైన్యంబును చీనా సేనయు వెనుక నుండవలయు. గాంధారులును యవనులును మధ్యప్రదేశంబున నుండవలయుఁ; గులూతాధిపతి మొదలగు రాజలోక మంతయు దారిలో మలయ కేతు కుమారుం జుట్టువారియే యుండవలయు” నని నామాటలుగా విన్నవింపుము.

ప్రియం—చిత్తము. (నిష్క్రమించును)

ప్రతీ—(ప్రవేశించి) అమాత్యశేఖరా! జయము జయము! మిమ్ముఁ గుమారరాజుగా రొకసారి చూడఁదలఁచియున్నారు. దయచేయుఁడు.

రాక్ష—భద్ర! ముహూర్తకాల ముండుము. ఎవఁడురా! అక్కడ?

పురు—(ప్రవేశించి) చిత్తము. ఏమిసెలవు.

రాక్ష—కుమారుఁడు నన్నుఁ గొన్నినగలు ధరించుమని పంపించెఁగదా! ఇపుడే నతని దర్శనమునకుం బోవుచుంటిం గాన నవి దాల్పకుండఁబోవుటను చితము. మనముకొన్నసగలు మూఁడింటిలోని యొకనగ నిమ్మంటినని శకట దాసు నడిగి తీసికొనిరమ్ము.

పురు—చిత్తము. (పోయి మరల వచ్చి) అయ్యా! ఇదిగో నగ.

రాక్ష—[ఆనగ నలంకరించుకొని] భద్ర! కుమారుఁడెచ్చోటనున్నాఁడో యచటికి దారిజూపుము.

ప్రతీ— దయచేయుఁడు.

రాక్ష— (తనలో) ఉద్యోగమనఁగాఁ బురుషుఁడు దోషికాకపోయినను దోషియను సందేహము కలుగఁజేయునదికదా! ఏమన :—

చ. నృపతులభీతి సేవకులకెప్పుడు తప్పదుగాని సేవకుల్
నృపతులయొద్ద నున్న భయ మెప్పటికప్పుడె కల్గుచుండు, నెం
తపదవియందు నుండిన ఘనంబగు నంతటిభీతి; యెత్తు నుం
డిపాలుచువారికెగద కడిందిప్రపాతభయంబు కల్గెడిన్.

ప్రతీ— అమాత్యవర! కుమారుఁడిందున్నాఁడు. సమీపింపుము.

రాక్ష— (చూచి) ఇతఁడే కుమారుఁడిందుఁగూర్చున్నాఁడు.

తే. గీ. చరణములమీఁదఁ జూపు నిశ్చలముచేసి
చిత్తమున నేదొ యేదొ యోజించుకొనుచు

దుర్వ్యూహములగు కృతులచేఁ దూలిపోయి
యున్న మొగమునఁ దలవంచి యున్నవాఁడు.

(సమీపించి) కుమారా! జయము జయము.

మల— ఆర్యా! నమస్కారము ఇదే! పీఠ మిందుఁ గూర్చుండుము.

రాక్ష— (అట్లు చేయుచున్నాఁడు)

మల— ఆర్యా! తమదర్శనముఁజేసి చిరకాలమగుటచే హృదయము వేగిరపడుచున్నది.

రాక్ష— వత్సా! ప్రయాణవిషయమగు నేర్పాటు చేయుచుండుటచే నీనిందకిట్లు పాత్రుఁడనైతిని.

మల— ఆర్యా! యాత్రావిషయములగు నేర్పాటులెట్లు గావించితిరో వినఁదలఁచి యున్నాఁడను.

రాక్ష— కుమారా! మన యనుచరులగు రాజలోకమునకెల్ల నిట్లాజ్ఞాపించితిని. "మగధసైన్యమును ఖశసైన్యమును నన్ననుసరించి ముందుఁ బ్రయాణము చేయవలయును. శకసైన్యమును చీనా సైన్యమును హూణసేనయు వెనుక నుండవలయు. గాంధారులును యవనులును మధ్యప్రదేశమున నుండవలయు. కులూతాధిపతి మొదలగు రాజలోకమంతయుఁ గుమారుం జుట్టువారియే యుండవలయును" అని.

మల— (తనలో) ఔరా! ఏరాజులు నన్నుఁ జంపి చంద్రగుప్తున కుపకారము చేయు తలంపుతో గూఢముగా నన్నాశ్రయించి యున్నారో వారినే నాసంరక్షణముకొఱకై నాయొద్ద నుంచినాఁడఁట! (ప్రకాశముగా) ఆర్యా! ఎవ్వఁడేని కుసుమపురంబునకుఁ బోవుటగాని కుసుమపురంబునుండి వచ్చుటగాని కలదా?

రాక్ష— ఆ రాకపోకలు ముగిసినవి. కొలఁది దినములలో మనమే కుసుమపురమునకుఁ బోవుదుము.

మల— (తనలో) క్రమముగాఁ దెలియుచున్నది. (ప్రకాశముగ) ఆర్యా! అటులేని నుత్తరమిచ్చి యీపురుషునిఁ జంద్రగుప్తునొద్దకుఁ దమరెందుల కంపించితిరి?

రాక్ష— (చూచి) వీఁడా! సిద్ధార్థకుఁడా! భద్రా! ఇదియేమి?

సిద్ధా— (కన్నీరు నించుచు సిగ్గభినయించుచు) మంత్రివరా! అనుగ్రహింపుము. నన్నుఁ జావమొత్తుటచే రహస్యము కాపాడలేకపోయితిని.

రాక్ష— ఓరీ! ఆరహస్య మెటువంటిదిరా, నాకుఁ జెప్పియున్నది!

సిద్ధా— మనవిచేయుచున్నాను. నన్నుఁ జావమొత్తుటచే (అని సగముచెప్పి గజగజ వణకుచుఁ దలవంచును)

మల— భాగురాయణ! ప్రభువునొద్ద భయముచేఁ జెప్పలేకున్నాఁడో, లేక సిగ్గు పడుచున్నాఁడో నీవే మంత్రికి విన్నవింపుము.

భాగు— చిత్తము. విన్నవించెద. అమాత్యసత్తమా! ఈ యుత్తర మిచ్చి మఱి కొంత సందేశము గూడఁ జెప్పి చంద్రగుప్తునొద్దకుఁ దమరు పంపించినారని వీఁడు చెప్పుచున్నాఁడు.

రాక్ష— ఓరీ! సిద్ధార్థకా! నిజమేనా యిది?

సిద్ధా— (సిగ్గు నటించుచు) నన్నుఁ జావఁదన్నుటచే నాలాగున విన్నవించితిని.

రాక్ష— కుమారా! ఇది యసత్యము. పురుషుఁడు కొట్టినప్పు డేమాట యనుమన్న నామాటే యనును.

మల— సఖా! భాగురాయణ! ఆ యుత్తరము చూపింపుము. సందేశ మీభృత్యుఁడే చెప్పును.

భాగు— మంత్రివరా! ఇదిగోఁ గొమ్ము.

రాక్ష— (చదివి) కుమార! ఇది శత్రుప్రయోగము.

మల— వట్టియుత్తర మంపఁగూడదని యార్యుఁడీనగగూడఁ బంపించినాఁడఁట కాదా! ఇది శత్రుప్రయోగ మెట్లగును?

రాక్ష— (నగఁజూచి) ఈనగ కుమారుఁడే నాకుఁ బంపించినది. దీని నొకానొక సంతోషకాలమున సిద్ధార్థునకుఁ గానుకగా నిచ్చితిని.

భాగు— ఇంత విలువగలనగ! అదియునుంగాక కుమారుఁడు తన మేనుపైనుండి తీసి మీకనుగ్రహముగా నిచ్చినది. అటువంటి దింకొకనికి బహుమానముగా నిచ్చితిరన్న నమ్మఁదగినదియా!

మల— ఈభృత్యునివల్లఁ గొంతవాచకముగూడ వినవలయు నని యుందే వ్రాసి తిరిగదా!

రాక్ష— వాచకము పంపినవాఁ డెవ్వఁడు? ఎవరికిఁ బంపించితిని? మొదలుత్తరమే వ్రాయలే దంటినిగదా!

మల— అటులేని యీముద్రిక యెవ్వరిది?

రాక్ష— కుమారా! ధూర్తు లసత్యముద్రికలు కల్పింపఁగలరు.

భాగు—కుమారా! మంత్రి విన్నవించుమాట నిజమయ్యే యుండవచ్చు. సిద్ధార్థకా! ఈయుత్తరము వ్రాసినవా రెవ్వరు?

సిద్ధా— (రాక్షసుని మొగమువంకఁ జూచి తలవంచుకొనును.)

భాగు— ఇంకను దన్నులు దినకుము, చెప్పుము.

సిద్ధా— అయ్యా! శకటదాసుఁడు.

రాక్ష— కుమారా! శకటదాసుఁడే వ్రాసినయెడల నేను వ్రాసినట్లే.

మల— విజయా! శకటదాసునిఁ దీసికొనిరమ్ము.

ప్రతీ— చిత్తము. (నిష్క్రమించును)

భాగు— (తనలో) కొనసాగని కార్యమెన్నఁడును జాణక్యుని చారులు చేయఁదల పెట్టరు. (ప్రకాశముగా) కుమారా! శకటదాసుఁ డెప్పుడును రాక్షసుని ముందఱ నీ యుత్తరము నేను వ్రాసినదని యొప్పుకొనఁడు. వరవడి వ్రాసి తెప్పింపుము. వర్ణముల పోలికయే నిర్ణయింపఁగలదు.

మల— విజయా! ఈపగిదిఁ గావింపుము.

ప్రతీ— కుమార! ముద్రికఁగూడఁ దెప్పింపుము.

మల— ముద్రికయు వ్రాలును నీ రెండును గూడఁ దెప్పింపుము.

ప్రతీ— కుమారుఁ డాజ్ఞాపించినట్లె చేసెదను. (పోయి మరలఁ బ్రవేశించి) కుమార! ఇదిగో శకటదాసుని స్వహస్తలిఖితమగు పత్రము. ఇదియే ముద్రిక.

మల— (రెండును జూచి) ఆర్య! అక్షరము లొకపోలికగానే యున్నవి.

రాక్ష— (తనలో) అక్షరములు సమముగానే యున్నవి. శకటదాసుఁడు మిత్రుఁడని నమ్మితిని గాని మిత్రశబ్దార్థముమాత్రము విపర్యస్తమైనది.

తే. గీ. శకటదాసుండు విస్మృతస్వామిభక్తిఁ
దలఁచుకొనఁబోలుఁ బుత్రదారలను మదిని,
వతిచలార్థంబులందు లౌభ్యమునఁజేసి
కీర్తి నాశింపలేదొకో కృపణుఁ డకట!

వినను నింక సందేహ మేమున్నది?

మ. తనకుం దైవవశమయ్యె ముద్రికయు, సిద్ధార్థుండు మిత్రుండు, వ్రా
లును వ్రాసెం దెలివాని వ్రాలవలె నెట్లో! శత్రువర్గంబుతో

వనుసంధించి ఘటించె నిట్టి కపటోపాయంబుఁ గష్టుండు రా
జునెడఁ భక్తిఁ దొఱంగి యీశకటదాసుం డిట్లు ప్రాపార్థినై.

మల—(చూచి) ఆర్యా! 'శ్రీమంతుఁడు పంపిన యలంకారత్రయము నాకుఁ జేరినది' యని వ్రాసితివే, యీనగ యామూఁడింటిలోనిదియేనా ? (చూచి తనలో) ఏమీ ! తండ్రిగారీనగ పూర్వము ధరించినదిసుమా ! (ప్రకాశముగ) ఆర్య ! ఈయలంకారమెక్కడిది ?

రాక్ష— వర్తకులయొద్దఁ గొంటిని.

మల— విజయా ! చూచు మీనగ గుర్తింపఁగల వేమో ?

ప్రతీ— (కన్నీరొత్తుచుఁ జూచి) కుమారా ! ఏలగుర్తింపలేను. ఇది సుగృహీత నామధేయుండగు నీ తండ్రి పర్వతేశ్వరుండు ధరించినదియే.

మల— (కన్నీటితో)

చ. నగలుధరించిన న్నిగుల నాణెము రాఁగల నీదు మేనికిం
దగినవి చూచె యీనగలు తండ్రి! కులాభరణంబ! వీనిచే
సొగియుచు నుండువాఁడ వలచుక్కలతోడి ప్రదోష మట్లు విం
తగ భవదాననంబు హిమధాముఁడు లేనికొఱంతఁ బాపఁగన్.

రాక్ష—(తనలో) ఏమిది ! మున్నిది పర్వతేశ్వరుఁడు ధరించినదియే యనుచున్నాఁడే! అతని నగలు విస్పష్టములైనవియే. (ప్రకాశముగ) ఈ యలంకారములు గూడఁ జాణక్యప్రయుక్తులగు వర్తకులే నాకమ్మినట్లు తోఁచుచున్నది.

మల— ఆర్యా ! మాతండ్రిగారు ధరించినవియుఁ బిదపఁ జంద్రగుప్తుని చేతికి వచ్చినవియు నగు నగలెవ్వరో వర్తకు లమ్మిరనుట యేమి యుక్తముగానున్నది ! నీ మదికి బాగున్నదేమో !

తే. గీ. చంద్రగుప్తుండు లోభవశంవద మగు
చిత్తమున విక్రయింపఁగఁ జెనఁటివైన
యీవు గావించి తౌర నికృష్టచిత్త
మూల్యమగు సొమ్ము భూషణమ్ములకు మమ్ము.

రాక్ష— (తనలో) ఆహా ! శత్రుప్రయోగ మెంతచక్కఁగా నున్నది ! ఏలన —

ఉ. ఉత్తర మేనెఱుంగననుటొప్పదు ముద్ర మదీయమాట, దు
ర్వృత్తయి చేసె మాశకటుఁడీగతి నన్నను గానిమాట, కిం
చిత్తును నమ్మ శక్యము చేసెను మౌర్యుఁడు సొమ్ము లమ్మఁ, బ్ర
త్యుత్తరమిచ్చుకంటె నిఁక దోసమొఁజేసితి నన్న యుక్తమౌ.

మల — ఆర్య! ని న్నొక్కటి యడుగుచున్నాను.

రాక్ష — కుమార! ఆర్యులెవ్వరో వారి నడుగుము. మే మిపు డనార్యుల మైతిమిగదా.

మల —

సీ. చంద్రగుప్తుఁడు నీకు స్వామిపుత్రుండు మిత్రునిపుత్రకుండ భృత్యుండ నేను
దాత నీకాతండు ధనమీఁగలుగు మేటి ద్రవ్యంబు నాకిచ్చు దాతవీవు
సత్కారపూర్వంబు సచివపదంబను దాస్యంబు వానియొద్దను ఘటించు
నా వృద్ధి యంతయును నీవు చేసిన దౌట స్వామి వీవే నాకు సత్యముగను
తే. గీ. నింత కంటెను నధిక మింకేది గలదు
స్వార్థసంపాద నేచ్ఛ యనార్యు నిన్నుఁ
జేయఁగా శక్తమైనది చెప్పుమయ్య
సత్యవిజ్ఞాన! యో రాక్షసప్రధాన!

రాక్ష — కుమార! అయుక్తవ్యవహారివైన నీవే నిర్ణయము గావించితివి. కాని ముద్ర నీయందే విధిదోసమున్నది. (వెనుకటి సీసపద్యము యుష్మదస్మచ్ఛబ్దములు మార్చి చదివి చివరపాదము "మలయకేతు నృపాల సంపద్విశాల" అని చదువును.)

మల — (ఉత్తరమును నగలపెట్టెను జూపించి) ఇదియేమి?

రాక్ష — (కంట నీరు స్రవింప) ఇదియంతయు దైవవిలసితము. ఏమన —

చ. ప్రణయము గల్గువారిఁ, బరిభావము చూపఁగఁ దగ్గభృత్యులన్
దనయులరీతిఁ జూచెడు కృతజ్ఞుల, శిక్షితబుద్ధులైన స
జ్జనుల, జగత్పరీక్షకుల, స్వాములఁ జంపి మనుష్యయత్నమున్
మనుపని దైవమే యిది యొనర్చిన పాతకి గూడఁ జూడఁగన్.

మల — (రోషముతో) ఏమి! ఇప్పటికిని గప్పిపుచ్చుచున్నావా? ఇది దైవము చేసెనేమి! నీవు చేసినదికాదు! ఓయీ అనార్య!

ఉ. ఎంచి విషప్రయోగవిష మేచ్ఛ మెయిన్ విషకన్య నొండు క
ల్పించి కృతఘ్న! నీవ కెడపించితి నప్పుడు తండ్రి; నిప్పు డ
భ్యంచితగౌరవంబు కలవై రిపుతంత్రము గూడి మమ్ముఁ జం
పించియు మాంస మమ్ముకొని పేడ్కపడం బ్రయతించుచుంటివే.

రాక్ష — (తనలో) ఇది యింకొకటి, గండముపై పిండకము పుట్టినది. (ప్రకాశముగా చెవులు మూసికొని) పాపము శాంతించుంగాక! పాపము శాంతించుంగాక! నేఁ బర్వతేశ్వరునిపై విషకన్యం బ్రయోగించలేదు.

మల— అటులేని మాతండ్రిం జంపిన వాఁడెవఁడు ?

రాక్ష— దైవము నడుగుము.

మల— (క్రోధముతో) దైవము నడుగుమునా ! క్షపణకుఁ డగు జీవసిద్ధి నడుగవల దేమి ?

రాక్ష— ( తనలో ) జీవసిద్ధియు చాణక్యచారుఁడేనా ! అక్కటా ! శత్రువులు నాగుండెకాయఁ గూడఁ దీసికొనిరిగదా !

మల— (క్రోధముతో) భాసురకా ! శేఖరసేనునికిట్లాజ్ఞాపింపుము, రాక్షసునితో మైత్రిసంపాదించి మాకు ద్రోహము సేయఁదలంపునఁ జంద్రగుప్తు నారాధించుచుండు కౌలూతాధిపతి యగు చిత్రవర్మయు, మలయ నృపాలుండగు సింహనాదుఁడును, కాశ్మీరాధిపతి యగు పుష్కరాక్షుండును, సింధురాజగు సింధుషేణుండును, పారశీకాధిపతియగు మేఘనాదుండును నీయైదుగురు రాజులందును మొదటివారు మువ్వురును నారాజ్యముం గోరుచున్నారు గావున వారిని లోఁతైన గోతిలోఁ బాఁతిపెట్టి కప్పివేయుమనియుఁ, దక్కిన యిరువురను హస్తిబల కాముకులు గావున నేనుఁగుల కాళ్లచేతనే నడఁగఁ ద్రొక్కింప వలయు ననియు నామాటలుగాఁ జెప్పుము.

పురు— మంచిది. ( నిష్క్రమించును. )

మల— (రౌద్రాకారముతో) రాక్షస ! రాక్షస ! నేను విశ్వాసఘాతి నగు రాక్షసుండఁగాను, మలయకేతుండ. నా యెదుటినుండి లేచిపొమ్ము. సర్వవిధముల మీ చంద్రగుప్తునే యాశ్రయింపుము. చూడుం-

తే. గీ. కొనకుఁ జాణక్యుఁడును నీవుగూడ మౌర్యు
తోడ నేకీభవించి పోరాడరండు
దుర్ణయుంబు త్రివర్గము దుంపఁ ద్రెంపు
కరణిగా నేను మీత్రివర్గము నడంతు.

భాగు— కుమార ! కాలహరణ మేల ? మనసైన్యంబులఁ గుసుమపురోపరోధంబునకై యాజ్ఞాపింపుము.

సీ. గౌడాంగనాలోధ్రకరజనూపరజస్సుగంధిగల్లములంటఁ గప్పఁగూర్చి
అళికులస్పృహణీయమైన తత్కుంచితాలకనీలిమతోఁ జలంబు చూపి
మింటిముత్తైదువ కంటికింపగు రీతి దంటైన నీలిపుట్టంబుగట్టి
క్రతుభుగ్వధూస్వయంగ్రాహోత్సవారబ్ధకాయమానస్తంభగరిమ గాంచి

తే. గీ. కనరె తురగఖురక్షతోద్ధత ధరార
జోఘనస్తంభసంతతిస్ఫురితకరీంద్ర
మదజలాంబోధి పెనువెల్లి గడలి, శత్రు
కులశిరోభాగములమీఁదఁ గూలుఁగాత!

మల — (పరిజనముతోఁ గూడ నిష్క్రమించును.)

రాక్ష — (ఆవేగముతో) కటకటా! ఎంతకష్టమెంతకష్టము! దీనులగు చిత్రవర్మాదులు గూడఁ జంపఁబడుచున్నారే. దైవమా! శత్రునాశనమునకై రాక్షసుఁడు చేయుచేష్టలన్నియు మిత్రవినాశంబునకై పరిణమింపఁజేయుచున్నావా? దురదృష్టవంతుండ నేనేమి చేయఁగలవాఁడ?

సీ. తపముసేయఁగఁ దపోవిపినమేగినను నంతర్వైర మడఁగునా దానిచేతఁ?
బ్రభువుల ననుసరింపఁ దలంచినను రిపుల్ జీవింప నది యాఁడుసేఁత గాదె!
ధైర్యము దాల్చి చూతమటన్న నక్కటా! దైవసాహాయ్యంబు తలఁగిపోయెఁ
జాణక్యతంత్రంబు సాధించుచున్న నా మతికి హెచ్చైపోయె నతనిబుద్ధి

తే. గీ. ఖడ్గమును గేలఁ బూని యక్కటికశత్రు
సైన్య మోపిన కొలఁదిగాఁ జంపి చత్తు
నందునా, నేఁ గృతఘ్నుఁడ నగుదు బద్ధుఁ
డైన చందనదాసు మో మరయకున్న.

(నిష్క్రమించును.)

ఇది... తిరుపతివేంకటేశ్వరాంధ్రీకృతంబగు ముద్రారాక్షసంబునఁ
బంచమాంకము.



# ముద్రారాక్షసము

## షష్ఠాంకము

(పిదప నలంకృతుఁడై సంతోషముతో సిద్ధార్థకుఁడు ప్రవేశించును)

సిద్ధా—చ. జయము పయోదనీలతనుశాలికి శౌరికి కేశిఘాతికిన్
జయ మల చంద్రగుప్తునకు సజ్జనలోచనశీతరశ్మికిన్
జయము సమస్తశత్రువులఁ జంపుటకుం బనిఁబూని పెంపుఁజెం
ది యలరు బ్రహ్మచారిగురునీతికి సర్వఫలప్రదాత్రికిన్.

ప్రియవయస్యుండగు సమిద్ధార్థకునిఁ జూచి చిరకాలమైనది. (పరిక్రమించిచూచి) వీఁడే సమిద్ధార్థకుఁ డీదెసకే వచ్చుచున్నాఁడు, సమీపించెద.

(సమిద్ధార్థకుఁడు ప్రవేశించి)

సమి— తే. గీ. చందమామనుజూచిన సమయమువలె
సౌఖ్యకారణములు గృహోత్సవములందు
హృదయమననుండువారు సుహృదయులెందు;
వారలకుఁగానివిభవంబు వంతగూర్చు.

మలయకేతుకటకమునుండి ప్రియవయస్యుఁడు సిద్ధార్థకుఁడు చనుదెంచె ననివింటిని వానిని వెదకవలయు. (పరిక్రమించిచూచి) వీఁడె సిద్ధార్థకుఁడు!

సిద్ధా— (సమీపించి) వీఁడె సమిద్ధార్థకుఁడు. ప్రియవయస్య! కుశలమా! (ఒకరి నొకరు కౌఁగిలించుకొందురు.)

సమి—మిత్రమా! సుఖమెక్కడిది! నీవు చిరకాలము ప్రవాసముచేసి వచ్చియు మాయింటి కొకసారియయిన వచ్చితివి కావుగద!

సిద్ధా—నెచ్చెలి! అనుగ్రహింపుము. ఆర్య చాణక్యుఁడు నన్నుఁ జూచినతోడనే "సిద్ధార్థా! నీవుపోయి యీప్రియవార్తఁ జంద్రగుప్తమహారాజునకు విన్నవింపు"మని నాకాజ్ఞాపించెను. నేను నతనియొద్దికిం బోయి తదీయానుగ్రహమనుభవించి నిన్నుఁజూచుటకయి మీ యింటిదగ్గఱకే వచ్చుచున్నాఁడ.

సమి— స్నేహితుఁడా! నీవు చంద్రగుప్తమహారాజునకు విన్నవించిన ప్రియవార్త నేను వినఁదగ్గది యయినచోఁ దెలిపెదవా?

సిద్ధా— వయస్య! నీవు వినఁదగనిది యేమి యున్నది? వినుము, చాణక్యనీతి ప్రయోగముచే మతిచెడి మలయకేతుహతకుండు రాక్షసుని లేవఁగొట్టి చిత్రవర్మాదులగు రాజు లైదుగురం జంపించె. తరువాత నసమీక్ష్యకారియగు మలయకేతుని దురాచారంబును దుర్నయంబును జూచి నిర్విణ్ణహృదయులై తక్కిన సామంతనృపాలు రందఱుఁ దమతమ దేశములకు మలయకేతు హతకుని కటకమును వీడి భయవిలోలములైన శేషసైన్యపరివారములతోఁ బోయిరి. భద్రభటపురుషదత్త డింగరాతబలగుప్త రాజసేన భాగురాయణరోహితాక్షవిజయవర్మ ప్రముఖులు మలయకేతువుం బట్టుకొని త్రాళ్లచేఁ గట్టిపెట్టిరి.

సమిద్ధా— మిత్రమా? భద్రభట ప్రముఖులు చంద్రగుప్తునకు విరుద్ధులై మలయకేతువు నాశ్రయించిరనికదా లోకప్రసిద్ధి! ఇది యే మబ్బురము! కుకవి చేసిన నాటకంబునందువలె ముఖమం దొకటియు నిర్వహణమం దింకొకటియుఁ దటస్థించినదే!

సిద్ధా— మిత్రమా! అదృష్టవశంబున గూఢచారిణియై యున్న చాణక్యనీతికి నమస్కారము.

సమిద్ధా— తరువాతఁ దరువాత?

సిద్ధా— అదిమొదలు సారసాధనసమేతుండై యార్యచాణక్యుండు సకలరాజలోకసహితం బగు మ్లేచ్ఛబలమున్నచోటికిం జనియె.

సమిద్ధా— ఇప్పుడా మ్లేచ్ఛసైన్య మెచ్చట నున్నది?

సిద్ధా— తే. గీ. జలదనీలములైన దంతులు మదించి
తిరుగుచున్నవి చూడు మాదేశమందు;
ధృతకశాఘాతభీతలై తిరుగుచున్న
పటుజయశబ్దకలితంబు లగుచు హరులు.

సమిద్ధా— మిత్రమా! ఇది యిటుండనిమ్ము, జనసమక్షమందుఁ జాణక్యుండు తన యధికారమును వదలెఁగదా! క్రమ్మఱ మంత్రిపదమెట్లు స్వీకరించినాఁడు?

సిద్ధా— ఇప్పుడీ వట్టిమూర్ఖుండవైతివి. బుద్ధిమంతుండగు రాక్షసామాత్యుఁడు గూడఁ దెలిసికోలేని చాణక్యనీతివిషయమును నీవు తెలిసికొనఁగోరుచున్నావు.

సమిద్ధా— చెలికాఁడా? ఇప్పుడు రాక్షసామాత్యుఁ డెక్కడ నున్నాఁడు?

సిద్ధా— ఆమహాకలహము వృద్ధిఁబొందినపిదప మలయకేతుకటకంబునుండి వెడలియుఁ దుంబురుఁడను పేరుగల యింకొక గూఢప్రణిధితో సంధించి యీ పాటలీపుత్రనగరంబునకే చనుదెంచెనని యెవ్వరో చాణక్యునితో నివేదించిరి,

సమిద్ధా— సుహృద్వరా ! అప్పుగిది నందరాజ్యము మరల సంపాదించుటకై యత్యుగ్ర ప్రయత్నము గావించిన రాక్షసామాత్యుఁడు కృతార్థుఁడు గాకుండఁగనే మరలి యీపాటలీపుత్రనగరంబునకు వచ్చినాఁడేమి ?

సిద్ధా— చందనదాసుని యందలి స్నేహభరంబుచే మరల వచ్చెనని యూహించెద.

సమిద్ధా— వయస్యా ! బద్ధుఁడైన చందనదాసునకు మోక్షము కలుగునా !

సిద్ధా— ఈదురదృష్టవంతునకు మోక్షమెక్కడిది? ఇప్పు డార్యచాణక్యుని మాట చొప్పున మన మిరువురమే వధ్యస్థానమునకుఁ గొంపోయి చంపవలయును.

సమిద్ధా— ( క్రోధముతో ) ఛీ ! ఛీ ! చాణక్యుని కంటె ఘాతుకజనుఁ డీలోకమున లేఁడు. మనవంటివారిని గూడ నిటువంటి క్రూరకార్యములయందు నియోగించుచున్నాఁడు.

సిద్ధా— వెఱ్ఱివాఁడ, యీజీవలోకంబున జీవింపఁ దలఁచినవాఁ డెవ్వఁడును జాణక్యుని యానతి కన్యథా చేయలేఁడు. కావున రమ్ము, చండాలవేషములను ధరించి మన మాచందనదాసుని వధ్యస్థానమునకుఁ దీసికొని పోదము.

( ఇరువురును నిష్క్రమింతురు )

—: ఇది ప్రవేశకము :—

(పిదప రజ్జుహస్తుఁ డగు పురుషుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

పురు— షడ్గుణ సంయోగంబున దృఢంబై యుపాయపరిపాటిచేఁ బాశాకారముఁ జెందిన చాణక్యనీతిరజ్జువు శత్రువులను గట్టివేయుఁగాత ! ( పరిక్రమించి యెదుటఁజూచి ) ఉదుంబరకుఁ డార్యచాణక్యుని ముందఱ నమాత్యరాక్షసుని సమీపంబునకు నీవు పోవలసినదని నాతోఁ జెప్పెగదా ! నేనింక నతనియొద్దికిఁ బోవలయును. (చూచి) ఇతఁడె! అమాత్యరాక్షసుఁడు తలపై ముసుఁగు వేసికొని వచ్చుచున్నాఁడు. ఈయుద్యానపాదపముల చాటున నుండి యెచ్చటఁగూర్చుండునో చూచెదను. (పరిక్రమించి కూర్చుండును)

( పిదప యథానిర్దిష్టుఁడై రాక్షసుఁడు శస్త్రహస్తుఁడై ప్రవేశించును)

రాక్ష— (కన్నీరొడ్చుచు) ఆహా ! ఎంతకష్ట మెంతకష్టము !

సీ. ఆశ్రయం బెడఁబాసి యడరు లంజెవితాన రాలచ్చి యితరగోత్రంబుఁజేరెఁ
ద్యక్తానురాగులై తదనుచరు ల్ప్రజ ల్కాఁజొచ్చిరి గతానుగతికులగుచు
నాప్తులై యున్నవారందఱుఁ బౌరుషం బుజ్జగించి రనాథయువతులట్లు
కంబంబు లురళిన కాయమానం బట్లు నియతకార్యము లెల్ల నేలఁగలసె

తే. గీ. శిరము లేని శరీరంబు కరణినుంటి,
నాసదుద్యోగ మెల్లఁ జాణక్యనీతి
విహతమై యీవిధంబుగ వేఱుపడియె,
నేమిసేయుదు నిట్టుండె నీశ్వరాజ్ఞ!

మఱియును.

శా. లోకేశుం డభిజాతుఁ డైనపతి నెట్లో పాసి పాపాత్మని
స్త్రీ! కైకొన్నది రాజ్యలక్ష్మి వృషలస్త్రీపోల్కిఁ; గైకొంటయే
కా కీరీతి దృఢానురాగవశ కాఁగా నేమి గావింతు? మ
త్ప్రాకల్వెట్టుమ దైవమిట్లు పగవాఁడై యత్నముల్మాపఁగన్.

ఉ. స్వామికటు ల్వృథాతగని చావుఘటింపఁగఁ బర్వతేంద్రుఁడు
న్నామము మీఁదవే జరపినాఁడఁ బ్రియత్నములెల్ల, నాతఁడున్
భూమిని బాసెఁ, దత్తనయుఁ డోడిమి యీగతి యయ్యె, విప్రుఁడిం
దేమి యొనర్చు! దైవవిధియే యిటు నందకులంబు మాపఁగన్.

ఆహా! మ్లేచ్ఛరాజు తెలివితక్కువ! ఏమన:—

శా. ఏరీతిం బగవారితోఁ గలియునో! యీరాక్షసుం డన్వయా
కూరంబేనియు లేకచన్న నృపులం గొల్వంబ్రియత్నించువాఁ
డౌరా? మ్లేచ్ఛున కింతపాటియును లేదయ్యె న్వివేకంబు, నే
వారిం దూఱిన నేమి దైవహతు లబ్భంగిం బ్రవర్తింపరే.

ఇప్పటి కైనను రాక్షసుఁడు పగవారిచేతులలోఁ బడియైనఁ జచ్చుంగాని చంద్రగుప్తునితో నయితము సంధి సేయఁడు. కాదుకాదు. నాకసత్యసంధుఁ డన్నయపకీర్తి యయినను మంచిది కాని శత్రువులకు లోఁబడె నను మాట మంచిది కాదు. (నాల్గు దెసలు పరికించి కన్నీరుఁ గార్చుచు) ఇవిగో! నందమహారాజ పాదసంచార పవిత్రీకృతంబులగు కుసుమపురోద్యానములు. ఈభూము లందు—

మ. కవికారజ్జువుమాని కేల ధనురాకర్షంబు గావించుచుం
డ వడిన్ బోయెడు తేజినెక్కియుఁ జలల్లక్ష్యంబులం దేయు మా
యవనీశుం డెట నేర్చె నానుమపురోద్యానాంతరాళంబు నేఁ
డవలోకింపఁగనయ్యె నక్కట యతం డచ్చోట లేకుండఁగన్.

దురదృష్టవంతుఁడ నే నిప్పుడెక్కడికిఁ బోవుదును! (కన్నెత్తి చూచి) కానీ యీజీర్ణోద్యానము కన్పడెఁగదా, ఇందుం బ్రవేశించి యెవ్వనివలననైనఁ జందన

దాసుని వృత్తాంతము తెలిసికొనియెద. పురుషులకు రాఁబోవు మహోన్నతపదవి గాని దుర్దశగాని తెలియకుండఁగనే వచ్చుచుండుంగదా ! ఏమన.

ఉ. క్రొన్నెలరీతి పొర లడుగొత్తుని వ్రేళులఁ జూప రాజుతే
వ న్నృపకోటి గొల్వ మును పట్టనమావల కేగువాఁడ, నా
పన్నతఁ జేరుచుంటి తనపాటు ఫలింపక దొంగపోలికన్
దన్నగరంబునం దుపవనంబునకున్ బెడదారినక్కటా !

ఏల యీవిచారము? ఎవ్వరి యనుగ్రహము వలన నా కంతటి మహోన్నతపదవి కలిగెనో వారే లేనియప్పుడు నా పదవికా విచారించుట !

( నాట్యమున నుద్యానములోనికిఁ బ్రవేశించి )

అకటా ! అంతటి యుపవన మెంతగా పాడైపోయినది !

సీ. అతిమహారంభక్రియలచేత వంశంబురీతి సౌధము విపరీతమయ్యె
ముఖ్యమిత్రవినాశమున సజ్జనుండట్లు కేళీసరస్సు శుష్కీభవించె
నిర్గుణుండైన భూనేత నీతుల రీతిఁ బాదపంబులు లత ల్ఫలము వాసె
దుర్నీతి కపటయుక్తుల నజ్ఞుఁడుంబోలె కసవుచేత ధరిత్రి కప్పఁబడియె

తే. గీ. ఎండిపోయిన మేనన నేకకీట
దంశనస్రుతనిర్యాసదంధమైన
కంటి నీరోడఁగాఁ జెట్లు కాటికేగు
నట్టులున్నవి నిల్వనీడైనలేక.

మఱియును—

ఉ. గొడ్డలి దెబ్బచేత పఱుకుల్వడి కొమ్మల నున్నపావురా
బిడ్డలకూఁతలన్ మిషను వృక్షము లేడ్వఁగఁ, దద్వ్రణంబులన్
గుడ్డలు చుట్టుచుండె ఫణికోటి వగర్చుచుఁ దొల్తఁ జేసికోఁ
బడ్డ స్వమైత్రి పేర్మి వెనుకం దమ కూసముల స్నేహంబులన్.

నిర్భాగ్యులకు సులభమైన యీయుద్యానవనమునందుఁ బగిలి పోయిన రాతిపలక మీఁదనే ముహూర్తకాలము విశ్రమింతును. ( కూర్చుండి యాలించి ) ఏమిది! ఏదియో చప్పుడు—

మ. శ్రవణంబుల్ గడుచిన్న పాట వినువారల్ దద్దరిల్లంగ మా
ధువులందూఁగుచుఁ గ్రమ్ముల స్వేదలి పోటుంబాటుగా సర్వది

గ్రీవరంబు ల్మ్రోఁగుచుండె పటహవిఖ్యాతమా మంగళా
రతముస్ శంఖరవంబుఁ దద్విపుల ధైర్యంబుం బరీక్షింప నాన్.

(ఆలోచించి) ఆహా! తెలిసినది. ఈధ్వని మలయకేతుసంయమనంబునఁ బొడమిన రాజుల యుత్సాహమునకు సూచకము. (అనూయతో) ఇది చంద్రగుప్తున కధిక సంతోషమునకుఁ గారణము. అబ్బబ్బా!

క. వింటిని విన్పించినఁ గన్గొంటిం బగవారి సిరు లనుభవించుటకున్
గొంటుకొని పోవుటకునై తుంటరివిధి సేయుచుండె దుర్యత్నంబుల్.

పురుషుఁడు—(ప్రవేశించి) ఇదిగో! నితఁడు కూర్చుండి యున్నాఁడు. ఆర్యచాణక్యుని యాజ్ఞ నిర్వర్తింౘెద. (రాక్షసుని జూడనియట్లు రజ్జుపాశముచే నతని యెదుటఁ గంఠమున నురిబోసికొను చున్నాఁడు)

రాక్ష—(చూచి) ఆత్మహత్యఁ గావించుకొను నీదీనుఁ డెవ్వఁడై యుండును! కాని మ్మడిగెదను. భద్రా! ఏమిది. ఇట్లు చేయుచున్నావు?

పురు—(ఏడ్చుచు) ఆర్య! ప్రియమిత్రవినాశంబున దుఃఖితుం డగునావంటి నిర్భాగ్యుఁ డింకేమి చేయవలయును?

రాక్ష—(తనలో) నేను మొదటనే యనుకొంటిని. నావలెనే యెవ్వఁడో వీఁడు దుఃఖితుఁ డని. (ప్రకాశముగ) ఓయీ? వ్యసనస్నేహితుఁడ! రహస్యము కాకున్నను, జెప్పుట కతిభారములేకున్నను నీకుం గలిగినవ్యసన మేదియో విన్నఁగోరెద.

పురు—ఆర్య! రహస్యముకాదు, గొప్పదియుఁగాదు. ప్రియమిత్రవినాశనంబునదుఃఖితుండవగు నేను త్వరగాఁజావక యేల యీకాలహరణము సేయవలయు.

రాక్ష—(నిట్టూర్పు నిగిడ్చి తనలో) మిత్రుఁడు వ్యసనపడుచున్నను నుదాసీనుఁడనై యున్న నన్నితనిమాటలు వ్యసనపెట్టుచున్నవి. (ప్రకాశముగ) ఓయీ! రహస్యంబును భారంబును గాకపోయిన వినుపించుము.

పురు—ఆర్యా! నాకేటికీ నిర్బంధము? ఏమిగతి, తెలిపెదను, వినుము. ఈపట్టణంబున మణికారశ్రేష్ఠుఁడు విష్ణుదాసుఁడనునొకఁడు కలఁడు.

రాక్ష—(తనలో) ఔను, చందనదాసుని స్నేహితుఁడు విష్ణుదాసుఁడు. (ప్రకాశముగా) ఉండిననేమి?

పురు—అతఁడు నాకుఁ బ్రియమిత్రుఁడు.

రాక్ష—(సంతోషముతోఁ దనలో)నా చెలికాని చెలికాఁ డితనికిఁ జెలికాఁడు. కావున దగ్గరసంబంధమే కలదు. చందనదాసు వృత్తాంతమితనివలనఁదెలియఁ గలదు. (ప్రకాశముగ) అతనికేమి ?

పుర—అతఁడిప్పుడు సొత్తంతయుఁ బంచిపెట్టి యగ్నిప్రవేశము సేయుటకై పట్ట నమునుండి లేచిపోయినాఁడు. నేనును వినఁదగని యతనిచావు వినకుండఁగ నే చచ్చిపోవుటకై యీయుద్యానవనములోనికి వచ్చి యురిబోసికొనుచున్నాను

రాక్ష—నీ చెలికాఁడగ్ని ప్రవేశము చేయుటకుఁ గారణమేమి ?

చ. పరిపరి మందులేవియును బాపఁగఁజాలని గొప్పరోగమా?

పుర—కాదు కాదు.

రాక్ష—గరళముకంటెఁ బావకముకంటెను మిన్నగు రాజకోపమా?

పుర—పాపము శాంతించుఁగాక! చంద్రగుప్తుని దేశంబున నట్టిక్రూరవ్యాపారమే లేదు.

రాక్ష—దొరయఁగ రాని పద్మముఖితోఁ గలయం దమకించుకామమా ?

పుర—(చెవులు మూసికొని) రామరామ! నా చెలికాఁ డట్టిదుర్జనుఁడు కాఁడు

రాక్ష—గొరఁగొను నీకుఁబోలెఁ గనుగోనవశం బగు మిత్రనాశమా ?

పుర—ఔను.

రాక్ష—(గుండెలు తడఁబడఁ దనలో) చందనదాసుని ప్రియమిత్రుఁడు గదా విష్ణు దాసు. ఇతనికిఁ జందనదాసనాశమే యగ్నిప్రవేశకారణమని తెలియ వచ్చుచున్నది. ఇది నిజమా! అసత్యమా! యుక్తస్నేహపక్షపాతంబున మనంబు చలించుచున్నది. (ప్రకాశముగ) చందనదాసు వినాశంబును సుహృద్వత్సలుండై తద్వినాశంబున వినాశముఁ జెందఁబోవు విష్ణుదాసు సుచరిత్రంబును విస్తరముగాఁ దెలుపుము.

పుర—అయ్యా! నిర్భాగ్యుండనగు నేనింతకంటె మరణమునకుఁ గాలహరణము సేయుటకు సమర్థుఁడనుగాను.

రాక్ష—భద్రా! నేనును వినఁదగ్గదే, యీకథ వినిపింపుమోయి.

పుర—ఏమిగతి! ఏమిచేయుదును! వినవయ్యా! చెప్పెదను.

రాక్ష—వినుచున్నాను.

పుర—ఈ పురంబున మణివర్తకుఁడు చందనదాసుఁ డనునొకఁడున్నాఁడు.

రాక్ష—(విషాదముతోఁ దనలో) ఆభగవంతుఁడు నాదుఃఖాలయమునకు ద్వారము తెఱచినాఁడు. హృదయమా! ధైర్యము వహింపుము. ఇంకను గష్టతరమైనది నీవు వినఁదగ్గవృత్తాంతమున్నది. (ప్రకాశముగ) ఎఱుఁగుదు, మిత్రవత్సలుఁ డాసజ్జనుఁడు. అతనికేమి?

పుర—అతఁ డీవిష్ణుదాసునకుఁ బ్రియమిత్రుఁడు.

రాక్ష—(తనలో) దుఃఖమను పిడుగు తలమీఁదఁ బడుటకు సమీపించుచున్నది.

పుర—ఆవిష్ణుదాసుండు వయస్యస్నేహంబునఁ జంద్రగుప్తమహారాజుతో నొకవిన్నపంబుఁ జేసికొనియె.

రాక్ష—ఏమని?

పుర—దేవా! నాయింటఁ గుటుంబభరణపర్యాప్తమగు చాలద్రవ్యముగలదు, దాని నీకిచ్చెద; నాప్రియమిత్రుండగు చందనదాసుని విడిపింపుఁ డని.

రాక్ష—(తనలో) సెబాసు! విష్ణుదాసా సెబాసు! మిత్రస్నేహము చూపితివి.

ఉ. దేనికినై పరస్పరముఁ ద్రెళ్లుదురో జనకుల్కుమారులున్
దేనికినై సుహృత్త్వమును ద్రెంచుదురో ఘనులైనమిత్రులున్
దేని బరిత్యజించుట లతివ్యసనంబులపోల్కిఁ గష్టమో
దానిఁ గృతార్థ! పుచ్చితివి తద్దయుఁ గోమటి వయ్యు విత్తమున్.

(ప్రకాశముగ) భద్రా! అట్లు విన్నవించిన చంద్రగుప్తుఁడేమి ప్రత్యుత్తర మిచ్చె?

పుర—విష్ణుదాసుండిట్లు విన్నవించినఁ జంద్రగుప్తుఁడు "ఓసెట్టీ! నేను జందనదాసుని ద్రవ్యార్థమై కారాగృహమం దుంచలేదు. అమాత్యరాక్షసుని భార్యాపుత్రాదు లితని యింట గుప్తులై యున్నారని పెక్కుమందివలన విన్నాను. వారిని వదలిపెట్టుమని పెక్కుమందిచే నడిగించినను నే నెఱుఁగ ననియె. ఇప్పుడేని రాక్షసుని కుటుంబము మాకొప్పగించినచో నాతనివదలుట నిస్సంశయము. లేనిచో నతనికిఁ బ్రాణహరమైన శిక్షవిధింతు మనిచెప్పి చందనదాసుని వధ్యస్థానమునకుం గొనిపొమ్మని నియమించె. పిదప వినఁదగని దుర్వార్త విందునేమోయని భయంపడి విష్ణుదాసశ్రేష్ఠియుఁ గృతాగ్నిప్రవేశనిశ్చయుండై నగరినుండి వెడలిపోయె. నేనును వినఁదగని విష్ణుదాసుని చావు వినకుండఁ జావవలయునని యీజీర్ణోద్యానమునకు వచ్చితిని.

రాక్ష—భద్రా! చందనదాసుఁ డింకను జంపఁబడలేదుగద?

పుర—చంపఁబడును. కాని యమాత్యరాక్షసుని కుటుంబమును సమర్పింపు

మని మాటి మాటికి గ్రుచ్చి గ్రుచ్చి యడిగినను మిత్రవత్సలుండగు నతండు సమర్పింపకున్నాఁడు. నాచావునకుఁ గాలహరణము గావింపకుఁడు.

రాక్ష—(సంతోషముతోఁ దనలో) సెబాసు ! మిత్రమా ! చందనదాసా ! సెబాసు

తే. గీ. శరణనినవానిఁ బ్రోచిన సజ్జనుండు
శిబికి వచ్చిన సత్కీర్తి స్నేహితుండ
వైననే లేనిసమయంబునందుఁగూడ
గొప్పవాఁడవు నీవు గైకొంటిపవుర. !

(ప్రకాశముగా) భద్రా ! చావకుము ! పొమ్ము, జ్వలనప్రవేశముఁ జేయకుండ విష్ణుదాసుని నివారింపుము. నేఁబోయి చందనదాసుని మరణము మానిపించెద.

పుర—నీ వేయుపాయంబునఁ జందనదాసుని మరణమునుండి తప్పించెదవు ?

రాక్ష—(ఒఱనుండికత్తిలాగి) సకలశత్రుసంహారకం బగు నీకత్తిచేత.

మ. జలదచ్ఛన్ననభోనిభంబగుచు హస్తప్రావృసఖ్యంబునన్
బులకాంకూరము లుప్పతిల్లినటు లెంతో శ్రద్ధతో సంయుగ
స్థలుల న్నాటుటచేత వాఁడియగు మత్ఖడ్గంబు మిత్రాపదా
కులు నన్నుం బురికొల్పుచుండెఁ దెగువం గ్రూరక్రియ ల్సేయఁగన్.

పుర— అయ్యా ! చందనదాసజీవితప్రదానంబునకై ప్రయత్నము సేయుచు విషమదశావిపాకమందు మునిఁగియున్న మిమ్ము నిర్ణయించుటకు నామతి చాలకున్నది. సుగృహీతనామధేయు లగు మంత్రిరాక్షసులు కారుగద ! (కాళ్లపైఁ బడును.)

రాక్ష— లెమ్ము లెమ్ము ! కాలహరణముఁ గావింపకుము. "రాక్షసమంత్రి చందనదాసుని చావు తప్పింతు ననియెను గావున నీవు మరణోద్యోగము మాను"మని విష్ణుదాసునితోఁ జెప్పుము.

("జలదచ్ఛన్ననభోనిభంబగుచు" అను పద్యముఁ జదువుచుఁ గత్తి కేల జళిపించుచు)

పుర— న న్ననుగ్రహించి నాసందేహము విడఁగొట్టుము.

రాక్ష— ఏలినరాజులు నశింప మహావిపత్తికి లోనై సుహృద్వినాశంబునకుఁ గూడఁ గారణభూతుండనైన రాక్షసమంత్రిని నేనే.

పుర— (సంతోషముతో మరలఁ గాళ్లపైఁబడి) అయ్యా ! దైవవశంబునం గన్పడితిరి. అనుగ్రహింపుఁడు. చంద్రగుప్తహతకుఁడు ముందుగా శకటదాసుని

వధ్యస్థానంబునకుం బంపించె. వధ్యస్థానంబునుండి తప్పించి వాని నెవ్వఁడో దేశాంతరంబునకుఁ బంపించె. తరువాతఁ జంద్రగుప్తుండు శకటదాసుని చావు తప్పించినవాఁ డెవ్వఁడో తెలియక వానిమీఁద మండించిన కోపవహ్నిని ఘాతుకజనులం జంపించి చల్లార్చుకొనియెను. అదిమొదలు ఘాతుకులు వెనుకముందును శస్త్రధారియగు పురుషుఁ డెవ్వఁడే నున్నాఁడేమో యని చూచికొనుచు నతిజాగరూకతతో నన్నుని వధ్యస్థానమునకుం గొనిపోయి చంపుచున్నారు. ఎవరిప్రాణములు వారికిఁ దీపికదా! కావునఁ దమకు శస్త్రిధారులై వెళ్లినచోఁ జందనదాసుచావతిత్వరితముగా జరగును.

రాక్ష— (తనలో) ఆహా! చాణక్యనీతిమార్గ మెంత దుర్బోధముగా నున్నది!

తే. గీ. శకటదాసుని నాసన్నిధకి విరోధు
లంపిరా, చంప నేల వధాధికృతులఁ?
గానిచో వాఁడు సేయునే కపటకృతులు?
నిర్ణయింపఁగ నాబుద్ధి నేరకుండె.

(ఆలోచించి)

ఉ. కాలముకాదు కత్తికిది, ఘాతుకులవ్వధియుంచె ముందె; యే
కాలమునన్ఫలించునో వికల్పఫలంబులు నీతిమార్గముల్;
జాలముసేయఁగాఁదగదు చందనదాసుఁడు చచ్చుచుండె; నా
పాలిటికింక నే నొనరుపందగినట్టిది దేహనాశమే.

(అందఱును నిష్క్రమింతురు)

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వరాంధ్రీకృతంబగు ముద్రారాక్షస

నాటకంబున షష్ఠాంకము.

# ముద్రారాక్షసము

## సప్తమాంకము

( పిదపఁ జండాలుఁడు ప్రవేశించును )

చండా—లేచిపొండు లేచిపోం డొత్తిగిలుం డొత్తిగిలుండు !

తే. గీ. ప్రాణములు భార్య బిడ్డ లన్వయము సిరులఁ
బోఁచికోవఁగాఁ దలంచినపురుషు లెవ్వ
రేని దూరంబుగా విసర్జింపుఁ డవని
పాలవైరాభిధేయ మపథ్య మెపుడు.

మఱియును—

తే. గీ. రోగిసేయునపథ్యము రోగికున్న
రోగమే పెంచు, లేకున్న రోగిఁద్రుంచు;
భూధవాపథ్యదోషంబు పొలియఁజేయుఁ
జేయువారలకుల మెల్లఁ జిచ్చుపగిది.

మీ రామాటనమ్మ రేని రాజాపథ్యకారి యగుటంజేసి సపుత్రకళత్రంబుగ వధ్యస్థానంబునకుం గొనిపోఁబడుచున్న చందనదాసశ్రేష్ఠిం జూడుఁడు. అయ్యలారా! ఇతని వదలిపెట్టించుట కేదేనుపాయమున్నదా యని యడుగుచున్నారా! ఉన్నది. రాక్షసామాత్యుని కుటుంబమును సమర్పింపవలయును. శరణాగతవత్సలుఁడైన యీసెట్టి తనప్రాణముకొఱకై యట్టిదుష్కార్యముఁ జేయఁ డనుచున్నారా! అటులేని పరలోకమం దితని సుఖగతికై ప్రయత్నింపుఁడు, మీకీ ప్రతీకారవిచార మేటికి ?

(పిదప రెండవచండాలుండును, శూలము భుజముపైఁ బెట్టుకొని చందనదాసుండును, నతనిభార్యయుఁ బుత్రుండును ప్రవేశింతురు)

చంద—(కన్నీరుజార్చుచు) ఆహా! ఎంతకష్ట మెంతకష్టము. ప్రతిదినంబును సుచరిత్రంబునకేమి భంగము వాటిల్లునో యని భీతిల్లుచుఁ గాలముగడుపు మావంటివారికిఁగూడఁ జోరజనోచితం బగుమరణము తటస్థించుచున్నది. దేవా! కృతాంత! నమస్కారము. నృశంసులగువారి కుదాసీనులైనను నితరులైనను నొకటియే.

తే. గీ. మరణభయమున మాంసంబు పరిహరించి
కసవు మెసవుచు నడవిలో మసలుచున్న
హరిణములఁ జంపుకొఱకుఁ బ్రియత్నపడెడి
వ్యాధసంతతి కేమి నిర్బంధముండు.

(నలుదెసల పరికించి) ఓప్రియమిత్రమా! విష్ణుదాస! పిలిచినఁ బ్రతివచనమైన నీకు న్నావు. నిన్ననే! నిట్టిమహావ్యసన కాలంబునం దృష్టిపథంబున నుండుమనుష్యులు వేఱు (కన్నీటితో) వీరే ప్రియమిత్రులు. తిలోదకము లిచ్చుపగిదిఁ గన్నీరువిడుచుచు శోకదీనవదనులై కన్నీటిచే భరంబగుదృష్టితో విడిచిపోలేక నన్ననుసరించుచున్నారు. (పరిక్రమించును)

చండా—అయ్యా చందనదాస! వధ్యస్థానమునకు వచ్చితిమి, కావునఁ బరిజనమునకు సెలవిమ్ము.

చంద—కుటుంబినీ! కుమారునితో మరలి పొమ్ము. ఇంతకంటె నీవనుసరించి వచ్చుటకు వీలులేదు.

చందనదాసుభార్య—(కన్నీరువిడచుచు) ఆర్య! పరదేశమునకైనఁ గాదు, పరలోకమునకే పోవుచుంటివా!

చంద—తరుణీ! మిత్రునికై నాప్రాణముః వదలుచున్నానుగాని నేఁజేసిన దోషము చేతఁగాదుకదా యేలవిచారించెదవు.

భార్య— ఆర్యా! అటులేని మీకులజనము మిమ్ము విసర్జించుకాలము కాదు.

చంద— కాక నీవేమి చేయఁదలఁచుకొన్నావు?

భార్య— మీపాదపద్మముల ననుసరించుటంజేసి యాత్మను గృతార్థపుచ్చఁ దలఁచుచున్నాను.

చంద—అది తప్పుతలంపు; లోకవ్యవహార మెఱుఁగని బాలుఁడు, నీకుమారుఁడు వీనిపై ననుగ్రహ ముంచవలయును.

భార్య—దేవతలే యనుగ్రహింపవలెను. తండ్రీ! కుమార! మీతండ్రిగారి పాదములకుఁ జరమాభివందనముఁ గావింపుము.

పుత్ర—(పాదములపైఁబడి) తండ్రీ! భవద్వియుక్తుండ నగునేను జేయవలసిన పని యేమి?

చంద— కుమార! చాణక్యుఁడు లేని దేశంబున వసియింపుము.

చండా— ఆర్య ! చందనదాస ! శూలము ప్రాఁతితిమి. కావున సన్నద్ధుండ వగుము

భార్య— ఆర్యులార ! రక్షింపుఁడు రక్షింపుఁడు !

చంద— ఆర్యురాల ! ఏల యేడ్చెదవు? దేవతలు స్వర్గగతుండగువాని బంధువులపై దయయుంచెదరు. అదియునుంగాక నేను మిత్రునికై నశించుచున్నాఁడను గాని యయుక్తకార్య మాచరించి కాదు. కావున నీవు సంతోషింపఁదగిన విషయము. విచారించెదవేల ?

ప్రథమచండా — ఓరీ బిల్వపత్ర ! చందనదాసునిం బట్టుకొనుము. పరిజనము తనంతన పోఁగలదు.

ద్వితీయచండా —ఓరీ ! వజ్రలోమ ! పట్టుకొనుచున్నాఁడను.

చంద—భద్ర! ముహూర్తమాఁగుము కుమారు నాడించెదను. (కొడుకుతలపైమూర్కొని) తండ్రీ ! చా వవశ్యము రాఁదగినయప్పుడు రాఁదగినదియే. కానినాకు మిత్రకార్యం బను నెపంబునఁ దటస్థించినది. కాన విచారింపకుము.

పుత్రు—తండ్రీ! ఇదియుఁ గూడఁ జెప్పవలయునా ? మనకిట్టిచావుసనాతనధర్మమే (పాదములపైఁబడును)

చండా—ఓరీ ! పట్టుకొనుమురా !

భార్య—(రొమ్ముబాఁదుకొనుచు) ఆర్య రక్షింపుము రక్షింపుము !

రాక్ష—(పటాక్షేపముగాఁ బ్రవేశించి) పూజ్యురాల ! భయపడకుము. ఓరోరి శూలారోపకులార ! చందనదాసుం జంపకుఁడు.

ఉ. వైరికులంబురీతిఁ బ్రభువంశమడంగ నెవండు చూచెనో,
ఘోరతరాపదం జెలులు గుంపుట యెవ్వని కుత్సవంబొ, నిం
డారఁ బరాభవంబడిన యాత్మయు నెవ్వనికిం బ్రియంబొ యా
క్రూరుని కంధరంబునఁ దగుల్పుఁడు దారుణమృత్యుపాశముల్.

చంద—(కన్నీరోడ్చుచుఁజూచి) అమాత్య! ఏమిది !

రాక్ష —నీసుచరిత్రైకదేశమునకుఁ దగినదియే యిది.

చంద— అమాత్యా! ఇట్లు నాసాహసప్రయాసములను నిష్ఫలము జేయుచుంటివేమి ?

రాక్ష—మిత్రమ ! నాస్వార్థమును నేను జేసితిని. ఏల నిందించెదవు ? భద్రముఖ! చండాల ! దురాత్ముఁ డగుచాణక్యునితో నిట్లు నివేదింపుము.

ప్రజ—ఏమని?

రాక్ష—మ॥ కలికాలంబునఁ బ్రాణనాశ మయినం గష్టంబుగా నెంచ కా
ర్తుల రక్షించి యుశీనరాధిపునికీర్తుల్మించె నెవ్వండు, బు
ద్ధులకంటె న్పరిశుద్ధిమంతమగుచేతోవృత్తి యెవ్వాని, దీ
యాలఘుం డెవ్వరికై శ్రమంపడియెనో యాతఁడ నేనేసుఁడీ!

ప్రథమచం— ఓరీ బిల్వపత్రిక! నీవీ చందనదాసునిం బట్టుకొని యాశ్మశానపాదప చ్ఛాయయందు ముహూర్తముండుము. అమాత్యరాక్షసుఁడు దొరకినాఁడని నేఁబోయి చాణక్యునితో నివేదించెదను.

ద్వితీయచం— సరియే పొమ్ము. (సపుత్రదారుండగు చందనదాసునితో నిష్క్రమించును.)

ప్రథమచం — అమాత్య! ఇటురమ్ము! (రాక్షసునితోఁ బరిక్రమించి) ఇదె యమాత్యుని గృహము. నందకుల నగకులిశంబును మౌర్యకుల ప్రతిష్ఠా కారణంబునగు నార్యచాణక్యునకిట్లు నివేదింపుఁడు.

రాక్ష— (తనలో) ఇదియును వినవలయునా?

చండా— ఆర్య! భవదీయ నీతిసంయమితబుద్ధి యగు నమాత్యరాక్షసుఁడు దొరకినాఁడని.

(పిదపయవనికావృతశరీరుండై ముఖమాత్రదృశ్యమానుండై చాణక్యుఁడుప్రవేశించును)

చాణ— ఓరీ! భద్ర! చండాల! చెప్పుము చెప్పుము.

సీ. ముడిచె నెవ్వఁడు పటంబున ఘనజ్వాలాకరాళమైన దవాగ్నిగోళకంబు
బంధించె నెవ్వండు పంజరంబున దంతిదానవాసితసటంబైన హరిని
నిలిపె నెవ్వఁడు పగ్గములచేతఁ గట్టి కల్పాంతకాలాకులంబైనగాలి
నీఁదె నెవ్వాఁడు బాహాదండముల నక్రిభీకరంబైన రత్నాకరంబు

తే. గీ. లీలఁ గొనవ్రేలఁ బెకలింపఁజాలె నెవఁడు
త్రిపురసంహారకాలోగ్రదేవదేవ
కంఠభూషణఫణిఫణాకలితరత్న
కోరకంబులతోఁగూడఁ గొండలెల్ల.

చండా— నీతినిపుణబుద్ధియగు దేవరయే.

చాణ— కాదు కాదు. నందకులవిద్వేషి యగు దైవ మని చెప్పుము.

రాక్ష—(తనలో) వీఁడు దురాత్ముఁడు. కాఁడు కాఁడు చాణక్యుఁడు మహాత్ముఁడే

తే. గీ. రత్నములకున్కి పట్టంబు రాశియైన
యట్టు లీబ్రాహ్మణుం డాటపట్టు సర్వ
శాస్త్రములు; కట్టివాఁడు మత్సరుల మైన
మాకుమాత్రము కాఁడయ్యె మంచివాఁడు.

చాణ— (చూచి సంతసముతోఁ దనలో) ఇతఁడే మహాత్ముఁ డగు నమాత్యరాక్షసుఁడు ఈనూత్మబుద్ధి=

తే. గీ. మిగుల జాగ్రత్తగా నుండఁదగిన గొప్ప
పన్నుగడ లెన్ని యేనియుఁ బన్ని యీతఁ
డేనుభావుఁడు కాఁడె యాయాసపెట్టె
మౌర్యసైన్యంబుఁ జాణక్యు మతియుఁగూడ.

(యవనికం జేతితోఁ దీసివేసి) ఓయి! అమాత్యరాక్షస! విష్ణుగుప్తుఁడు నీకు నమస్కరించుచున్నాఁడు.

రాక్ష— (తనలో) అమాత్య యను విశేషణము మాత్రము లజ్జాకరముగానున్నది. (ప్రకాశముగ) విష్ణుగుప్త! చండాలస్పర్శదూషితుండగు నన్ను నీవంటి బ్రాహ్మణుఁడు తాఁకఁగూడదు.

చాణ— ఓయీ! రాక్షసామాత్య! వీరు చండాలురు కారు. ఇతఁడు నీవుచూచిన సిద్ధార్థకుఁ డను రాజపురుషుఁడు. రెండవవాఁడు సమిద్ధార్థకుఁడు. దీనుఁ డగు శకటదాసుఁ డాయుత్తరము వ్రాయలేదు. ఆకపటలేఖ నేనే కల్పించి వ్రాసితిని.

రాక్ష— (తనలో) శకటదాసునిపైఁ గల దురూహ నేఁటితోఁ దీఱినది.

చాణ— అయ్యా! వేయేల! సంక్షేపముగాఁ జెప్పెదను వినుము.

శా. తద్రీతిన్నగ లమ్మఁజేయుటయు సిద్ధార్థుండు సాక్షాద్భవ
న్ముద్రాముద్రితమైన కమ్మయును భదంతుండు న్భవన్మిత్రుఁ డో
భద్రా! భద్రభటాది భృత్యులను సర్వంబు న్మహాశోకభా
రద్రాఘిష్ఠతఁగన్న సెట్టి భటుఁ డారామాగతుండిన్నియుఙ్.

(కొంచెము సిగ్గుపడి)

తే.గీ. చంద్రగుప్తునకును నీకు సంధిచేసి
యతనిరాజ్యంబు భవదీయమతివిశేష
మాన్యముగఁజేయఁదలఁచిన మామకీన
వర్ణనీయనయప్రభావమ్ము సుమ్ము.

దీనికేమి. వృషలుఁ డొకసారి నిన్నుఁ జూడఁదలఁచుచున్నాఁడు.

రాక్ష—(తనలో) ఏమిగతి, చూచెదను.

(పిదప రాజు విధవోచితముగు పరివారముతోఁ బ్రవేశించును)

రాజు— దోర్బల ముపయోగింపకుండఁగనే యార్యచాణక్యుఁడు దుర్జయమగు పరబలమును జయించుటంజేసి మదిలో సిగ్గువొడమచున్నది.

తే.గీ. అమ్ము లెల్లను సుఫలయోగమ్ముఁ జెంది
యును విపక్షత్వమును బూనియుంటఁజేసి
వంతచేఁబోలి తలవంచి సంతసమ్ము
గాఁదలంపవు తూణీరగాఢనిద్ర.

అదియునుం గాదు—

తే.గీ. ధనువు కేల ధరింపకున్నను సమర్థుఁ
డితఁడు చేతవ్వల జయింప ; నెల్లవేళ
నేను నిదురించుచున్నను నా నిమిత్త
మార్యులే జాగరూకత నందినారు.

(చాణక్యుని సమీపించి) ఆర్య ! చంద్రగుప్తుఁడు నమస్కరించుచున్నాఁడు.

చాణ— సర్వాశీర్వాదములు నీయందు ఫలించియే యున్నవి. పూజ్యుఁడగు రాక్షసామాత్యునకు నమస్కరింపుము.

రాక్ష—(తనలో) ఇతఁడు సంబంధము కలుపుచున్నాఁడు.

చాణ—(రాజునుసమీపించి) అమాత్యరాక్షసుఁ డిదెవచ్చినాఁడు. నమస్కరింపుము.

రాజు—(రాక్షసునిఁజేరి) అయ్యా ! చంద్రగుప్తుఁడు నమస్కరించుచున్నాఁడు.

రాక్ష—(చూచి తనలో) చంద్రగుప్తుఁడా !

తే.గీ. బాలుఁడయ్యును సర్వసంభావ్యమగు మ
హోదయముఁ జెంది క్రమముగా యూథనాథ
పదవిఁగైకొన్న మత్తద్విపంబు పగిదిఁ
బడసె రిపురాజసామ్రాజ్యపద మితండు.

(ప్రకాశము) రాజా ! విజయముఁ జెందుము.

రాజు— తే.గీ. గురువులగు మీర లిరువురుఁ గూర్చి కరుణ
కలిగియుండఁగ నాకు లోకములనెందు
నజిత మనుమాట యుండునే యార్యవర్య !
సర్వమును మీకృపావిశేషమ్ము గాదె.

రాక్ష— (తనలో) ఈకౌటిల్యశిష్యుఁడు నన్ను భృత్యునిగాఁ జేసికొన నెంచుచున్నాఁడు. కాదు ఇదియంతయు నితని వినయాతిశయమే. నాకున్న మాత్సర్యము విపరీతోహ కలిగించుచున్నది. సర్వవిధములఁ జాణక్యుఁడు కీర్తిశాలి యనఁదగినవాఁడు.

తే.గీ. జయముగొను మందబుద్ధిమంత్రియు నదృష్ట
వంతుఁడైన జిగీషుఁ జేపట్టెనేని ;
కాని నిర్భాగ్యుఁ గొల్చువాఁడైన నిపుణ
మంత్రియును గూలుఁ గూలద్రుమంబుభాతి.

చాణ— రాక్షసామాత్య ! చందనదాసు బ్రతుకుట నీకిష్టమే నా !

రాక్ష— విష్ణుగుప్త ! సందేహమెందులకు ?

చాణ— మఱెందులకును లేదు. నీవు నృపులు ననుగ్రహించుటకై యమాత్యఖడ్గము ధరింతువో లేదోయని సందేహము. నీవు చందనదాసుండు బ్రతుకఁ దలంచితివేని మంత్రిశస్త్రమిదె స్వీకరింపుము.

రాక్ష— విష్ణుగుప్త ! నే నీకత్తిఁ బూనుటకుఁ దగను. నీవు ధరించినది బొత్తిగా ధరింపఁదగము.

చాణ— నేను యోగ్యుఁడను, నీవుకావు అను మాటలేల ? చూడుము—

ఉ. సంచితయుద్ధభారమున స్నానముఁ బానము ఖానముల్ విస
ర్జించి ఖలత్త్రలీనములు జీనులు వాయని వారువంబులున్
బూంచు కుధంబుల న్నడుము పుండ్లయియున్న గజంబులున్ ద్వద
ర్ప్యంచితమైన బుద్ధియును పౌరుషముల్ వెలిపుచ్చుచుండెడిన్.

వెయ్యేల ; నీవు శస్త్రగ్రహణము చేయకున్నఁ జందనదాసు బ్రతుకఁడు.

రాక్ష— (తనలో)

ఉ. నందులప్రేమ వాయదు మనంబున ; భృత్యుఁడనైతి విద్విష
ద్బృందము సేయుమాయలకుఁ ; బెంచిన చెట్లనె ద్రుంచినాఁడ నే
మందు ! ధరింతుఁ గత్తిఁ జెలిప్రాణము నిల్పుటకై ; వశత్వమున్
జెందక యుండరాదు విధిసేతలకున్ విధికైన నక్కటా.

(ప్రకాశముగా) విష్ణుగుప్త! సర్వకార్యప్రవృత్తిమూలంబగు మిత్రస్నేహంబునకు నమస్కారము. గతిలేక మీకు నమ్ముడనగుచున్నాను.

చాణ—వృషలా! వృషల! రాక్షసామాత్యుఁడు నిన్ననుగ్రహించినాఁ డింక నీవు వర్ధిల్లుము.

రాజు— ఆర్యప్రసాదమె చంద్రగుప్తుఁ డిట్లనుభవించుచున్నాఁడు.

పురు—(ప్రవేశించి) ఆర్యా! జయము జయము! భద్రభట భాగురాయణ ప్రముఖులచేఁ గాళ్లుచేతులు కట్టఁబడి తేఁబడిన మలయకేతువు ద్వారమునం దున్నాఁడు. దేవరవారి చిత్తము!

చాణ— రాక్షసామాత్యునితో విన్నవింపుము. అతనిచిత్తము.

రాక్ష—(తనలో) ఈకౌటిల్యుఁడు నన్ను దాసునిగాఁ జేసికొని విన్నపములకై నన్ను ముఖరునిఁ జేయుచున్నాఁడు. ఏమిగతి! (ప్రకాశముగా) రాజా! చంద్రగుప్త! నీకుఁ దెలిసినవిషయమే. మేము మలయకేతువునొద్దఁ గొన్నాళ్లు భృత్యులమైయున్నాము. కావున నితనిప్రాణములు రక్షింపుము.

రాజు— (చాణక్యుని ముఖమువంకఁ జూచును)

చాణ—అమాత్యరాక్షసుని ప్రథమస్నేహము మనము మన్నింపవలయును. (పురుషునితో) ఓరీభద్రా! భద్రభటప్రముఖులతో నామాటలుగా "రాక్షసామాత్యుఁడు చంద్రగుప్తునితో మలయకేతుప్రాణముఁ గాపాడుమని విన్నవించెను. రాజును మలయకేతువు తండ్రి రాజ్యము మలయకేతువున కిప్పింపుమనియె. కావున మీరందఱుగి యతనిఁ దదాజ్యమున నిల్పి మరల రం" డని చెప్పుము.

పురు— చిత్తము (అని పోఁబోవును.)

చాణ— ఓరీ! ఉండు ముందుము రా! అమాత్యరాక్షసలాభంబునఁ బ్రీతుండగు చంద్రగుప్తమహారాజు చందనదాసశ్రేష్ఠికి సర్వనగరశ్రేష్ఠిపద మిప్పింపుచున్నాఁడని దుర్గపాలునితోఁగూడఁ జెప్పుము. మఱియును గుఱ్ఱము లేనుగులు తప్పఁ దక్కిన చందనదాసు ద్రవ్యమంతయుఁ జందనదాసున కిప్పింపుమనుము. పోనీ! అమాత్యరాక్షసుఁడు ప్రభువై యుండ లేనిపోని గొడవ నాకేటికి?

తే. గీ. గుఱ్ఱముల కేనుఁగులకుఁ దప్ప గొదవవాని
కెల్ల బంధనముక్తి చేయింపు మనుము;
మించి గాఢప్రతిజ్ఞ చెల్లించుకొంటిఁ
గనుక నాజుట్టు ముడివేసికొనుదు నింక.

పురు — చిత్తము (నిష్క్రమించును.)

చాణ — ఓరాజా! చంద్రగుప్త! ఓఅమాత్యరాక్షస! మీకు నే నింకను జేయఁదగిన ప్రియ మేదియో తెలుపుఁడు.

రాజు — ఆర్య! మాకింతకన్నఁ బ్రియ మేమున్నది.

తే. గీ. మైత్రిదొరకెను రాక్షసామాత్యుతోడ
మద్వశముఁజేయఁబడియె సామ్రాజ్యపదవి
మాసి రెల్లరు నందులు; మాకుఁ జేయఁ
గాఁదగిన మంచి ప్రియకృత్య మేదియింక?

రాక్ష — అయినను ఇట్లగుఁగాక!

భరతవాక్యము.

మ. జగదవనంబు సేయుటకుఁ బాలివయాదివరాహమూర్తి యే
జగతి ధరించెఁ గోరకొన సర్వజగత్ప్రళయంబునందు నా
జగతిని ప్లేచ్ఛబాధితభుజంబుల నిప్పుడు మోయుచున్న చా
రుగుణుఁడు చంద్రగుప్తుఁడిల బ్రోచుత శ్రీయుతబాంధవంబుగన్.

(అందఱును నిష్క్రమింతురు.)

గద్య.

ఇది శ్రీకింకపీంద్ర ఘటాపంచానన విద్వత్కవి బాలకలానిధి బాలసరస్వతీ శతావధాని తిరుపతి వేంకటేశ్వ రాంధ్రీకృతంబైన విశాఖదత్తరచిత ముద్రారాక్షస నాటకంబున సర్వంబును సప్తమాంకము.

సంపూర్ణము.



## —♦ ముద్రారాక్షసము ♦—

### శుద్ధపత్రిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 25 | గృహాజనటము | గృహాజనము |
| 13 | 27 | పెదుకళ | పెదకళ |
| 15 | 19 | రాక్షసునకు | రాక్షసుని |
| 16 | 15 | ఆవులించిన | ఆవలించిన |
| ,, | 24 | తీఱునా | తీరునా |
| 17 | 10 | సుమీ | జుమీ |
| | ,, | పెండ్లాము | పెండ్లము |
| 18 | 5 | విధించుఁగాక | విధించుంగాక |
| 21 | 5 | యిరువురి | యిరువురు |
| ,, | 9 | కాలురు | కాలులు |
| 22 | 10 | విడచి | విడిచి |
| 23 | 13 | జాజిలి | జాజలి |
| ,, | 17 | రాణ్ణిరా | రాణ్మిరా |
| ,, | 18 | మంసంగ | మదంగ |
| 26 | 15 | జలధితరంగజాలమున | జలనిధివీచులంజెనయు |
| 28 | 6 | ఐరోచకు | వైరోచకు |
| ,, | 24 | ఇరువురి | ఇరువుర |
| 38 | 26 | స్వాతంత్ర్యా | స్వాతంత్ర్య |
| 40 | 23 | గూర్చించి | గూర్చుండి |
| 44 | 9 | ప్రేరేపణచేయుము | ప్రేరేచు |
| 45 | 16 | బ్రిభువులం | బ్రభులన |

| | | | |
|---|---|---|---|
| 48 | 24 | జనువు | జన్వు |
| 50 | 16 | నేను వం | నేను బం |
| 52 | 6 | నంత | యంత |
| 54 | . 2 | వహింపఁ | వహింప |
| ,, | 25 | గళ్యాన | గళ్యాణ |
| 55 | 6 | ఊరువుచ్చి | నిశ్వసించి |
| | 13 | బూడెలో | బూదిలో |
| 56 | 4 | వారిఘుల్ | వారిధుల్ |
| ,, | 9 | ద్వారా | ద్వారమున |
| 60 | 4 | మనోశ | మనోక |
| ,, | 9 | జ్ఞాడంబ | జ్ఞాడీనం |
| 62 | 13 | నడిపించు | నడపించు |
| 63 | 18 | శిరసా ధరింప | యాదలఁదాల్ప |
| 65 | 9 | లేఖపత్రంబు | లేఖను |
| 66 | 17 | కోపగింప | సంశయింప |
| 66 | 23 | మానాంగి | మాణాంగి |
| 77 | 2 | నిజమయ్యె | నిజమైయే |
| 79 | 26 | గౌరవంబుకళవై | గౌరవాస్పదుడవై (పాత) |
| 80 | 27 | స్పృహానీయ | స్పృహణీయ |
| 82 | 13 | మలయకేతు | మలయకేతు |

---

శ్రీపరదేవతాయైనమః.

# బాలరామాయణము.



## ప్రథమాంకము.

చం. వెలయు నిలన్ శ్రుతిప్రస్మృతిపేయమధుచ్యుతిమై రచించు వ
స్తులకు మొదల్కళాత్మకము సూక్తివిభూష్యము సుప్రసత్తికిన్
నెల వభిధేయకాయరమణీయము నైన వచోనిగుంభ మా
జలనిధిచంద్రతారకము సత్కవిగోష్ఠి సేవ్యమానమై.

సూత్రధారుఁడు — ( నాంద్యంతమందు సంరంభముతోఁ బరిక్రమించి సవినయముగఁ బువుదోసిలియొగ్గి ) సకలకళాప్రవీణులగు నోసభాసదులారా! ఈగుణనిధి మీకందఱకు నొక విన్నప మాచరించుచున్నాఁడు. నాట్యాచార్యుండగు ధూర్తిలుం డొనరించిన ప్రతిన తమ రంద ఱెఱింగినదియేకదా.

గీ. తఱచు వీరరసంబద్భుతరస మున్న
రూపకములందు మిగుల నేర్పునఁ జెలంగు
నతఁడె గేయంబునందు నృత్యంబునందు
వలఁతియగు నాకొమార్తకు వల్లభుఁడని.

అందు దక్షిణాపథమునుండివచ్చిన రంగవిద్యాధరుఁ డను భరతపుత్రుండు మీచేతఁ బరీక్షితుఁడై నిర్వాహమందఁడయ్యెఁగదా! ఇఁక నన్నును బరీక్షింపుఁడు. ( ఆకసము దెసకుఁ జెవియొగ్గి ) ఏమనుచుంటిరి? విలక్షుండగు నా కర్ణాటనటుండు, కర్ణాటకుల పౌరుషంబు లెందును వెనుదీయునవి కావుగాన, నిర్మర్యాదముగ నిట్లుపలికె ;

గీ. ఎదుటఁ బరిణేత యుండుఁగా కేన దాని
నపహరించెద నిజముగా శపథ మిదియ
వెలఁదిబన్నంబులను నైఁచువిధముగల్గు
చదువులను దాక్షిణాత్యులు చదువలేదు.

అని యనుచుంటిరా? ( దోసిలియొగ్గి ) అయిన నాపల్కు పల్కులఁగూడ నవధరింపుఁడు.

కేన పెండ్లియాడినయెడల

గీ. కడలి నడిమిటి తిన్నెకై కడఁగి వాఁడు
తీసికొనిపోయినను నేను దిరిగి తేర
నవును, నర్ణవలంఘనం బనఁగ నెంత?
యనుఁగుఁ బెండ్లము నింకొకఁ డపహరింప.

ఏమంటిరి? అయిననిఁక నుపక్రమింపుమనియా? (ఆలోచించి యెదుటికిఁ జూచి) అదియేమి?

పారిపార్శ్వికుఁడు—(ప్రవేశించి) ఇదెఅది.

సూత్ర—ఇదేమిటి?

పారి—సభాసదు లొసంగిన పత్రము. చదువుము.

సూత్ర—(స్వగతము) ఎండ కావలయువానికి మబ్బు తటస్థించినగతి నుపక్రమించినది యొకటియుఁ దటస్థించినది మఱియొకటియు నాయెఁగదా! (విచారముతో) సత్కార్యారంభములకు విఘ్నము లుపస్థితములగుచుండును. (నిరూపణముతో) అవును. అనిర్వేదము కార్యసిద్ధికి మూలము (నిశ్చయించి) ఇట్లవునుగాక, (ప్రకాశముగ) మారిషా! రసాంతర తిరస్కారముచే నా డెందమునకు స్వస్థత కానరాకున్నయది, కావున నీపత్రము నీవే చదువుము.

పారి—(తానే చదువుచున్నాఁడు.)

గీ. పూర్వకవులు రచించిన పుణ్యచరిత
మెద్దియేనియు రూపకం బెవరుగాని
మించుగతిదోఁప నాంధ్రీకరించిరేని
శ్రేష్ఠమగుఁగాన దాని దర్శింపవలయు.

సూత్ర—(విని, ఆలోచించి, స్మృతికిందెచ్చుకొని) దైవమనుకూలించిన నందఱికిని శుభము రాఁగలదు. సభాసదుల యానతియును నాతలంపును నేకీభవించుట తటస్థించినది. మున్ను భుజస్తంభాలానితలక్ష్మీకవేదండుండును రఘువంశైకభూషణంబును నగు మహేంద్రపాలమహారాజుచే నియోగింపఁబడిన సభాసదులయెదుటఁ బ్రదర్శింపఁబడినదియును రాజశేఖరకవికృతమునగు బాలరామాయణనాటకము తెనిఁగింపఁబడియున్నది. అయ్యది ప్రయోగించి యీసభాస్తారులయుల్లంబులు రంజిల్లఁజేసెదనుగాక. (పరిక్రమించుచున్నాఁడు.)

పారి—బావా! బాలరామాయణ మాంధ్రీకరించినవా రెవరు?

సూత్ర—ఇంతదనుక నీవెఱుంగవా యేమి?

సీ. తనకు వేంకటశాస్త్రి తగిన సహాధ్యాయిగాఁ బాణినీయాబ్ధి కడచి, రెండు
భాషలలోఁ దత్క్షణం గవియయ్యు ననేకముల్ శతలేఖినీకవిత్వ
తంత్రముల్ పెక్కుగ్రంథమ్ము లాతనిసహాయమునఁ గావించి యయ్యవఘనుఁగూడి
శ్రీపోలవరపురీభూపాలుఁ డాంగ్లేయభాషాప్రవీణుండు బహుకళాఢ్యు

గీ. రంధరుఁ డతిశాంతుండు సరసుఁడునగు
రామచంద్ర వేంకటకృష్ణరాయచంద్రు
నొద్ద బుధుఁడును గవియు మాన్యుండునై చె
లంగుతిరుపతిశాస్త్రి తెలుంగుఁజేసె.

పారి—బావా! నీవుడివలన నిది గావించినవా లోకరో లేక యిరువురో నాకుఁ దెలియకున్నది గాన నేర్పఱచి చెప్పుము.

సూత్ర—ఎవరేదిరచించినను నాసహాధ్యాయుఁడు నిర్వురము రచించినట్లే గ్రంథాంత గద్యంబునం దుదాహరించుకొందురు.

పారి—మున్ను మహర్షియగు వాల్మీకిరచించిన రామాయణముకంటె నీ రాజశేఖరకవి యీనాటకమునఁ బ్రదర్శించిన విశేషమేమి ?

సూత్ర—ఒక్కొకచో నొక్కఁడికి మిగులఁ బ్రౌఢిమ వాటిల్లుఁగాని యంతయు నన్నిటియందును నేర్పగలుగదు.

పారి—బావా! దివ్యదృష్టిగతంబున నఖిలప్రాపంచికశబ్దార్థంబులు కరతలామలకంబులుగానుండు మహామునులకుఁ బెక్కువగా నీచర్మదృష్టియగు కవికిఁ దెలియునే ?

సూత్ర—మారిషా! అట్లుగాదు.

తే. గీ. కల్పరేఖలచేత సంఘటితమైన
నేత్రము లబలల మొగముల నెల్లలయందుఁ
గ్రాలుగతి సుకవీంద్రుల రసనలందుఁ
దనరు సారస్వతంబు నేత్రంబొకండు.

అదియునుంగాక యీకవిమిగులఁ బ్రాజ్ఞుండు. తుల్యవస్త్వంతరముల నతిక్రమింపలేకదా ప్రజ్ఞాప్రకర్షము; ఈసూక్తిని మహామంత్రి పుత్రుఁడగు నాకవియే వక్కాణించె.

చ. పుడమికి నాల్గుప్రక్కల సముద్రము హద్దు, సముద్రమున్న నా
ఘృషలోకనూఁటు, మింటిపరిమాణము గొల్పుచునుండు ద్వాదశా

త్మ్యుఁడు దినమంతటం బఖికుపోలిక, నిట్లు సమస్తవస్తువుల్
పడయును మేర, సత్కవులప్రజ్ఞకుమాత్రము మేరలేదిలన్.

పారి—అట్లైన నమస్కరింపుము.

సూత్ర—ఆమహాకవియే నమస్కరించినాఁడు.

గీ. పుట్టఁబుట్టినవాఁడు ప్రఖ్యాతసుకవి
యెరుగుమఁ గావించినాఁడు రామాయణంబు
యోగి ఛందఃప్రణేత ప్రాచ్యుండుమాని
చెలఁగుఁగావుత మెపుడుఁబ్రాచేతసుండు

మఱియునమ్మహాకవి ప్రబంధారంభమున నిట్లుపలికినాఁడు.

చ. వినివిని చెప్పుచుంటిమొక వస్తువుమేలగు మీకు బ్రాహ్మణుల్!
విని గ్రహియింపుఁడయ్య! యిదె పెట్టితి దోసిలి యోగ్యులార! హా!
వినయము లేల శాకుఁ? కృతివిన్నను వైనఁ దముక్తిమాధురిన్
దనియక పోవు పండితులు దైన్యముఁ దేవొకో యజ్ఞ రేరికిన్?

అన్నిభాషలను నేర్చిన యక్కవియే మఱియునిట్లుపలికినాఁడు.

ఉ. వేలుపుబాస వీనులకు విందగుచుండు స్వభావమాధురీ
లాలిత మల్ల ప్రాకృతము లాల్యము మిక్కిలి సూతభాషయున్
జాలికమున్నగాఁ గలుగుసూక్తుల స్రోవలు వేలువేలు; భా
షాలలితుండివన్నియును సత్కవిసత్కృతులందుఁ జేరుచున్.

రెండియు నేతత్ప్రబంధ గౌరవముం గుఱించి యతండ యిట్లువాక్రుచ్చె.

చ. ఇదియొక పెద్దకబ్బమని యీరసమాడెదరేని, శయ్య యొ
ట్టిది, రసమెట్టిదంచు నొకటేపలుకగ్గెద; లెస్సయంటిరేఁ
జదువుఁడు షట్ప్రబంధముల చాడ్పునదీనిని; చెట్టయంటిరే
నదుకులబొంత యిద్ది యడఁగాఱుత నట్టువునాల్కపట్టునన్.

పారి—బావా! నీకును మహేంద్రపాల మహారాజునకును గదువిశ్వాసపాత్రుఁడగు నిమ్మహాకవి యేగోత్రమందు జనించినవాఁడో?

సూత్ర—ఓరీ, తెలివితక్కువవాఁడా! గగనాలంకారమణియగు సూర్యనిగూర్చి కూడ నితఁడెవ్వరని యడుగుదువు కాఁబోలును.

గీ. మూర్తసద్గుణగణమన మొదలఁ గాల
జలదుఁడాపై సురానందుఁడలఘుబుద్ధి

తరళ కవిరాజముఖు లనంతరము పుట్టు
వందినకులంబు దనరు యాయావరంబు.

తత్కాల సంభవుండును నకాలజలదునకుఁ జతుర్థపురుషుండును మహారాష్ట్ర చూడామణియును శీలవతీగర్భుక తనయుండును నగుచుపాధ్యాయ రాజశేఖరకవి యనునది గొప్పప్రతిష్ఠకాదా! (ఏకోవినినట్లభినయించి) ఆహా! కవి తనకుఁదా నాశీర్వదించుకొనిన యాశీర్వాద మెంతబాగుగనున్నది!

గీ. వేదవిద్యాలతలకెల్ల నాదికంద
మింకనాల్కపై వనిమేపనృష్టి కవుల
కెవ్వరేదికోరిన నదియిచ్చుదేవి
చెలఁగి వాఙ్మూర్తి ననుఁగటాక్షించుఁగాత.

మెండియు నిట్లుపలికినాఁడు

శా. భ్రాజిష్ణుండగు రాజశేఖరుఁడు నిన్బ్రార్థించుచున్నాఁడు దే
వీ! జిహ్వా! ధరియింపు నీవయిగుణప్రీతిన్ వచోదేవతన్
రాజన్యున్ నిజవంశశేఖరుని శ్రీరామున్ ద్విషద్భీము నెం
తేఁజెప్పం దొరకొన్న మత్ప్రతిభ కగ్గింపంచె సంకోచమున్.

పారి — ఇటులు ప్రార్థించినవాఁ డేల పొగడ్త కెక్కఁడు?

సూత్ర — పొగడ్తగాంచినాఁడుగదా యిట్లుదైవజ్ఞునిచే.

గీ. మొదట వాల్మీకి కవియయి పొల్పుగాంచె
భర్తృమేంఠుఁడై పిదపఁ బేర్వాసికెక్కె
నవలభవభూతియయ్యె నేయతఁ డతండె
రాజశేఖరుఁడై నేఁడు రాణకెక్కె.

మఱియు సభ్యుఁడగు శంకరవర్మ యతని వర్ణించిన వర్ణనము వినలేదా!

చ. శ్రుతులరసాయనంబు చవిచూడ, సమస్తలకూర్పొనర్ప, న
ప్రతిహతయా రసాపగకుఁ బారముగన్గొన, జీవితాప్వాయ
క్షితిజపు సత్ఫలంబుల భుజింపఁ దలంపగునేని, చేయుఁడీ
జతనము రాజశేఖరుని సత్కవికల్ విన నార్యసోదరుల్!

శా. ఆపన్నార్తిహరుండు విక్రమధనుం డూర్జిత్యవారాశి ధూ
తాపాయుం డతిదాత సత్యజలధిప్రాలేయభానుండు స
ద్వ్యాపారుం డతనిన్ నుతింపఁ దరమా నా? యేమిచెప్పన్ వలెన్
భూపాలుండు మహేంద్రపాలుఁ డతనిం బూజించు శిష్యాకృతిన్.

(నేపథ్యమందు ధ్రువాగానముఁ జేయుచున్నారు.)

క. విధుమండలసాన్నిధ్యము బుధనికురోత్కరము విడిచిపుచ్చి మతితమో
విధుతుఁడగు గగనమణిసన్నిధిఁ జేరి సముల్లసించె నింగిం గనుమా.

సూత్రి — సభాసదుల యానతి విని కుశలులగు కుశీలవు లుపక్రమించినట్లున్నది. లేనియెడల శునశ్శేఫుని ప్రవేశసూచకంబగు ఘోషయేల వినఁబడు (విమర్శించి) ధ్రువయనఁగా నాటకమునకుఁ బ్రాణప్రాయము.

గీ. వచ్చుభూమిక లెల్లను వ్యక్తపఱచు
సభ్యులమనంబునకుఁ జేయు సంతసంబు
సకలరసములఁ గూర్చు నాటకములందు
ధ్రువకుఁ జాలినగీతి లే దనియందు.

మనకును ననంతరకర్తవ్యంబునకై యత్నింతము రమ్ము.

(ఇది ప్రస్తావన.)

(అంతట శునశ్శేఫుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

శున — ప్రాతస్సవనమంద యజమానునిఁ జూడవలయునని తలఁచితిని. సంధ్యావందనముఁ జేయుచుఁ గూరుచున్న నాకుఁ గాలాతిక్రమణంబు కాలేదుకదా ? (యాకసము వంకకుఁ జూచి)

గీ. ముజ్జగము మేడ మొగసాల మొనయు హస్త
దీపికలు, ప్రొద్దుఁబడవడపుఁదీవె లేఁత
చిగురుటాకులు, పవలేన్గుచెవుల కరుణ
చామరము లినకాంతులు కోమలములు.

గీ. ముందునడచుచు నాకసమందుఁ జెలఁగు
తేజమిదియే పురాణమూర్తి యగుతరణి
యాజ్ఞవల్క్యుండు శిష్యుఁడీయనఘమూర్తి
కతనిశిష్యుండు జనకుఁడు నృపుఁడు యోగి.

రాక్షసభీతిం దొలఁగించు మందగు రామచంద్రుని వెంటంగొనిరా నయోధ్యకుం జనినవిశ్వామిత్రుండు తన్నుం జన్నంబునకుఁ బిలిచిన శ్రోత్రియ క్షత్త్రియుండు నా మిత్రుండును నగు జనకభూపాలుని సత్త్రసంపూర్తికై తనకుం బ్రతినిధిగా నన్ననిపె. అధ్వరకాలంబున కవ్వనధిగాఁ బయనమైతి. నేబోవునాఁటి కవభృథంబు మిగులు గాకుండునేమో ! అవభృథపుసుస్నానమడిగినయేని గురువులదెస నపరాధంబుఁ జేయనివాఁడనవుదు. (పరిక్రమించుచున్నాఁడు.)

(అంతట విప్రవేషంబున నొకరాక్షసుఁడు ప్రవేశించుచున్నాఁడు)

గీ. రాచపాఱుని వార్త నరయుమటంచు
మాల్యవంతుఁడు పంప సమ్మదము మీఱ
నేను పోనుంటి మిథిలకు నిమిపురంబు
నకు నయోధ్యకు రాఘవనగరమునకు.

కులధురంధరుండ ననికదా యేను నియోగింపఁబడితి. సీతయను నయోనిజాతయగు కన్యను జనకుండు గిరీశధనురారోపణంబు పణంబుఁగాఁ బెండ్లిసేయుదునని యొనర్చిన ప్రతిన దశాననుండు వినియె. అతనికి, మర్త్యలోకసంచారమున కానతియీఁబడిన, శూర్పణఖ యను చెలియ లనుదిన మిటువంటి రాచపనులు నెఱవేర్చుటకు వలంతి. అత్యాదియుచితత్వముఁగూడ నెఱిఁగినదియే. సేవకజనంబునకు ప్రభుచిత్తానువర్తనంబు సిద్ధవిద్యకదా. దశాననమహారాజును సీతకొఱకు మిథిలాపురికి రానున్నవాఁడు. వేయేల? గండముమీఁదఁ బిండిక జనించినగతి నొకయకార్యము సైతము జరిగినది. పయనంబగుచున్న యన్నిశాచరచక్రవర్తి శివశిష్యుండును పార్వతీధర్మపుత్రుండును భగవంతుఁడునగు పరశురాముని గండ్రగొడ్డలి నపహరించుటకై మాయామయుండను రక్కసుని నక్కడకుఁబంపెనఁట. ఇది పనికిమాలినపని యని తలఁతును.

ఏలన:—

ఉ. పౌరుషశాంతులన్ బఱపి పాలనతంత్రము సల్పనేని చె
ల్వారును రేఁడు సిక్తతరువట్లు; బహుచ్ఛలముల్ ప్రభుత్వముల్
చారులు లేనివారల కసాధ్యములెల్లెడ చెప్పఁ, జంచలా
చార నృపాలలక్ష్మి మతిచాలనివానిని మోసగించెడిన్.

(ఆలోచించి) అమాత్యులమీఁద కార్యసిద్ధిని నిలుపనియేని దగ్గఱ మంత్రిత్వము కొల్పనా?

గీ. ఏవియో కొన్ని దుష్కృతు లెందుకొఱకొ
చేయుచుందురు తమయిచ్చఁ జెనఁటిరాజు
లకట యవి సవరింపఁగా నతకుతలయి
మంత్రు లెంతేని సంకటంపడవలయును.

గీ. కలుగనున్న యాపద దీర్పఁగడఁగుకంటెఁ
గలిగినట్టిదానిని దీర్పఁగడఁగవలయుఁ
గాన నే మొట్టమొదట సీతానిమిత్త
మునకె ప్రతికారమును జేయఁబూనవలయు.

మాల్యవంతుండు నన్నుం బిలిచి 'భద్రముఖా! నీవు మేనకాకాముకుండును త్రిశంకుయాజియు క్షత్రియబ్రాహ్మణుండు నగువిశ్వామిత్రుని యుదంతంబు మా కుం దెలుప వలయు. అతండు సిద్ధాశ్రమమునుండి వెడలెనని వింటి. అతనికి జనకుండును దశరథుండును సమానమిత్రులే. దశరథునిం జూడ నేగిన యెడల నే నొకకపటంబుం బన్ని దశకంఠుని మిథిలానగరప్రయాణంబు మాన్పింతు. ఆవిశ్వామిత్రుండు రాక్షసులకు సహజవిరోధి. పవిత్రచర్యకును వీరపవిత్రచర్యకుం గూడం జాలినవాడు. దశరథుండును నట్టివాడే. యోగియగుజనకుండును శమదమాదిగుణసంపన్నుండు సుమీ' యని యానతిచ్చె. కావున నేనును ముందు మిథిలాపురంబున కేగి పదపడి రఘురాజధానికిం బోయెద. (యాలోచించి) మునులజనకుం బోవు చాయందును మునియె కావలయునని యేనును గృతతాపసవేషుండనయ్యు ఋషులవలని భయంబునం గలుగుచుంటిని. (యెదుటకుం దృష్టిపఱపి) ఓహో! ఎవరో బ్రాహ్మణుఁడు! (గుర్తించి) విశ్వామిత్రధర్మపుత్రుండగు శునశ్శేఫుండు కాంబోలును. అగుంగాత. ఇతనివలననె యవ్వార్త నరసెద. (వెనుకకుందిరిగి) భగవానుఁడా! నమస్కారము.

శున—నీమనోరథము సిద్ధించుంగాత.

రాక్ష—సాప్తపదీనంసఖ్య మనువచనము నన్నుం బ్రేరేచుచున్నదిగాన, నేదియో యొకపిచ్చిమాటడుగుట కుద్యుక్తుఁడనయితి.

శున—అడుగుము.

రాక్ష—విద్యార్థివలెనున్నావు ఇట్లు విద్యావిఘ్నంబుం జేసికొన నీకేమివచ్చె?

శున—మా గురువుగారియాదేశము.

రాక్ష—మీగురు వెవ్వరు?

శున—భగవంతుం డగువిశ్వామిత్రుఁడు.

రాక్ష—(తనలో) అవుఁగాక యితనిం గోపింపఁజేయుదు. నిద్రయును మదమును గోపంబును జెందినవారి యింగితము సులభముగఁ దేటపడును.

(ప్రకాశముగా) విశ్వామిత్రుఁడనవెవరు?

శున—ద్వీపాంతరమునుండి వచ్చితివా యేమిరా? భగవంతుండగు విశ్వామిత్రుని సైత మెఱుఁగకున్నావు!

చ. జమునిదెసఁ బెఱొక్క ఋషిసప్తకముం దివి నవ్యతారకా
సముదయము మహావిస్మయము ద్యుసత్తతి ప్రముచ్చిలినట్టి యధ్వరాం
గములు వసిష్ఠశాప మడఁగార్చి త్రిశంకునికోస మొండు స్వ
ర్గమును రచించె నెవ్వఁడు సురప్రభునైనఁ దృణీకరించుచున్.

చ. తపమునఁ బ్రాభవంబున సుదారమునీంద్రుల రాజచంద్రులన్
గృపణులఁ జేసె నెవ్వఁ, డిరువేల స్రుచంబును విల్లుఁబూను భూ
మిపముని యెవ్వఁ, డాభువనమిత్రుని గాధిజుఁగాదె యవ్విరిం
చి పటుమతిన్ రచించె నల చిత్రశిఖండులయందు నొక్కసిన్.

జన్మంబొసర్చువాఁడై యమ్మహానుభావుఁ డనుపదంబు రాక్షసులవలని భయంబున రక్షకుఁడగు రామచంద్రునిఁ గొనిరా నయోధ్యాపురంబునకుంజనియె.

రాక్ష—(భయముతో) మహాత్మా! కోపింపకుము. బ్రహ్మచారిస్వభావసులభం బగు చాపలంబ యిట్టియపరాధం బొనరించెఁగాని యమ్మహానుభావు నెఱుఁగమికాదు. రంభనుగూడ స్తంభింపఁజేసిన యయ్యావస్యు నెఱుంగని వారెవరు? (తనలో) ఆ. చేయఁదగినది చేసితి, నింక చారవ్యాపారమునకుఁ దఱి వచ్చినది (పైకి) మహాత్మా! ఒజ్జలపనుపు నిన్నెచటికిఁ బంపుచున్నదో?

శున—మిథిలానగరంబునకు.

రాక్ష—అచటంగల కార్యమేమి?

శున—ఉపాధ్యాయమిత్రుండగు సీరధ్వజుని జన్మంబునం దార్త్విజ్యము. మహాత్మా! పరదేశివలెనుంటి వెటనుండి యేతెంచుచున్నావు?

రాక్ష—(తనలో) ఇట్లగుఁగాక (ప్రకాశముగా) రోహణాచలపరిసరారణ్య భూషణంబగు నగస్త్యాశ్రమమునుండి వచ్చుచుంటిని.

శున—(కొంచెము సంశయముతో) అగస్త్యుఁడన నెవరు?

రాక్ష—(నవ్వి) మహాత్మా! ఏను జేసినదానికిఁ బ్రతిసేసితివి. తనపొడుపున నెల్లయుదకంబులును స్వచ్ఛంబులుగఁ జేయునగస్త్య నెఱుఁగనివారెవరు?

మ. గరువం బేదఁగఁజేసె వింధ్యగిరికిం, గండూషమాత్రంబ సా
గర మాచాంతముఁజేసె, శాపదకుఁ బొల్లావించె వాతాపి నె
వ్వ రగస్త్యుం దెలియంగఁబో రతఁడె లోపాముద్రికన్ భర్త వే
దరసంబుం జవిఁగొంచు రోహణముచెంతం గ్రాలు మౌనీంద్రుఁడై.

శున—అన్యోన్యగురుతరసత్కారంబునంజేసి యిరువురమును బ్రాయశ్చిత్తార్హుల మైతిమి.

రాక్ష—అట్లైన నఘమర్షణఋగ్జపంబుకొఱకు నాకానతియిమ్ము.

శున—గురునానతి యొసర్చినపిదప నేనును బ్రాయశ్చిత్తార్థంబు యత్నింతుఁగాని యిపుడు నిన్నొక్కమా టడుగనుంటిని.

రాక్ష—ఆజ్ఞాపింపుము.

శున—లంకకు సమీపంబున నుండు మీయాశ్రమపదంబున దశకంఠునివృత్తాంత మేమియుం దెలియలేదుగదా.

రాక్ష—శివధనురారోపణంబొనర్చి యదియె పందెముగాఁగల సీతను బెండ్లియాడు నని మాత్రము తెలిసినది.

శున—(తనలో) చులుకఁదనంబుగల మనంబున నింగితంబు వెలువరించు నితఁడు రక్కసుఁడైయుండునా! ఆఁ, రాక్షసుఁడే.

క. కడుపునఁబుట్టినికస్యం గడు జగములనెల్ల గెల్చుఁగాంచిన దశకం ఠుఁడు పురహరుచాపం బెక్కిడి పెండ్లాడఁడో కో యెట్టికీడు కటకటా.

(ప్రకాశముగా) ఏనింక మిథిలానగరంబునకుం బోయెద.

రాక్ష—నేను మత్కర్తవ్యంబు నిర్వర్తించి పిదపఁ బ్రాయశ్చిత్తంబుఁ జేసి కొనియెద. (ఇద్దరును నిష్క్రమించుచున్నారు.)

ఇది శుద్ధవిష్కంభము.

(పిదపఁ బుష్పకముతో రావణుఁడును బ్రహస్తుఁడును బ్రవేశించుచున్నారు.)

రావ—శా. ఏవి ల్లెక్కిడలేక తూలిరి ధరిత్రీశుల్ మదంబేది వీ
రావేశంబు లయోనిజాత యగుకన్యారత్నముంగోరు నా
శా వి ల్లెక్కిడఁగావలెం దొడిశరం, బాచేత మై వేడ్క ని
చ్చోఁ బవర్ధిల్లుతఁ గన్నులిర్వదియు విచ్చుందమ్మిపూఁదోఁటయై.

ప్రహ—ఇదిగో దశాననమహారాజదర్శనాకాంక్షంజేసి వేల్పులమూఁక యాకసంబునం గిటకిటలాడుచున్నది. (ఆక్షేపముతో)

శా. నీరం జిమ్ముచుఁ బోవుమబ్బుదరి కగ్నీ చేరుమా! వేఁడి చ
ల్లాఱుక్, గ్రిష్మమ! యూష్మవాయు నటు పొమ్మా! శీతుతోఁగూడ నో
మూరా! నీవును నాడిఁజల్లనగు మిచ్చో నిల్వరాఁబోకు మా
రారా! వీరుఁడు రావణుండు పరుశౌర్యంబోర్పనే యెన్నఁడుక్.

రావ—సభ స్తరుపుష్పమా! పుష్పకమా! ఒకమాట:

శా. నాకైంకర్యము సేయవచ్చిన మరున్నానావిమానంబులుక్
జీకాకై యెడమీరు వేగమున మచ్చిత్తంబు నిర్జించి సీ
తాకాంతా పురవైరిచాపములచేతఁజా వింతవిందో నిమి
క్ష్మాకాంతాగ్రణి రాజధానికి సముత్సాహంబుతోఁ నేఁగుమా!

ప్రహ — ఆకసంబను సంద్రంబునం దిరుగు పుట్టియగు నీ విమానంబెక్కి యితండు జనకుని పురంబుఁ జేరియు నేలొకో తొందరపడుచున్నాఁడు. అవుఁగాక యీతని రాక సీరధ్వజున కెఱింగించెద. (బిగ్గరగా)

శా. శ్రీకంఠుం దగఁ దన్పుఁగాఁ బదితలల్ సెట్టించు పెంజుట్లతో
డాకేల్గుంపు పదింటఁ బట్టుకొని వెంటన్ శస్త్రముల్ దాల్చి క
న్నాకై వర్తిలు లాఁతిచేతులు పదింటం గోయుచోఁ జేసె బ
ల్లీఁకన్ బాహుదశద్వయీదశముఖీవేషంబు లెవ్వానికిన్.

ఉ. అట్టిఁడు రావణుండు తనయంతన బల్మినిఁ బట్టువాఁడు నీ
పట్టిని బందెముం గెలిచి పట్టఁదలంచెడుఁ; గన్యనిచ్చుటం
బట్టి విదేహరాట్కులము పావనమై ధరయుండునంతకున్
బట్టపుదేవి నీయనుఁగువత్సయసుమ్ము విదేహభూపతీ.

(ఆకసమువంకఁ జూచి) 'పురాణబ్రహ్మవాదియు యాజ్ఞవల్క్యశిష్యుండును రాజర్షియు నగు జనకుండు పురోహితుండగు శతానందునితోఁ గూడ వచ్చుచుండెఁ గాన నందనుక నాస్థానమంటప సమీపమున సంగూరుచుండుఁ' డనుచున్నారాయేమి?

(పిదప శతానందుఁడును జనకుఁడును ప్రవేశించుచున్నారు)

జన — ఉ. యోజనసేయుచున్ శతపథోపనిషత్తులు దెల్పు బ్రహ్మమున్
రాఁజరియింతు మాకుశికరాట్సుతు నెమ్మదికేని యీయుం దురా
భోజికపాయపానపరిపూతమయైన సమాధి వీడి యి
ట్లోజ నటించు మామనమహో! తగు గానము తోడు లేకయున్.

శతా — సూర్యవంశ్యుండవగు రాజర్షీ! మీగురు వాశిషమ్ము లమోఘమ్ములు; ఏలన! భగవంతుండగు విశ్వామిత్రుఁడును నీయందు వాత్సల్యంబు పాటించుచున్నాఁడు.

ప్రహ — ( మరల వెనుకటి పద్యములు రెండును జదువుచున్నాఁడు. )

జన — అన్నా! తపోధనులకుఁగూడ సుఖప్రత్యయము నిరాటంకము కాదుగదా! ఏమన, సీతార్థియై దశకంఠుఁడుఁగూడ నగరికేతెంచుచున్నాఁడు!

శతా — ఆహాహా! ఆశ్చర్యము! ఒక్కఁడైనను గొప్పతప్పిదము గుణసముదాయమును పాడుచేయును! అంతేకదా!

సీ. ఎవనియాజ్ఞాపనం బెల్లవేల్పులనేలు దేవేంద్రుతలమీఁది పూవుదండ
యెవ్వని కోఁటపురం బీవసుంధర సాటిచూడఁగారాని లంకాపురంబు

ఎవనిభక్తి పరత్వ మీశ్వరేశ్వరునందుఁ బార్వతీపతియందుఁ బాయకుండు
ఎవనికిఁగ్రింగన్నులు వివిధశాస్త్రంబు, లుత్పత్తి వేనికి బ్రహ్మవంశమందు

గీ. వాఁడు పరుఁడౌట నెచ్చఁగావలయు నగయ ,
కాని రావణుఁడనుమాట కానిమాట,
ఉర్విలో నెందుఁ జేఁగాని సర్వగుణము
లొక్కచోఁ గూడియుండుట చిక్కుడుగద !

జన— మహాత్మా ! ఉతథ్యనందన ! సీత నిమ్మనుచు నింటికేతెంచిన లంకేశ్వరునకేమి ప్రత్యుత్తరము చెప్పుదును ?

శతా— ప్రత్యుత్తరమిచ్చి చిరకాలమాయెనుగదా !

జన— ఎవరిచ్చిరి ?

శతా— ఈశ్వరుఁడు.

జన— ఏమని ?

శతా— తనవిల్లని.

జన— ( నిట్టూర్పు నిగుడించి )

. హరువిల్లితఁ డెక్కిడు, బల్గిరిరాజం బతని దెత్తలేదే? యిది దు
ష్కరమే? నిముల కితని గొత్తురువేయని చిత్త మెఱియుచుండె మహాత్మా!

శతా— రాజర్షీ ! విచారింపకుము. తనకేలంగలచాపము మనకుం బ్రసాదంబుగా నిచ్చినపార్వతీపతి కభిమతుఁడగు సీతావరుం డెవ్వఁడో యెఱుంగము. కాని దశకంఠుఁ డీ య్యనఘుమనోరథంబున కన్యధాకరణంబుఁ గావింప నేరఁ డని మాత్రము చెప్పఁగలము. కనుక దుర్వృత్తుండయినను నామునిపుత్రుని సంభావింతము రమ్ము. ( తిరుగుచున్నాఁడు. )

జన— ( ఎదుటికిం జూచి ) మాయదృష్టంబునఁగదా పులస్త్యసంతానముం గనుఁగొనుట లభించె. లంకేశ్వరా ! యిటురమ్ము. ఈపీఠం బలంకరింపుము.

శతా— లంకేశ్వరా! ఋషిపుత్రుండవదియుంగాక దివ్యుండవు కావున నీ కే తెఱఁగున నతిథిపూజ గావింతుము.

గీ. శ్రోత్రియుం డింటికేతెంచుచో వృషభము
బొండె మేఁకనొండెను గోయుటుచితమగును
దివ్యుఁ డేతేర సుక్సుగంధినిధియగు ని
వేదనము సేయఁదగు నిది విధిహితంబు.

రావ— బ్రహ్మర్షీ శతానంద! మాకీపని యొనర్చితిరే యిదియే యతిథిపూజ.

చ. సురల గురుస్థిరాంశముల నూతినహించి, వసుంధరాసుతన్
బరిణయమాటకుం బ్రగయఘనం బయి, మున్ను ధరాత్మజాకుచాం
బరహరకర్షణక్రియల మాన్యత గాంచిన చేతులందు వ
త్సరములు వేయునన్ను పురదాహకుచాపముఁ దేరఁబంపుఁడీ.

ప్రహ— అయోనిజాతయగు సీతతోఁగూడఁ గనికొనిరండు.

రావ— మతోగ నిశ్శల్యముఁ టంబకచ్ఛలికిఁ గాంతుల్ మేసికింగోటఁ ట
త్రోగ జేఁ డానవకింకరుండఁట జగద్భర్తుండు పౌలస్త్యుఁ డిం
పుగ నీకిర్వదిచేతులన్ మొనిడిచెంబో! చిత్రమా! యగ్రజం
బ్రగతిన్ సీతను జూమవేళ విజానద్వారంబులం దుంచుమా.

శతా— దశాననా! ఇదిగో! మహేశ్వరచాపంబుఁ దేరఁబంపుమన్నాము.

రావ— (మనమునుద్దేశించి) ఓమనసా! పరిహాసం బావిర్భవించుచున్నదికాని మన్మథచాపంబు నమ్ముట కాన్పింపదు.

శతా— (విలాసముగఁజూచి)

ఉ. పవిచే నుగ్గగు పైడికొండ పొడిశేషమ్ మించు కాంతిచ్ఛటా
నివహంబుల్ నలుదిక్కులం గవిసి వన్నెం జేఁగ ఘోరాత్మకం
బవు నీ ముప్పెన్మనవాలుదాల్పు ధనువాహా! నేఁడు గావించుఁ గాం
తివడిన్ లోకమువారికన్నులకు దౌస్థిత్యస్రిదానత్వమున్.

(తెరనంకఁజూచి) కంచుకులలో నెవఁడురా అక్కడ? కన్యాంతఃపురంబున కేగి జనకరాజకన్యకం దోడితెండు.

(తెరలో) ఇదిగో! వచ్చుచున్నది. వచ్చుచున్నది.

(పిదప సీతయు నిరువురు చెలులును ప్రవేశించుచున్నారు)

సీత— రక్కసుఁడని తెలిసి భయప్రమోదంబుల సందునఁబడి తందరఁ జెందుచుంటిని.

ఒకచెలి— కుమారికా! రక్కసుఁడని వీనిం దిరస్కరింపకుము. రాక్షసచక్రవర్తిసుమీ.

సీత— అట్లయిన నెక్కువగా భయపడఁదగినవాఁడు.

రెండవది— ఏమి యాలోచించుచుంటివి? ఇతం డిచటికి వచ్చినపనియేమి!

మొదటిది— శివునివిల్లెక్కువెట్టుటకఁట.

రెండ— అట్లుచెప్పకుము. సీతను పెండ్లిచేసికొనుటకా?

(ఆకసమువంకకుంజూచి)

ఉ. లాలనసేయుమీ హయములం దగఁ బిచ్చుకకుంట ! నీవు స్వః
పాలక! తెల్లయేన్గు మెడపట్టునఁ గట్టిగఁ బట్టుకొమ్మ మీ
వ్రేళులఁ జొన్పుఁడీ సురలు! వీనుల; రావణపాణిపీడనో
చ్చాలనమాత్రభగ్నహరచాపరవంబు దిశంబుఁ బర్వెడిన్.

రావ— అహా ! దశాననానియాజ్ఞ! యీనాస్వావయవంబులకు సైతమిట్లు జితగగన చాటుకారంబగు వ్యాపారంబు సెల్లునే.

చ. అనువను మైనపట్టుదల యబ్బుటఁజేసి పరస్పరంబుఁ ద
ర్జన మొనరించుకొంచు నొకసారిగ వామభుజాదశాగ్రముల్
ధనువుఁ బరిగ్రహింపఁ బదితక్కినచేతులు నేననేన యం
చును దివిఁజెన్గులాడు పనిసుంతగు బొంచియు నారి లాగఁగన్.

(జుగుప్సావశ్చాత్తాపాతిశయముతోఁ దనలో) ఏపనియేనియు నాలోచింపక చేయుటవానికిఁ బరాభవంబువచ్చును. ప్రాకృతునివలె నప్రాకృతుఁడగు రావణుండును ధనురారోపణంబు పణంబుగా సీతం బెండ్లియాడుటకై యత్నింపఁ గూడదు.

(ప్రకాశముగా)

మ. రజతాద్రిం గదలించు టాత్మదశమూర్ధచ్ఛేదనం బయ్యతా
గ్రజుఁ గారాగృహబద్ధుఁజేయుట మొదల్గాఁ బెక్కుకార్యంబులన్
భుజశక్తిన్ బొనరించినట్టి దశకంఠుం దేవమానాపహా
రు జనం బెన్నునె ప్రాఁతవిల్లొకటి మారోపించినన్ ద్రుంచినన్.

(తిరస్కారంబభినయించుచుఁ జాపంబుఁ గ్రిందఁబడవేయుచున్నాఁడు)

చెలి— భర్తృదారికా ! నీయదృష్టము మంచిది. భవత్పరిణయాశతోఁగూడ రావణుఁడు శివచాపంబు వదలినాఁడు.

సీత— హృదయమా ! నీకు దైవంబును మన్మథుండును ననుకూలించినగతినున్నారు.

శతా— ఓలంకేశ్వరా ! చరమశైవుండవైతి, విదియేమి కొనియాడుటకుం దగని పనిఁజేసితివి ?

జన— (కోపముతో లేచి)

శా. అవంజాలరు నామనంబు సురుఁడో నాయాజ్ఞవల్క్యుండు దు
ష్కోపావేశ విగర్హణంబు బహుళశ్రుత్యర్థవేత్తృత్వమున్
శాపంబా శివచాపధిక్కరణపూర్వన్ లేక యుద్రేకియై
చాపంబెత్తుదు శాపమిత్తునను హస్తం బీజరాజీర్ణతన్.

(ఆలోచించి తెరపంకమంజూచి) ఎవఁడురా! అక్కడ. విల్లు విల్లు విల్లు. (పిదప నొకపురుషుఁడు ధనువిచ్చి మగుడిపోవుచున్నాఁడు. జనకుండును నడికట్టు గట్టి గ్రహించుచున్నాఁడు.)

రావణు—(కోపహాసములతో)

శా. వ్రాలుంగన్బొమ లెత్తి, జందెము భుజావస్థాయిఁ గావించుచున్,
గేలందాల్చిన యక్షమాల చెవిపైనింజుట్టి, చేలంబు డా
కేలం బట్టి పిఱుందుఁగప్పుచు నొగిన్ గేల్సాచి విల్లూనను న్నా
త్యాలంబున్ జనకున్ విరక్తుఁగని యాహా చెందితిన్ నేఁటికిన్.

శతా—ఆహా! మహాప్రభావుఁడగు మాయాజ్ఞాని ప్రభావము!

మ. మదిమిన్ జెప్పినయట్లు రాఁదగని యీభూపాలుపాణిద్వయం
బుదితాహంకృతిఁ జాపమెత్తుటకు నుద్యోగింపఁగా మార్వి య
య్యది మే యంచులపైఁ దగుల్కొనె, శరంబా మధ్యముండేర; ని
య్యది తద్దివ్యతపఃప్రభావమవు నాహా! యెన్నఁగా శక్యమే.

సీత—హా! ఎంతకష్టము! ఎంతకష్టము! ఉపశమైకధనులగుతండ్రిగారు విల్లూని యుద్ధసన్నద్ధులగుట చంద్రకాంత మగ్ని నార్పఁబూనుటకదా!

ప్రహ—ఓవృథావృద్ధగుదుష్టక్షత్రియుఁడా! దశాననను నుద్దేశించి చాపమెత్తుచున్నావు నిన్ను రావణశస్త్రంబగు చంద్రహాసము సైరింపదు సుమీ.

రావ—(బిగ్గరగానవ్వి పరిహాసముగా)

గీ శిథిలమై త్రుప్పువట్టిన శివునిప్రాఁత
ధనువు పఙ్క్తిముఖుఁడు దోర్మదమున విడిచె
జనకుఁ డిదిసైఁప కనికిఁజొచ్చునఁట! పోరు
తగదటంచు నవ్వుఁ డొకపెట్టు మొగములార.

జన—పులస్త్యపుత్ర! శస్త్రంబు కరంబునంబూని రమ్ము. పరమశైవుండగు జనకుఁడు నీయపరాధంబు సహింపఁడు.

రావ—ఆహా! సీతాస్నేహం బెంతగాఁ బీడించుచున్నదో! కాదేని దశవదనుం డెన్నఁడేని యిట్టిపలుకులు సహించునే!

గీ. సోమయాజి వృద్ధు మామయా వేదాంతి
యోగ్యుఁడన్న గుణము లొక్కటొకటె

నన్ను శాంతుఁ జేయుచున్నవి చంద్రహా
సంబు దాల్పకుఁడు శరంబులార !

జన— రావణా! ఇటు చూడుము. శరంబుఁ బ్రయోగించుచున్నాను. (అని బాణంబు సంధించుచుండఁగాఁ దెరలో)

శా. శాంతిం జెందుము కోపమాఁగు జనకా! సన్యస్తశస్త్రుండ వీ
వంతం బేల యాజ్ఞవల్క్యుఁడు శమోపాధ్యాయుఁడా నీవు దుః
ఖాంతంబుం బరిణామహీనమగుయుద్ధాటోపముం బూనెదే?
చింతం బాయుము చాపమున్ విడువుమా సిగ్గయ్యె నీచేఁతకున్.

జన— బ్రహ్మర్షి శునశ్శేఫ! నీచెప్పినయట్లు శస్త్రంబు విడుచుచున్నాను. (అని చాపంబును శరంబులును విడిచి) జగం బరాత్మసం బగుట కీశాపోదకంబులు విడుచుచున్నాను. (అని కమండలువు పుచ్చుకొనుచున్నాఁడు.)

శతా— ఇదియేమి? సూర్యశిష్యుఁడును భగవంతుఁడునగు యాజ్ఞవల్క్యునివలన సంప్రాప్తమయిన తత్త్వవిద్యను, నాజన్మసంభృతంబగుతపంబును వ్యయమొనరించుచున్నావు. (అని శాపోదక ముపసంహరించుచున్నాఁడు )

జన— భగవంతుఁడా! విశ్వామిత్రధర్మపుత్ర! కులగురూ! శతానందా!

గీ. హరశరాసనపరిభవ మాచరించె
వట్టి దుర్గర్వుఁడైన యీయసురరాజు
గురువు లిం దానతీ నెఱుంగుదురు తగవు
నాకు మీమాట జవదాఁట న్యాయ్యమగునె!

రావ— మిథిలేశ్వరా! ఎందుకీయాటోపము? రథసన్నిర్జితైరావణుండగు రావణుండు సుమీ వీఁడు!

గీ. తలలు తెగఁగోసికొని పురాంతకునిఁ దృప్తి
పఱచినట్టిదశాస్యుని భక్తిబాహు
బలము లగపి మునుల్ భూమిపులుఁ దపములు
శస్త్రములు వంతురనుట కసంశయంబు.

నీవు సంబంధజ్యేష్ఠుండవనియు వేదాంతవిద్యావరిష్ఠుండవనియు సైరించితిని.

చెలి— వచ్చినవాఁడా! నీమాటలు మాజనకకులదేవతలు పరిహరింతురుగాక.

శతా— నిశాచరచక్రవర్తీ! మిన్నక పొగడుకొనకుము. హరధనురారోపణంబొనరించినవాని కీపొగడ్త శోభించును గాని నీకు శోభింపదు.

రావ—(కోపముతో) ఏమంటి వేమంటివి! హరధనురారోపణం బొనర్చినవానికే గాని నాకుశోభింపదా? (ఆలోచించి) ఏమిచేయుదు!

గీ. ఋషులసభ, రాజు ముదుసలి, యేను సీత
యందుబద్ధానురాగుఁడ; నందఱచటి
వారు దోర్మదమత్తులై మీఱువార;
లైనను దశాస్యుఁ డేరీతి ననిరొనర్చు?

(ఆటోపముతో) వినుండయ్యా! నిశాచరపతి ప్రతిజ్ఞను.

చ. ధరణియు నింగియుం బగిలి దారుణమాగతి డాంకరింపఁగా
హరునిశరాస మెక్కిడి ధరాత్మజ నెవ్వఁడుగొన్నఁగాని నేఁ
గరకరఁ దద్గళాస్థికలు గ్రంధియుఁ గోయఁగ బ్రేఁతబ్రేతయు భీ
గురువగు చంద్రహాసమునకుం బలియిచ్చెద వానిరక్తముల్.

(నేపథ్యమందుఁ గలకలంబు పుట్టుచున్నది.)

రావ— ప్రహస్తా! విస్తీర్ణజలధరధ్వానలాఘవకారి యగునీరొద యేదెసనుండి వచ్చినదో కనుఁగొనుము.

ప్రహ— దేవరవారి ననుసరించుటకువచ్చిన మనరాణువల కోలాహలంబు.

(తెరలో వైతాళికుఁడు ప్రవేశించి.)

జయజయ దశాననమహారాజా! మాధ్యందినసంధ్య దేవరకు సుఖమొనరించుఁగాత.

సీ. చమరీమృగంబులు నెమరువేయుచు నమేరుల తూఁగొమ్మ నీడలకుఁ జేరెఁ
జల్లఁదనంబుకోసము మంచిగంధపుఁ జెట్టున ఫణి చుట్టచుట్టుకొనియె
ఖండితయగు కాంత ఘర్మితుండగు కాంతుఁగాంచి యీసునఁ గౌఁగిలించుకొనియెఁ
గస్తూరిలేఁడి చక్కఁగఁ బిల్లకాల్వలోఁ దీరంబు ద్రివ్వి భక్షింపఁదొడఁగెఁ

గీ. గాసరంబులు వదుల ముక్కలుబొనర్చెఁ,
గోటరంబులఁ దూఱెఁ బక్షులును, బాంథ
చయము చలివేంద్రపంక్తుఁ జనియె నతుల
చండమార్తాండమండలచండిమమున.

రావ— అట్లైన మేమును నిసర్గరమణీయంబు లగు మిథిలాపురీపరిసరారామంబుల కేగి క్రీడించుచు నిండుమధ్యాహ్నదినంబు లాత్మీయ వినోద మాస్వాదించుకొనియెద్దము

గానవో సైనికులారా !

మ. లవలీనాగలతావృతక్రముకమూలప్రస్తరచ్ఛాయలన్
స్వవధూసంఘముతోడఁగూడి కదళీపత్రంపుఁ బాత్రంబులన్
దవులం ద్రావుఁడు నారికేళజలముం దాత్యూహకేళీసము
ద్భవకోలాహలభాసురంబు లగు కాంతారప్రదేశంబులన్.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

గద్య.

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వరప్రణీతంబగు ఆంధ్రీకృత
బాలరామాయణ నాటకమున
ప్రథమాంకము.

—

శ్రీరస్తు

# బాలరామాయణము

## ద్వితీయాంకము

(అంతట భృంగిరిటుఁడు ప్రవేశించుచున్నాఁడు)

భృంగి—(పరిక్రమించుచుఁ దనవంకఁ జూచికొని) అహో! వికృతరూపమునకు సైత మొకొ్కకచోట నెక్కువసన్మానము సంప్రాప్తమగును. ఏలన:—

మ. నరముల్ పట్టుగ నున్న యెమ్ములగు నీనామేను చాముండికా
కరతాళంబుల నర్తనంబు లయగాఁ గావించుట ల్చూచి యీ
శ్వరుఁడుం దేవియుఁ బెండ్లివేళనె తత్ప్రాసంకోచముగ్ వీడి న
వ్విరి; దానం దయమానఁ డవ్విభుఁడు నాపేరెత్తినగ్ నేఁటికిగ్.

( మరలఁజూచికొని యెకసక్కెముగా ) అహో! త్రిభువనాధిపతి యనుచరుండ నగు నాకీగొప్ప వేషము.

గీ. గోచి యుత్తరీయంబు నౌకోటియె వల్క
లంబు రుద్రాక్షమాల జడలు సటలును
భస్మపుండ్రంబు నుదుటిపైఁ బాణి శూల
మిట్టివేషముగలవాఁడు భృంగిరిటుఁడు.

(ఆలోచించి) నాస్వామియగునీశ్వరునకును నాకును వేసమం దనుమంతయు విశేషంబు లేదు.

గీ. కట్టఁబుట్టంబు లేదు నాగములు నగలు
పాణిఁ బునుక గళంబునఁ బాడదండ
బూది మైపూఁత వార్వ మాఁబోతు హరుని
చరితమిది యిందుఁగతము విచార్యమెందు.

మఱియును లింగంబునను జనించె, భైరవాకారంబు వహించెఁ, దుంబురుం డయ్యెఁ, బార్వతిం బెండ్లియాడి యామె కర్ధశరీరంబొసంగెఁ, జందమామనుదలపై ధరించె, యమునిగ్రొవ్వడంచెఁ, గాలకూటంబుఁద్రావె, జంభారిభుజస్తంభనం బాచరించె, దక్షయాగధ్వంసంబుసేసె, మన్మథునిం దహించెఁ, ద్రిపురంబులుగాల్చె, మఱియుం బెక్కు దుర్ఘటకార్యంబులొనర్చె నిట్టిపరమేశ్వరుని చరిత మిదమిద్ధమని వచింపఁగ హరివిరించులు సైతము సమర్థులు గారఁక భృంగిరిటుండన నెంతవాఁడు. అయినను నమ్మహాత్ముని యనంతకల్యాణగుణంబులలోఁ గొన్ని వక్కాణించెద.

ఉ. పుట్టముఁ గట్టఁ డట్టియున మ్రొక్కుదురెల్లరు వేలుపుల్ జరీ
పట్టులుగట్టువారు; వృషభంబును నెక్కును నేన్గు నెక్కు నా
శెట్టియె మ్రొక్కెడుఁగా; నగలు చిల్వలెయైనను మెచ్చ శ్రీదుఁడే
యిట్టులు గల్మిలేములను నీశ్వరుఁడొక్కఁడె యీశ్వరుండహో !

ఆసమయమందేల యీస్తోత్రప్రపంచ మమ్మహాత్మునియానతి యొనర్చెదను గాక. (పరిక్రమించుచు నెదుటికిఁజూచి) ఓహోహో! నారదుఁడా! ఈముని కలహకుతూహలిగదా !

గీ. ఎదురుగా వచ్చె నీతఁడు కదన మొకటి
యెవరితో నైనజరగు నిక్కువము నాకు
లింగమూదయించునాఁడు పోరంగనయ్యె
ధాతకు హరికి నితనికతమునఁగాదె.

అవుఁగాక ! ఇతనివలనన రామరావణులయుదంతంబు సాంతంబుగాఁ దెలిసి కొనియెద. (పరిక్రమించుచున్నాఁడు)

(పిదప నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు)

నార — నిజము నిజము ! ఎవ్వరికైనను సహజంబగు గుణంబు విడునదు.

గీ. పోరెవ్వం డెవండింకఁ బోరుచుండుఁ
బోరనున్నాఁడెవండను తీరుగల్గు
పోరుచింతతో నువ్విళులూరు నాకు
నేఁగ నేఁగుచుండెను గాల మేఁగనుండె.

మ. వరమల్ ప్రదిల్లినవారువంబులుఁ గృపాణధ్మాతధారానిశ్
త్రరణత్కార్వదనేకపంబులు సదాధావత్కబంధోద్ధత
త్వరదాట్యంబులు గల్గు భీషణపుయుద్ధంబుల్ దివారాత్రముల్
సరిగాఁ జూచుటకై జగత్త్రితయసంచారంబుఁ గావించెదన్.

(ఆలోచించి) అందఱును దనకుఁ దనకుఁ బ్రియం బగుపని నగ్గించుచు లాఁతి పనుల నిరసింతురు.

క. యుద్ధంబ పరబ్రహ్మము యుద్ధంబ తపంబునాకు యుద్ధమ జపమూ
యుద్ధమ యాగాదికమగు నుద్ధతయుద్ధంబ చూచుచుండెద నెపుడున్.

ఏదియో యొకదానియందు వ్యసనముగల మనుజున కది తటస్థింపనియెడలఁ దత్ప్రతినిధియైనను వినోదకరంబగుఁ గావున నేనును:—

గీ. వీరయుద్ధంబు దొరకని వేళలందుఁ
జేతులాడఁగ గోరులఁ జెనకుకొనుచుఁ
గవిసి కామినులొనరించు సవతిపోరు
వినియుఁ గాంచియు నానందవిధముఁగాంతు.

మఱియును,

గీ. లావుకంబులు తీతువుల్ మహిషములును
గుక్కుటంబులు మేషముల్ గూర్చుపోరు
సతతామోదకరముగా సంచరింతు
హరికి బ్రహ్మకుఁ బోర్వెట్టినట్టియేను.

గీ. వీరులకుఁ గత్తిపోట్లు చేకూరకేని
కరులకును దంతములురాల విఱిగకేని
బులులగోరులు వగిలి చేటొలసకేని
సంతసముఁజెందుఁ గలహభోజనుఁడు మఱియు.

చ. హరిగనెఁ బాదురూపము, బురారి యడంచెఁ బ్రసూనబాణు, ని
ర్జరపతి పోరిలో నురుఁగు శస్త్రముగాఁ గొని వృత్రుఁజంపె, భూ
ధరసుత కాళినాఁ బరమదారుణరూపముఁ దాల్చెఁ బోర మే
ల్చిరమర గల్గు నారదుని చేయువ్వ లి వన్నియు నెంచిచూడఁగన్.

ఇప్పుడే నామనోరథసిద్ధి కాఁబోవుచున్న దని తలంచుచున్నాను. తనగండ్రగొడ్డలి యాచించుటయుఁ బరమేశ్వరు నధిక్షేపించుటయు నున్నగు నకార్యంబు లొనర్చిన దశకంఠు నెదిరి జయించుటకై పరశురాముండు మిథిలాపురంబున కరిగెనని యతని శిష్యుండగు మాతరుండు నాకుం దెలిపె. (ఆలోచించి) కావున నేనును జనకపురంబునకేగి రామరావణుల కిర్వురకును నలుకలు రెట్టించి నామనోరథంబు సఫలీకరించుకొనియెద. (అని పరిక్రమించుచున్నాఁడు)

భృంగి — (వేగముగాఁ గొన్నియడుగులు నడచి) సురమునియగు నారదునకు స్వాగతము.

నార — ఓహోహో! మహాదేవానుచరుండగు భృంగిరిటుఁడా? (దగ్గఱకుఁబోయి) భృంగిరిటా! నీకు శుభమగుఁగాక. ఎచటికిఁ బ్రయాణము?

భృంగి — విక్రమాగ్రగణ్యులగు పరశురామరావణు లున్నయెడకు.

నార — ఓ ప్రమథప్రథమా! బాగుబాగు. మంచిమాట స్మరింపఁజేసితివి. వచ్చెదిని ముందు రామరావణులలో నెవ్వ రెక్కుడో చెప్పుము.

భృంగి — మునీంద్రా! హెచ్చులొచ్చులు చాలఁగలవు.

చ. ఇరువదియొక్కమాఱు ధరణీంద్రులఁగెల్చిన జెట్టి తాపసే
శ్వరుఁ డఖిలాగమంబులకుఁ జక్కనిభావముఁ దెల్పు పీఠకా
గురువు స్వమాతృఘాతుకుఁడు కోరినమానికి భూమియెల్ల న
ధ్వరియయి యిచ్చినట్టి యతిదాత నుతింపఁగ రాముఁ డల్పుఁడే.

నారద — ఈశ్వరానుచరా! విక్రమంబున రావణుండును లాఁతియోగులచే వంచింపఁదగినవాఁడు కాఁడు సుమీ.

ఉ. పుట్టిరి పుట్టఁబోవుదురు పుట్టియయుండిరి కాని యట్టిమే
లట్టులు మూఁడులోకముల దబ్బఱ, రావణు మీఱలుంగరే
గట్టితపంబునందుఁ దనకంఠము లన్నియు నిచ్చినట్టి యా
జెట్టికి శూలి సుంతయని సిగ్గరె లోకము లన్ని యిచ్చియున్.

భృంగి — మునీంద్రా! నీవనినమాట సత్యమే కాని—

శా. కైలాసంబుఁ గదల్చె నొక్కఁ డొకఁడా క్రౌంచాద్రి భేదించె స్వః
పాలుం గెల్చె నొకండు హైహయునిఁ జల్పాదించె నన్యుం డొకం
డాలంకం గొనె శ్రీమగెల్చి యితరుం డాకొంకణం బందె నిం
కేలా యిర్వురకుం జయేందిరయు సామీప్యంబునం గాంచెదున్.

నారద — (సంతసముతో హస్తంబెత్తి)

ఉ. కంటికి విందు నిర్జరతఁ గైకొన పెద్దశుభంబు ముత్తిపే
రింటికి దల్పులేని తెర వేను ముదంబు వహించు భేషజం
బొంటరి రామరావణులయుద్ధము కోరింబతులన్ బరించు వా
ల్గంటులతోడ వచ్చి సురలార! కనుంగొనుఁ డేను జెప్పెదన్.

భృంగి — యుద్ధైకరుచీ! నారద! ఊరక లేనిపోని సంతసముఁ జెందకుము. మహాదేవుండు తనవిల్లు నిరసించె ననియుం దలంపక రామరావణుల సంగరంబు మాన్పింపుఁడని ఋచీకపులస్త్యసహితంబుగా నన్నుం బనిచెఁ గావున నీమనోరథమునకు విఘ్నంబు కలిగె.

నారద — (విషాదముతో తనలో) అయ్యో! అతికష్టముగ మొలచిన సంతోషవృక్షంబు వెనువెంటనే నశియించె. అవుఁగాక రావణునకు శ్రీరామునితో పోరుట లేకపోయినను మఱియొక రామునితో నైనను గయ్యంబుఁ బురికొల్పెద. కాదేని యీరామునికి మఱియొక రామునితో నైనను జగడంబు వెట్టెదఁ గావున నిప్పుడే

యయోన్య కేగవలయును (ప్రకాశముగా) భృంగిరిటా! ముల్లోకంబులవారి కైనను శివుని యాజ్ఞ దాటరాదు. నేను మాతండ్రియింటికిఁ బోయెద.

భృంగి— నేనును బ్రస్తుతకార్యంబు నెఱవేర్చుటకై యత్నింతు.

(అని నిష్క్రమించుచున్నారు.)

(పిదప రావణుడును బ్రతీహారియుఁ బ్రవేశించుచున్నారు)

రావ— చ. చిలుకగవున్నచో సుధ రుచింపదు, నెమ్మొగమున్నచోట వెం
పలు శశి, కన్నులున్నఁ దొగ లందముఁ దక్కును, బుక్కలున్న నే
త్తెఱచెడుఁ దేనె, మేనిపస డించును బంగరుతేజు నిక్క మ
త్తెఱవ సృజించి ధాత సరితీరు సృజింపఁగ నేరఁడయ్యెడున్.

ప్రతీ— ఈదశాననుం డిప్పటికి నాగోడయుండే యాచిత్తరువేవాడ్రియుచు గాఢాభినివిష్టుండై యున్నాఁడు. మదనుండు మాత్ర మితనియెడ శరమన్యపతన పాతంబుఁ జూపించుచున్నాఁడు. ఓమన్మథా! సకలజననింద్యనీయుండవగు నీవు దశాననున కనుగ్రహంబు రాఁదగిన సమయమందును నింద్రపతనపాతంబు విడువక రావణునిం దాడించుచున్నావు. సీతపై దయఁబూనుచున్నావు. చాలుఁజాలు. ఇది నీకుం దగినపనియే. (ప్రకాశముగా) దేవా! మాయామయుఁడు ద్వారమందున్నాఁడు.

రావ— (వినక) ఓమదనా! యెంతదుర్మార్గుండ వైతివి.

గీ. నన్నుఁ బీడించుచుంటి వైనను సమస్త
సురలలో నాకు నీవ యిష్టుండ వో న్మృ
గాంకబాంధవ! రావణునం దమర్చు
బాణములు సీతపైఁగూడఁ బఱపుచుండె?

ప్రతీ— దేవా! మాయామయుఁడు ద్వారమం దున్నాఁడు.

రావ— (వినక) అయ్యో! మదనునిచెయ్వు లనేక విధంబులుగా నున్నవిగదా! ఏలన, నే నావైదేహినిఁ జూచినది మొదలు—

మ. వికసించు న్ముకుళించు నున్ముఖముగన్ వీక్షించు మూయున్ నగున్
జికిలించు న్మరలున్ భ్రమించుఁ గదలున్ క్షేపించుఁ గుందున్ సము
త్సుకతా మించు హరించుఁ బ్రేమ లుదయించు న్నీరసించుం జలిం
పకయుండున్ బొమలెత్తు లోచనము లవ్వైదేహిపైఁ బేరిమిన్.

ప్రతీ— (తనలో) మందోదరీస్నేహంబును గూడ వదలిన యీతని యుల్లాపంబు లన్నియు సీతామయంబులుగా నున్నవి. అప్పుఁగాక, నిసర్గదుస్సహంబగు పరశు రాముని పేరు తలంచి యీసీతావేశంబు మఱల్చెద. (ప్రకాశము) దేవా! పరశు రాముని యొద్దనుండి వచ్చినాఁడు.

రావ— మాయామయుఁడా? అట్లైన శీఘ్రముగఁ దీసికొని రమ్ము.

(అంతట మాయామయుండు ప్రవేశించుచున్నాఁడు.)

రావ- మాయామయా! గండ్రగొడ్డలి యడిగినఁ బరశురాముండేమి ప్రత్యుత్తరమిచ్చె

మాయా— ఓ త్రైలోక్యమాణిక్యమా! రావణ! పరశురాముండు నిన్నుద్దేశించి నాతోడం బల్కిన పల్కు లాకర్ణింపుము.

చ. పరశువు గోరనంపితివి పల్మఱుఁ బేర్మి నటంచు మోదమున్,
హరునిప్రసాద మీఁదగనిదంచు విచారముఁబట్టె నాకు; భూ
సురులకు మున్నె యిచ్చితి వసుంధర; స్వర్గము నాగలోకముం
దిరముగ గెల్చి యిచ్చెదను నీ కవి కావలెనేని రావణా.

రావ— ఏమీ! పరశురాముఁడు రసాతలత్రిదివంబులు జయించి యిచ్చువాఁడును రావణుండు పరిగ్రహించువాఁడునా! తరువాత నీవేమంటివి?

మాయా— నక్తంచరచక్రవర్తి! యిదె యిదె చెప్పుచున్నాను.

చ. హరునకు శిష్యుఁడైతి పటులైనను నిర్వదియొక్కమారు భూ
వరులజయించి తట్టయినఁ బల్కెదనొక్కటి విన్ము నీవు కం
ధరమున నీకుఠారమునె తాలిచి మాదశకంఠుమౌళులన్
గరములు మోడ్చి వచ్చుటది గాంచఁగలన్ భృగువర్ణసత్తమా.

రావ— (అనుగ్రహముతో) మాయామయా! యిట్టిపల్కులు పల్కుటకు నిన్ను వదలిన మఱియెవ్వరు సమర్థులు, తరువాత తరువాత?

మాయా— (ఊరకొనుచున్నాఁడు)

రావ— ఒక రన్నపల్కులకు నీకింత సందేహమేల చెప్పుము.

మాయా— నోటికి వచ్చినట్లు ప్రేలుట బ్రాహ్మణులకు నైజము. అట్టిమాట లుచ్చ రింపరాని వైనను దేవరయానతింజేసి మనవిచేయుచున్నాను.

క. "ఈ రానిదనక గొడ్డలి గోరితి వనికిం, బురారి గురుచాపతిర
స్కారముఁ జేసితివి పరశుధార నిను సహింపదోరి దశవదన యిఁకన్."

రావ—(కోపహాసములతో) గట్టివాఁడవు చక్కనిమాట చెప్పితివి. 'ఇచ్చవచ్చినట్లు ప్రేలుదురు బ్రాహ్మణు'లని. క్షుద్రక్షత్రియవిజయి యగు నయ్యధముఁ డీనాఁడు నీ దనచాపల్యంబునకు ఫలం బనుభవించునుత్తే.

మాయా— ముజ్జగంబులం దనకుం దగిన వీరుండు లేఁడని యాబ్రాహ్మణవీరుండు పొగరుకొని యున్నాఁడు.

రావ— ఎక్కడ నున్నాఁడవురా ! బ్రహ్మవీర !

మాయా—(తనలో) మన ప్రభువుగారు కోపించుచున్నట్లు తోఁచుచున్నది. అప్పుఁగాక. ప్రాణముపోయినను భృత్యు లనుచితాలాపంబు లాడఁగూడదు.

చ. క్రతువిధి బుత్త్విజుండయిన కాశ్యపమౌనికి భూమియెల్ల యి
చ్చి తివిరి చండమార్గణవిశీర్ణజలంబగు సాగరాంతర
క్షితి నలభార్గవుం డనఁటిచెట్లులు గొబ్బరచెట్లులున్ ఫణి
వ్రతతులు పోఁకలేలకులుఁ బండెడుదేశమునందు నుండెడున్.

రావ—అటులేని మన మీమిథిలనుండి లంకకుం బోవునపు డుత్తరమువైపునఁ దటస్థించును.

మాయా—సహజక్రోధుండగు నారేణుకాపుత్రుం డిచ్చటికే వచ్చినట్లు తోఁచుచున్నది.

రావ—అట్లయిన మిగులఁ బ్రియంబు, మిగులఁ బ్రియంబు.

(తెరలో)

చ. చిలువలతాల్పుదేవతకు శిష్యుఁడు భార్గవమౌని గండ్రగొ
డ్డలిమొన నిప్పుమంటల హుటాహుటి రాజులనెల్ల వేల్చి పే
ర్వేలసినవాఁడు వచ్చె, గురువిల్ నిరసించె నటంచుఁ గిన్కమైఁ
గలఁగుచు; రావణుండెచటఁ గ్రాలెనొ పూనుతఁ జంద్రహాసమున్.

రావ—(విననియట్లభినయించి)మాయామయా! హాస్యంబులకై యనుచుంటివా యేమి?

మాయా—మహారాజ ! అసత్యముగాదు.

రావ—మదనతాపంబున నసిమిసియెత్తిన యీభుజదండమండలంబునకుఁ గొంత వినోదంబుఁ గావించునుగాక.

మాయా—ఇదిగో ! పరశురాముఁడు సహాహస్తాస్ఫాల్యమానమార్గణామనోహరంబగు రవంబుతో వచ్చుచున్నాఁడు

ఆత్మహత్యయొనర్చ్వా రందుఁజొత్తు
రనివచించుట యెుఱుఁగవె యాప్తవాక్య.

రావ—ఓరీక్షత్రియాపుత్ర! బ్రాహ్మణుండవుంబోలె వేదార్థము మీమాంసించుచు వేదత్రయమును బాడుచేయుచున్నావేమిరా! యీయపరాధంబునకై రాజగు రావణుఁడు నిన్ను దండించుఁజుమీ!

పర—(నవ్వి) అబ్బో! రాజుగారికింగలవర్ణాశ్రమధర్మవివేకము!

గీ. సకలలోకమువారికి జననిజాతి
తమకు ఘటియించు నంచు వేదములు సెప్ప;
నిగమవేత్తలు స్వాధ్యాయనిరతులునగు
తాపసులకళ్లను ఘటించుఁ దంద్రిజాతి.

రావ—నీవనినట్లయినఁ గావచ్చును.

పర—బడబానలంబునందుఁ గాష్ఠానలం బస్తమించు టాశ్చర్యమాయేమి?

చ. హరువికరంబునం దునికిసైనకళంబునఁ బూతమై గజా
సురుని వధించె నెన్నె పరశుప్రవరం బది సర్వశస్త్రికా
గురువగు దానితేజమునమన్ సరిగాన జగానఁ గాన న
బ్బురముగఁ జందహాసముఖముల్ తదురుప్రభ నస్తమించెడున్.

రావ—ఈకుతారమా! మా చంద్రహాసంబునకు విలయంబుఁ జేయునది! భగవంతుండగు ఖండపరశుండు విరిగి ముక్కయిన యిది తనయొద్దనుండుట యమాంగల్య కరంబనియెంచి కదా నీకొసంగె. తపంబుఁ జేసికొనువాఁడవు గాన సమిత్కుశాదిహరణంబునకైన నుపయోగించునులే.

పర—ఔనురా! రావణ! భగవంతుండగుభర్గుని యనుగ్రహంబు స్మరింపంజేసితి వీకుఠారంబు తపంబుఁ జేసికొనుతఱి సమిత్కుశాదిహరణంబునకే కాదు యుద్ధం బొనర్చుతఱి దుర్మదరిపుకంఠకాండఖండనంబునకుం గూడ నుప యోగించును. చూడుము దీనిప్రతాపము.

రావ—శివునికరంబునం దున్నసమయమందు మాత్రమీకుతార మటువంటిదే. ముత్తెపుఁజిప్పలయందుం బడినసీటిబిందువులు ముత్తెములుగా మాఱునట్లాధారము ననుసరించి యాధేయమునకును గుణాధిక్యము లభించునులే.

పర—నిశాచరచక్రవర్తీ! నీవన్నమాట సార్వత్రికము గాదు. సలిలగర్భంబునం బ్రతిఫలించినను సూర్యమండలంబు దురాలోకం బగుగతిఁ బరశురాముని చేతంబడి నను నీపరశువు సారవంతమే యనుకొనుము.

రావ—అట్లే యొప్పుకొనియెద. దుర్నిషేధము కాదేని దల్లియగు రేణుకాదేవి తల యెట్లు ఖండింపఁగలుగు ఓరీ! బ్రహ్మబంధువా!

గీ. ధరణిధరపుత్రి సొబగుటద్దంబు దంతి
దైత్యమౌళిమణీశాతధారము నగు
గండ్రగొడ్డలి రేణుకాకంఠరుధిర
శాదితంబుగఁ గని యేరు జాలిపడరు?

కటకటా! చంద్రశేఖరస్వామీ! తనశౌర్యంబు తల్లియెడంగూడఁ జూపునీ క్షత్రియధర్మం బితని కెగురు నుపదేశించె! భార్గవా! మాతృవధంబొనరించినను నీవు సర్వజనాదరణీయుండ వైతివి! ఔరా! లోకయాత్రయెంత స్వతంత్రమయినది! లేక దుర్మార్గులకేనియు సత్పురుషసేవ యెంత ఫలప్రదము!

గీ. అమరవందితచరణాబ్జుఁ డైనచంద్ర
శేఖరుఁడు గౌరవము దయసేయుచున్న
బ్రహ్మవర్చసవంతులు వజ్జలైన
నుండఁగానీరు పరశురాముండ! నిన్ను.

ఐనను నీతో నిట్లు పల్కుచున్నాను.

మ. ధమరాచార్యుఁగ నప్పురాసురనిహంతం జేరి, తత్కార్తవీ
ర్యునిఁ జక్కడితి, వుంటి వమ్ములను నీరుంజిమ్మి మున్నిటిభూ
మి నిదెల్లఁ శుభమైన రేణుకతలం బీడించి తాఁగంటుఁజెం
దిన నీగొడ్డలితోడఁ బోరు త్రివగాదే చంద్రహాసానికిన్.

పర—నిసర్గదుస్సహంబగుపరశురాముని కుఠారముతోడ మార్కొంటకుఁ దల పెట్టిన నీచంద్రహాసంబునకు సిగ్గెక్కడిది?

శా. రేవాతీర్థములందు నైకవిధనారీహస్తయంత్రోచ్ఛ్రితాం
భోవల్లీతతి వాడు హైహయుఁడు నిన్నొక్కమిగావించెనో
యావార్తల్ స్మరియించితే? రామభుజవాహ్యం బీకుఠారంబు త
ద్గ్రీవాబాహువు లేమిచేసె నదియెంతే కైకసీపుత్రకా?

ప్రతీ—(తనలో) రాక్షసులకుఁగూడ రాక్షసుఁ డున్నాఁడనుట యిదియే కాఁబోలును.

రావ—(నవ్వి) మనుజుండు రావణునకుఁ బరాభవంబుసేయువాఁ డనుటమాత్రము చాల దొడ్డమాట. ప్రతీహారీ! ఋచీకపౌత్రుండగు పరశురాముఁడు

యుద్ధముఁ జేయఁదగినవాఁడుగాని వృథాదోషంబు లారోపింపఁదగినవాఁడు కాఁడు. (ఆలోచించి) శాత్రవులు దండనమునకుం దగినవారుగాని సామముఁ బ్రయోగింపఁ దగినవారు కారు (చేయెత్తి) భార్గవా! భార్గవా! నిశాచర చక్రవర్తి యస్త్రములు దాల్చనివారిపై బాణము విడువఁడు. వీరవ్రతచరిత్రోత్కర్ష కంతరాయంబు లేదేని—

ఆ. కరమునందు ఖండపరశుపరశ్వధం
బేని హరిశరాసమేని యిపుడు
తాల్పు; మంతదనుకఁ దాల్పదు నాచేయి
చంద్రహాస మోయి జామదగ్న్య!

పర—ఏమిది! సముద్రోదక పానంబునకై బడబానలంబుం బ్రార్థించునట్లు పరశురాముఁడు సైతమిట్లు వచింపఁబడుచున్నాఁడు.

మ. అమరుల్ వజ్రియు వెండికొండతలపైయం జెక్క దర్పింప మ
ధ్యమునం భర్గుఁడు పుత్రశిష్యకుల యుద్ధౌచిత్యముం జూడ దం
తిముఖుండుం బ్రమథుల్ సహాయులగువానిన్ స్కందు నోడించిన
ట్టి మహావీరునితోడఁ ద్వాదృశు లనిం డీకొందురే రావణా.

రావ—ఇయ్యది గురువున కొసంగందగిన గురుదక్షిణ గురుపుత్రున కొసంగితివి! గురువునందుంబలె గురుపుత్రునియెడ నడచుకొనవలయు ననునీతిఁ జక్కఁగాఁ జదివితివి కాఁబోలు.

పర—నీవెఱిఁగినట్లు శత్ర్వర్థ మితరులెఱుఁగరు. గురువునందుంబలె గురుపుత్రుని యందుఁ బ్రవృత్తి నీకేకలదు. మేము శాస్త్రవాసన లేనివారము. మావలు కిట్టిది!

ఉ. నీవును రాజరాజువలెనే నలకూబరుతండ్రివౌదు, రం
భావనితాంగి కీవు నలకాధిపుఁడుంబలె మామవౌదు; విం
కావలిమాట నాకు హృదయంబున నుండియు బైటరాదు పా
పావహమాట నిట్టు లనినందులకే శివు సంస్మరించెదన్.

రావ—ఒరులవిక్రమంబు సహింపలేనివారేదియో యొకయపవాద మెదిరిపై మోపుచుందురు.

గీ. గజముఖుండును నందియుఁ గమలవైరి
యును సహాయులుగాఁ గలరని కుమారుఁ

దకట నిన్నుఁ దండ్రిశిష్యుండ వనియు వదలి
నంతనే నీవు విజయంబునందితోయి.

పర — దశకంఠా! అహ్హా! పరశురామునివాక్కులయందును సత్యాసత్య విచారము సేయుచున్నావు! నీళ్లు భేదింపని వస్తువులును దురాత్ములు దూషింపని మహాత్ములును లేరు.

పర —

గీ. హరుఁడు జనకుండు జనయిత్రి గిరికుమారి
వారితో నేమి మద్బాణదారితాగ్ర
చంద్రకంబగు నెమ్మిపింఛంబు బర్హి
ణాహ్వానుం డోడె ననుట కిప్పటికి సాక్షి.

రావ — ప్రత్యక్షప్రమాణమునే పరిగణింపని బుద్ధిమంతున కనుమానప్రమాణమున నాయాదరముండునా? (కరమునందు ఖండపరశుపరశ్వధం బను పద్యము మరలఁ జదువుచున్నాఁడు)

పర — అపకారంబు సేయఁదలఁచియు నుపకారంబే యొనర్చితి; వేలన నీసంగతి స్మృతికి వచ్చినది.

మ. పతిచాపంబుఁ దిరస్కరించితని కోపస్వాంతయై యున్న పా
ర్వతివక్త్రంబున నైజకాంతి మసఁగం బర్వంగఁ బచ్చాపధి
క్కృతిఁ గావింపఁగ మేటియైన కరమేదీ తెల్పు మీ గొడ్డటన్
గ్రతుభుగ్బృందిక లందఱున్ బాగడఁగా ఖండించెదన్ రావణా.

అట్లుఁగాదేని యొక్కఁడపచారంబు సేసినఁ దత్సహచారు లందఱును నపచారంబు సేసినవారే కావున—

శా. కైలాసాచలచాలకంబులును సంగ్రామస్ఫురచ్చంద్రహా
సాలంబంబులు యుద్ధసంచకితరంభాలింగనానందధా
రాళంబుల్ భవదీయబాహులు కుఠారచ్ఛిన్నహస్తాగ్రముల్
గావించుం దనువల్లి నిష్కమలనాళంబైన నీరేజినిన్.

రావ — అట్లేని నిన్నుం జేరఁదీసిన ప్రమథనాథుండు దిక్కుమాలినవాఁడు కాఁడు. భవానియు నవమానంబుచే వంచినతల నిఁక నెత్తఁగలదు. (ఆలోచించి)

ఉ. యక్షపతిం జయించి సురయానముఁ దెచ్చినజెట్టి సేసతా
ధ్యక్షుని బందిపెట్టిన మహాభుజుఁ డమ్మలసంచి వల్కలం
బక్షపుమాల గొడ్డలి శరాసనముం గల మౌనితోడ నే
కక్షవహించెనా యని పకాలున నవ్వు దశాననంబులున్.

శర— బలివధూపరీక్షితపరాక్రముండ వగునీవు మావంటివారలను మానులని యాక్షేపింపవలసినదే.

మ. మునుపాతాళమువంక కేగుతటి నామం బాపఁగా నవ్విరో
చనుకోడం డ్రురు వేడ్క నీతలలపైఁ జప్పట్లు వాయించుచున్
నిను నాడించిరి చేతులందు విశసన్నీలోత్పలాకారలో
చనలై జ్ఞప్తికివచ్చునే యిపుడు తత్సందర్భముల్ రావణా.

రావ— ఆఁ. అంతయును యథార్థమే. భార్గవునిపగిది రావణుఁ డాఁడువాండ్రపై భుజశక్తిఁ గనఁబఱచువాఁడు కాఁడు.

శర— రావణునిపగిదిఁ బరశురాముఁడును జతుష్పాజ్జంతువులపైఁ బౌరుషంబుఁ జూపఁజాలనివాఁడు కాఁడు.

ఉ. కోఁతిగదా సురాధిపునకుం దనుజుండగువాలి చంకలో
నీతలలన్నియుం దిగిచి నీరధు లన్నిటియందు వార్చునాఁ
డూఁతములేక యార్పెడల కుక్కిరిబిక్కిరియౌ మొగాలతో
నే తడవుంటివోరి రజనీచర యెవ్వరెఱుంగ రింతయున్.

రావ— (క్రోధహాసములతో) మూఢబుద్ధులు చెప్పినసంగతియే తెలిసికొనలేరిఁక సత్యాసత్యము లెట్లు వివేచింపఁగలరు.

క. సగమాఁడుని సగము మగండగు శంభునివిల్లె విఱచు టనభిమతం బీ
జగతీవీరున కింక వడుగుపయి వానరముపయిఁ బడునె యంపగముల్.

శర— దశాననా! యిట్టి యద్వాతద్వావాక్యంబులతో నేమిప్రయోజనము! భార్గవుండు వీరులవిషయమై జాతిపరీక్ష సేయఁడు.

క. పురుషునకెపుడుఁ బ్రతిష్ఠాకర ముత్తమచరిత్ర మగునుగాని కులముగా
దరయము కుంభభవుఁడు సాగర మాచమనంబుసేసి కనఁడే కీర్తిన్.

రావ— ఓరీ! దుర్ముఖ బ్రహ్మచారి! వైఖానసపక్షీ! ప్రతారితపురాంతకాచార్య! వసుధారానిక్షత్త్రజననీకంఠసీమా! మూర్ధాభిషిక్తమూర్ధరుధిరజలనివాపాం

జలి తర్పిత పితృకా! క్షత్రియాగర్భపాతనమహాపాతకీ! ఇదిగో! దశాననుండ స్వదోర్దండసామర్థ్యముం జూపించుచున్నాఁడు.

గీ. మాతఁ జంపినయట్టి నీమస్తకంబుఁ
దూఁడు నఱకినరీతిగా నూడనఱకి
నిష్కృతిఁ గావించుకొను మరుస్నేత్ర్యమాళి
శాతధారము చంద్రహాసము కడంగి.

చ. కలితజయాంకవర్ణములుగా సురదంతిశిరంబునందు రయే
టులిడిన చంద్రహాసము వటుక్ నిను పాఱని జంపునే? యటు
ల్నిలుపుము వామపంచకకనిష్ఠకరాంగుళులం గనిష్ఠికాం
గుళినఖమే భవచ్ఛిరముఁ గూల్చు రణాన్నిగమంబు వంచకా.

పర — రేరే పునరుక్తాకార! దురాచార! నిశాచరాధమ! విరించికులకలంక! లంకోపపతీ! కుబేరశాత్రవా! పాతకీభూతకరాసీ! అభిలషితరంభాపరిరంభా! దాక్షాయణీప్రణామపరిహారీ! ఏదీ నీదోర్దండమండలీ సామర్థ్యముఁ జూపుము.

రావ — (నవ్వి) భార్గవుఁడు రావణునిబలంబును దనబలమువంటిదే యనుకొనుచున్నాఁడు కాఁబోలును (తెరవంకఁజూచి) పుష్పకమా! యిటురమ్మా

పుష్పకము — (ప్రవేశించి) ఇదిగో వచ్చితిని

రావ — (సగమెక్కియు సగమెక్కనిగతి నభినయించుచు) ఆహాహా! వీరులకు ధర్మముగాని యాచారము నవలంబించుచున్నానే! (అని దిగఁబోవుచున్నాఁడు.)

పర —

ఉ. ఈయన పాదచారి యయిరే యనిసేయఁగ నే నిటుండుటల్
న్యాయముగా దటంచు నరయానము డిగ్గకుమో దశాస్య! క
ర్ణాయతనేత్ర లప్సరస లందఱుఁ గ్రిందికిఁ బైకిఁ గ్రిందికిన్
డాయు శరంబులం గని ముదంబువహించుచు నుంద్రుగావుతన్.

రావ — నీకు యుద్ధ మభ్యస్తమైనదిగాదని యిట్లు రాదలఁచితినిగాని వేఱొండుగాదు

పర — పశుపతియూ ననుగ్రహింపనినన్ను నీ వనుగ్రహించెద వేమీ, నీకరుణ! నా కభ్యాసములేదని యేల నుడివెదవు.

గీ. నీవు నేర్చినకొలఁదిగ నీశరంబు
లేసి నంతకు హెచ్చుగా నేగలేవు
హరునిశిష్యుండ నైన నాయంబకములు
సకలదిక్కుల నేగు నిస్సంశయంబు.

రావ— అట్లైన యుద్ధంబుసేయుటతోఁ బురారి శిష్యసాహాయ్యం బొనర్చును గాఁబోలు ! చేయనీ. (ఇరువురును శరములు ప్రయోగించుటకు నుద్యుక్తులగుచున్నారు. అంతట సశిష్యులగు ఋచీకపులస్త్యులతో భృంగిరిటుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

శిష్యు—(ఎదుటఁజూచి) అఖండపిండితశిఖాసంఘాతచండీకృతచిత్రభానుబింబంబులును దత్తత్క్షణోపనతదాహోత్తరణతారతరజాత్యకాంచనమయకేతుదండంబులును నమందస్వచ్ఛందసంపతితజటిలజ్వాలావళీప్రక్షాలనసవిశేషసముజ్జ్వలదగ్నిరాశిచయసంస్థితధ్వజపటాడంబరంబులును నిబిడోష్మప్రాగ్భారభారపరిగమంబునందును నమ్లాయమానసరసోత్పలావిచ్ఛిన్నకోకనదపరికరంబుచే విరాజమానంబులు నగువిమానంబు లట్టిటుసంచరించుచున్నవి! ఇది యేమివింత !

ఋచీ— నాయనా ! శాఙ్ఖాయన !

చ. గగనము సర్వము౯ మెఱుపుగచ్చొనరించినభాతి నుండె నిం
పుగ మణిదేవయానముల మూసల మేల్కిటికీలలో మెడ
ల్దగిలిచి చూచుచుండిరి బుధప్రమదల్ మనకుఱ్ఱ లిర్వురు౯
జగడములోన నగ్నిమయశస్త్రములం బరఁగించిరేమొకో.

పుల—(బాగుగఁజూచి) సఖా ! ఋచీక ! నాయూహయు నీయూహనే యనుసరించినది.

చ. ఒలసెడు నొక్కచో నొకఁ డిఁకొక్కయెడం బడి, యిట్లులోకము
ల్దలఁచుచు నేకమై పడునొకండు ధనుర్ధ్వను లాలకించి తే
కలనువొనర్ప రామదశకంఠులు చొచ్చిరటంచు నెంతుఁ బే
శలకుశనిర్ఝరీకుచకచగ్రహచంగములైన చేతుల౯.

శిష్యు—అమందసిందూరసుందరితకుంభస్థలప్రాగ్భారభాసురంబులును బ్రచండముండమండలీమండితతుండాదండడంబరోడ్డామరంబులును బ్రవృత్తమదధారాధోరణీనిరుద్ధరేణురమణీయమార్గంబులునుగళగుహానికుంజపుంజితనిర్జితజలదజాలస్తనితవిస్తారంబులును నగుగజసముదాయంబు లట్టిటు సంచరించుచున్నవి.

భృంగి——భద్రీ! దాక్షాయణి! బాగుగ నిరూపించితివి! రావణుండు వారణాస్త్రం
బుఁ బ్రయోగించినాఁడు. ఏలన!

చ. గులగులలాడు పెంగళ్ళపుఁగూఁతలు మ్రోగఁగఁగ డిండిమధ్వనిం
దలఁకుచు దర్పహేలలు సదా చెలువారఁగ మావటీంద్రతో
మెలఁగుచు నంకుశద్విగుణమూర్ధములం దవరారు దంతిప
ఙ్క్తులొదవె లోలకేతువులతో జలశీకరపూరితాశలై.

శిష్యు——ఉత్తుంగలాంగూలాగ్రసమాలింగిత గగనోత్సంగంబులును ఘనఘోణఘుర
ఘురాఘోషఘుర్ఘరితగళగుహాకుహరస్ఫారగపుల్లగల్లస్థలికరంబులును విద్యుత్పిం
జపింజరితదృష్టిచ్ఛటాకటాక్షదుష్ప్రేక్షంబులును నగుసింగంబు లివిగో వచ్చు
చున్నవి.

పుల——వారణాస్త్రప్రతిద్వంద్వియగు పంచాననాస్త్రమును భార్గవుండు ప్రయో
గించెనని తోఁచుచున్నది.

చ. గురిజపుఁగాంతి కన్గవలనుం జెలువీఁగ సటాచయంబు కం
ధరముపయి న్నటింప మెయి నానెపుఁబింగళకాంతి మీఱ ఘు
ర్ఘురఘురమ్రోఁగు పెన్రొదలనున్ జగమూఁగఁగ వచ్చుచుండె భీ
కరనఖరాళితో గజహకాండము నిండుచు నంతరిక్షమున్.

(భావగర్వితముగా నందఋను) ఇట్టిటు రండు! వీరాగ్రగణ్యులగు నీవీరుల యిరువుర
మధ్యమున వసింతము.

గీ. విండ్లు వడియుఁగూడ విడువుమో దశకంఠ!
దురము మానుమయ్య పరశురామ!
యుద్ధభూమి మీర లొండొరుల్మార్కొంట
కోడఁబడంగఁబోఁడుచుఁడు పురారి.

రావ——అక్కటా! యిది దహించుచున్న దావాగ్నికి వానజడి గదా.

గీ. భార్గవుం డనియును దశవదనుఁ డనియు
రెండు తెఱఁగులఁ బాఱు కీర్తిప్రవాహ
మేకముఖముగఁ జేయ నేనీహ సేయఁ
జంద్రఖండధరుం డెటుసమ్మతించు?

పర——(తిరస్కారముతో)

చ. గురుచాపంబుఁ దిరస్కరించె ననుచుం గోపంబు రామానదీ
శ్వరుఁడే నందిముఖంబునం దురము మాన్పంగా నియోగించె మ

త్కరణీయం బిఁక నేది? నీయెడను మార్గం బిచ్చి కొంపోఁగదే
ధరణీ! గొడ్డలి నన్నుఁగాల్పుము మహాత్మా! కాలవైశ్వానరా!

రామ— ఈశ్వరనియోగంబునంజేసి మనము మిత్రులమైతిమి. కావున మహాత్మా! సెలవొసంగుము.

(తెరలో)

భగవంతుఁడా! భార్గవ! పరబ్రహ్మధ్యానము సేయుచున్న పూజ్యురాలగు నాత్రేయితోడను లోకయాత్రాపరతంత్రయగు కాత్యాయనితోడను సూర్య శిష్యుండు నిన్నిట్లు ప్రార్థించుచున్నాఁడు.

గీ. హరునిశిష్యుండ! మాయింటి కతిథివైతి
దారలును మేము నగ్ను లీదాఁపునంద
గాఁపురంబుంటిమయ్య! రాఁగదవె పటుచ
యంబునకు నేఁ డనధ్యయనంబుగాఁగ

పర— సూర్యాంతేవాసి యానతిచ్చినట్లే యొనర్చెద.

(అని యందఱును నిష్క్రమించుచున్నారు.)

ఇది శ్రీ.........తిరుపతి వెంకటేశ్వర విరచితం
బగు నాంధ్రీకృత బాలరామాయణమునందుం
ద్వితీయాంకము.

---

శ్రీరస్తు

# బాలరామాయణము

## తృతీయాంకము

(పిదప గృధ్రమిథునము ప్రవేశించుచున్నది)

గృధ్రము—ప్రియురాలా! సువేగా! భగవంతుఁడగు తామరకంటికి పీఁటంబును బాములకుఁ బగవాఁడును సుధాహరణవిశ్రుతపరాక్రముండును పతత్రికులసార్వభౌముండును మనకుఁ గూటస్థుండునగు వైనతేయుని యేల్బడికి లోఁబడిన పక్షికులంబులలో నెక్కువ యసంబు నిక్కువంబుగా గాంచఁదగువానిఁ గుమారునిఁ గడుపున ధరియించి యుంటివిగానఁ దదనుకూలంబుగ రక్కసుల పాలయును నెత్తురును నీకు దోహదంబగు సమయంబు తటస్థించినది.

సువే—ఓచిత్రశిఖండా! ముల్లోకంబులు జయించి మించుచున్న రక్కసులఱేఁడగు దశకంధరుండు జీవించియుండఁగానే నా!

చిత్ర—అది దొరకుట సామాన్యమయినపనియా! ఏమి! నిజముగా నతని పేరే రావణుఁడు.

ఉ. ఆఁడుదియంచు హైమవతికైన నెవండు నమస్కరింపఁడీ
రేడుజగంబు లెవ్వనియహీనవిభూతికి సాక్ష్యమిచ్చు నె
వ్వాఁడు జగద్విధాతయగు బ్రహ్మకు మున్మనుమండఁ జేరినో
రాడును వాని నెన్నియుఁ దదస్యుల నెన్నుటకై పతత్రిణీ.

మత్తేభంబులు లతలయం దుదయించు ననుకాలము గతించి యాలిచిప్పలయం దుదయించు ననుకాలము తటస్థించినది! ఏలన, రామభద్రుండు, తాటకను సంహరించె నని వినియు నాదశాననుం డింకను దనబాహుమదంబునకుం దగిన పను లాచరించుచునే యున్నాఁడు.

సువే—పతత్రికులాలంకారమా! రామచంద్రుం డా సుందసుందరి నెట్లు వధించెనో యాయుదంతము రవంత చెప్పుము.

చిత్ర—ప్రియురాలా! ఒకానొకనాఁడు విశ్వామిత్రుండగు విశ్వామిత్రుండు మఖసంరక్షణార్థంబుగా దశరథకుమారులగు రామలక్ష్మణులను సాకేతపురినుండి సిద్ధాశ్రమమునకుం గొంపోయి యొకవంక నుద్గాత సామవేదపారాయణం బొనర్చుచుండ నొకచెంత హోత హోమం బాచరింప నొకవంక నధ్వ

ర్యుఁడు సప్తతంతువిధానంబు నెఱవేర్ప నొకయోర యజమానుఁడు యాజమాన్యంబు లుచ్చరింప నొకదెస బ్రహ్మ కర్మలోపంబు గాకుండఁ బరీక్షించుచుండ జన్నం బొనర్చునప్పుడు నూర్యాచంద్రమోవీథిహర్మ్యాత్తేరమ్మదవ్యతిరిక్తంబగు నొక పెనుమంట పుట్టినది.

సువే—ఏమిపింత యేమివింత! తరువాతఁ దరువాత?

చిత్ర—పుత్రమిత్రకళత్రంబులతోఁ బెక్కుదెసలనుండి వచ్చినజడదారు లిదియేమి యనుభయంబునఁ బాఱిపోవ నచ్చటిజను లిట్లుఘోషించిరి.

సీ. పొలదిండి వేళను సెలవుల జాఱినసెత్తురు కెడల ఘనీభవింప
గండదేశవ్యతికరమున మిగులు ఫీత్కారంబుచేత జగంబు లదరఁ
జిఱుతలగతి రెండుచేతుల మ్రోఁగించుశవమాలరొద చటచ్ఛటని పెనఁగ
గండనంజుడు నోటఁగఱచి మెసవువేళఁదట్ప్రలగతిఁ గాటుదములు కదల

గీ. ఘటితదంష్ట్రాంకురచ్ఛటాకషణజనిత
రణరణత్కారభయదసంరావమూఖర
తాళవృక్షోపమాకార తాటకాభి
ధానరక్కసి చనుదెంచె దండకదిగొ.

సువే—హా! హా! ఈచచ్చినది భయంకరులకుఁగూడ భయంకర యనవచ్చును.
తరువాతఁ దరువాత?

చిత్ర—అట్లు చనుదెంచిన తాటకం గాంచి విశ్వామిత్రుండు దానిం జంపుటకై రామభద్రునే నియోగించెను.

సువే—అయ్యో! భగవంతుఁడయ్యు విశ్వామిత్రుఁడు చేయరానిపని చేసెను గదా.

చిత్ర—పిదప రామచంద్రుండును స్త్రీవధంబునకై సంశయించుచు నమ్మునిచంద్రున కిట్లనియె.

చ. ననుఁ గరుణింపుమా! కుశికనందన! దానుఁడ నాఁడువాండ్రఁ జం
పను శరమెత్తికోలు రఘువంశ్యుల ధర్మము గాదు; మంత్రవే
దిని జడదారి నొక్కని సతీర్థజలాత్తశపాణి నింపఁ బం
పిన నతఁ డేపుమాపు నడపీనుఁగురక్కసి నొక్కత్రేల్మిడిన్.

సువే—ఏమి! ఈరఘువంశకుమారుని యౌచిత్యము!

చిత్ర—ఇట్లు నుడివిన రామభద్రునిం గని శిరంబు మూర్కొని చిబుకంబెత్తి ముద్దువెట్టుకొని రాచపాఱుం డిట్లుపదేశించె.

గీ. కాలమునఁ గాని ఘోరంపుఁ గాళరాత్రి
గాని యాఁడుది గా దాశుగంబుఁ దొడిగి
సంశయింపక నాతండ్రి! చంపుమయ్య
ముజ్జగంబులు సంతోషమునను బొంగ

చిత్రి—పిదప మునివచనంబులు త్రోయలేక జగదేకవీరుండగు నా రఘువంశాంకూరంబు క్రూరంబగు నాశుగంబు వింటం బూరించి పఱపినంతట సౌమిత్రి రాముని కిట్లనియె.

గీ. ధ్వస్తహస్తంబు దళితాంత్రితంత్రచయము
గళితరక్తంబు ఖండితకాలఖండ
ముగుచు ధరఁ గూలె జడదారు లద్భుతపడఁ
దాటకాదేహ మార్యసంతాడితంబు.

సువే—పసితనమైనను బదుమఁదనపు రాఘవుం డొనరింపఁదగిన పని చేసెను రామభద్రుఁడు ! తరువాత ?

చిత్రి—వదంపడి త్రిశంకుశోకశంకుపరిహర్త సుందాసురసుందరీ వధంబున కాశ్చర్యపడి—

గీ. తనకుమున్ను కృశాశ్వుఁ డత్యంతమోద
మొదవ నిడిన ధనుర్వేదమది సమంత్ర
కముగా వెల్గు జృంభకాస్త్రములతోడఁ
గరుణ నప్పుడు రామలక్ష్మణుల కొసఁగె.

సువే—దేశకాలపాత్రంబు లెఱిఁగి తగిన కార్య మొనర్చుటకు నీ భరతమాతామహునకే తగును.

చిత్రి—తాటకం జంపిన కతంబున నం దేట తెల్లంబగు నపరాక్రమంబు గల రాఘవునకుఁ దన ధనుర్వేదమంతయు నుపదేశించిన యా కుశికతనయుండు జన్నంబు యథోక్తముగా నిర్వర్తించి హరశరాసనంబు చూపి విఱిపించి సీతం బెండ్లి చేయింపం దలంచి మనువుల నిరువురఁ దోడ్కొని మిథిలాపురంబున కరిగె.

సువే—తరువాతఁ దరువాత.

చిత్ర—ఇట్లు మువ్వురును మిథిలాపురంబున కరుగుచుండ మధ్యమార్గంబునఁ దాటక కొడుకులు మారీచసుబాహులను వా రడ్డంబు వచ్చి యుద్ధంబునకుం దలపడిరి.

సువే— దుష్టులగు నా తాటకేయులు నందివానితో వైరంబు పూనిరి లే. పదంపడి వారికి జరిగిన మహోత్సవ మేమిటి ?

చిత్ర— తల్లికి జరగినమహోత్సవమే జరగెను.

క. పదితేరులదొరకొమరుఁడు వదలినశర మానుబాహు వ్రిక్కలు సేసెన్
దదనుజు మారీచునిఁ బడఁబొదివెన్ దనపక్షవాతములం నక్కడలిన్.

సువే— ఇఁక రామ యనునక్షరంబులు రాక్షసవినాశకరము లననలయు.

చిత్ర— ఆహారంబ దొరకిన నెత్తురును బాలయు నీకు దోహదం బగుఁగాత.

సువే— నాథా! ఇట్లుపలాలించుచు మదీప్సితం బొసఁగూర్చుచున్న నీవలన సకల పతత్రిస్త్రీమండలిమానినియు సౌభాగ్యగౌరవ నయితిని గాని నామది నొండొక సంశయంబు బాయకున్నది.

చిత్ర— ప్రియురాలా! ఆజ్ఞాపింపుము.

సువే— దశాననుం డట్టిరాక్షసావమానంబు సైఁచి యెట్లున్నాఁడో!

చిత్ర— పతత్రిణీమణీ! సీతావిషయకం బగువిరహంబు వానిం బట్టుకొని పీడించుచున్నది. లేకున్న నెన్నఁడును సర్వావమాని యగు రావణుం డిట్లూరకుండఁడు మంచు లేకున్న సూర్యుండు చల్లఁబడునే.

సువే— అట్లైన వాఁడా సీతావిరహదుఃఖంబు బాపుకొన నేమేమి వినోదోపాయము లాచరించుచున్నాఁడో ?

చిత్ర— త్రికూటపర్వతమునం గలపక్షులకు రాజై సర్వదా లంకయందుండు నిమఱఁది యగురత్నశిఖండుఁడు నిన్ననే కదా చెప్పపోయెను.

సువే— ఏమి చెప్పపోయెనో నేను వినలేదు.

చిత్ర— అట్లైనఁ జెప్పెద నాలింపుము.

చ. అవనిజమోముతోడ సరియైన శశాంకుఁ డొకండు సీతక
న్నవ కెనయైన యుత్పల మొకండును మైథిలి నవ్వుతో సమం
బవుబిసజాల మొండును దిశావను నూరడఁబల్కఁ దత్తరు
ల్యపయిజనావ్య మందనపదార్థము లన్నియు వేయు నేటికిన్.

మఱియును సీతావిరహపీడితుల మగు మాకు వినోదాంతరమిదియొకటి యిపుడు లభించినది. భగవంతుఁడగు దేవేంద్రుని యానతిచొప్పున భరతాచార్యులవారు సీతాస్వయంవరకథాసంబంధముగా నొక నాటకమును గ్రొత్త రచించిరట, దేవసభలో

దానియాటకూడ జరిగినదట! అది తెలిసి రావణుఁడు మాకుఁగూడ దానిఁ జూపవల సినదని యాజ్ఞాపింపఁగా భరతాచార్యులవారు తమ పుత్త్రుల నూర్వురనుగూడ నప్స రసలతో లంకకుఁ బంపిరి.

మవే— అట్లైన రమ్ము. మనమును మన రాజధానియగు వింధ్యగిరికింబోయి యట సురక్షితంబగు నీడంబునం బ్రవేశించి మఱియును దోహదము సంపాదించు కొందము. (యాగ్న్యుగ్రమి ఘనము నిష్క్రమించెను.)

(పిదప రావణుఁడును బ్రహస్తుఁడును బ్రవేశించుచున్నారు.)

రావ— (విరహతాపం బభినయించుచు) హృదయమా! నీయదృష్టము మంచిది. సీతాప్రతిబింబ విలోకనం బైనను నీకుఁ దటస్థించినది.
(తెరలో) త్రిజగత్ప్రభీ మహారాజ! దశానన! నీకు జయము. నీకు జయము. సాయంసంధ్య దేవరకు సుఖప్రద మగుఁగాత.

మ. ఎలు వర్ధించిన వట్టునూలువలె నెంతే మీఱు నుసాళ్లితో
నెఱసంజం గుదిగూర్చుకొంచుఁగనుఁగొంటే పూష యస్త్రాద్రిపెం
జఱియన్ వాలె నోకింతమున్నెబయిఁ దేజంబాఱ వారాశి గ్ర
చ్ఛుఱ వాత్యాదళితాంబుజాతజరజశ్ఛకాలయమాణాకృతిన్.

రావ— నా పుణ్యవశంబున నేఁటికిఁ బవలు గడచినది! ఓ ప్రహస్తా! భరతాచార్య పుత్రులను నాటక ప్రదర్శనంబునకై రప్పింపుము.

ప్రహ— (తెరవంకం జూచి) ఓ భరతపుత్రులారా! నాటకముఁ గనుంగొన మా చక్రవర్తిగారు సన్నద్ధులైనవారు గాన వేగ రండు.

కోహలుఁడు— (ప్రవేశించి)

గీ. మండిపోయియుఁ గర్పూరఖండమట్టు
జములయందెల్ల నెవఁడు వాసనలుగొల్పు
నతని శృంగారరసమున కాదికార
ణం బయినవానిఁ గుసుమధన్వునుదలంతు.

రావ— ఇది నాంది. ఇంకఁ బ్రస్తావింపఁగలఁడు.

కోహ— పూజ్యుఁడగువిధాత మానవసంభవులలో మొట్టమొదటివాఁడగు భరతా చార్యుండు రచించిన సీతాస్వయంవరమను నూతననాటకముం బ్రయోగించు చున్నారము! పరమేష్ఠినలన నాట్యవేదంబును స్వపారువసంతోషితుం డగు

హరునివలన లాస్యతాండవంబులను నేర్చుకొనిన దేవర మానృత్యాభినయం
బులు చక్కఁగ నవధరించుగాక యని వేఁడుకొనుచున్నారము.

క. వినఁబెక్కుచెవులుఁ, జూడ న్గనులెన్నో వలయునట్టి నాటకమిది చే
సెను భరతుఁడు దేవరకొఱకనియే మేమెల్లఁ దలఁపనగు దశవదనా.

రావ— ఏమిది! అసంబద్ధప్రలాపము లాడెదవు! రావణుఁడిక్కడ నుండఁగా
నింక సీతను పెండ్లియాడువాఁడు వేఱొకఁడెవ్వఁడురా.
(ఆలోచించి) కానీ! కవివాక్కులు నిరంకుశంబులు.

శోహ— (అంతటఁజూచి) ఔరా! రాక్షసచక్రవర్తిప్రాభవము త్రిభువనశిరశ్శేఖ
రాయమాణమై ప్రకాశించుచున్నది.

సీ. రిక్కమొత్తము తేజరిల్లుచాందొంటిలో ముత్యాలజాలరై పొల్పెనిచట
నిల్వుటద్దంబులై నిల్చిరిం దందందు ద్వాదశాదిత్యులు తైక్ష్ణ్యముడిగి
చంద్రమోబింబంబు చలువలల్లార్చుచు నల్లాథమై మీఁదనొప్పుచుండె
సంజకెంజాయలు పాంద్రసిందూరరేఖలఁ దీర్చుచుండె రంగస్థలమున

గీ. మందపవనంబులెల్లెడ మలసి మలసి
శ్రమజలంబెల్ల నల్లంతఁజల్లనార్చు
గొప్పతాలవృంతంబులై యొప్పుచుండె
బాగుకేచాఁగు రావణేశ్వరునిబాగు!

ఓరావణసభాసదులారా! పూజ్యుఁడగుభరతాచార్యుం డిట్లు పలుకుచున్నాఁడు.

ఉ. మాధుర్యంబును గర్ణపేయముగ నిర్మాణించు వైదర్భియున్
సాధుస్వాంతమనోహరం బగుకథం జాటించుమాత్రల్ రసా
ర్ణోధిన్ నించెడు నప్రసాదగుణచంద్రుండుం నెలంగం బ్రమో
దాధారం బగునైత శారదకు నిత్యావాసమై యొప్పదే.

క. శ్రవణంబునకుం దగినది సువర్ణబద్ధంబు కలితసుచ్ఛాయం బీ
కవనము దా మత్తైపుజంపువిధంబునఁ బ్రమద మొసఁగు బుధులకు నెందున్.

( తెరలోఁ బాడుచున్నారు. )

క. ప్రకటితరామాబ్జము కౌశికవంతము లక్ష్మణప్రసిద్ధంబుఁ బురాం
తకచాపదమనకారణ మకలంకము వచ్చె శరద మతిసుఖమొదవన్.

ఇదిగో, రామలక్ష్మణసహితవిశ్వామిత్రప్రవేశసూచకంబగుధ్రువాగానము చేయు
చున్నారు గానశేషము దక్కినవనులకై యచ్చింతు (నిష్క్రమించుచున్నాఁడు)

ఇది ప్రస్తావన.

(పిదప రామలక్ష్మణులతో విశ్వామిత్రుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

విశ్వా—ఆహా! జనకునిమనంబు సర్వదా పరబ్రహ్మానుసంధానమే చేయుచున్నది. ఇది యంతయు యాజ్ఞ్యవల్క్యుని సామర్థ్యము. సెలఱాలు కరఁగెననుటకుఁ గారణము చంద్రునిసామర్థ్యముగాని యన్యంబు గాదు గదా.

రామలక్ష్మణులు—భగవంతుఁడా! ఉపాధ్యాయ! ఇతఁడేనా జనకమహారాజు? సూర్యశిష్యునివలన శుక్లయజుర్వేదము సైతముఁ జదువుకొని విరక్తుండయ్యెను నేల వనమునకుఁబోలేదో.

విశ్వా—నాయనా రామచంద్ర! తండ్రీ లక్ష్మణ! రాజ్యాశ్రమమహాముని యీతఁడు దీని నిట్లు సమర్థించుకొనుచున్నాఁడు.

చ. అడవులనుండఁగావలె మృగాదులతోడఁ జరింపగావలెన్
గుడువవలెన్ ఫలాదులను గొండలనీళ్ళులు గ్రోలఁగావలెన్
బడుకొనఁగావలెన్ గఱకుబండలఁ గామములూడ్పఁగోరువా;
రుడిగినవారి కిల్లయిన నొక్కటె కాననమైన నొక్కటే.

రామ—ఇది నిజమే. ఇట్టివారుగాని యట్టిరహస్యమును దెలిసికొనలేరు.

రావ—(సాక్షేపముగా) వీఁడె! దశరథపుత్రుఁడు రాముఁడు! వీఁడు తాటకను, దాటకకొడుకులను జంపినవాఁడు! (మునివంకఁజూచి) అన్నా! ఈరాచపాఱునియభిచారచాతుర్యము! అస్మత్పరిజనులందుఁగూడ సాగింపఁ దొడఁగినాఁడే! అవురా! యీ రాచకుఱ్ఱఁడు గూడనా! ఏమి! వీని కుఱ్ఱదనపుఁ బొగరు!

లక్ష్మ—ఇదిగో! మారశరాసనము. అప్పుడే సీతాస్వయంవరమండపములోనికి వచ్చినాము.

ఉ. బంగరుమువ్వ లెల్లెడ నభంగుర మాగతి మ్రోఁగ గోపురో
త్తుంగవిచిత్రరత్నరుచితోఁ దులఁదూఁగుచు వేల్పుటేనిపి
ల్లంగిఁ జెలంగి నింగి సురలం గనుఁదమ్ములు వ్రాల్చునట్లు చే
యంగల మంచసౌధములయందు వసించిరి రాజపుంగవుల్.

విశ్వా—(అన్నివంకలకుం జూచి.)

గీ. దేవదేవుని విల్లిది త్రిపురవిజయి
యితఁడు జనకుండు భోగి యోగీశ్వరుండు

నితఁడు జనకపురోహితుం డీవెలంది
పుణ్యయజనసముద్భవ పుడమికాన్పు.

(అంతటఁ బురోహితునితో జనకుండును జెలులతో సీతయుఁ బ్రవేశించుచున్నారు.)

శతా—ఓ సీరధ్వజా! నేఁడు తాటకావిపాటనుండగు రామభద్రునిం జూచిన నతని తండ్రి బాల్యావస్థ స్మృతికి వచ్చుచున్నది సుమీ! ఏలన నాదశరథుండును.

గీ. గడ్డమును మీసలును రానికాలమందె
పవిధరుండగు దేవతావల్లభునకుఁ
జెలిమి యగుచు దానవులనెల్లఁ జెండి దైవ
తంబు రాజ్యంబు నిష్కంటకంబు సేసె.

జన—అవును. ఇక్ష్వాకులవిక్రమంబులు వయఃప్రక్రమంబుల నపేక్షించునవి కావు.

శతా—హేమప్రభా! స్వయంవరసమయ మాసన్న మగుచున్నది గాన జానకిని హర శరాసనసమీపమునం గూర్చుండఁ బెట్టుము.

(అంత హేమప్రభ యట్లు చేయుచున్నది.)

విశ్వా—వత్సా! లక్ష్మణ! అదిగో జనకునిసమీపమునం గలమంచముపై రామభద్రు నెక్కించి నీవును గూర్చుండుము.

(అంత సౌమిత్రి యట్లు చేయుచున్నాఁడు)

రామ—(తనలో) పుడమి తల్లియు యాగస్థలంబు పుట్టిల్లును శివధనుర్భంగం బోలి యుఁ గాఁగల కన్యక యీమెయే కాఁబోలును.

ఉ. పలుదెసఁ బూర్తిగా నురమునం గుచయుగ్మము నిండలేదు, క
న్నుల కొకవింత పుట్టియుఁ గనుంగొనుదాఁక నయుండ దో, పిఱుం
దులును నితంబలక్ష్మిని నెదుర్కొనుచున్నటు లున్న విప్పుడే
యలముచునుండెఁగా ప్రథమయౌవన మీచిగురాకుఁబోణికిన్.

(ఆలోచించి) హృదయమా! ఇఁక మన్మథుం డస్ఖలితశాసనుండు కాఁగలఁడు.

గీ. ఇంత యయిన నేమి వెదురైన నేమి చాప
మాయసము లైన నేమి పూలైన నేమి
తూపు లీముజ్జగములందుఁ దుంటవింటి
వాఁడె విల్కాఁడు సీతకు వయసు వచ్చె.

(బాగుగ నాలోచించి) నూతనాలంకారరచనావిలాసవ్యగ్రభావయగు నీ లతాంగియే జవ్వనము నలంకరించుచున్నదని తలంచుచున్నాను.

మ. కబరీపాశము దిద్దునేర్పులును వక్రంబుల్ కురుల్ తిన్నఁగాఁ
గ బనాయించు తెఱంగు దంతచయముం గై సేయుసామగ్రి ప
ల్కుబహూకారము నీవిసన్నహనముల్ మున్నైన చెయ్యంబు లీ
యబలల్ నేర్తురుగాదె శైశవము పోసైయున్నకాలంబునన్.

రావ—ఇదిగో! నాహృదయతాపముం బాపుమంచు! శీలతాంగి నిరుపదికన్నులతోఁ (గూడనొక్కసారి చూచెద. (చిరకాలమా మెసంకకుంజూచి కన్నుల నుద్దేశించి-)

సీ కటికిచీఁకటివంటి కబరికాభారంబుఁ దఱపివెన్నెలవంటి చిఱుతనగవు
నతివిశాలాకార మైన కన్నుంనోయిఁ గడుఁగుటిలము లైన కన్నుబొమలుఁ
బురిగదించినపాశములఁ బోలువీనులు నరచందమునేఁడుఁబోని యలికతలముఁ
గరఁగించినట్టి బంగరుఁబోలుకంఠమ్ము సాచీకృతంబు వక్షస్థలంబు

గీ. జక్కవకవను బురణించు చన్నుదోయిఁ
గొండచఱివంటి జఘనపుమండలంబుఁ
గవకవలుగాఁగ మిగులు నైక్యంబు గల్గి
కనుఁగొనుం డాసదీఱఁగఁ గన్నులార!

(ఆకసముపంకకుం జూచి సీతను దలంచుకొని)

సీ. నల్లగల్వలసౌరు నశియించి పోఁగాక గుల్కుఁజూపులు చిమ్ము కోమలాంగి
పగడంబునకు వెల్లఁబాటు చేకుఱుఁగాక గెమ్మోవి ప్రకటించు మెమ్మెలాఁడి
బంగారమున కున్నవన్నెతగ్గునుగాక మైలీల వెలిపుచ్చు మోలతాంగి
వింటఁ జంద్రయుగంబు విభ్రాజిలునుగాక మొగము పైకెత్తు మో ముద్దుగుమ్మ

గీ పంచదారకుఁ జేఁదుచొప్పడును గాక
గొనబుమాటల నించు మోవనజగంధి
రామణీయకశాలి యీరావణుండు
మనవి గావించుకొనుమాట వినుము తరుణి.

ప్రతీ—ఆహా! సహజసౌందర్యవతుల సాహాయ్యకంబునం దుంటవిలుకాఁ డీ బొఱుంగురాయుల నెంతగా నెల్లిదము చేయుచున్నాఁడో ?

సీ. మధురంబుగ నొకంఠము మాటాడు నొక్కఁడుసొగియింపఁ గాఁజూచు నగునొకండు
నసుఁదమ్ముఁ గేలఁ ద్రిప్పు నొకండు మొదలో రహించుహారంబులాడించు నొక్కఁ

డంగభంగము లీల నాచరించు నొకండు చేత గల్లంబు స్పృశించు నొకఁడు
లలితసంగీత మాలాపించు నొక్కఁడు మించుఁబూవండలెక్కించు నొకఁడు

గీ. చిట్టమిడుచు నొకండు కెంజేతినడుమఁ
దలఁ గదల్చుచు నొకఁడు వర్ధిలెడుకోర్కి
కనుగుణంబుగ నిరుగేల నభినయించుఁ
గాముకుల నేమి చేయఁగఁ గారు చెలులు.

(కొంచెము బిగ్గరగా)

గీ. రాజులందఱు వినుఁడయ్య రావణుండు
విఱువఁజాలని ముక్కంటివిల్లు విఱుచు
టొలిగాఁగ విదేహభూపాలు మెచ్చ
వడయువానికి కళత్ర మీ పుడమికాన్ప.

రావ —(క్రోధహాసములతో) ఓసీ! మూర్ఖ! కైలాసాద్రి నిట్టటుఁ గదల్చినదశకం
ఠుని చేతులకటరా, ముక్కంటివిల్లు విఱువఁజాలనివను నప్రతిష్ఠ!

అయినను —

మ. రజతాద్రింగదలించు టాత్మదశమూర్ధచ్ఛేదనం బచ్యుతా
గ్రజుఁ గారాగృహబద్ధుఁజేయుట మొదల్గాఁ బెక్కుకార్యంబులన్
భుజశక్తిం బొనరించినట్టిదశకంఠుం డేనయాశాపహా
రు జనం బెన్నునె పాఁత విల్లొకటి యారోపించినన్ ద్రుంచినన్.

హేమ — చెలీ! జానకీ! రాజులందఱును హరశరాసనం బెక్కుడుట కారంభిం
చుచున్నారు. నీసౌందర్యమును నిర్మించిన విధాతపరిశ్రమంబు సఫలంబగుఁ
గాక. తుంటవిలుకాని ధనుర్విద్యాపరిశ్రమంబుగూడ సఫలంబగుఁగాక.

ప్రతి — (తనలో) ఓహో! ముందుగా నరకాసురుఁడే ధనుర్భంగంబునకు సన్నద్ధుఁ
డగుచున్నాఁడే (ప్రకాశముగా)

మ. అమరస్త్రీలు సుగంధిగంధహారిణవ్యాలోలకస్తూగరు
ద్రుమపూలంబులఁ బాడుచుం దొనవకీర్తుల్ వాఁడు భూమీశక
త్రమునం దాదికిటీంద్రుఁ డెవ్వని గనెం బ్రాగ్జ్యోతిషాధీశ్వర
త్వమునఁ గైకొన్నతఁ డెవ్వఁ డానరకుఁ డీతండే సుమీ జానకీ.

హేమ — చెలీ! జితఖంజరీటంబులును దలితబాలతమాలంబులు నగు క్రీఁగంటి
చూపులఁ జూడుము.

సీత— సురవిరోధి యసురుఁడే కాఁడు ?

హేమ— చెలీ! విచారింపకుము! శంకరశరాసనము రక్కను లెక్కిడఁ దగినది కాక లే.

ప్రతీ— ఏమీ! ముక్కంటివింటి దిట్టతనము! జగజెట్టియగు నరకుండును—

క. ముక్కంటిచాప మిదియని వెక్కసముం బడుచుఁ బోయి విఱుచుట యును నమ్మెక్కిడుటయు నటులుండఁగ జక్కికిఁ జనలేక మరలి చతికిలఁబడియెన్.

రావ— చీ చీ వసుంధరాకుమార! ఇసీ! నీయభిమానము కాల్పనా! ఆరంభించిన కార్యము సమాప్తి నొందింపకపోవుట యపయశస్సు కాదా.

ప్రహ— అందఱును రావణాసుర లగుదురా యేమి!

ప్రతీ— (మఱియొక వంకకుఁజూచి తనలో) ఇదిగో! ఇఁకఁ బాండ్యరాజుగారు బయలుదేఱినారు (ప్రకాశముగా)

ఉ. గండపుఁగొండ నెత్తముల గండపుమోకల సుండుసర్పపుం
జందనగంధు లందఱకు సారెకు బోయిత లేగి విన్నవిం
పం దమ చేని విందుసభ వారు యదీయయశంబు నెంతు రా
నందమయాత్ముఁ డాధరణినాథుఁడు పాండ్యుఁ డితండు వచ్చెడున్.

సీ. ఎవనిపుట్టువుకల్మి నెసకంబు ననమును నధిగమించె మదన్వదన్వయంబు
వేల్పుటావుంబోలి వెలలేనిముత్యాలధన మెవ్వనికొసంగుఁ దామ్రపర్ణి
యెవనిపో రప్పరోయువతీమణులకెల్లఁ గ్రొంగొ్రొత్తమగలను గూర్చుఁజాణ
యందక త్తెలకెల్ల నరుదుపుట్టించు దివ్యౌషధి యెవ్వాని యొడలిసంచు

గీ. హస్తచేయంబు లెవ్వానియశము లతఁడు
పాఁడ్యభూపాలకుఁడు నుతింపందగండె
ధనము సర్వము నిచ్చుచోఁ దనకుఁ బాత్ర
తయు నపాత్రతయును లేనిదాత గాని.

హేమ— కపోలకాంతిజితముగ్ధమధూకకుసుమచ్ఛవీ! సెచ్చెలీ! యితఁడు పాండ్యుఁడు. తుమ్మెదబారులఁ దూలించుకటాక్షంబు లితని మోమునమ్మిపైఁ బఱపుము.

సీత— ద్రవిడచూడామణి కదా!

ప్రతీ— (ఎవరికిని దెలియకుండ నవ్వి)

గీ. విఱుచువానివిధంబున వేగఁబోయి
చేతఁజేకొని యల్లంత సిగ్గుపడుచు

మస్తకము వంచి విల్లు నమస్కరించి
వీడుచున్నాఁడు పాండ్యపృథ్వీవరుండు.

రావ — (నవ్వి) ఆహా! యీపాండీఁడు విలువలేక విడుచుటకు మఱియొక కారణమును సూచించుచున్నాఁడే! ఏమీ! చాకచక్యము!

ప్రతీ — (మఱియొకవంకకుఁజూచి) ఇతఁడు మాహిష్మతీనాథుండగు శత్రుంతపుఁడు (ప్రకాశముగా)

ఉ. హైహయవంశ మొప్పఁగద యత్రివిలోచనకీర్తి కార్తికం
బాహిమరశ్మి వంశకరుఁడై తగఁ; దంము జనించె సర్మదక్
బాహుల నాచిపట్టి తలవంపులొనర్చెఁ బులస్త్యసూతికిన్
వాహవ! యర్జునాహ్వయుఁడు వాని కుమారుఁ డితండు వచ్చెడున్.

క. మును తండ్రి దశాననుఁ గెల్చి నిజావాసంబునందుఁ జెఱవెట్టెను గా
వున నింద్రజిత్తుఁ దత్తనయుని నితఁడోడింపఁ దలఁచుచుండు బళారే!

రావ — ఓరి మాసలి రాచబంటా! యిట్టిదురుక్తులాడిన నిన్నొక వేళ రావణుఁడు సహించినను నీయింద్రజిద్దూషణోక్తులను జంద్రహాసము సహింపదు సుమీ!

ప్రహ — దేవా! ఇది యడవినుండు జడదాయలు చెప్పినదృశ్యప్రబంధము. కోపమున కిది పనికాదు.

ప్రతీ — గీ. నర్మదానదిచుట్టు నేనగరికుండు
నోజగల చుర్యులకు నేది రాజధాని
నెచట వీతేంధనం బగ్ని యొసఁగు నితని
కాఁపురం బల్లమాహిష్మతీపురంబు,

గీ. గుబ్బపుందండు దేక్కౌఁకులకుఁ బుడమి
రేఁగుబూడిద కన్నుల మూఁగకుండ
మూసికొనుఁ జేత నితనిపోర పేర్క-
కొఱకు వచ్చిన తెఱఁగంటి తెఱవగుంపు.

హేమ — గురుజనశిక్షిత వినయనర్మదా! యితండు నర్మదావలయితం బగు మాహిష్మతీనగరికి రాజుగాన నితనిపైఁ దరళపత్మ్రళంబులును ధవళంబులు నగు నేత్రాంచలంబులు కఱపుము.

సీత — క్షత్రియకుమారుఁడయ్యుఁ బరశురాముని నెదుర్కొనఁదలఁచినవాఁడే కాఁడు?

ప్రతీ— ఏమీ! ఈకృతవీర్యపౌత్రునిగర్వము.

క. భుజములతీటం బురహరు నజగవమున్ విఱువఁ దలఁచి యంతనె మరలన్
గజిబిజియై యెక్కిడుమనిఁ ద్యజియించెం గార్తవీర్యతనయుఁడు బళిరా.

ప్రహ—మోఱకా! వేల్పుతేఁకుమాత్రము నీవు ప్రొక్కెడుగాని దళపదమునంత
వాఁడ వగుదువురా.

ప్రతీ—(మఱియొక వైపునకుం జూచి) ఇదిగో! చేదిపతిగారు దయచేయుచు
న్నారు. (ప్రకాశముగా)

గీ. తొల్లి యీసీతపెండ్లిహేతువగువిల్లు
దాల్చి భవుఁడు పురమ్ములు గాల్చువేళ
పుడమి నొకముక్క త్రిపురినాఁ బడియెఁ జెదరి
దానిఁ బాలించు చైద్యుఁడీతండు చూవె!

చ. కరమును మానికన్ వసుళకంబులతావులు గొల్చుపట్టినే
ర్పరియును దంపతిప్రణయభంగులపొంగుల లెక్కవెట్టు నే
ర్పరియును బండువెన్నెలఁ గరంబులఁ బుక్కిటఁబట్టి త్రాగు నే
ర్పరియు గణింపఁజాలును సరాసరి నీతనికీర్తిసంపదల్.

హేమ—చెలీ! యీతఁడు దశార్ణదేశాధిపతి. ఇతనిఁ దిర్యగ్దర్శననిలీనకాలిమంబు
లును దలితచంద్రఖండపాండిమంబును నగుకటాక్షంబుల వీక్షింపుము.

సీత—దశార్ణదేశ మనఁగా నర్మదప్రవహించినదేశమే కాదు?

ప్రతీ—క. మాని నుమా యీతండీశానుధనువుమీఁద దృష్టిసారించియుఁ దో
డ్తో నిమురుకొనెన్ నిభృతంబౌనటు తనభుజవిజృంభితము నయ్యారే!

ప్రతీ—(మఱియొక్క ప్రక్కకుఁ జూచి తనలో) ఇదె సింహళేంద్రమహారాజు
వచ్చుచున్నాఁడు (ప్రకాశముగా)

క. వననిధియు రోహణాద్రియు ధనగృహములు వనవములు మదనమంత్రము ల
య్యనురోధనగరి కాఁపుర మినసముఁ డగుసింహళేంద్రుఁ డీతండవురా!

చ. ఎవనికరాసి శత్రుధరణీంద్రశిరంబులు గోయ నప్సరో
యువతులతో క్షణంబునకె యుప్పరమందుఁ జెలంగువారల
య్యవనిని గూలమొండె నడయాడెడు నాత్మకబంధరాశిపైఁ
బువ్వుజడి నొల్కుచుం బ్రతిఁ డెపో యితఁ డద్భుతదోర్బలుం డనిన్.

హేమ—అసమగ్రయౌవనారంభ యగు వైదేహీ! క్షణవికచకమలచ్ఛవికరంబితంబు లగువిలోచనాంచలంబుల నాలోకింపు మితండు రోహణగిరిపరమేశ్వరుండు.

సీత—కౌస్తుభవంశజాతంబు లగురత్నంబులఁ దలఁ దాల్చువాఁడే కాఁడు?

ప్రతీ—(తనలో) ఇతఁడు మందబుద్ధివలె నున్నాఁడే! ఏవనికిని మనంబుఁ జొరనీకున్నాఁడు.

గీ. చండికానాథు మేటికోదండమందుఁ
దనభుజాదండమందును దారుమారు
గాఁగ నూరేసిసార్లు గతాగతంబు
లాచరించుచున్నవి వీనిలోచనములు.

రావ—సింహళేంద్రా! ఏమి సందియపడెదవు? సంశయగ్రస్తు లెన్నండును వీర వ్రతంబు నిర్వహింపఁ జాలరు.

ప్రతీ—(ఒకప్రక్కకుంజూచి తనలో) ఇతఁడే మధురాపురమహారాజు బయలు దేఱినాఁడు.

గీ. కంసముఖు లైన దుష్టరాక్షసుల నెల్ల
జన్మ మెచ్చట వహియించి శార్ఙ్గపాణి
మాపఁగలఁడంచుఁ దొల్లిటిమానివరులు
వ్రాసి రవ్వీడు మధురకు రాజితండు.

చ. కలనుల పైన మాఁగెఁ బువుకల్మల నీపములాఁగ నెమ్మికే
కలు చెలరేఁగ లేమొగులు కన్నులకుం దివిఁదోఁచినంతనే
కలకలలాఁడుచుం ద్రుటితకంచుకబంధము లైన సంబరం
బులఁ దిలకింతు రీతని రిపుప్రమదల్ చెలికాండ్రకాంతలన్.

హేమ—నిసర్గసర్వాంగసుందరీ! జానకీ! ఇతఁడు మధురాపురమహారాజు, సాటిలేనిచక్కఁదనముఁ జూడఁదలంచినచో నితనినే చూడవలయుఁ జుమీ.

సీత—బృందావనవిహారదుర్లలితుఁడే కాఁడు?

ప్రతీ—అధిగతకోదండపాండిత్యుఁడయ్యు నీతఁడూరకున్నాఁడేమి?

గీ. శశధరునిచాప మెక్కిడఁజాలుఁ గాక
చాలకయపోవుఁగాక యీనేల తేని
బుజములందలి జ్యాకిణంబుల పసందు
తెలుపుచున్నవి విల్కానిధీమసంబు.

రావ — మహాధన్వియయ్యు మధురాధిపతియీశ్వరచాపారోపణమున నేల యప్ర
యోజకుఁడయ్యెను !

ప్రతీ — (మఱియొకవంకకుం జూచి తనలో) అవంతీరాజగు సత్యవ్రతుండు వచ్చు
చున్నాఁడు (ప్రకాశముగా.)

చ. శమితమనస్కుఁడైన పురశాసనుఁడుం బహువిభ్రమోపదే
శి మరుఁడు వైరముల్ వదలి శ్రీవ యనంజను నే జగద్ధ్గాఁ
గ మనను నించు నేనగరి కాఁపుర ముండిరి యిర్వు రేకపీ
ఠము ఘటియించి దానిఁ బ్రకటక్రియఁడీతఁడు ప్రోచుచుండెడున్.

సీ. వీరలక్ష్మికిఁ గ్రొత్త వేణికాబంధంబు భుజఫణాధర రాజమునకుఁ బడగ
శ్రీతాధి నాథచమూతటినికి వీచి పొగరెఁబోతుఁ కునుభూప్రవతాక
యమరకాంతాకటాక్షములకు సంకెల గడితంపుసిరికిఁ గీఁగంటిచూపు
వరికామినీతతి కప్రవ్రవాహంబు లోలఁకుకోపాగ్నికి ధూమవర్తి

గీ. యగుచు నెవ్వనితరవారి పగఱ నన్ని
సమరములయందు నోడించి జయముగాంచు
నతని నుతియింపఁ దరమె సమస్తనృపతి
వందితశ్రీసనాథు నవంతినాథు.

హేమ — చెలీ ! యితఁడు విశాలాపురీనాథుఁ, డితనియెడ నీకటాక్షపాండిత్యమును
జేటపఱచుము.

సీత — మహాకాళుఁ డనునామముగల యీశ్వరుఁ డున్న పట్టనమునకు రాజేకాఁడు ?

ప్రతీ — (తనలో) విల్లెక్కిడకయే యూరకున్నాఁ డేమో ? (ప్రకాశముగా)

గీ. కంటిలోని తృతీయభాగమ్మ చేత
హరశరాసనమును జూచి యంతమరలి
యవలిమో మయి చెలికానియందు దృష్టి
పఱపి మాటాడుచున్నాఁ డవంతిరాజు.

రావ — ఓయీ ! అవంతీనాథ ! పురాతనశీర్ణశంకరశరాసనారోపణంబునకుఁ గూడ
నాలోచించుచున్నా వేమి ?

ప్రతీ — (మఱియొకవంకకుఁ జూచి తనలో) ఇతఁడె ! క్రథకైశికాధిపతి వచ్చుచు
న్నాఁడు. (ప్రకాశముగా)

గీ. సరసమగు కైత కేవీడు జన్మభూమి
యేపురము తుంటవిలుకాని కాఁపురంబు
రాజమార్గచరద్రమణీజనంబు
కుండినం బది యేలు నితండు సీత.

ఉ. రూపసి జాణ వేత్త చతురుండు మనోహరుఁ డిక్షుధన్వకుం
గా నుపవర్గి యీనృపశిఖామణి పేర్వని శత్రువుల్ మృతిం
జేడుటన్ సురత్వమును జెందగ దాన సురాంగనల్ వృథా
రూపులు దిద్దుటయ్యెనఁట కోర్కె ద్రోవరుల్ లభియింపకుండుటన్.

హేమ — స్నిగ్ధశ్యామలకుటిలకుంతలా ! జానకి ! యితండు కుంతలేశ్వరుం డితనిం జూచి చేరలఁగొల్వం దగుని నేత్రనిర్మాణమును సార్థకమును జేసికొనుము.

సీత — మహారాష్ట్రచూడామణియే కాఁడు ?

ప్రతీ — (తనలో) ఇతవిచరిత్ర ప్రకృతిపరాధీన మనితోఁచుచున్నది (ప్రకాశముగా)

గీ. లెండు విల్లెక్కుడుండని లెంక లంద
ఱేఁప్రకల్పించి తన్ను బ్రేరేపుచుండఁ
దనమురూపంబుతోడ శస్త్రప్రభావ
మెన్నుకొనుచుండె నీకుంతలేశ్వరుండు.

దాన — ఈతఁడు చాలఁ బిల్లతనపుఁజేష్ట చేసినాఁడుసుమీ !

ప్రతీ — (మఱియొకవంకకుం జూచి తనలో) ఇదిగోఁ గాంచీపురవరమేశ్వరుఁడు వచ్చుచున్నాఁడు (ప్రకాశముగా) ఓ విదేహరాజనందనీ ! యిటుఁజూడుము.

ఆ. కంతువైరి చిచ్చుకంటి జన్మించిన
కొలమువాఁ డితండు కొమరుఁ డితని
కీర్తు లఖిలభువనకీర్తనీయంబులు
కాఁపురంబు కాంచికాపురంబు.

మ. వగగొంచుం బలవంతు నీతని ననిం బాటింప కత్యద్భుతం
బుగఁ బోరన్ సుగలంద ఱెవ్వరికయిం బూలొల్కిరో వారిలో
విగతాసుత్వముఁజెందువారు సురలై వింటం బ్రివేశించి యిం
పుగ శేషించినవారి ముంతుకు యథాపూర్వంబుగాఁ బూవులన్.

హేమ — నవకాంచనకాంచీదామాలంకృతకాంచీమండలయగు జానకీ ! ఇతండు కాంచీపురీశ్వరమేశ్వరుం, డితనివదనచంద్రికల భవన్నయనచకోరంబు లానుఁగాక.

సీత — చంద్రశేఖరవరప్రసాదీకృతమును శుల్కమాగతమునగు వృషభలాంఛనము గలవాఁడే కాఁడు?

ప్రతీ — (తనలో) ఇంద్రాణీశాపమును లెక్కచేయకున్నాఁడే (ప్రకాశముగా)

గీ. హరునివిల్లు విఱువ కట్టిట్టు గదలక
యూఁతఁడూరకుండె నేమి యిట్లు
ఉదయదరుణకుసుమ సౌష్ఠవముమాపులఁ
గనలి లాఁతినృపులు కాంచుచుండ.

రావ — ఓసీ! మర్యాదాహీనుఁడా! విల్లువిఱువకపోయిన నీవు కాంచీపురాధీశ్వరుండవు కావు. (అని యాలోచించి సిగ్గుతో) అగుదువు, ఇదిగో! ఉంటివిగదా!

ప్రహ — (సవ్య)

చ. అనిని కుమారి పెండ్లికత యందును గొంటుగతిం జరించు నీ
యవనిపతిం జలత్పులకితాంగుని జూచి దశాననుండు కో
పవశముఁ జెందియుం దననెపంబునఁ జూపఱకెల్ల లోచనో
త్సవము శమించునేమొ యని శాంతముఁ దాలిచి యుండె నెంతయున్.

ప్రతీ — (తనలో) శృంగారవీరరసపంపటుం డగు లాటేశ్వరుఁడు వచ్చుచున్నాఁడు. (ప్రకాశముగా)

ఆ. వె. జగమునేత కాఁడు జలజాతభవుఁడు మున్
సందెవార్చునాఁడు జలముఁ జులుక
ముగనొనర్ప నందుఁ బొడమెఁ జులుక్యుఁ డా
తనికులంబువాఁ డితఁడు కుమారి.

ఉ. వేరముఁ బూనినట్టి పృథివీపతులం బ్రధనిలోన గెల్చి యు
ద్వారలముండ్లకేగ వెలభామలు మౌక్తికకంధరాచల
ద్ధారలు చూచు కీర్తనిముదంబున నంచులతుందు షట్పద
శ్రీరహిమించు లేమొగలిరేకుల రేకుమదంచు మాపులన్.

హేమ — అష్టమీచంద్రసదృశలలాట యగు జానకీ! ఇతండు లాటేశ్వరుండు శ్యామలధవళంబు లగుకటాక్షంబుల నీతని నిరీక్షింపుము.

సీత — అనుదినముఁ దన్నలంకరించుటతోనే కాలము కడపువాఁడే కాఁడు?

ప్రతీ — ఇతఁడు సహజముగా మాయావి (ప్రకాశముగా)

గీ. చాపపుంజువ్వ దుడిచెడురూపుదోఁపఁ
జేయిసారించునే కాని చేతఁబట్టి

వింటి నెత్తను నెత్తెడు తొంటిచోటు
చేరనైన రాఁడేమి చిత్రమితఁడు.

రావ— నిజము, వీఁడు శృంగారలంపటుఁడే కాని వీరపపమునకుఁ బగఁడు.

ప్రతీ— (తనలో) ఇదిగో! కుశస్థలీనాథుఁడు వచ్చుచున్నాఁడు, (ప్రకాశముగా)

సీ. నాటించె నెవఁడు సేనానీముఖంబుగా నసవుఁగంబములు దిగంతములఁ
కావించె నెవ్వండు కరుణతో ధూతౌమయుంబైన వైద్యశాస్త్రామృతంబుఁ
ఎవనివంశమునకుద్భవము బాపఁడు కాకమున్న విశ్వామిత్రమునివరుండు
వహియించె నెవ్వఁడా బాలగోపాలంబుఁ దెలియ సుశ్రుతుఁడను కలికి పేరు

గీ. చేసె నెవ్వఁడు మేటిదక్షిణలతోడ
రాజసూయాదికక్రతురాజములను
సకలరాజన్యవినుతప్రశస్తియితఁడు
సల్లలితుఁడు కుశస్థలీవల్లభుండు.

చ. గురిజపుఁబేర్లు నేరెటిచిగుళ్లను గప్పినయప్పిఱుందు లం
బరముచెఱంగునందు మడుపంబడు జేగుఱురాలు నొదలఁగా
దుటిమిన నెమ్మిపింఛములునుం గలవేసము నొక్కయింతలోఁ
గఱతురు కాన నేతదరికాంతలు చెంతలఁ జేర్పఁ జెంచెతల్.

హేమ— ముష్టిగ్రాహ్యమధ్యయగు వైదేహీ! ఇతఁడు మధ్యదేశనరేంద్రుం డీతని గుతూహలవికసితనయనజలజవై చూడుము.

సీత— ఇతఁడేనా! మందరాద్రిచేతం దఱువంబడిన పాల్కడలియందుం బొడమిన ధన్వంతరికిఁ జరమావతారం బగుదివోదాసుని ప్రథమశిష్యుఁ డగుసుశ్రుతుఁడు.

ప్రతీ— క. ఎడమకరంబున విల్లొని కుడికేలం బ్రాడు లాగికోఁజాలక వి
ల్విడనాడఁడు వంచం డీతఁడు పదుగురు జెండ్లుచూచి తమనవ్వంగన్.

రావ— ఓహో! కుశస్థలీనాథ! నీవాయుర్వేదమున నుశిక్షితుఁడవైనను ధనుర్వేదమున కుశలుండవే. అన్నిరోగములకుం దగినయౌషధ మెఱుంగుదువు గాని హరచాపారోపణమునకుం దగినయౌషధ మెఱుఁగవు.

ప్రతీ— (తనలో) వీరే! రాజు లనేకులు హరధనురారోపణంబునకై గుంపుగుంపులుగఁ దయచేయుచున్నారు (ప్రకాశముగా)

సీ. చండాసిరక్తి యోధ్రుఁడీతఁ డీతఁడే మగధభూమిభర్త మాన్యయశుఁడు
కాంభోజవిభుఁడు విఖ్యాతాన్వయుండీతఁ డీతఁడే సౌరాష్ట్రభూతలపతి
సకలకలావేత్త శకనృపాలకుఁడీతఁ డీతఁడే నేపాలనృపవరేణ్యుఁ
డఖిలభోగాన్వితుం డంధ్రేశ్వరుఁ డీతఁ డీతఁడే కర్ణాటనృపవరుండు

గీ. ఇల్లిదే యెల్లభూపాలు రేగుదెంచి,
రిందుమౌళిధనుస్సుపై, నిందువదన
గోముపైఁ, గుతూహలమును, బ్రేమభరము
మెండుకొనఁగా రసస్ఫూర్తి నిండుకొనఁగ॥

హేమ— హారలతాలంకృత ఘనస్తనీ! ఘనస్తనితప్రచండగంభీరభీషణభాషణులును, సకలమహీమండలమండనైకపరాక్రములునగు మహీపతులు వీరుగో! వచ్చుచున్నారు. నిండుఁ దమ్మిరేకుదొప్పలంబోని తెలిగన్నులు విప్పార వీరిఁబరికింపుము.

సీత— ఏలొకో యీనరపాలురు సకలక్షత్రియమానఖండన మగు ఖండపరశుచాపారోపణమున బింకములు వెలార్చుచున్నారు!

క. ఏకాగ్రమైనమనమున నీకార్ముక మర్చనీయమే యుల్లరకుం
గాక మఱేమనుచు నమోవాకంబులఁ గేలుమోడ్చువా రది వారల్!

క. కొందఱు రాజులు చేతులయందుం బురహరునిచాప మూఁపమి నట వా
రందఱు నవ్వఁగ నిలపై ముందఱి బోరగిలఁబడఁగఁబోయిరి కట్టా.

రావ— ఓహో! వీ రందఱును నొక పురహరుచాపమే యారోపింపఁజాలకపోలేదు, తమపేరులఁగూడ ప్రవీరులలెక్కలో నారోపింపఁజాలకపోయినారు.

ప్రతీ— ఈక్షత్రియు లందఱును క్షత్రియులు చేయందగినచాపారోపణరూపకార్యంబున నోపమిఁజూపుచున్నారేమి? ఇఁక నిందు వికర్తనకులకుమారుండగు రాముఁడుమాత్రము మిగిలియున్నాఁడు (పెదవులు విఱిచికొని] ఈకుఱ్ఱఁడు మాత్ర మేమి చేయఁగలఁడు.

గీ. దేనిరజము రాల్పఁ దివిరి లోహపునాది
వాఁడిమొనలకేని గోడుచెడునో
యట్టివజ్రమునకు నక్కటా బోటుల
గోటిగీటు లెంతపాటి తలఁప.

(ఆలోచించి) అయినను వీతనిఁ గొనియాడెదము. వీరుల సారంబు గుర్తింపఁదరము కాదు. అందులో విశేషించి సూర్యవంశపు రాజుల పరాక్రమంబులు బొత్తిగాఁ దెలియవు.

రావ—లంకాధిపతి నగు నే నీచాప మలక్ష్యభావముచేత విఱువమానితి; నీ రాజులందఱును విఱువనసమర్థులైరి. వృషధ్వజాయితము విజృంభించినదన్న మాట సుమా! (చాపము నుద్దేశించి) ఓహో! తవెదురుబద్దా! హరశరాసనమ!

గీ. వాఁడు విఱుచక దిగద్రావి వాఁడటంచు
ద్రఢిమ గర్వంబు మానుమా, తొఁదలఁచినఁ
జిద్రుపలుగఁ జేయఁజాలు మూండేతిలాఘ
గల్గువాఁడు సుమీ దశకంఠుఁ డవఁగ. (లేచుచున్నాఁడు)

ప్రహ—దేవా! ఇది హరకార్ముకము గాదు. ఈమె సీతయును గాదు.

రావ—ఏమిటి?

ప్రహ—నాటకము.

ప్రతీ— గీ. నీరు పుట్టినిల్లు నిశ లగ్నిహోత్రంబు
తనువునందు రుచులు దాఁచువాఁడు
చదలితోడవు నిశలఁ జందమామ వెలుంగు
నైన సూర్యునకు జోహారు సేతు.

అట్టివిక ర్తనకులంబునందు మను వుదయించె; నా మనువంశంబునం దుదయించినవారనేకులు గల రందు,

క. అంగజులవలన సాగరమం గావింపించె సగర భూపాలుఁడు ద్యో
గంగం దెచ్చి యవనిపూతంగావించెను భగీరథక్ష్మాపతియున్.

క. వారికులంబునఁ గలిగినవారల నధికుండు భరతవంశీయసదా
చారుండు వీరుఁడుం బది తేరులదారి యాజి యాజిధీరుం డలరెన్.

చ. ఎగుభుజముల్ విశాలలలితేక్షణముల్ గలయుందగాఁడు, మె
ప్పుగనినవాఁడు సద్గుణసమూహముచేత నరోత్తమాధ్యలో, ధను
ర్నిగమము గాధిసంభవుఁడు నేర్పిన నేర్చినవాఁడు, రాముఁడన్
సొగసగు పేరుదాలిచిన కూరుఁ డితం డిదె యేఁగుదెంచెనున్.

రామ—తమ్ముఁడా! లక్ష్మణ! ఏమిది. ఇతఁడు నా పేరెత్తుచున్నాఁడు? (అని లేచుచున్నాఁడు)

లక్ష్మ—ఇదిగో ! నేనును లేచుచున్నాఁడను. (లేచి ఇరువురును మంచముదిగిరి)

ప్రతీ—బాగు ! రామభద్ర ! బాగు ! నిజముగా సూర్యకులాలంకారాంకూరమ వని పించుకొంటివి.

రావ—ఓరీ ! క్షత్రియపోత ! అభిమాన మనిన నీకే కలదురా ! అధ్యవసాయమన్న నీవేయెఱుఁగుదువురా ! మనుష్యస్త్రీలయందు నీతల్లియె పుత్రవతి !

జనక—విశ్వా-ఈతఁడు దిలీపదశరథుల నతిక్రమింపఁగల పనిచేయఁబూనినవాఁడు!

హేమ— రామచంద్రునకు వయసునసే చిన్నతనము. నడవడి నన్నో అఖిల రాజమండలమున కంటెఁ బెద్దతిక మున్నది.

శతా—ఓసూర్యశిష్యాంతేవాసీ! యీ బాలుఁ డతిసాహసివలె నున్నాఁడు! ఏలన:—

క. చాపం బీశ్వరుని దనియు, భూపాలురు విఱువలేకపోయిరనియు నీ
పాపఁడు లెక్కింపఁడు బలె ! బాపురె ! సూర్యాన్వయంబు పాటికి నెక్కెన్.

ప్రతీ—క. కంపముఁ గనఁబో కాదినుదంపతుల కెఱింగి విఱువఁ దలపెట్టెను బల్
తెంపు గలిగి యింపగునో కంపగునో బుడుతవాని కర్మంబు కటా.

హేమ—భగవంతుఁడు దాక్షాయణీవల్లభుఁ డేమిచేసెనో అదియే చేయఁగలఁడు ! సింగంపుఁగొదమలవంటి ముంజేతులుగల యీబాలురకు భుజదండమండనీయ మగు కార్యంబున దుష్కరత యెట్టుండును !

రామ—(చాపంబునకు నమస్కరించి.)

క. పురములు పూర్వము కాలిచి సురసారమయంబ వైతిచూ; వైదేహీ
వరకారణమైతిపుడో హరచాపమ ! నీకు నే జోహా రొనరింతున్.

(వేగముగాఁ గోదండముఁ గేలం గొని లక్ష్మణు నుద్దేశించి)

గీ. వత్స ! లక్ష్మణా ! తగఁ గనువైచికొంచు
చుండుమా మద్భుజాకాండదయుగ్మ మూర్ఛ
టింప హరచాపమదియె విటేలుమనునొ
ఎక్కుడఁగరాక త్రాడె పుటుక్కుమనునో.

రావ—ఇదిగదా యీటగాండ్రయార్భాటము !

లక్ష్మ—ఆర్యవర్యా ! హరకరాకర్షణంబు సైతము సహించిన యీవిల్లు విఱుగుట సంభావ్యము కాదునుమా!

రామ—అయిన నిదిగో ! ఎక్కువెట్టుచున్నాను.

రావ—ఇదియును వటబిభీషికయే.

ప్రతీ—(అంతటఁ జూచి)

గీ. చాపకోటికై యెంతెంత సాఁగుచుండె
నారి రామానుబంధమాత్రనను గ్రమముగ
నంతకంతకు సర్వనరాధిపులయు
వెడమొగమ్ములు వెస నల్లఁబడుచునుండె॥

లక్ష్మ—ఈరాజు లందఱకును సేవలను మొగంబులు నల్లఁబడుటయే గాదు.

మ. నగుచుం దుర్భిరిముందు జోడ్లు సగముగా జాపంబుఁ బైకెత్తనెం
చఁగ, నారిం బిరిగొల్పి లాగఁ దలఁపం జప్పుట్లు వాయించి, లిం
పుగ నారిం గొనఁ గూర్పఁబోవఁగ మొగంబుల్ వాల్చి, రాకర్షితం
బుగఁజేయం దమ యున్నగద్దియలపై మూర్ఛిల్లి రెంతేనియున్.

ప్రతీ—(హాతాత్తుగాఁ జూచి) ఆకర్షితంబే కాదు విఱిగిపోయినది. (బిగ్గరగా)

మ. మును పెన్నుండును సేరిచేతను బరాభూతంబు గాకున్న ధ
ర్గని యీవిల్విఱిగెన్ రఘుప్రవరుఁ డారోపింప రాజన్యనా
శనదీక్షాచరణప్రచారునకు క్రించక్షాత్రధరద్వేషికిన్
ధనురామ్నాయనిబోధనప్రవణమన్నా ! యెంతయాశ్చర్యమో !

రావ—ఇదియును గల్లనుగూడ నిజ మనిపించు కవివచనరచనయే.

విశ్వా—సఖా ! సీరధ్వజ! రామచంద్రునియందలి మాధనుర్వేదము నేఁటికిఫలించినది.

శా. చేతోరాముఁడు రాముఁ డీహరధనుశ్శింజాచ్యుతిం జేయఁ ద
జ్జాతారావము మ్రోఁగె వేలుపు లవిశ్వస్తభ్రమోపేతులై
కాశక్యంబు వహింప దిక్కరిఘటాగండస్థలం బెండఁగాఁ
బాతాళంబులు వేఁడు భీతిఁ జలియింపన్ దిక్కశేకంబుగన్.

శతా—ఏమివింత ! ఏమివింత ! రామచంద్రునిచరిత్రము ముక్కంటికన్న మిన్నగా
నున్నదే.

సీ. జగము లన్నియుఁ బ్రోవఁ జదివినతొలిపల్కుకళ కాదిఁబల్కునోంకారమనఁగఁ
బగఱడెందంబులు పగుల వార్చిన యమునాసోదరుని బిట్టునవ్వనంగఁ
లజ్జపెంపున నాదలలు వంచు జోడ్ల కీర్తిని బాఁదోలు భేరిరవ మనఁగఁ
దన కీర్తిమహిమ కెంతయుఁ బొగడ్తయొనర్చు వందిమాగధుల కైవార మనఁగఁ

దనరు టంకారమునన రోదఃకటాహ
ముదురిప ముక్కంటిచాపంబుఁ జిద్రుపల్కగ నా

నర్పినట్టి విశర్త్యాన్వయకుమారుఁ
డనుఁగుఁ బెండిలికొడుకయ్యె జనక! సీత.

జన—భగవంతుండగు నీలలోహితునియనుగ్రహము.

గీ. ఏనరేశ్వరులును జేయలేని గొప్ప
పని యొనర్చిన పనివాఁడు మనకనుంగుఁ
బెండ్లికొడుకంచు మోదంబు, విఱిగిపోయె
నభవువిల్లని మఱియుఁ బెల్లడరు దోఁచె.

సీత—సకియా! హేమప్రభా! హరదేవధనుర్భంగము జరగెను గదా.

హేమ—అంతే కాదు. మాసఖురాలికిఁ బరిణయముఁ గూడ జరగనై యున్నది.

రావ—(పెద్దనవ్వి) ప్రజ్ఞావంతులచూపు గొప్పమననుగలవారి తెలివితేటలమీఁదఁ బొలుచుండును.

ఉ. తా నొకపెద్దగాఁ దెలివితక్కువవాఁడగురాముఁ డీమహే
శానుని ప్రోఁతవింటిని బిసప్రతిమానముఁ దుంచినంతమా
త్రాన నముజ్జగంబుల బరాబరి కీర్తుల సోఁకు లేనికి
మానికి నిర్జితాగ్రజవిమానికి మానము తగ్గిపోవునే.

రామ—(గద్గదస్వరముతో)

శా. ఆరోపించితి శైవచాపలత విశ్వామిత్రువాక్యంబునం
దోరాస్ఫాలన సేఁప కయ్యదియు మంతుందెచ్చె రెంటాము; ల
జ్జారూక్షానముఁ డయ్యె దాన జనకక్ష్మాభర్త; యే ముత్తరం
బారంభించునొకో క్షమాపణకునై యద్దేవుతో నిత్తఱి?

లక్ష్మ—లోకంబునం బౌరుషంబులకుఁ జాల భేదము గలదు.

ఆ. హరునికార్ముకంబు విఱుచుటఁ గని మాదృశులకునెల్ల మేను పులకరింప
గద్గదస్వరంబుగాఁ జూపు నాసాగ్రమందు నిలిపి యార్యుఁ డందుఁగుందు.

విశ్వా—శతానందా! దిలీపకులాలంకారంబగు దశరథునికుమారుఁడగు రాముఁ డిట్టి పనియొనర్చె ననుట కబ్బుర మేమి!

శతా—మహారాజ! జనకచక్రవర్తీ! యిఁక మం దొనరింపఁదగిన కృత్యంబులొనర్చి రామచంద్రునకు సీతను బెండ్లి చేయుము.

జన—(మంచమును దిగి కొంత నడచి)

క. ఖండితచండీశధను ర్దండభుజాదండనిర్జితేన మత్పుత్రిన్
పెండిలి గమ్మిఁక రాఘవ! యుండుంగా కింకఁగమలయుం గమలమునన్.

(అని రామభద్రునిచే సీతాపాణిగ్రహణము చేయించుచున్నాఁడు)

ప్రహ—(నవ్వి తనలో)

చ. నటజనకుండు నాటకమున న్నటమైథిలి రామమూర్తికిన్
పటువ కొసంగఁగాఁ దలఁచినం గని సత్యముగా తలంచినం
తట నరుణమ్ములయ్యెఁ గనుఁదమ్ములుఁ గత్తులువూనెఁ జేతులున్
బటపటలాడె దంష్ట్రలును బండ్లును మాదశకంఠభర్తకున్.

(ప్రకాశముగా) రాక్షసపతీ! నాటకము సమాప్తికావచ్చుచున్నది. కావున నర్తకుల యభినయచాతుర్యమును రసవృద్ధియుఁ జక్కఁగఁ బరిశీలింపుము.

రావ—(సిగ్గుతోఁదనలో) ఇది నాటకమా! నిజమనుకొని వ్యర్థముగాఁ గోపపడితిని సఖా! ప్రహస్త! యేను మున్నొనరించినప్రతిజ్ఞ మఱచిపోలేదు గద!

ప్రహ—మఱచి పోలేదు (అని మొదటియంకములోని "ధరణియు నింగియుం బగిలి" అను పద్యము చదువుచున్నాఁడు.)

రావ—తప్పక యీపని చేయుదును.

(రెండవతెరలో వైతాళికుఁడు ప్రవేశించి) మహారాజ! నీకు జయము నీకుజయము సాయంసంధ్య యల్లుఁడగు రామభద్రునితోఁ గూడ దేవరకుసుఖప్రదమగుఁగాక

మ. ముకుళీభావము తమ్మిపూవుల కొసంగి బోధించి యస్తాద్రిచెం
తకు మార్తాండుఁడు వోవుదెంచెఁ బరిశాంతం బైననీరెండతో
నకవోష్ణంబులు నైన ధీధితులముం దందండఁ జీఁకట్లు మే
చకనీరేజవనాళికుట్మలసమచ్ఛాయం బ్రవర్తిల్లఁగన్.

గీ. సంధ్యకును వాసరమునకు జరుగుచున్న
పరిణయములోని హోమాగ్ని భాతిఁదనరె
భానుబింబంబు; లాజల భాతిఁ జెలఁగెఁ
దరళతరళంబులైనట్టి తారకలును.

(మఱలఁదెరలో) దేవరా! దేవు లిట్లు విన్నవించుచున్నారు.

గీ. అంతిపురివారు చనుదెంచి రతిశుభప్ర
దము వివాహముహూర్తంబుఁ దానువచ్చెఁ
గూఁతుతోఁగూడఁ బెండిలికొడుకు రామఁ
బరిణయప్రదీక్షఁ గైకొనఁ బనుపు జనక.

జన—ఇదిగో! పంపుచున్నాను. నేను బోవుచున్నాను. (అని ప్రతిహారి చెవిలో నేమేమో చెప్పుచున్నాఁడు.)

ప్రతీ—(కొంచెము బిగ్గరగా)

క. ఈపుణ్యసభకు వచ్చిన భూపాలకులార! జనకభూపాలుఁడు వి
జ్ఞాపింపుమనియె మత్పురగోపురములనుండి పూజ గొనవలె ననుచున్.

(అందఱును నిష్క్రమించుచున్నారు)

ఇది సీతాస్వయంవర మను పేరుగల గర్భాంకము.

రావ—(ఆలోచించి)

ఉ. రాజులకోల్మినందు రఘురామునకున్ యశమబ్బలేదు భ
ర్గాజగవంబు భంగమును నందనులే దిదియొల్లఁ గల్లగా
నీ జగజెట్టియైన రజనీచరనాథునియుల్కుఁ గుంగటా
యాజికుమారుఁ డొక్కరుఁడ యగ్గలమాయెను వేయు నేటికిన్.

(సీతమదలఁచుకొని) "చిలువగవున్నచో"—అని పఠించును)

ప్రతి—దేవా! దేవతానాటకము సమాప్తమాయెను గావున భరతాచార్యపుత్రుల కిఁక సెల విమ్ము. దేవరయును నంతఃపురమునకు విచ్చేయుఁడు.

(అందఱును నిష్క్రమించుచున్నారు)

ఇది...... శ్రీతిరుపతి వేంకటేశ్వర విరచితంబగు నాంధ్రబాలరామాయణనాటకమున విలక్షలంకేశ్వరమను తృతీయాంకము.

శ్రీరస్తు

# బాలరామాయణము

## భార్గవభంగము.

### చతుర్థాంకము

(పిదప నుపాధ్యాయుఁడును శిష్యుఁడును బ్రవేశించుచున్నారు)

శిష్య—ఓయుపాధ్యాయా! తమయొద్దఁ జదువుకొనుటకు వచ్చినవాఁడను నాపేరు భవభూతి సాష్టాంగపాతముగా నమస్కరించుచున్నాను.

ఉపా—విద్యావంతుఁడవు కమ్ము! ఆయనా! భవభూతీ! నీ కుపనయనాదిసంస్కారము లాచరించినవా రెవరు? నీ వెటనుండి యిటకు వచ్చితివి?

శిష్య—భగవంతుం డగుపరశురాముఁడు. వారి యాశ్రమమునుండియే వచ్చితిని.

ఉపా—భగవానుఁ డగుపరశురాముఁ డీశ్వరునివలన ధనుర్వేదమును జతుర్దశవిద్యలునుగూడ జదివినమహానుభావుఁడు గదా! అయ్యనఘుని వదలి మఱియొకని యొద్దఁ జదువుకొనుటకుఁ గారణ మేమి?

శిష్య—ఓయుపాధ్యాయుఁడా! దృష్టమున ననుపపత్తి యుండదుగదా!

ఉపా—దృష్ట మేమి?

శిష్య—మహర్షి యయ్యును సమరసమారంభదురాగ్రహము వదలినవాఁడు కాఁడు?

ఉపా—అతనికిఁ దల్లిపోలికవలనఁ గలిగిన సమరవాంఛాపిశాచము యావజ్జీవమును వదలదు.

శిష్య—ఈభల్లంబులు వినిహతరిపుగజఘటాపార్శ్వవ్యాసక్తశల్యంబులనియు నీక్షురవప్రంబులు విద్రావితవైరిదర్పంబు లనియు నీనారాచంబు లసమసమరసమారంభవప్రవర్తితవైరివీరరుధిరధారాప్రవాహంబులనియు నీబాణంబులు సకలక్షత్రియగోత్రనిర్దళనదుర్లలితంబులనియు సర్వదా యింత యమ్ములకట్టను మోయించుచుండు నాపరశురామునివలన నొక్కముక్కయుఁ జదువుకొనుట లేదుగదా తుండువలె నుండువాఁడను సైతముఁ జిక్కిపోతిని. నిన్నటిసాయంకాలము దశరథుని రాముఁడు నీలకంఠుని శరాసనము విఱిచెనని యతనితో యుద్ధంబునకుం బోవువాఁడై యిన్నిబాణంబులు కట్టగట్టి నానెత్తిమీఁదఁబెట్టెను. నేనవి మోయలేక భయంపడి రాత్రివేళఁ గాళ్ళువచ్చుదు

లేకుండఁ గదలి పాఱిపోయివచ్చి యుపాధ్యాయులుగా మీ కాళ్ళఁ బడితిని గావున నన్ననుగ్రహించి విద్యార్థిగాఁ బరిగ్రహింపుఁడు. నే నతనియొద్దఁ జదువుకొనను లేను, ఈయమ్ములకట్ట మోయను లేను.

ఉపా—ఈవిషయమును నే స్వర్గగమన ప్రభావము గల్గిన మునిశిష్యులవలన వింటిని. నాఁడు పురందరుఁడు కూడ భార్గవసమరసంరంభమును విని దశరథు నటకుం బిలిపించుకొని సత్కరించి పంపెనని కూడఁ జెప్పిరి (ఆలోచించి) ఏండ్లుగడచిన వాఁడును బహుగురజయించినవాఁడునునగు పరశురాముఁడెక్కడ! పసితనపు మిసిమినొప్పారు ముద్దుమోమువాఁడా రాచకున్నయెక్కడ! ఇద్దఱకు నంతర మెంతోయున్నది. (విమర్శించి) ఒకసారియే చూచితిని. అయినను నా రామభద్రుఁ డిందు సర్వదా నా కన్నులఁ గట్టినట్లే కనిపించుచుండును. (అని యాకసమువంకకుఁ జూచి) కటకటా! పరశురామ!

చ. ధరణిభృదన్వయంబునకు దాఱు పురాతనధన్వి మీసులుం
నరపినయట్టి పెక్కుముసలి నవ్వులచేటిది; తాటకాంతకుం
గరమున విల్లుదాలిచినకందుమమాననివాని క్షీరకం
ధరు నెదిరించి పోరునఁట తా జమదగ్నిజుఁ డేలకోంకఁడో!

శిష్య—ఉపాధ్యాయా! ఇట్టిపరాక్రమము గలపరశురాముఁ డల గిరీశశరాసనం బే లారోపింప లేఁడో.

ఉపా—ధనుర్విద్యావిశారదుఁ డాతఁడు సబ్రహ్మచారు లెంత ప్రేరించినను పలుదపవ లిట్లు బహులు చెప్పియూరకుండెను.

శా. నాయాచార్యులవారు నా, రెపుడుఁ దన్నామాక్షరోచ్చారమేఁ
జేయంగా రా దఖిలాస్త్రవేదమును దచ్ఛిష్యుండనై నేర్చితిం;
బ్రాయంబుం జనెఁ దాల్చితిం మఱియుటుల్ వైఖానసత్వంబు, నా
చే యావిల్లెటు లెత్తు సీతకయి యిస్సీ యెంతలావుండినన్?

శిష్య—ఉపాధ్యాయా! యీపరశురామరఘురాముల సమరసంరంభమున జయ మెవరికిఁ జెందునని మీరు తలఁతురు?

ఉపా—(ఆలోచించి) భవభూతీ! యిరువుర పరాక్రమంబు నెఱింగిన వాఁడఁ గాన నేనెటును నిశ్చయింపఁజాలకున్నాఁడను.

చ. హరుఁడు గనుంగొనం దురమునందుఁ గుమారు జయించె నొక్కఁ, డా
హరునిశరాస మొక్కఁడు లతాంతముఁ ద్రుంచినరీతిఁ ద్రుంచె, ని

స్యాఁడు సరిలేనిలావుగలవాఁడు; లేంబుజముంబు వోలెఁ గం
కరకరుణాకటాక్షములు గల్గినవానిగా గనంబడుఁ.

(తెర లో)

క. కండిలపులహవిభండక శాండిల్యప్రముఖవిబుధసంయములారా
రండు కనుంగొండని రాకొంచిన వారదుఁడు తిట్టకుండుఁడు సుండీ.

సీ. రాఘవుం డెదిరి భార్గవుతోడఁ దలఁపడు గనఁగొనుఁడయ్య దిక్పాలురార
రామపరశురామరణము కంటికింపు దయచేయుఁడయ్య గంధర్వులార
దశరథాత్మజజామదగ్న్యులయాని జూడఁ బదుఁడయ్య కిన్నరస్వాములార
పార్వతీనాథవిశ్వామిత్రశిష్యులకతు గన్గొనుఁడయ్య యక్షులార.

గీ. వేగ రావయ్య వెనకయ్య వెనుకవాఁడ
యూఁతఁ గొని రాఁగదయ్య లంబోదరయ్య
చంద్రభాస్కరులార! యీసమరమునకుఁ
గోరి దయచేయవలెఁ జుడీ మీరుఁ గూడ.

శా. రా రంభా! విసరా ఘృతాచి! భ్రమరీ! రా, మందరీ రా, సుకం
ఠీరత్నప్రభలార! రండు, కలకంఠీ! రమ్మ. రావే, సుధీ
రా! రామా నెదునమ్మ చిత్రలతరో! రావమ్మ సౌదామినీ!
చేరంబోఁదగు నేఁడు మీకుఁ బతిఁగా శ్రీరాముఁడో రాముఁడో.

ఊహా— నాయనా! భవభూతీ! కలహకుతూహలి యగునారదుం డాగ్రహోను
గ్రహములతో నందఱను సంగరంబునకుఁ బిలుచుచున్నాఁడు! మనముఁ గూడ
నాతనితోఁ బోదము రమ్మ (అని నిష్క్రమించుచున్నారు)

(పిదప మాతలిసారథికంబగు రథంబుతోఁ జామరవాహినియగు సౌదామినియుం
దశరథమహారాజును బ్రవేశించుచున్నారు.)

దశ— (అంతటఁ గలయంజూచి) ఆహాహా! వికసించిన పారిభద్రపుఁబూలగుత్తివలె
రమణీయమగు నరుణసంధ్యారాగముగల యీయంతరిక్షముం దుంటిమి. గగన
గర్భమున బ్రాతఃకాలరామణీయకం బెంతవింతగొల్పుచున్నది!

ఉ. హైకిని గ్రిందికిం గలయఁ బ్రాఁకెడు బాలవివస్వదంశువుల్
చీఁకటుఁ దివిఁ భువి గ్రసింపఁగసాగె సముంబుగాఁగ మం
దానిలోఁ బ్రభాతసమయంబునయందున లేఁతతమ్మిపూ
రేకులకుఁ వికాస మలరం గడునాకులభావ మొప్పఁగన్.

చ. తెలతెలవాఱఁ దా బయలువెడలినయప్పుడు మ్రోగు డిండిమం
బుల వినువీథి హెచ్చరికఁబొందుచు ముందఱి మావటీళ్ళు దం
తుల నొదిగింప దేవధునితోయములో మునుఁగంగ వచ్చె వే
ల్పుల తెలియేన్గు ఘాతతటబూనశిలాదళనాగ్రభాగమై

(స్మరణమభినయించి) ఆర్యా! మాతలీ! ఇరుబుజంబుల ప్రేలాడు సంతాన ద్రుమమాల్యంబులు సురసుందరీ కరాందోళితచారుచామరాగ్ర మంజ్యనానంబులై కదలుచుండ ననేకంబులగు సోఁసుమూఁకలం గీటడఁగించిన శచీనాథుండు 'మిత్రమా! దశరథ! నీవు వేగమ మిథిలాపురంబున కరుగుము. భూలోకసంచారంబునకు మదల యీఁబడిన మాచారణచారులాకాశవార్త నేఁడు మాతోఁ జెప్పిరి మిథిలాపురంబున హరశరాసనంబు పణంబుగా నిశ్చయింపఁబడిన సీతాస్వయంవరమునకు వచ్చినరాజు లందఱా శరాసన మారోపింపలేమిఁ గుఁదుచు లజ్జామాత్సర్యరూక్షాననులై చూచుచుండఁగా—

చ. చిలువలఱేఁడు తాల్పు సరసీరుహలోచనుఁ డమ్మ పైఁడిగు
బ్బలియెకిమీఁదు గాత్రము తుషాకరపాళి ధనుర్ధరుండుఁ గా
వెలసిన దివ్యవైభవప్రువింటిని దా నలవోకఁ దాల్చి దో
ర్బలమున రామచంద్రుఁడట భగ్నముఁజేసెనఁ టొక్క వ్రేల్మిడిన్.

తరువాత గురుచాపంబువిఱిచె ననిపరశురాముండు కోపించి రామనృపునితో యుద్ధంబొనరింపఁబోయెనఁట నీవును దత్ప్రతీకారంబొనర్చి పనూవరుల నయోధ్యకు నంపించి పిదప సురకార్యశేషంబు నిర్వర్తింతువుగాక ' యని యానతిచ్చె.

మాత—అయిన వేగముగా రథము పోనిచ్చెదను.

దశ—మాతలీ! మనదేవేంద్రుఁడుగారికిఁ బరశురామునియెడం గలుగుగౌరవ మెట్టిదో యెఱుఁగుదువా.

మాత—చాలగౌరవము కలదు. వినవలతురేని వినిపించెద.

గీ. నందనమునందు దేవయానంబునందుఁ
గూర్కుటింటను దమకొల్వుకూటమందు
రేణుకాసుతుచిత్రచరిత్రలెల్లఁ
జిత్రగచనచేయించి వీక్షించుచుండు.

ఎక్కడనో యేల మన మెక్కినయీరథము వాల్గుపక్కలయందును దచ్చరిత్రచిత్రములే చిత్రింపఁబడియున్నవి. (వ్రేలఁజూపించుచు) ఇది పురాధిపులన ధనుర్వేద మభ్యసించినచరిత్రము.

దశ — ఇదిగో! ఇక్కడఁ బెద్దతాళ్లు గల్గినకొండ యున్నది. హిమానీసముపేతంబు
లగు దీనినెత్తమ్ములు చూచిన మంచుకొండ యని తోఁచుచున్నది.

మాత — చ. ఇది హిమవద్గిరీంద్రమె మహేశ్వరుఁడుం గిరిపుత్రియున్ వసిం
చుదు రట, దీనినెత్తముల జూదములాడుచు వేల్పుటాండ్రు చె
న్నుమీఱు భవచ్చరిత్ర, మదనం దనుమంతుని జూచినట్లు చె
ప్పుదు రిటవారు మూఁకలనునం బరిహాసమ్ముసూక్తవుల్.

చ. ఇతఁడు మహేశ్వరుండు త్రిదశేశ్వరవంద్యపదుండు శిష్యసం
తతికి శరాసనాగమవిధానముఁ జక్కఁగ నేర్పుచున్నవాఁ
డితఁడు గజాననుండు గుహుఁ డీతఁడు తక్కినవారు వీరు ను
వ్రతులగు భార్గవాదులు కరంబులు మోడ్చినున్నవారొగిన్.

దశ — మాతలీ! ఏమి! ఈభార్గవునియదృష్టము! భగవంతుండగు చంద్రమౌళియే
యిమ్మనుజునకు నీఁడురిన కాచార్యకంబు నేయుచున్నాఁడు.

సౌదా — ధనుర్వేద మభ్యసించియు సాము నేర్చుకొనుచున్న శిష్యు లిచ్చటనే
యున్నారు. దప్పులకుం బోవుటగు గుతివాయుమియు గాటము గాఁ దగు
లుటయు మన్నగు రామబాణముల నిక్షేపము లిచ్చటఁజిత్రింపఁబడియున్నవి.

మాత — అహో! ప్రతిభాపరీక్షకుఁ జాల హెచ్చుగ్గులు గలవు వీఁన —

చ. హరుఁడు సమంబుగా వటువు లందఱకున్ విలువిద్య నేర్చె, న
గ్గురుకృప శిష్యులంద ఱొకకూడిక గా నదియెల్ల నభ్యసిం
చి, రయిన నందు బుద్ధిసవిశేషుఁ డనందగె భార్గవుండ; లో
వరసిన సత్క్రియావిధుల నాఁగద పత్త్రియె యజ్ఞసూత్రముల్.

(ముందుఁజూచి) దేవా! యిటుఁజూడుము. పినాకివాత్సల్యము.

గీ. తనయులు గుహుండు గణపతి వెనుకొసినను
జేకొనక, ప్రజ్ఞమెచ్చి పినాకపాణి
సతతధృతనాగమైన హస్తంబుచేత
భార్గవుని వీపు తట్టు సేబా సటంచు॥

(మరల ముందుఁజూచి) మహారాజ! దశరథ! యిచట ఖురళీకలహంబునకుం
జొరఁబడిన త్రినయనాంతేవాసుల కలహము ప్రారంభింపఁబడినది! అచటఁ గోదండ
ఖాండిత్యంబునకుం దగినకలహము మొదలిడిరి.

దస — ఇది యట్టిదే —

చ. అదురుఁ గనుంబొమల్ నిటలమం దలుకం గుదిపింప భార్గవుం
డదరుచు వింటిత్రాడు మిళితాంగుళికంబగు కేల లాగ నా
రొదకు షడాననుండు గడు గోయుచు వీనులు మూఁడునాల్గులుం
జెదరఁగ ఖిన్నుఁ డయ్యె నిరుచేతులచే నవి మూయఁజాలమిన్.

సౌదా — ఇచ్చటఁ గైలాసశైలాగ్రంబునందుండి చండికానాథుండు నంది మొదలగు ప్రమథపరివారము తోడం బార్వతియుం దానును గుమారలంబోదరులు పరశురామతో నొనర్చు సంగరం బాలోకించుచున్నాఁడు.

మాత — కేవలము చూచుటయే కాదు; తా నుపదేశించిన ధనుర్వేదోపనిషద్విశేషములు చూపించు శిష్యుని చాకచక్యమునకు మెచ్చుచున్నాఁడు.

మ. శరపాతోపవినీతిరీతులు ధనుష్పాండిత్య మందింతకి
ద్ధరలో నెవ్వరు మున్నుసూపఁగలవారో యంచు శీతాంశుశే
ఖరుఁ డద్రీంద్రకుమారి కేలుగొని యక్కైలాసశైలాధిరా
ట్శిరమందుండి కుమారభార్గవుల వీక్షించున్ సముద్గ్రీవుఁడై.

దశ — మిగుల సంతసించుచున్నాఁడు! ఏలన —

ఉ. నంది ముదంబుఁ జెందఁ గణనాథుఁడు నవ్వుచుఁ గేరుచుండఁగాఁ
జందురుఁ డిట్టిటు దిరుగఁ జండుఁడు చండచరిత్రి చూప నా
నందముతోడ భృంగిరిటి నాట్యముసల్పఁ బురారి గౌరితో
నందనుకంటె శిష్యుఁ గరుణాపరుఁడై కనుచుండెఁ గంటివే.

మాత — మహారాజ! యిట్టిటుఁ జూడుము. హాస్యాద్భుతరసంబు లొక్కయెడ నావిర్భవించుచున్నవి.

ఉ. కరమున గొప్పవిల్లుఁ గొని కాండపరంపర లెత్తి వైచుచున్
బరశువు తొండపుంజివరఁ బట్టి లసద్ఘననాగ్రఘట్టన
స్థిరముగ విక్రమించుచును జేటచెవుల్ మొగమందుఁ గప్పుచున్
దొరలుచు గుజ్జువేల్పు రణధూర్వహుఁడై యనిఁ దేజరిల్లెడున్.

క. కరిచేష్టలు నరచేష్టలు, పరిహృతరుద్రాంబకప్రభావంతములై
గరువం బొడఁగూర్పఁగ నచ్చెరువొనరించుం గజాస్యుచేష్టలు గంటే.

సౌదా — గజవదన సమరజనిత దురాగ్రహగ్రస్తుఁడగు పరశురాముండు సమరరంగం బంతయు గణశూన్యం బొనరింపఁ దలంచినట్లు తోఁచుచున్నది.

దశ— సెబాసు సౌదామినీ! సెబాసు! నీ వనితమాట నిజమే.

చ. గణములు భీతిఁ గాల్కొలఁదిగాఁ బరువెత్తిరి వెండికొండకున్
గణపతి నందియున్ భయమునన్ విడనాడిరి విండ్లతోడ మా
ర్గణముల నంచు; లిల్లడరుగా బల మోహటిలంగఁ గ్రౌంచదా
రణుఁ డొకఁడే యెదుర్కొనియె రాముని నవ్వుచు వాఁడియమ్ములన్.

(ముందుఁజూచి) పరశురాముని యెదుట సేవియో యక్షరము లున్నట్లున్నవే
(అని చదువుచున్నాఁడు)

శా. అంతేవాసిని నేను బుత్త్రకుఁడ వీ; వర్ధేందుకోటీరు ను
స్వాంతం బొక్కనిపై విశిష్టమగు నెట్టి? ఘ్లాధారవైశిష్ట్య నా
యంత న్నాకగునంటివేని వినురా! యాధేయవైశిష్ట్య మీ
చెంతం గల్గుఁ గుమార! రార యని నీ చేలాపు చూపించురా.

మాత— మహారాజ దశరథ! పురోభాగం బవలోకింపుము. కుమారు నెదుర్కొను పరశురాముం గని లంబోదరుం డడ్డుపడ నాతనిపై జ్యోతిశ్ఛటాచ్ఛాదిత రోదఃకటాహంబగు పాశుపతాస్త్రముం బ్రయోగించుచున్నాఁడు.

దశ— ఇదిగో! ఇచట నొకయక్షరపఙ్క్తి కలదు (అని చదువుచున్నాఁడు.)

ఉ. వచ్చినయుల్కకుం గుహులవాకిలిగాచి పరిశ్రమింపఁగా
వచ్చిన విద్యకున్ బ్రబలబాహుబలంబునకుం బినాకికిన్
నచ్చినయట్టి శిష్యత కవర్ణ్యముకాని శరంబుచేత నీ
పొచ్చెమడంతు నోరిగణముఖ్య! భవత్సహజుండు చూడఁగన్.

మాత— ఇంతలో మఱియొకచిత్రము జరిగినది.

ఉ. కోపకషాయితుండయి భృగుప్రవరుండు గజాస్యు నొంచఁగాఁ
జాపమునందుఁ బాశుపతశస్త్రము వేఁ దొడునంతలో రణ
న్నూపురయై భవాని మొలనూలిమణుల్ దిగజాఱఁ బైఁటచెఱుం
బైపయి జాఱ నడ్డుపడె భర్గుఁడు నవ్వుచుఁ జూచుచుండఁగన్.

దశ—(ముందుఁజూచి) అహా! స్వభావముచే నుద్ధతుండగు పరశురామున కీవినయాతిశయము! దీననే యితనిచరితంబు ముల్లోకంబులచేఁ గొనియాడఁ దగినదిగా నున్నది.

శా. చాలుంజాలురరామ! శస్త్రి మరినోఁజాలించురా యంచు నా
ప్రాలేయాద్రికుమారి యడ్డుపడి చేరంబోవఁగా బాణ మా

స్మాలించెన్ విలు పాఱవైచెఁ జరణాంభోజమ్ములందుం బడెన్
లోలంబైన జటాచయంబు మును ముందుం గాళ్ళపై వ్రాలఁగన్.

సౌదా—మాక్కంటి కీముని పైఁ గల మూర్తి యనిర్వచనీయము.

దశ—(చూచి)

ఉ. చెంగట నాదలన్ మొగుపు చేతులు దాలిచి నమ్రుఁడై నయా
సంగరభీము రాముఁ గని సంతసమందుచుఁ జందమామాళి ముల్
బంగరుఁగొండ సానువుల భగ్న మొనర్చెడి వేళ ఖండమై
త్రుంగిన గండ్రగొడ్డలిని దోర్ముమంచు ననుగ్రహించెడున్.

కం. ఆనందమందె విద్యాస్థానంబులు వదియునా ల్గతని శంతటనీ
శానుండు నేర్పె; నిల నెన్నైన శుభములిడుసుగా మహోత్కులకూర్మిల్!

సౌదా— నాఁటఁగోలె రాముఁడు పరశురాముఁ డాయెనని తలంచెద.

మాత— మహారాజ! ఇటుచూడుము.

చ. అనుదినముం బ్రపాఠమునకై గురుసన్నిధి కేఁగఁ బండఁగ్ దో
వనడఁచి క్రౌంచపర్వతము పైకొనఁగాఁ గని యొక్కవాఁడియ
మ్మున నొనరించెఁ బెద్దబిలముం దనరాశుఁ బోఁక; కట్టిత్రో
వన యొనరించు నేఁటికి నుపర్వసరోగతి రాజహంసముల్.

దీనికేమి, యిటుచూడుము! ఒకదెసఁ బితృభక్తియు నొకదెస మాతృహత్యయుఁ గూడ జరగుచున్నది.

దశ— పాపము శమించును గాక! జమదగ్ని సుతుండును బొరపడుచున్నాఁడే మాతలీ

గీ. తండ్రి శంబెను బనిరేల్లు తల్లి గౌర
వమ్ము నంబెక్కువనుటడె సమ్మతంబు
తండ్రియెడ భక్తి చూపింపఁదలఁచి తల్లి
శిరము నఱకునె కటకటా పరశుధరుఁడు.

ఆలోచించిన నీప్రమాదము జమదగ్నిదికాని పరశురామునిది కాదు. (ఆలోచించి) భృగువంశమంద్రుఁ బుట్టియు భృగునీతిచదివియు నితఁడిట్టి పితృభక్తి చూపించుచున్నాఁడే! స్మృతి చెప్పుచున్నదిగదా!

గీ. చేయఁదగినట్టి కార్యంబు చేయఁదగని
యట్టికార్యం బెఱుంగక యాతతాయి

వడువున నమార్గమునఁ జనువాని గురునిఁ
దండిౘనైనను వదలుట ధర్మమగును.

సౌదా— (చెవులు మూసికొని) భగవంతుఁడు పరశురాముఁడెట్లు దీనిఁ జెవులతో వినెను! వినెఁగాక యెట్లు పనిగొనెను?

మాత— మహారాజ! యిటు చూడుము.

దశ— ఔరా! ఈపరశురాముని తల్లికి మరలఁ బ్రాణమువచ్చినది

క. తనచేసినపని కలరిన జనకుని వలనన్ వరంబు జనని పునర్జీ
వినిగా భృగుతిలకుఁడు కోరినయంతన మెండె మతికి రేణుకతలతోన్.

సౌదా— చంపియుమరల బ్రతికింపసమర్థుండగు నీపరశురామునకు జననీశిరశ్ఛేదంబును శోభాకరంబుగానే యున్నది.

దశ— ఆర్యా సౌదామిని!

చ. జననిని జంపెఁ దాతపరశక్తిని, దా బ్రతికించె నిట్లు పే
ర్చినభృగురాము నద్భుతచరిత్రము సన్నుతి చేయఁదగ్గద
య్యును నుతియింప సిగ్గుపడుచుంటిమి; పెద్దల నెన్నఁబూనఁగా
మనసగుకంటెఁ దా మొక నమస్కృతి సేయుట యుక్తమేరికిన్.

మాత— మహారాజ! ఇది చూడఁ దగినవిచిత్రము.

దశ— ఇతఁడు వేయిచేతులుగలవాఁడని మనము విను మన్న కార్తవీర్యార్జునుఁడే కాఁడు

మాత— ఔఁ! అగును! ఈచిత్రమవలోకింపుము.

ఉ. పావనసావనంబు మునిపల్లియు కల్లఁజేసచ్చి హైహయుం
డావల భార్గవుం డశని కర్తృవిధానము లాచరించె నీ
తోవన రాజు హోమగవిమూడను బల్మిహరించె దాన నా
పావడి పోరుపోరి జమదగ్నియుఁ బ్రాణముఁ బాసెనల్లదే!

సౌదా— వేయిచేతులుగల యీపుడమిఱేఁడు రాచకొలమునకుందగని పనిఁజేసెను. సమరభూమింబడియున్న మగనిం బ్రతికించుటకయి పయింబడియేడ్చుచున్న పతివ్రతాశిరోమణిని రేణుకమ్మం జలపట్టి యీడ్చి కృపాణధారలం దాడించుచున్నాఁడు.

దశ— గొప్పవారుగూడఁ బ్రమాదముల పాలగుదురేల! సంసారభోగము లను రాగములు రేఁగఁగొట్టునన్నమాట గదా!

సూత — మహారాజ! ఇచట మహోదీర్ఘుండును బృహద్భాగలంబమానతూణీరుండును పరమేశ్వరోపదిష్టధనుర్వేదుండును సన్నద్ధీకృతకార్ముకకరుండును పరశుధారాగ్రోచిరుజ్జృంభమాణబాహుగుండును సమరపరితోషితాముండును సమరాభిరాముండునగు పరశురాముండు సకలారణ్యకనివేదితవృత్తాంతుండై సాక్షాత్కృతాంతుండునుంబోలె సమరసంరంభవేషంబుతో నిటుకదలి చనుదెంచుచున్నాఁడు. ఏమి! ఇది యాశ్చర్యపజ్ఞ్ర! (అని చనుచున్నాఁడు.)

శా. ఓరీదుష్టనృపాల! వృద్ధుని సతీయుక్తుఁ సదాచారు వి
ద్యారాశిన్ ఋషిశీలు మజ్జనకు సత్యజ్ఞానసంపన్ను ని
ర్వైరా! కీర్త్యవశేషుఁజేసితివి యిస్సీ! కాల్పనా నీదు పా
పారంభంబులు వేయుచేతులు దురంతా! యెంతదుశ్చింతరా!

శా. మమ్మున్ జీరికిఁగొఁక హోమగవికై మాతండ్రి గూలార్చి, జీ
వమ్మారించుచు మూర్ఛచున్నపతిపైవాలింగ మామ్మాఱు మా
యమ్మంగొట్టితి గాన నిన్నొదల సంహారంబుగావించి తూ
ర్ణమ్మింకిర్వదియొక్కమాఱు భువి నీరాజమ్ముగావించెదన్.

ఓతపోధనులారా! నాకోప ముపశమింపంగల యుపాయంబు వెదకి కావింపుఁడు. నాకోపము నాకు వశము గాకున్నయది.

ఉ. పుట్టితి భార్గవాన్వయము బొంపిరివో, విఖనోవ్రతంబు చే
పట్టితి, మన్మథాంతకుకృపన్ శుచివర్తనగల్గి విద్యలున్
నెట్టన సర్వభూతదయ నేర్చితి, నిట్టిఁడనైన నాకునుం
బెట్టిదమైనయల్కప్రభవించెను మాతృపరాభవంబునన్.

సూత — పరశురాముని ప్రతినయెన్నఁడును నసత్యముకానేరదు.

శా. త్రాటంగట్టినయట్టినాఁ డలపులస్త్యబ్రహ్మ వేఁడంగ మో
మోటంబుంబడి రావణున్ విడచె నేభూనేత వానిన్ నిరా
ఘాటప్రక్రియ వేయిచేతులును గిన్కన్ గండ్రగొడ్డంట ను
త్పాటించెన్ భృగువర్ణి మొండెము యశస్తంభంబుగాఁగంటివే.

సౌదా — నిజముగా భార్గవుఁడు భైరవాకారుండగు భర్గుని శిష్యుఁడుకాని శాంతాకారుండగు సదాశివుని శిష్యుఁడుకాఁడు. అయినచో సహస్రభుజుండగు నీకార్తవీర్యభూభుజునింగనిమసంగునంతటి పరాక్రమ మేలకల్గును.

దశ — సౌదామినీ! నీవనినమాటయే నిజము.

చ. ఇరువదియొక్కమాఱు ధరణీంద్రులఁ జంపినవీరమౌళి, యు
ర్వర నొకజన్మమందు విధిజాతునకిచ్చిన దాత. నేఁటికిం
దిరముగనున్న రాజులకు నెత్తురుబావులఁ దానమాడి సా
దరముగ రక్తతర్పణముఁ దండ్రికిఁ జేసినధన్యుఁ డల్పుఁడే.

(ముందుచూచి) ఆహా! యీపరశురాముని పరాక్రమాతిశయమున రాజులందఱకును నిప్పుడీయవస్థ తటస్థించినది.

సీ. పతిభిక్ష పెట్టుమో పరశురామయటంచు గృహిణులచే నడిగించువారు
గాజులు ముంజేతఁ గలిగి స్త్రీలవలె నంతఃపురంబులోన దాఁగువారు
సన్యాసివేష మాసాదించి యింటింటి యరుఁగులపైఁబడి పొరలువారు
కంఠంబుపైనున్న గండ్రగొడ్డలిఁ గాంచి శరణంచుఁ గాళ్ళపై కొరుగువారు

గీ. ప్రోవఁజేయుము భో మహాదేవ యనుచు
దేశికుండగు శివునిఁ బ్రార్థించువారు
నైరి రాజులు కార్తవీర్యాపరాధ
శివగురుక్రోధుఁడైన భార్గవునియెదుట.

మాత — మహారాజ! పరమేశ్వరశిష్యుఁడగు పరశురాముని కట్టకడపటి యద్భుత చరిత్రచిత్రమిది యాలోకింపుము.

చ. పుడమిఁ సమస్త మర్థియగు భూసురపాళి కొసంగి, యస్త్రములన్
గడలిఁదొలంగఁజేసి యటఁ గాఁపురముండి, శమప్రధానతం
బెడిదపు గండ్రగొడ్డలి సమిత్కృశలావముగాఁగ భర్గశి
ష్యుఁడు తపమాచరించుకొనుచుండెఁ గనుంగొనుమయ్య రాఘవా.

దశ — మాతలీ! ఇంకేమి కావలయు మొదలనుండి చివరవఱకుఁ దనప్రతాపము నొక్కరీతిగా నిర్వహించుకొనినవాఁడీ భార్గవుఁడొక్కఁడేనుమీ.

సౌదా — మహారాజ! చండీశకోదండవిద్యారహస్యపారంగతుండగు నీ పరశురాముండును నీలలోహితఫాలలోచనోల్లాసియగు హుతవహుండును నీయిరువురే యప్రతిహతప్రతాపముగలవారు.

దశ — (అంతటఁగలయఁజూచి) మాతలీ! మహావీరుఁడగు భార్గవుని చరిత్ర చూచుచుఁ బరవశమైన నాచిత్తంబున కన్యం బేదియును దోఁచకున్నయది. మన మిప్పు డీయంతరిక్షంబున నెచ్చోటికి వచ్చితిమో చెప్పుము.

మాత — పురందరనగరంబునుండి యాఱువాయువుమార్గము లతిక్రమించి యేడవవాయు మార్గంబున సంచరించుచున్నాము. భూభువనం బిచటికి సమీపములోనే యున్నది. కొలఁదికాలములోనఁ జేరుదుము. (అని రథవేగము నిరూపించి) ఇదిగో మిథిలానగరం, బిదియే జనకునిమందిరము గావున మహారాజుగారు రథము డిగి నాకును సౌదామినికిని సెలవిండు వాఁడె! విదేహభూపతిగారి ప్రతీహారి మిమ్ము గుర్తించుచున్నాఁడు.

దశ — (రథముడిగి) ఆర్యా, మాతలీ! ఆర్యా, సౌదామినీ! మీ రింద్రనగరంబునకుం దయచేయుఁడు. నేనును జనకుని మందిరంబులోనికిఁ బోయెద. (అని వారిని బంపుచున్నాఁడు)

ప్రతి — (ప్రవేశించి నమస్కరించి) ఇటుదయచేయుఁడు (దారిచూపుచున్నాఁడు)

దశ — ఓజనకప్రతీహారి! మారామభద్రుని వివాహమహోత్సవము జరిగెనా?

ప్రతి — జరగుటయే కాదు, సాకేతంబునకుం బ్రయాణమగుచున్నారందులకైయిప్పుడు మహారాజు గారును విశ్వామిత్రులవారును శతానందులవారును రామలక్ష్మణాలును సీతా హేమప్రభలును సభామండపమున నివసించియున్నారు.

దశ — హృదయమా! తొందరపడకుము. కొడుకును గోడలిని శీఘ్రకాలములోఁ జూచెదవుగాక (అని లోనికిఁ బ్రవేశించుచున్నాఁడు)

(పిదప జనకాదు లందఱును బ్రవేశించుచున్నారు.)

శతా — (సీతవంకకుఁ జూచి)

ఉ. పెంచినవాఁడు రాజఋషి విశ్వధురంధరశీల నేల నిన్
గాంచినతల్లి నీకుఁ దెలుకన్నెలకుంబలెఁ జెప్పనేల? సే
వించుము సాధుధర్మములు పెన్మిటియే కులదైవమంచు భా
వించుము నీడవోలె రఘువీరునిఁ బాయకుమమ్మ జానకీ.

జన — అమ్మాయీ! జానకి! చెప్పఁదగినదంతయు కులగురులగు తాతశతానందుల వారె చెప్పినను నీయందలిప్రేమ నన్నునొకింత చెప్పించుచున్నది.

చ. పతిచనుదేర లేచి భయభక్తులు చూపుట పల్కరింపఁగా
హితమితవాక్యముల్ బలుకు టిష్టసపర్యలు సల్పు టాసన
స్థితిఁ దనచూడ్కిఁ బాదముల చేరువ నిల్పుట యెందు భర్తయే
గతి యనినమ్మియుంట కులకామిని ధర్మము లందు రమ్మరో!

శతా—అమ్మా! విదేహనందని! మాటలవెంబడి నింకొకమాట చెప్పుచున్నాను.

సీ. ప్రాణేశుపట్టఁ గాపట్య మూనకుమమ్మ యాఁడుబిడ్డలఁ గూడిమాడుమమ్మ
గురుజనంబులచిత్త మరసి వర్తిలుమమ్మ చుట్టాలపైఁ బేర్మిఁ జూపుమమ్మ
దాసీజనంబుపై దయను దప్పకుమమ్మ సవతాండ్ర కణఁకువ సలుపుమమ్మ
పతిమిత్రులను గౌరవమ్ముతోఁ గనుమమ్మ పతిశత్రువులకంటఁ బడకుమమ్మ

గీ. నగరివారికిఁ దలలోని నాల్కవోలె
దయకుఁ బాత్రమవై మంచితనము గల్గి
సౌఖ్యలందఱ కేలికసాని వగుచు
రవ్వయను రట్టు లేకుండ బ్రతుకుమమ్మ.

సీత—(గద్గదస్వరముతో లజ్జామిళితంబుగ నేడ్చుచున్నది.)

జన—తల్లీ! ఉభయకులపావనీ! (అని బుజ్జగించుచుఁ జుబుకమెత్తి.)

ఉ. ఎఱుఁగవు గోల వేడుకకు నీవిటు లేడ్చిన నామనంబు త
త్తఱపడు శోక మాఁగదు వృథా గురునావతి జ్ఞానినయ్యు సం
సరణముఁ బూనితిం కుశికనందను కుందును సిగ్గులేక దు
స్తరగతి బాష్పవారి కనుదమ్ముల నొల్కఁగ సాగెఁ బుత్రికా!

శతా—మహారాజ! విశ్వామిత్రునిఁ జూచిన నీకు సిగ్గేల.

క. తనయావియోగదుఃఖంబున నీవచియించువచనముల నిటు వినినం
తన విశ్వామిత్రమహామునికిని నశ్రుద్రవంబు మొదలిడెఁ గనుమా.

రామ—(తనలో) ఈముగుద కేడు పెందుకో! (అనియాలోచించి)

ఉ. ఈపరిపూర్ణచంద్రముఖి యెంతయుఁ గన్నుల జాలునశ్రువుల్
లోపల నాఁపలేమి జలలోచనయై కను లెఱ్ఱ లాపమిం
పైపయిఁ గొల్కులందుఁ బడి పర్వితదీయధురంబు గండభా
గోపరిలగ్నమైన వలితోద్గతకంధరయయ్యె నక్కటా.

(మరల నాలోచించి) ఈముగుద యేడ్చుచుండియు సంతసింపఁజేయుచునే యున్నది. మనోహరము లైనయాకారముల కెట్టిసమయంబులయందైనను సంతసింపఁజేయుట సహజమే!

సీత—తండ్రీ! నాతో మన యూర్మిళామాండవీశ్రుతకీర్తులు రారా యేమిటి.

విశ్వా—నీతో రారు, నీవలెఁ గ్రమముగా వారును నత్తింటికిఁ బోవువారే,

హేమ — చెలీ ! తాతగారు చెప్పినమాటలు వింటివా.

(ప్రతీహారి తోడరగాఁ బ్రవేశించి)

క. మాతోడ విద్యమందిన శాతలమానికము పద్మ్యకరథుఁ డేతెంచెన్
మాతలిరథమున నర్ఘ్యసమేసము గా నెదురువోవుమీ జనకనృపా.

(అందఱును యథోక్తమాచరించి యుపవసించుచున్నారు)

జన— పురందరమిత్రమా ! శాసనశిఖామణీ ! జయరస్తు !

గీ. ఈరు రాక్షసుఁడు గోముఖున కిచటఁ బెండ్లి
చేసినా మని కోపంబుఁ జెందవలవ
దుభయులకుఁ గూర్చువాఁడు నెయ్యుండు మాని
రాచపోటుండు మధ్యస్థుఁడాచరించె.

(తెరలో)

వ. ఆసమయమంద లోకముల నన్నిటినొక్కపరిఁ జ్వరంబుచేఁ
గసిమసఁగించు చంద్రధరుకంటనుబుట్టినవిప్పులో లె న
ల్లసలకు బంగరుంబొడిచలెన్ దన తేజముఁ బర్వఁజేయు తా
పసుఁ డొకఁడేఁగుదెంచెఁ గనువారలకుఞ్ మిఱుమిట్లు గొల్పుచుఞ్.

(మరలఁ దెరలో)

ఉ. అమ్ములసంచిలోపల శరాసము గొడ్డలి పెట్టి, నాలుగే
నమ్ములు స్ఫాటికాక్షవలయంబును జేతులఁ దాల్చి, కోపపూ
ర్ణమ్ముగ వచ్చెడుం బరశురాముఁడు కావలె; లేకయున్న న
బ్రమ్ముగ వీరశాంతరసరాజము లెవ్వనిచట్ల నిట్లగుఞ్.

జన / దశ — భగవంతుఁడా ! శతానందుఁడ ! భార్గవుండు చనుదెంచుచున్నవాఁడఁట. కా వునఁ బూజాద్రవ్యంబు లాయత్తపఱుపుము.

శతా — సమరశ్రాద్ధంబున కతిథి యగుచున్నాఁడాయేమి ?

రామ — అబ్బాయీ ! లక్ష్మణ ! కర్ణాకర్ణికగాఁ జిరకాలమునుండి మనము వినుచున్న పరశురామభగవానులు వచ్చినారఁట చూచి నమస్కరింతము రా.

లక్ష్మ — చూచి నమస్కరింపఁ దగినవాఁడే కాఁడు. ఎదురుకొని యొకచేయి చూడఁదగినవాఁడును.

రామ — పరశురాము నెదుర్కొనుటకు మన మెంతవారము.

సీత— హేమప్రభా! యీపరశురాముఁడు శివశిష్యుఁడనియు సకలక్షత్రియాంతకుఁడనియును గూడ విని నామనంబు సంతసంబును విచారంబును గూడఁ బొందుచున్నది.

హేమ— భార్గవదర్శనమున సంతోషపడవలసినదే కాని హరశరాసనమును విఱిచిన రఘురామమూర్తి మనయొద్దనుండఁగా భయింపవలసిన దేమున్నది.

(పిదప కోపముతోఁ బరశురాముఁడు ప్రవేశించి)

పర— నిబిడకడకడాత్కారపూరితకోదసీకందరోదరమేదురం బగునినాదం బకాలమునందు వినఁబడుచున్న దేమిది! (అని యాకసమువంకకుఁ జెవియొగ్గి) దశరథకుమారుఁడగు రామఁడు హరశరాసన మారోపించి లాగి విఱిచె; దానివలనం బుట్టిన టాంకార మనుచున్నారా! యేమి! (దుఃఖముతో)

చ. త్రిదశుల గెల్చునాఁటి పవిదెబ్బలమచ్చలుగల్గుచేతు లి
ర్వదియును శైశరాసనముపట్ల దశాననుఁ నప్రతిష్ఠుగం
గుదురుగఁజేసె, నట్టివిలుఁ గుఱ్ఱఁడు భగ్నముఁజేసె రాముఁడకా
గొదవ లటన్థమయ్యో నిఁకగొడ్డలి యేటికి రుద్రుఁ డేటికిన్.

(ఆలోచించి తన్నుఁ జూచికొనుచు) పరశురాముఁడు సత్యసంగరుఁడు, గురువులయెడఁగూడఁ బ్రతిజ్ఞాతార్థము నిర్వర్తించువాఁడు. గుణదోషము లొక్కదాని దెసఁదటస్థించిన నందు గొప్పదానివిషయమై ప్రయత్నింపవలయునని పెద్దలు చెప్పుదురు. (అని యాకసమువంకఁజూచి)

ఉ. నానుడి యాదరింపుఁడు మనంబుల నోచ్యవనాదులార! మీ
యానతి దాఁటకుండవలె నన్నను భర్గునిభగ్నమైన వి
ల్లేను గనుంగొనన్వలసె నిర్వదిరెండవమాఱుఁగూడ నీ
పీనుఁగు రాచవంగడము పీఁచమడంచెద సమ్మతింపరే.

(అని గిఱ్ఱునఁదిరిగి భగ్నధనుర్దర్శనము నటించుచు) హా! శంకరకరాందోళనదుర్లలితమా! హా! త్రిపురదహనహరకర్మకర్మఠమా! హా! గీర్వాణసారపరమాణునిర్మాణమా! హా! దుర్జనజనకసదనదుర్నిక్షేపమా! హా! నుతసకలనాకమా! పినాకమా! లూతాతంతువులచే మదగజంబు బంధింపఁబడినట్లు నూడిమొనచేత వజ్రము భేదింపఁబడినట్లు నీకీదుర్బాలకునిచే నిట్టిపాటు తటస్థించినదా!

చ. ఒకపరి నీచే పురత్రయము నొయ్యన మున్ను దహించె నెద్ది నా
ఖండనిశరాస మంచు వచలాత్మజ మన్నన చేయుదేని హా

సుతకుబుసంబుచేఁ బయిఁకునుంగిడె నందియుఁ దేని కట్టి దే
శికునిధనుస్సు ముక్కలుగ శిష్యుఁడు రాముఁడు చూచి సైఁచునే.

(క్రోధగర్వములతో సంకటఁ గలఁగుచుఁ జూచి) పరశురాముఁడు పరదేశమునకు లేచిపోయెనని తలంచు నోవీరమ్మన్యులారా యించుక యిటు వినుఁడు—

ఉ. పంచశిఖాసమేతుఁ డగుబాలకుఁ డెక్కడ! వాఁడియమ్ము నం
క్రౌంచధరాధరంబునకు రంధ్రమొనర్చినమాని యెడ! పేర్చి
మించి స్వయంవరంబునకు మెచ్చుమవచ్చిన రాజులార! కో
పించెను భార్గవుండు పసివీరునిఁ బోవుఁడు పోవఁగల్గినన్.

(ఆకసమునకుఁ జెవియొగ్గి) అగ్నియే యగ్నికి మందన్నట్లు రాముని రక్షించువాఁడు రాముఁడే, రఘువంశ మొదలచే రక్షింపఁదగినది కాదనుచున్నారాయేమి? (ఆలోచించి) నీలలోహితాంతేవాసి యగురాముఁ డెదిరియై యుండ రాచకొలమును రక్షించువారున్నారా! (మరల నాలోచించి) ఎంతదుష్కాలము వచ్చినది. వినరాని మాటలు వినుచున్నాను. కనరానిపనులు గాంచుచున్నాను, (దుఃఖముతో) ఇదియే మనము సహింపరాని తిరస్కారము (అని చేతులాడించుకొనుచుఁదన్నుద్దేశించికొని)

గీ. అమ్మచే గుహుఁ నెమ్మిషింపమ్ముఁ ద్రుంచి
నట్టి నీగండ్రగొడ్డలి నవమతించి
శిశు వొకఁడు నీకుఁగలపేరు చెఱిచె; నింత
పనికిమాలిన బ్రతుకేల పరశురామ.

(ఆకాశమందుఁ జెవియొగ్గి) దాశరథి యొనర్చిన హరశరాసనభంగమును నుతించి. యబ్బురపడనివా రెవరనుచున్నారాయేమి! ఏమంటిరి! దాశరథియొనర్చిన హరశరాసనభంగము నుతించియబ్బురపడనివారెవరా? ఆల్లైనవినుఁడు.(కోపముతో)

ఉ. ఎవ్వఁడు చాపమున్ విఱిచె నెవ్వఁడు దానికి సమ్మతించె నిం
కెవ్వఁడు దానిఁజూచె మఱియెవ్వఁడు దానికి సన్నుతించె నా
కొవ్వుఁ దొలంగఁజేయ నిదిగోఁబయికెత్తిన గండ్రగొడ్డటన్
గవ్వలగుత్తులట్ల తలకాయలు వారివి నేలఁ గూల్చెదన్.

(రభసము గాఁ దిరిగి) ఓజనకశుద్ధాంతసంచారులగు కుబ్జవామనకిరాతవర్షవర సౌవిదల్లులారా. యాదశరథరాముఁ డెచటనున్నాఁడో పరశురాముఁడు వచ్చెనని చెప్పుఁడు.

శా. కృత్తక్షత్రియకంఠమండలగళత్కీలాలధారాసర
స్వత్తీర్థంబునఁ బైతృకక్రియల నేపారుండు గావించె, వాఁ

డెత్తెం గొడ్డలి భార్గవుం డటకనే త్రేతాస్వాసనంహారుసు
నృత్తుఁడై రాము సపత్నునాను మొనసై నాట్యంబు చేయింపఁగన్.

రాము—తమ్ముఁడ! లక్ష్మణా! ఈ బ్రాహ్మణుఁడు మన మెంతవినయముగా నుండ వలయునని తలంచినను మహాక్షోభంబుతో నెప్పుడగ్గుమాటలాడుచున్నట్లు తోఁచుచున్నది.

(భార్గవుఁడు మరల వెనుకటిసవ్యాసమునే చదువుచున్నాఁడు)

రాము—(సరభసముగాఁ బ్రవేశించి) భగవంతుఁడా! భార్గవ! అనుగ్రహింపుము, దయచూపుము, సముదాచారమని దాశరథి నమస్కరింపఁగోరుచున్నాఁడు

పర—(నవ్వి) రేణుకానూనుఁడు నమస్కారమునం బ్రసన్నుఁడు కాఁడు. గురుధను ర్భంగరూపమైన యపరాధము చాలఁబెద్దది.

క. ఏలా వినవో కంఠేకాలునిఁ గాఁచనకుఁగూడఁ గాలుని శశిచూ
డాలుని దచ్ఛిష్యుని దుర్గాలితాౢసహనుఁ బరశురాముని నన్నుఁ.

గీ. మాగురునివిల్లు రాజులమధ్యమున ధ
రించుటేకాక తట్టునఁద్రుంచె నెవఁడు
వాని భుజదండబల మిట వఱలుచున్న
పరశురాముని పయిఁగూడఁ బరగుఁగాక!

రాము—(వినయముతో) తపోరాశీ! భార్గవ! పుత్రసదృశులమును ముగ్ధబుద్ధులమును నగు మాదృశులయెడ నింతకోపమేల?

గీ. భుజబలం బింతయైనఁ జూపుటకు మున్నె
ప్రాఁతగిల్లిన హరువిల్లు భంగపడియె
బాలచాపల మిది క్షమింపఁగదవయ్య
తుట్టచెయ్వులు రుచిగావె గురువులకును.

పర—ఓరీ! నిదర్శితలాఘవా! రాఘవా! నేనుతపోరాశినిగాని శౌర్యరాశినిగాను కానురా! ఆత్మస్తవముఁ జాలఁ జేసికొనుచున్నావులే, ఇట్టిదుర్గర్వాటోపుని నిన్ను నే నేమిచేసెదనో వినుము చెప్పెద.

క. ఛేదింపఁబడినశాఖన్ లేఁదూఁటులనుండి పచ్చి నెత్తురు కాఱన్
ఛేదింతు శంభుచాపలతాదళనపటిష్ఠ మూఢ తావకశిరముఁ.

రాము—(వినయముతో వోపిలిరొగ్గి)

గీ. నీకు వశమగుగొడ్డంట నీ కధీన
మైనరామునితల భవదభిమతముగఁ

జేయఁగదవయ్య నీచేయు చేఁత కెవ్వఁ
డౌనుగా దనిపల్కువాఁ డవనియందు.

పర—ఎవ్వఁడా, యామునియింటి కతిథిగాఁగోరువాఁ డెవ్వఁడో వాఁడు.

రాము—(అంజలిపట్టి) బ్రాహ్మణోత్తమా!

ఉ. మానుము కోప మీవనుచు మాటికి రాముఁడు వేఁడు నిన్ననూ
చానుని భార్గవా! మనము శాంతముఁ జేయఁగదయ్య మ్రొక్కెదన్
నేను భవత్కుఠారకవనీకృతకంఠుఁడ నయ్యెఁ గోపముం
బూనను; మాకొలంబునకు భూసురులే యిలువేల్పు లెప్పుడున్.

పర—(నవ్వి)

ఉ. గౌరికి ధర్మపుత్రుఁడను గ్రౌంచగిరింద్రవిదారకుండ భూ
వారకుమారకుండ క్షితి దానముఁ జేసినవాఁడ నబ్ధిలోఁ
జేరిన భాగముం బయలుచేసి వసించినవాఁడ నాజి దు
ర్వారుఁడ బ్రాహ్మణుండనఁట రా! హరశిష్యుఁడ రైణుకేయుఁడన్.

శతా— వీరవర్గవరిష్ఠుం డగుభార్గవుం డేమేమో యనుచున్నాఁడే.

పర—ఇఁక యుద్ధయాత్రచాలించి యూరకుండ మనుకొన్నను నీరాచనిను వేమేమో మాటలాడి మరల నాయుధము పట్టఁజేయుచున్నాఁడు. పదగయెత్తి బుసకొట్టుచున్న ద్రాచుఁబాముసు బరికింపనితప్పిదము వానిదే.

గీ. పలుకఁబోతిన కపురంపుఁబలుకు నలుచు
పగిది నీతఁడు మూఁడింటి నగడుపఱచె
భార్గవునిలజ్జయును ఖండపరశువిల్లు
చిన్నతనమున నే తనజీవితంబు.

జన—సన్యస్తశస్త్రగ్రహణుండ నయ్యును బాహు మరలశస్త్రగ్రహణాపేక్ష! ఏమిది! (అని తెరవంకం జూచి) ఎవఁడురా యక్కడ? విల్లు! విల్లు!!
(ఒకఁడు ప్రవేశించి ధనువు నిచ్చిపోవుచున్నాఁడు)

జన—(విల్లుఁగొని) గీ. హరునిబాణాసనంబు పే రవమరించి
యజ్ఞకంఠుఁడు నిన్నుఁ జేపట్టఁజేసెఁ
బరశురామునివలన నీశౌలుఁబోవఁ
బట్టితిఁగదమ్మ మరలఁ జాపంబ నిన్ను.

గీ. పెద్దవాఁడను బోరఁ గావింప నేను
సన్నిధియొనర్పుమీ వింట శస్త్రవిద్య
రామభద్రుఁడు నేర్చుకొనె రాముఁ డకట
వందనము నీకు జనకభూపతిని నేను.

దశ — బావా! జనకమహారాజ! కార్ముకము జేతఁబట్టి చేయవలసినది చేసెతి వింకం జాలుఁ జాలుఁ; బ్రకటితసాహసం బతనల్లునిమాత్ర మవమానసూచకము.

ఉ. మిత్రునివంశమందుఁ బొడమెం గుశికాత్మభవుండు దివ్యచా
రిత్రుఁడు శస్త్రవంతు నొనరించె మహేశ్వరచాపభంగచా
రిత్రము బాహుశక్తి వివరించెఁగదా విను మట్టివాఁడు మ
త్పుత్రుఁడు భార్గవుం డెదిరి పోరఁ బరాభవ మేలచెందునో.

విశ్వా — మహారాజ! సీరధ్వజా! దశరథునిమాట సత్యమే (అని చాపము లాగికొని పరశురాము నుద్దేశించి)

చ. చెలియలిపుత్రిపుత్రుఁడవు శిష్యుఁడు నీవును మాకు రాముఁడుం
గలుగునె కార్యభేద మెసఁగాంచినఁ జేతులు రెంటిలోపలన్
దెలిపితి మేను భర్గుఁడును దివ్యశరంబులు మీకుఁ గావునన్
దొలఁగుము కోపమున్; విడుము తొందర; చెందుము సాధుపద్ధతిన్.

పర — ఓమాతృమాతులా! భవానీవల్లభుం డగునీశ్వరునకును నీకును, సకలక్షత్రియాంతకుండనగు నాకును క్షత్రియకీటంబగు రామునకు భేదము లేదుగా!

విశ్వా — భార్గవుని వాక్ప్రవాహమున కడ్డులేదు. గురువులయెడల నైనను వినయమనుమాట యెఱుఁగఁడు.

పర — స్వభుజోపార్జితబ్రహ్మభావా? విశ్వామిత్ర! శస్త్రగ్రహణాధికారము సంబంధము ననుసరింపదు.

రామ — బ్రహ్మర్షీ! భార్గవ! ఏమియీశస్త్రగ్రహణాధికారము! గురులయెడఁ గూడఁ దిరస్కారమా!

పర — (కనుబొమలముడితో) ఓరీ క్షత్రియాధమా! ఎంత వాచాలుండవురా!

గీ. విఱిగిపోయిన మాకెంటి వింటిముక్క
తెగఁబడిన నీదు పుఱ్ఱెలోఁ దిగిచి చేతఁ
దాల్చి కాపాలికవ్రతధర్మమూని
యే నలకపాలి వర్తింపనేఁగువాఁడ.

రాము — భగవంతుఁడా! భార్గవ! సర్వంకషంబులగు నీరోషవచనము లేల?

శా. సర్వత్యాగివి సప్తమూండవు విరించస్వామికిన్ శిష్యతన్
నిర్వాహించితి వీవునొద్దనని నే నిన్నింత మన్నించితిన్
గర్వోక్తుల్ విడుమయ్య వీరసరణిన్ గైకొందు నాకిందు ని
న్నోర్వన్ రా; నిఁక నూరకుండిన గురుండున్నాఁడు చేసిగ్గిలున్.

పర — వీరసరణిఁగొని యేమి చేయఁగలవు?

రాము — ఏమి చేయఁగలనా, ఇది.

చ. ఎవనికిఁ జేసె గౌరవము నీశ్వరుఁ డెవ్వఁడు బ్రహ్మచారియై
పవరమునందుఁ బట్టి గురుపట్టిని గుట్టెకలించె నట్టినాఁ
డవుదువుగాన నీదుధనురాగమసంగతి చూడుఁగాని యీ
రవికులసంభవుండయిన రాముఁడు దాల్పఁడు ముందు చాపమున్.

పర — ఓరీ క్షత్రియకీటమా! బాగు! బాగు! మాతృఘాతుకశిష్యా! బాగు! బాగు! తాడితతాటకాకుటుంబక! బాగు! బాగు! భగ్నభార్గవశరాసనా! బాగు! బాగు! రేణుకేయరణరసికా! బాగు! బాగు!

గీ. భర్గచిరభుక్తమైన యాపాతవిల్లు
భంగపఱచినమాత్ర గర్వంబు తగునె
యెక్కువోనిది విష్ణుకార్ముకము దీని
నెక్కువెట్టుము బలముండెనేని రామ.

(అని ధనువుఁ జేతికీఁగా నెదురుపోయి లక్ష్మణుఁడు పుచ్చుకొనుచున్నాఁడు)

లక్ష్మ — ఆర్యా! సీతావివాహావసరంబు గావున శంకరశరాసనము దేవర విఱిచితిరి గాని దోర్దండబలపరీక్షార్థంబగు నీవైష్ణవచాపారోపణంబుతో దేవరకుఁ బని యేమి. తమ భృత్యపరమాణువు లక్ష్మణుండు సిద్ధముగా నున్నాఁడు.

సీత — (తనలో) లక్ష్మణా! చాలయోగ్యుఁడవు, రఘుకులోచితంబు లగుసుగుణంబులు నీయందును గలవు.

విశ్వా — అబ్బాయీ! లక్ష్మణా! మీయన్న శంకరధనురారోపణంబుఁ గావించెఁ గావున నీవు నారాయణధనుర్భంగంబుఁ జేయుటయు నుచితమే.
(లక్ష్మణుఁ డారోపించుచుండఁగా శతానందుఁడు సంతసముతో)

శా. జ్యాటంకారము దిక్కులం దొరయఁగా సౌమిత్రి కేలన్ నిరా
ఘాటప్రక్రియ విష్ణుచాపముఁ జమత్కారంబుతో లాగ వ

స్ఫోటన్ భార్గవరాము వక్త్రశశిపై భాసిల్లె చిహ్నంబొగిన్
భాటిల్లెన్ రఘురాము వక్త్రశశిపైఁ బర్వేందుకాంతిచ్ఛటల్.

విశ్వా— యోగీ, జనక! మిత్రమా, దశరథ! ఇక్ష్వాకుకులచంద్రుండగు నీలక్ష్మణుఁడు రామమూర్తికిఁ దమ్ముఁడగుట నిర్వహించుకొనెను.

చ. పెటపెట రెండు దండలును ఛిక్కటిలన్ ధనువెత్తి కట్టి, పి
డిక్కటనదుమూన్చి, నారిని ఘటిల్లగ నిట్టటు సాగలాగి, యొ
క్కటి జగదండభాండము నగల్చు తెఱంగున లక్ష్మణుండు చే
చటులపయోదఘోషణ మెసంగఁ దటుక్కున నెక్కువెట్టెసెన్.

ఉ. చండభుజాప్రకాండ బలసారము మీఱఁగ నెక్కువెట్టి ప్ర
కోదండము ప్రేలుకోయన మహాధ్వను లుప్పతిలంగ విష్ణుకో
దండము లక్ష్మణుండు త్రుటితంబొనరించెను పొల్చెఁ దద్ధ్వనుల్
మెండుగ రాఘవప్రశతిధ మెచ్చ నృపాలుర మెప్పులోయనన్.

సోమ— సఖి! జానకీ! నీమఱఁదిగారి పరాక్రమ మాలోకింపుము. నీభర్తకుఁ దీసి పోవువాఁడు కాఁడు. విశ్వామిత్రునిమాట కడుసరసముగా నున్నది.

జన— (సంతోషముతో విశ్వామిత్రునివంకఁ జూచి)

క. అవనిజ కనదన మాయెన్ భవధను రారోపణునకుఁ బద్మాక్షుధను
ర్వ్యవసాయుంబున నూర్మిళ యవనిజకుం దోడికోడలౌఁగాక సఖా.

సంబంధీ? దశరథ! నారాయణశరాసనారోపమున నూర్మిళను మీచిన్న కుమారునకుం గానుకగా నిచ్చెద.

దశ— అగుఁగాక. తథాస్తు.

విశ్వా— మహారాజ! సీరధ్వజా! మీతమ్ముని కుమార్తెలగు మాండవీశ్రుతకీర్తు లిరువురును దాశరథులగు భరతశత్రుఘ్నులకు ధర్మపత్నులగుదురు గాక.

శత— శుభము మీఁద శుభము. శుభము మీఁద శుభము.

పర— దశరథడింభకు లిరువురును బొగరుకొని యున్నారు కావున మతియొకవిల్లుఁ గొని సమరక్షమ యగు మిథిలాపురపరిసరక్షమకుం బోయి యుద్ధంబు గావించెద (అన్ని తెరవంకకుం జూచి) ఎవఁడురా, ధనుస్సు!
(ఒకపురుషుఁడు తెచ్చి యిచ్చినం బుచ్చుకొని పరశురాముఁడు కోపముతో)

చ. అమృతము జాలు నిర్జరలకాంతసరంబులు మీఁద వేయ న
య్యమరులు క్రిమ్మఱం బ్రతికినట్టి మదీయశరాగ్రధారలం

గములగు రాతిపీసుగులఁ గన్గొని క్రొత్తలుగామి కేడ్చుచుం
దమతల మోఁదుకోఁ గరముఁ దద్వలయంబులు మ్రోగుఁ గావుతన్.

గీ. మహి నరామంబుగా నలత్తృణము గాఁగఁ
జేసి చూపలు మెచ్చి సేబాసనంగ
దర్పకాంతకు దివ్యపాదముల దరికిఁ
జేరి దేశికఋణముక్తిఁ జేయువాఁడ.

రాము—భగవంతుఁడా, భార్గవ!

గీ. విల్లు భుజమూలమందునే వెలయుచుండ
నమ్ము లమ్ములపొదిలోన యలరుచుండఁ
జేతఁగా కిట్టిసారకాయకోఁత లేల
రాఁదలంచితి వేని వే రమ్ముపోర.

(అని తిరిగి యందఱును నిష్క్రమించుచున్నారు.)

గద్య—ఇది...శ్రీ తిరుపతివేంకటేశ్వరకృతంబైన యాంధ్రబాలరామాయణనాటకమున భార్గవభంగమను చతుర్థాంకము.

---

శ్రీరస్తు.

# బాలరామాయణము

## పంచమాంకము.

(మాయామయుఁడు ప్రవేశించి తిరిగి తిరస్కారబుద్ధితో) హా! హా! నిసర్గనిర్గళచరిత్రైక నిబంధన! ఛీ! ఇదిగో నిన్ను నిందించుచున్నాను. నీకేమిబుద్ధి! రత్నాకరమును క్షారోదకపూరితముఁ గావించితివి, చంద్రునియందుఁ గళంక మారోపించితివి; మహారాజరావణున కిట్టియవస్థ తెచ్చిపెట్టితివి. ఆ రాక్షసరాజు, రఘుకులరాజధానికిఁ బోయి ముక్కంటివిల్లు విఱిచి చక్కనికన్యం బెండ్లియాడిన రఘురామునితో నా మాటలుగా నీమాటలు చెప్పుమని నా కానతిచ్చె.

గీ. హరునివిల్లు విఱిచినట్టివానిది సీత
యనుట మొట్టమొదట నగుచు గాత
జగము లెల్ల నేఁ జగజెట్టి దశకంఠుఁ
డగుట నతఁడ దానిమగఁడు రామ.

ఓరీ! రాజపోతా! రాక్షసరాజు పట్టినప్రతిన వినలేదా.

ఉ. ధరణియు నింగియుం బగిలి దారుణ హూంకృతి డాంకరింపఁగా
హరునిశరాస మెక్కిడి ధరాత్మజ నెవ్వఁడు గొన్నఁగాని నేఁ
గరకరఁ దద్గళాస్థికలుఁ గంధరముం దెగఁగోయ మ్రోగు భీ
గురువగుచంద్రహాసమునకుం బలియిచ్చెద వానిరక్తముస్.

మఱియు నాతో నిట్లనియె. భద్ర! మాయామయా! ఈమాటలు చెప్పిన నతఁడు భయంపడి యాసీతను నాకర్పించును. ఇట్లు సమర్పింపఁబడిన యాజానకియు,

చ. జగముల నన్నిటిం గెలువఁజాలిన మద్భుజశక్తి నీవు చె
ప్పఁగ విని సంతసించి యిటువంటిమగండు లభించెనంచుఁ బ్రి
మగని నిరాకరించి నను మన్ననఁ గైకొను; నుత్తరోత్తరం
బుగ గుణవంతులందుఁ బువుఁబోఁడులచిత్తము లెక్కుటబ్రమే.

(ఆలోచించి) రాక్షసులకు నిసర్గవిరోధియు వసిష్ఠవిశ్వామిత్రాది మహర్షిసనాథుండును నగు రామునితో నీమాట లెట్లు చెప్పుదు! ఇట్లు చెప్పుట కాలకూటము మ్రింగుటయు యమునిదంష్ట్రలు పెఱుకుటయుఁ గాని వేఱొండు గాదు (ఆలోచించి) అగుఁగాక, యీరావణుని తెలివితక్కువయాలోచనము బుద్ధికౌశలవంతుండగు మాల్యవంతునితో విన్నవించెద. అతఁడు మతినాశావిష్టంబునకుఁ గర్ణధారుఁడు (కొంచెము ఆలోచించి) వీఁడుగో! మాల్యవంతుఁడు లేఖహస్తుండై యేమేమో యాలోచించు

చున్నాఁడు. ఇతఁడును రావణుని తెలివితక్కువకొఱకై యాలోచించుచున్నట్లు తోఁచుచున్నది. రవికిరణాపాతము తక్క నల్లగల్వలను వేఱొకవ్యాధికలుగనేరదు.

ఆ. కావ్యతంత్రవిదులఁ గవిజనులబ్రహ్మలు మంత్రతంత్రవిదుల మంత్రివరులు
నొరులదుఃఖమొందెడి నొరులసుఖంబొందెడి వారు ననుభవించువారు నిజము.

(పిదప లేఖహస్తుఁడై మాల్యవంతుఁడు ప్రవేశించుచున్నాఁడు)

మాల్య — మిథిలాపురవాసియగు చారుఁడొక యుత్తరముఁ బంపించె నిది చదివెదను. (విప్పి చదువును) 'శ్రీలంకాపురరాజ్యమంత్రియగు మాల్యవంతునకు మిథిలాపురవాసి యగుచారుండు వ్రాసికొను మనవి, సీతాస్వయంవరకాలమందు శ్రీరాముఁడు శంకరశరాసనమును విఱిచె ననియు నదివిని సైఁపక శివశిష్యుఁడగు పరశురాముఁడు యుద్ధసన్నద్ధుఁడై మిథిలాపురి కరుగుదెంచెననియు దేవర పేర నింతకుఁబూర్వము వ్రాసికొంటి. ప్రస్తుతవృత్తాంత మేమన, నా శ్రీరామ పరశురాములకు శరనికరవర్షణంబును భూతలనిఘర్షణంబును సుభట ధర్షణంబును గాతరమనఃకర్షణంబును బగస్పరప్రతిహతిమర్షణంబును లోమ హర్షణంబునునగు తుములయుద్ధంబు జరిగినది. ఆసమరమున—

చ. దశరథసూతి రాజకసుధానిధి భాస్కరవంశమౌళియున్
గుశికసుతాప్తవిద్యుఁడగు కుఱ్ఱఁడు రాముఁడు వృద్ధు రాజఘుక్
శశధరమౌళిశిష్యుఁ జ్యవనప్రవరాన్వయజాతు రాము దో
ర్వ్యళునిఁగఁజేసి యెంతయుఁ బరాజితుఁజేసెను దెంపుపెంపునన్.'

(ఆలోచించి) అట్టివాని భార్యపైఁగూడ రావణుండనురక్తుఁడయ్యె ననుట మాత్రము సుఖోదర్కముగాఁ దోఁచకున్నది.

మాయా — (ఎదుటఁ జూచి) మాల్యవంతుండు కమ్మ చదువుటఁ జాలించినట్లు తోఁచుచున్నది. (సమీపించి) ఓ కనిష్ఠమాతామహా! మాయామయుఁడు నమస్కరించుచున్నాఁడు.

మాల్య — కుశలమా, మాయామయా! మనరావణమహారాజేమి చేయుచున్నాఁడో యెఱుఁగుదువా?

మాయా — బ్రహ్మణేతరుఁడు చేయవలసినపని చేయుచున్నాఁడు.

మాల్య — ఏమది?

మాయా — (రావణుఁడు రామునితో జెప్పుమనినమాటలు మరలఁ జదువుచున్నాఁడు)

మాల్య — వృద్ధబుద్ధి యెప్పుడును ఆరంభమందే కార్యావసానము నాకలించును.

ఏమన:— నేను రావణుఁడు శివధనురధిక్షేప మాచరించినది మొదలు సీత నపహరించుననియే యెంచుచున్నాను.

మాయా— తరువాతఁ దరువాత ?

మాల్య— తరువాత నేను మందోదరితండ్రియు మాయావంతులలో నగ్రగణ్యుండును నగు మయునిశిష్యులలో మొదటివాఁడగు విశారదుఁడను యంత్రికానిచే సీత ప్రతికృతియొకటి చేయించితిని. వాఁడును సీతాప్రతికృతి నిర్మించి యిట్లు చెప్పెను.

గీ. దారుమయగాత్రి యొకనూత్రిధారుఁ డవలఁ
దగుగతిఁ గదల్ప మొగమునఁ దాఁపియున్న
శారికయు మాటలాడ రాక్షసపతేంద్రు
చేతము హరించు నీయంత్రసీత నిజము.

మాయా— గీ. చోద్యమెట్టిదొ నీచేతఁ జూడఁబడెనె
దారుమయభూమిపుత్రి మాతామహుండ ?

మాల్య— యేమిచెప్పుదు నిక్క మాభూమిపుత్రి
యనుచుఁదోఁచెను నాకు మాయామయుండ.

వానిచేతనే సీకబాదియగు సిందూరిక ప్రతికృతికూడ నట్లనే చేయించితి. తలలన్నిటిని దడవి దేవరకు మిథిలాగమనము విఘ్నకలితమగుట సీతావచనము చేతనే యొప్పించుట మంచిది. కనుక మన కృతకసంవిధానముచే నిరంతర ప్రేమోపార్జనము నమ్మఁజేయుట కిట్లు నిశాచరపతితోఁ జెప్పవలెను.

" దేవా ! ఆజానకి యొకఁడు పెండ్లాడినది కదా !

గీ. అఖిలభువనంబులు జయించినట్టి నీదు
చిత్రకథచేత రంజింపఁజేయఁబడియు
నా కనిష్టంబయిన పరిణయము నేను
జేసికొనని సిగ్గుచే శిరము వంచె" అని.

మాయా— ఇట్లుచెప్పిన దశాననుండు నమ్మునా ?

మాల్య— మాటచే నమ్మకున్న మనసుచే నమ్మఁడు. (అని యిద్దఱును నవ్వుచున్నారు) అట్లు నమ్మనపిదప నీప్రతికృతిని జూపింపవలయు.

మాయా— అట్లు చూపించినచేమి జరగును ?

మాల్య— ఏమి జరగునా, యిది జరగును. ఈసీతాప్రతికృతినిఁ జూచిన దశాననుఁడు లోభపడును. లోభపడినఁ గాంతకాలహరణమగును; అట్లు కాలహరణము

వలనఁ గర్తవ్యానుసంధానమున కవకాశము కలుగును. దానిచేఁ గార్యసిద్ధి తప్పక యగును.

మాయా — తమరు చెప్పినమాట చక్కఁగా నున్నది.

మాల్య — అట్లైన నీవు నీచనుచోటికిఁ బొమ్ము. నేను మంత్రమంటపమునం దుండెద

(అని యిరువురును నిష్క్రమించుచున్నారు.)

(పిదప రావణుఁడును బ్రహస్తుఁడును జామరగ్రాహిణియుఁ బ్రవేశించుచున్నారు.)

రావ — మ. తలలంగోసి తపోగ్ని కిచ్చి పురహర్తం దన్పనాఁడైన వే
ల్పులకోనిం దనయింటిద్వారమునఁ గాళ్ళుం గట్టునాఁడైన న
య్యలకాధీశ్వరు గెల్చి పుష్పకము తోడైవచ్చునాఁడైన నో
కులరాయండు గనండు జానకిని గన్గొన్నసంతోషమున్.

(ఆలోచించి) ఓహృదయమా!

చ. ఉపవనమేఁగ దిందురుచియున్ బరికింపను మేడపై భయ
మ్మపరిమితంబు ద్వారమునయందును భీతిలఁ జిత్రగేహమున్
రపరప లాడుచుంగనుఁ బరాకు మనోగతిఁ దోఁచు నీనుడిం
జప మొనరించుఁ బద్మదళశయ్యాపయింబడి మాటిమాటికిన్.

అని మాయామయుఁడు చెప్పిన సీతావృత్తాంతమును మఱచిపొమ్ము! ఓప్రహస్తా! నీవు వేగము పోయి యాజానకి నిటకుం దీసికొనిరమ్ము; లెమ్ము పొమ్ము. ప్రియాసమాగమమహోత్సవములు కాలహరణము నపేక్షింపవు.

(ప్రహస్తుఁడు వెడలిపోయి సీతాసిందూరికామాయామయులతోఁ గూడఁ బ్రవేశించును.)

మాయా — మహారాజ! ఈమె సీత.

రావ — ఇది సీతయే? ఇదిసీతయే? (ఆలోచించి)

శా. నీటంబుట్టిన విచ్చుఁదెంగలువ లీనేత్రంబు లాచంద్రునిం
బోఁటుల్ మోమును గాము తోరణరుచిన్ గ్రాలున్ బలే కన్బొమల్
మాటాడించినఁ గోకిలాకలవచోమాధుర్య మచ్చిప్ప మీ
బోటిం జేసినధాత తెల్వి యపురాభూతంబుఁ జిత్రం బొగిన్.

సిందూ — దేవ! దశాననా! శివధనురారోపణకాలమునఁ జూచియుఁ జూడని నీ మొగంబులు పదింటిని యీజానకి యిప్పుడు మరల స్పష్టముగాఁ జూచుచున్నది.

రావ — మంగళప్రదురాలా! మదనాగ్నిచేఁ దపింపఁజేయఁబడువారి నూఱడించుట చక్కఁగా నెఱుఁగుదువు!

సింధూ—రాక్షసచక్రవర్తి వగుని యెదుట మఱియొకవిధముగాఁ జెప్పుదునా.

రావ—(ఉల్లాసముతో) చెప్పుము చెప్పుము. శ్రోత్రామృతము నీయిరువదింటిచేత నొక్కసారిగ ననుభవింతును.

సింధూ—ఇదిగో మనవిచేయుచున్నాను.

చ. సొగసగువెన్నెలం గనులఁ జూడక చేల మునుంగువెట్టు సు
ల్కఁగను స్వకంధరధ్వనికిఁ గోకిలపంచమునాద మంచు మం
చిగఁ బయివారు కూడదని చెప్పిన నీకథలే వినుఁ భవ
త్సుగుణములే నుతించు నలతొయ్యలి నేమని యెంచికొందువో.

రావ—తరువాతఁ దరువాత?

సింధూ- చ చెలిస్మరతాప మేమనుచుఁ జెప్పుదు నెచ్చెలిగుంపు కూడఁ దొ
య్యలియెడ లింతసోకఁగ భయంపడుఁ గాలు వటంచు నీళ్ళకుం
గలుగును వేఁడి చందనము క్రాగి తటాక్కృతిసేయు హారమం
దలిమణులెల్లఁ బేలవిధంబునఁ బేలును ఫెల్లుఫెల్లునన్.

రావ—ఓ సీతాధాత్రేయీ! అట్లైన నేల మీచెలి నన్నుఁజూచి మొగ మడ్డముగాఁ ద్రిప్పుకొన్నది?

సింధూ—ఆయపరాధము నూతనానురాగజన్యము గాని మాజానకిది కాదు.

గీ. ఎంతయనురాగ మున్న మ రెంత పేర్మి
గల్గినను ముగ్ధ లైనట్టికాంత లెల్ల
నూతనప్రియనికటమందున శిరంబు
వర్తితాంసంబుగాఁ జేసి వంచుకొంద్రు.

రావ—ఏ మంటివి? సీతకుఁ బ్రియసఖివి గావున నట్లు సమర్థించితివి. మొగలిపూవు లుంచిన వసనంబునకుఁ గూడ సువాసన కల్గు టబ్బురము కాదు (అని సీతవంక కుం జూచి) జానకీ! కుశలమా!

సీత—(సింధూరిక చెవిలో నేమేమో చెప్పుచున్నది)

సింధూ—మందోదరీప్రాణవల్లభదర్శనమున సుఖముగా నే యున్నామని మా జానకి నెచ్చెలి మొగంబున విన్నవించుచున్నది.

రావ—(తనలో) ఈముగుద నన్ను మిగుల వలచినది. స్త్రీలవలపును సపత్నులయందలి యీర్ష్యయే చెప్పును. (అని నవ్వి ప్రకాశముగా) జానకీప్రాణవల్లభదర్శన మునే నని చెప్పవలసినది. (సంతోషముతో) హృదయమా! నీవు సర్వమనో రథంబులకును మీఁద నున్నావు! ఏలనః—

గీ. కాముకులపేర్మి యిరుదెసఁ గలిగెనేని
నెమ్మిపించెంబువలె రమణీయ మగును
శ్యామపృష్ఠకబర్హిణచ్ఛదమువోలె
హేయమగు నొక్కదెస గాటమాయెనేని.

సీత—(చెలిచెవిలో మరల నేమేమో చెప్పును.)

సిందూ—సఖీ! సిగ్గువదలి నీవే చెప్పుము. దూతికలలో స్వయందూతికయే మంచిది.

సీత—(కొంచెము సిగ్గువదలి చెలిపంకకుఁ దిరిగి) లంకేశ్వరుఁడు చక్కఁగా సమర్థించెను గాని యీవిషయమును నావచనములుకూడ వినుండు.

గీ. శ్యామపృష్ఠకబర్హిణచ్ఛదమువోలె
నొక్కదెస నున్నకూర్మియు నొప్పిదంబ
నెమిలిపించెంబువలె రమణీయమైన
యిరుదెసలకూర్మి కడు నుతియింపవలయు.

రావ— అట్లైన రావణుఁడు ఘననిబిడప్రేమము కలవాఁడైయున్నాఁడు

సీత— మిగుల ఘననిబిడప్రేమము కలవాఁడని చెప్పవలయు

గీ. తగినప్రేమంబు రూపంబు తగినదియును
దగినప్రాయంబు చెయ్వులు తగినవియును
గలిగి సుఖదుఃఖములు తుల్యములుగఁ జెలఁగు
నాల్మగలపొందు పూర్వపుణ్యమునఁ గలుగు.

రావ— ఆహా! జనకతనయ మాటలసొంపు.

ఉ. రూపమునైనఁ గోరక మదుండు గుణుండుగ రుచ్యమై నునం
దీపిత మైనకూరిమికి నిచ్చలు మేలగుఁగాక! దేనిపై
రేపున నాల్మగల్ చెలియపేక్షయు లేని మనోహరోక్తులుం
గోపకషాయితోక్తులును గొంకొగ్రకగంటకె మాలుసొద్దుగన్.

ఓ సీరధ్వజరాజపుత్రి! దేవి! ఈనాయొకవిన్నప మవధరింపుము.

చ. ఇరువదికన్ను లున్నవి సితేక్షణ చూపులకోపుఁ గోరితే
నిరువదిచేతు లున్నవి గృహేందిర కౌఁగిలిబాగుఁ గోరితే
నిరువదిమోవు లున్నవి మదీశ్వరి ముద్దులముద్దుఁ గోరితే
సరియగు నెట్లు రాముఁ డుపచారమునం దశకంఠునేతకున్.

ఘటీయు లంకారాజపత్నివే యయినయెడల—

గీ. ఘుద్ముజాదండకాండతిగ్మప్రతాప
విహితపతిదేవతాకామినీశిరముల
జానకీదేవి నీదివ్యచరణనఖర
శేఖ లవతంసమై సంస్కరించుఁగాత.

సీత — దశానన! పురంధ్రులవఁగా నీవంటి పురుషమౌళిసమాగమం బనుభవించిన దానే మరి.

రావ — (కొంచెము సమీపించి) సుందరీ! సందియ మేల? దగ్గఱకు రమ్ము.

ఉ. చుక్కలు రెక్కరాయుఁడును జుట్టునునున్న పసిండికొండకు
న్మ్రొక్కవయొక్కొనో సురవనంబున నుండఁగఁ గోర్కెపుట్టెనో
నిక్కము దీర్పఁ జెప్పు రమణీ! యొడలంతయుఁ బుల్కరింపఁగా
నిక్కిన గుబ్బచన్నుఁగవ నీటుగ గ్రుచ్చి కవుంగిలింపవే.

(కవుంగిలించుకొనఁబోయి చమత్కారముగా) అయ్యో! ఆకుదానిం దాఁకి నట్లు లేదే!

గీ. రమణి మైతాఁకుఁ జూడఁగ రాయిగాని
దేవతాస్త్రీలు గూడ నీదృశలుగారు
నను బరీక్షింపఁగోరి యీవాలి నిట్లు
పడసెఁగాఁబోలు జనకభూపాలకుండు.

(మరల నిరూపించి) అయ్యో! శారిక మొగమందమర్పఁబడిన సీతాప్రతికృతి యంత్రముగాని యిది నిక్కపుసీత గాదు. మాయామయ సీతాప్రతికృతిని నీకొసఁగి నిన్ను వంచించిరి. నీమతియు నీమాయయు నెచటికేగెనో తెలియదు. దీనిం గొంపోయి మద్వినోదార్థముగాఁ బడకటింటం బెట్టుము. (సీతాసింహారికామాయామయులు నిష్క్రమించుచున్నారు.)

రావ — (మదనావస్థ ననుభవించుచు) ప్రభంజనికా! లీలోద్యానమునకుం దారి చూపుము. రాత్రిందివంబులును జంద్రసూర్యోదయంబులును షడృతువులును గూడ నొక్కకాలంబునంగలిగి విలసిల్లు నాలీలోద్యానమున సీతావిరహదుఃఖమును బోఁగొట్టుకొందును. ఓప్రహస్తా! నీవు ముందుఁబోయి శిశిరపదార్థంబు లన్నియు సమకూర్చి యితరపదార్థంబులు దూరంబునం బాఱవేయుము.

ప్రహస్తుఁడు — (పరిక్రమించుచు)

చ. ఎవఁడవురోరి చంద్రి! మఱఁ డెంతటివాఁడు దశాస్యు సేఁచ, మా
ధవుఁడన నెంత? నోపరభృతంబ! మఱల్పుము పంచమంబు, పా
మ్మ్రవలకు మందమారుతమ! యక్కట మీభుజశక్తి వజ్రము
న్నవు తెఱగంట్లపైవలె దశాననుపైఁ బఱపింప శక్యమే. (నిష్క్రమించును)

(తెరలో) ఉ. పావకుసార్వమా వరుణ! భాస్కరు మ్రింగుము సైంహికేయ! మీ
చేవ నిదాఘుదర్పహతిఁ జేయుఁడు మేఘములార! శీతధా
మా! వలిగుబ్బలీ! శిశిరమా! కలశాంబుధి! వేల్పుటేఱ! మా
దేవరవారియింటి కరుదెం డుపచారముఁజేయ వేళకున్.

ప్రతి — దేవా! ఈమార్గంబున రమ్మిదియే లీలోద్యానము.

రావ — మంగళప్రదురాలా! సకలర్తుసమావేశము గల యీయుద్యానవనభాగముల యన్నింటిని జూపుము.

ప్రతీ — అట్లైన నిటురమ్ము.

రావ — (పరిక్రమించుచున్నాఁడు.)

ప్రతీ — ఇదిగో! ఇది నీరెండిపోయి తూఁడులు బయల్పడిన పుండరీకంబులతోఁ గూడి నీటిచేఁ దడుపంబడిన వీవనలచే సేవింపంబడు యువతుల శరీరపరీరంభ మాచరించు కాముకులకు మాత్రము చల్లనగు గ్రీష్మఋతువు.

రావ — ఆఁ! ఇదిగ్రీష్మమా! ఈఋతువునందు—

చ. అరుణుఁడు తమ్మిమొగ్గ లుదయంబుననే పరిపూర్తిగా విక
స్వరములు చేయు, విచ్చుఁ గలువల్ నడిరేయికిఁ గాని కోరినం
దొరకవు, తాలవృంతములతోఁ బడుచుండు నిషేచనక్రియా
పరపరిచారికాజన మపారపరిశ్రమ మొందవేఁడికిన్.

మఱియును —

చ. కచభరమందు మల్లియలు కర్ణములందు శిరీషపుష్పముల్
కుచములఁ జందనంబు మెడఁ గుంకుమ పాటలపుష్పమాలికా
నిచయము మై బిసంబులును నేత్రములం జలికజ్జలంబులున్
విచికిలగంధు లందఱకు వేసఁగివేసము లిట్టులొప్పగున్.

(తాపాతిరేక మభినయించుచు.)

గీ. చల్లచల్లని శైత్యోపచారములనె
యొందఁదగు నాకు నిదిరెండు నోర్వరాని

నిపుడు నడిమింట మంటలరేఁడకాల
మొకటి మఱినెయ్యురాలి వియోగ మొకటి.

కావున మఱియొకప్రదేశమునకుం దీసికొనిపొమ్ము.

ప్రతీ — దేవా! ఇది బాంధవుల నింటికిం జేర్చి పథికమార్గంబులు పాడొనర్చి లాంగ లీకుసుమంబు లాడఁగూర్చి వికసించి రాలిపోయిన ముసలికేసరంబులతో వె డవింటివాని విశ్రమం బవక్రమంబుగ నొర్చు వర్షాకాలము.

రావ — ఆఁ! ఇది వర్షర్తువా! యీఋతువునందు —

శా. ముల్లోకంబుల నేడిపించు మసనుం బూజించు జేగంట కే
ళ్యుల్లాసపవిత్రమంగళధ్వని విదూరోపాంతరత్నప్రభా
వల్లీద్రావము రాజహంసముల లేవం గొట్టు చేసవ్వ వి
ద్యుల్లీలాలలితాంబుదధ్వనము రోదోభాగముల్ నిండెడున్.

మఱియు —

మ. నలఁగంగొట్టిన జీలకఱ్ఱవలె రమ్యంబైనకింజల్కమం
డలితో దోనెలవోలె మూఁడుదళముల్ నల్వొంద తేకెత్త కి
మ్మలకుం దుమ్మెద లట్టిటుల్ తిరుగ నామోదంబు పైఁ జిమ్ముచున్
జెలియా! చూడుము కేతకమ్ము వికసించెన్ హాయి నాకిచ్చుచున్.

(వేడుకతో) శా. చాలుంజాలుఁ బయోదకాలమ! యికం జాలింపుమా మేము నీ
మేలుంగోరద మైన భృత్యులగునీ మేఘంబులయ్యో, యస
చ్ఛీలంబుల్ సఖినైన దుఃఖినయినం దండ్రించిపీడించు నే
కాలంబుం గనుఁగోవు చూపవు వియోగంబుం బ్రియాయోగముల్

ప్రతీహారీ! మఱియొకచోటికిం గొంపొమ్ము.

(ప్రభంజనిక యడుగుమారంబుననుండి) ఇదిగో నిది శరదృతువు! కరండీ కుసుమంబులు వికసింపఁ గలువపూవుంబోఁటులు హసింప నింద్రచాపంబు బంధూక కుసుమంబుఁబోలె విగతచ్ఛాయంబై కాన్పింప మొగలిపూవుల తావులునశింపఁదటాకం బులకుఁ గాంతి యతిశయింపఁజేయుచున్నది.

రావ — ఆఁ! ఇదిశరదృతువా! యీఋతువునందు —

క. వికసితకుంకుమకింజల్కకృతవతంసంబు వచ్చెఁగా శరదృతువుం
బ్రకటవదీపులినంబుల కకటా చనుదెంచె రాజహంసకులంబుల్.

చ. తెలితొగలందుఁ జెన్నలరు తేనియ నోడ్చుచు హంసమండలీ
గళకలకూజితంబులకుఁ గాంతియొసంగుచు విచ్చుతమ్మిపూ

వలపులతోడ నేకమయి వచ్చెనళిప్రకరంబు మాట్టఁ జెం
గలువలు నల్లగల్వలుఁ బ్రికాసిల శారదవాతపోతముల్.

గీ. నీటఁగల్వలు దివియందు నీరజారి
నావగలయందుఁ బులినముల్ హంసకులముఁ
జూడఁజూడఁగ మానీత సుందరావ
యవములను జూపు నీఋతువంచుఁ దోఁచు.

(తాపమభినయించుచు) ప్రియంజలికా! దీనిపేరుమాత్రము శరదృతువుగాని నిక్కముగానిది గ్రీష్మఋతువే. కావున నింకొకచోటికిఁ బోదమురమ్మ.

ప్రతీ—మహారాజ! ఇది వివర్జితజలక్రీడంబును లోధ్రరజఃపుంజకింజల్కిత దశదిశా వలయంబును ననియంత్రితసారసారావకలితదిశాసీమాంతంబునగు హేమంతము.

రావ—ఆఁ! హేమంతమా! దీనియందు—

మ. పరమానందము రల్లకంబులు వహింపన్ భూర్జచర్మంబులున్
దొరలం గస్తురిలేళ్ళ నేస్తమున సంస్తుత్యంబులై కుంతలీ
వరణీయంబులునైన హైమనమరుద్వారంబు లేతెంచె దు
ర్భరలంపాకవధూశిరోరుహవిహారప్రీయమాణంబులై.

(తాపమభినయించుచు.) గీ. అకటకట చూడ సర్వావయవములందు
రగులుచున్నది మదనాగ్ని యగణితముగ
నాదు పాలిటి కివి హైమనములు కావు
తవిలివచ్చిన వేఁడివాయువులుగాని.

ప్రతీ— మహారాజా! ఇది హిమపరిపుష్టదమనకంబును సతతశైత్యసులభయువతీ స్వయంగ్రహాలింగనంబును నవతంసీకృతరవికిరణప్రసారంబును బురాణదర్పణ విచ్ఛాయచంద్రబింబంబు నగు శిశిరఋతువు.

రావ— ఆఁ! శిశిరఋతువా! యీఋతువునందు—

చ. చలి భరియింపలేక రవి సత్వరుఁడై చనుఁ బావకాశకున్
జ్వలనుఁడు నీరవోలెఁ గడుఁజల్లనిహాఁ డయియుండుఁ బూవు మొ
గ్గలు వికసించు నామరువకంబులయంద హిమానికిం దినం
బులు భయమందెనో యనఁగఁ బొల్పఱు రాత్రులు వృద్ధిఁ జెందఁగన్.

ఉ. వాసనకోస మొక్కప్రసవంబును లేక సుపాణిదండఁ గై
వేసినకొప్పులుం బయలుఁజేసి శరీరమునిండఁ గుంకుమం

బూసినచన్నుదోయి గల ముద్దులగుమ్మలతోఁ గవాటముల్
మూసినయిండ్లలోని సుఖముల్ సుకృతాత్ములపాలిభాగ్యముల్.

గీ. హిమమయములైన వాతపోతములకు గజ
కుంభములఁ బోలు జావకికుచములకును
వాకరంబులకును నీదినంబులందుఁ
జేరికలు లేవు కాఁబోలు శిశిరఋతువ!

ప్రతీ— (అడుగుదూరము నడచి) దేవా! ఇది పండిన ప్రియంగువృక్షంబులును జిగిరించిన కంకేళినగంబులును గలగానంబొనరించు కోకిలదంపతులును వల్లి బిల్లిగ నల్లుకొనినపున్నాగలతలును గలిగిన విరహిజనకృతాంతంబగువసంతము.

రావ— అఁ! వసంతమా! యీఋతురాజము—

శా. పాలం బోలినపూలు మల్లికల కాపాదించె భృంగికుల
వ్యాలోలంబులఁ జేసెఁ గింశుకములన్ బాహ్లీకకాంతాధర
శ్రీలింపొందెడు కెంజిగుళ్లనలరించెన్ బెల్లశోకంబులన్
బాలార్కద్యుతి నొప్పుమొగ్గలను పస్తానించె నప్పాటలిన్.

గీ. విరహవతులను నీఁకమందు వేఁచుననుచుఁ
గనికరమునొఁవ వారలకలికిచెలులు
తెలియకుండఁగ మామిడితీవ పసరుఁ
బూవమొగ్గలు కేలఁ దుంపుదురు నేఁడు.

(తెన్నఁగఁజూచి) ప్రభంజనికా! సీతావయవసౌందర్యముకలుగుకతన నియ్యాస్తునియందు నాకుఁ బ్రీతి యధికమగుచున్నది. ఎట్లన—

ఉ. మైజిగి శిప్పపూలు సరి మల్లెలు పల్గమి కీడు పాటలం
బోజగుమోవికిం గలువ బుద్ధి కనుంగవకుం బరిమళ
శ్రీ జత కేసరంబులు విచిత్రము నీదుచరిత్ర చైత్రమా!
నీజననంబు గన్య మననీసుతకున్ సరివచ్చుటం గదా.

ప్రభం— మహారాజా! దీనితో నేమి! యిది యుత్కంఠకుం బెట్టినపేరు.

రావ—(ఉత్కంఠ నభినయించుచు) గీ. మధుఋతువు నేఁచుచున్నది గ్రీష్మంబ నీవు
(అడుగుదూరము నడచి) గ్రీష్మము నడంపుమా వర్షఋతువ నీవు
(మరల నుత్కంఠతో) శరదృతువ వాన రూపమేచంగదమ్మ
(మరల నడుగుదూరమునడచి) శిశిర హేమంత మీర్మాపుఁడు శరదృతువు.

ప్రభం— దేవా! సకలర్తుచక్రముం గనుఁగొంటివి గాన నిఁక నీమృదితదర్పణసమాకారంబగు శిలాతలంబునఁ గూరుచుండి కొండొక విశ్రమింపుము.

రావ— ప్రభంజనికా! నీచెప్పినట్లు విశ్రమించెదను (కూర్చుండి దుఃఖముతో)

చ. ఇది శ్రమఁజెందె నవ్వె నిది యిట్టిది వెల్వెలఁబాఱెఁ బాడె ని
య్యది యిది పుల్కరించె నిది యట్టిటులం బడె నూరకుండె ని
య్యది యిది యాపులించె నిది యబ్రముముగాఁ బ్రలపించె నేడ్చె ని
య్యది యిటు లయ్యె సీత విరహంబున నావదిమోములుం గటా!

ప్రభం— మహాత్మా! మదన! మారాజు నేమి చేయుచున్నావో! దేవా! ఇదిగో రతనంపుంగోళ్ళ పట్టెమంచ మిందు విశ్రమింపుము.

రావ— (తనలో) కోపముతో—

శా. దానిం గొట్టుము మార! నన్విడిచి, దాఁ దప్పింపుమీ యిర్వురన్
(దయతో) దానిం గొట్టఁగఁ బూను బాణములచే నన్నేనిఁ దాఁడింపుమా
(ప్రేమతో) దానిన్ నన్నును గూడఁ గొట్టు మొకచేతన్ రెండుబాణంబులన్
దానం జేసి విదేహరాజతనయాతాదాత్మ్యముం జెందెదన్.

(ప్రభంజనికవంకఁజూచి) ప్రభంజనికా! శిశిరోపచారసామగ్రి వేగఁ దెప్పింపుము

ప్రభం— దేవా! ఇంతకుమున్న దేవతలచేఁ దెప్పించియే యుంచితి మఱియు నానతిండు.

రావ— గీ. మంచు మలయాలిచేతఁ దెప్పించు మిపుడు
నీళ్ళఁ దేఁబంపు మందర నీరజాక్షి
మంచిగందముఁ దెచ్చులే మలయజలన
వ్యజనమున వీచుఁగాత నేపాళపాళి.

ఓపర్వతశక్రంబులారా! మీసేవఁ జాలింపుఁడు (యవ్వలిదెసకుం జూచి)

ఉ. వేఁడివెలుంగువేల్పు వెడవిల్తునిఁ జంపినచిచ్చుకన్ను నీ
ళ్ళాడినచేడె లందఱును నావలి కేగుఁడు; రండు లచ్చితోఁ
గూడ శశాంకుతోడ మధుకన్ సహజన్మతఁ గాంచినట్టి యో
చేడియలార! దగ్గఱ వసింపుఁడు చేయుఁడు నానియోగమున్.

శా. ఓరంభా! కడుఁజల్లఁగా విసరు రంభోద్యద్దళాగ్రంబులన్
దారా! పూయుము చందనంబు మెయి నిండం దారకారాణ్ముఖీ
హారా! తామరతూండ్లు గప్పుము సమన్యాసంబుగా మేనకా
చేర న్మిమ్మెమ్మయిఁ బైవయి న్నిమురు మీరావే కాని వల్దొండొరుల్.

(మరలఁ దాపాతిరేక మభినయించుచు) ఓయచ్చరలారా! మీపతులనునిర్జించి మిము విరహిణులఁజేసిన నాకు మీరుపచారమునకుం బనికిరారు లేచిపొండు.

మ. ఉపచారక్రియ చేయలేవు రతి! వేఱొక్కండు గావింపు మీ
వెపుడుక్ ముప్పదిరెండుచేతుఁ భవానీ! పీపనత్వేయుమీ
యపచారంబగు సూర్యపత్ని విడు మీ పంభోజముల్ చేతులం
గృపతోఁ బంపఁగదయ్య సన్నిధికి నీయిల్లాండ్రఁ బాథోనిధీ.

చ విసరుము రేవ! ఱొమ్ముపయి వెట్టుము కేల్మరళా! పదంబులం
బిసుకుము తామ్రపర్ణి! పదవే బిసమాలిక గ్రుచ్చ గౌతమీ!
విసుగక తెమ్ము గందముఁ గవేరజరో! పయిఁజిమ్ము యంత్రపున్
రసములు తాపిరో! కడు విరాళి సురారికిఁగల్గె సీతకై.

(మరలఁ దాపముతో) వీరుగూడ నాశరీరతాపము తాఁకి తపించుచున్నారే (అని కోపముతో) ప్రభంజనికా! నాయనుగ్రహముఁ గోరువారుకూడ నామాట వినకున్నారు వేగమ భటుల నిటుఁబిల్వుము. ఓభటులారా!

ఉ. తావిని రెండుమూఁడు పెదతాఁపులు తన్నుఁడు వాతపోతమున్
జావఁగఁగొట్టి కాళులకు సంకెలవేయుఁడు బందెవెట్టుఁడీ
ప్రోవక పంచమస్వరముఁ బూర్ణశశాంకుని బిండిచేయుఁడీ
రావణుమీఁదనా తమపరాక్రమ మీగతిఁ జూపుచుండుటల్.

(గుమ్మమువంకకుం జూచి) ప్రభంజనికా! వారెవరు?

ప్రభం— దేవా! వారుణియు లక్ష్మియు సరస్వతియుఁ జనుదెంచినారు.

రావ — (తిరస్కార మభినయించుచు)

ఉ. వారుణి వచ్చినట్ల నడువందగు రత్నములేల మాకుఁ బో
మ్మా రమ! పొమ్ము మెచ్చుకునయో నినుఁగాంచిన మాకుఁ దాపమో
శారద! నీపురాణములు సాగవు దగ్గఱ నుండఁబోకుమా
యేరును మాకు సంతసము నీ వసమర్థులు సీత తక్కఁగాన్.

(మిన్నువంకఁజూచి తనలో) ఇట్లగును గాక (ప్రకాశముగా) ఓదేవతలారా! శీతోపచారములు చేయుమనిన నుష్ణోపచారములు చేయుచున్నారుకారు! కానిండు దశకంఠుఁ డీమాట మఱచిపోఁడు సుఁడీ (ఆలోచించి) అట్లుచేయరు. సర్వదా నాయనుగ్రహముఁ గోరువారేకదా! అయినను నొక్కొకరిం బిలిచి నియోగించెద. (పెద్ద యెలుంగుతో)

చ. విసరక లేచిపో తఱపివెన్నెల వీవన లీవు చంద్రి! పై
మసలకు పాలుతోడికొను మన్మథవహ్నికిఁ బాలవెల్లి! ప
ద్మసరసములార! మీవలనఁ దాపము హెచ్చును లేచిపొండు నా
చెస కిటు రాకు మంచుమల! తెల్లము నీహిమచేష్ట తమ్మికిన్.

ప్రభం—ఏమీ! మదనునిదౌర్మార్గ్యము! అన్నా, విధిప్రాతికూల్యము! అంద మై నదికూడఁ గురూపముగాను జల్లనిదికూడ నుష్ణముగాను గన్పట్టుమన్నది దేవా! శాంతింపుము

రావ—(దైన్యగర్వములతో)

ఉ. ఆమనిగాలి మ్రింగవలెనయ్య ఫణీశ్వర! వేయిమోముల
నోమునితోడ మ్రింగవలెఁజు మ్మలచంద్రికఁ గూడ రాహువా!
కామునిఁ జూచుమా మరలఁ గ్రచ్చఱ చిచ్చఱకంట నీశ్వరా!
సోముఁడ! సూర్యుఁడా! తొగలసొంపును దమ్ములసొంపుఁ ద్రుంపుఁడీ.

(తనలో) అన్నా! నాకీతాపమెట్లు శాంతించును ((ప్రకాశముగా) ఇట్ల గునుగాత.

చ. పెనువడగండ్లవాన లడపింపుఁడు మేఘములార నాపయిం
గుసుకువిధంబుగా నెగురఁగొట్టుఁడు కల్పమరుత్తులార నా
కనువుగ నాటబావి వగుమయ్య కరంగి హిమాచలంబ! లే
కునికి దశాస్య నీమనసిజాగ్రిమహాగ్నులు చల్లనాఱు నే.

(విశేషతాపముతో మిన్నువంకఁ జూచి)

గీ. చంద్రికిరణంబు లనుసూత్రసమితిలోన
రిక్కలనుముత్యములు గూర్చి యొక్కకొత్త
దండ దయసేయుఁడయ్య సీతావియోగ
రాగమగ్నాత్ముఁ డైన యీరావణునకు.

ఛీ ఛీ యీక్షుద్రనక్షత్రమణిస్యూతం బగుదండ నాకేల.

గీ. పార్వణేందుని నిరుఁగేలఁ బట్టి పిడుచ
జాఱినట్టి సుధారసస్రవముచేత
నొడలు శ్రామినఁ జల్లనైయుండుఁగాన
నాకు వైద్యంబు నేన యొనర్చుకొందు.

ప్రభం—అట్లు నేసికొనుట మంచిదే కాని యిఁక లోకమునకుఁ జంద్రుఁడో,

రావ—పోనీ, యితని విడచెదను. సీతావదనబంధువగునీతనితో నేఖవని (దయతో)

గీ. అమృతమూర్తివి భూమిసుతావదనంబు
కోరయువాఁడవు గాసఁ బంధువుఁడవీవు
మిగులఁ జల్లనివాఁడవు మేలుఁ గోరు
వాఁడవును గాన బ్రతికినవాఁడ వైతి.

(మదనవేదన నభినయించుచు)

గీ. మదన! శరములు నాపయి వదలుచుంటి
మఱచితివె పఙ్క్తికంఠు నమరవిరోధి
నకట! రాఘువపక్షపాతకుఁడ వీవు
మఱచినను నిన్ను నాకత్తి మఱవ దోరి.

ప్రభం—సకలవిటమానసనివాసియు విభ్రమోపదేశియు నగుమదనుం జంపనెంచిన నింక సురతవిశేషవిజ్ఞానమ్మునకుఁ గూడ జలాంజలియీవలసినదే.

రావ—(విరసముగా నవ్వి) వల దనినను నన్నుంగొట్టుచున్నావుగా! నీమదిఁ గల తలంపు నాకుం దెలిసినదిలే.

గీ. అలుగుఁగా నేమి నన్నుఁ జేయుంగలాఁడు
పఙ్క్తికంఠుండు వానికృపాణమునకు
గోచరుండనుగా ననుకొనకు మో యు
వంగ! రావణునకు నసాధ్యంబు గలదె.

(ఆలోచించి) మదనుగ్రహాకాంక్షియుఁ దపస్వియు నగునీతని యీమొదటి తప్పు క్షమించెద (అని మిన్నువంకకుంజూచి)

గీ. అబ్దములు వదలు మరర! బలారి నీవు
నికటమును బాపు మోఘమా! నీహయంబు
మరలువన్నవలె మెఱపులో మఘువ! వృష్టి
నైంపఁజాలఁడుచుమ్ము రాక్షసవిభుండు.

(ముందుఁజూచి) ప్రభంజనికా! ఎవరువారు?

ప్రభం—దేవరసేవనిమిత్తము వచ్చినపన్నగములు.

రావ— గీ. పన్నగములార మీస్వరూపంబు విషము
యంబగుటఁజేసి చంప నాయత్తపడియు
జానకీదేవిజడతోడ సమము గాన
మరల నాచంద్రహాసంబు మరలుచుండె.

(మరల ముందుఁజూచి) ఇదిగో ! కేలికమలిని (అని కేలంగొని)

గీ. కుట్మలంబులఁ దూండ్ల తేఁకులను సీత
కన్నుఁగవ కిరుకేలికిఁ జన్నుఁగవకు
మాదిరిపగుటను నీకు నమస్కరింతు
నమ్మ పద్మిని కన్నుల నద్దుకొనుచు.

(మఱియొకవంకకుం జూచి) ఇదిగో ! పితామహుని తేరిరాయంచ లివి సీతా గమనసమగమనంబున నాకునంబునకుం బ్రీతి పుట్టించుచున్నవి (అని యాక్షేపణముతో) పాలు నీరును వేఱుపఱుచువిద్య నేర్చిన యో రాజహంసములారా ! మీ రీ దొంగతన మెచ్చట నేర్చితిరి. అగుఁగాక మాతాతగారి నే యడిగి తెలిసికొనియెద.

గీ. సీతనడ దొంగిలించె నిన్నీ విధాత
మందలింపుము నీహంసమండలమును
నీవు శిక్షయొనర్పఁగ నేర వేని
పెల వోసంగుము నేన శిక్షించువాఁడ.

నాభయంబునం ద్వరగా నడచు నీయంచలు సీతాగతిస్తేయమును మానిన వని తోఁచుచున్నది. కావున శిక్షింపను ! తెలియక యొకసారి దుష్కార్యముఁ జేసినను దరువాత మానినవారు నిర్దుష్టులే. (మఱియొకవంకకుం జూచి) ఓరీ ! పురందరా ! నాయెదుటనే సీతను గౌఁగిలించుకొనుచున్నా వఁటరా ! మునిభార్యయగు నహల్య యనుకొంటివా యేమి ! ఓచంద్రహాసమా ! ఇటురమ్మ, నిన్నీ పురందరహతకునిపైఁ బ్రయోగించవలె.

ప్రతీ— దేవా ! ఇచట దేవేంద్రుఁడును లేఁడు సీతయును లేదు.

రావ—(సరిగాఁ జూచి) అయ్యో! సాదృశ్యముచే వంచింపఁబడితిని. విరహోపశాంతికై వల్లవల్వలు తెచ్చిన భటుఁడుగాని వీఁడు సహస్రలోచనుఁడు కాఁడు. తరగలచేఁ బొడుగుగాఁ జేయఁబడిన జలప్రతిబింబితమైన చంద్రబింబముగాని సీతయుఁ గాదు.

ప్రతీ— మఱియొకచోటికిం గొంపోయి యూపిచ్చిమాటలు మాన్పించెద.

రావ—ఓపన్నగములారా ! మాసీతం బాతాళమున కెత్తుకొని పోవుచున్నారా. ఓపక్షిరాజా ! ఈసర్పముల నివారింపుము. అక్కటా ! రావణుఁడుగూడ సాహాయ్యము గోరుచున్నాఁడే (లేచి పట్టుకొనఁబోవును)

ప్రతీ-దేవా! ఇచటఁ బన్నగములునులేవు జానకియులేదు గరుత్మంతుఁడును లేఁడు

రావ— అక్కటా ! ఈతని భ్రాంతిపడితి.

గీ. నీటిసుడి గాని యిది సర్పవాటి గాదు
భంగములుగాని యివియు సర్పములు గావు
కొప్పుగా దిది తుమ్మెదకొలము గాని
ధరణిజాస్యంబు గాదిది తమ్మిగాని.

(ఆలోచించి) ఇవిగో! క్రీడార్థంబులైన సారంగము పికము నలినము గంధగజమును నిటనున్నవి.

గీ. చూడ్కిఁ బల్కులఁ దావిని సొగసునడల
శిష్యులరు గానఁ దెలుపుఁడీ సీత నెచటఁ
గాంచితిరో? లేటి నీవు పికంబ నీవు
సారసమ నీవు గంధగజమ్మ నీవు

(మరల ముందుఁజూచి) నాభయముచే నివియుఁ దలయెత్త లేకున్నయవి, యొక యైరావతము మాత్రము ఘీంకరించుచున్నది. ప్రియురాలి సొత్తేదియో యిది దొంగిలించియె యుండును.

చ. అవనిసుతాకుచంద్వయమువడుము జన్నులసొరు గండసో
మ్మమము గతిప్రపత్తియు నిజంబుగ నీకరకుంభదంతమం
దవలితమల్ హరించిన వదంతి వినంబడె; నామె యున్నకం
దువ నిజ మీవు తెల్పుము నినుం గరుణింతును దంతిరాజమా!

అన్నా! ఈయైరావతము నామాట యాదరింపక తనప్రియురాలగు నభ్రముతోఁ గలియుచున్నది. (కోపముతో) ఓసీ! చండికాసింహపోతమా! దీని మందలింపుము.

గీ. కంధరంబునఁ బెదతాడుఁ గాళ్ళసంక
లియలు నిరుదెసనుం దగిలించి యిచట
ద్వారమునఁ గట్టఁబడియున్న దంతికకట
శిక్ష వేఱ విధించుట సిగ్గుగాదె.

(మఱియొకవంకకుఁ జూచి) అపర్వమందు వసుమతిపైఁ జంద్రగ్రహణము పట్టుచున్నది.

ప్రభం—దేవా! కృష్ణపక్షమునఁ జంద్రగ్రహణ మేమిటి?

రావ—ప్రభంజనికా! నిజ మంటివి (అని నవ్వుచు)

చ. చెలి నవనీతరమ్యమగుసీతశరీరము గాని కాదు బె
న్నెల, నెలకాఁడు వీఁడు రమణీయతదాస్యము గాని, నల్లగ

ల్వలగమి కాని భూతనయ వారనిచూడ్కులు కావు, పాముగా
దలమిథిలాత్మజాత జడయందము గాని భ్రమంబుఁ జెందితిన్.

(ఆలోచించి) ఇచట సీతయైనను లేదే! ఆఁ! తెలిసినది, సీతావిషయికనిరంతరధ్యాన మట్లు చేయుచున్నది (అని మఱియొకదెసకుఁ జూచి) ఇదిగో! క్రీడాసారంగము (ఆలోచించి) ఇది సమీరకురంగము గాని మన క్రీడామృగముకాదు

(వాయువు నుద్దేశించి) గీ. కలికి కన్గవసొగను తెక్కలితనంబుఁ
జేసె నీలేటి గావ శిక్షింపవలయు
మారుతమ నిన్ను; నొడయలఁ జేరఁగాదె
భృత్యులొనరించినట్టి తప్పిదము లెందు.

(ముందుఁజూచి) ఓసరీసృపచక్రవర్తీ! నీ వీసమీరమును మ్రింగుము (అని

నెలవంకఁజూచి) గీ. హరిణమును వీడు మోహరిణాంక నీవు
మైథిలీనేత్రములకు విరోధి కాన
నీమొగముఁజూడ నింక నోనీరజారి
దాని వదలవయేని తథ్యంబు వినుము.

రాహువా! రాహువా! యీచంద్రు నొక్కకబలముగా మ్రింగుము.

ప్రభం— పరిపక్వకర్పూరపిండపాండురచ్ఛవియగుఁ గేళీకమలినీవిలాసప్రియుఁడు నగు
నీచంద్రుని జంపించిన నీఁక మానినీమానభంగోపాయమును వెదకికొనవలయు

రావ— ప్రభంజనికా! మాటిమాటికి నీవు నివారించినకొలఁది నీదురాత్ముండు మిట్టిపడుచున్నాఁడు గావున నొకసారి వీని శిక్షింపవలయు.

గీ. వదలుముర చంద్ర! లేడి రావణునియావ
నేయుముర నీకు రెండింటఁ జెందు శుభము
వజ్జకంతున కర్మిలివాఁడ వాదు
కందటివ నీదుబింబంబు కాంతిఁజెందు.

(తాపముతో) జానకీ! జానకీ! నీకేమి యొగ్గొనరించితి?

ప్రభం— దేవా! యిచట జానకి లేదు.

రావ— ఇదిగో, నిదిగో! (బాగుగఁ జూచి) కాదు, కాదు ఎంత నిర్భాగ్యుఁడనైతిని

క. ఇది యొకపువ్వుఁదీవ తతచ్ఛద మీపూవులకు మూసరె షట్పదములు ని
య్యది గని భ్రమఁజెందితి నీలదుకూలముఁ గప్పుకొనిన లలనామణిగన్.

(ముందుఁజూచి) ఇవిగో వెన్నెలతిండి తిను చకోరములు (వాని నుద్దేశించి)

గీ. ఓచకోరములార యీజ్యోత్స్న నకట
వేచి నిశ్శేషముగ మ్రింగివేయుఁడమ్మ
కాంతికి దరిద్రుఁడగుచు నీకమలవైరి
విరహిణులపాలివేరంబు విడుచు నిజము.

గీ. సీత నెచటనో కంటిరి చెప్పుఁడో చ
కోరవాతకంబులార యీతూరి నిజము
లేకయుండిన నామొమైలీలవంటి
వెన్నెలలతిండి కేల యపేక్ష మీకు.

(అంతట ఛిన్ననాస యగుశూర్పణఖ పటాక్షేపముగాఁ బ్రవేశించి)

హా భగినీవత్సలా! శూరాగ్రేసరా! చూడుము, నీచెలియలి కపకార మొన రించి యొక్కఁడు తత్క్షణచూడామణి నపహరించె, దావాగ్ని నార్పఁబూనె.

రావ—(కోపముతోఁ గనుబొమ్మ లదర లేచి)

మ. పతిభిక్షాంమమదేహియంచు నెవనిం బ్రార్థించెఁ బౌలోమి ము
న్నతఁ డాసీతకునై మనోజవిజితుం డైయున్న రంధ్రంబు వే
చి తదీయానుజ వైననీకు నొనరించెం గీడు నేబాసు వి
స్మృతికిన్ వచ్చెనె చంద్రహాస మనమీచీభూత మవ్యానికిన్.

శూర్ప—(తనలో) నేను రామలక్ష్మణుల బొందఁగోరి చేరఁబోయిన వారొల్లక నాకీయపకార మొనరించిరని పెద్దయన్నగారితో నెట్లుచెప్పుదు. అయిన నిట్లగును గాత. (ప్రకాశముగా) దేవా! అయోధ్యయందు రాముఁ డనురాజ కుమారుఁ డొక్కఁ డున్నాఁడు.

రావ—(తనలో) అహాహా! వానిం జంపించుటకు సీతయే కాక శూర్పణఖయు మృత్యువైనది (ప్రకాశముగా) శివచాపము విఱిచి పరశురాముని భంగపఱిచిన వాఁడే కాఁడు?

గీ. కల్పకాలికపటుపటాత్కారచండ
ఖండపరశుపవిదంష్ట్రికాకషమువోలె
రావణునిచంద్రహాస మారామచంద్రుఁ
గఱకుఱ గళంబువం దెగనఱకుఁగాక.

(అని యందఱును నిష్క్రమించుచున్నారు)

ఇది... శ్రీతిరుపతి వేంకటేశ్వర విరచితంబగు నాంధ్రబాలరామాయణ నాటకమునం దున్మత్తదశాననమను పంచమాంకము.

శ్రీరస్తు

# బాలరామాయణము

## షష్ఠాంకము

(తరువాత శూర్పణఖయు మాయామయుఁడును బ్రవేశింతురు.)

శూర్ప — మాయామయా! తాతగారి తెలివితేటలు నీకుఁ దెలిసినవికద. తాను జేయఁబూనినకార్యము మనయిరువురవలనంగాని నెఱవేఱదని మనల నియోగించినాఁడు.

మా.మ — శూర్పణఖా! తాతగారి మతిచాకచక్యము నీవు నాకుఁ జెప్పవలయునా! చంద్రుఁడు చల్లనివాఁడని యెవరికిఁ దెలియదు.

గీ. తగునుపాయంబునుం, జలత్వంబులేని
పౌరుషంబును రెండుకారణము లనుచు
నీతిశాస్త్రంబునందు వర్ణింపఁబడియెఁ
జేయఁదలఁచినకార్యంబు సిద్ధిఁజెంద.

కావున మనము మాల్యవంతునియొద్దకే పోదము రా.

శూర్ప — అట్లే చేయుదము (అని యిరువురును బరిక్రమింతురు)

మాయా — గీ. రావణుఁడు చేయుచున్న కార్యములయెడల
మంచిచెడ్డలు గుర్తించి మనుచుకొనుటకు
మాల్యవంతుఁడే యున్నాఁడు మనుమనియెడ
దయగలాడు కనిష్ఠమాతామహుండు.

(అంతట మాల్యవంతుఁడు ప్రవేశించును)

మాల్య — (స్మృతి నభినయించి) చెలియలికిం జేసిన యపకారమువలన మండిపడుచున్న దశాననుఁడు, సీత చారులచే నీ కీర్తి వార్తఁ నంపించెనని చెప్పి, సాకేతపురీయాత్రనుండి మరలింపఁబడెను.

గీ. "నీకు నాయందుఁ గలప్రేమ నిక్క మరయ
నపుడు పన్నితి మెదుట నాయంత్ర మొకటి
రేపు రెల్లుటనో నిజరూపుతోడ
నీదరికిఁ దప్ప కేతెంతు నోదశాస్య."

గీ. ఇటులు పంపిన యాసీత కుటిలవచన
ములకుఁ జెలియలియొగ్గినఁ దలఁప కలఁడు
దానిఁ గవఁగూడఁదలఁచు డెందమున నుండె;
వెడవిలుతుఁ డన్నియును మఱపించుఁగాదె.

(స్మృతి నభినయించుచు) కైకేయీదశరథుల వృత్తాంత మేమైనదో తెలియనేలేదు (నలుదిక్కులుఁ గలయంజూచుచుండ శూర్పణఖామాయామాల్యులు ప్రవేశింతురు)

మాయా—ఆర్యా! జయము జయము.

శూర్ప—కనిష్ఠమాతామహా! జయము జయము.

మాల్య—వత్సలారా! కుశలమా! మీపోయినకార్య మేమాయెను.

మాయా—దేవర సెలవిచ్చినట్లే జరిగెను.

మాల్య—సవిస్తరముగాఁ జెప్పుఁడు.

మాయా—ఆర్యా! వినుము. ఒకనాఁడు దశరథుఁడు కైకేయితో దేవేంద్రునికి సాహాయ్యము చేయుటకై యసురవిజయంబున కమరావతీపురి కేగఁగాఁ జూచి, రాముని వంచించి యయోధ్యనుండి తరలించుటకై శూర్పణఖయు నేనును గైకేయీదశరథుల రూపంబుతో నమరావతినుండి వచ్చినట్లయోధ్యాపురి కేగఁగా నపుడు బృందారకవందివేషముతో నొక నిశాచరుఁడిట్లు స్వాగతోద్ఘోషము చేసెను.

చ. అసురుల నెల్లఁ బేర్మిగులున ట్లనిలోఁ బరిమార్చి చక్కఁగా
దెసలు పదింటియుం దనపుఁదీవలు ప్రాఁకఁగఁ జేసి దేవతా
బిసరుహనేత్రి లందఱకు వేడుక మోములఁ నిండఁగాఁ గళ
త్రసహితుఁ డౌచు నీదశరథక్షితిపాలుఁడు వచ్చెఁ బ్రోలికిన్.

మాల్య—తరువాతఁ దరువాత.

శూర్ప—తరువాత నోతాతా! వందివచనములు విని పురమునల్లడలఁ దూర్యములు వాయించిరి. నారాంగన లాడిరి. తోరణము లలంకరించిరి. జెండాలు కట్టిరి. పరిమళచూర్ణములు వెదఁజల్లిరి.

మాల్య—తరువాతఁ దరువాత.

మాయా—తరువాత మాయాకైకేయీ దశరథులమైన మేమిరువురమును యథాస్థానములకుం బోతిమి. పిదప మనశూర్పణఖచే బోధింపఁబడి మంధర యను

కైకేయీపరిచారిక రూపుదాల్చిన యిరమ్మద నాసమీపమునకు వచ్చి కైకేయివచనములుగా నిట్లనియె.

క. వరములు రెండొసఁగితి రంబరమార్గమునందుఁ బోవుపట్టున రథతూ
బర మూడిపడిన నే తూబరమునకుంబదులు వ్రేలు పన్నినవేడ్కన్.

క. ఆం దొకటఁ జేయఁదగు నానందనునకుఁ బట్టబంధనము, కౌసల్యా
నందను వరణ్యమున కంపందగుఁ బదునాలుగేండ్లు మఱియింకొకటన్.

మాల్య—తరువాతఁ దరువాత.

శూర్ప—అప్పుడు మనమాయామయుఁడు నిజముగ దశరథుఁడువలెనే, వినిన చెట్లును పుట్టలును రాళ్ళును రప్పలును గూడ నేడ్చుపగిదినతికరుణముగా నేడ్చెనఁట.

మాల్య—మాయామయా! తక్కినవృత్తాంత మంతయు నీవే చెప్పుము. కవిముఖముగా వినినంతసంతస మితరులవలన వినినఁ గలుగదు.

మాయా—(నవ్వి)

క. కుడియెడమపక్కలం బడి వెడలెడు కన్నీరు యమునవిధమున మిన్నే
ర్వడుపునఁ బ్రవహింపఁగ నే నడలితి నిజమైనకరుణ మనుకొనుపగిదిన్.

మాల్య—స్వామిభక్తి గలవారికిఁ జేయరానిపనియును మతిమంతుల కసాధ్యమగు కార్యంబును లేవుగదా! తరువాతఁ దరువాత.

మాయా—ఎట్టకేల కంగీకారమును జూపి వట్లభినయించుచుఁ దుష్టుఁడగు రాముని యరణ్యగమనము స్థిరపఱచితి, నతఁడును బోవుటకుఁ బ్రయత్నించెను.

శూర్ప—అతఁ డొక్కఁడే కాఁడు, సీతతో లక్ష్మణునితోఁగూడఁ బోనెంచెను.

మాయా—ఆర్యా! పగవారినైనను మహాత్ములను వంచించునప్పుడు దుర్మార్గులకైనను దుఃఖము రాకమానదనుమీ.

గీ. క్రూరజాతిగదా దైత్యకులము మొదట
నందులోఁ గార్యపరుఁడనై యరిగితిఁగద
రాముఁడట తండ్రియానతి దాఁటకుండ
నడవికేఁగుట చూడ నాకడుపు పగిలె.

దశకంఠమాతామహా! ఇంకొక విచిత్రమైన విశేష మాలకింపుము.

గీ. ఇల్లు వాకిలి విభవంబు లెల్ల విడిచి
తండ్రిపనుపున నుగ్రకాంతారములకుఁ
బోవువాఁడును గనుమాయఁబోక రాము
మొగము పున్నమజాబిల్లిపగిది నుండె.

తరువాత మే మిరువురమును సత్యదశరథుఁడు వచ్చెనేమో యని సందియ పడుచు మామా యారూపంబులు విడిచి యేమి కాఁబోవునో చూత మని యాపౌరులలో నొకరులమై యచటనే యుంటిమి. పిదప నెవరో మాయాకైకేయీదశరథరూపంబులతో రామభద్రుని వంచించిరని పెద్దకోలాహలంబు పురము నాల్గుప్రక్కుల నిండె.

మాల్య—తరువాతఁ దరువాత.

మాయా—తరువాత వామదేవప్రభృతు లందఱు రామభద్రుఁ డడవికిఁ బోవుదాని కడ్డమై జరిగినవృత్తాంతముఁ జెప్పి కాళ్లను గడుపును బట్టుకొని బతిమాలి నను నతఁ డిట్లుత్తరముఁ జెప్పెను.

చ. జనకుఁ డటంచు నే వచననిశాసన సూచనలఁ దాల్చినాఁడఁ బ
ట్టనమున కింక రాజు భరతప్రభువే పదునాలుగేఁడులుం;
జనకుఁడు గాక వాఁ డొక నిశాచరుఁడే యగుఁగాక యమ్మయుఁ గై
కను నగుఁగాక నే మరల; నమ్ముఁడు మీకు జోహారు చేసెదన్.

అని చెప్పి యడవికి జానకీసౌమిత్రులతోఁ గూడఁ బోయెను. మేమును దేవర పాదమూలమునకు వచ్చితి మింకఁ జేయందగిన పనుల భార మంతయు మీతలనే యున్నది. (మాయామయుఁడును శూర్పణఖయు నిష్క్రమింతురు)

( ఇది విష్కంభము. )

(తరువాత మాతలిసారథికం బగురథంబుతో దశరథుండును కైకేయియుఁ బ్రవేశింతురు)

దశ—ఆర్యా, మాతలీ! ఇంకను రఘురాజధాని యెంతదూరమున నున్నది.

మాత—మహారాజ, అదిగో సరయూనది! దానిచేఁ జుట్టికొఁబడిన ప్రాకారము కలదే సాకేతపురము (అని రథమువేగముగాఁ దోలును)

కైకే—ఓసరయూనదీ! భగవతీ! తల్లీ! నమస్కారము; మేము ప్రవాస మేగివచ్చినప్పుడు ముందుగా మానేత్రములకుఁ బ్రథమామృతకబల మగుసాకేతపురము నేఁడేలొకో కాలకూటకబళముగాఁ గానుపించుచున్నది. అయోధ్యఁ జూచుటయం దిన్నాళ్ళవలెఁ గాక నాడెందము వ్యాకుల మగుచున్నది, నాకొడుకులను గోడండ్రను సుఖముగాఁ జూచెదనా, చెప్పుము.

దశ—ఓప్రియురాలా!

సీ. శ్రాంతచిత్రములయ్యె చత్వరభాగమ్ము లేలొకో వందులు మేలుకొనరు
వినరాదు మార్దంగికనినాద మదియేమి సంగీతగోష్ఠులు సాగవేల

చదువ లేలొకో బ్రహ్మచారు లాగమములు ఘనపదక్రమజటాఘనలతోడ
క్రీడాసమస్య పూర్తి—యొనర్ప కూరకే సుకవీంద్రు లేలొకో ప్రసక్తపడిరి

గీ. అధికవిద్యద్వివాదము లడఁగె నేల
యఖిలశుభములఁ గలకలలాడుచుండు
నవ్యరీతుల సాకేతనగరలక్ష్మి
మూఁగనో యేలొకో నేఁడు పూనియుండె.

( అని రథావతరణ మభినయించును )

మాత — మహారాజ! తొందరపడక విచారింపుము. నేను దేవేంద్రునిపాలికిం బోయెద
( అని నిష్క్రమించును. )

దశ — ( నిగి లోనికిం బోయి ) ఎవఁడురా! అచట.
( తెరలో ) అయ్యా నేను కాంపిల్యుఁడను సౌవిదల్లుఁడను.

దశ — సుమంత్రుని వామదేవుని త్వరఁగాఁ బిలువుము ( సౌవిదల్లుఁడు పోయి వామ
దేవునితోఁ బ్రవేశించును )

వామ — దశరథమహారాజ ! నేను వామదేవుఁడను; సుమంత్రుండును వచ్చు
చున్నాఁడు.

దశ — ( వినక శాంతచిత్తములయ్యె అనుపద్యమును మరలఁ జదువును )

వామ మ. జననీ! మాకునిఁ జేయుమా నను నమస్కారంబు సద్వాణి !

( దంపతులనిరువురను ద్దేశించి )

చె, ప్పినచో విల్లవు మీకుఁ బ్రాణములు దేవీ దేవరా పోవుఁడీ

( దంపతు లిరువురు వ్యాకులపడుచు వడుకుదురు )

వనవాసంబున కేగె రాఘవుఁడు సవ్యాజంబుగా నేఁడు మీ
తనువుల్ దాల్చిన మాయకాంత్రదనుప సీతాలక్ష్మణోపేతుఁడై.

( హా రామ హా లక్ష్మణ హా సీత యని దంపతు లిరువురును మూర్ఛవోదురు )

వామ — దేవా ! ఊరడిలుము. తల్లీ ఊరడిలుము !

దశ — ( మూర్ఛనుండి లేచి ) వామదేవా ! కారణమేమి ?

వామ — కైకయకులమునకుఁ బెద్దదుర్యశముఁ దెచ్చుకారణము.

కైక — మాపిల్లఁడు భరతుఁ డొనరించిన దుశ్చేష్టలు కావుగదా ( ఆలోచించి )
అదియెట్లు? దశరథమహారాజుగారు మానాయనకుఁ దండ్రిగారుగదా !

వామ — తల్లీ! శాంతియుగుఁగాత. ఛందుకీ దొండకాయనా,

దశ— త్వరగాఁ జెప్పుము, నా హృదయము మిగులఁ దొందరపడుచున్నది.

వామ— గీ. రెండువరములు మిమ్ముఁ గోరెనఁట కైక
యొసఁగితిరఁట మీరు నా వరయుగ్మకంబు.

దశ— ఆఁ! ఔను. కోరినదియు నిజమే యిచ్చినదియు నిజమే.

వామ— భరతునకు రాజ్య మం దొక్కవరముచేత
రాము వనవాస మొక్కవరంబుచేత.

కైక— అయ్యో! ఎంతనిర్భాగ్యురాలనైతిని

దశ— అక్కటా యెంతకష్టము సంప్రాప్తించినది

చ. ముదుసలిగాన లేఁజిగురుబోఁడికి వశ్యుఁ డటంచు నన్ను, ని
ట్టి దురిత మెట్లు చేసెనొకొ డెందము తాఁకఁగ వంచఁ గైక, ని
య్యది తనకిష్టమే యనుచు నా కొమారుని గూడ లోకు లె
న్న దినకరాన్వయమ్మునకు నల్పులిఖించిన శిల్పియెవ్వఁడో!

(వామదేవునివంకకుఁదిరిగి) వామదేవా, ఆకైకేయీ దశరథులిప్పు డెక్కడ నున్నారో

వామ— రామభద్రుని నడవికిఁ బంపించినవెంటనే లేచిపోయిరి.

కైక— యథార్థముఁ దెలిసికొనినపిదప మరలించి రామభద్రు నేలతోడ్కొని రాలేదు?

వామ— వృత్తాంతమంతయుఁ జెప్పి యెంతబతిమాలినను నీమాటలే చెప్పి రాక పోయెను (అని జనకుఁడటంచు అను పద్యమును మరలఁ జదువును)

దశ— నాయనా! రామభద్రా! యెంత తెలివితక్కువ వాఁడవోయి? నీవును బెద్దలమాట లతిక్రమించుచున్నావఁటోయీ!

కైక— అయ్యో నిర్భాగ్యురాలా, కైకేయీ! ఏచవితినాఁటి చందురునిఁ జూచితివే. (అని నేలంబడి) ఓతల్లి! వదినా, రామభద్రునియత్తా! సీతాజననీ! వసుంధరా! నీవియ్యపురాలిని నీలోనికిం గొంపొమ్ము. కోడండ్రయాక్షేపణలకింక నేఁబ్రాణములు నిల్పఁజాల. తండ్రీ! భరతా! ఇట్టి నిరాపనిందను బొంది మరల నీకెట్లు మొగముఁ జూపింతును. నీమొగ మెట్లుచూతును. దుఃఖము లనుభవించుటకే పుట్టితివా కొడుకా! ఓతల్లి కేకయరాజధర్మపత్నీ! నావలన నీవును బరిహాసపాత్రురాల వైతివి. ఓకౌసల్యాదేవీ! నీయొడలంతయును శూలములచే గ్రుచ్చితిని. ఓసుమిత్రా!

నిన్ను జీవచ్ఛవమును జేసితిని (అని యేడ్చుచుండఁగాఁ గౌసల్యాసుమిత్రలు ప్రవేశింతురు)

కౌస—సఖి! సుమిత్రా! మన రామభద్రుఁడు సూర్యవంశమందుఁ బుట్టినవాఁడేకద! కావుననే జనకుని కుశాసనమైనను జవదాఁటలేకపోయె. పిల్లవాఁడైనను వానికిఁ గలబుద్ధి యే పెద్దవారికిని లేదు.

సుమి—లేనిధైర్యముఁ దెచ్చుకొని నవ్వఁజోవుచున్న యోకౌసల్యాదేవీ! వేయుమాటలేల, రాకరాక మొదటనే పెద్దదుఃఖమువచ్చి వివశుఁడైయున్న భర్తనైనను గాపాడుకొందము రా.

దశ—ఓహృదయమా! యింద్రియములతోఁగూడ విలయమందుము. కౌసల్యా సుమిత్రలు వచ్చుచున్నారు. వారి మొగము లెట్లు చూడఁగలవు.

కైక—హృదయమునఁ బెద్దశల్యము నాటిన యోకౌసల్యాదేవీ! రాము ననుసరించిన పుత్రునిచేఁ బవిత్రురాలవగు సుమిత్రా! రాఘవు నడవికంపించి భరతునకుఁ బెద్ద దుర్యశముఁ దెచ్చిపెట్టిన పాపాత్మురా లిదిగో నిచ్చట నేయున్నది.

దశ—వామదేవా! ఆమాట విని వత్స లక్ష్మణుఁ డేమనెనో?

వామ—దేవరయానతి గాన విన్నవించుకొనుచున్నాను. లక్ష్మణుని పలుకులు తలచుకొనిన హృదయ మెండుపిడక కాలిపోయినట్లు కాలిపోవును.

చ. తగనిప్రియంబుగన్నఁబుచు తాతయుఁ బూజ్యుఁడుకాఁడు, కైక యి
ప్పగిదిని దుశ్చరిత్రి మగపర్చిన సీయని రోయువాఁడఁ, దా
నుగ భరతుండు నిర్మలమనఃక్షితిపాలకులంబునం గళం
క గదియఁజేసెనేని నిదిగో విలు సజ్యముఁజేసి యుంచితిన్.

సుమి—ఇది మాయామయశూర్పణఖలు పన్నినపన్నుదలయని వత్సలక్ష్మణుఁడెఱుఁగఁడా యేమి.

దశ—ఆలక్ష్మణునిమాటలు విని రామభద్రుఁ డేమనెను?

వామ—ఇదిగోఁ జెప్పుచున్నాను.

ఉ. వనమునఁ దండ్రియానతి నివాసముసేయుట కష్టమేమి! శాం
తనిధులు గొప్పగొప్ప జడదారులసేవ లభించుఁ, గొండలన్
వననిధిఁగట్టు శక్తిగలవాఁడ నొకండనె యందుఁ దండ్రి దీ
వనయును నానయున్ మిగుల బాసటగాఁగ నశక్యమున్నదే.

కైక—ప్రకృతిసుకుమారిక యగు నారఘుకులవధూరత్న మేమనియెనో?

సుమ — 'తల్లీ! జానకి! పుట్టింటనుండె, నత్తింటనుండె నీయభిమతమగుచోట రామభద్రుండు మరలి వచ్చునంతవఱకు నుండుము. వింధ్యాచలకాననభూములు నీవంటి యోగ్యైశ్వర్యసంతురాండ్రు సంచరింపఁ దగినవి కావు' అని చెప్పినను నామె చెప్పిన యుత్తర మీపత్రమునందు వ్రాసియున్నది. విస్తరించిన శోకంబుచే డగ్గుత్తికపడి నేను జెప్పలేకుంటిని (పత్రిక దశరథుని చేతి కిచ్చి తాను బోరున నేడ్చును)

దశ — (చదువుచున్నాఁడు)

చ. జనకుఁడు సర్వరాజనతచారుపదుండగుఁ గాక, మామగా
రను దెఱఁగంటి వేల్పు సభ రూఢివహింతురుగాక, రామచం
ద్రుని చరణారవిందములు నోముచుఁ గానలలోఁ జరించు నా
మనమున నున్న సంతసము మామలుఁ దండ్రులుఁ జేయ నేర్తురే.

కౌస — (అతి ప్రయత్నమున దుఃఖమాఁపుకొని)

గీ. తమ్ముఁగుఱ్ఱండు తోడురాఁ దరుణితోడ
జనకుసానతి నడవికిఁ జనిన పుత్రు
కథకు మోదమందవలసినకాల మున్న
జలము జార్చెను పాపిలోచనము లకట.

(ఆలోచించి దైన్యసంతోషములతో)

ఉ. పావనమయ్యె రాఘవులవంశము రాముని చేత నిట్టు ము
న్నెవ్వరును సిరిన్ విడిచియేగిరె తండ్రులయానఁ గానకుం;
గేవలుఁ డిట్టివాఁడు కులకీర్తులువర్ధిలఁ జాలఁడే! ప్రసూ
యౌవనభంగకారులగు నాత్మజు లేలొకొ వేవు రేనియున్.

దశ — మా రామభద్రుఁడు రాజచిహ్నములు విడిచి తాపసవేషముఁ గూడ ధరించెనా యేమి.

సుమ — పితృభక్తిపారీణుండగు మనరామచంద్రుఁడు—

చ. జడలుగఁ జేసె నిచ్చటఁ గచంబులు, పూలు విదిర్చె నిచ్చటన్

దశ — ఓ పాడుహృదయమా! ఇంకను సిగ్గులేక వినుచున్నావు

సుమ — తడయక పైడివల్వ విడి తాల్చెను వల్కలయుగ్మ మిచ్చటన్

కైక — పద్మరాగమణికిఁ గాంచనబంధము వదలి కాచబంధము ఘటించినది.

సుమ — అనుజుఁడు లక్ష్మణుం డతనిపోలికె వేషముఁ బూనె నిచ్చటన్.

దశ—వత్సలక్ష్మణా! నీకథనామదికి విషాదప్రసాదంబులు గలుగఁజేయుచున్నదోయి!

వామ— పడసెను భర్తతో నడవిపాలుఁగ వేసము సీత యిచ్చటన్.

దశ—తాపసాకారములు వహించినపిదప వామవ్వారు నేమి చేసిరి?

వామ— గీ. తల్లులకు మ్రొక్కి రిర్వురు దాశరథులు,
నెఱఁగె సీతయుఁ దనయత్తలిర్వురకును

కైక— వరుసఁ దాపసులైన దంపతుల నతులు
పడయ నేరని నేను నిర్భాగ్యురాల.

వామ—వీనికేమి గాని యీ కార్యమెంతకుఁ దలఁచుకొనిన సంతోషదుఃఖములు వెల్లువలగుచున్నవి.

గీ. దయితు వెన్నంటియేఁగు సీతమ్మ నట్టె
యరయుచును దాను దనవిభు ననుగమింపఁ
జూచునూర్మిళ భోమముడింజూచి నిలిపె
లజ్జఁదలవాంచి గురులొద్ద లక్ష్మణుండు.

దశ—వేయేల, యోగ్యతయందు మనలక్ష్మణుఁడును రామభద్రునకు శిష్యుఁడే! తరువాతఁ దరువాత.

వామ—క. కమ్మలు వలయమ్ములు హారమ్ములు మేఖలయు నూపురమ్ములువిడి యూ
ర్ధమ్మున గురుజనకారుణ్యమ్మని యొకమణియె జానకమ్మ ధరించెన్.

తరువాత.

సీ. స్మరణీయవైతింక చక్రవాకవధూటి! సారసాంగన! నమస్కారమమ్మ
ఇదియె నీకును నాకుఁ దుదిచూపు చిలికంఠ? నీచిన్నె మఱపురాదే చకోరి!
శారికా! మాటలు చాలింపు మిఁకనైన రండు నాతోఁ బావురమ్ములార!
దయయుంచు నామీఁద దాత్యూహి! నీకు నాయాశ లేదింక లీలాశుకంబ!

గీ. యనుచుఁ బ్రత్యేక మరిగి పెంచినసమస్త
పక్షులను జేతనిమురుచుఁ బైనమునకు
సెలవు గోరిన సీతపల్కులు సమస్త
పౌరజనములగుండియ ల్పగులఁజేసె.

కైక—మాజానకికిఁ గేలీశకుంతములన్న నెంతో యాదరము.

వామ— దానికేమి, యీమాట వినుఁడు.

ఉ. అడుగుల వంటి వచ్చుఁబ్రియహంసకుఁ జూపెను బంజరంబు; వెం
బడిఁ జను దెంచు లేడి బతిమాలి మరల్చెను, జిల్కమాటకుం

బెడచెవియొగ్గి నన్నుఁ బృథివీసుతచర్యలు విన్నఁ గన్న నె
వ్వాఁడు జయపెట్టఁ డెవ్వాఁడు కృపాపరుఁడై కుయిపెట్టఁ డిప్పురిన్.

వశి—తరువాతఁ దరువాత ?

వామ— దేవా! యీమాటలకేమి; యీమాటలు చెప్పినఁ బుండుమీఁదఁ గారముఁ జల్లినట్లుండునని యేఁ జెప్ప సంశయించుచుంటిని.

శా. క్రీడోద్యానమ ! నీకుమంగళము, నిస్తీర్ణాంతు నోడోలికా !
క్రీడాగారమ ! నీకు భద్రి, మనుర క్రీంజాపు మేనాఁటికిం
గ్రీడావాపిక ! నీవు; మిమ్ముల సిఁకేరిం జూచునో చూడనో
క్రీడావస్తువులార ! మర్వెకుఁడు పేర్కిం జూచి మీజానకిన్.

శ—హా ! రఘుకులభద్ర రామభద్ర ! అట్టి దిలీపవంశమున కేల యీవిపరీత చరిత్రము !

ఆ. వసుధ యేలుచుండె వహ్వారే ! దశరథక్ష్మాధవుండు మూఁడు గాళ్ళముసలి
క్షీతకంఠుఁడైన శ్రీరామచంద్రుండు కానకేగుచుండెఁ గాంతతోడ.

వామ— సఖా ! భూదేవేంద్ర ! మీమాట లటుండ మనపౌరులకు రామచంద్ర ప్రవాసదుఃఖ మెట్లు చల్లార్పఁగలము !

ఉ. అక్కడఁ బౌరకాంతల సమాజము బొమ్మలు బాఁదుకో వడిన్
ముక్కలుగాఁగ హారముల ముత్తెము లూడుచు బాష్పపఙ్క్తితో
నొక్కటిగాఁగ, నెద్దు మెడలొప్పఁగ నెక్కలఁ దూర్చి వీథిన
ల్పక్కల నున్న పంజరపుఁ బక్షులు నెక్కువవంత నేడ్వఁగన్.

దశ—(నిట్టూర్పు నిగిడించి)

ఆ. అడవికేగురాము ననుసరింపఁగఁబోండు ముసలిదశరథేశు వసువులార !
(సంతాపమభినయించుచు) ఓరామజననీ ! కౌసల్యా !
ఔను చంద్రికాంత మరుణోపలము రామచందనంబు నాకు జ్వాలనమయ్యె.
(వామదేవునివంకఁ జూచి) సఖా ! తరువాతఁ దరువాత ?

వామ—నేనుగూడ వెంటవత్తునని పట్టుపట్టిన భరతునకు నిజపాదుకాయుగళ మిచ్చి నందిగ్రామమున నీవు పూజించు చుండుమని యానతిచ్చె. భవత్పాలిత రాజ్యరక్షణంబునకై చిన్నతమ్ముని సహాయునిగా నుండుమని యాజ్ఞాపించి. సుమంత్రుని వెంటఁదీసికొని సీతాలక్ష్మణులతో నీకొడు కడవికిఁ బోయెను

(పిదప సుమంత్రుఁడు ప్రవేశించుచున్నాఁడు)

సుమం — ఆర్యావర్తదేశ మతిక్రమించి దక్షిణదిశకుం బోవు రామభద్రునిచేఁ బ్రతిపదంబునను మరలింపఁబడుచున్నవాఁడ నయ్యుఁ జాలదూరము తీర్థయాత్ర గావించి మరల నయోధ్యాపురముం బ్రవేశించితిని. దశరథమహారాజుగారు స్వర్గమునుండి మరలి వచ్చిరో లేదో (యాలోచించి రాజప్రవేశమును గుర్తించి) ఆఁ! దేవేంద్రసఖుఁడు వచ్చియే యున్నాఁడు (సమీపించి) మహారాజా! జయము జయము. దుస్తరకాంతారసంచారి యగు రామభద్రుఁడు సుమంత్రుని ద్వారమున నమస్కరించుచున్నాఁడు.

దశ — (నోటమాటరాక మూర్ఛపడి) నాపిల్లవానికి వనవాసవ్రతము సంపూర్ణమగుఁ గాక,

రాజభార్యలు — సీతాలక్ష్మణసమేతుఁడగు మా రామభద్రునకుఁ గుశలమా?

సుమం — ఎవరిచరిత్రము జనుల కాశీర్వచనము లగునో వారికుశల మడుగవలెనా.

దశ — సఖా! సుమంత్రా! వత్సల వనవాసచరిత్రము రవంత తెల్పుము.

సుమం — దేవా! అయోధ్య వదలినది మొదలుకొని చెప్పుదునా? ఆకర్ణింపుము.

చ. నడ కలవాటుగా నడచునాతిగతిం బురిదాపునంద నా
ల్గడుగులు వోయి యింక మన మావలఁ బోఁదగుదూర మెంతయం
చడిగిన యాశిరీషమృదులాకృతి భూమికుమారి మోందు రా
ముఁడు తనకంట నీరు వలపోయుటకుం గతమయ్యె భూవరా!

రాజభార్యలు — తల్లీ! జానకీ! మణికుట్టిమంబు లగు లీలాభవనాంగణంబు లందును నడచుట కలసట పడుదానవు, పామరస్త్రీలు నడువఁదగిన వనభూముల పాలై పోయితివా?

దశ — వారి ననవలసినపనియేమి! దైవము నిర్దయుఁడు. తరువాత?

సుమం — పురసమీప ప్రదేశమతిక్రమించి పోయినపిదప.

ఆ. దర్భమయములైనదారుల నున్నంచుఁ బుడమికాన్పు కష్టపడుచు నడువ
నొప్పకోవని యన్న నొప్పించి యారాత్రి లక్ష్మణుఁడు కుశస్థలమున నిలిపె.

కైక — ఎటులైనను లక్ష్మణుఁ డవసర మెఱిఁగినవాఁడు.

సుమం — మఱునాఁ డుదయమున నాకుశస్థలమునుండి నడువ నారంభింపఁగా,

ఆ. కుశపథంబు చూచికొని మెల్లనడువుము, పైనఁ గప్పికొనుము పైటకొంగు
యెండ ప్రబలునంచు నేర్పుచు నేర్పిరి పథికసతులు సతికి బాటనడక.

ఇట్లు కొన్నిదినంబులు నడిచి క్రమముగా గంగాతీరమునకుఁ జేరితిమని నిశ్చయించుకొనుచుండ మార్గాయాసపరిశ్రాంతయగుసీత యచ్చటనున్న చేలకాపరులగు కన్యకలంజూచి స్త్రీస్వభావసులభంబగు చాపల్యంబునఁ బ్రోవయడిగిన వారిట్లనిరి.

ఉ. అల్లదె పంటచేలు చిలుక లక్వరివెన్నులపైవ వ్రాలుఁ, బై
నల్లసితాబ్జ మెక్కుచెఱు వున్నది వాఁగెటి నిల్వచాలలం
దల్లెదఁ దుంగతావు లొలయించు పొలంబులు కొన్నిదాఁటఁగాఁ
దల్లి సమస్తభక్తజనతాపనివారిణి గంగ గన్పడున్.

రాజభార్యలు — మాపురాణశ్వశురుం డగు భగీరథుని కీర్తిపతాక యగు గంగ వృత్తాంతము ముసలిజడదారులు చెప్పఁగా వినుటయే గాని మేమెన్నడును జూడలేదు. ఇప్పుడు మారఘుకుటుంబ మాగంగాతీరమున నున్నదా ? తరువాతఁ దరువాత ?

సుమం — తరువాతఁ బ్రొద్దు గ్రుంకువేళకు గంగయొడ్డునకుం జేరి దాఁటుటకై నావ యెక్కిరి.

కైక — భగవతి! తల్లీభాగీరథీ! భగీరథుని పేరు తలఁచుకొనియైనఁ బుట్టింటివైపు వారిని సుఖముగా నవ్వలియొడ్డుఁ జేర్పుము.

దశ — (తొందరతో) సుమంత్రా! నావకుఁ గర్ణధారుఁ డున్నాఁడా లేఁడా ?

సుమం — దానికేమిలోపము! మనలక్ష్మణునకు మిత్రుఁడును నిషాదాధిపతియు నగు గుహుఁడే కర్ణధారుఁడు.

కౌస — తరువాతఁ దరువాత?

సుమం — ఉ. అంబుధురంబు స్వర్గవసుధాతలలోకము లాక్రమింపఁగా
నంబుజవైరియున్న మదనారిశిరంబున నాటలాడు లో
కాంబ నఘాపహాంఘ్రి నమలాత్మ నమర్త్యధునిం దరించి శా
ఖాంబువు గ్రిమ్మఁ దాపసుల యాశ్రమభూములు చేరి రందఱున్.

రాజభార్యలు — అమ్మయ్య! ఇప్పటికి మంచిచోటికిఁ జేరిరి. తరువాత ?

సుమం — పిదపఁ బ్రియాగకుఁ బడమటివైపుననుండి పోవుచు నొకరాత్రి గడపి వేగి యమునానదిని దాఁటి చిత్రకూట పర్వతమునకుఁ జేరితిమి.

దశ — దేవీ! కౌసల్యా! చిత్రకూటారణ్యము సుకుమారులాండ్రగు మనసీతవంటి వారు నడువఁదగినది కాదు సుమీ!

సుమం— గీ. పచ్చియులకంబు చేసినపర్ణశాల, యందు సౌమిత్రినీతఫలాదికంబు
లారగించుచుఁ గొన్నినాళ్లటవసించి, రితరగోష్ఠులఁ జాట్టాలనెల్లమఱచి

మఱియును నచ్చట—

ఉ. నారలు కట్టుచీర, లశనంబులు దుంపలు మంచిపండ్లు వ
స్త్యారము, లిట్టిత్రోళ్లు శయనంబులు, కొండగుహల్ నరేశ్వరా
గారము, లద్రిభూములును గానభూములు నాటచోట్లు మీ
వీరవరాగ్రిపూర్తి కటవీగృహవర్తికి రామమూర్తికిన్.

కౌస— ఆర్యా! ఎంతపుణ్యమో! మా సీత వనములయందును గృహిణియై కాఁపు
రము చేయుచున్నది!

సుమం— ఇదిగో, నింకొకమాట చెప్పుచున్నాను.

ఉ. మంచిఫలంబు లేఱి యజమానికి ముందుగ విందొసంగి శే
షించినపండ్లు లక్ష్మణునిచేత భుజింపు మటంచుఁ జెట్టిగా
లించుచుఁ బచ్చిపండ్లు రుచిలేనిఫలంబులు కొన్నితాను భ
క్షించును నారిలేఱిన సుశీలయన న్వనిసుందరి సీతయున్.

కౌస— మహారాజు కడుపునఁబుట్టి యీదరిద్రసంసారకృత్యము లెన్నడు నేర్చుకొం
టివమ్మా కోడలా!

దశ— దేవీ! ఒకరు నేర్పనేల? అన్నియు దైవమే నేర్పును.

సుమం— ఈమాట యాలకింపుఁడు. హృదయము కరిషముపలెఁ గాలిపోవును. మార్గా
యాసకరములగు ప్రయాణములయందు

ఉ. వేఁటకుఁబోయి బిట్టలసి వేచను దెంచిన నాథుఁజూచుచుం
బైఁట చెఱంగు జాఱఁగ గుబాలున లేచి బుజంబుమీఁది వి
ల్లీ మెలఁ నందిపుచ్చుకొని యేఁకటఁ గొమ్మలకుం దగిల్చి తా
బోఁటియొనర్చు సేవ తలపోసిన నబ్రమొనర్చు నేరికిన్.

దశ— తరువాత?

సుమం— జానకి నపహరింపఁ దలఁచిన విరాధప్రముఖులఁ జంపియు, సీతశరీరము
ను ముక్కుచెవులఁ జిటినశాకి నేకాక్షిం జేసియు నాయాశ్రమభూములు
నిష్కంటకములుగాఁ జేసి దక్షిణదండకారణ్యంబునంబడి పోయిరి.

దశ— సుమంత్రా! క్రొత్తకోడలు సీతయొక్కయుఁ గుఱ్ఱవాఁడు లక్ష్మణుని
యొక్కయుఁ బ్రథమపథికత్వము నామదిని విచిత్రముగాఁ జేయుచున్నది.

సుమం— వివశునిగాఁ జేయక యానందపఱచునా యేమి?

గీ. అలసి కూర్చుండుతఱి నాథుఁ డవనిజాత
యలసియును దాను విసరుఁ బైఁటాంచలమున
వత్సలత్వమ్మునఁ డంఘ్రిసంవాహనంబు
వరుసఁ గావించు నలసటపడక తాను.

రాజపత్నులు— దేవా! ఆగర్భశ్రీమంతులగు నీసీతాలక్ష్మణుల కీపథికజనయోగ్య మగు గురుజనశుశ్రూష యెట్లలవడినదో!

సుమం— మహాభాగులకు మంచిపనులు నేర్చుకొన నక్కఱలేదు.

దశ— మారామభద్రునకు జానకికంటె లక్ష్మణునియందే యెక్కుడు దయ.

సుమం— దేవర సెలవిచ్చినమాట నిజమే.

గీ. ఘోరకాంతారములలోని దారులందుఁ
బుడమికానుపుతోఁగూడ నడచునప్పుడు
బాష్పసంరోధ మత్నసంపాతియైన
రాఘవునిదృష్టి భ్రాంతమై ప్రాలుచుండు.

కాని, నాకీవ్యాపారము దలఁచిన రామునిమీఁద మిక్కిలి కోపమువచ్చును.

చ. నగములపొంత దారిఁజనునాఁడు కుమారుఁడు ముందుఁ గొన్నిలేఁ
జిగురులు రాల్చుచు న్నడువ సీతయుఁ బాదములందు నల్లచి
మ్మఁగ ననురున్మరంచుఁ దనమాటునరాఁ బెగఁద్రిప్పురాముఁ డ్రో
క్కఁగడియు నిల్వనీక మొనగాఁడగుచుం బవలంతయు న్వనిన్.

తరువాత నిట్లు నడచుచుఁ బోయిపోయి.

గీ. అజగరశ్వాసభీతమృగాంగణంబు హరినఖధ్వస్తదంతావళారవంబు
నళనకందార్ధశబరఖాతాచలంబు వింధ్యగిరిఁజేరె రాఘవోర్వీధవుండు.

కౌస— కపింజలపక్షులనైన వాడించుటకు భయపడు మాకోడలు భయంకరములగు కోఁతికూఁతలును, గిరాతులచేఁ జంపఁబడిన మృగముల నెత్తురనుభ్రాంతిచే నాలుకలుచాఁచి కేసరికిశోరములచే నాకఁబడు పద్మరాగమణులును గల వింధ్యారణ్యమున నడచుచున్నదా! హా! హతదైవమా! చాలుఁ జాలు లేయనఁటిబోదెకు గజతుండాఘాతమటరా! రాఘవకుటుంబమును వనములోఁ గాపాడుము.

దశ— గర్వకైన మారనివాఁడను నేనేమిచేయఁగలను? మాలతీపుష్పమాల దర్భచే గ్రుచ్చఁబడుచున్నది.

సుమం— మహారాజ! వనములలో నిట్లు కష్టములపాలగుచున్న జానకియు

ఉ. కొండలుచూచి భీతిపడి కొంతవడిం గనుదోయి మూయు, నో
రెండి ధరింపలే కలస యెచ్చటినీళ్ళను ద్రావఁబోవుఁ గూ
ర్చుండఁగ జెట్టుచెట్టుకడ కొయ్యనఁ జేరుచు నిల్చుఁ గాఁపురం
బుండఁదలంచు రమ్యముగ మున్నవనంబుల నెల్లచోటులన్.

దేవా! కష్టతరమగు నింకొకమాట విన్నవించుచున్నాను.

ఉ. నీళులు లేనిచోట ధరణీసుత దప్పిక మూర్ఛవోవ శో
కాలసచిత్తుఁడైన తనయన్నను వద్దని చెప్పి మాలుదా
నీలతయాకులందిగిచి నేర్పున దొన్నెలుగుట్టి తమ్ముఁడే
వేళను నీటిచోట్లు కనిపెట్టి జలంబులు దెచ్చునచ్చుఁగన్.

(అందఱును నిట్టూర్పు విగిడించుచున్నారు.)

కౌస— నాయనా! లక్ష్మణా! ఇచ్చటికిరమ్మా, నీపాదపద్మములు శిరసావహింతును.

కైక— సఖి కౌసల్యా! రాముఁడెక్కడ! సుమంత్రుఁ డెక్కడనో జరిగిన కథను జెప్పుచున్నాఁడు.

దశ— నా కివేమియుఁ దెలియవు, విషాదసముద్రములో మునిఁగిపోవుచున్నాను.

కౌస— రఘువంశమునఁబుట్టి మీవలె నెవ్వరు వింధ్యారణ్యనివాసదుఃఖ మనుభవించిరిరా కొడుకా!

సుమి— అయ్యో! వెఱ్ఱిదానవు, వారందఱు రామభద్రులఁటమ్మా!

కైక— కైకమాత్రము ప్రతినగరములో నున్నది. అందఱి నోళ్ళలోఁబడినది.

కౌస— తరువాతఁ దరువాత?

సుమం— తరువాత.

మ. అరుణద్యోతము పక్వతాళదలతుల్యంబైన కాలంబునం
గిరినేరేటిపాదం దళీపుటమున న్నీరంబు నిండించి ము
వ్వరున న్నేఁ జిగురాకులం బఱచి యాపాదించె సౌమిత్రి యా
దరముప్పారఁగఁ బూలపాన్పొకటి సీతారాఘవార్థంబుగన్.

దశ— (విశేషకరుణముతో) తరువాతఁ దరువాత?

సుమం— ఇట్లు కొంతకాలమేగిన పిదప.

గీ. కడలి దేవేరి పీయూషకరుని బిడ్డ
గిరులకుఁ బతాక శ్రీవింధ్యగిరికిఁ గరము

కరిఘటాలుంఠితాపంబు గానిపించె
నర్మదానది నినకరాన్వయుల కచట.

దశ — ఆర్యావర్త దక్షిణాపథములకుం బొలిమేర యగునది యిదియేనా ?

సుమం — తరువాత నన్నచటినుండి మరలిపొమ్మనిరి. నే పోనని కోపగించినను మిమీఁద నొట్టుపెట్టికొని బలాత్కారముగా మరలించిరి.

క. మాతండ్రికి వందనమని, చేతులు మొగిడించి ముందు చెప్పుమనియెం ద
ర్వాత నొక యేఱుగట్టెఁగ, నీతనుజాతుండు కంట నీరము పెట్టెన్.

కౌస — అన్న, రాముని వదలి వచ్చితివా యేమి ?

సుమం — తల్లీ, మనలనందఱను రాముఁడే వదలెను.

కౌస — తరువాతఁ దరువాత ?

సుమం — ఉ. తీరతలంబునం దిసుముతిన్నెల నేరెటి చెట్లతోఁ బులం
దీరములందుఁ బట్టపవలెల్లను బిచ్చుకగూళ్ల యాటచే
జాటిచి పిచ్చిలోపల విసంస్థుల దుష్పథనర్మదావగో
త్తారణ మాచరించె వసుధాసుత చూపఱులెల్ల నేడ్వఁగన్

సుమి — ఆర్యా ! నీకెట్లు దెలిసెను ?

సుమం — నేను వారల నవలోకించుచు నీవలయొడ్డుననే యుండి యారాత్రి గడపితిని. వారును నదిదాఁటి యవ్వలియొడ్డున నారాత్రిగడపి మఱునాఁడుదయమున —

చ. కడవలఁ బోసినట్లు కడగన్నుల నీరము జార్చునన్ను నా
యొడయఁడును జూచుచుం జనిరి యింపగుమాటలు చెప్పుకొంచుఁ గా
ల్నడ నలదక్షిణాటవికి నర్మదయావలి యొడ్డునుండి నే
నడలుచుఁ జూపు చూచువఱ కాదెసవంకకుఁ గాంచివచ్చితిన్.

దశ — నాయనా ! రామభద్ర ! నాకుఁ బ్రియమిత్రమును మలయాచలవాసియుఁ బక్షిరాజునగు జటాయువునుగూడ నన్నేడిపించినట్లె యేడిపింతువు గాఁబోలును.

(తరువాత వాకసమునుండి దిగుచు రత్నశిఖుండు ప్రవేశించుచున్నాఁడు)

రత్న — గీ. చంద్రహాసాసి దెబ్బచేఁ జావుదప్పి
మేలుకొంటిని మింటితెమ్మెరలచేత

దశ — సుమంత్రా ! ఇంతకు మనపిల్లలకు మార్గమంతయు శుభప్రదముగ నున్నది గదా ! సీతకేమియు శకునలోపము రాలేదుగద ?

సుమం—దేవా! మనరామచంద్రుఁడే యందఱికిని శుభకరుఁడు. జడదారిముత్తైదువు లందఱు వచ్చి ముద్దుపెట్టుకొని దయాకౌతుకములతో మఱిసీత కిట్లుపదేశించిరి. "కూఁతురా! విదేహరాజనందనీ! పతివ్రతాశిరోమణి! అరణ్యప్రదేశములు, కొంచెము జాగ్రత్తగా నడువఁదగినవి. కాళ్ళు నొప్పిపెట్టినను రామచంద్రు ననుసరించియే నడువుము గాని విడువకుము.

ఉ. కొండలనుండు నెన్నె, లెలుఁగు లుహలోఁ, బొదరిండ్ల సింగపుం
దండములుండు, బెబ్బులులుదండులు పేఖలనుండుఁ, జెట్లయం
దుండును గొండముచ్చులు మహోద్ధతవాతులభిల్లమండలం
బుండెడిచోట్లు పెక్కులు; వనోర్వి కఠోరముగాఁ యుండునే.

ఓసీరధ్వజసువాసినీ! ఇంతియేకాదు—

ఉ. తందరమాని ముండ్లపొదదారులఁ బయ్యెద వ్రేలనీక ము
న్ముందటి రాతిగొప్పులు కనుంగొనుమా, విటపంబు లడ్డమై
నం దలవంచుమా, యడవినాగులపుట్టలు చూచిపోవుమా
సుందరి! దావవహ్ని గలచోట్లను గుచ్చెల తిద్దఁబోకుమా.

రత్న— గీ. వ్యోమమార్గమ్మునుండి వాయూగతిచేతఁ
దివిరి దిగుమంటి రెక్కలు తెగియు నేఁడు,

(ఆలోచించి) ఇట్టివాఁడనయ్యు—

గీ: నీరెడవడుండు తామ్రపర్ణి జలంబు
లందు రెక్కలు దడిపి గతాహిపాళ
ములుగఁ జందనధాత్రిజముల నొనర్చి
పక్షిరథుఁజేరితి జటాయువనుపుఁజేసి.

కావునఁ బూజ్యుఁడగు దశరథుం జూచెదను. (అని రెమ్మటఁజూచి) ఇతఁడే దశరథమహారాజు! ఎవఁడురా యక్కడ?

గీ. బాల్యమిత్రుండు గృధ్రాధిపతియు నగు జ
టాయునకు సేవకుం డాజటాయు వనుప
వచ్చె రత్నశిఖుండుఁ డన్నట్లు యనుచు
దశరథున కెఱిఁగింపుఁడు త్వరితముగను.

సుమం—ఇటు రమ్మిటు రమ్ము!

రత్న—(ఆకాశావతరణ మభినయించుచు) మహారాజ జయము జయము!

దశ — అస్మన్మిత్ర మగు జటాయువు సుఖముగా నున్నాఁడా ?

రత్న — మిత్రోపకారరూపమున బ్రతికియున్నాఁడుగాని స్వరూపమున లేఁడు.

దశ — నాయనా ! కూర్చుండి సవిస్తరముగాఁ జెప్పుము. నీమాటచేఁ జాల వ్యాకుల పడుచుంటిని.

రత్న — ఒకనాఁటి యుదయమునఁ గాననధిగమనార్థముగ బైలువెడలిన పక్షులన్నియుఁ గన్నీరు కాల్వలుగట్టగా నేడ్చుచు నేలికయగు జటాయువు నొద్దకు వచ్చి యిట్లు విన్నవించినవి — పాత్రితస్సంధ్యావందన మాచరించుకొని జానకీ లక్ష్మణులతో నుటజద్వారంబున రామచంద్రుఁడున్న సమయమున —

ఉ. దేహ మొకింతుదాల్చి చనుదెంచిన యింద్రునిచాపమో చల
ద్రోహణగోత్రమో యని కుతూహలదత్తమనస్క లౌచు సం
దేహము జెంది తాపససతీమణు లండఱు గుంపుగూడి కో
లాహలమాచరింపగఁ జెలంగెను బంగరులేడి ముందరన్.

రామచంద్రుండును 'జానకితో నేత్రములను సంతుష్టిపఱుపుము, దీనిం జూడుము చూడుమని యామృగముం జూపి యిట్లనియె —

ఉ. కోపలు తీర్చి రత్నములు గ్రుచ్చినభంగి శరీరకాంతి న
ల్కేవల నిందచాపరుచిలీలలు విస్తరిలంగఁ జేయుచుం
ద్రోవల వెంటవెంటఁబడి తోలుచుఁ దాపసబాలు రండఱుం
బోవఁగ మింటమంటఁ బడిపోవు కురంగముఁ జూడు మంగనా.

తరువాత దానింజూచి లక్ష్మణుఁడు నిట్లనియె: — తల్లీ ! జానకీ ! చూడఁ దగినదగును, చూడుము —

గీ. మరకతమయంబు పార్శ్వ ద్వయుగ్మంబు, కాళ్ళు
పల్లవంబులు, ముత్యాలబంతి ముట్టె,
కనులు వైడూర్యమయములు కనుము దీని
చర్య మనలను మిగుల నాశ్చర్యపఱచు.

కౌస — తరువాతఁ తరువాత ?

రత్న — విచిత్రరచనగల యామృగముత్తోలునం దభిలాష వొడమియున్న సీతయింగితం బెఱింగి రామచంద్రుండును దత్సంరక్షణార్థము సౌమిత్రినుంచి తాను దాని వెంటఁ బోయె. కొన్ని నిమిషంబుల కనంతర మన్న రాకుండుటఁ గాంచి యాయద్భుతభూతమువలన నేమియపాయము వచ్చెనో యని సౌమిత్రియు వధూనికం దాపసకాంతల కప్పగించి రాము నన్వేషింపఁబోయెను.

కౌస—నాయనా ! లక్ష్మణ ! మాణిక్యకురంగముకొఱకు సీతనొక్కతెను కాంతార
మున వదలి పోకుమా !

సుమ—దేవీ ! యిది జరిగినవృత్తాంతముగాని జరగుచున్నది కాదు.

దశ—తరువాతఁ దరువాత ?

రత్న—క. ఆకర్ణాకృష్టగుణంబౌ కోదండమున బాణ మమరిచి రాముం
డాకాంతారంబున మాయాకృతియగు లేడివెంట నరుగుచునుండన్.

దశ—(ఆకులభావముతో) అప్పుడేమి జరగెను ?

రత్న—క. నురవనితల నెందఱనో చెఱగొని పలుతిట్లువడియు సీతాదేవిం
దరలించెఁ బుష్పకంబున సురవైరి దశాననుండు సురమార్గమునన్.

దశ—పాపమురా పాపమురా !

క. అతిరాక్షసఖండనపండితములు నాయంపగములు నేఁ డాలంకా
పతి పదితలలును వింశతిశతములు గావింపఁగాక శక్తిదలిర్పన్.

(అని లేవఁబోవును)

సుమం—దేవా ! ఇది యతిక్రాంతచరిత్రము గాని బాణప్రయోగకాలమా !

దశ—(కూర్చుండి) అయ్యో యెంతకష్టము ! రఘురాజకుటుంబమున కింకొక కళం
కము గూడఁ దటస్థించినదా యేమి ! (ఆలోచించి) ఆమాయామృగముగూడ
మాయామయుఁడైయె యుండును.

క. ఆమాయలేడికడుపున రాముం బెట్టెదనొ? లేక రామవికలతన్
నామతి నిర్భాగ్యంబై యీ మెయిఁ దలపోయునో యనేకవిపత్తుల్.

సుమి—జానకీ ! అడవిలోనైన సుఖముగా నుండక రాక్షసులచే హరింపఁబడితివా?
మాలదైవ మింతకుమునుపే హాలాహలము మ్రింగియున్న మాకడుపుల మఱిం
తచిచ్చు పెట్టెనా !

కైక—కైకేయీదుర్యశోంకురమునకు రెండవ యాకు గూడ బయలుదేఱినది.

దశ—(తెలతెలవోవుచు) తరువాతఁ దరువాత ?

రత్న—ఈవృత్తాంతమంతయుఁ దనభృత్యులవలన విని జటాయువు గృహకపోతసై
న్యములతో రావణుని కడ్డపడం దలంచి మలయాద్రినుండి బైలుదేఱె.

దశ—బాగు బాగు చెలికాఁడా ! స్నేహము నిలిపితివి. నీకోడలైన నొకటియు నా
కోడలైన నొకటియు నా !

రత్న— గీ. ఏవి మూసిన రవికాంతు లెనయు దిక్కు
లేవి విప్పినఁ జీఁకటు లెసఁగు దెసల
నట్టి ఱెక్కలు పుడమియు నాకసంబుఁ
గప్పఁగ జటాయు వాదశకంఠుఁ దాఁకె.

దశ— సంపాతికి సహోదరుండును నాకుఁ జెలియు ననూరునికొడుకునగు జటాయువు పరాక్రమము నాకుఁ జెప్పవలయునా.

రత్న— ఇట్లు కాఁకి గృధ్రరా జభిమానోర్జితముగ నిట్లనియె :—

ఉ. వచ్చితివోరి! నే మలయవాసిని నన్ను జటాయువండ్రు నీ
మచ్చమడంతు లే దిఁక సమానము కొల్పుము చంద్రహాస మే
దెచ్చట నున్న దీపులుఁగు లెల్లను మాంసము మీఁది యాసచే
నచ్చుగఁ గేఁడు నీతలలయందలిరత్నము లేఁటు రావణా!

దశ—ఓహోహో! సాటిలేనిబలమే చూపించెను?

కౌస—భగవతి జయలక్ష్మి! మాజటాయువునం దభిమానముంచుము,

రత్న—పిదప ననూరుగరుడులవంశమునయందుదయించిన మే మందఱమును దాత జటాయువున కడ్డపడితిమి. యుద్ధమును బ్రారంభమాయెను.

మ. కనులుం గర్ణములు న్లలాటములు వక్షంబుం దల ల్మున్నుగా
దనుజాధీశుని మేను పక్షిపతి వాఁతం జీరుచుండంగ నెం
టనె తన్మాంసము ముక్కముక్కలుగ నోటం గ్రుచ్చి భక్షింపసా
గెను గృధ్రంబులు కాపులుం గలతిభ స్త్రీజా తేని నగ్గింమన్.

పిదప సమస్తపక్షులచేతను వ్యాకులీకృతుండగు రాక్షసరాజు చంద్రహాసము ధరించి పక్కలనెల్ల నుక్కడంపఁ జొచ్చిన జటాయువును విజృంభించి యాహా టింపకుఁడని తలపడె నంతట నాపతత్రిదానవవాహానోన్యన్యసంగరమునందు—

గీ. పఙ్క్తికంఠుని కత్తిచే వాటుపడని
చోటు తిలయంత పక్షిరాజునకు లేదు
పక్షిపతిముక్కుచేఁ బోటుపడనిచోటు
నావగింజంత లేదు దశాననునకు.

కౌస—భగవతీ సంగ్రామలక్ష్మి! మాసీతను బంధియనుండి వదలించుము.

దశ—గయతాఁ దరువాత?

రత్న—తరువాత మా యొడయుండగు జటాయువు—

గీ. చంద్రహాసక్షతికి నైన జడియ కప్పు
డాకసంబున కెగసి యల్లాడు చుండి
దిగ్గజాంకుశములతోడ దీటు వచ్చు
గోరులుపదింటఁ బదితల ల్చీరివైచె.

దశ—బాగు బాగు గరుడాగ్రజా! మేలు మేలు సూర్యసారథీ! రత్నమువంటి కొడుకును జటాయువును గంటివి! తరువాతఁ దరువాత?

కౌస—పక్షిరాజును జెలికానికోడలి నొకఁ డపహరించుచున్నపుడు చేయవలసిన సాహాయ్యమంతయుఁ జేసెను. ఇంక నేమిచేయఁగలఁడు!

రత్న— తరువాత.

గీ. కత్తివేటునఁ దనవాసికాపుటంబు
తెగియఁ గత్తిని మొక్కవోవఁగ నొవర్చ
వదిరె మెడవాళ్ళుమ్రింపఁగ నవనిఁ బడియె
నంతట జటాయు పిమ్మిత్రతాయనగును.

పిమ్మట కంఠగతప్రాణుండగు నీచెలికాఁ డీయపశ్చిమం బగువార్త నంపించె. 'సఖా! దశరథమహారాజ!

గీ. అరుణుతనుజుండు సంపాతికనుజుఁ డన్న
యశము చెడకుండ మైత్రికి ననుగుణముగఁ
బోరి ఖరురాయుధుఁడు దశముఖుని చేత
జీవముం బాసె నీవు లజ్జింపకుండ.

కౌస— దేవా! రాఘవకుటుంబమునకే కాక యడవులలోనున్న మిత్రులకుఁగూడ ద్రోహము చేసితివి.

సుమి— అడవిలోనుండువారికే కాదు. జగమంతటికి నని చెప్పవలయును.

రత్న— దేవా! నాకు సెలవిమ్ము, నిజకుల కులాయమునకుం బోయెద.

దశ— మంచిది పొమ్ము.

రత్న— ( పరిక్రమించి నిష్క్రమించును )

కైక— ఓయుత్తరకోసలవరేశ్వరా! ఇంక రాఘవవంశ మేమికావలసినది?

దశ- (విచారముతో) ఏమి కావలసినదో నాకుఁ దెలియదు. నామనస్సుమాత్రము—

గీ. మేచకోత్పలరుచివిరాజి మిహిరపుత్రి
జలము గంగోదకముల నెచ్చటను గలసె

నట్టిపుణ్య తీర్థంబునఁ గ్రాణిఁబాసి
యుండఁగాఁగోరు వాసవార్థాసనంబు.
(అందఱు నిష్క్రమింతురు)

గద్య.

ఇది... శ్రీతిరుపతి వేంకటేశ్వర కవిప్రణీతంబైన యాంధ్ర బాలరామాయణ నాటకమున షష్ఠాంకము.



# బాలరామాయణము

## సప్తమాంకము

( పిదప వైతాళికుఁడు ప్రవేశించుచున్నాఁడు )

వైతా— (నాల్గుదెసలు పరికించి తెరవంకకుఁజూచి) ఓరీ! చందనచండా! తెల్ల వాఱినదిరా! నిద్రలెమ్ము. పర్ణశాలవిడువుము.

చ. తగరపుఁగాంతి తారపిలఁ దారక లెల్లను నల్పసంఖ్యగా
మగిసెను, దిన్వెలుం బసుపుమోటికలో యనఁనొప్పెఁ జందురుం
డగపడెఁ బారదీయఘుటికాకృతిఁ దూలుపుమింటిచాయయుం
దగియెఁ బురాణమద్యసమతామసరం బగుడాలుపెంపునన్.

(తెరలో)—ఆర్య కర్పూరచండ! ఇదిగో నిద్రమేలుకొనవచ్చినది. లేచుచున్నాను

కర్పూ—ఔరా! ఏమినీయుత్సాహము! మంత్రిశక్తి లేని రాజును లాఁతికబ్బములు చూడని కవియుఁ గైవారముచేయని వందియు నెందులకును బనికిరారసుమీ

(తెరలో)—అట్లయిన నీపక్కనుండి లేవకయే కన్నులు మూసికొని కైవారము చేసెదను.

కర్పూ— ఇది నీయందింకొకవిశేషము.

(తెరలో)— ఔను సత్యమే. సరస్వతీప్రసాదమును బ్రత్యక్షము చేయఁగల బ్రాహ్మముహూర్తమేగదా?

గీ. దీప్తిదొలఁగెను నంతఃప్రదీపములకు
వికసనముఁదప్పెఁ గాడ్రుంపినకలువయు
నాలసాలలు జనరవవ్యాకులమ్ము
లినుఁడు కైసేయుఁ బ్రాగ్దిశ నింక వేగ.

కర్పూ— ప్రాతఃకాలవర్ణనముతోఁ బనియేమి! శ్రీరామచంద్రుని నుతింతము. ప్రభుస్తోత్రపాఠమే కదా వైతాళికులకు వ్రతము—

చ. దినమణివంశమౌళి జగతీత్రయికి న్మణిభూష గాధిభూ
మునికి పటుండు తాటకను మొత్తినవాఁ డలకోసలాత్మజా
మనమునకుం బ్రమోదము రమాపతి మాఱటమూర్తి కీర్తికిం
గని యగుఁగాత రాఘవుఁ డకారణమిత్రుఁడు భక్తకోటికిన్.

(తెరలో)— సఖా! కౌసల్యాగర్భవారాశిరాకానిశాకరుండగు రామచంద్రుఁడు—

గీ. ఎవని ముక్కంటి సెగ హరియించె మదను
బ్రహ్మమూర్ధము గోసె నెవ్వనికరంబు
వానివిలు పాఁపరాసారితోన విఱిచి
నట్టిరౌద నేఁటికైనఁ జల్లారలేదు.

కర్ణా— (సంతోషముతో రామునుద్దేశించికొని)

క. అని జంభునిఁ జంపిన యింద్రుని గెల్చిన యామినీచరునిఁ దనవిల్త్రా
టను గట్టిన యర్జునుఁద్రుంచినరాముని గెల్చితీవ శ్రీరఘురామా.

(తెరలో)— గీ. వీణవలె నీవు పార్వతీవిభుని వింటి
నారి మీటంగ వెడలిన యారవమునఁ
బ్రాణమెడసిరి మున్ను ఖరాదులెల్లఁ
బిదపఁ దావకశరములు పృథివిఁ గూల్చె.

కర్ణా— గీ. ధాత సృజియింపనేల నేత్రములు మాకుఁ
బుట్టుగ్రుడ్డులఁ జేసినఁ బోవునంచు
నీరు విడిచిరి కనులకై నీవు మాయ
లేడి నేసినతఱిఁ జూడలేని సురలు.

మఱియును, గీ. త్వత్కృతకబంధదారణోత్సవముఁజూచి
రెవరు వారికి మనముల నెలమిచెడదు
కనుల రెప్పలు వ్రాలవు గండముల జ
నించు పులకమ్ములును బోవు నేఁటికైన.

(తెరలో)— క. గిరికాట్టహాసరాశి స్ఫురణముగల వాలికీర్తి సుడివడిపోవం
జరణాగ్రంబున దుందుభిశరీరమును మీటితీవ తృణమాత్రమునన్.

మఱియును, క. లీల భవదీశశరమునఁ దాళములేడింటికేడు దరములుగా వా
తూలము క్రుతిగా లోకు లవేలభవద్యశముఁ బరిభవింపరె రామా?

కర్ణా— చ. కపులకుఁ జక్రవర్తి, సురకాంతునకుం గొమరుండు, రావణుం
ద్రవపడఁ జంకలో నిఱికి నాలుగువార్ధుల ముంచినాఁడు, క
ర్మపటుఁడు, వాలి, హైమనల మాలి సహోదరుతోడఁ బోరునాఁ
డవగతజీవుఁజేయ నొకయమ్మునఁ గూల్చితి వీవు రాఘవా!

(తెరలో)— క. ఒకరిచితి వింధ్యమందరకనకనగకళిందమలయకైలాసకస
హ్యవగముల నుండువానరులను సుగ్రీవాధిపాళులను శ్రీరామా.

కర్పూ— చ. హనుమ పయోధి దాఁటి దనుజాధిపుప్రోలున నున్నజానకిం
గనుఁగొని యామెకీ విడినకానుక నిచ్చి యశోకభూమిరు
ద్వనమును బాడుచేసి బలవంతుని నక్షునిఁ జంపి క్రిమ్మఱ
న్నినుఁ గనెఁగాదె దానికిని నీమహిమంబ కతంబు రాఘవా!

(తెరలో)— చ. ఇతర విరాధముఖ్యదనుజేంద్రవిదారణముం గణింప కే
కతమొకఁ డెంతు, మాదమజకాంతలుఁ బొమ్మలుబాఁదుకొంచుఁ బే
ర్లుతెగి ధరాతలింబడ నలోయని యేడ్పులు వెట్టసాగి ర
బ్ధితటమునందు నీవు శరధిం గొని యున్నపుడే రఘూద్వహా.

కర్పూ— శా. లంకారాజ్యము గట్టె రాఘవుఁడు హేలం బెక్కు రగ్గింప నే
శంకం బొందక యావిభీషణునకు సమ్యక్ప్రతిజ్ఞావిధిన్;
లంకానాథుని మోములన్నియు నవేలశ్వాసధూతంబులై
యాంకింపించెను గోపవహ్ని రుధిరప్రవ్యాహంబునుం గన్నులన్.

ప్రతీహారి— (పటాక్షేపముగాఁ బ్రవేశించి) ఓరీ యలీకవైతాళిక! ఎందులకురా యీ కలకలము!

కర్పూ— ఆర్యా! మా రామదేవుని శౌర్యగుణసంపదలు కొనియాడుకొనుచుంటిమి

ప్రతీ— దశరథమహారాజుగారి మరణము వినినది మొదలు రామచంద్రుఁడు 'నే రావణునిఁ జంపువఱకు వన్నెవ్వరు నుతింపకుఁ' డని నిషేధించెఁ గాదా!

కర్పూ— నేను విభీషణుని వైతాళికుఁడను పరదేశిని గావున నాయానతి యెఱుంగక నుతించితిని. క్షమింపుము, (అని వినయముతో) తండ్రిమరణవార్తఁ వినియు రాముఁడిట్లు యుద్ధసముత్సాహమునం బ్రవర్తించుచున్నాఁడేమి?

ప్రతీ—(నవ్వి) ఓరీ తెలివితక్కువవాఁడా! నీవు సత్పురుషులలో మెలఁగినవాఁడవు కావు. కావున వారి చరిత్రములు నీకుఁ దెలియవు.

గీ. ఆపదలు వచ్చెనేనియు ననుభవింత్రు
చెలఁగి కర్తవ్యములు గూడఁ జేయుచుంద్రు
సజ్జనులు వారికెవ్వరు సాటిరారు
వారికింగలధైర్య మెవ్వరికి రాదు.

కర్పూ— ఆర్య! కోపింపకుము. తెలియక యడిగితిని. కాని రామభద్రుఁ డిపుడేమి చేయుచున్నాఁడు?

ప్రతీ— సముద్రతీరమునం దిసుమతిన్నెమీఁదఁ గుశప్రస్తరముపై సువిష్టుండై నిట్లుండి భగవంతుండగు భాగీరథీవల్లభుని ధ్యానించుచున్నాఁడు

ఉ. రావణుమీఁద నల్క జలరాశిపయిం గ్రుధ వింట మోదముం
బావనిమీఁద నచ్చెరువు పాపి కళాంకునిపై ననూయ సు
గ్రీవుని మీఁదఁ బేర్మియు లగింపఁగఁ జేయు విలోకనంబులం
గేవలమేగె రాత్రి నరకేసరి శ్రీరఘురామమూర్తికిన్.

కర్ణా— ఆర్య ! యిట్లున్నను సముద్రునకుఁ దెల్వి రాలేదా ?

ప్రతీ— అతని పేరే జడనిధిగదా !

కర్ణా— అట్టి సముద్రుని విషయమై రామభద్రుఁ డేమనెనో ?

ప్రతీ— ఇట్లనెను. వినుము చెప్పుచున్నాను— ఓరత్నాకరా!

క. రాముఁడు నీయొద్దనఁగను సేమంబున దర్భశయ్య నిట్రిండంగా
రామా నెదు దలఁపును తోడ్తోమది సగరుని భగీరథుని మద్దనువున్.

కర్ణా— అంతకోపమే వచ్చిన గోష్పదమునువలె సముద్రమును దాఁటినవాఁడె.

ప్రతీ— (నలువంకలఁ బరికించి) ఓప్లవంగయూథపతులార ! ఓగోలాంగూలసేనా నాథులార ! ఓయచ్ఛభల్లసేనానులార ! వీరలు చేయఁదగినపని మీరలు చేయుటలేదు. సముద్రప్రాంతవనంబులం దాటలాడుచు పనులు లెక్క పెట్టుకొనుచున్నా నమువవలసినది !

కర్ణా— (చూచి) ఈవానరులు నిజకులాచారములు లెక్కింపమి యటుండ నీమాటగూడ లెక్కింపకున్నారు.

ప్రతీ— ఇదిగో నిందలను దోలుకొనివత్తును. కోఁతిమూఁకగదా ! ఓ వానర యూథులార !

ఉ. కనుఁగొని పూర్వమొక్కచులుకంబుగఁ ద్రావె నగస్త్యుఁ డీపయో
ధిని బడబానలంబున కిదేకద ! తిండి యడంగి పొంగుచుం
డును బోలిమేర దాఁట దెపుడుం బ్రళయాంతమునం దరాశ్చతిం
గను మనవారు త్రవ్వినదిగా యిది దీనికిఁ జింతయేటికిన్.

ఉ. చెలియొకయింత యింతయనుఁ జేరి జలంబులు త్రాగఁబోయినం
జెలియొకతాయి లోపలకుఁ జిమ్మినఁ జాలును బూడిపోవఁగా
వెరవు లెఱుంగలే కిటుల వేదురలై భయమంద నేల పెం
పలరుఁడు రండు వేగఁ బ్లవగాధిపులార పయోధి దాఁటఁగన్.

కర్ణా— ఓసుగ్రీవప్రతీహార ! నీమాట లరణ్యరోదనములు. ఈవానరయూథ పతులు మాత్రము చెట్లు దిగరు.

వ్రతీ— (చేతితోఁజూపి) ఈచిల్లరమూఁక రాకపోయినను గొందఱు పనిచేయుచున్నారు చూడుము—

గీ. అంసములు రెండుచేతుల నప్పళించి
సైన్యపతియగు నీలుండు సవదరించుఁ
గిలకిలధ్వని వినలేక నలువ యిడుమఁ
జెందు నిరుకేల నెనిమిది చెవులు మూయ.

గీ. అవులించిన సెలవులయంతరమున
అంపములు వోలె నిడుదకోఱలు గనఁబడఁ
దోఁకచేఁజుట్టి ధూమ్రుండు తోయరాశి
యలలఁ బడవైచుచున్నాఁడు మలయనగము.

గీ. మూఁడులోకము లిముడని మూర్తిఁ గలుగు
నలత్రివిక్రము వలగొన్న యంతవాఁడు
వార్ధిఁగట్టుట విని జాంబవంతుఁడకట
ముదిమిపైఁ గోపగించుచు మూల్గుచుండె.

చ. అలసి కుమారుఁడంగదుఁ డయారె నఖంబులఁ బాకపాండురో
పలములు పచ్చకప్పురపుఁ బల్కులు చీలిచి తత్పరాగమున్
నలుగిడి మేని చెమ్మట గనంబడకుండఁగఁజేసికొంచుఁ గొం
డలు జలరాశిలోపలఁ దడాలున వైచుచునుండె నేర్పునన్.

గీ. తారకాపతి పయి నభ్యుదయముఁ జెంది
కేసరాఢ్యత్వ మామోదభాసురత్వ
లంబతరవాలనాలతలను వహించి
పడసెఁ గుముదుండు కుముదరూపంబు బళిరె.

క. ద్వివిదుం డీషన్ముకుళితమవు దృష్టింజూడ సొంపుఁ దశ్వినుతుఁడు సైం
ధవపులినంబున మొసలికిఁ బవగొలిపెం గజముతోడఁ బాణియుగమునన్.

క. అంబుధి దాఁటెద దైత్యకులంబుం దునిమెదను గపిబలములారా మీ
రింబుగ మల్లోమసమూహంబుం బట్టుకొనుఁడంచు హనుమయు నవ్వన్.

గీ. తారగుబ్బలమీఁది పూఁతయును వేయి
తమ్మిపూఁదండలును గల తనయురంబుఁ
జూచుకొని యెంచుకొనుచుండెఁ జులుకసేయ
మీఁపయోరాశియని వానరేశ్వరుండు.

ప్రీతి— సఖా ! నీవు చెప్పినదంతయు నిజమే (చమత్కారముతోఁ గలయఁజూచి) విచిత్రముగఁ గపవీడక తిరుగుచుండు జలమనుజదంపతులచేతను నింద్యమానంబులగు శంఖినీయూధంబులచేతను మిగిలిన బడబాగ్ని జ్వాలలచేతను మిన్నంటుచు నినమండలంబునుదాఁకు తరంగములచేతను దాహాతిశయముచేఁ బగులు ముత్తెపుఁజిప్పలనుండి పైకెగయు ముక్తాఫలంబులచేతను నిట్టటు కదలు మత్స్యకచ్ఛపాది జలచరములచేతను బైకిఁ దేలియాడు మీనపృష్ఠంబులచేతను మందేతరాక్రందనములొనర్చు మకరములచేతను సరీసృపచక్రంబులచేతను సెగురుచున్న పతత్పర్వతంబులచేతను దటావటప్రవిష్టసప్తపన్నగములచేతను గరివర ముచ్యమానదురవగాహమదప్రవాహములచేతను బాడబశాంతి నొనర్చికొనుచు జలస్తంభనవిద్యచే డాగియున్న మునిగణంబులచేతను విముక్తోపరిగమనులగు విబుధసిద్ధసాధ్యవిద్యాధరాదులచేతను దీరతరుకులాయంబులు వదలి మింటికెగసి చూచు పక్షిగణములచేతను దూరముగఁ బాఱిపోయి యవలోకించు కపికుటుంబములచేతను గర్భవాసంబువదలి పాఱిపోవు దైత్యసుందరులచేతను మథనకాలావశిష్టాప్సరశ్శ్రేయమును గాంచుటచే నుతించు నిశాకరపారిజాత కౌస్తుభాదులచేతను విరాజితంబగు నీపారావారము ఁగనుంగొన సంతసంబును భీతియు నచ్చెరువుంగూడ గలుగుచున్నది.

మఱియును,

గీ. పొగయు మిణుగుర్లు మంటలు బూది నీల
మణులు మాణిక్యములు విద్రుమములు ముత్తె
ములును నైక్యంబుఁ జెందఁగ జలధివహ్ని
జలచరంబుల కానవాల్ తెలియదయ్యె.

ప్రీతి— (సవితర్కముగా) సఖా ! ఇటుచూడుము.

గీ. పాతవయనవహ్నియో ప్రళయానలంబొ
లేక కాలాగ్నిరుద్రుఁడో గాక బాడ
బాగ్నియో యిది కాదుకాదకట తెలిసె
దాశరథిముక్తబాణాశ్రియాశకీల.

కావున నేదియో గొప్పపని చేయుటకు సంరంభించి సుగ్రీవవిభీషణులతోఁ గలసియున్న రామునొద్దకే పోదము రా (అని యిరువురు నిష్క్రమింతురు).

ఇది విష్కంభకము.

(పిదప సుగ్రీవవిభీషణులును హనుమంతుఁడును గొలువ రామలక్ష్మణులు ప్రవేశించుచున్నారు.)

రాము — (బాణమెక్కు వెట్టి యాకసము వంకకుంజూచి యౌదలవంచి నమస్కరించి)

చ. సగరునిచేతఁ ద్రవ్వఁబడి సాగరమై పిదపన్ భగీరథా
నుగయగు దివ్యగంగకు ననుంగు ప్రియుండగు వారిరాశిపై
కెగసె మదంబకాగ్ని యొడమీనికరంబునఁ బెద్దలార నా
కీ గతి మఱొండులేక దయఁగోరితిఁ గావుఁడ దప్పునైనరే.

విభీ— సఖా సుగ్రీవ! మన రామదేవునిచరిత్ర శశాంకశేఖరునిగూడ దాఁటును జుమీ

గీ. ఈమకరమ్ములయ్యె బడబాగ్నియును యుగాంత
వాయువులు గూడజలహృతబలములయ్యె
దేనిలోపల నట్టివార్ధి నిదె రాము
బాణములు గ్రాఁచె నతిబాడబంబులగుచు.

సుగ్రీ— మిత్రమా విభీషణ! ఇంతకుమున్ను వినియుఁ గనియుఁగూడ నెఱుంగని రాముని విక్రమ మెవ్వరి నాశ్చర్యపఱుపదు. జలములుగూడ భగభగమండు చున్నవి.

చ. ఒడలులు చుట్టచుట్టుకొనియుండె భయంబున సర్పదంపతుల్
సుడివడి నీరుగ్రుక్కకొని సోలె మొగి క్రౌంకమాల నద్దెసల్
గడుకొనె వారిజంతువుల క్రాఁగిన మేనులపూలిగంధముల్
కడలి రఘుప్రవీరశితకాండపరంపర గ్రమ్మ వేఁడిమిన్.

హను— (ఆశ్చర్యముతో ముందుఁజూచి నమస్కరించి)

గీ. నుదురునందలి బొమముడి వదలుమింక
బాణ మపసంహరింపు చాపమునసింక
పన్నగీగీతయశుఁ డదె వచ్చుచున్న
వాఁడు వారిధి దేవ! సభార్యకముగ.
(అందఱును సంతోషముతోఁ జూచుచున్నారు)

రాము— అట్లైన నిదిగో ఆగ్నేయాస్త్ర మపసంహరింపుచున్నాను.

(పిదప ఓషధులు శరీరమునిండఁ జుట్టుకొని బద్ధాంజలిపుటుండగు సముద్రుఁడును భార్యలును ప్రవేశించుచున్నారు.)

గంగ — సఖీ! యమునా! త్వరగా నడుచుటకునైన శక్తి లేకయున్నాను చూడు మా మననాథుఁడు.

గీ. ఆదికిటి భూమిఁ జొట్టిన యపుడు మంద
రాద్రి చిరముగఁ దఱిచిన యపుడుఁ గూడ
నంతనొవ్వని యవయవాల్సూవె రామ
బాణముల నొచ్చి దగ్ధభావంబుఁ జెందె.

(అని యందఱును యథోచితముగాఁ బరిక్రమించుచున్నారు)

సము — (దుఃఖముతో) సఖీ! హైమవతీ! ప్రియగాలా కాళిందీ! అపరాధినగు నేను రామచంద్రుని మొగమెట్లు చూతును.

గంగా — ఆ రామచంద్రుఁడే యపరాధిగాని మీరు కారు. సగరభగీరథయశోరాసులకు శమకిట్టి యపకార మాచరించినాఁడు.

యమూ — అపరాధమింక నేది, తత్క్షణమే బయలు వెడలి వచ్చితిరిగదా.

సము — అట్లైన బాలనారాయణమూర్తియగు రామదేవు ననుసరింతము రండు.

(అని యందఱును బరిక్రమించుచున్నారు)

యమూ — దశరథనందన! భగీరథకులపావన! సగరభగీరథులవలె గారవింపఁదగిన రత్నాకరుఁడు మీయెదుటికి వచ్చియున్నాఁడు

సము — (పూజాపురస్కారములతో సమీపించి)

మ. రమయుం జంద్రుఁడు హాలయున్ సుధయు న్వర్మ్యాతంగముం బారిజా
తము చింతామణి మున్నుగాఁగల పదార్థవ్రాతముల్ మున్న నేఁ
దమస్వాధీనము చేసితిం జలముమాత్రింబింక నాకున్న వి
త్తము నీవంచిన పంపుసేయుటకునై దాసుండ శాసింపుమా

రామ — (గౌరవముతో) భగవంతుఁడా! రత్నాకర! నీకు నమస్కారము. సాగరుఁడవగు నిన్ను శాసింపఁదగినవాఁడను గాను. అవినయమో వినయమో యీయొక్క తప్పు క్షమింపుము.

విభీ — భాగీరథీవల్లభునకుఁ దమయందు సర్వదా స్వభావసిద్ధమగు పక్షపాతమే

చ. అమృతము పుట్టినిల్లు దివిజాపగకుం గడువల్లభుండు నై
ద్యమణికి వంశకర్త హిమధామునకుం జనకుండటంచు సం
ద్రమునకుఁ గల్గుకీర్తి విదితంబు జగత్త్రితయంబునందు నం
నెమగ స్తుతింపుచుంటి విపుడల్లుఁడ వీవు నిఁకేమి రాఘవా.

( రాముఁడును సముద్రుఁడును సిగ్గుపడుచున్నారు. )

విభీ— దేవా! సముద్రుని యోగ్యత కిదియొక వర్ణనాపరిపాటియా! దేవతని చరిత్రమును వర్ణింతును వినుము.

చ. మగలకు చాంద్రకుం బ్రణయమానము బాపు సుధాతపంబు నే
ర్పుగఁ గిలికించితంబు విటబోండ్లకు నేరుపు హాల సర్వదా
తగు నెలప్రాయముం ద్రిదివధాముల కిచ్చెడు తీపిబువ్వ క
ల్మిగల త్రిలోకమాతయును లీలలఁ గావె పయోధి కారయన్.

సుగ్రీ— భగవంతుండగు యాదఃపతి మహిమ మట్టిదే.

గీ. స్త్రీలకెల్లను మేల్బంతి శీతగిరికి
మారి, యామెకుఁ దమ్ముండు నాటుఁగొనిరె
నింద్రునకు జంకి మైనాకుఁ డీపయోధి
లోనిజంబాలమున రెక్కలు తెగకుండ.

గీ. పుడమిధరియించె శేషుఁడు పడగలందు
నతనిఁదాల్చెను దాఁబేలు పృష్ఠమందు
దాని భరియించె నీతఁ డుదరమునందు
పెద్దల మహిమ కింతని హద్దుగలదె.

ము— (స్నేహముతోఁ గూడిన యమునాయతో.)

గీ. అగ్నిశిఖలను జిమ్ము నీయంబకములు
నాఁటఁగా నన్నుఁ దాడించునప్పు డకట
మంచిపోతివె పడకింటి మాట దేవ!
కమలకును నీకుఁ బ్రళయాంతకాలమందు.

రాము— దేవా! రత్నాకర! నాయపరాధంబులెత్తి నన్ను లజ్జింపఁజేయకుము.

సము— (గంగాయమునల రామునకుం జూపి)

గీ. తమ్మిచూల్చేతికుండి సుదయముఁ జెంది
శివశిరోభూషణైన దీ చిగురుబోఁడి
ఆ కలికి మీకుఁ గూటస్థుఁడైన యుష్ణ
లారి కూఁతురు మాయింటి యాడుబిడ్డ.

రాము— దేవి, హరశిరోవతంసమా, మందాకినీ! తల్లీ మార్తాండ నందనీ, యమునా! దాశరథి మీకు నమస్కరించుచున్నాఁడు.

గంగాయమునలు — రవికులాలంకరణమా, రామచంద్ర! నిరర్గళవిక్రమసంపన్నుఁడవు కమ్ము.

సము — దేవా! ఏమిసెలవు?

రామ — నన్నే నియోగింపుము. ప్రకృతకార్యమునకుఁ గొంచెము దేవర సాహాయ్యము కోరుచున్నాను.

సము — విశేషములు వినఁదలఁచియున్నాను.

గంగా — ఏల పది మాటలు.

క. వేవే యారంభింపుము దేవా! పోతంబురీతి దృఢముగ నెంతే
నీవార్ధిదాఁట శైలగ్రావంబులచేత నావకట్టం గట్టన్.

(అందఱును విస్మయపడుదురు)

సము — గంగాదేవి చెప్పినట్లే చేయుఁడు. చక్రవాళాద్రికి మధ్యంబందు నివసించియుండు బడబాగ్ని కుత్తరముగా ననంతభోగిభోగశాయియగు భగవంతునికి దక్షిణముగానున్న యింద్రనీల శకలశ్యామలంబగు సలిలస్కంధము సేతుబంధనమునకుం దగినచోటు.

రాము — (నవ్వి) దేవా! ఱాళ్ళు నీళ్ళలోఁ దేలునా.

సము — విశ్వకర్మసూనుండును శతువనదావానలుండునగు మన నలునకు ఱాళ్లుగూడఁ జేతఁదాఁకిన నీళ్ళలోఁదేలునని మహామునులు వరమిచ్చిరి కదా.
( అందఱును మిగులనాశ్చర్యపడుచుండ తెరలోఁబెద్దకలకలము )

హను — ( ఆలించి ) ఇది సముద్రుని మాటవిని సంతోషముతో నొడలెఱుంగక యఱచు కపికులముల కలకలము.

సము — రామభద్ర! హనుమంతుఁ డీమలయాచలకటకవిటంకముపైనెక్కి సేతుబంధనమునకుం దగిన ప్రదేశమును జూచును గాక.

రాము — ధన్వంతరి జనకుం డానతిచ్చినట్లే యొనర్చెద (అనివినయముతో) భగవంతుఁడా! రత్నాకర! రాముని దుర్వినయమునంజేసి వ్రణములు గల శరీరము గలవాఁడ వైతివి గావున నిజపాతాళనిలయంబునకుం దయచేయుము. చాల ననుగ్రహితుండనైతి.

సము — సప్తమనారాయణావతారమగురామమూర్తీ! చిరంజీవ (నిష్క్రమించును.)

(తెరలో) గీ. రామునకుఁ గీర్తిహేతువు రావణునకు
భూమహేతువు సేతువు పొలుచుగాక

పలయుచున్నది దయఁజేసి వెడలుఁడయ
నాగనాయకకూర్మమీనంబులార !

గీ. సేతువును గట్టుచోఁటు త్యజించి బంధు
చయముతోఁ బోవుఁడో జలచరములార
లేకయున్నను సేతుకాలికములైన
యిడుమ లేనాటికిని బోవుచుఁడు నిజంబు.

సుగ్రీ— ఆంజనేయా ! సేనాపతులందఱికిని బర్వతానయనమ్మునకై యానతిమ్ము.

హను— దేవా ! చిత్తము (అని నాల్గుదెసలు పరికించి)

శా. కేళీలాలసులైన వానరులు సుగ్రీవాజ్ఞ నాలింపుఁడీ
మాళిన్యస్తకరద్వయాకులగుచుం బాహాబలప్రౌఢి నెం
తో లీలం జలరాశిఁ గట్టుటకునై తోడ్తెండు భూభృచ్చయం
బాలస్యంబులు సేయఁగావలదు పొండయ్యా దిగంతాళికిన్.

సుగ్రీ— గీ. తెండు కపులార మీర లద్రిశతి, యంది
పుచ్చుకొనుమయ్య యోవాలిపుత్ర నీవు
నలుఁడ నీచేతి సేర్పును బలముఁ జూపి
సేతుబంధనకృత్యంబు సేయుమయ్య. (అందఱును విందురు)

హను— (నవ్వి) సముద్రుఁడు పాప మాపద్విలీనుఁడై యుండెను నిజదౌవారికుండగు
శోణనదముద్వారా జలచరమహాసత్వంబు లన్నింటికి నుపదేశించుచున్నాఁడు.

సుగ్రీ— మిత్రమా ! ఆంజనేయ ! యిరువురు వానరవందులను బిలచికొనిరమ్ము.
వారు సేతుబంధనవిధియంతయు రామునకు నివేదించుచుండురు.

హను— చిత్తము ( వెళ్ళి యా యిరువురతోఁ బ్రవేశించి ) ఓకపిత్థదధిత్థులారా !
రామచంద్రునితో నిచటివృత్తాంతములన్నియు నివేదించుచుండుఁడు.

వందులు— చిత్తము (అని రాముని సమీపించుచున్నారు)

కపిత్థ— దేవా ! యిటుచూడుము. తీరమునందలి పర్వతములన్నియుం బెకలించి
తలమీఁద నిడికొనివచ్చు వానరులతో నిసుముచల్లినను గ్రిందరాలదు. వారి
కింగల సేతుబంధనవిధిత్సయందలి యభిలాష యుం వర్ణింపఁదరము గాదు.

రాము— ఏమీ ! శాఖామృగముల పరాక్రమాతిశయము. ఏమీ! సముద్రుని వాత్స
ల్యము. పర్వతంబులు మునుంగకుండఁ దేలుచున్నవి. ఈగొప్పకార్యము
నకుఁ దోడుపడినాఁడు.

దధి— దేవా! తావకపరాక్రమాతిశయమునకుం గుసుమంబును సీతావిరహవిచ్ఛేద శుభకార్యంబునకు స్వస్త్యయనంబును రత్నాకరంబునకు మొదటికళంకంబును నగు సేతుబంధమునకు నలుఁడు మోటికి మొలపించినాఁడు.

కపి— దావాగ్ని చల్లార మృగేంద్రంబులు తల్లడిల్ల పంచవర్ణధాతుద్రవంబులు స్రవింపఁ గపిబలములతో క్షణమాత్రము స్నేహముం జేసిన ధరాధరంబులు పతన సముజ్జాతంబులగు బుడగలు తమ్మనుకరింప నలకరస్పర్శంబుచే మునుంగక సముద్రముం దోడల పగిది నట్టిటు తేలియాడుచున్నవి.

దధి— మిత్రమా! నీవు చెప్పినదంతయు సత్యమే.

ఉ. అంబుధిహద్దుదాఁటు బడబాగ్నికి విందిడి భోగిలోకమం
దుంబడి యాదిపోత్రి ముఖఘాతము కర్దమ మంటఁ దేలుచుం
డెం బృథివీధరంబులు వడిన్ నలు హస్తము సోఁకినంతమా
త్రంబున వానరప్రవరచండభుజాయుగపాతితంబులై.

(ఆలోచించి) గీ. కపిబలము త్రవ్వివైచిన గట్లు మింట
నరయ నివి చాలవా కట్టకనుచుఁ దోఁచు
వార్ధిలోఁ జూడ వేయవభాగమైనఁ
బూడ్చలేకున్న వహహ యెప్పలను నిజము.

కపి— మిత్రమా! రామచంద్రునకుఁ జక్కఁగఁ దెలుపుచుంటివి.

హను— క. మును మందరగిరిమథనంబున నమృతముఁ గ్రోలి మృత్యువుం గెల్చినవా
ర్మనుజులు ప్రతిగిరిపాతంబునకుం దన్మథనబుద్ధి పొందిరి వేడ్కన్.

లక్ష్మ— (ఆశ్చర్యముతో) ఆర్యా! కథలుఁగాఁ జెప్పఁబోఁబడిన జలజంతువుల నన్నింటిని ప్రత్యక్షముగాఁ జూచుచుంటిమి

గీ. కమఠపృష్ఠావపాతంబుఁ గాంచి మరలఁ
బైకిఁ దేలుచున్నట్టి పర్వతంబు
మ్రింగె నొక తిమి దానిఁ దిమింగిలంబు
మ్రింగె నిఁక వేఱయున్నదే మేటివింత!

రామ— వత్సా! లక్ష్మణ మఱియుం దక్కువ వింతయే చూచితివి.

గీ. మ్రింగుఁ దిమియను దానిఁ దిమింగిలంబు
దానిమ్రింగు నింకొక్కటి దాని మ్రింగు
నింకనొక్కటి నద్దాని నింకనొకటి
మ్రింగు దాని మఱొక్కటి మ్రింగుఁగాక.

ఇదియే కాదు

ఆ. వె. నలుఁడు సేతుబంధనమునకై కూర్చిన కొండలెల్ల శిఖరమండలంబు
తానుచేతఁ గొన్ని తాఁ బేటిపిల్లల తానుచేతఁ గొన్ని తరలుచుండె.

దధి— గీ. గట్లు తేలుట జలరాశి కట్టఁబడుట
కూర్మమీనకులస్థులు కూలుచుంట
సానుమంతంబులెల్ల గోష్టంబు లగుట
సేతువిధి రావణక్షయహేతు వరయ.

సుగ్రీ— మన సేతుబంధనమున కొక యంతరాయముకూడఁ గలుగుచున్నది గదా

ఉ. కొండల నుండియే వెడలి కోట్లకొలందిగ నేర్లు తోయధిన్
నిండఁగఁ జేయుచుండ నవనీధరతండము లెన్ని తెచ్చినం
బండుగ కాని యెచ్చటఁ గనంబడవన్నియు నింతమేరలో
నుండ విఁకెట్లు కట్టఁబడునో జలరాశికిఁ గట్ట యక్కటా.

విభీ— మిత్రమా ! యిదియొక మహాద్భుతము చూడుము.

గీ. పర్వతము నీటిలోఁ బడవైచి పాయ
వడిననీరంబు మరలి తా వచ్చునంత
లోన నాకోఁతి యది భూమిలోనఁగల్గు
కొండనుచు నెంచి పెకలించుచుండె నహహ.

మఱియును, గీ. ఎచట బడబానలంబుండె నెచట వెన్నుఁ
డుండె నెచ్చోట దైతేయులుండి రెచట
పర్వతములుండె నచ్చోటు బైటఁబడుచు
నుండె నొక్కొకగిరి వైచుచున్నయపుడు.

సుగ్రీ—ఉ. వేలుపుటేన్గునింటఁ బ్రభవించిన యేన్గులు శీతరశ్మిచు
ట్టాలును లచ్చి బందుగులు డంబగు కౌస్తుభమింట నున్నర
త్నాలును జూచువారికిఁ గనంబడు నిక్కము గాఁగ నేఁడు వా
తూలభవుండు మేరుగిరి తోయధిలోఁ బడవైచునంతటన్.

రాము— వలదు, మేరుగిరి పెకలింపవలదు. ముప్పదిమూఁడుకోట్ల దేవతలకు నదియే
కదా నివాసము.

కపిత్థ— దేవా ! యివి సకలబృందారకబృందనివాసంబులును గుంకుమపంకవి
లేపితతరుణీగండసమచ్ఛాయంబులునగు బంగారుగొండ తునకలు. ఇవి

యర్ధనారీశ్వరవిషమచరణవిన్యాసప్రతిబింబచుంబిత శిలాతల రమ్యంబులును హిమనిరంతర పాతపాండురంబులునగు మంచుఁగొండ తునకలు. ఇవి కౌస్తుభమృగాంకమదిరాసుధారసశ్రీసురద్రుమసముత్పత్తిసాక్షి భూతంబులగు కవ్వపుంగొండ తునకలు. ఇవి కుబేరమైత్రీకృతనివాసకృత్తివాసఃపావన చరణవిన్యాసపావనంబులును జరఠమృగాంకఖండధవళంబులునగు వెండి కొండ తునకలు. ఇవి కాంచనకమలపత్రశోభిత మానసంబులును గంధహారిణ నాభీసుగంధులునునగు గంధమాదనగిరిఖండంబులు. ఇవి లవలీలతామండి తంబులును ఫలితకేరళీకపోలరుచిరంబులునగు కాటుకకొండ తునకలు. ఇవి మార్తాండమండలమార్గనిరోధులును సిక్తశిఖరశిఖండి మండనంబులునగు వింధ్యపర్వతఖండంబులు ఇవి నానామణి సముత్పత్తిహేతుభూతంబులును లోపాముద్రాస్నానపవిత్రీకృతనదీప్రవాహపరిపూరితంబులునగు రోహణాద్రి ఖండంబులు. ఇట్లనేకపర్వతంబులనుండి ప్లవంగపుంగవులచేఁ బెకలించి తేఁబడిన ఖండంబులచేత నీలుండు సేతువును నిర్మించుచున్నాఁడు.

దధి— (తొందరగాఁ జూచి)

గీ. సేతు వంబుధిఁ బాదావశిష్టమయ్యె
నపుడె కపులెల్లఁ గిలకిలమనుచు లంక
సొగను గంతులువైచుచుఁ జూచుచుండి
మేడలెక్కిరి పాలడిండి మెలఁత లచట.

( తెరలోఁ బెద్దకలకలము. అందఱును విందురు)

రామ— ఏమిది ? ప్రళయకాలకాలకంఠకంఠ హుంకారసమాకారమగు కలకలము?

కపి— (ముందుచూచి) దేవా ! సేతుబంధమున కంతరాయము నాచరింపఁగ రావ ణుం డనిపినరక్కసులకును సుగ్రీవుఁడు ప్రేరేపించిన వానరులకును జరగు పెద్ద పోరునందలి కోలాహలము.

లక్ష్మ— బాగుబాగు లంకేశ్వరా ! నీ సాహసమునకును సాద్గుణ్యమునకును దగిన పని యారంభించితివి.

సుగ్రీ— విభీ. దేవా! రామచంద్ర! కొంచె మగ్రభాగమునకు దయచేసి కూర్చుండ వలయును. వానరులకు రాక్షసులకును బెద్దయుద్ధము జరగుచున్నది.

రామ— మంచిది. (యట్లు చేయుచున్నాఁడు.)

కపి— రాక్షసబలంబు బిట్టేఁచి కోఁతులంబట్టి త్రిమ్మరుచుండ శిరంబులమీఁది పర్వ తంబులు పాఱవైచి మనవాండ్రు పలాయమానులైనను వాని చేతనే శిష్టంబగు

సేతువు ముగిసినది. లంకాపురిలో యుద్ధపటహమును మ్రోయించు చున్నారు. రాక్షసులు నవ్వుచున్నారు కొండలు పోచి దిమ్మవట్టిన తలలమీఁద రక్కసులు గ్రుద్దినగ్రుద్దులచేఁ గపులు మఱింత దిమ్మవట్టి వరు గెత్తుచున్నారు. కావున నో దేవా గ్రక్కునఁ బ్రతికర్తవ్య మాలో చించుము.

లక్ష్మ— భద్రముఖ! భయపడకుము. రావణుఁడుగాని యింద్రజిత్తుగాని రానిదే మన మాయుధముఁబట్ట నవసరము లేదు.

దధి— (నవ్వుచు నొకవంకకుఁ జూచి)

గీ. ప్రాణమెడసిన కపులయు రాక్షసులయుఁ
దలలు మొండెమ్ము లొకటిగాఁ గలసికొనియెఁ
జేసెఁ గపిరాక్షసాత్మకసృష్టి తాత
నూతనంబంచు జనులు వినోదపడఁగ.

(మఱియొక వంకఁ జూచి)

గీ. తెగిపడినయెన్ను తలతోన వగతుమూర్ధ
మైనరాత్రించరకబంధ మదుకుకొనుకుఁ
గలసికొన వింత మాయరక్కసులమేను
లన్న విభ్రాంతిపడిరి చోద్యముగ జనులు.

(ఇంక నొక్కప్రక్కకుఁజూచి)

క. పలువురు నవ్వుచు నృత్యంబులు వికటముగాఁగఁ జేయు పోలిక వచ్చెన్
తలమాత్రము తెగి నిట్టగ నిలువంబడి యున్న యామినీచరుల కిహీ!

కపి— దేవా! యిటు విలోకింపుము. అంతరిక్షమును దట్టమగు కుంకుమపూఁతగల దానిం జేయుచుఁ బుడమినుండి వెడలిన పరాగ మష్టమంబగు రక్తసముద్రము వలెఁ గన్పట్టుచున్నది.

గీ. సైన్యచరణాభిహతావనీజాత మైన
యాపరాగంబు లీల మిన్నఁ బఘులింపఁ
గంచుతాళంబుతోఁ బోలు కాంతివచ్చె
నఖిలలోకప్రకాశకుఁడైన రవికి.

మఱియును —

చ. త్రిదశపదంబు దాఁక దివి రేఁగినధూళికి వేల్పుఁ బెద్దయుఁ
జదువుట మాని యచ్చెరువునం గనుగొంచు చిరుగేలఁ గన్నులె

న్మిదియును మాయలేక తన నీగజమందలి కేశు లొల్చి రొు
ప్పిదముగఁ గప్పకోఁదగినవే కనులంచు మదిం దలంచెదన్.

కపి.— (నవ్వి) పుంఖానుపుంఖముగా వచ్చు బాణములవేగముచేతను వికటంబులై యిట్టిటుఁగదలు ధ్వజపటపటలంబుచేతను జూడవచ్చిన దేవతాసుందరులచే విడువంబడు పుష్పమాలికలచేతను గొంచెము తక్కువగాఁ జేయఁబడిన యీ పరాగము నిష్ఠురప్రహారకృత కబంధకంధరారంధ్రనిస్సరదసృగ్ధారలచేతను గరికరవికీర్యమాణ జలాసార పరంపరలచేతను నిర్మూలముగ నుపశమింపఁ జేయఁబడినది.

దధి.— ప్రశాంతపరాగంబగు రణాంగణంబున మరల యశోధనంబగు నాయోధనము మొదలిడిరి. (ఆలోచించి) యుద్ధమునఁ జచ్చుటయు వీరులగువారికి లాభకరమే. అప్సరసలందఱు వహింప్రక్రమికతో స్వయంగ్రహాలింగనము చేయుదురు.

క. తమ తెగిన శిరంబులు సమరము చూడఁగ మింట నచ్చరలతోడ విమానములపయినుండి వీరుల్ తమవారలకు వందనంబులం జేతు రొగిన్.

సుగ్రీ.— సర్వము దధిత్థుఁడు విన్నవించినట్లే యున్నది. వేయేల! సమర మాశ్చర్యవితరణైకముష్టియోగమై యున్నది!

క. అమరులు పూవులు గురియఁగ సమరం బొనరించి తుదకుఁ జచ్చియు దివిపై నమరులయి మరల మొంతురు తమవారల దివ్యపుష్పదామముల బళీ.

విభీ.— ఈవైపునఁగూడఁ జూడఁదగినది చూడుఁడు.

చ. మడిసినవీరు లందఱు విమానచరత్వముఁజెంది క్రిందఁ గాఁ
బడు బవరంబు చూచి యనిపట్టున వేడుక గాఁగ వేలుపుం
బడఁతులతోడఁ గూడి భుజపాశములం గుసుమాంబకంబుల
న్వడివడి పోరుచుండిరి నవీనముగా సమరంబు గూర్చుచున్.

కపి.— దట్టంబుగ నేలంబడియున్న కరికరంకంబులును భయంకరంబుగ నఱచుచు నెత్తురు ద్రావు సృగాలంబులును రక్తమాంసమేదోభక్షణంబునకై యొండొరులతోఁ జోరాడు డాకినీగణంబులును నస్పకాన్పనంబుచే మత్తిలి ఘోరంబుగఁ గిలకిలారావంబు గావించు పిశాచాంగనలును గల యీ సమరాంగణంబునం బ్రబలవానరబలసమాక్రాంతంబు లగు రాక్షససేనలు లంకాభిముఖముగాఁ బాఱిపోవుచున్నవి.

హను — (నవ్వి) దేవా! మనము గెల్చితిమి; ఎదిరిన రాక్షససైన్యము విముఖమై పోవుటయే యందులకు గుఱుతు.

రామ — యుద్ధమగు చున్నపుడు మరణాపమరణంబులు మొత్తముమీఁద జరగుచుండు; నంతమాత్రమున జయాపజయములు నిర్ణయించుట కనువుపడవు.

హను — దేవా! అట్లుకాదు. ఎదిరియు విముఖమైన బలము మరల వేయేండ్లకైనను మార్తుర నెదుర్కొనుట యబద్ధము.

రామ — భద్రముఖా! ఆంజనేయ! ఈ యెలుగోలుమూఁక వెన్నిచ్చిన నేమి విచ్చిన నేమి చచ్చిన నేమి! వెండికొండ తన చేతులచే నిట్టట్టుఁ గదల్చిన దశకంఠుఁడు గాని దేవేంద్రునిగూడ జయించిన మేఘనాదుఁడుగాని యనికి వచ్చి పాఱిపోవలయు లేక చావవలయు. (అని ముందుఁజూచి) దైత్యబల మప్పుడే లంకాద్వారముఁ దూఱినది. (పైకిఁచూచి సంతోషముతో)

మ. అతఁ డెవ్వం డొకో పేపయానమున

హను — దైత్యస్వామి

లక్ష్మ — పౌలస్త్యుఁడా!

అతివేగంబునఁ గత్తిదాల్చి మరి నత్యాసన్ను నిన్ సైఁతు మే

రామ — క్షితిజం బాడుఁడు తప్పి ప్రియోక్తిరత నిస్సీ! తెండు నావిల్లు

సుగ్రీ — నీ

సతికిం దాఁకునొ యేమొ చూడ వలుఁగు ల్భాంతింపుమా రాఘవా!

(తెరలో) గీ, ఓరి రాఘవ సీత నాయొద్దనున్న
దేవి వాలిని గెల్చిన నీదుబలము
అవఁటికంబంబుఁ జీల్చినయట్లు చంద్ర
హాస మీసీతతలఁ ద్రుంచి యవనివైచు.

రామ — (వికటముగా నవ్వి) ఓరీ రావణా! జనులందఱికిని హాసముఁబుట్టించు నీ చంద్రహాస మొకమూల దాఁచికొనుము. శక్తిగలిగినను జంద్రబింబమా సెవ్వఁడు తాటిపలకపై నూఱునురా?

లక్ష్మ — (దుఃఖముతో)

గీ. ఆర్యుఁ డమ్ముఁ బ్రయోగించునంతలోన
హనుమ నిజశక్తి చూపించునంతలోన
సీతతల చంద్రహాసము చేతఁ ద్రుంచి
కన్నుఁగొనఁగా నప్పుడే దశకంఠుఁ డకట!

రామ— (తొందరతో) సీతతల ద్రుంచి రావణుఁడు క్రిందఁ బడవైచి పోయెనా? క్రిందఁ బడనీకుము. స్తనతటపరిపీడనపరిచితస్పర్శంబును బ్రసారితకరయుగళజనితంబు నగు నంజలిపుటంబునం బట్టుకొనియెద. (అట్లుచేసి) హా! వైదేహీ! సీతలమాత్రము మిగిలియుండెనా (సకరుణముగ నాలోచించి)

గీ. పడుచు త్రాఁచువంటి జడయును మారు ను
య్యేలలవంటి శ్రుతులు నిండువిల్లు
తూపులనఁగఁబోలు చూపులు నిండు జా
బిల్లివంటి మోము బెడఁగు నవియె.

హా ప్రియురాల! విదేహరాజనందని!

మ. నెలకింకం జిగివచ్చు లేళ్ళకనులుం దీర్ఘంబులౌ నింకఁ గో
కిలకుం బల్కులతీపి గల్గు నిఁక రక్తి భూజము ల్పల్లవం
బు లిఁకం దుర్గమమైన రావణుగృహంబుం జొచ్చితో యెట్టి యి
మ్ములలో నుంటివో మాల దుర్విధిమొగంబుం జొచ్చితో జానకీ.

(సవిశేషకరుణముగ)

గీ. నాయెదుట సీతతలద్రుంచినాఁడు పఙ్క్తి
ముఖుఁడు, కన్గొనుచుండఁ గన్మొఱఁగినాఁడు
నిష్ఫలములయ్యె మారుతి నీరరాశి
దాఁటుటయు నాదు సేతుబంధమ్ము నకట!

(అందఱును దుఃఖమభినయించుచున్నారు)

లక్ష్మ— (కోపముతో) ఓరీ సమరకుంఠ! కుంఠ! దశకంఠ!

గీ. సీతమృతి నింధనంబుగఁజేసి నీవు
రవులుకొల్పిన మాశోకపవనకీల
లింకఁ జల్లార్చురా రామునిషుగణంబు
నీకళత్రము లేడ్చుకన్నీటిచేత.

రామ— (అవస్థకుం దగినట్లు కూర్చుండి) మిత్రమా సుగ్రీవ! వయస్య విభీషణా! రావణుని జంపుటకై వత్సలక్ష్మణుని చేఁ బ్రతిజ్ఞ చేయింపఁ బడితిమి వింటిరా!

లక్ష్మ—ఏమిది యాశ్చర్యము! తెగిపోయియుం సీతతల మాటలాడుచున్నది! సమీపమునందుండి విందము రండు. (అందఱు నాశ్చర్యముతో దగ్గఱకుఁ బోయి విందురు.)

శుల— గీ. సూత్రధారచలద్దారుగాత్రయైన
యంత్రజానకికంఠంబునందు నొక్క
శారిక నమర్చి పన్నిరి జానకీస్వ
రూపమును రావణుని కాలయాపనకయి.

క. నే నాశారిక మాయాజానకి తలనుండి వెడలి చనుదెంచితి నీ
తో నావృత్తాంతము నిజమైనది చెప్పితిని రాఘవాన్వయతిలకా.

క. జానకి మృతిగనె నని యీ వానరులును నీవునుం బవరప్రం జేత
ల్మాన గలరంచు రావణుఁ డీనాటకఁ బన్నె నిక్కమిది దాశరథీ.

( విని యందఱును సంతోషమభినయింతురు )

రాము— శారికా ! ప్రియకారిణి వగునీకు శుభము. నీయిచ్చవచ్చినచోటికిఁ బొమ్ము.
(అనిపవ్వి) శౌర్యమునందకాక మాయాచాతుర్యమునందును రావణుఁడు
ప్రవీణుఁడే.

లక్ష్మ— ఆర్యా ! కపియూథపతు లందఱు నేఁటిరాత్రి సువేలాచలసానువుల
యందుండి సూర్యోదయమైనతోడనే లంకాదుర్గముం దాఁకుదురుగాక.

రాము—స్వభావకోపియగు రావణుఁడీరాత్రి మనల నెదుర్కొన రాకుండివఁగదా!

( నేపథ్యమునఁ బెద్దకలకలము. అందఱును విందురు)

లక్ష్మ— భైరవాకారుండగు శంకరుని ఫేట్కారమువలెఁ గరాళంబగు నీకలకల
మెచ్చటిది ?

విభీ—(ముందుఁజూచి) గీ. కరిముఖము కృద్ధసింహముఖంబునందు
హయముఖము క్రుద్ధకాసరాస్యంబునందు
జొనుపఁగలవీఁడు దశభుజుండు సింహ
నాదుఁడను దైత్యుఁడే తెంచినాఁడు వీఁడు.

రాము— సింహనాదుఁ డెవఁడు ? ఎప్పుడును వినలేదు.

విభీ— దేవా ! మందోదరి చిన్నకొడుకు. మేఘనాదునకుఁ దమ్ముఁడు.

రాము— వీఁడు దశభుజుఁడు కావున రావణునిలో సగమంశ మున్నదనుము

విభీ— ఆకారముచేతనే సగమంశము పరాక్రమమునందు రావణు నినుమడించువాఁడే.

ఉ. ఏపునఁ జంద్రశేఖరగిరీంద్రము కేలఁ గదల్చినాఁడు లం
కాపతి మేను జల్లెడగఁ గాసిలఁజేసిన నందిముఖ్యులన్

దూపుల బిట్టడంచి రణధూర్వహాతం డనతండి కెవ్వఁడ
య్యాపదఁ బాపె వాని ననయంబు స్మరించెద సింహనాదునిన్.

(యథానిర్దిష్టముగ సింహనాదుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

సింహ— (ముందుఁ జూచి) వానరసేనాధిపతులందఱును దాపసులవలె నెదుర్కొ
ను చున్నారు.

రామ— ఆకటికిఁచీఁకటివలె నున్నవాఁడేనా సింహనాదుఁడు ?

విభీ—ఔను వాఁడే సింహనాదుఁడు.

కపి—దేవా! విస్ఫురిత భీమభుజదండంబులును విస్తీర్యమాణతారతరగళగర్జితంబులును
ఘాయానిర్జితపరిపక్వపనసఫలంబులును బిళంగీకృతగగనాంగణంబులును నీల
ప్రభానీలితదశదిగంతంబులును గిలకిలారవభరితదరీముఖంబులును నగు మన
వానరబలంబులు మానును ప్రేరేప సింహనాదున కభిముఖముగా నడచుచున్నవి.

దధి—సింహనాదుని దైదుమొగంబులొక్కసారి సంక్షోభమును బొందినవి.

కపి—రెండుచేతు లప్పళించి పెద్దహుంకార మొనరించి సింహనాదుఁడు దేవతానుంద
రులు చల్లుపుష్పములు క్రిందఁ బడకుండఁ బుడమినుండి పరాగంబు పైకెగ
రకుండ రవికిరణంబులైనఁ జొరకుండ బాణవర్షము కురిపించుచున్నాఁడు.

సింహ—(ముందుజూచి) ఓప్లవంగపశువులార !

గీ. నాకుఁ గలయుద్ధశక్తి సహస్రమూలకు
మీర లెదిరించినంత నేమియగునార
రాముఁ డొకవీరుఁడఁట తత్పరాక్రమంబు
చూడఁగావలె నాతఁడెచ్చోటఁ జెపుడ?

(మరల ముందుఁగని) ఈవానరకీటకోటులనుజయించిన నేమిఫలము? (చేయిపైకెత్తి)

గీ. అనియొనర్చెద నొక్కపెట్టున ధనువు
లేను ధరియించి, గెలువుఁడో యేనుచేతు
లార ! సుగ్రీవమారుతిలక్ష్మణులను
రామునంగదుఁ; దక్కువారలను వలదు.

(మరల ముందుఁగాంచి పెద్దనవ్వునవ్వి) వానరయోధపతులందఱు తోఁకలెగనెత్తి
పరువెత్తుచున్నారు. (బిగ్గరగా)

గీ. కష్టపడి కట్టుకొన్నట్టి కట్ట కలదు
త్వరగవచ్చినదారి మీవాసములకుఁ
బొండు సుగ్రీవమైందద్వివిదకపీంద్ర
తనయనీలద్వివిదనలతారులార.

రామ— వత్స లక్ష్మణ! వీని మాటలు బహుంచిత్రములుగా నున్నవి!

లక్ష్మ— (గర్వముతో నెదుటికివచ్చి) ఓరీ వికృతాకార! దురాచారా! నరమాంస కబళనదక్ష! రాక్షసాపశద. చాలఁబ్రల్లదములు పలుకుచున్నావేమిరా? ఎన్నఁడును వీరులయందు పెత్తనంబు నట్లున్నావు!

సింహ— (వినక వానరులఁ దలుచుచు ఓప్లవంగపశువులారా! "గీ. నాకుఁగల యుద్ధశక్తి" అనుపద్యము చదువుచు)

రామ— నెబాను సింహనాద! వీరపరిష్వండగు దశకంఠుని సిగ్గుపఱచుచుంటివి.

సింహ— (అభిముఖముగా నిలచి)

గీ. రామ! నుం దస్మదీయశరప్రయోగ
విధికిఁ బాలైతివేని జీవింప వీవు
కాన ముందుగ నీయాశుగంబు పఱపు
మోరి నీదెబ్బ రుచిచూడఁగోరియుంటి.

రామ— (ధైర్యముగా నిలువంబడి చిఱునవ్వు నవ్వి) ఓరీ సింహనాద!

క. నీతను విది చూపఱకుం గౌతుకముగఁ బుడమినుంచకయె నీమంత్రు
ల్నీతండ్రియు నీయన్నయు నీతమ్ములు నిన్ను ముం దనికిఁ బంపిరిసీ!

సింహ— ఓరీ! రామ! చాలగర్వింపకుము. ఇంతగర్వమునకుఁ గారణములేదు. నీ చరిత్రలు విన్నమాకును సిగ్గగుచున్నయది.

గీ. పడతితాటక విప్రుండు భార్గవుండు
మృగము మారీచుఁడును వనమృగము వాలి
ఓరి నీవు జయించిన వీరుఁ డెవ్వఁ
డైనను మదించితేని విల్వాను మెదిరి.

లక్ష్మ— (నవ్వి) గీ. ఆఁడుదే యౌను దాటక యైన దాని
జంపుటకుఁ గారణము మానిపంపుసుమ్ము
మృగమనెడుమాట నిజమె మారీచుఁ డైన
రాజయినవానికెల్ల ధర్మంబు వేఁట.

బ్రాహ్మణుఁడగు పరశురాముని జయించుటకుఁ గారణము మావైతాళికుఁడే 'అనిజంభునిజంపిన యింద్రుఁ' 'అని చెప్పియున్నాఁడు. ఇఁక వాలిని జంపుటకు సమాధాన మొక్కటి చెప్పవలసి యున్నది.

రామ—లక్ష్మణా నీవూరకుండుము. దానికుత్తరము నేను చెప్పెదను.

గీ. క్రోఁతి యని వాలినవకుము కోఁతులుంగు
నమలినం బగు నీతండ్రిశాపము గూడ
వాల్గునారాసులను ముంచి నాన్సెఁగా జ
చంకలో నొక్కిపట్టి నీజనకు నతఁడు.

సింహ—(క్రోధముతో] ఓరోరీ కపట్రాయా! మాతండ్రి నాక్షేపించుచున్నావు. !
ఇదిగో వాఁడియమ్ముల నీప్రాపుమాపుచున్నాను.

రామ—(విల్లెత్తి) ఓరీ రాక్షసపోత! నేనుమాత్రి మూఁకుందునా, లంకాపురీపరిసర గోపురములయందుండి చూచుచున్న పౌరజను లందఱు మనసంగర విశేషములను బెదరుదురు. కావున నావలికింబోయి యుద్ధము చేయుదము రా.

(అని యందఱును నిష్క్రమింతురు)

ఇది......శ్రీతిరుపతి వేంకటేశ్వర విరచితంబగు నాంధ్రబాలరామాయణనాటకమున సప్తమాంకము.

శ్రీరస్తు.

# బాలరామాయణము

## అష్టమాంకము

(పిదప సుముఖదుర్ముఖులను నిరువురు రాక్షసులు ప్రవేశింతురు)

సుము — సఖా! దుర్ముఖ! మన రావణ మహారాజునకు గొప్పసహాయలోపము తటస్థించినది. కుమారసింహనాదుఁడు గతించెఁగదా! ఆయనను శోకామగ్నంబులపాలుగాక తులాద్యూతమునను నొకటి వచ్చె, యందును బరాభవముఁ జెంది పందెముగా నిర్ణయించుకొనిన సీతాసమర్పణంబును లంకాధిపత్య పరిత్యాగంబును జేయఁడాయె.

దుర్ము — ఆర్య! సుముఖా! స్వామినియోగము ప్రతిదినము వలె నిరువురను, "అంగదునకును నరాంతకునకును జరుగు యుద్ధములోని విశేషము లరసి నాతోఁ జెప్పిన నేను సీతాదేవితో విన్నవింతును" అని నియోగించుటయే యెఱుఁగుదును గాని వారిపోరాటమునం దగిన కారణ మెఱుంగను, నీకుం దెలిసినఁ జెప్పుము.

సుము — మన రాజు శుకసారణులను రాము నొద్దకుఁ బంపఁగా వారేగి, రామునితో మనము వానరబలమును రాక్షసబలమును వ్యర్థముగాఁ జంపుకొనుట భావ్యము గాదు. తులాద్యూతమువలన జయాపజయములు నిర్ణయించుకొందము. పందెమేమనఁగా—

గీ. అందు నీవాఁడు గెల్చిన నవనిజాత
నీకళత్రంబు లంకయు నీయధీన
మగుట, నావాఁడు గెల్చిన నవనిజాత
నాకళత్రం బయోధ్యయు నాదియగుట."

అని రావణుని మాటలుగా విన్నవించిరి.

దుర్ము — తరువాతఁ దరువాత.

సుము — తరువాత రామభద్రుండును బ్రహ్మకు ముమ్మనుమండను రావణుఁడు చెప్పినట్లే జరుగ వచ్చును అని ప్రత్యుత్తర మిచ్చెను.

దుర్ము — తరువాత తరువాత.

సుము — తరువాత సౌమిత్రి సుగ్రీవ విభీషణ జాంబవ దాంజనేయ ప్రభృతులందఱును వలదని నివారించినను రాముఁడు తనవైపున నంగదు నంకకారుఁగా

నియమించెను. రావణుఁడును దనవైపున నరాంతకు నంకకారునిఁగా నియమించుకొనియె.

దుర్ము—తన భుజపరాక్రమ మెఱుంగకయే మనరాజు లంకాధిపత్యమంతయు నరాంతకుని నీపుమీద నుంచినాఁడేమి ?

సుము—తెలివితక్కువపనులు చేయుటయందు మనరాజుగారగ్రగణ్యులుగదా, యింతేకాదు.

గీ. సింహనాదుఁడెపుడు మడిసెనో స్వశక్తి
యెపుడు వమ్మయి పోయెనో యపుడె రామ
చంద్రునకు సీత నిచ్చుట సముచితంబు;
రాజమోహంబచుమి కాలరాత్రి మనకు.

దుర్ము—యువరాజు మేఘనాదుఁ డేమయ్యెనో.

సుము—ఏమయ్యెనా,

చ. నడి నిశి వేళ రాఘవుల నాగశరంబులఁ గట్టినాఁడు క
న్పడ కనిసేయు శేగ్వరి నభంబున నుండిరెాః నిత్యజైత్రమై
వెడలురథంబునాఁ డొరుల వేఁడక యగ్నినె కొల్చువాఁడు బి
ట్టడలి యడంగె రాఘవభయంబున నొక్కెడ మేఘనాదుఁడున్.

చ. జలనిధి చుట్టు నుంటఁ జొరశక్యము గానిది లంక, దేవతా
లలనల యూడిగంపుఁ బనులంగొను రావణుఁ డేలు దానిఁ గోఁ
తులబలగంబుతో వెడలి తోయధి కడ్డముఁ గట్టి వాని దో
ర్బలమున గెల్చు మర్త్యుడఁట రాఘవుఁ డక్కట సిగ్గు సిగ్గుగున్.

దుర్ము—నిజము నిజము. చర్మేంద్రియములకు గోచరము గాని సంగతి యార్యులకుఁ బొడఁగట్టినది.

సుము—చాలుఁ జాలు. రాజవిరుద్ధము లగు మాటలు చెప్పకొనరాదు. మనపని మనము నెఱవేర్చుకొందము.

దుర్ము—త్రిజటమ్మగారు మనరాకకై యెదురు చూచుచున్నది. అచటికే పోదమురా (అని నిష్క్రమింతురు)

(పిదపఁ ద్రిజట ప్రవేశించును)

త్రిజ—(ఔత్సుక్యముతో ముందుఁజూచి) ఓహో! సుముఖదుర్ముఖులా! త్వరగా రండు, యుద్ధవృత్తాంతము చెప్పుడు.

సుమ—స్వామిని త్రిజటా! లంకకుఁ దూఱుపు వైపున సువేలాద్రికిఁ బడమటి వైపు నునగు రత్నాకువాటంబునఁజూపఱందఱును సమంబుగాఁ జూచుటకై క్రమ క్రమోన్నతంబులగు మంచంబు లలంకరింపఁబడినవి. అందుఁ దూర్పువైపున సపరివారుండగు దశాననుండును బడమటివైపున సపరివారుండగు రాముండును గూరుచుండిరి. సద్దుచేయకుండ వానరబలంబునకై నీలుండును రాక్షసబలంబునకై ప్రహస్తుండును నియోగింపఁబడిరి. అందఱు నిట్లుండ దేవతాంగనలు విమానంబునుండి చూచుచుండ నంగదనరాంతకు లిరువురును గత్తులు చేతఁబూని రణరంగమునం బ్రవేశించిరి. తరువాత.

గీ. మువ్వరుస రత్నకంకణముల ప్రకోష్ఠ
మమరను గంధంపుమేనిపూఁతలుగలట్టి
యంగదనరాంతకులరూప మరయ ననిమి
షత్వమును మెచ్చుకొనిరి యప్సరసలెల్ల.

త్రిజ—తరువాతఁ దరువాత.

సుమ—తరువాత నీలప్రహస్తులు మంచంబులు దిగి బరాబరులు సేయుచు సేనలు మాయకుండ నడుమ నెడము గలుగఁ జేయుచుండఁ బ్రత్యాలీఢపాదంబులతో నాయంకకారు లిరువురు నెదుర్కొని మండలాకారంబుగ రణాంగణంబునం దిరుగఁజొచ్చిరి.

త్రిజ—తరువాతఁ దరువాత.

దుర్ము—తరువాత వారిరువు రందముగా మరలి తిరుగుచు నుపరితాడనంబులు లాఘవంబుగాఁ దప్పించుకొనుచు నొండొరులం బిలచికొనుచు వీరాలాపంబులాడుకొనుచు దృష్టులువంచించుకొనుచు శస్త్రక్షతములగు శరీరంబులు రక్షించుకొనుచు, నొక చోటఁ గొట్టునటు లుంకించి మఱియొకచోటఁగొట్టుకొనుచుఁ బెద్దలపేరు లుగ్గడించుకొనుచు బిట్టుచిత్రముగాఁ బోరిరి.

త్రిజ—తరువాతఁ దరు వాత ?

సుమ—తరువాత

అ॥ వాలినందనుండు ప్రహరించి నపుడెల్లఁ గీశసేన సేసెఁ గిలకిలంబు
రావణాత్మజుండు ప్రహరించి నపుడెల్ల పోకుమూఁక చేయఁ బొచ్చెగోల.

త్రిజ—తరువాత తరువాత ?

సుమ—తరువాత నాయంగదనరాంతకు లిరువురును,

క. సొగసుగ నడ నడచుచు సొగసుగఁ గనుఁగొని యాక్రమించి చూచుటయును
మున్నుగ గతులన్నియుఁ గడు వేడ్కగ సూచికలయ్యె నంక కాయల కెల్లన్.

త్రిజ — తరువాత తరువాత?

దుర్ము — ఇట్లు సర్వప్రయత్నంబులఁ బోరుచుండ నరాంతకుండు తనవాల వాఁగెడును కాలికి సంకిలి కొట్టి నేలంబట్టుకొనియున్న సమయంబున కోపించు నతఁడె యెత్తుంగ మొం డగు నంగదుం డతని మెడపట్టునఁ గత్తితోఁ బొడువఁ బ్రళయకాలవాయువు చేఁ గూలిన పారిజాతవృక్షము పగిది నాఁడు రజనీచరాంగనల కన్నీటితోఁ గూడ నేలంబడియె. వానరవీరులందఱు శ్రేష్ఠనాదంబు లాచరించిరి. ఉదాన నుని పదిమొగంబులును ముకుళించిన తమ్మిపూవుల చందంబు వహించె. రక్కసులు చూడకుండఁ గరతాళధ్వనులతో నచ్చరలందఱు నవ్వసాగిరి.

త్రిజ — హా వత్స. నరాంతక. యెచటనుంటివి. మాఱుపలుకవేమి? దుర్ముఖా! నరాంతకుఁడు కూలినపుడు దేవతల ముఖచ్ఛాయ లెట్లున్నవిరా.

దుర్ము — శత్రుపక్షమునఁ బరాజయము తటస్థించి నవ్వు దున్నట్లున్నవి. స్వామిని త్రిజటా! ఆక్షత్రియకుమారుని యందు దేవతలకుంగల పక్షపాత మింతింత గాదు. అవును; ధర్మవిజయముగల వారియం దెవ్వరికి పక్షపాతముండదు?

మ. దనుజాచార్యుని యొంటికన్ను బుధసంతానంబు కందోయి భ
ర్గుని నేత్రత్రియ మబ్జసూతి యిరునాల్గుఁ గన్నులుం గేకివా
హను షండేంద్రు విలోచనంబులును జంభారాతి వేగన్నులుం
గని నుల్లాసముతోడ నంగదు భుజాగర్వంబు నింతింతలై.

త్రిజ — తరువాత నార్య దశకంఠుఁడే మనియెను?

దుర్ము — ప్రహస్తునితో నిట్లనియె

గీ॥ అని నరాంతకుఁ డణఁగిపోయెను గదా య
టంచు సమరంబు మాన్పుకుమయ్య తాత
వానరులకును గీర్వాణవైరులకును
జరుగు సామాన్యయుద్ధంబు జరుగనిమ్ము.

త్రిజ — అట్లేని మనరాజుగారు లజ్జాదేవి నావలకు సాగనంపినారు.

దుర్ము — తరువాత విభీషణుఁడు చప్పట్లు గొట్ట రాముఁడు నవ్వఁ గుంభకర్ణుని లేపుటకును నికుంభిలానిర్గతుండగు నింద్రజిత్తును బిలుచుటకును శుకసారణులను బంపి మనరాజుగా రంతిపురిలోనికిం బోయిరి.

త్రిజ — అట్లేని మీరు తరువాత వృత్తాంతముఁ దెలిసికొనుండు నేనిది సీతతో విన్నవించెద.

(అని అందఱును నిష్క్రమింతురు) ఇది మిశ్రవిష్కంభము.

(పిదప నిరుప్రక్కల నిరువురిరువురు బరిచారికలతోడను వేత్రవతితోడను సుప్తోత్థితుండగు రావణుండు ప్రవేశించును)

వేత్ర— (తనలో) ఏమీ! దశకంఠదేవునకుం దటస్థించిన యవస్థ, యీకేళీవిమానమునందే రత్నాట్టాలకంబునం బ్రొద్దుగ్రుంకినది మొదలు వేగుపఱుపం గన్నుమూయకుండ రజనీరణం బాలోకించి కించిత్కాలము విశ్రమించి మరల దివాయుద్ధమునుం జూచుటకై చనుదెంచె ఇప్పుడును కొంచెము నిద్రచే మ్రాగన్నుపడుచు నేదియో మనంబున నాలోచించుచున్నాఁడు.

రావ— భద్రురాలా, వేత్రవతి! ఎవనికి దేనియం దభిరుచిమెండగునో వాఁడుసర్వదా దానికే లొంగియుండును నన్నుఁ జూడుము, రాత్రియుద్ధముఁ జూచుటచే మిగుల డస్సియు మరల దివాయుద్ధముం గాంచుటకై చనుదెంచితి (అని యాకసము వంకకుంజూచి) దేవతలందఱు వేగముగఁ బరుగెత్తుకొని వచ్చుచున్నారు. పేరులేని రాక్షసులఁ గొందఱం జంపిన తాపసక్షత్రియు నభినందించుటకై కాఁబోలును,

ఉ. వేల మూడంబు మీకు బలహీనులు దైత్యులు కొందఱీల్గినన్
వేలుపులార రావణుని విక్రమ మింకటిలోనఁ బోయెనే
కూళతనంబుమానుఁ డిదిగో! చనుదెంచెద రింద్రజిత్తు, ని
ద్రాళిసవృత్తి లోకముల నాఁకలికింగొను కుంభకర్ణుఁడున్.

వేత్ర— దేవా! రాజు లవసరసంతోషణీయులు కావున నుచ్చావచసంచారములతో వేల్పులు దేవరసేవకై చనుదెంచుచున్నారు.

(తెరలో)

ఓలంకాపురీప్రాకార పాలకులారా! వలీముఖసైన్యమువచ్చి మీపురమంతయుఁ బాడుచేయుచున్నది. కాచుకొనుండు. తోరణములు తెంపుచున్నారు. జాగ్రత్త! రాక్షసకబంధములతోఁ బూడ్చిన యగడ్తను మరలఁ ద్రివ్వికొనుఁడు. బంగరు పలకలూడఁ గొట్టిన గుమ్మములన్నియు బాగుచేసికొనుఁడు. కంటకిద్వారమును మరల నేర్పఱచుకొనుఁడు. పడిపోయిన ప్రాకారపుందారులు పూడ్చుకొనుఁడు. విఱిచిన యట్టుకలును బాడుచేసిన పరాండికలును మక్కలైనయంత్రంబులును నికుంచితంబులగు కాంచనికలును మరల నలంకరించుకొనుఁడు.

రావ— (వినినవ్వి) అరరే ఇదియంతయు సత్యమా, అసత్యమా! అసత్యమే. మన దుర్గము మనుష్యులకు సుగమ్యముగునా! అయిననేమి

గీ. అఖిలదేవభయంకరమైన మామ
కీర్తదోర్మండలం బుండఁగాని లంక
కేల ప్రాకారలోపంబు హీనదశయుఁ
గలుగుఁ? గలిగిన నిదియు ప్రాకారమగును.

(రాక్షసులను దేశించి సాక్షేపముగా) ఓకీకరం. క. ఓకీకంకాళిక. కుంభకర్ణుని లేపుఁడు మేఘనాదుని పిలువుఁడు

(కరాంకకకంకాళికు లెదుటికివత్తురు)

కరం—(జనాంతికముగా) ఒసీ కింకాళిక! రాజు కుంభకర్ణునిఁ బ్రబోధింపు మను చున్నాఁడు కాని యింకను తన యాత్మను ప్రబోధించుకొనలేదు మన మెంత కష్టపడి లేపినను మరల రాక్షసనిలయఁ గుంభకర్ణుఁడు పెద్దనిద్దుర పోకమానఁడు.

కంకా—కుంభకర్ణుఁడే కాఁడు; విభీషణుఁడు తక్కఁ దక్కినవారందఱికి నిదియే గతి.

కరం—అవును. (తనలో రావణుని దేశించి)

మ. అతిగర్వంబున మించు నీభుజము లేలా, కాల్పనా! పార్వతీ
పతికై కోసి శిరంబు లిచ్చిన భవద్వక్త్రంబులుం గత్తిరయుం
గతి లేదా! నిదురించువానికయి యాకాంక్షింతు వీవక్కటా?
యతఁడా! సాయముసీకు, విస్మృతశరవ్యాసంగుఁ డోరావణా.

రావ— ఓసుముఖ దుర్ముఖులారా! మీరు మేఘనాదునకును, కనిష్ఠ తాపసక్షత్రియులకును జరుగుపోరునందలి విశేషము లెప్పటికప్పుడు తెలుపుచుండవలయును.

(దేవా నిత్తము అని వారిరువు రెదుటికి వత్తురు)

సుము—(జనాంతికముగా) ఓయీ! దుర్ముఖా! ఆలక్ష్మణుని పరాక్రమంబును గొప్పదియే. ఏమన నిక భిలానిర్గతుండగు మేఘనాదునకుఁ గూడ నిట్లు కబురు పంపించినాఁడఁట

ఉ. అమ్మలు తేరు విల్లుఁ బచమబ్బెను నాకు నికుంభిలాప్రియా
గమ్మునఁ గాన జయమ్ముఁ డను గాసని యెంచకు మిందజిత్తు! నీ
తమ్మను బాసి వ్యాకులితమైన మదిందగు రామచంద్రుకో
పమ్మను బాపి యేన నినుఁ బంతమునిూలఁగ రూపుమాపెదన్.

దుర్ము— అగును, విరాధ ధ్వంసికిఁ గడగొట్టు తమ్ముఁడు గదా. చంద్రునితోడఁ బుట్టిన యమృతమునకుఁ జంద్రునికంటెఁ దక్కువ గుణములుండవు.

సుము— వీరగోష్ఠిప్రసంగములయం దిట్లు చెప్పుకొనుచున్నారు.

మ. తలుపుల్మూసిరి భీతి భోగవతిఁ బాతాళంబునం జేవకాం
తల యోష్ఠంబుల లేఁతనవ్వులను సన్యాసంబు ప్రాపించె నే
యలఘుం డెక్కటిఁ బోరువేళ నతఁడాహా! మేఘనాదుండు శ
త్రులఁ దుర్వార నికుంభిలాగుహఁ దపోరూఢిం బ్రవర్తించు నే.

కరం— (పురోభాగమునకుం జూపునిగుడించి.)

ఆ. కంకణంబులచప్పుడు గాకయుండఁ దొత్తులై చేల్పుటాండ్రు కాళ్లొత్తుచుండఁ
కుంభకర్ణుఁడు వడి బుసకొట్టుకొనుచు నిదురపోవుచు నున్నాఁడు నిట్టవాడిచి.

కంకా— బాగుగ వర్ణించితివి. కుమార కుంభకర్ణుఁ డిప్పుడు నిద్రానంద మనుభ
వించుచున్నాఁడు.

రావ— నిక్కముగ తమ్ముఁడు భగవంతుండగు పద్మయోనికంటె మిన్నగాఁ
దపముఁజేయు భంగి నిద్రానందములో నున్నాఁడు.

మను— (రావణుని చెవిలోఁ జెవియొగ్గి)

క. రణభూమి విడిచి యైరావణమవ్వలికేగ నింద్రు బంధించి ధను
ర్గుణమును మ్రోయించి భవత్ప్రియసుతు గన్నట్టి కొడుకు వచ్చెంబోరన్.

గీ. పర్వులయరుదుని ఫేట్కారపటిమఁబోలు
మేఘనాదంబు వినుచు సౌమిత్రి వచ్చె
నాఁడు మనలంకఁ గాల్చినపోగ్రుడ బాహు
బలయుతుండగు హనుమ వార్యంబుగాఁగ.

దుర్మ— ఓహో! దేవ! నీవు మార్తాండపులస్త్యకులములు రెండును సందేహ
డోలపై నూఁచుచున్నావు.

గీ. కుడిమొగమునైదు శ్రీరామ కుంభకర్ణు
లాచరించెడు యుద్ధంబు చూడఁగాక
మేఘనాదునితోడ సౌమిత్రి సేయు
కలను గనఁగాక నెడమమొగంబులైదు.

కంకా— అట్లైన మనము కుంభకర్ణుని లేపుదము రా,

కరం— లేపుటకుందగిన యుపాయ మేదియో నాకుం దోఁచదు.

కంకా— పదునెన్మిదికోటుల పాములును రావణుని సేవకై వచ్చియున్నవికదా!
వానిలోఁ బెద్దపెద్ద పాములకు నియోగింపుము.

కరం— మంచియుపాయము దొరకినది, పాములు తమ మేనుల నతని మేనితో పెన
వైచికొని లేపఁగలవు (అని కొంచెము బిగ్గరగా)

గీ. తక్షకుఁడు లోమ్ము సర్పశతంబుతోడఁ
చెవులఁ గర్కోటకుండు నాసికను వాసు
-కియును గాలియసర్పంబు గ్రీవ నిట్లు
చుట్టుకొనుఁ డయ్య కైకసీసూనునొడలు.

రావ— ఈపాములు చుట్టికొనిన నాశమ్మునకుఁ దామరతూండ్లు చుట్టినచందముగా నుండును. ఇంతమాత్రమున లేమనా?

కంకా— సఖా. కరంకక! మన మనోరథములన్నియు వ్యర్థమనోరథములే. మహాఫణీంద్రము లతనిం గించిత్తైనం గదల్పలేకపోయినవి.

(పడమటివైపునఁ దెరలో)

గీ. మయుఁడు తాత వచించిన మాయలెల్ల
మాయమైపోయెనకట యీమర్త్యులయెడ
తండ్రి నేర్పినదారుణాస్త్రంబు లింక
లలిఁ బ్రయోగింపనట్టి కాలంబువచ్చె.

రావ— వత్సా! మేఘనాద! యేల విచారపడెదవు. మాయలన్నియుఁ జేతగాని వానికిఁగాని నీవంటి నిష్కారణ వీరునకుఁ గావు.

దుర్ము— కిలకిలమను కోఁతి నెక్కి కేల విల్బూని మేఘనాదుని యెదురఁగనిష్ఠతాపసుఁ డేమోమో ప్రల్లదములు పలుకుచున్నాఁడు.

కంకా— ఇఁకఁ గేళీవిమానమందలి రత్నాట్టాలకమునకుఁ దగ్గఱనుండు పర్వతంబులు మీఁదఁ బడవేయించి లేపుదము.

రావ— (నవ్వి) వీరి యూహ పిచ్చియూహ. ఆపర్వతంబులు కఠోరంబగు తమ్మదేహము సోకి బంతులవలె నెగురును గాని యావంతయుఁ బనిచేయలేవు.

కంకా— పర్వతంబులన్నియుఁ ద్రాడునకు గుచ్చిన ముత్యములవలె నల్లల్లాడినవి గాని కార్యకరములు కాకపోయినవి.

(పడమటివైపునఁ దెరలో)

మ. వదలుము మాయ, కౌతుకము పాయక పోరుము, నిన్ను వేలుపు
స్మదితలు పెండ్లిచూడుదురు; ఘన్నుల మీఖుఁ డన్న సేనలో
నెదురఁ దదీయరక్తమును నింపుగఁ ద్రావిన నాయలుంగు లీ
యదనున నీదురక్తమును నాగళముం గబలించుఁ గావుతన్.

రావ— ఔరా! యీలక్ష్మణుఁడు కుమారమేఘనాదునకుం దగనికూఁతలు కూయుచున్నాఁడు. కానిమ్ము వీనిం గుమారుఁడే శిక్షించుఁగాక.

(మరలఁ దెరలో) ఓరీ కనిష్ఠకుక్షత్రియతాపస.

గీ. బుద్ధిమంతుఁడననుచు నీపాంత దార
నునిచిపోయిన గాని నింకొకఁడు వచ్చి
యెత్తుకొనిపోవఁ జవటవై యొత్తిగిలిన
చెవఁటి పని సేయుపొంకె లజ్జింపవేల.

సుషు.— (నేపథ్యమువంకకుం జూచి) ఇంకను నుత్తరముఁ జెప్పుచున్నాఁడే మో.

( తెరలో )

ఓరీ బ్రహ్మరాక్షసుఁడా ! నీకు వీరజనమర్యాదలు తెలియవు. అసాధ్యకార్యముల పట్ల శస్త్రధారణ విడంబనయగును గాని యిట్టిపట్ల నలంకారమేయగును.

రావ— ఏమీ! మనుష్యుల పొగరు. కుమారమేఘనాదునితోఁగూడ వీరవృత్తమందు యుక్తిచమత్కృతులు చెప్పుచున్నారు.

కంకా— (మఱియొకవంకకుంజూచి) మిత్రమా! శఠంకక! సురగళద్దానవారి ప్రవాళితగండమండలంబులును గళకుహాకుహారనిరర్గళఘుంఘుమారావంబులు నగు దిక్కరులను కుంభకర్ణుని లేపుటకై నియోగింపుము.

కరం— మంచిది. ఓదిక్కరీంద్రములారా.

గీ. కొండచరికలలో వవ్రితాండవంబు
సలుపునాఁటి భవద్దంతబలము నేఁడు
ద్విగుణముగఁజేసి లేపుఁడీ దేవవైరిఁ
గుంభకర్ణునిఁ బగరమూర్కొనుట కొఱకు.

రావ— ఇది యుక్తమే, దిక్కరులవఁగా జంగమదుర్గములుగదా.

కరం— దేవా ! యిది చూడఁదగినది.

గీ. దిగ్గజంబులు నాలుగుదిక్కులందు
రొమ్ముపై కెక్కి ద్వంద్వయుద్ధమ్ము సేయుఁ
గుంభకర్ణుండు కటకటా గుఱ్ఱువెట్టు
కొనుచు నిద్దురలేవఁడు కొంచెమైన.

కంకా — (నవ్వి) దిగ్గజంబులచేష్ట లన్నియుఁ మనవానియెడలఁ జెవిటివానియొద్ద సంకూదినట్లాయెను.

ఇంద్రజిత్తు— (దక్షిణమునైపునఁ దెరలో) ఓరీ ! దుర్ముఖ ! లక్ష్మణ !

ఉ. రావణితోడఁ బోరుటకు రాముఁడు నంత సమర్థుఁడంచు నే
శ్లాఘల వింటి. నీ పతనియట్లుగ శౌర్యము చూపరాకురా

కేవల మన్నదమ్ముల కొఱకె దనభాగము వచ్చెఁగాని మూ
ర్ఖా! విలువిద్య వచ్చునటరా! యనిలోపల నేఁ బ్రమాసఁగన్.

లక్ష్మ—(తెరలో) ఓరీవాచాల! వృథాభిమాన! మేఘనాద!

గీ. తలలు తెగఁగోసికొని పురాంతకునిఁ దృప్తి
పఱచి లంకాధిపత్యంబుఁ బడసెఁ దండ్రి
యనును నీకేమి పరువురా? యరుణమణులు
గాక రవికాంతి స్ఫటికము ల్కారఁగు టెట్లు?

ఇంద్ర—(తెరలో) ఓరీ విరోచనకులపాంసనా! కేరళీతనయ! లక్ష్మణ! లంకా
యువరాజును గణపిత్రియుఁడు నగు నింద్రజిత్తు నెఱుఁగకున్నావు. ఇదిగో
నెఱుఁగఁ జేసెదను.

లక్ష్మ—(తెరలో) ఓరీ పులస్త్యకులకళంక, ఇద్ధయుతంబులకోడుక. రామచంద్ర
సేవకుఁడగు సౌమిత్రి నెఱుఁగకున్నా విదిగో నెఱుఁగఁజేసెదను.

సుము—దేవ! లంకాధిపతీ! ఇంద్రజిత్తును సౌమిత్రియు నొక్కొకరినొక రాక్షే
పించుకొనుచుండఁగనే—

గీ. కాఁడలేని నల్లగల్వ లాకాశవా
పికను నెఱుఁగఁ జేయు వేడ్కకాంద్రు
కేరుచున్న సేన క్రీఁగంటిచూపులు
వేలకొలఁది నిండె విశిఖరాశి.

లంకా—కరంకక! కుంభకర్ణప్రబోధమునకై మనుష్యుం గొందఱ నంపుము.

కరం—మీరేమి చేయఁగలరు, ఈశ్వరారాధనంబు దక్క మనకు వేఱుదిక్కు లేదు
(అని పరమేశ్వరు నుద్దేశించి)

గీ. నంది మద్దెల వాయింప నాగముఖుఁడు
చదువఁ జండిక యట్టహాసంబు చేయ
డమరుకపుమోఁతతో నీవు డాయవచ్చి
రావణానుజు లేపుమో దేవదేవ.

లంకా—(తనలో) ఆఁ! కుంభకర్ణుఁడు లేచిన వాళ్ళు నీళ్ళలోఁ దేలి సారకాయలు
మునిఁగిపోవును.

ధూమ్ర—(కుడివైపున) దేవా! లంకాపరమేశ్వర! మేనువాద లక్ష్మణుల నసుప
ఠించి వచ్చు రాక్షసనాయకవరశీరులకుఁ బెద్దయుద్ధము జరుగుచున్నది.

సుము—దేవా! అతిభీషణముగా జరుగుచున్నది చూడుము.

గీ. చాపములు చక్రములును సేజాలుఫూని
యల్లవీరులు చిత్తంబు లుల్లసిల్లఁ
బోర, మెయిమీఁదఁ బడు కత్తిపోటుతోడఁ
బడు సురస్త్రీల పూదండజడులుగూడ.

కంకా—(ఎడమవైపున దుఃఖముతో) దైవమా! యీకుంభకర్ణుఁడెట్లు లేచునోగదా.

కరం— (ఆలోచించి) ఆఁ! తగినయుపాయము దొరకినది

చ. బలిసిన గబ్బిగుబ్బ లెదపై బిగియారఁ గదించి వేగమో
వెలఁదుకలార! యీభువనవీరుని లేపుఁడు కుంభకర్ణు న
గ్గలముగు పైఁడికుండల చోకారమునగ్గిన చంటివింటివో
టులఁ బురుపాయితంబులఁ బటుత్వము చూపిన లేవకుండునే.

రావ—మాతమ్ముఁడు నిద్రలేచినట్లున్నాఁడే?

కరం—లేచుటయే కాదు. రాముని సమీపమునకుఁ గూడఁ బోవుచున్నాఁడు.

కంకా—పరిజనమువలన వృత్తాంతమంతయుఁ దెలిసికొని రాముని మీఁదికి యుద్ధము
నకుఁ బోవుచుఁ గుంభకర్ణుఁడనుచున్న మాటలు వింటిరా—

గీ. వారిధికిఁ గట్టకట్టినవాఁడు రాముఁ
డంత నేర్పరి నింక నేయమ్మ కనును!
ఈన్న దేనో యనర్థ మిట్లైన్నఁడకట
నన్నకాలమునందు మాయన్న లేపె!

(ఆలోచించి తనలో) స్వభావభీషణుం డగురాక్షసేంద్రుఁ డీమాట వినలే
లేదు, విభీషణుని వృత్తాంత మీకుంభకర్ణుకే మైనఁ దెలిసియుండునా లేదా! (అని
తెరవంకకుఁజూచి) మరలనేమియో కుంభకర్ణుని మాటలు వినఁబడుచున్నవి. (చెవి
యొగ్గి విని) దేవా దశాననమహారాజ! వినుము.

గీ. వలదు చాపంబు తూపులు వలదు వలదు
చక్రమును ముద్గరములు పట్టసములు వలదు
ఆఁకలియుఁ దీఱ వశియింతు కరులఁ గూడఁ
గోఁతిమూఁకను మ్రింగెద గుటుకుమనుచు.

అని యనుచున్నాఁడు.

రావ—సెబాసు వత్స! నిజముగా నాకుఁ దమ్ముఁడ వగుదువు.

దుర్ము— దేవా! కుమార మేఘనాదుని రథము వచ్చుచున్నది

సుమ— (బాగుగ నిరూపించి)

గీ. అవని నంటనిదోటఁ జక్రాగ్రపంబు
లేక సిడమున జలదమాలికల(దుచుచు
నగ్రిచూర్ణితకీశ సైన్యంబు నగుచు
నీకొడుకు తేరు రాజిల్లు నాకసమున.

దుర్ము — వాయునందనుండగు హనుమంతుఁడును నీకొడుకు రథముతో నాక
సంబున కెగసె.

సుమ — ఒక్క హనుమంతుఁడే కాఁడు.

గీ. గుబ్బముల నాఁగఁజేసి యరుక్కఁడుచూడఁ
దోవ వైమానికులనెల్లఁ దోసికొనుచు
నంబుదాంతస్స్రితాంబుప్లుతాంగుఁ డగుచు
నెగసె సౌమిత్రి హనుమపై నెక్కిదివికి.

శరం— (ఎడమవైపున)

చం. అవని ధరింపలేక కమఠాధిపుఁడుం గిటిరాజు దిగ్గజ
ప్రవరులు శేషుఁడుం దగులఁపాటుపహింప ననూరుఁ డబ్జబాం
ధవునిరథంబు భీతిఁ ద్వరితంబుగఁ దోలఁగఁ గుంభకర్ణుఁ డీ
భువియును నాకసంబుఁ దనపూర్వశరీరము నిండవచ్చెడున్.

(తెరలో) ఎవఁడురా యక్కడ! దశాననమహారాజుతో—

గీ. శివునివిలు ముక్కలుగఁ జేసి సీతఁ బెండ్లి
యాడి వాలినిద్రుంచి రత్నాకరంబు
గట్టి సోఁకులఁ జంపించు ఖలునిఁ జంపి
వందనము లాచరింతు నీపాదములకు.

అని మీతమ్ముఁడు కుంభకర్ణుఁడు శపథము చేసె నని విన్నవింపుమురా.

రావ— సెబాసు తమ్ముఁడా! సెబాసు కుంభకర్ణ! నీవట్టివాఁడవే. లేనియెడల
యుద్ధములలో రావణుఁడు నిన్నెట్లు మెచ్చును.

సుమ— (కుడివైపున) దేవా, చూడు. మీకనిష్ఠక్షత్రియతాపసుని యుద్యోగము!

గీ. పాకశాసను విల్లాలి పైఁటకొంగు
ధ్వజపటము చేసికొన్న సీతనయు నగ్ని

కేతనముమీఁదఁగూడ నిశాతబాణ
చయము పడుచుండె నౌర లక్ష్మణుని పొగరు.

(తెరవంకఁ జూచి) సెబాసు మేఘనాద! దశకంఠునియొద్ద ధనుర్వేదము చదివినవాఁడ వౌదువు. దేవా పులస్త్యనందన !

గీ. జలక మాడించె దేని నంజనయు దేని
వాయుదేవుండు మూర్కొనెఁ బ్రియమొదవ
వార్ధి దాఁటినయట్టి యావానరేంద్రు
నెత్తిపై వాఁడె నొకయమ్ము నీనుతుండు.

రావ.— అట్లేని లంకాద్రోహము చేసినందులకును నక్షకుమారుని జంపినందులకుం దగినశిక్ష కావించెను.

సుమ.— ఆహాహా ! ఈమేఘనాదలక్ష్మణు లిరువురచేత—

గీ. కటికిచీఁకటి దిక్కులఁ గ్రమ్మఁజేయు
బాణములు నొండొకొళ్ళపైఁ బఱపఁబడియు
నమ్ము లగుచుండె సురతోత్సవమునఁ జెవిటి
యాలుమగ లాడుకొను రహస్యములపగిది.

శంకా.— (ఎడమవైపున) గణేశ్వరగళగర్జితంబును శంకరడమరుకకోలాహలంబును నాదినూకరారవంబును నరకేసరినినాదంబును గూడ నతిక్రమించు నీరొద యేమయియుండునో ?

కరం.— (చెవులు మూసికొని) దేవా! నిజము. కంకాళకుఁ డన్నట్లే యున్నది.

గీ. దిక్కరులు భీతివడ సర్వదిశలు గూడ
శూలి జడ లూడ హరియు సుషుప్తి వీడ
నంది పొరలాడ రోదసులందు నిండె
యాక్రమించెడు నిద్ధధనురారవంబు.

రావ.— వత్స కుంభకర్ణుఁడు సమీపింప జ్యేష్ఠతాపసుఁడు విల్లుమోయించె నని యూహించెద.

సుమ.— (కుడివైపున) దేవా ! గగనాంగణచారులను మందోదరీసుమిత్రాకుమారుల చరిత్ర మిగులం జిత్రముగా నున్నది. ఇరువుర బాణములు సందులేక యాకసమున నిండియున్నతటిని—

గీ. డాఁగి చూచిరి సిద్ధులు డంగులేక
సంచరించిరి యమృతభోజనులు సురలు

చతులమెయి బ్రక్కనొదిగిరి పడఁతు లఖ్య
సించిరి గణములు శరవిక్షేపవిద్య.

కంకా— (ఎడమవైపున) కుంభకర్ణుఁడు పరిజనము దీసికొనివచ్చిన యుద్ధసాధన
ములను గ్రహింపకయే యేల బయలుదేరినాఁడో ?

కరం— అతఁ డనినమాట నీవు వినలేదా యేమి?
( " గీ. వలదు చాపంబు " అను పూర్వోక్తపద్యమునుం జదువుచున్నాఁడు)

రావ— సత్యము. కుంభకర్ణ! నాకు నీవే తమ్ముఁడవు.

కంకా—ఇది యేమిటి! కాటుకకొండవంటి పొగతోడను, మేరుశిఖరములవంటి
మంటలతోడను సంధ్యాకాలరవిఖండములవంటి స్ఫులింగములతోడను లక్షల
కొలఁది బాణములు మండుచు వచ్చుచున్నవి.

రావ— గీ. తొల్లి యొకవానరేంద్రుని తోఁకనుండి
వీఁడు మనవీఁడు గాల్చినవాఁడు గాన
నేఁడు శరణంచుఁ బ్రార్థించి నేరమునకు
నిష్కృతిగావించుకొనవచ్చె నిజము వహ్ని.

సుమ—దేవా, సౌమిత్రిని దహించుటకై కుమారమేఘనాదుఁడు ప్రయోగించిన
యాగ్నేయాస్త్రమని యీపాదసేవకుఁ డూహించుచున్నాఁడు (అని వ్రేలితో
జూపుచు) ఈపెనుమంటవలన.

గీ, ధాత తనగద్దియను నీటఁ దడుపుచుండెఁ
దారకలతోడ శశి మిన్ను దరలిపోయె
గంగ యమునయు నొకరి నొకళ్ళు కౌఁగి
లించుకొని లేగ వెనకయ్యె మంచుకొండు.

గీ. పేరుకొనె క్షీరములు పాలవెల్లిలోన
రాల్చిగిలె మంచుచెడి శైలరాజమునకు
రవియుఁ దపియించుచుండె గర్భములు పగిలి
కార్మొగుళ్లును పడి వేఁడికండ్లు గురిసె.

కంకా—(ఎడమవైపున) ఇట్లు శ్రీరాముఁడు విల్లు మ్రోయించినపిదప వానరు లంద
ఱును దమాల తాల హింతాల సాలప్రముఖము లగు చెట్లు యుద్ధసాధనంబు
లుగఁ గైకొని వెడలిరి.

రావ— వీరల లెక్కయేమి? మనవానిముందట దోమ లగుదురా, చీమ లగుదురా?

దుర్ము—(కుడివైపున) ఇది యేమిటి? పదిదిక్కులు ముంచు సముద్రమువలె నన్ని వైపులఁ గాలువలు ప్రవహించు కొండవలెఁ బెనువెల్లి యొకటివచ్చుచున్నది.

సుము—అనుమ గీ. త్రిదివసరసుల శాంతాగ్నిదీప్తిఁ జెంద
నగ్ని కాచాంశుకముకంటె నధికమైన
కాంతితో నున్నచోట నేఁడు సలిలమెంత
గండిపడు వారిపూరము దెసలు నిండె.

రావ—ఇవి మేఘములు కేవలగ్నమా యేమి? (విమర్శించి) ఆఁ! తెలిసినది.

గీ. కేళికుళి యగాము మనయింటికెలన నున్న
వాని నేసెల్లు గుటిచేతు బాణములకు
జానకీవిరహాగ్నిని శాంతపఱుప
వచ్చుచున్నాఁడు వరుణుఁడు వారిరాజు.

సుము—దేవా! కుమారుఁడు ప్రయోగించిన యాగ్నేయాస్త్రము చల్లార్ప లక్ష్మణుఁడు ప్రయోగించిన వారుణాస్త్రమని నేనూహించెదను.

కంకా—(ఎడమవైపున) దేవా! దశాననమహారాజ! తరువాతఁ గొన్నిస్రోతములు మన కుంభకర్ణుని గోటికొనలు తగిలి రోమములూడి పండులవలెఁ బాదములఁ బడుచు మంత్రింపఁ బడినవోయనఁ జిక్కులయందుఁ దగుల్కొనుచుఁ గట్టు బట్టలవలెఁ దొడలను మూయుచు నశ్వసైనికుల కత్తులవలెఁ బిఱుందులపై దొర్లుచు సుజనులవలె మధ్యస్థములగుచుఁ బేదకుటుంబములవలెఁ బ్రక్కల నిలుచుచుఁ దరుణీస్తనములవలె ఱొమ్ములపై విస్తరిల్లుచు జడముడులవలెఁ బృష్ఠముపయి వ్రేలాడుచుఁ జిరకాలమునకు వచ్చినబంధువులవలె మెడలు కౌఁగిలించుకొనుచుఁ జెక్కులనుండి జాఱు జలబిందువులవలె గడ్డముల నంటుచుఁ జుంబనరసికులవలె నధరముపీడించుచుఁ బరిమళమువలె ముక్కు పుటంబులలోఁ దూఱుచు మంచిమాటలవలెఁ జెవిలోఁ బ్రవేశించుచు నిద్రలవలెఁ గన్నులపై మూఁగుచుఁ దిలకములవలె నొసటఁ బ్రవేశించుచు నావరింపఁ బడిన నీచులవలె నెత్తియెక్కుచు విటులవలెఁ గచగ్రహణ మాచరించుచున్నవి.

రావ—కుంభకర్ణుఁ డీప్లవంగయూథపతుల నేమిచేయుచున్నాఁడు?

కంకా—కొందఱిం జంపెను కొందఱికాళ్ళు విఱిచెను. మోచేతిపోటులచేఁ గొందఱిం గూల్చెను. కొందఱి యెముకలు పిండిచేసె. ఘుటికొందఱిం

గుప్పిళ్ళఁబిసికియు నఱచేతులం జఱచియు లెంపలు వాయించియు గుద్దియుఁ దన్నియుఁ బొడిచియు నొడిచియు రూపుమాపెను.

కరం— ఇదియంతయు నిజమే.

క. చేతులచేతం గుద్దుల చేతన్ మోకాళ్ళఁ గాళ్ళచేతను నస్త్ర
వ్రాతాయితాంగుఁడగు నీతమ్ముఁడు క్రోఁతిమూఁక నేలం గూల్చెన్.

మను— (కుడిపైపున నీటిబాధపోయిన ట్లభినయించి) లంకాపతీ! ఒక్కమాటు శత్రుబలమును దనబలమును గూడ నశించునేమోయని సౌమిత్రియే యావారుణాస్త్ర ముపసంహరించినాఁడు.

గీ. బాగుగా మండ డగ్గి యిప్పటికి ధూమ
కలుషితుం డగురవి యొక ల్కడిగికొనియె
నడఁగెఁ జూత్కార మథవుఘాలాగ్నియందు
వారుణాస్త్రపువారి పొంగాఱిపోవ.

కర—(ఎడమపైపున) ఉండియుండి నీతమ్ముఁ డొక్కతటి కోపించి—

కం. చెవులం గన్నుల నాసావివరముల నోళ్ళఁ గల కపిశ్రేష్ఠులఁ ద
ద్వివరములు మూసి హాహారవముల పాల్సేయువాఁ డరాతులు మెచ్చన్.

ఓలంకాపతీ! పౌలస్త్య!

గీ. పులకరించిన మెనులోమములను బట్టు
కొనుచు వ్రేలాడుచుండి మీకుంభకర్ణుఁ
డొడలు విదళించినంతన పుడమి రాలి
యైదుకోట్ల వానరబల మడఁగిపోయె.

దుర్మ—(కుడిపైపున భయముతో) ఏమిది! తైలమిశ్రితమగు కాటుకవలెఁ జీఁకటి చెట్టుమాడిక్కఁ గారుకమ్మ మొగిళ్ళవగిది నెమిలిమెడ చాదిరి నారాయణశరీరమురీతి యమమహిషదంష్ట్రిలభంగి గజముఖదానకర్దమము పోలిక నాకసము నల్లనై భయంకరముగా నున్నది!

రావ—ఎవఁడురా యక్కడ? తమోవిరోధియగు సూర్యుఁ డెంచుచున్నాఁడో తీసి కొనిరండు. (అనియాలోచించి నవ్వుచు)

(తెరలో) గీ. జగ మరామంబుఁ జేసి లక్ష్మణునిఁ జంపి
వానరులఁగూడఁ గెడపి యాపైన వారి
గురువయిన నన్నుసైతము గూల్చు నీ కు
మారుఁడని సూర్యుఁ డెచటికో పాఱిపోయె.

రావ—(మరలనవ్వి) ఇంక సూర్యుఁడు మేఘనాదునియెదుటికి రాఁడు.

సుము—దేవ! నీపవాతీఃవముగు సుముఖుని యూహ విభుఁడు. రణాంగణచారు లగు రాక్షసుల నందఱిని సుగ్రీవారిఁ గాఁజేయ సౌమిత్రి తామసాస్త్రముం బ్రయోగించెను.

గీ. మగనికడ కేగువాండ్రు సంబరము చెంద
జక్కవల్విడిపోకకు జడియుచుండఁ
గనుల కవరోధ ముగుచుఁ జీఁకటులు ప్రూసె
మంటికిని మింటికిని నీలిమందురంగు.

కంకా—(ఎడమవైపున) ఇట్లు ప్లవంగవర్గ మంతయుం గుంభకర్ణతనూకంపముచే ప్రమగ్గ సేనానియగు నీలుఁడు హతశేషు లగువానరులతోఁ గూడఁ బలాయమానుఁ డుగాఁగ నొక్కసుగ్రీవుండుమాత్ర ముద్గ్రీవుండై సువేలాచలమునుండి యొక రాయి పెఱికి కుంభకర్ణునిపై విసరెను.

రావ—(నవ్వి) ఇది తామరతూఁటిచే మదగజముం గొట్టుటవంటిది,

కరం—(రావణు నుద్దేశించి) సుగ్రీవుఁ డారాయి విసరెను. కాని పాపము—

గీ. అజభీషణుఁడైన నీయనుఁగుదమ్ము
ముష్టితాఁకున నది ముక్కముక్కలయ్యెఁ
జెదరి నల్దెసలకుఁ బర్వ చిన్నిరాళ్లు
కపివరుల లక్షలకొలందిఁ గసిమసంగ.

రావ—మనకుంభకర్ణునివలన వీరలందఱికి నీరీతినే చావు మూఁడినది.

దుర్ము—(కుడివైపున) ఆశ్చర్యమాశ్చర్యము. చంద్రకాంతములు ద్రవింపఁ గువలయంబులు వికసింపఁ గమలంబులు ముకుళింపఁ జకోరంబులు ద్రావఁ బొలయలుకలుగల లలనలు పశ్చాత్తపింప మదనోన్మత్తులు భ్రమింప విరహిణీనయనంబులనుండి రెండింతలుగాఁ గన్నీరు స్రవింప మగలతోఁగూడిన మగువలు మూఁడింతలుగా సంతసింపఁ గుపితమానవతులకుఁ జేయు నమస్కారములు నాలుగింతలుగాఁగఁ జీఁకటిగొంగలగుచుఁ జంద్రబింబములు బయలుదేఱినవి.

రావ-ఓరీ సేవావిదగ్ధ! చంద్రి! రావణసేవాసమయము నీవు బాగుగ నెఱుఁగుదువురా.

(అని దుర్ముఖువంకఁ జూచి)

గీ. ఎల్లపుడుఁ బండువెన్నెల నెల్లదెసల
నిండియుండిన రాక్షసనేత దయకుఁ
బాత్రుఁడ నటంచు పెక్కురూపములు దాల్చి
నన్ను సేవింపఁగా వచ్చుచున్నవాఁడు.

సుషే—దేవా! యట్లుగాదు. తామిస్రాస్త్రమును హరించుటకై సౌమిత్రి ప్రయోగించిన చంద్రాస్త్రము.

కంకా— (ఎడమవైపున) దేవా! తనవిసరినబాణము వ్యర్థముచేసెనను కోపముతో మరల సుగ్రీవుఁడు—

గీ. కర్పపుంకెట్లరస మేలుగా ప్రసవింప
ఘణులు చందనవనగములపట్లు పీడ
మలయనగమును రెండుచేతులను విసరి
దశముఖానుజునిం జంపఁదలఁచినాఁడు.

రావ— అహ్హా! మర్కటకీటకము పొగరు.

దుర్ము—(కుడివైపున) రాక్షసేశ్వరా! తమ్ముం బట్టకొన వచ్చుచున్నవని సూర్యచంద్రులు భయంపడఁ దలపుగ్గొలు భువనంబు నిండినవి.

రావ—(ఆలోచించి)

గీ. తరతరమ్ముల సురలకుఁ దనకుఁగల్గు
నట్టి పగదీర్పఁగోరఁగ సాహాయ్యకమ్ము
నన్ను వేడఁదలఁచి సబాంధవముగాఁగ
దుర్ముఖా! వచ్చుచుండె విధుంతుదుండు

(ఆకాశమున) స్వర్భానూ! భయంపడకుము. రావణుఁడు శరణన్నవానిని రక్షించువాఁడె.

సుషే—దేవా! చంద్రాస్త్రముం బాధించుటకయి యువరాజు రాహుబాణమును వదలినాఁడు.

గీ. పుష్పకము లెక్కి వడివడిఁ బోవుసురలు
దారియిడ నరిష్టంబని దైవవిదులు
తలఁప వేవేలుగ్రహణము ల్వెలయునట్లు
చంద్రులను మ్రింగె స్వర్భానుసంచయంబు.

కంకా—(కుడివైపున) ఇట్లు సుగ్రీవుండు పర్వతము వైవఁదలఁచి యున్నంతటిలో

గీ. కుంభకర్ణుండు తన చాపకోటివంచి
నారి దగిలించి వాయుబాణంబు విడిచె
మలయగిరితోడ వానరబలముతోడ
వానరేంద్రుండు వారాశిలోనఁ బడఁగ.

రావ— (హర్షక్రోధములతో) అట్టులేని బడబాగ్ని కాహుతి చేయఁబడినవాఁడె.

కరం— లేదు లేదు!

గీ. శరము విడిచిన బుజము నీసహజుఁ డొక్క
మూల ముడువనె లే దొకమూలఁ ద్రిదశు
లేద్య నేలేను సుగ్రీవుఁ డెట్లువచ్చె
నో! రణోర్వికి వారాశినుండి వచ్చె.

రావ— (తనలో) బలములో నితఁడు వాలికన్నను నెక్కువవాఁడె కాఁబోలును. (ప్రకాశముగా) క్రోఁతిజాతికి గంతులు మాత్రమే చేతనైనవి.

దుర్ము— (ఎడమవైపున) లంకాపరమేశ్వరా! చూడుచూడుము! కౌస్తుభమణి లాంఛితంబు లగువక్షంబులయందు వ్రేలాడు వనమాలలయందలి మకరందంబును గ్రోలు తుమ్మెదలవలె నుండు పుట్టుమచ్చలతో నల్లగల్వలకాంతిగల విగ్రహంబులతో గరుత్మంతుల నెక్కిన నారాయణు లాకసంబున నిండియున్నారు.

రావ— (సమ్మదముతో)

క. తనయెదపైఁ బొదలు రమావనితను హరియింతు నన్నభయమున నానే
వనుజేయఁ బెక్కుమూర్తులు కనిపింపఁగ వచ్చుచుండెఁ గమలాక్షుండుఁగా.

(ఆకసమున) ఓరీనారాయణ! రావణుఁడు శరణన్నవారి పెండ్లముల నపహరింపఁడురా.

సుషు— దేవా! నాతలఁపేమనఁగా, రాహుబాణసంహారమునకై సౌమిత్రి నారాయణాస్త్రముం బ్రయోగించినాఁడని.

గీ. పద్మయుక్కన మీఱఁగఁ బాంచజన్య
రవము మిన్నంట నాల్గుకరంబు లలర
నీలమేఘాకృతులు నింగి నిండియుండె
రాహువుల నెల్ల నడఁపఁ గారణములగుచు.

కంకా— (ఎడమవైపున) ఇట్లు సముద్రమునుండి వెలువడి సుగ్రీవుఁడు కుంభకర్ణుం దలపడి విల్లు లాగికొని యది నేలపైఁ బడవైచెను. సీతమ్ముండును గోపము చేఁ గన్నులెఱ్ఱవడఁ జక్రములఁ బ్రయోగించియుఁ బట్టసముల విడిచియుఁ గవచధారుల శరీరములు సయితము ఛేదింపఁదగిన ఘనుంతులు

వదలియు మేను పులకరింపఁ గత్తులు జడిపించియు సుగ్రీవు నెదుర్కొ-నియె. అతండును నాసాధనము లన్నియు వమ్ముచేసి నియుద్ధమ్మునకు మరలి బాహువు లప్పళించి కిలకిలారావముచే భూనభోంతరములు నిండించెను. దేవతాసుందరులందఱు సందర్శనకుతూహలంబునం బరుగెత్తి వచ్చుచున్నారు. నిశాచరాంగనలు లంకాపురీప్రాకారశిఖరము లధిష్ఠించుచున్నారు. వానరులు చేతులలోని ఱాళ్లు నేలవైచియు రక్కసు లాయుధములు ప్రక్కలం దిడుకొనియుఁ జూచుచున్నారు. ఇరువురును బరస్పరగ్రహణోపాయములకై చేతులాడించుచుఁ దలలూచుచు బుజము లప్పళించుచుఁ బరస్పరకక్షాబంధవినిహితహస్తులై కొంతసేపును నన్యోన్యహస్తాగ్రధృతకంధరులై కొంతకాలంబును బరస్పర జంఘాతాడనంబుల గొంతవఱకును దూత్కరించుచు మల్లయుద్ధమారంభించిరి. ఒక జుట్లుపట్టుకొనుటా, యొక గుడ్లు పీకికొనుటా, యొక ముక్కుమీఁద గుద్దుకొనుటా, యొక పండ్లూడగొట్టుకొనుటా యొక గోరులతోఁ జీరుకొనుటా, వారుచేయు పెక్కుపనులు వినోదముగానున్నవి. పర్వతంబులు సైతము గండశైలములు గ్రక్కుచున్నవి. భూమి చీత్కరించుచు గిఱ్ఱునఁదిరుగుచున్నది. బరువాఁపలేక కూర్మపతియుఁ దల వంకరగఁ ద్రిప్పుచున్నాఁడు. కావున నీసమయమున దేవర విల్లుధరించిపోవుటయే శ్రేయమని నాకుఁ దోఁచుచున్నది.

రావ— (నవ్వి) వెఱ్ఱివాఁడ! ఇది యొక ద్వంద్వయుద్ధమటరా? దీనికి నేఁ బోవలయునా!

దుర్ము— (కుడివైపున) దేవా! యిది యేమి వింత! యాఁతకల్లు ద్రావి మత్తిల్లిన నర్తకివలె మత్తిల్లుచు ముదుసలియాండ్రను గూడ యువతులనుగాఁ జేయు శక్తితోఁ బూవుందూపులు ధరించి విరహిణీకంఠంబులకుఁ బంచమరాగంబు గలుగఁ జేయుచు మృగాంకబాలమిత్రులును మూతీకృతకుమారసమీరులు నగు మన్మథులు వచ్చుచున్నారు.

రావ— (సంతసముతో)

గీ. లోకు లెందఱు గలరో మల్లోకములను
వారిమనములఁ బొడమిన పంచబాణు
లెల్లఁ గొలువఁగ మారుఁ డయ్యాశుభీతి
నన్ను శరణొందఁగా వచ్చుచున్నవాఁడు.

(ఆకాశమున) ఓరీ మకరధ్వజా! రావణానుగ్రహంబున నీకు మహాదేవుని వలన నయితము భయము గలుగదులా.

సుము— వైష్ణవాస్త్రి మపసంహరించుటకై మందోదరీనందనుఁడు మన్మథాస్త్రిముం బ్రయోగించెను.

గీ. సిడముల మొనల్లు పూవిండ్లు చేతులందు
మధుసహోద్యాయమగు పంచమస్వరంబు
గలుగు మదనులు తెలిదీవికడకుఁ బంపి
రచ్యుతుల నంది రాలోచనాంచలముల.

కంకా—(ఎడమవైపున) దేవా! కుంభకర్ణుఁడు సుగ్రీవుని సర్వాంగసంధులు విఱిచి యాకసంబునం గిఱగిఱఁద్రిప్పి నేలంబెట్టి కొట్టెను.

రావ—అట్లయిన మత్తుటేనుఁగు చేతంబడిన యనఁటిచెట్టువంటి యవస్థ వచ్చినది.

కరం—ఇంకొక చిత్రము జరగుచున్నది.

గీ. నేలఁ బడియున్న వానరానీకనాథుఁ
గక్షపంజరదాత్యూహకల్పుఁజేసి
యనుజూఁడదె వచ్చుచుండె జయంబు నీకు
దేవతావైరి! లంకాపతీ! నిజంబు.

గీ. చంకనిఱికించుకొని నాల్గుజలధులందు
నన్నుముంచెఁ గదా వీని యన్నమున్ను
దాని కభిమానియైన నాతమ్ముఁ డిపుడు
కీశనాథునకుం బ్రతిక్రియ యొనర్చె.

కంకా—కుంభకర్ణకక్షాంతరగతుం డగుసుగ్రీవునిం జూచి రభసనదన్నూపురరశనా కేయూరులగుచు బృందారకవందిసుందరు లందఱు నృత్యమారంభించుచున్నారు. దేవా! చూడు చూడుము.

రావ—(సంతోషముతోఁ బరికించి)

ఉ. ఏల పులోమకన్యయు ధనేశుని కాంతలు చంద్రునాంధ్రుడు జే
జేలవెలందులుం బలుగుఁజేఁతలు చేయుట పంపుఁ డొలకుం
జాలు సపత్నులుం గొడుకుచావలు గొల్వఁగ వచ్చి దేవియే
మోఁల నటించుఁగాతఁ గడుమోదమునం జలపాణిపద్మయై.

దుర్ము—(ఎడమవైపున) దేవా! యిదియేమి యబ్బురము. కటాంగములు ద్రిప్పుచు నట్టహాసములు చేయుచు డమరుకములు మోగించుచు వేతాళము లెదుట నృత్యము సేయ దేవతాపురంధ్రులు భయమునందఁ దలలమీఁది చంద్రఖండంబులఁ గదల్చు నాకాశగంగాతరంగంబులు ఘూర్ణిల్లఁ గోపంబునం బున్నురని

బునకొట్టు పాపజంబెంబులు ప్రేలాడఁ బ్రచండవేషధారు లగుచుఁ జండికా పతు లేతెంచుచున్నారు.

రావ—(సంతోషముతో)

గీ. తలలు తెగఁగోసికొనినయందులకుఁ దగిన
యట్టి వరమును నితని కీనైతి మున్ను
నేఁడొసంగెదనంచు ననేకమూర్తి
యగుచు ముక్కంటి నను బ్రోవనరుగుదెంచె.

సుమ—దేవా, యట్లుకాదు. మన్మథాస్త్రము పసంహరించుటకై తృతీయదాశరథి యీశ్వరాస్త్రముం బ్రయోగించె నని నాయూహ.

గీ. బాలశశిశేఖరులును గాకోలగళులుఁ
బన్నగాలంకృతులునైన భర్గు లకట
గడియలోపలఁ జిచ్చుఁటకంటిలోని
మంటలోపలఁ గలిపిరి మన్మథులను.

కరం—(కుడివైపున)

ఉ. పేర్వులు త్రెంపఁగాఁ గదలు పీలుఘుటిల్లఁగఁ జంకదాఁటి వి
ద్రావితుఁడై నఖంబుల నురంబు పగిల్చి రదాళిచేత న
త్రేవల నాసికంగఱచి లీలఁగ బర్విడె మింటివైపు ను
గ్రీవుఁడు నీసహోదరు నొగిం దన తోఁకనె నెత్తిమొత్తుచున్.

రావ—(దుఃఖముతో) హా! ఎంత ప్రమాదము! వానరులు కపటప్రచారు లనుమాట తలంపకయే తమ్ముఁడు పోరుచున్నాఁడు.

కంకా—ఈసుగ్రీవుఁడట్లు కుంభకర్ణుని వంచించి యంతలో గగనమార్గంబునం బ్రథమతాపసుని సన్నిధిచేరెను.

కరం—కపిచక్రవతిఁజ యొనర్చిన చాపల్యమునకుం గోపించి మధ్యమపౌలస్త్యుండును సమరసమారంభమే శరణముగాఁదలఁచి లంకాపురీగోపురము వెడలఁగా సర్వసేనాపరివృతుండై స్వయముగా రాముఁడే యతని నెదుర్కొనియె.

కంకా—జాంబవన్మణిమన్మహాముఖ దుస్సహ ప్రభృతులగు నెలుఁగురాయు లొక్కప్రక్కను గయగవయగవాక్షకటాక్షప్రభృతులగు గోలాంగూలాధిపతు లొకవైపునను దధిముఖదరీముఖదుర్ముఖప్రభృతు లగువానరనాయకు లొకవంకను శరభకేసరికిశోరప్రముఖు లొకదండను నిండియుండ నెదుటికి వచ్చిన రాముంజూచి కుంభకర్ణుఁడు.—

రావ—ఇదియే పిపీలికాపన్నగన్యాయము. ఏమిచేసెను?

కంకా—ముద్గరప్రహారముల చేత నచ్ఛభల్లకులంబును మూర్ఛనొందించి కొండముచ్చులం బాఱఁద్రోలి వానరసేనలంబెండి చేసి రామున కభిముఖుండై మూర్ఛదేఱిన వానరులచే నలుదిక్కుల నాక్రమింపఁబడుచుఁ గోపాంధకారమునం గన్నులుగానక ప్రక్కలనున్న పరిజనములతో నిజపక్షబలనకేళి యందుం బ్రవర్తిల్లెంచెను.

(తెరలో) దేవా దాశరథీ! వానరసేనాసంరక్షణమునకై త్వరపడుము.

చ. బలరిపుకుంభికుంభములు వ్రయ్యలుచేసి కృతాంతుపోతుకొమ్ములు మొదలంట నూడిచిన ముద్గరముం ధరియించి రక్తముం గ్రోలుచుచుఁ గుంభకర్ణుఁ డడుగోఁ దిగ్దశాంగన లెల్ల నవ్వ శత్రులుఁ దనవారునంచు మది దోయక ద్రిమ్మరుచువచ్చె నక్కటా.

రావ— ఔరా! తమ్మని యత్యుప్తియు నధ్యవసాయమును గొనియాడఁ దగినవి!

కరం—(కుడివైపున) దేవా! రాముఁడును దోర్బంధబంధూకృతచాపుఁడై కుంభకర్ణుం దాఁకెను. కుంభకర్ణుండును ముద్గరముం దాల్చి వెన్నీక నిలువంబడియె

రావ—ఎప్పుడును మా తమ్మని సంగర మభంగురమైనదియే.

కంకా—అయ్యో! అయ్యో!

గీ. త్రిదివసతులకుఁ దిలకము ల్దిద్దుచేయి
యరులఁ దునుమాడఁ బైకెత్తినట్లెయుండ
రామశరఖండితం బయి భూమిమీఁద
దొరలె నాచేతిదనుక ముద్గరముతోడ.

కర—ఒక్క చేయియేకాదు, భుజదండముగూడ ఖండింపఁ బడినది.

రావ—(కన్నీటితో)

గీ. కంకణీకృత దేవతాకరిరదంబు
మృతకవానరరక్తరంజితతలంబు
తమ్ముకుఱ్ఱనిబాహుదండమ్ము వడియె
నకట నరపశుశరలూనమగుచు నవని.

కంకా—(అని మూర్ఛవోవును) దేవా! యూరడిల్లుము. ఎడమచేతనే ముద్గరము పట్టుకొని నీతమ్ముఁడు మరల రాము నెదుర్కొనుచున్నాఁడు.

రావ—(మూర్ఛదేఱి చూచును)

(తెరలో) గీ. దంతఖాతాధరము భయదభ్రుకుటియు
జ్వలితనయనంబులు కోపకషాయగండ
మైన నీసోదరుని తల యవనిఁ బడియె
నరవిముక్తార్ధరాకేంద్రుశరము చేత.

(అందఱును క్షోభము నటింతురు)

(మరలఁ దెరలో)

చ. శరమునఁ గంధరంబు తెగి చప్పుడుఁ జావక ఘోరలన్ భయం
కరముగ కుంభకర్ణు తలకాయ పొరింబొరి నిద్రమత్తుతో
ధరఁబొరలాడుచుండఁ గని దానిని వాయుకుమారుఁ డింక నె
వ్వరి నిది మ్రింగునో యనుచు వారిధిలోఁ బడవైచె రావణా.

రావ— హా! వత్స. కుంభకర్ణ! నావలన నీకెట్టిపాటు వచ్చెనురా తమ్ముఁడా (అని యేడ్చును)

(తెరలో)

గీ. పుష్పకంబులు మరలించి పొందు సురలు
కపులు దైత్యులు పొందు సంగరము విడచి
రవిరథము దూరమేగుము భువినిఁబడెడుఁ
గుంభకర్ణుని మొండెము కొండవోలె.

రావ—(శోకము నటించుచు)

ఉ. నేఁటికి శేషపన్నగము నీవొనరించిన యొగ్గు మర్వె దిం
తేటికి గౌరి సింగమును నింద్రుని దంతియుఁ బోలె పోరు నీ
పాటవమున్ సుమేరువునుబట్టి కదల్చిననాఁటి వేలుపుం
బోటుల పాట్లు నే మఱచిపోయెదనన్నను బోవు తమ్ముఁడా.

సుమ—(ఎడమవైపున) దేవా! ఊరడిలుము. పెక్కుదుఃఖములు వచ్చినఁ బక్కున నవ్వవలయునఁట. పుండుమీఁదఁ గారము రాచినట్లింకొక యాపదమూడినది. అచట లక్ష్మణుండును—

క. వింటం దూపిడి పురముల నంటించిన వాని భైరవాకారుని ము
క్కంటిం దలంప నాతని కంటి సెగల్ మేఘనాముఁ గడ తేర్చెఁగటా.

రావ— హా పుత్రా! హా పుత్రా! (అని మూర్ఛపోవును అందఱును యథోచిత మాచరింతురు.)

రావ—(కొంతసేపటికి మూర్ఛఁదేఱి)

చ. కెరలుచు వజ్రి బ్రొమ్మపయిఁ గేలిడి నిద్దుర వోవుఁగాక ని
ర్జరులును గాలిసంకెలలు జాఱి సుఖింతురుగాక దేవతా
తరువుల పూలు దేవతలె తాల్తురుగాక దశాస్యుచేత నె
వ్వరికిని దెల్పరాని దురవస్థకుఁ బాలయితయ్య పుత్రికా!

(అనియెల్గెత్తియేడ్చి) ఓకింకరులారా! నన్ను మందోదరీభవనంబునకుం గొంపొండు

(అని అందఱును నిష్క్రమింతురు)

ఇది...శ్రీతిరుపతి వేంకటేశ్వర విరచితంబగు నాంధ్రబాలరామాయణ నాటకమునం దష్టమాంకము.



శ్రీరస్తు

# బాలరామాయణము

## నవమాంకము

(పిదప యమకింకరుఁడు ప్రవేశించును)

యమకి.— ఆహా! ప్రాజ్యాండమును లీలామాత్రమునను సకలప్రాణి భయంకరుం డును నగు శ్రాద్ధదేవుని విశ్వాతిశాయి యగు ప్రభావము!

గీ. సతతవికసితనీరజాసననివిష్టుఁ
డగుచుఁ దనయిచ్చ నీరేడుజగములను స్పృ
జించి మించినవాఁడు విరించి వేద
కర్త యూర్పుచ్చెఁ బితృపతికి తనఁ గాదె.

(పరిక్రమించి ప్రక్కకుఁజూచి) ఔరా! వీరచూడామణియగు నక్తంచరేంద్రుని ప్రతాపము! గరుత్మంతుని రథమునుగాఁ జేసి మాతలిసుతుఁడగు సునీతుఁడు సారథిగా యుద్ధరంగమునకుఁ దేవరాజు రామునికొఱకుఁ బంపించితిననియు, నేఁడు రామరావణులకు ద్వంద్వయుద్ధము జరుగుననియుఁ, బుత్రదర్శనలాలసుండును మాకుఁ బరమమిత్రుండును నగు దశరథమహారాజుతోడను యుద్ధప్రచారము వినిపించు చారణమిథునముతోడను సేనాయుద్ధరంగమునకుఁ బోవుచుంటి ననియుఁ, జిత్రగుప్తుల పుస్తకములో లంకానివాసుల లెక్కఁదీయించి మాకుంబంపుము —

గీ. లంకలోనున్న రావణు లెంక లెంద
ఱిప్పు డెవ్వరిచే వధియింపఁ బడుదు,
రదియు, రాముని చేత లంకాధిపతికి
నెట్లు మృతియగునో దాని నెఱుఁగవలయు.

అనియుఁ బురుహూతుఁడు దనకుం బంపించినవార్త త్రిలోకనియామకుం డగు యముండుకూడ నాతో నేకాంతముగాఁ జెప్పి యీపని నెఱవేర్పుమనియె. నేను జిత్రగుప్తుని కడకుంబోయి యీలెక్కలు దీయించి యిటు పురుహూతున కందఁజేయవలయు. (అని యాలోచించి) ఔరా! దశాననుండు పరాక్రమములో నందఱికిని మీఁదివాఁడే కదా; కాఁడేని —

గీ. దేని గనుఁగొన్న నిర్జరాధిపతియైన
వేయి కన్నులు ముకుళింపఁజేయు భీతి

నట్టియమ కాలదండ మిాయసురనాథు
కంఠములయందు మాత్రము కుంఠమగునె.

మఱియును — గీ. సకలజంతువులకు వినాశంబుఁ జేయు
దుండగుండగు యముఁడును దండమాని
వీని నెదిరించుటం గాదె విఱిగిపోయెఁ
బురుషభావంబుతోఁ గూడఁ బోతుకొమ్ము.

(అని నలుదెసలు పరికించి) ఇదుగో! చిత్రగుప్తుఁడు (అనిసమీపించును)

చిత్ర—(ప్రవేశించి)

గీ. వానరులచేత రాత్రిందివంబులందుఁ
జంపఁబడినట్టి దైత్యుల చావులెక్క-
లట్టె వ్రాయఁగ ఖేదజడాంగుళీక
తోరమయి చేతి తిమ్మెర తీఱదాయె.

యమకిం—(డాయంజని చెవిలో నేమోమో చెప్పును)

చిత్ర—స్వామి యానతిప్రకారము చేయుదును (అని నలుదిక్కులుఁగలయంజూచి) ఈపార్శ్వముల బ్రచ్ఛన్నుఁడుగాని మత్తుఁడుగాని యెవ్వఁడును లేఁడుగదా! మంత్రము వెలియగును. (అని లెక్కలపుస్తకము వానిచేతికిచ్చి) సరిచూచుకొనవలయును, నీవు చదువుము.

యమకిం— (చదువును.)

గీ. కృతయుగము చన్నపిదపను త్రేతనాదిఁ
గార్తికంబునఁ గృష్ణపక్షప్రథమది
నమున గట్టిరి వార్ధి గ్రావములచేత
రామభక్తులు కపులు దోర్బలము మిాఱ.

గీ. కోప ధూమ్రాక్షుఁ గాటుకకొండఁబోలు
వాని ధూమ్రాక్షు విగతకంపను నకంప
నుని వధించెను మారుతతనయుఁ డధిక
రోషవివశుండు చెఱియొక గుద్దుగుద్ది.

గీ. దీర్ఘభుజాఁడగు నీలుండు దీర్ఘనిద్ర
నొందఁజేసెఁ బ్రహస్తు రఘూద్వహుండు
కుంభకర్ణుని గాటుకకొండవంటి
వాని ఖండించె రెండవవారమందు.

గీ. అంతకుండయ్యెఁ బోర నరాంతకునకు
నంగదుండు భుజాలంకృతాంగదుండు
అంతకునిఁ జేర్చె హనుమ దేవాంతకత్రిశి
రసులఁ బిడికిలిచే గలఁచనులఁ జేసె.

గీ. ఋషభుఁడను వానరుఁడు వధియించెఁ బిదప
బార్శ్వములు చించి యలమహాపార్శ్వనాముఁ
జేసె నతికాయు నిష్క్రియుఁ జిత్రయుద్ధ
ఘనుఁడు సౌమిత్రి మూఁడవ దినమునందు.

గీ. కడఁగి కుంభనికుంభులఁ గౌంభకర్ణు
లను వధించిరి రవిమరుత్తనయు లవల
దామరసలోచనుఁడు ఖరాంతకబలుండు
రామభద్రుఁడు మకరాక్షుప్రాణముడిపె.

గీ. మేఘనాదునిఁ జంపె సౌమిత్రి నిహత
నాయకము లైన నిశితాగ్రసాయకముల
నాలుగవనాఁడు వానరనాథుఁ డలుకఁ
గొని విరూపాక్షుని మహోదరుని వధించె.

గీ. రాఘవేంద్రుండు నిశితాస్త్రలాఘవమునఁ
గడఁగి చంపఁగలఁడు దశకంఠు విహిత
సంగరోత్కంఠు నేఁడు నిజంబునిజము
పరసతీహర్తలకు నిట్టి పాటులనఁగ.

చిత్ర—సరిగానే యున్నది. నీవుచని వేగముగా నివి దేవేంద్రునికిచ్చి మరల మన స్వామితో నివేదింపుము. నేను గార్యశేషంబునకై పోయెద. (అనియిరువురును నిష్క్రమింతురు)

(ఇది విష్కంభము.)

(పిదపఁ బురందర దశరథులును చారణమిథునంబును బ్రవేశింతురు.)

చార— ఆర్యా! మాతలీ. సకలదానవేశ్వరపరాక్రమణంబును గౌతూహలోత్తానిత సకలలోకలోచనపత్త్రంబును నైరావణలక్ష్మంబును గగనాంగణసంచరణ వేగతరళితమాణిక్యకింకిణీనినాదనిష్యందనంబునగు స్యందనంబు వేగ నడపుము. సురాసుర సంగరప్రదేశంబు నతిక్రమించియున్న రామరావణసమరాంగణము లోచనగోచరం బగుచున్నది. (అందఱును రథవేగము నటింతురు)

దళ — భగవంతుఁడా! గీర్వాణనాథ! అనుగ్రహించి దృష్టిలీవైపునకుం బఱుపుము,

క. లతతోఁడ న్వికసించిన యతసీకుచ్చమన రాముఁడదె చొచ్చె రణ
క్షితి ధన్వియగుచు లంకాపతియును విలు పూని వచ్చె వారిద మనఁగన్.

(ఆకసంబునఁ జెవియొగ్గి) రభసోల్లసితహృదయామోదసముద్రుం డగు రామభద్రుం డేమనియో యనుచున్నాఁడు.

మ. "అనురాధీశ్వర! సీతనిమ్ము నిను నే యాచించితి న్మానుమీ
యసదాచారము, మించలే దిపుడు కార్యంబైన, లేదేని రా
ర! సమాకృత్తఖరాదికంఠవిగళద్రక్తావిలంబైన నా
రసముం బూని దశాననంబులఁ ధరారంగంబునం గూల్చెదన్."

పుర — భూదేవేంద్ర! మీ రామభద్రుని కెన్ని యేండ్లున్నవి? ఇంతటిపౌరుషము లోనే యేండ్లు గడచిన పెద్ద లనవలసినమాట లభ్యస్తములయినవి.

దళ — (వినయముతో) దేవా! ఇది దేవరయనుగ్రహమే. ఇనుము క్షమించుటకు సూదంటుఱాతిబలిమిగాక జేఱున్నదా. (మరల మింట చెవియొగ్గి) ఇవి రాక్షసరాజుమాటలు. "ఓరీరాముఁడా! దోర్దండచండిమాహృతపరశురాముఁడ! వాపరాక్రమమును నీపూర్వపురుషుఁడే సహింపలేకపోయెను. నీవన నెంత!

గీ. తావికై వచ్చుతుమ్మెద దంతిచెవుల
చేత దెబ్బలు దినులీలఁ జేతఁగాక
చెంపకాయలు దినిరో నా చేత మును వ
రేణ్యగుణుఁడగు మీయనరణ్యనృపతి.

ఇంతియే కాదురా! ఓయనరణ్యకులకుమార!

మ. నను దాఁకె న్సురిచక్రముం గుపితకాంతాకుండలాఘాతమో
యన, నామూఁపునఁ గాలదండము మృణాళాకారమై యుండె, బో
మ్మనఁ గాంతాకుచహారమట్లు దొరలెంబో వజ్రముం; దూపు లీ
వును నాపై నిగిడించెదేని నవి పూవుందూపు లౌ రాఘవా."

పుర — (ఆలోచించి) రామరావణుల వచనరచనయం దెంత హెచ్చులొచ్చుగలదో చూడుము. గౌరవము బుద్ధిమత్తచే వచ్చునుగాని వయస్సుచేత రాదు.

చార — (చెవియొగ్గి) ఆమాటకు రాముఁ డిట్లనుచున్నాఁడు. (తెరలో) అట్లయిన వనంగబాణోపమానంబులగు నాబాణంబులు సహింపుము మిదిగో విడుచుచున్నాను.

చారిణి— (సంభ్రమముతో నమస్కరించి) దేవా! విశదకమల మనోహరంబు లగు నయనాంచలంబు లీవంకకుం బఱపుము. ప్రళయకేతుదండాకారం బగు బాణంబు కోదండదండంబునుండి మొదట విడిచినపిదపనే రామభద్రుని మొగంబునుండి మాటలు వెలువడెనవి. భగవానుఁడా! ఇంద్రాణీవల్లభ! ఈరాముని చరితవంటి చరిత వినియుఁ గనియుఁగూడ నెఱుంగము. మం దోదరీచుంబనవిలుప్తతిలకం బగు దశానను ఫాలఫలకంబున జయధ్వజదంబుగా నొక్కబాణమును నాటెను.

చార— సుగేహిని! నీవు బాగుగ గుర్తింపఁ గలవు సుమీ.

చ. ఎచటఁ దృతీయలోచనము నీశ్వరుఁ డర్థి వహించి యుండెనో
యొచట విశేషకంబుఁ బృథివీశ్వరు లందఱు దాల్చుచుందురో
యొచటఁ ద్రిభంగికాకృతివహింపఁగ జేయునొ క్రోధ మేరికిన్
నచటనె రాఘవేంద్రుఁ డొకయమ్మునఁ గొట్టెను రాక్షసేశ్వరున్.

చారణి— అయ్యో! అయ్యో! దశాననహతకుఁడు దళదింద్రనీలదళాభిరామంబగు రాముని పెన్నురంబునం గృతాంతదంష్ట్రికరాళంబగుశరంబు గ్రుచ్చెను.

దశ— ఎవఁడురా అక్కడ! పురందరమిత్రంబగు దశరథుఁ డెదుట నుండఁగానే రావణుఁడు రామునిం బ్రహరించుచున్నాఁడఁట.

పురం— సఖా! దశరథ! ఇది ద్వంద్వయుద్ధము కదా! ఇరువురు పోరాడుచుండ మూఁడవవాఁడు చనుట క్షత్రియధర్మము కాదు.

దశ— పూజ్యుల మాట కడుగు దాఁటను గాని యిప్పుడు కర్తవ్యమేమి?

పురం— చేయఁదగిన పని రాఘవధురంధరుండగు మన రామచంద్రుఁడే చేయఁ గలండు.

చారణ— ఔరా! యీ మొక్కలి రక్కసుని పొగరు.

గీ. జానకీదేవి నిదురించు శయ్య పైడి
లేటితోల్దాల్చు గ్రావకవాటసమము
చిరపరిత్యక్తమాక్తికసరము నైన
రామునురమందు గ్రుచ్చె నారాచ మకట.

దశ— దశకంఠా! మంచినేర్పరివిరా! ఒక్క యమ్ముచేతనే దశరథరాములిరువుర హృదయములను వ్రచ్చితివి.

చారణ— (సంతోషముతో చంకలు దాటించుకొనుచు) దశరథమహారాజ.

కం. మందోదరి వలిగుబ్బలయందలి కుంకుమము చేత నందంబయి చె
న్నొందు రిపు సెడఁదపయిఁ జొన్పెం దారుణమైనశరము నీకొడుకు బలా!

చారణి—(చమత్కారముతో) చెవి దాఁకఁ దాఁకు వింటి నడుమునుండి వెడలు తూపులు ముజ్జగంబుల నిండ రామరావణులొనరించు నిర్భరంబగు సమరంబుఁ జూడఁజూడ మన ముప్పొంగుచున్నది.

పుర—మిత్రమా! మహీమహా రాజ! మన రాముని ధనుర్విద్యాపాటవంబుం గనుంగొనినఁ ద్రిపురాంతకుండు పాతలఁపునకుం దగులుచున్నాఁడు సుమీ.

దశ—(ఆకసమునఁ జెవియొగ్గి) మిత్రమా! పురందర! రామభద్రుని చరిత్రకు సంతసించి శివని యీదశకంఠుఁడు నిన్నుఁగూడ నేమో మాటలుమిగులుచున్నాఁడు.

( తెరలో )

మ. పతికిం బంధముఁబాపి ప్రోవు మనుచుం [illegible]లోమి కోరం దయా
మతి నే నిన్విడనాఁడు నాఁటిగతి సంస్మృతజాన్యమౌ౯ె! దివ
స్పతి! యేమీ! యిటుతప్పఁ బల్కితిని రక్షస్స్వామికిం బాణిసం
శ్రితధారాశితచంద్రహాసునకు నిన్నీ యిట్లనం బోలునే.
ఓకపిలలోమశబాహూ! అహల్యాజార!

ఉ. రాముని పేరుచెక్కిన శరంబులు నాలుగు మింటి నంటఁగా
నేమని వేయి కందోవలు నింతలు చేసెదవోరి మూఢ! సు
త్రాముఁడ! నేఁడె రావణుఁడు రాము ననిం దెగటార్చు రేపు నీ
బాములు చూడు మడ్డపడువాఁ డెవఁడో నిను బందివెట్టెదన్.

దశ—(మరల నాకసమునఁ జెవియొగ్గి) ఆమాటలువిని రామచంద్రుఁ డుత్తరము చెప్పుచున్నాఁడు. దేవా! వీరిరువుర సల్లాపములును వినుము.

(తెరలో) ఓరీ! వాలిబాలమిత్రమా! పౌలస్త్య! వీరధర్మపరిభాషలు మీ వంటివారా ప్రవర్తింపఁ జేయువారు. ఇదియేమి. ఒకఁడు ప్రతిపక్షుఁడై యుండఁగా నింకొకనిపైఁ గోపగించెదేల? పోరఁగల వేని నాతో నేపోరుము. ఇట్టి యసంబద్ధ ప్రలాపములాడు నిన్ను క్షత్రియుండగు రాముఁడే శిక్షించువాఁడు.

రావ—(తెరలో) ఓరీ మానుషీపుత్ర! రాముఁడే క్షత్రియుఁడా, రావణుఁడు కాఁడు గదా! కానిమ్ము శిక్షించువాఁ డెవ్వఁడో శిక్షింపఁబడువాఁ డెవ్వఁడో చూతము.

రామ—(తెరలో) ఓరీ! అమానుషీపుత్ర! రాముఁడే క్షత్రియుఁడా! రావణుఁడు కాఁడు

చారణ—ఇట్లు వాక్ప్రతివాక్యములచేఁ దామసములు హెచ్చి రామరావణు లిరువ్వురును శరవర్షములు గురిపించుకొనుచున్నారు.

చారణి — ఓ దేవతా పరమేశ్వరా! యుద్ధ మతిభీభత్సము గానున్నది. జెండాగుడ్డలు చీలియున్నవి. ఘోరాబంధంబులు విఱిగిపోయియుఁ దాళ్లు తెగియు నరథంబులు దున్నియుఁ గోబరంబులు భగ్నంబులయ్యు తేఱుదోఁలుచున్నవి. ఇంద్రియంబులు చెడియుఁ జరణంబులు వికలంబులైన దాతులు మడియుచున్నారు విద్యాధరదంపతుల సద్దుచు దేవతామిథునంబుల గాయపఱుచుచుఁ బన్నగవివరంబులందూరుచు గంధర్వవర్గంబుల గంధంబు లడంచుచు సిద్ధులం దఱుముచు శకుంతసంతానంబులకు బెదరుపుట్టించుచు వీరప్రతివీరప్రయుక్తంబులగుశరంబులు లెక్కలేక యెక్కడఁ జూచినను నిండియున్నవి.

చార — (లెస్సగనాలోచించి) విరించి విలోచనకులతిలకులకు ధనుర్విద్యాపాటవంబునం జాల హెచ్చుతగ్గు గలదు.

> గీ. పదిశరంబుల నొకసారి పఙ్క్తిముఖుఁడు
> పదిశరంబులు రాఘవుపైకిఁ బఱుప
> శరము లేకను రాఘవస్వామి యొక్క
> చేత సంధించి వాని ఖండించుచుండె.

మఱియు నో దేవతాచక్రవర్తీ! కామ్యమానకాంతాపరిగ్రహంబులగు వస్తువులేవియైనను గాముకుల కానందజనకంబులే.

> చం. ఉరమునఁ గౌఁగిలించుకొనుచుండె ధరాసుతచేతిగందపుం
> గురుతులుగల్గు రామనృపకుంజరు తూపులు పంక్తికంఠుఁ డ
> ద్దిర! మరుశక్తి యక్కతన దేహము చెమ్మటపట్టి పుల్కరిం
> చె రసవశత్వము న్నిగతచేష్టలుఁ జెప్పఁగ నేల వానికిన్.

చారణ — అయ్యలారా! వినుఁడు. విచికిత్సాక్రోధములతో రాముఁ డేమో మో యనుచున్నాఁడు.

రామ — (తెరలో) ఓరీ మూఢ రావణ! యీసమబాణవర్షము చేతనే రామునిబడాయి తెలిసిన దనుకొనకుము. నిన్ను జంపుటకు మావిశ్వామిత్రభగవానుఁ డుపదేశించిన దివ్యాస్త్రములు పెక్కులుగలవు.

చారణి — (సంభ్రమముతో) ఇదియేమి. ఆమూలఫలితస్ఫులింగజటిలజ్వాలావళీవిలీనతుహినసరణిసారణీపూర్యమాణమందాకినీచంద్రభాగాదినదీసార్థమంథరిత విస్తారంబును నుత్తరదిగంతరస్థంబును సకలకులశైలరాజంబునునగు హిమవంతము! లేక సంతతతనోత్తపతరశశిలాజతునిష్యందనిర్ఝరదహ్యమాన చరణచంక్రమణాక్రందితకరీంద్ర ఘీంకారంబును స్రోతస్సలిలస్ఖాలితతటాంత పతత్ప్రస్తరప్రవృత్తశబ్దసందోహభరితగంభీరగుహాగహనకారణమహాంబుధి [illegible] ?

లేక సీమసీమాయమాన శిఖిఖండమండలీభగ్నిష్ట భుజగభోగభిభియమాణ తామ్రపర్ణోపవనవిచ్ఛిన్న నితంబడంబరాలంకృతదక్షిణమహీవలయంబగు మలయమా? లేక దాహకుపితకుంభసంభవమహాముని గేహినీదత్తవివర్ణదృష్టిచ్ఛటాకలాపసంకుచితదటులజాలుకోత్పీడపరిగ్రహియమాణ మాణిక్యచక్రవాళవేల్లిత శిలాతలలతాభవనరథససంభావిత హుతవహోచ్ఛేద మహార్తసుఖసుప్తవిద్యాధరమిథునజనితమనోమోహనంబగు రోహణమా ?

పురం — అవియేవియునుగావు. పౌలస్త్యునిం జంపుటకై యస్త్రతంత్రుండగు రామచంద్రుండు ప్రయోగించిన యాగ్నేయాస్త్రము.

చం. బిరబిర విల్లుద్రిప్పుచును బీరము పొంపిరి వోవ రాక్షసే
శ్వరుపయి రాముఁ డేయు శరజాలము లాతనిఁ దాఁకి మీఁదుగా
నతిమితి నెచ్చటంబడెనొ యచ్చట నొక్కొకబాడబంబు సా
గరమునఁ బుట్టఁజేయుగతిఁ గ్రాఁచుచునుండెఁ దదీయనీరమున్.

మఱియును,

గీ. పైడిమల పైడి ద్రవమయి పాఱఁదొడఁగె
మాడెఁ గల్పాగముల కుసుమవ్రజంబు
నిప్పుకలు గుఱిపించెను నీరదములు
రామనిర్ముక్తవహ్నిశరంబుచేత.

చార — (ఆకాశమునఁ జెవియొగ్గి) ఆర్యులారా! యీ రావణుని పల్కులు వినుండు (తెరలో) నీవు దివ్యాస్త్రములు ప్రయోగించిన నేను బ్రయోగింపలేనా!

గీ. హృదయతాపంబు బాష్పవాహినులు శ్వాస
ములను వాగ్నేయవారుణానిలశరముల
సీతకయి యోర్చుచుండిన జెట్టి నేమి
సేయునుర రామ! నీదివ్యసాయకములు.

చారణి — పారిజాతవృక్షముల మొదలంటఁ బెఱికివైచుచుఁ గల్పవృక్షములనున్మూలించుచు సంతానసంతానంబులం బెల్లగించుచు మందారద్రుమంబులఁ గందంబులూడ్చుచు హరిచందనంబులం బాడొనర్చుచు నీరేడు లోకంబులు కంపిల్ల ఝంఝామారుతంబులు విసరుచున్నవి. దేవా ! విలోకింపుము.

పురం — రామనిర్ముక్తమగు వాగ్నేయాస్త్రము తనకుం దగినది కాదని దానిం బ్రజ్వలింపఁ జేయుటకై పౌలస్త్యుండు వాయవ్యాస్త్రముం బ్రయోగించెనని తోఁచెడిని.

మ. అమరాగంబులఁ గూల్చుచుం దివిదివసద్వ్యానంబులం దోలుచున్
ప్రమదోద్యానములందు వతిల్లెడు చెంగాకంబయు ద్రెళ్ళుచున్
గమనీయాగ్నిజబర్హిపింఛమును మాగం జేయుచున్ వచ్చె సం
ద్రమునం గల్గిన విద్రుమపత్రితతి నీరన్ ముంచుచుం బన్యైరల్.

చారణి— దేవా! పురందర! ఇది యేమి! చుస్పృగారాజపట్టస్నిగ్ధముగ్ధంబగు నల్లని కాంతి గగనంబున కుల్లాభంబు గట్టుచున్నది. కలకలరవోత్కంఠ కంఠంబులగు శితికంఠంబులు నృత్యంబు సేయుచున్నవి. నిబిడోల్లాసిత సంశకరీరంబులును దలితకరీందరింబులు నగు జలధరంబులు గర్జిల్లుచున్నవి.

పురం— పవనోద్దీపితమగు నాగ్నేయాస్త్రముం జల్లార్పుటకై రామభద్రుండు జలధరాస్త్రముం బ్రయోగించె నని తలంచెద.

సీ. పలువితంబులగు రంగులు గల్గు శక్రచాపం బొకవంక శోభనువహింప
నీటిప్రబ్బలు మొల్వ నీరధారలు నేలఁ బడకుండఁ జాతకపక్షి గ్రోల
శక్రచాపమువంటి చాయలు గల్గు పింఛమ్ములు విప్పుచు నెమ్మలాడ
రవమూని మెఱుఁగిడి పవరఁగాముప్పివ యాంధ్రకాంత శిరోరుహములపగిది .

గీ. మొగలితీఁగల కెల్లెడ మొగ్గతొడవఁ
గడిమిపూవుల తావి లోకములు గప్ప
కమలములు రూపు మాయఁగఁ గదుపుగట్టి
గగనమున నిండెఁ బెనుకాఱు మొగులదండు.

గీ. పుడమికిని నింగికిని గల నిడివి గొల్చు
దండముల భాతిగా నీరధారలలర
మూజ్జగంబులు గూడ సముద్రమధ్య
మందు నొకసారి మునుగుచున్నట్లు దోఁచె.

చారణి— దేవా! యిటు చూడుము. నీటి యేన్గులు పరస్పరముం బోరాడఁ దరగల పై నాడుకొనుటకై జలాంతరమగ్నపర్వతంబుల యందలి పక్షులెగురుచుండ లక్ష్మ మాశ్రైరావతబాంధవంబును సముల్లసత్ప్రియామశేషంబును దృశ్యమాన దేవద్రుమాలవాలంబును నవలోక్యమాన నారాయణసూకరసముద్ధృత ధరణీ పృష్ఠనిలయస్థానంబును విస్తార్యమాణ కౌస్తుభసగోత్రమణికరంబిత పాతాళ జంబాలంబును నుచ్ఛలల్లక్ష్మీబాలవిలాసోద్దేశంబును ససంభ్రమభ్రమత్కచ్ఛపాది డింభకవర్గంబును బ్రకటాయమానదామోదర నిద్రావిముగ్ధశయనీయశేష రమణీయంబును తిమి తిమింగిల తిమింగిలగిలాది జలచరజంతుభీకరంబును నగు సముద్రసమూహంబు జగంబులు ముంచుచున్నది.

పురం— నిజముగా వారిదాస్త్రము తనకుం దగనిదని యెంచి తదుద్దీపనార్థంబుగాఁ బౌలస్త్యుం డుదన్వదస్త్రముం బ్రయోగించె నని తలంచెద.

ఉ. రక్కసు లేడ్చు నేడ్పులకు వ్రస్సిన శుక్తులు లోని ముత్తెము
ల్రిక్కఁగ నార్ణవముం జలచరంబుల యాహుతి బిట్టు మండఁగా
నెక్కలు గల్గుకొండలు చరింపఁగఁ బొంగెడు నెల్లలోకముల్
గ్రక్కున ముంచివేయఁగల కాలమునం బలె వార్ధులక్కటా.

చారణి— దేవా! దశశతాక్ష! చూడుము చూడుము! కలికాలనిర్వాపణక్షములును వార్ధిసప్తకపానప్రవీణులును నిర్వాణనగరరాజమార్గాయితులును ధర్మద్రుమారామభూతులును గోత్రభపాదపపరశుప్రాయులును నిబిడితజటాజూటబంధులును గమండలుమండితహస్తులును బ్రకటితయోగపట్టాభిరాములును బ్రహ్మసూత్రపవిత్రితభుజస్కంధులును భగవంతులు నగు నగస్త్యమహర్షులు లక్షలకొలంది వచ్చుచున్నారు.

పురం— ముజ్జగంబులు ముంచు కడలిపేరిఁటి పెనువెల్లి నుపశమింపఁ జేయుటకై రఘుకులధురంధరుం డగస్త్యోపదిష్టంబగు నగస్త్యాస్త్రముం బ్రయోగించెఁ గాఁబోలు.

మ. పతిభక్తిం బరిచర్యలం జలుపు లోపాముద్రలం గూడి ధా
తతరంబైతగు చీరతో ద్రుహిణసూత్రభ్రాజితాంసంబుతో
రతనంపుఁగనికొండ మండెడు తపోరాసుల్మునుల్ కర్ణసూ
త్రితరుద్రాక్షమయాక్షమాలికులు వీరే వచ్చుచున్నారొగిన్.

చారణ— నముచిమంథనప్రవృద్ధ మన్యుండవగు శతమన్యుఁడా! ఇట్లు దివ్యాస్త్రములచేతం దివ్యాస్త్రములనుపసంహరించుచు రక్షోలక్ష్మీవిరామండగు రాముం డొనరించిన పని నివేదించుటకు నాకు నమ్మకము తోఁచకున్నది. మాటలు తాకున్నవి! ఔరా దశాననునిప్రతాపము. (ఆలోచించి ధైర్యము తెచ్చుకొని) దేవా! నివేదించుచున్నాను. సావధానుఁడవై యాకర్ణింపుము.

సీ. ఏవేళఁ బల్కిన నీరేడు జగముల కానతి పల్కులే యానతిచ్చె
నే నాఁడు చూపిన నాశారిపుత్రాస కృత్కోపకలితహుంకృతులె చూపె
నే చాయఁ జూచిన వీచోఁపులిడు సురపద్మదల యాననాబ్జములె చూచె
నే కాలను నటింప నెల్ల మార్తురఁ ద్రుంచు శాతాసిఁ జంద్రహాసమె నటించె

గీ. నట్టి దశకంఠు మొగములయందు నొకటి
రామభల్లాగ్రలూనమై భూమిమీఁదఁ

బడిరి యంతఃపురస్త్రీల బాష్పధార
తోడ; బంధులు వేల్పుటింతులు జెలంగ.

పురం — ఓహో హో! దశరథమహారాజ! మన రామభద్రుఁ డతిదుష్కరమగు కార్య మొనర్చినాఁడు.

ఉ. ఏ తల చంద్రహాసమున నీశ్వరు ముందర మున్ను ఛిన్నమై
భూతము లెల్ల విస్మయము బొందఁగఁ గీర్తి వహించి మించెనో
యా తల నేఁడు రాఘవశరాహతిచే స్మరణీయమై రణ
క్ష్మాతలమందు దొడ్డచు విచారము గల్గఁగఁజేసెఁ గంటివే.

దశ — రాక్షసరాజునఁగా వీఁడే రాక్షసరాజు, వీని గాంభీర్యమే త్రిభువనశ్లాఘనీయము. ఇట్టి యవస్థయందును బ్రాచీనాహంకారము వదలలేదు కదా!

గీ. తెగి గళము నుండి పడు వీని మొగముఁజూడు
మింటిపైఁ దూపుపై దృష్టివెట్టుచుండె
నవదల నసునయింప లంకాభిముఖము
నగుచు రాముని దూషించి నగుచునుండె.

చారణి — దేవా, పురందర! మహారాజ, దశరథ! ఇఁక దశాననుని నవాననుఁడన వచ్చును.

చార — ప్రియురాలా! మంజువాదిని! ఇప్పటికి నవాననుఁడేకాని యిఁకనొక్క త్రుటిలో నిరాననుఁ డని కూడ నందువు.

దశ — ప్రతిభాశాలియగు చారణుని వాక్యము విని చేలచెఱంగున ముడివైచికొంటిని.

చార — (మింటఁ జెవియొగ్గి) నవాననుతో రాముఁ డేమేమో యనుచున్నాఁడు.
(తెరలో) ఓరీ రాక్షసీపుత్ర!

చ. మదమున గౌరికాళ్ళకు నమస్కృతి సేయఁగ సంశయించె నె
య్యది మును పాఁడుదంచు, నచలాత్మజపై ధృతిఁ గన్నువైచె నె
య్యది, తెగి నేలమీఁదఁబడె నయ్యది; నేఁటికి శాంతమయ్యె శా
మది సురబంధు లెన్నఁ బరిమార్చెద నింక భవన్నవాస్యముల్.

చార — రాజా! ఇప్పటికిని నవాననుఁ డుత్తరమిచ్చుచున్నాఁడే.

(తెరలో) ఓరీ! పిచ్చివాఁడ. సహజభ్రాంతిగల చర్మదృష్టిగలవాఁడవు. ఏ తలకా నాది తెగిపోయినది?

దశ—(ఆలోచించి నమస్కరించుచు) త్రిభువనైకవీరా! సునాసీర! రావణునిమాయ తలకాయఁ జూచి మిటింతకోపముతో రాముఁ డకాండచండంబులును నంతరితమార్తాండమండలంబులును నగు కాండముల వర్షము గురిపించుచున్నాఁడు చూడుమీ.

చారణి—దేవా! చూడుము చూడుము. నిబద్ధభ్రుకుటీకోటి కుటిల పట్టంబులును జరఠదంష్ట్రాదండనిష్ఠురదష్టాధరోష్ఠంబులును రభసనిస్సరద్దీర్ఘ హుంకారదారుణంబులును నగు లంకేశ్వరునితలలు రామశరలూనంబులగుచు నల్దెసలం బడుచున్నవి.

దశ—(చమత్కారముతో) భయహేతువు సమసినను దత్సంస్కారము కొన్నాళ్ళవఱకు వదలదు కాఁబోలును.

కం. ఏ యే దెసకుఁ గను రాముని
సాయకములఁ దెగినతలలు చయ్యనఁ బడునో
యాయా దెసఁ గల సురల
రొయ్యా! యని కాల్కాలఁదిఁ బాఱుచుండిరి భీతిన్.

(వేగముగాఁ గన్గొని) ఔరా! రావణుని మాయావిత్వము.

క. ఎడతెగక రామశరములు పడఁగొట్టుచునుండఁగాను బడిబడి మొలవం
దొడఁగె దశవదను శిరములు తడయక యిది యెుచట మాయ దారుణ మకటా.

మ. ఇనగోత్రుం డరివోయి నంపగమి పైనెల్లం బుధారాతికిం
బెనుగంధుల్వడ నల్కహెచ్చి ధృతగాంభీర్యంబుగాఁ బల్కనా
తని వాక్యంబుల నొక్కొకత్తెరమ కృత్తంబౌచుఁ బల్మాఱు పు
ట్టిన యొక్కొక్క మొగంబునన్ వెడలుచుండెం గంటివే వాసవా.

చార—(మింటఁ జెవియొగ్గి) అయ్యలారా! శతధాభిన్నంబు లయ్యు మరల మొలచుచున్న దశానను మొగంబులం గనుంగొని విసిగి యను మన రాముని మాటలు వింటిరా, (తెరలో) ఓ ప్రతికూలదైవమా! స్మరాంధుండనై నే చేయుకార్యంబు సైతము విపర్యాసము నొందఁ జేయుచున్నావు.

శా. శత్రువు చచ్చినం గద విచారము పోకయు భార్యరాకయున్
జిత్రము వీని యాస్యములు ఛిన్నములయ్యును మొల్చుచుండె నే
మాత్రమిఁకేమి చేయఁగల? మాయలమారి దశాస్యుఁ; డేవలా
షాత్రుఁడ నింతకుం గులము పొందగుకాలము వచ్చె నక్కటా.

రావ—(తెరలో) ఓరీ! రామ! అశీకశిరఃఖండనాడంబరముచే స్వాత్మను నిందించుకొనుచున్నావు. అవంధ్యజన్మములగు రాక్షసపతి తలలు నీచే ఖండింపఁబడునఁటరా.

రామ—(తెరలో) ఓరీ! పిశాచనాథ? నీమాయావిలాసములు చూచుటయందలి ప్రీతిచే నూరకుంటిని గాని లేనిచో నీవెంతరా.

గీ. తెగినయీ నీతలలన్నియు మగుడ మొలచు
చుంటయే నాకు వేడుక యోరిమూఢ!
ఎన్నిసారులు తెగఁగొట్టకున్న భార్య
నపహరించిన నీమీఁది యలుకతీఱు.

రావ—(తెరలో) ఓరీ క్షత్రియకీటమా, కాపటిక తాపస! మొట్టమొదట శివధనురారోపణసమయమందు నే వరించిన సతిని బెండ్లాడిన నీచే యమపతి వైతివి గాని వేఱు గాను. కావున నీతలయే వ్రక్కలు చేయఁదగినది రా!

రామ— ఓరీ పిశాచాశనా, నిశాచరనాథ!

ఉ. కోడలిపొందు సేయుటకుఁ గోరినవాఁడవు మూఢ! నీకిఁకం
గూడని నేఁత యేది? రవిగోత్రమునం జనియించి నట్టి మా
వాఁడెవఁడేని సైఁపఁ డపవాదయు సైరి; మకార్య మింక నే
వాఁడొనరించు? నిందులకు భాస్కరదేవుఁడె సాక్షి గావునన్,

కావున నట్టియపవిత్రపుఁ గూఁతలు గూయు నీనోరింకనైన శుద్ధమగును గాక.

చార—(ఆలోచించి భయముతో) రాఘవుని కోదండ పాండిత్యమును నిరుపమానమే, రావణుని పురుషకారమును సాటిలేనిదే. ఏలన,

గీ. దాశరథికృత్తమగు తనతలయె తాను
గేలఁగొని రావణుం డపలీల విసరి
యతనివక్షంబు గుఱిచేసినంత రాముఁ
డబ్జకుట్మలకులిశాక్షుఁడయ్యె దాన.

దశ—హా వత్స! రామభద్ర! ఈప్రహారణమెంతటిదోయీ. దీనిచేత నే మూర్ఛనొందితిని.

పురం—మిత్రమా! దశరథ! రామభద్రుని గుఱించి విచారింపకుము. ఇతఁ డెల్ల వీరులు విఱువలేని శివధనుస్సు విఱిచినవాఁడుగదా.

చార—దేవా! రాముని వచనము లాలింపుఁడు.

(తెరలో) ఓరీ. మాయావీ! మఱియొక అవయవముతోఁగూడ నీసారి నీతల ఖండించెద. కాని కేమాయ వన్నెదవో చూతము.

చార — కేవల మనుటయే కాదు; చేసి చూపించి మరల నేమో యనుచున్నాఁడు వినుండు.

(తెరలో) గీ. తెగియు విలుపూనెఁ బిడికిలి మగుడ మొలచి
తెగియు బాణంబు వట్టె వేల్మగుడ మొలచి
తెగియు గుఱిచూచె నక్షింబు మగుడ మొలచి
వార్ధిగట్టుట యొక్కటా వ్యర్థమయ్యె.

దశ — ఆహా! యీపిల్లవాఁడు ఛిద్యమానమాయాశిరఃప్రపంచవంచితశరలాఘవుండై తెగినయవయవములన్నింటిని మరల మొలపించుచున్న యీదశకంధరు నెట్లు జయింపఁగలుగునో తెలియకున్నాను.

పుర — కులాచలసందోహదహనంబునఁ గాలాగ్నిరుద్రుండు జయమందినట్లే.

చార — (సంభ్రమముతో) త్రిదశచక్రవర్తీ! నీవు సెలవిచ్చినట్లే జరిగినది.

క. దశదిశల మాయసెందఱు దశవదనులు చాపదండధరు లున్నారో
దశరథసుతులందఱు నాదశరథసుతుఁ డొక్కఁడయ్యెఁ దాఁ గెంగనుమా.

దశ — నేఁటికిఁ బురందరప్రసాదము నాయందు ఫలించినది. యుద్ధమున మాపిల్లవాఁడు దశాననుని నతిక్రమించుచుండఁగాఁ జూచుచున్నాను.

చార — ఆకసమునఁ జెవియొగ్గి. ఇదిగో! రాముని మాటలు.

(తెరలో) అవుఁగాక. విశ్వామిత్రుఁ డుపదేశించిన మాయాహరాస్త్రముచే నీమాయావి మాయ నడంచెద,

చార — (బాగుగ నవలోకించి) దశరథమహారాజ! నేత్రములఁ దృప్తి వఱపుము చూడఁదగినది చూడుము.

గీ. రామనిర్ముక్తమాయాశరంబుచేత
మాయ చూచుచునుండఁగ మాయమయ్యెఁ
దలలు సర్వాంగములు దెగి యొక్కతలయె మిగిలె
రావణుం డొక్కఁడే యుండె రథమునందు.

(నాల్గుదిక్కులు గలయంజూచి) రావణభయశరణాగతసమగ్రనాకియై పినాకియుఁ, త్రిభువనస్వస్త్యయననిమిత్తము ద్రాగ్విస్తృతబాహ్వగ్రుఁడై బ్రహ్మయు నిరంతరచింతానిశ్చేతనుండై ప్రచేతసుండును సంభావితజగన్నాశుండై శ్రీనా

శుండును సముపాలబ్ధవిధియై విధియు రిపుగ్రామనిధనమున్డై ధనదుండును దూరీకృతస్తరణుండై సమీరణుండును విగళితవనుండై విభావసుండును దురవత్యజవన నిందితపులస్త్యుండై యగస్త్యుండును కళ్యాణధ్యాననిష్ఠుండై వశిష్ఠుండును సామ పారాయణవికాసితమిత్రుండై విశ్వామిత్రుండును భయాలాపస్ఫురితాధరుండై విద్యాధరుండును నుండ భువనాభోగమంతయు నిర్వాణోద్యతచారణంబుగను హాహారవముఖరబృందారక బృందంబుగను జేయుచు ప్రాణములయందలి యాశవదలి గాత్రునేశ్వరుండు సమీపించి రాముని రథంబుతోఁ గూడ సందిటఁ బట్టి గిరగిర ద్రిప్పుచున్నాఁడు.

దశ — (నమస్కరించి) భగవతులగు రఘుకులదేవతలారా! దశరథు ననుగ్రహింపుఁడు భగవంతుఁడా! ఇంద్రా! దంభోళింగాని యంభోధరలాంఛనంబగు చాపంబు గాని ధరింపుము. రామచంద్రుని రావణరాహువు మ్రింగుచున్నాఁడు. (అని మూర్ఛపోవును)

పుర — ప్రియవయస్యా! ఏల వ్యాకులపడెదవు. జలదమాల యెంతదాఁక మార్తాండమండలమును గప్పఁగలదు.

దశ — (నాల్గువంకలకుఁజూచి) ఓ సమరసుందరా! చూడుము. చూడుము.

గీ. తురగములతోడ సారథితోడ సిడము
తోడఁ జక్రయుగంబుతోడఁ గూడ
రామునిరథంబు నింగిపై రావణుండు
కటకటా! త్రిప్పుచుండె బొంగరముపగిది. (మూర్ఛపోవును)

పుర — ఔరా! యీ రాక్షసరాజెంత భుజపరాక్రమములు గలవాఁడో

శార — సముద్రమును మకరాలయమని వర్ణించుటెందుకు?

(తెరలోఁ బెద్దకలకలము అయినతరువాత)

చ. దశదిశలేల నెవ్వనికి ధాత సృజించె దశాననంబులుం
దశయుగబాహుఁడై యెవఁ డుదాత్తుల నందఱఁ గోలుపుచ్చె నా
దశముఖు నాజిలోఁ ద్రిదివధాముల చిత్తము లుల్లసిల్లఁగా
దశరథసూతి గూల్చె విదితంబుగఁ దాఁ బవివాఁడియమ్ములన్.

దశ — (విని) ఎవరయ్యా యీమహానుభావులు! శ్రవణామృతవృష్టిచే మమ్మూరడించుచున్నారు.

శార — దేవా! ఇవి యూరడింపుమాటలుగావు. లంకావైతాళికుఁడు విభీషణునకై ప్రియము నివేదించుచున్నాఁడు.

దశ — అట్లైన భగవంతుండగు సహస్రలోచనుండేల యీప్రియము నివేదింపఁ బడలేదు.

చార — దేవా! వినుము.

> గీ. భూమియంతయు నొకసారి బ్రుంగునట్లు
> రాక్షసేంద్రుండు శ్రీరాము రథము ద్రిప్పఁ

దశ — (కొంచెము లేచి) రావణునిచేత ద్రిప్పఁబడిన రథంబు క్రిందఁ బడకుండఁ బట్టుకొని పిల్లవాని నెవ్వరైన బ్రతికించురా లేదా.

చార — (సంతోషముతో) దేవా! ఎవ్వరును బ్రతికింపనక్కఱలేదు, మాట యూనవాలుపట్టి.

> దశరథ నామ వాని పదియవ తలయుఁగూడ
> రాఘవుఁడు ద్రుంచె నొక్కశరంబుచేత.

పురం — (నవ్వి) నీయొద్ద శబ్దవేధిత్వము నేర్చుకొని నీకొడుకు నీకంటె నెక్కువ వాఁడాయెను. రాముని బాణమునుండి వెడలిన బ్రహ్మాస్త్రముచే మనకిట్టి భద్రము చేకూరినది.

దశ — ప్రియము ప్రియము. సంతోషము సంతోషము.

చారణి — ఆర్యులారా. దేవతలందఱు దుందుభులు మోగించుచున్నారు, కుమారునిపైఁ బుష్పవర్షము గురిపింపనున్నారు. కారణమేమి.

చార — కారణమా. వినుము.

> గీ. ఒక్క మొక్క విభీషణుం డుండునట్లు
> తులువపాలదిండికొలమును దుంపదెంపి
> మాయచేఁ బెక్కుసారులు మరలబ్రదుకు
> పంక్తికంఠుని జంపినప్పటికి సురలు.
>
> గీ. కేరి దుందుభి మ్రోఁతఁ బ్రమోఁగింపరైరి
> ఎలమిఁ బువుసోనలును గురియింపరైరి
> మరల జీవించునేమొకో మాయలాఁడు
> రావణుండను భయమున రాజవదన.

(తెరలో)

మ. ధ్వజదండంబు శరాళిఁ దూంట్లుపడ గృధ్రశ్రేణి పల్యంక మాం
సజిఘృత్సం దిరుగాడ సారథియు మూర్ఛం జెంది యాలంకకున్
నిజదోశ్శక్తి కొలందిఁ దద్రథిను మొందెం బూశఁగాఁ దోలె దై
త్యజనస్వామి రథంబు వెంట రథిధాత్వర్థంబు లేపారఁగన్,

గుహుం— సఖుఁడా! రామభద్రుని పురుషకార మనన్యసదృశాకారము.

శ. గుహలం దల క్రౌంచశైలమునకుం బిలమొక్కటి గొట్టె శంభుఁడుం
దహనము పాలుచేసెఁ బురదానవులంచు వచింత్రుగాని యా
తహతహ చూడ మోదశరథా! పదిమోములఁ ద్రుంచి రావణున్
నిహతునిఁ జేసె వీరగణనీయుఁడు కాఁడొకో! రాముఁడద్దిరా!

చార— (నవ్వి) దశాననుఁడు చచ్చెనని సంతోషించు వేల్పులయూఁక మనదాశరథులపైఁ బ్రసూనవర్షముఁ గురిపించుచున్నారు.

(తెరలో)

మ. యామినీశులార! పొందు నిలయంబుల కోసురలార! వేల్పురా
సామజరాజమున్ దనదు సాలకుఁ బోలుము మావటీఁడ! యా
రామమునందు దయించుఁడు సురద్రుమపుష్పములెల్ల నంతక
స్వామి భటుల్ దశాననుని వక్త్రముఁ గట్టిరి కోటకొమ్మకున్.

చార— ఈపురందరప్రతీహారుని వచనములచే దేవేంద్రుండును భూలోకదేవేంద్రుండగు దశరథమహారాజుం గూడ సద్యస్తుష్టవంతులైరి. ఇంతయుద్ధముఁ జేసిన రాముని శరీరమావంతయుఁ గసిగందకున్నది

గీ. రణరసికు రామచంద్రు దేవతారమణులెల్ల
పుష్పవర్షము గురియఁ దమ్ముని బుజంబు
మీఁదఁ గేలిడి డిగె జగిమీఱ మాగ
ధులు నుతింపఁగ రామభద్రుండు తేరు.

(అందఱును నిష్క్రమింతురు)

ఇది... శ్రీ తిరుపతి వేంకటేశ్వర విరచితంబగు నాంధ్రబాలరామాయణ నాటకమున నవమాంకము.



శ్రీరస్తు

# బాలరామాయణము

## దశమాంకము

(తరువాత ఏడ్చుచు లంక ప్రవేశించుచున్నది)

లంక — హా! దుర్వారతపోవిశేషపరితోషితనీరజాసనా! హా త్రిభువనైకమల్ల! దశకంఠ! హా! హేలాబందీకృతమహేంద్రా! మేఘనాద! హా! సమరసంరంభ నుపరిసన్న! కుంభకర్ణ! యెచ్చట నుంటిరి. మాటుమాటాడరేమి?

అలక — (త్వరగాఁ బ్రవేశించి ముందుఁ జూచి) ఇదిగో లంక! దశాననుఁడు కత తేటవని యేడ్చుచున్నది. (ఆలోచించి తనలో) ప్రభువులు దుర్గుణవంతులైనను భృత్యులయెడ నాదరము కల్గినవారైనచో గతించినపిదప వారిచే స్మరింపఁబడుదురుగాదా! (ప్రకాశముగా) సఖీ! లంకా! నిఖిలవలీముఖుల బలాత్కారము విని నిఖిలనాకితలతిలకాయమానంబగు నమరావతియు మర్త్యమండలపురీసముజ్జయిని యగునుజ్జయినియు రసాతలభోగభంగీభూతయగు భోగవతియుఁ దదనుచరంబగు సకలపురీచక్రంబును నీకుశల మరయుటకై నను బంపిరి. నేనును సఖీస్నేహముచే వచ్చితిని.

గీ. కూలిపోలేదుగద దివ్యకుజచయంబు
కాలిపోలేదు గద సౌధగణము వ్రాడ్చ
లేదుగద పరిఖాళి సాలాదులెల్లఁ
గూలలేదుగదా చేల కుండెదిపుడు,

లంక — (గద్గదస్వరముతో) సఖీ కైలాసోత్సంగవాసినీ! కుబేరపుణ్యరాశీ! దేవతానిలయా! అలకా! అన్నియును జరగినవి. వాయుదేవునివలన నంజనాదేవియందుఁ బుట్టిన వానరుఁడొకఁడు మకరధ్వజునకుఁ గులభవనంబును మలయవాయువునకు విశ్రామస్థానంబును హృదయంబున కానందకరంబును నెల్లపుడు వసంతున కునికిపట్టును బంచవిధకల్పద్రుమారామభరితంబును నగునశోకవనము నుకుమారకామినీకరతలకోమలంబులగు కిసలయంబులతోడను లాటలలనాధరోష్ఠమంజిష్ఠంబులగు పుష్పగుచ్ఛంబులతోడను గూడి, బందీకృతలగు దేవతాకాంతల చరణప్రహారదోహదములయందుం దనులుకొల్పిన లత్తుకచిహ్న

లతోఁ గూడిన వృక్షములతోఁ గూడఁ దగులఁ బెట్టెను గదా! నేఁడు పాతాళలోకంబు వఱకు వ్యాపించియున్న యగడిత గుట్టు బట్టబయలై యున్నది. మార్తాండునికయిన దాఁట రాని కనకప్రాకారంబు దలఁచుకొనఁదగిన దాయెను. పొడయిపోయిన మణిభవనంబుల చొప్పు చూచిన దయలేనివానికైనను జాలిపుట్టకమానదు. హతశేషులగు రాక్షసుల కన్నీటి కాలువలచే సముద్రము పొంగి లంకను ముంచుచున్నదా యనునట్లు తోఁచుచున్నది. ఇంతకంటె నొక్కమాటే యట్లు జరగిన బాగుండును. సమాన సుఖదుఃఖ యగు చెలితో నేమని విన్నవించు కొందును. నాకుఁ గలిగిన యాపదలు తలఁచుకొనినఁ దీఱునవి కావు.

అలక — సఖి! లంకా! భీషణవిభీషణుండును ధర్మస్వభావుండును రాఘవానుగ్రహపాత్రుండు నగువిభీషణుండు నిన్నేలువాఁడై యుండ నీకేల చింత? పూర్వవృత్తాంతములన్నియు మఱచిపొమ్ము. బాష్పబిందువులు స్రవింపఁజేయుట మానుము. ముది యుమ్మెత్త మొగ్గ చిగురువలె నున్న దృష్టియందలి రక్తిమను మాన్పుకొనుము. మాసిన కుసుంబారంగు గుడ్డపేలికవలెనున్న యధరోష్ఠము మరల నెప్పటికాంతిని బొందించుము. పరిమాళాధికంబు లగు నిట్టూర్పులం దగ్గించుము.

లంక — కుబేరనగరి చెప్పినట్లే చేయుదును.

(తెరలో) గీ. ధాత్రి! వరుణాని! లక్ష్మి! రుద్రాణి! దివి! స
రస్వతీదేవి! సావిత్రి! రామరామ
శుద్ధికై నేఁడు వహ్నిలోఁ జొచ్చుచుండె
రండు దిక్పాలురును మీరు రామరామ!

లంక — (విని) విశుద్ధికిఁ గారణమేమి?

అలక — రాక్షసగృహవాసమఁట. (ఆలోచించి నవ్వి)

గీ. రాక్షసుని యింటనున్నదీ రామయనుచు
కట్టుగట్టిరిగా రామరామ కటకట!
కటికి చీఁకటి నలుప్రక్క గవియఁగాక
యట్లజాబిల్లి యెప్పుడైన నల్లపడునె.

లంక — అట్లేనిఁ బోయి చూతమురా.

అల — కుబేరుని యనుగ్రహమువలన దివ్యదృష్టిచే నేనిచ్చటనుండియే చూడఁగలను

లంక — అటులేని నాతోఁగూడఁ జెప్పుచుండుము.

అలక — ఇదిగో రామునిరాణి భగవంతుఁడగు వైశ్వానరునియందు శరీర మాహుతి చేయఁదలఁచి జాలిపుట్టించు కేఁగింకారములతో లకుముకివలె నేడ్చుచు నగ్నిని స్తోత్రము చేయుచున్నది. విశుద్ధికిఁగూడఁ గారణము చెప్పుచున్నది.

లంక — ఏమని, చెప్పుము?

అలక — ఆలకింపుము.

ఉ. ఎవ్వనిచేతిలోనఁ గల దెల్లసుపర్వులతిండి, చిత్తజుం
డెవ్వనిచేతవయ్యె మరుఁ, డెవ్వఁడు విప్రులకుం బలంబు, దా
నివ్వలి కించుకే న్గదల దెవ్వనిచే జలరాశి, కాంతులం
దెవ్వఁడు మేటి వాని నుతియింపఁగ శక్యమె వీతిహోత్రునిన్.

మఱియును — గీ. చెలియు మిత్రుండు ప్రభువు దేశికుఁడు శిష్యుఁ
డందఱును నాకు రాముఁడే యానుగాన
నెన్ని జన్మము లెత్తిన నెన్నఁడైన
నతనిఁ బతిగాఁగఁ జేయుమో హవ్యవాహ.

(లంకిణంకకుఁ జూచి) పిదపటి వృత్తాంతము వజ్రహృదయులైనవారు తప్ప వినఁదగినదియుఁ జూడఁ దగినదియుఁ గూడఁ గాదు.

లంక — అన్నా! జనకనందిని యెంతమాటన్నది! వినినచో రావణునిభార్యల హృదయంబులు గూడఁ బగులక మానవు. గగనాంగనమునుండి వర్షముల వలె బాష్పబిందువులు పడుచున్నవి. తరువాత?

అలక — తరువాత.

ఉ. ఎంతగనుండునో జ్వలనుఁ డేమియొనర్చునో సీత రాముఁడే
మింతగనుండునో భువనవీరుఁడు లక్ష్మణుఁ డేమి చేయునో
యంతయుఁ జాతమంచు జనులందఱు విస్మయమంది చూడ నా
వంతయు సందులేక దివినంతటఁ గప్పెను దేవయానముల్.

తరువాత — గీ. వహ్నిలోఁ జొచ్చుతఱినేని వన్నె చెడని
సీతసౌభాగ్యము గని సురస్త్రీలు పూల
సోనఁ గుఱిసిరి వెలహెచ్చెఁజూచుచుండ
వేలుపుం జెట్లకడఁ బుష్పమాలికలకు.

తరువాత నంతర్హితలై చూచుచున్న యరుంధతీప్రభృతులగు పతివ్రతలందఱు నిట్లనిరి.

ఉ. రావణు నింట నున్నదను రట్టు తరింపఁగఁ జొచ్చుచున్న దో
పావక! సాధ్వి సీత కులపావని నీపెనుమంట చల్లనై
పోవఁగదయ్య; యెచ్చటికిఁ బోయి పవిత్రుఁడ వౌదువయ్య యీ
దేవి బిసప్రకాండమృదుదేహముఁ గాల్చెదవేనిఁ జెప్పుమా.

లంక — అహో! దేవతలకుఁగూడ సీతయందలి పక్షపాతము! అందఱును గుణముల యందాసక్తులగుదురు గాని శరీరములయందుఁ గారు.

అలక — ఆహాహా! పతివ్రతామయం బగు తేజ మితరతేజములచేఁ దిరస్కరింపఁ దగినది కాదు. ఏలన —

గీ. శుద్ధికై, లోకులందఱుఁ జూడఁ, సీత
భర్తయెదుటనె వహ్నిలోఁ బడుచునుండ
మంచువలె మంటకును శైత్య మించుకేనిఁ
గానరాదు పతివ్రతాగౌరవమున.

అయ్యో! అయ్యో! ఎంతదయమాలినవాఁడో యీహుతాశనుఁడు.

గీ. అంద ఱగ్గింప సురలంద ఱౌననంగఁ
బుడమికానుపు చిచ్చులోఁ బడినయంత
మింటి కెగఁబ్రాఁకుచున్నట్టి మంటలందుఁ
గానఁబడకుండఁజేసె నీశిఖులుఁడు శంటె!

లంక — ఈదుర్మార్గుఁడు దయలేనివారిలో మొట్టమొదటివాఁడు. ఎట్టివాఁడును గాక పోయిన మారాజాగారి యశోకవన మింతలోఁ దగులఁబెట్టునా.

అలక — సఖి! లంకా! ఇట్లు కొన్ని కలకలధ్వనులు గతించిన పిదప —

గీ. పావకునికంటె హెచ్చగు భవ్యమహిమ
దనరు ననసూయ యిడినపూదండఁ గొనుచు
వెడలి చనుదెంచె జ్వలనంబుఁ బుడమికాన్పు
కాలిబొట్టనవ్రేలిపైఁ గనులు నిలిపి.

క. ధైర్యమున నగ్నిఁజొచ్చిన యార్యయగు ధరాకుమారి కాపాదశిరః
పర్యంతముఁ దప్తకనకవర్యంబగు దేహకాంతి వచ్చెం దానన్.

లంక — అగ్ని దుర్మార్గుఁ డనుకొంటిమి గాని మంచివాఁడే. జనకతనయ యపవాద ముతోఁ గూడ శరీరమాలిన్యమును బాపెను.

అలక — సఖి, సర్వాంగ హిరణ్మయి! లంకా.

గీ. శుద్ధులగువారి కొండేల శోధకంబు
శుద్ధమగువారికేల విశుద్ధియనఁగ
వహ్ని తద్దేహలావణ్యవారిచేత
శీతమైపోయె నప్పుడా సీతయెడఁ.

(తెరలో)—గీ. అధిగతబ్రహ్మతత్త్వుఁడై మిథిలనేలు
జనకభూపాలమౌళికి సాధ్వి బిడ్డ

లంక—ఆమె కేమి?

తెరలో— యగ్నిలోఁబడి పరిశుద్ధయయ్యెనామె
రామునకు భార్య రఘువంశరాజవసువు.

ఉ. వారిధిఁగట్టి రావణుని వర్గముతోఁ దునుమాడి వహ్నిలో
దారవిశుద్ధిఁగైకొని యుదారత మీఱ విభీషణాదులం
జేర విమానమెక్కి దయచేయు నయోధ్యకు రామచంద్రుఁడా
దారిఁగలట్టి చందములు తద్దయు జానకితోడఁ జెప్పుచున్.

గీ. భరతునొద్దకు ముందుగాఁ బంపినారు
హనుమ నాతఁడు లంకాసురాంగనాచ
యంబు భయమునఁ గనుఁగొన నరుగుచుండె
రామపట్టాభిషేక కార్యములు జరప.

కావున నోప్లవంగయూథపతులారా! గోలాంగూల సేనాధినాథులారా! అచ్ఛభల్లచమూపాలకులారా! మహారాజ సుగ్రీవుండు మీకందఱకు నాజ్ఞాపించుచున్నాఁడు. వేగముగ సన్నద్ధపడుండు. త్రిభువనైక మంగళకలశంబగు రామచంద్రునితోఁ గూడ నయోధ్యాపురంబునకుం బోవలయు.

ఆలక—సఖిలంకా! మనముకూడఁ బోయి రామచంద్రదర్శనసుఖ మనుభవింతమా.

(నిష్క్రమించుచున్నారు)

ఇది విష్కంభము.

(పిదప సుగ్రీవవిభీషణులును సీతాత్రిజటలును రామలక్ష్మణులును విమానమెక్కి ప్రవేశించుచున్నారు)

రాము—(సీతవంకఁ జూచి)

చ. హరువను మిత్రుఁడైన యలకాధిపునొంచి హరించె రావణా
సురుఁ డిది, వానిచావున యశోధనుఁడైన విభీషణుండు చే
చ్చెర మనకిచ్చె దీనిఁ గయిసేయుము పుష్పకరాజము న్వలో
దరి! కని మోద ముప్పతిల దండము వెట్టుము ముందు దీనికిన్.

సీత—ఆర్యపుత్ర! పూర్వపశ్చిమసముద్రముల నడుమఁ బుడమికిం గొలదండమువోలెఁ దెల్లనై యుత్తర దిక్కాంతయు వైశాల్యముచే నాక్రమించియున్న దీని పేరేమి?

రత్న—అమ్మా, వైదేహీ! దీనికై యార్యపుత్రు నడుగనేల. ఈమీపాదదాసుఁడు సిద్ధముగా నున్నాఁడు. దీనిపేరు హిమవత్పర్వతమందురు.

సీత—ఇదియేనా, సమస్త దేవతలచే నమస్కరింపఁబడు సర్వేశ్వరుని చరణారవిందముల ప్రతిబింబములచేఁ జిహ్నితంబయి గంగాప్రవాహపవిత్రితంబులగు నితంబములతోడ గజాననుని దంతప్రహారములచేఁ జూర్ణితంబులగు చరియలతోడను ముక్కంటి తత్తడి డెక్కతాఁకులచే నలిగిన నేలతోడను సప్తర్షులచేఁ బూజకయి యుపయోగింపఁబడు పువ్వులచే నివ్వటిల్లు కల్పవృక్షములతోడను గౌరీదేవికిఁ దండ్రియని చెప్పఁబడు పర్వతము?

రత్న—ఔను. ఆపర్వతరాజమే యిది.

చ. హరునకు మామగాను గిరులన్నిటికిం బతి మేనకామనో
హరుఁడు గజాననుం గనినయమ్మకుఁ దండ్రియు వేయునేల ని
ర్వరి వరిధాన్యముండినచు వాసిగ స్వాశ్రమభూములం బరిం
తురు మును లిందు గేస్తులయి తోయజబాంధుని ధూర్జ్ఞచొప్పనన్.

సీత—ఆర్యపుత్ర! హరుఁ డీపర్వతమందే కాదా యర్ధనారీశ్వరుఁడైనాఁడు.

రత్న—ఔను. ఓవసుంధరాపుత్రి!

చ. పరిణయమాడి మేనిసగపాలొసఁగెం గిరికన్యకిందు శం
కరుఁడు మహానురాగమున గౌరియుఁ గైకొనె వేల్పులందఱుం
బరుసగ మ్రొక్కుచుండఁ బిదపం దనవామకరంబునం దదా
దరమున నొండుకేల వడిఁ దాళము వేయుచు నవ్వెఁ బక్కనన్.

రాము—ఈనీహారగిరీంద్రము సర్వాద్భుతనిధానమని వేఱ చెప్పవలయునా!

రత్న—దేవరవారు మంచిమాట సెలవిచ్చితిరి.

చ. గిరిసుత పెండ్లి యిచ్చట భగీరథపుత్రిక పుట్టుపుం గజా
సురపతిచావు నిచ్చట నజుండొకశీర్షముఁ బాసె నిచ్చటం
దురగముఖుల్ వెలందుకలతోఁ దమపిన్నటనాఁటి పార్వతీ
వరుచరితంబుఁ జెప్పుదురు బాపురె! యీగిరి సన్నుతికర్యమే.

సీత—ఈహిమవత్పర్వతమందే చంద్రశేఖరుఁడు మకరధ్వజునిం దగులబెట్టెనని మా పెద్దలు చెప్పుచుందురు. అది యెచ్చటనో.

రత్న— మరకతమణిమరీచినిచయంబుచే నిర్మింపఁబడినదియుంబోలె శరీరపంకశనీల కాంతులచేఁ గప్పఁబడ్డదివోలె ననూరుసారథిరథతురంగరోమపఙ్క్తులచేఁ బరికల్పితమైనదానిరీతి శితికంఠకంఠచ్ఛవిచే రచియింపఁబడ్డదివోలె నున్న యీ యాశ్రమమే యీశ్వరుని యాశ్రమము.

మ. ఇదియే నమ్మరో దేవదారువన మిందే వాసవుం డంపఁగా
మదనుం డిందుకళావతంసునిపయిం బాణంబు సంధించి యా
పదకుం బాలయినాఁడు తన్నయనభూవైశ్వానరజ్వాలచే
నెదుటం బార్వతిఁ జూడఁ బోవ్రుమని దేవేంద్రాదు లగ్గింపఁగన్.

సీత— పరమేశ్వరుని శరీరమందుం బ్రయోగించి బాణతైక్ష్ణ్యంబుఁ బరీక్షించిన యీ మకరధ్వజుని యాశ్రమ మెక్కడనున్నది?

రత్న— చ. ఇది మదనాశ్రమంబు రతియేచుమి యిచ్చటి చెట్లు పెంచె నీ
మదకలకూజితాండజసమాజము నాయుమ పెంచె సర్వదా
యిది రసరాజసంభరిత మిందువసంతులు నిందునుండు రి
ప్పదమున నుండు నెల్లపుడుఁ బంచమరాగము గూడ జానకీ.

సీత— (సంతోషముతో) పుంజీకృతం బగు నార్యపుత్రుని కీర్తిరాశి ననుసరించి పెరుగు మొక్కంటి యట్టహాసమునఁ బ్రిశయాగ్నిచేఁ దోడుకొనిన పాలసముద్రమునఁ బ్రకాశించు నీకొండపేరేమి?

రాము— రుద్రనివాసం బగు కైలాసం బనుకొనియెదను.

రత్న— తాటకాతాడనులగు దేవరవారు సెలవిచ్చినట్లె—

మ. ఇది కైలాసము వెండికొండ యుమతో నిందే గిరీశుండు స
మ్మద మొప్పారఁ గుబేరునంమఁ గలప్రేమం గాఁపురం బుండు మా
న్ను దశాస్యుండు భుజావలేపమునఁ గన్నుంగాన కీయద్రినే
కదలించెం గనుపట్టు నిప్పటికిఁ బ్రక్కం దన్నఖచ్ఛేదముల్.

ఈకైలాసపర్వతమునందే యొకపట్టణము గలదు.

చ. ఇది యలకాపురం బునికి యింతెపు డాహరుసంగడీని కీ
యది పెడవింటి చెయ్యాలగు సాకర, మేల బహూక్తు లుత్సవ
ప్రదలగుచుండు రిందు దశవక్త్రుఁడు వచ్చిననాఁటనుండియు
న్నదురుల నిండ్లలోన మొగసాలల వీథులఁ గాంత లందఱున్.

రాము— (ముందుఁజూచి) సర్వతటాకంబులను మించి సముద్రంబువలెఁ బ్రకాశించుచున్న యీచెఱువు పేరేమో?

రత్న — కలహంసలకుత్పత్తిభవనంబును గనకారవిందంబుల కాకరంబును దేవదేవునకు విలాసదీర్ఘికయు గజాననుండు దిగికలఁచుటచేతఁ బంకిలంబై తరంగంబులఁ బాసినదియు గగనమున సంచరించు చంద్రునియంజలి లేడిచేఁ ద్రాగఁబడు జలబిందువులు కలదియుఁ దీరంబున గూళ్ళువెట్టిన కుమారుని మయూరంబుచేత మెడసాచి నీళ్ళు గొనఁబడునదియుఁ గరిమకరగాఢాశ్రవణ భయంబునం జేసి యైరావతంబుచేత సేవింపఁబడు శాద్వలోపకంఠము గలదియునై, తీరంబున హరవృషభంబును దేవదారువనాంతరంబున నాదివరాహంబును సలిలగర్భంబున నాదికమఠమత్స్యంబులును గలిగి మూఁడుకాలములయందు నరుంధతిచేఁ గోయఁబడు పత్రిపుష్పములచేఁ బవిత్రితంబులగు కమలినీలతలచే మానసంబునకు సంతోషంబు ముప్పిరిగొనఁ జేయు మానససరోవరము. (సీత వంకకుం జూచి)

చ. రమణిరొ చూడు మానససరస్సిది పార్వతి దీనిలోని ప
ద్మములను గోసి యీశ్వరుపదంబులఁ బూజయొనర్చు గంగ ని
ర్గమమిట నీశ్వరోక్షఖురఘట్టన పూతమునైన దీని నీ
ళ్ళమలము లంచు సప్తఋషు లాడటఁ గొందురు పర్వవేళలన్.

సీత — రత్నశేఖరా! ఎల్లపుడు ముదిమిలేని వృక్షములచేఁ బ్రకాశించు నికుంజంబులును మార్తాండుని రథచక్రంబునకుం దగులుకొను శిఖరంబులును గల యీ పర్వతము పేరేమి?

రత్న — తల్లీ జనకరాజనందనీ!

ఉ. వాసుకి త్రాడుఁ జేసి సురవైరుల వేల్పులఁ ద్రిప్పువారిఁగాఁ
జేసి పయఃపయోధికలశిం గిరియొక్కటి పెద్దకవ్వముం
జేసి మథించె వెన్నుఁడని చెప్పుదు రంతియ కాని చూడలే
దో సతి యల్లమందరశిలోచ్చయమే యిది వేడ్కఁ జూడుమా.

(రాముని వంకకుం జూచి) దేవా! శత్రువులపై విషముగ్రుమ్మరించు నదియు మిత్రుల పయి నమృతము చిలికించునదియు నగు నీకందోయి నిందుఁబఱపి చూడుము.

గీ. పాలమున్నీరు దీనిలోపలనె సుధయు
శశియు మొదలుగ రత్నము ల్సంభవించె
నిందువోడమిన సురతరు లిడినపూల
సరముచే లక్ష్మి వెన్ను నిచ్చట వరించె.

రామభద్రా! యీపైపునఁ గూడఁ గనఁబడుచున్నదానిం జూడుమా—

గీ. పగలు రాతిరి యని వేఱుపఱుపఁ దరణి
దేనిచుట్టును నిత్యంబుఁ దిరుగుచుండు
నా కనకశైలమిదియె పాకారి సురలఁ
గలసి క్రీడించు దీని మేఖలలయందు.

రామ — ఓహో పుష్పకరాజమా! యింతకంటెను గొంచెము పైకిఁ బొమ్ము. వీరం
దఱు దివ్యక్షేత్రదర్శనకుతూహలంబున నింకను దృష్టిపఱచుచున్నారు.

(అందఱును విమానవేగమును నటించుచున్నారు)

సీత — మొగలిపూవుపుప్పొడివలెం బర్వఘనసారపుంజమువలె ముక్తాఫలవిశదచ్ఛాయ
వలె నానందము గలుగఁజేయుచున్నది ఇట్టివెన్నెల యెందుండి వచ్చుచున్నది?

రాము — చంద్రలోకసమీపమునకు వచ్చినామని తోఁచుచున్నది.

రత్న — ఔను. మారీచమారకుండు సెలవిచ్చినట్లె.

ఉ. చందనపంకలిప్తమగు చందము నింగికిఁ గల్గజేయునీ
యిందుని జూడుమా సురలయేనికదంతపుముక్కపోల్కిగాఁ
జందనగంధులెల్ల మరుజాబులు వేడ్కఁబఠింప దీపమై
యిం దుదయించుచుండె ఘృణులింపగు ముత్తెపుఁగోవలట్లుగన్.

(సీతవంకకుఁజూచి)

చ. పొలఁతులమోముతోడ సరిపోల్పఁగఁ జాలినవాని దాక్షిణా
త్యల మృదుదంతకాంతులకు దాపగు కాంతులవానిఁ జూడు మో
లలనరో! పార్వతీపతివిలాసశిరోమణిఁ గామతంత్రదీ
క్షలకు గురు న్మృగాంకుని వికర్తనవంశ్యుల కెల్లఁ జుట్టమున్.

(రాముని వంకకుఁ జూచి) దేవా! ఇంతకుఁ బైని భూమి లస్మాదృశులు పోఁదగినవి
కావు. అందు బ్రహ్మలోకమున్నదని విందుము. అచ్చట బ్రహ్మర్షి
పరివారముతోఁగూడి పరమేష్ఠి గరిష్ఠంబగు తపోనిష్ఠతో నుండునఁట

రాము — (చమత్కారముగా)

చ. హరి ధరియించె బొమ్మనఁ బ్రియం దనమేనిసగం బొసంగె శం
కరుఁడును భార్యకంచు మదిఁ గన్గొని పిన్నటనాఁటనుండి యీ
కరణి సరోజసంభవుఁడు కామినికిం దనమేన నైక్యముం
బొరయఁగఁ జేయఁగాఁ దలఁచి ఘూర్ణతపం బొనరించుచుండెడిన్.

(అందఱును నవ్వుదురు)

సీత—గగనాంగణపుష్పమగు నోపుష్పకమా! దయయుంచి మరల నంబురాశితీరంబునకుం దిగుము. జలనిధియానపాత్రంబును నార్యపుత్రప్రతాపప్రథమమార్గంబునగు సేతుబంధము చూడవలయు నని యున్నది.

రత్న—దేవా! రామభద్ర! నీకు జయమగు. నేను బోవుచున్నాను.

(నిష్క్రమించుచున్నాఁడు)

త్రిజట—(సీతవంకఁగనుంగొని) వరుణదేవునియింటి మోసలయుంపలి నీలమణికుట్టిమంబువలెఁ బాతాళతిమిరచక్రవాళంబునకు నిర్గమనమార్గంబునుంబోలె భువనమహామహీరుహంబున కాలవాలంబురీతి దిశావిలాసినులకు గోష్ఠిస్థానముపగిది గగనాభోగంబునకు నద్దముచాయ నున్న యీమహోదధిని బ్రియసఖి చేరలఁ గొల్వఁజాలు నేత్రంబులచే విలోకించుఁగాక.

లక్ష్మ—వధూనికా!

గీ. త్రవ్వె సగరుండు గంగయఁ దరుణినొసఁగె
ముదమున భగీరథుండు రాముండు కట్టె
మామలయు భర్తఁదియు దివ్యమహిమగ్నైన
సాగరం బిది చూడు మో చంద్రవదన.

సీత—లక్ష్మీలతాకందలికి మొదటిమొంపయు హరచూడాచంద్రున కుదయాచలంబును నైరావణంబునకుఁ గట్టుకట్టయుఁ బీయూషంబునకుఁ గలశంబు నగు భగవంతుఁడగు నుదన్వంతునకు నమస్కరించెదను.

రామ—చ అనయముఁ దీపిబువ్వ తినునట్టి సుపర్వులకున్న నిత్యయౌ
వనము వెలందిమిన్నలకు వారుణిచేయు వికారచేష్టలున్
బ్రణయపుటల్కఁ బాపి పతిపై యనురాగము పుట్టఁ జేయు చం
ద్రుని గనుఁగొన్న నందఱకుఁ దోయధిసారము తేటతెల్లమా.

లక్ష్మ—చ. అమృతము లచ్చియు న్విభుఁడు నప్సరస ల్మదిరారసంబు జ
న్మము గనె నెందు, పక్షులును మందు యదీయపయస్సమిత్తులన్
బ్రిమదముమీఱ నాజలధి భర్త యనుజ్ఞవహించె సేతుబం
ధమను మిషంబునం గిరులు తజ్జలపీఠికఁ దేలియాడఁగన్.

సుగ్రీ—దేవీ! భగవంతుండగు భాగీరథీవల్లభుని మహిమము త్రిభువనజయపతాకమగుచున్నది చూడుము—

ఉ. కాంతల మేలుబంతి యగు గౌరికిఁ దమ్ముఁడు మంచుఁగొండకు
న్వంతతిరైన పర్వతము లక్కిఁడు ఱెక్కలు ద్రుంచునంచు లో

కొంతయు భీతచిత్తయయి యీజలరాశిమహోదరంబునన్
సంతసమొంద డాఁగెను రసాతలపంకమునందు మైథిలీ.

విభీ—చ. గజముఖుఁ డీసరస్వదుదకంబుల స్నానము చేయ దానగం
ధజమగు నీసుచేత జలజంతులు పైకొన నేకదంతుఁడుం
గజిబిజిగాఁగఁ దద్భటులు కట్టలమోఁదుచుఁ బట్టి తెచ్చి యు
క్కుజముగ శంభునొద్దనిడఁగా విడిపించు నతండు ప్రేముడిన్.

సీత—(తిర్యగ్గమనమభినయించుచు) అఖండితాఖండలకోదండమండలప్రతిరూపంబగు నీమండలము పేరేమియో ?

విభీ—చ. సువతులకెందు మౌక్తికప్రసూంపులు పెక్కు లభించు దేనిలో
నిది మణిభూమిర్థైన యవనీధరరాజము కాంతలందు సొం
పుదొలఁకు నెచ్చటం గరికిపోఁచల వంటిది దానిఁ జూడుమా
యీయుదధియగడ్తగాఁ జెలఁగుచున్నది సింహళదేశమంగనా.

మఱియును—. గీ. అమృతము లభించు జనులవాక్యములయందు
రత్నములు పుట్టుచుండు పర్వతములందు
మత్స్యములు గల్గుచుండు సముద్రమందు
ద్వీపముల సింహళముఁ బోలు దీవి గలదె.

సీత—భగవంతుఁడగునగస్త్యమహాముని యీరోహణపర్వతముచెంత నేగదా యున్నది.

రాము—రోహణపర్వతము చెంతనున్న యిది లోపాముద్రాభర్తయగు నమ్మహాను భావుని యాశ్రమము అయ్యనఘుధర్మాశ్రమపథము ముందుఁ గనఁబడఁగలదు.

సుగ్రీ—దేవా రఘుకులతిలక ! ఇంతలోనె—

గీ. ముత్యములు పుట్టుచుండు భూములనుదాఁటి
వచ్చినారము కాటుకవంటినలుపు
గలిగి సాంద్రితమాలవృక్షములచేత
దిగ్విభాగంబు తెలియనిదేశమునకు.

రాము—(సీతవంకకుఁ జూచి)

గీ. పృథ్వికెల్లను మాల్యమై వెసురుపొదల
దట్టమగునిది మాల్యవంతంబు తరుణి
కనులుమూయుచుఁ దెఱచుచుఁ గలఁతనిద్ర
నీఁగుచుండు మతంగమునీంద్రుఁ డిందు.

సీత—[illegible] ?

రాము—ఔను. వైదేహీ.

ఉ. చీఁకటిచెట్లదండ వికసించిన మల్లెలు నిండ హంస లం
దాఁకనెరయుండఁ గేకులమదంబులు పండ వెదుళ్ళమొల్కలుం
బ్రాఁకుచు నాల్గువంకల నరణ్యము నిండఁగ నేగుదెంచె నే
నీకడ నుండ వర్షఋతు వింతిరో! దిక్కులు గానకుండఁగన్.

(ముందుకుఁ జూపించుచు)

గీ. ఈమయూరకుమారుఁ డోయింతి కొండ
చఱియలోనుండి మెడయెత్తి సఖియుఁ దాను
దాండవంబొనరించుచునుండెఁ జూడు
మనుపమస్నేహమయముగ మనలఁ గనుచు.

సీత—ఓమయూరపుత్రికా! యిటు రమ్ము. ఎగిరి యీవిమానశిఖరంబుపై కెక్కుము.

రాము—ఈజానకి యతిసుప్రసన్నురాలు గదా!

సుగ్రీ—(సీతవంకఁ జూచి)

గీ. తమలపుందీవగమి పూగతరుల నింత
మిరియపుందీఁగ లెల్లెడ మెఱయఁగా మ
లయగిరీంద్రంబు తనరు నేలాలతాలి
కడలిపైఁ బ్రాఁకఁ జందనాగముల వీఁక.

సీత—కామమిథునంబునకు విచారకారణంబును గామినీమానగ్రంథి విప్పఁగల నేర్పు గలదియు నగు మలయవాయువు విసరుచున్నది.

రాము—దేవి! బాగుగఁ దెలిసికొంటివి.

ఉ. ఉయ్యెలలందుఁ గామినుల నూఁచుచు నోజ్జల యొద్దనున్న రా
జయ్యలమేనిచెమ్మటల సేదలడంచుచుఁ దీపకల్కులం
దొయ్యనఁ జాలు నిల్పుచు రతోత్సవఖేదము వాపుచుండు నీ
వయ్యెర లీగిరీశ్వరముపైని జనించినవే తలోదరీ.

ఇంతియకాదు. మఱియు నిటుఁ జూడుము.

గీ. కాంచు రత్నంబులను మౌక్తికముల ననుచుఁ
గడలిదేవేరులం దెల్ల గౌరవమునఁ
దనరునది తామ్రపర్ణి యోతరుబోఁడి
యీగిరీంద్రము చఱియలందే జనించె.

ఈపర్వతమునకు సౌభాగ్యకారణ మిది యొక్కటియే కాదు.

గీ. తామ్రపర్ణి జనించె ముక్తాఫలముల
కునికిపట్టగునదియటుండ నిందుఁ
గంచెలకునైనఁ జందనాగములకంప
నారికేళరసంబుపానంబునకును.

రాము—(ముందుఁజూచి) సుందరీ! భూమినందనీ ! యీప్రక్కకుంజూచి దృష్టి పావనము గావించుకొనుము.

శా. దంతోలూఖలు కందభక్షకులు పత్రప్రాశను ల్ఫేనపు
ల్దాంతస్వాంతులునుం గుటీచకులునుం దశ్మాలపుక్వాశనుల్
చెంతం గాలఁగఁ బీతవారిధితపస్విశ్రేష్ఠుఁ డీపర్వత
ప్రాంతంబందున నుండె భార్యయగు లోపాముద్ర సేవింపఁగన్.

(చేయెత్తి)

క. పాగద్రాగుచు నీముని నిష్ఠఁగఁ దప మొనరించుచుండె సన్తాశ్వనియం
డెగుఁజూపునిలిపి, నీవా గగనము పైఁ జనకు పుష్పకమ ! నీడయగున్.

(కొంచెము దూరము నడిపించి) ఓ దేవయానరాజమా !

గీ. శివునిమందిర మిది ప్రదక్షిణము గాఁగఁ
బోయి క్షణమాత్ర మందు నిల్వుము మునీంద్రు
లచటనున్నారు వారిపాదాబ్జములకు
వందనము సేయుగతి నుంత వంగిపొమ్మ.

సీత—ఆర్యపుత్ర ! హుతవహునియందు హోమము చేయువారును బుణ్యశ్లోకుల కథలు వివరించువారును వేదంబులు చదువుకొనువారును ధర్మశాస్త్రంబు లుపదేశించువారును సమాధిమార్గంబులం జూపించువారును నతిథివర్గంబులను సేవించువారునునై యీపర్ణశాలాంతరమునను న్న జడదారులంజూచిన నస్త్రీ వృకులకుఁ గూడ సంసారగ్రంధి విడిపోవుచున్నది.

రాము—ఒపర్చిన నిట్టి తపమే యొనర్పవలయును. (ముందుఁ జూచి)

మ. సుమనో ల్వాజముఁ బూచె నీలతిక లిచ్చో వీరికై వ్యోమమా
ర్గమునం గోణము లారవైచితి మృగగ్రాసంబుచే వీరు వృ
క్షములం భిక్షము లెత్తుచుండిరి ఫలేచ్ఛ న్వీరు కంచుండి రా
చమనార్థంబుగ రిక్తపాత్రల మృగాచాంతంబులన్ వీరొగిన్.

(అంకటనుగాంచి) తరుణీ ! యీకుంభసంభవుని యాశ్రమవృక్షములం జూచి నేత్ర పారణముఁ గావింపుకొనుము.

గీ. చదివిచదివి వటువులు విశ్రాంతిఁ గొంద
నిత్య మెలమి లోపాముద్ర నీరువోయ
వృద్ధిచెందిన యిచ్చటివృక్షచయము
తప్ప కతిథులకై సర్వదా ఫలించు.

లక్ష్మ — ఈభూములన్నియుఁ దపస్విసంకీర్ణములే.

రామ — ఓ విమానరాజమా! ఎచ్చటనే నొకచోట నిలువుము. నే నగ్నిమారుతసంభవుండగు ముని నొకసారి చూచివచ్చెదను.

(అందఱును విమానములు దిగుచున్నారు)

సుగ్రీ — } దేవా! త్వరపడుము. ఈమైత్రావరుణుఁడు మల్లువెలఁగచెట్టుక్రింద భగవ
విభీ — } తియగులోపాముద్రతోఁగూడ మనల నెదురు చూచుచున్నాఁడు.

(పిదప అగస్త్యుఁడును లోపాముద్రయుఁ బ్రవేశించుచున్నారు)

అగ — భగవతి! ధర్మతనయా! లోపాముద్ర!

గీ. ప్రేమమయులయి త్రిదశు లర్చింప వార్ధి
గట్టి రాత్రించరులనెల్లఁ గసిమసంగి
తరుణితోడ వైమానికత్వంబుఁగొనఁగఁ
గాంచితిమి నేఁడు సంపూర్ణకాము రాము.

రామ — (సమీపించి) రెండుకాళ్లు పట్టుకొని —

గీ. జల్లుపూవులఁబోలు శరీరకాంతి
కలుగు మునిచంద్ర! పావకానిలకుమార!
కుంభసంభవ! భాస్కరకులుఁడు రామ
ప్రణతి కైకొమ్ము మిత్రావరుణకుమార!

(అందఱును నమస్కరించుచున్నారు)

అగ — గీ. దేవ! నిన్నేమి యాశీర్వదించువాఁడఁ
జల్పితివి ముజ్జగంబు నిష్కంటకమ్ముఁ
జేయవలసిన దొకటి యాశీర్వదింతుఁ
గొడుకులిర్వురిఁ గనఁగాతఁ బుడమికాన్పు.

రామ — రఘువంశము మిగుల ననుగ్రహింపఁబడినది.

లోపా — గీ. శార సాపత్న్య మొద్దకు రామచంద్ర!
[illegible]

నాయనా దశకంఠు బాణంబులెట్లు
పైఁచితివి వానితలలెట్లు చదిపితీవు !

రాము—(సిగ్గుపడుచు) తల్లీ ! లోపాముద్ర ! మహానుభావురాల వైనను స్త్రీస్వభావ సులభంబుగ మాటలాడుచున్నావు.

లోపా—(రాముని తల మూర్కొని)

గీ. అనకట్టకునై కొండలన్ని తర్పివ్వి
తనుచు నీయత్త కోపగించినదో యేమొ
నాల్గువారిధు లాచమనంబుఁ జేసి
నట్టి మావారితోఁ జెప్పవైతి కుఱ్ఱ!

అగ—ఓసుతపస్వినీ ! లోపాముద్ర ! వసిష్ఠుఁ డుంచిన రాజ్యాభిషేకముహూర్తము సమీపించినది. కావున రామునకు సెలవిమ్ము.

లోపా—వత్స రామభద్ర ! సగరభగీరథులను మఱపించి రాజ్యమేలుము.

(అందఱును లేచి విమానమెక్కుట నభినయించుచున్నారు)

సీత—పుణ్యవశమున నేఁటికి మాయమ్మను జూచితిని (అని భూమివంకకుఁజూచు చున్నది)

రాము—భూమిమాత్రమే కాదు. అందు ద్రావిడదేశములోనికి వచ్చితిమి.

ఉ. ఆసలు పోఁకలుం గపుర మాఱని మాస్తలు నేలకాయలున్
జోక యొనర్చు వీడియము సొంపును గల్గిన యట్టిదేశ మిం
దే కుసుమాయుధుండు వసియించును గేళిగృహంబుగాఁ జెవిం
దాఁకెడు నీదునేత్రముల దైర్ఘ్యము సార్థముగాఁగఁ జూడుమా.

మఱియును— గీ. కులుకుఁ గ్రీఁగంటిచూపులే ములికిగములు
గాఁగ ముక్కంటినైనను గాసిపెట్టు
ద్రావిడకాంతల బొమముడి దర్పకునకుఁ
గాముకులనొంచు రెండవకార్ముకంబు.

సుగ్రీ—(దక్షిణపువైపుఁ జూపించుచు) దేవా ! సప్తగోదావరీ తీరంబున నున్న భగవంతుండగు భీమేశ్వరస్వామికి నమస్కరింపుము.

రాము...(చేతులు జోడించి)

గీ. ప్రణతి యొనరింతు మేటి సత్త్వములచేతఁ
జుట్టుకోఁబడి పెంపొందినట్టిధవళ
పలితకాయంబు జడలనుపల్లవములు

గలుగు హరహరిచందనాత్మజమునకు.

( అందఱును నమస్కరించుచున్నారు.)

రాము — చ. అనుదిన మెందుఁ జేర్చి త్రివిధాభినయంబుల ముద్దులొల్క వా
మనయన లెల్లఁ గేలిమెయి మన్మథనాటక మాడుచుండ్రు మం
తనముఁ జూడుమా తెలుఁగునాఁడిది గౌతమి యేడుపాయలై
వననిధిలోపలం గలసె భామిని నీకుడికంటిచాయలన్.

మఱియును — గీ. హరుని సెగకంటిచే దగ్ధమైన పంచ
శరుని బ్రదికింపఁజాలు నౌషధులు సూవె
తెలుఁగునాఁటి సెలంతల కులుకుఁజూపు
లమలశారదపూర్ణహిమాంశువదన.

విభీ — ఉభయతటములయందును దట్టముగఁ గొబ్బరచెట్లును బోఁకచెట్లు నలమికొని
యున్న యీధునీలలామమే కావేరి.

రాము — దేవీ! కడలిదేవేరి యగు నీకావేరికి నమస్కరింపుము.

శా. కావేరీనది, వేణియై పుడమి సింగారించెఁ దాంబూలపుం
దీవల్ప్రాఁకిన పోఁకమోకగమి నిర్దేశించె నాశ్లేషవి
ద్యావైశద్యము ప్రాచికిన్మరలెఁ గర్ణాటీనితంబావిలం
బై విస్తారితదీయనాభిగుహలం దావర్తితంబై సఖీ.

మఱియును — గీ. వలుదవలిగుబ్బచందోయి లలితజఘన
భాగములు గల్గు కర్ణాటవామనయన
లెచట దృష్టిఁబ్రయోగింతు రచటికేగుఁ
డుంటువింటివజీరు ముందుఁబరువెత్తి.

సుగ్రీ — భరతాగ్రజ! ఇదిగో మహారాష్ట్రదేశము.

రాము — (చూచి ఆనందించుచు సీతవంకఁ జూచి)

మ. త్రిదివం బేగఁగ మంచిదారి నిగమశ్రీ సప్తమాంగంబు నై
తవఖండంబునకంటె స్వాదువు సువాచారూపనేత్రంబు స
త్కవి కావ్యంబు రచించు నెందు రసవత్కాంతంబు మాధుర్యమై
భవయుక్తంబుగ దీనినామము విదర్భంబండ్రు సుభ్రూమణీ.

మఱియును — గీ. సురతసౌభాగ్యవిద్యల సొగసు తెలిఁగి
నట్టి కుంతలకాంతల కందఱకును
నిరతమును విభ్రమంబులు నేర్పుకొనఁగ
శిష్యుఁడై కింకరుండగుఁ జిత్తభవుఁడు.

సీత—ఈ దేశమం దేకదా, యస్మత్పురాణశ్వశురపత్ని యగు నిందుమతీదేవి జన్మించి నది ?

త్రిజ—వింధ్యమహీధరంబునం బుట్టి యీదిక్కుగాఁ బ్రవహించుచున్న యీనది పేరేమో ?

సీత—నర్మదానది.

త్రిజ—ఎన్నాళ్ళకుఁ జూచితి నీనర్మదానదిని !

సీత—ఆర్యసుమంత్రుండు మమ్మడవికిఁ బంపి యిచ్చటినుండియే మరలిపోయినాఁడు

రాము—(ప్రక్కకుఁ దిరిగి సీతతో)

> గీ. జల్లులాటలయందు హస్తతలయంత్ర
> గలితజలధార నీవయిఁ గదియకుండఁ
> దరుణి గుబ్బలపైనున్న తామరాకు
> గొడుగుగాఁ బట్టుకొంటివి గుర్తుగలదె?

మతియును—

> గీ. ఒకరికొక్కరు దవ్వవయింటి మిచటి
> యినుమాతీన్నెలఁ బాలయుల్కు నింతి మనము
> కూర్చి వలిగాలి యొజ్జయై కులుకుఁ దెలుపు
> కౌఁగిలింతల నిది జ్ఞాపకంబు గలదె.

విభీ—(ఎడమప్రక్కకు వ్రేలు చూపుచు) విశ్వంభరాశిరశ్శేఖరాయమానంబగు లాటదేశంబిదియే.

రాము—(సీతతో)

> ఉ. వేలుపులాసకియ్యది నివేశము విద్యలనేర్తు రిచ్చటన్
> స్త్రీలును, భాషచూడఁ బరుషీకృతవర్ణము చిన్నమాటలన్
> గ్రాలెడు, మంచిప్రాకృతపుగద్య పఠించుచునుందు రిచ్చటన్
> బాలిక చూడుమా యిది యపారము లాటపదంబు కోమలీ.

మఱియును—

> గీ. లాటకాంతల గరిచేసి పోటుబంటు
> మరుఁడు సంధించుశరములు మరలి వచ్చి
> వాని సౌందర్య మరసి వివశతఁగన్న
> యిందువిల్కానిఁ గన్ని వేధించుచుండు.

సుగ్రీ — ఇది యుజ్జయినీపురము. భగవంతుం డగుమహాకాలనాథుని మందిరము.

రాము — (దోసిలొగ్గి)

గీ. మరుఁడు విడిచిన కేతకమార్గణంబు
మేనిపైఁ బడి వక్రమై నూన మేమ
హాసుభావునితలచంద్రుఁడనుమిషమునఁ
దనరు నాయీశ్వరుఁ డలంతు ననుదినంబు.

(సీతవంకకుం గనుంగొని)

మ. చటువాక్యంబుల కాటపాటలకుఁ జంచత్ప్రీతిఁ గ్రేఁగంటఁ జూ
చుటకుం జక్కనిమందయానముల మెచ్చుల్గల్గఁ గూర్చుంటకున్
జటులాంగంబుల మారసంగరమునం జండత్వముం జూప నె
చ్చటి ప్రోయాండ్రును జాల రుజ్జయినిలో జన్మించు ప్రోయాండ్రకున్.

మఱియును —

గీ. వింతజాబిల్లి కాయువెన్నెలలు తినఁగఁ
దెలివియును దేటయుఁ జకోరములకె కలదు
మదనసంగరమందలి మర్మములను
దెలివి తేట లవంతికాంతలకె కలవు.

సీత — గీ. వానకాలమునం దెందు వఱలుచుంట
కంటికింపగురీతిగాఁ గానిపించు?

త్రిజ — మాలవదేశమునందు.

సీత — కనుల కానందసుఖములు గలుగఁజేయు
మాలవంబిదియేసుమి మధురవాణి.

రాము — గీ. సుజను లెల్ల శృంగారులు సొగసుకాండ్రు
గల్గునీమాళవంబునఁ గమలపాణి
వానకాలములందు డాబాల నెక్కి
కూడియుందురు స్త్రీలతోఁ గోడెగాండ్రు.

సీత — వసుంధరాపురంధ్రి జడపాయవలె, వింటనుండి ద్రవించు పంకమువలె, నింద్రనీలకంఠికవలెఁ గాళిందీనది ముందు చెలువారుచున్నది.

రాము — ఉ. కాళియపన్నగంబునకుఁ గాఁపురమైన ధునీలలామ గం
గాళి కళిందపుత్త్రి యమునానదిఁ గన్గొను మేలు తెల్విడుం

బోలవు దీని, దీనికి యముం డనుజుం డరుణుండు తండ్రి తోఁ
జాలగు దీధితిం గనకశోధకముల్ జనియించుతాపియౌఁజా.

సీత—(నమస్కరించుచున్నది)

లక్ష్మ—ఆర్య! భగవతియగు నయోధ్య మిగుల దూరమువలేదు. అప్పుడే పాంచాల దేశములోనికి వచ్చినాము.

రాము—(సీతతో)

గీ. దేవి కనుఁగొమ్ము పాంచాలదేశములను
మనకుఁ జనుమట గంగాయమునల నడుమ
లౌకికములగు నర్మోక్తులకునుబోలెఁ
గావ్యములకిందుఁ గనరాదు గౌరవంబు.

అదియునుంగాక—

గీ. కామకల లఱువదినాల్గుఁ గఱతురనుచు
ఖ్యాతిఁగాంచిన పాంచాలకాంతలయెడ
వస్త్రిసన్న్యాస మొనరించు నంగజుండు
కులుకుఁ గ్రీఁగంటి సోగచూపులకు జడిసి.

లక్ష్మ—ఇదిగో! మందాకినిచేఁ జుట్టువారియున్న మహోదయపురంబునకు వచ్చితిమి

రాము— గీ. ప్రబలసౌధములందము నగలు కలవి
గానికోటయుఁ గలది యీ గాధిపురము
బెళుకు బేడిసమీల శోభలు హరించు
కులుకుఁజూపులఁ జూడుమో కోమలాంగి.

అదియునుంగాక—

గీ. శాతమూర్తాతశాతలతరములందుఁ
బరమపూతములని నుతింపఁబడు రెండు
అబ్జలోచన! యీకాన్యకుబ్జపురము
వారశిరఃకృతభూషణంబగు స్రవంతి.

మఱియును—

ఉ. చీరలకట్టుఁ బల్కుబడి చిత్రిమ విద్యలనేర్పు వేణిసిం
గార మలంకృతుల్సొగసుగా ధరియించుట యందచందము
లారయఁ గాన్యకుబ్జపురధామల భామలయొద్ద నోసఖీ
నేరుచుకోవలె న్సకలనీరజనేత్రలు వేయు నేటికిన్.

రాము—(సిగ్గుపడుచున్నాఁడు)

సీత— లంఘితసాగరుండగు హనుమంతునికంటె నాదృష్టికి శీఘ్రగమనముగలదు. ఇప్పటినుండియే యయోధ్యాపట్టనముం జూచుచున్నాను.

(అంతట హనుమంతుఁడు ప్రవేశించుచున్నాఁడు)

హను—(నమస్కరించి) దేవా! నావలన వృత్తాంతమంతయు విని వసిష్ఠుఁడు భరత శత్రుఘ్నులతోడను సకలప్రకృతిమండలముతోడను భవదీయ పట్టాభిషేక సంభారములంగూర్చుకొని సిద్ధముగా నున్నాఁడు.

(అందఱు నాదరముతో వినుచున్నారు)

రాము—(ముందుచూచి నమస్కరించి)

గీ. అమరపురి యందమును గెలువంగఁ జాలు
రవికులీనులు పాలించు రాజధాని
చందురునిబోలు తెల్లని జలముగలుగు
సరయూ వీపురిచుట్టు నెసంగుచుండె.

(అందఱును నమస్కరించుచున్నారు)

రాము—(ముందుచూచి) విమానరాజమా! వసిష్ఠాదులు నాకై యెదురుచూచుచున్నారు. కావున రాచనగరులో డిగియెదము, నిలువుము.

(అందఱును విమానముం దిగుచున్నారు)

(పిదప వసిష్ఠుఁడును భరత శత్రుఘ్నులును బ్రవేశించుచున్నారు)

వసి—నాయనా, భరత! శత్రుఘ్న!

మ. శివశిష్యం ద్రుహిణప్రపౌత్రు నితఁ డేచేట్పాటులొందించె న
య్యవి రెండుం దలపోయఁగా నగవు నత్యాశ్చర్యముం బుట్టుఁ, బు
ణ్యవిశేషంబున నేఁ డెదుర్కొనుట సంప్రాప్తించె శ్రీరామ నీ
రవివంశం బిఁక శ్వేతమానమగు నిర్యన్మార్తులం గీర్తులన్.

(అందఱును బరిక్రమించుచున్నారు)

రాము— (వినయముతో సమీపించి పాదములు స్పృశించి)

గీ. గురువు లెవ్వార లిక్ష్వాకుకులమునకు వ
సిష్ఠులెవ్వారు దివి సప్తఋషులయందు
వారికిప్పు డరుంధతీవల్లభులకుఁ
బ్రణతి రొనరించుచున్నాఁడు రాముఁడితఁడు.

వసి—"గీ. దేవ నిన్నేమి యాశీర్వదించువాఁడ" (అను పూర్వోక్త పద్యముం జదువు చున్నాఁడు)

రాము—ఋషివచనములకుఁ గతజాలు వేరైనను నైక్యముకలుగుచుండును. ఈవసిష్ఠుండు గూడ మున్నగస్త్యుండాశీర్వదించినట్లె యాశీర్వదించెను.

సీత—(నమస్కరించుచున్నది)

వసి—జనకరాజపుత్రి! రాముని యాశీర్వచనమే నీకు నాశీర్వచనము. ఇదియు నుంగాక.

గీ. ఇంతదనుక క్రియదుంధతియే పతివ్ర
తా వ్రతము చేయుచున్నది తరుణులందు
ఆవ్రతముచేయ నీవు నోయమ్మఁగుబిడ్డ
పంచుకొంటివి భాగంబు పరమువగిది.

లక్ష్మ—ఇక్ష్వాకుకులగురూ! వసిష్ఠ! లక్ష్మణుఁడు మ్రొక్కుచున్నాఁడు.

వసి—వత్స లక్ష్మణ! ఇంద్రజిత్తుని జయించిన నిన్నేమని యాశీర్వదింతును?

భర—ఆర్య! రావణవిద్రావణ! ఇదిగో నీతమ్ముఁడు భరతుఁడు నమస్కరించు చున్నాఁడు.

రాము—(చేతులుసాచి) తమ్ముఁడా యిటురమ్ము.

గీ. తల్లి నిను గౌఁగిలించితి కుతుక మొదవ
వేగ నాకిమ్ము నీవు నీకౌఁగిలింత
సోదరులమేను సోఁకినసోదరునకుఁ
జంద్రికయుఁగూడ నంత నెచ్చగానె యుండదు.

భర—(సీతకు నమస్కరించుచున్నాఁడు)

సీత—నీముఖారవిందము నెత్తము, నీదృష్టి యానందమందపరిస్యందయగుఁగాక.

శత్రు—పాదసేవకుఁడు శత్రుఘ్నుఁడు నమస్కరించుచున్నాఁడు.

రాము—(లేవఁదీసి) పుణ్యమున మారెండవ లక్ష్మణునిఁ జూచితిని.

శత్రు— (సీతకు నమస్కరించుచున్నాఁడు.)

సీత—వత్స శత్రుఘ్న! చిరకాలము జీవించుము. మీయమ్మలెచ్చటనున్నారు?

శత్రు— మంగళద్రవ్యములు చేతఁబూని యంతఃపురద్వారమున నిల్చియున్నారు

లక్ష్మ—(భరతునకు నమస్కరించుచున్నాఁడు)

భర— గీ. మించువేడుక నను గౌఁగిలించుమయ్య
లక్ష్మణా ! లేచి, నీవ సలక్షణుఁడవు
ఆర్యసేవాపవిత్రము లైననీదు
గాత్రములు నన్ను సుఖపెట్టుఁగాత మిపుడు.

శత్రు—(లక్ష్మణుని గౌఁగిలించుకొని) నిర్విఘ్నముగ రామసేవచేయుట కొనసాగించుకొన్న నీయందు నాకు స్నేహము రెండింతలగుచున్నది.

రామ—భగవంతుఁడా ! వసిష్ఠ ! ఇతఁడు సూర్యపుత్రుఁడును కిష్కింధాపురాధిపతియునగు సుగ్రీవుఁడు. ఇతఁడు లంకాధిపతిసహోదరుఁడును బ్రస్తుతము లంకాపరమేశ్వరుఁడు నగు విభీషణుఁడు. వీరిరువురును నమస్కరించుచున్నారు.

వసి—రామచంద్ర ! భవదీయకీర్తిశాలకీ యిరువురే కాయమానస్తంభంబులు.

రామ—భరత ! వీరును నీకు మఱఁదులే కావునఁ గౌఁగిలించుకొనుము.

(భరత శత్రుఘ్న సుగ్రీవ విభీషణులు పరస్పరముఁ గౌఁగిలించుకొనుచున్నారు)

వసి—(అందఱివంకఁ జూచి)

మ. దశకంఠుం బరిమార్చె రాఘవుఁడు, సీతాదేవి సాధ్వీమహా
దశఁ గాంచెన్ శుచియందు, లక్ష్మణుఁడు గాదా యింద్రజిత్తుం జయిం
చె, వనవాసీభరతుండు పాదుకలచేఁ జేయించె రాజ్యంబు, స
ద్యశమొం బొందుట కేమిలోపమిఁక సప్తాశ్వాన్వయం బంతయున్.

(రామునివంకఁ జూచి) వత్స దాశరథీ రామభద్ర ! ప్రశస్తమగు ముహూర్త మాసన్నంబైయున్నది, కావునఁ బవిత్రంబగు సింహాసనం బలంకరింపుము.

రామ—(అట్లు చేయుచున్నాఁడు)

(వసిష్ఠుఁడు తప్ప తక్కినవారందఱు సాష్టాంగ నమస్కృతులు చేయుచున్నారు)

(తెరలో మంగళగీతములు పాడుచున్నారు)

(ఆకాశమందు)

క. చిరకాలము ధనదుఁడు శంకరునిం బ్రణుతించి పుష్పకం బార్జించెన్
ధరణిపుల ! నేఁటికిది నీవరమయ్యె నొసంగు మర్థపతి కతిమరలన్.

వసి—వత్స రామభద్ర ! ధన్యుండవు. సాక్షాత్కుబేరుఁడు నిన్ను యాచించుచున్నాఁడు.

రాము—విమానరాజమా! భగవంతుం డగు కుబేరుఁడు ప్రార్థించుచున్నాఁడు. వానికి మరల నిన్నిచ్చెదను. (పైకిఁజూచి) అనినంతనే యీవిమానము కుబేరుని యొద్దకుఁబోయినదే!

వసి—రామచంద్ర! నీకింక నేమిప్రియముం బొనరించువాఁడను.

ఉ. కోపము లేదు శంకరునకుం దనచాపము భగ్నమైన సం
తాపము లేదు వార్ధి కెడఁదం దనకడ్డము గట్టిరంచు ని
ర్వ్యాపితుఁడయ్యె మన్మఁడని వారిజగర్భున కీను లేదు సం
ప్రాపితుఁడయ్యెఁ బుష్పకవిమానము నేఁటికి యక్షనాథుఁడున్.

అయినను నిట్లగుఁగాక!

ఉ. పండితు లెల్ల సంసరణబంధముఁ బాపెడు కావ్యబంధము
ల్నిండగు నర్థమున్ లలితనీతులు సూక్తులఁ గూర్చి చేయుతన్
బందువు గాఁగ సజ్జనులు బ్రహ్మకు మాఱుగఁ గావ్యమూర్తిఁ గొ
న్నందును బాయకుండుత మనంబులఁ బండితభక్తి పెంపునన్.

(అందఱును నిష్క్రమించుచున్నారు)

—* గద్య *—

ఇది శ్రీకింకవీంద్రఘటాపంచానన విద్వత్కవి బాలకళానిధి బాలసరస్వతీ శతావధాని తిరుపతి వేంకటేశ్వరవిరచితంబగు నాంధ్రబాలరామాయణనాటకంబు సర్వంబును దశమాంకము.



శ్రీరస్తు

# ఎడ్వర్డు పట్టాభిషేక నాటకము.

## ప్రథమాంకము



శా. శ్రీశుండుం దుహినాద్రిజాపతియు వాణీశుండు దేవేంద్రము
ఖ్యాశాపాలకసంఘ మానతి యవశ్యం బొదలం దాల్ప నా
నాశాస్త్రజ్ఞులసత్సభానుమతి విన్నాణంబుగా దీవు లెం
తే శాసించిన దేవి యెల్లపుడు మీ కిచ్చున్ దృఢైశ్వర్యమున్.

ఉ. వాయుసుతుండు ముం, దెడమవైపున జానకి, వెన్క లక్ష్మణుం,
డాయన తమ్ముఁడున్ భరతుఁడావల నీవల, సూర్యపుత్రుడై
తేయధవాదులెల్ల నలుదిక్కుల మూలలఁ గొల్వఁ బట్టభ
ద్రాయితమైన యుత్పలదళాకృతి మిమ్మనయమ్ముఁ బ్రోవుతన్.

సూత్రధారుఁడు — ( నాంద్యంతమున నలుదెసలు పరికించి సంతోషముతో ) అప్పుడే రంగస్థలమంతయుఁ జక్కఁగా నలంకరించినారే!

గీ. నలుదెసల నిండుచుండె మద్దెలలవలన
వెడలునాదంబు బుధకర్ణపేయమగుచుఁ
దేనియలు జాలువాఱఁగ దీటుకొనియెఁ
గిన్నరలనుండి సంగీతకీర్తనములు.

( మిన్నువంకఁ జూచి ) చిరకాలమునకు దుర్దినములు గడచి దిశాముఖంబులు తెలివి నొందినవి.

గీ. రాజహంసలక్ష్మి రమణవహింపఁగ
మిత్రమండలంబు మేల్మిఁ జెంద

సర్వదిశలయందు సన్మార్గమును జూపు
చతిశయించె శారదాగమంబు.

(వినయముతో సభవంకకుఁ దిరిగి దోసిలి యొగ్గి) సప్తమైడ్వర్డు భూపాల పట్టాభిషేకమహోత్సవ మభినందించుటకుం గూడిన యోసభాసదులార! నేను నాట్యవేదశార్ణ్వుని కుమారుఁడను, నాపే రభినవభరతాచార్యుఁడు. నాకు నేఁ డేదేని నొక నాటక మాడుటకు సెలవిండు. (ఆకాశమువంకకుఁ జెవియొగ్గి) ప్రస్తుతమహోత్సవమునకుం దగినదియు నూతనప్రసిద్ధకవివిరచితంబును నగు దెనుఁగు నాటక మొకటి యభినయింపు మనుచున్నారా! (సంతోషముతో) ఏమీ! నాభాగ్యము. నామనోరథమునకుం దగినరీతినే సభవా రానతిచ్చిరి. సెలదినములక్రిందటనే—

గీ. అరసి తిరుపతివేంకటేశ్వరు లిరువురు
చేసి యెడ్వర్డుపట్టాభిషేక మనెడు
నాటకం బొండు కొచ్చెర్లకోట రామ
చంద్రవేంకటకృష్ణరాయేంద్రు నాజ్ఞ.

దాని నభినయించి యీసభాసదుల యుల్లంబులు పల్లవింపఁజేసెద. అహా! దైవఘటనయన నిట్లుండవలయు:—

చ. నవరసబంధబంధురము నాటక, మీసభవారు విద్యలం
బ్రవరులు మెప్పెఱుంగుదురు, మాపరివారము నృత్తనాట్యబం
ధురమని పెక్కుచోటుల బుధు ల్గొనియాడఁ జెలంగె, సప్తమై
డ్వరుడుఁడు చక్రవర్తియగుట ల్కథ యిందిఁక వేయునేటికిన్.

(ఆలోచించి) ఏలొకో మానటి యింతతడవు చేసినది?

నటి—(ప్రవేశించి) ఆర్యపుత్రా! ఇదిగో వచ్చితిని. నేఁ జేయవలసినపనికై నన్ను నియోగింపుఁడు.

సూత్ర—నీవు చేయవలసినపని యింకేమి యున్నది.

ఉ. పాడెదఁ గోకిలస్వరముపద్ధతి, నాడెద వీసమేనియుం
బాడిదొఱంగకుండ, ననుభావము చూపెదనంచు నింటఁ బూఁ
బోఁడిరో! కూర్చునెచ్చెలులపొంతఁ బ్రగల్భము లాడుదాన వీ
నాఁడు సభాముఖంబునఁ గనంబడఁ జేయుము నీప్రతాపమున్.

నటి—(భయముతో) నాట్యసామగ్రి సమకూర్చుటకై యింతతడవైనది. సర్వము సన్నద్ధపఱచితిని, యిపుడు ప్రయోగింపవలసిన నాటక మేదియో సెలవిండు.

సూత్ర—ఈనాటక మాడవలయు. (అని పత్రిక చేతి కందిచ్చును).

నటి—(పుచ్చుకొని) తే. గీ. అతివ యొక్క_ర్తు దేశంబు లాక్రమించి
చక్రవర్తిని యను పేరున్నె తనుంది
పుడమియేలిన తర్వాతఁ గొడుకు పట్ట
భద్రుఁడగునట్టి కథ చూడవలయు నేఁడు.

(అని చదివి) ఆర్యపుత్ర! ఈకథయెద్దియో నాకుఁ దెలియకున్నది. వివరించి చెప్పుఁడు.

సూత్ర—ఓసీ మూర్ఖురాలా! ఇంతమాత్రము తెలిసికొనలేకపోయితివి. విక్టోరియా చక్రవర్తి కుమారుఁడగు సప్తమైడ్వర్డు భూపాలుని పట్టాభిషేకకథయని కాదా దానియర్థము?

నటి—ఆర్యపుత్ర! తెలియక యడుగుచున్నాను క్షమింపుము. ఎడ్వర్డుపదమునకు వెనుక సప్తమపదము గూడ నెందులకో?

సూత్ర—దానికిఁ జాలనర్థము కలదు.

తే. గీ. ఆర్గు రెడ్వర్డు లనురాజు లన్వయమున
వసుధఁ బాలించి రేడవవాఁ డితండు
గాన సప్తమపదమును గాంచెఁ గలికి!
చారుతరకీర్తి యుండియాచక్రవర్తి.

నటి—ఆసప్తమపదమున కాయర్థముకంటె నీయర్థము చెప్పిన బాగుండునేమొ?

తే. గీ. చక్రవర్తులు మును హరిశ్చంద్రముఖ్యు
లార్వురేగిరి రాజు లీయవనియందు
సప్తముఁడు గాన నెడ్వర్డుచక్రవర్తి
సప్తమైడ్వర్డుఁ డనుమాట సార్థకంబు.

సూత్ర— ప్రియురాలా! సాధు సాధు! ఇట్టి యర్థమును జెప్పిన నీబుద్ధిచాకచక్యము వేయినోళ్ళఁ బొగడఁ దగినది.

నటి— ఇది యంతయుఁ దమయనుగ్రహమే.

సూత్ర—ఔను; నాయనుగ్రహమనుట న్యాయమేగాని

తే. గీ. తరుణి! నీవంటి సత్కళత్రంబు వలన
మగలఁ బొగడొందెదను నాట్యనిగమమందుఁ
జదువ నేర్చినభార్య సాహాయ్యకంబు
చేయనేరని కార్యసంసిద్ధి కలదె.

(అని కౌఁగిలించుకొనఁ బోవును)

నటి— ఆర్యపుత్ర! యిదెమిగుల సుకుమారులు, ఇట్టి నిగ్రహాలింగనమును సహింపరు.

సూత్ర— (సిగ్గుపడి మరలుచున్నాఁడు)

నటి— ఆర్యపుత్ర! నీకు సంతోషముగా నున్నదిగాని యట్టివారలా చరిత యభినయింపఁగలరో లేమో యని నాకుం గొంత యనుమానమున్నది.

సూత్ర— ఆఁ! ఇదియేమిమాట. నా నాట్యసామగ్రి యంతయును సిద్ధముగా నున్నది. నీవు సంగీతమున నేమి చేసెదవో తెలియదు.

నటి— నేనా! సంగీతసముద్రము నంతయుఁ గల్లోలముచేయుచుగాఁ జేసెదను. నీ వవధానమను వడవ యెక్కి చూచుచుండుము.

సూత్రి— అవహితుఁడ నైతిని. ఇదిగో ధ్రువ మొదలిడుచున్నాను.

నటి— (నవ్వుతో) ఆర్యపుత్రులా ధ్రువాగానము చేయువారు?

సూత్ర— మాట పూర్తిగా వినకుండఁ దప్పులుపట్టిన నేమి చేయుదును. ధ్రువ యగు నాట్యవిద్యయని నాయర్థము. నీకు ధ్రువాగానముచేయఁ దొందరగా నున్నది కాఁబోలును. త్వరగాఁ బ్రారంభించుము. రసపరవశులైన సభ్యులందఱు నొడలెఱుంగక పోదురుగాక.

ఆ. వె. విన్నవారినెల్ల వివశులఁగాఁ జేయు
పాటిలేనిపాట పాటగాదు;
రసము లాని యాని రసవశులై విట్లు
వీగకున్న గానవిదులుగారు.

నటి— (ధ్రువాగానము చేయుచున్నది).

క. ధవళితభువనాంతరమై కువలయమోదంబుఁ గూర్చుకొనఁ జాలినదై
కవగూర్చె నలంకారము, నవవధువగు రాజ్యలక్ష్మి నరనాథులకున్,

సూత్ర—(విని యానందముతో)

తే. గీ. అతివ! నీగానసౌకర్య మరసి హాయి
బొంది సభ్యులు జంత్రపు బొమ్మలైరె
తనిసి ప్రత్యక్షరగళత్సుధారసమున
స్నాన మొనరింతు మైనిండ సరసిజాక్షి.

నటి—ఆర్యపుత్ర! యీస్తోత్రములకేమి, తామింకఁ జేయఁనది చేయుదురుగాక.

సూత్ర—ఇదిగో వాక్శుద్ధికై సర్వవిద్యామూలకందంబగు సరస్వతిని నుతించెదను.

చ. చదువుల కిక్కవై ప్రజల సాకుచు నిచ్చలు సర్వతోముఖా
స్పద మగునృష్టితోడఁ దెలిచాయశరీరముతోడ నీకథల్
త్రిదశులు మెచ్చుచుండఁ దేదీవి వసించిన దేవి! సర్వదా
మగిఁ దలఁపోసెదన్ నను గుమారుని బ్రోచినరీతిఁ బ్రోవుమా.

(తెరలో) నిక్కము నిక్కము. మావిక్టోరియాదేవి యట్టిదే. నిన్నొక్కనినే కాదు, లోకులనందఱను దనకుమారులనుగాఁ జూచుకొనునది.

సూత్ర— నా సరస్వతీస్తవమును విక్టోరియాస్తవముగా భావించుకొని వైతాళికులు వచ్చిరని తోచుచున్నది (అని ముందుజూచి) వీరే వైతాళికులు! మన మనంతర కర్తవ్యమునకై పోదమురా. (నటీసూత్రధారులు నిష్క్రమింతురు)

(ఇది ప్రస్తావన)

(పిదప సాయణమాయణులను వైతాళికులు ప్రవేశించుచున్నారు)

సాయ—(పరమానందముతో)

ఉ. దీవులలోఁ బ్రసిద్ధిగల దీవిని బుట్టి జగంబుమెచ్చ వి
ద్యావతియై క్రమానుగతిఁ దండ్రిసిరిన్ వహియించి విద్విష
ద్భావరులెల్లరుం బొగడ భూమి నిజంబుగ ధర్మసంఘసం
భావనసేలు విక్టోరియ భాగ్యము వర్ణనసేయ శక్యమే.

మాయ—సఖా! సత్యముగా నీవనినట్లు విక్టోరియాను వర్ణించుట శక్యమే కాదు. భూతభవిష్యద్వర్తమానకాలములయం దీమె పరిపాలనమువంటి పరిపాలన ముండగానము.

సీ. మరుదేశములఁ దీయమావితోఁటలు పెంచె నేరాజపుత్రి దయారసంబు
గడియకామడత్రోవ నడిపింపఁగాఁ జేసె నేహూణదేవి మనోహయంబు
నిమిషాన కఖిలదేశములవార్తలు దెచ్చె నేరాజ్ఞి కుశలశ్రీమారుతంబు
పలుగూళ్ళు తినురీతి ప్రజలకు మాన్పించె నేరామ చిత్తకేదారభూమి

తే. గీ. వర్ణభేదంబు చూపు సంపచ్చలాక్షి
పక్షపాతంబు మాన్పె నేప్రభ్వి మతిభి
షగ్వ్యథామణి యామెకు సాటిగలరె!
భూరిసుగుణాసలంబ విక్టోరియాంబ.

సాయ—మిత్రమా! వేయుమాటలేల?

ఉ. ‘ఓరి కుమార! నీజనకుఁ డుర్వ్వరకుం బ్రభువయ్యెఁ జుమ్మి ప
ల్మారులు తద్విధంబున నిలాతలనాయకి నన్ను జేయఁగా
నేరవె’ యన్న, నవ్వి ‘జననీ! యటులేని నొనర్తు’ నంచు వి
క్టోరియఁ జేసెఁ బద్మభవుఁడుం జగమేలఁగఁ జేయ నిందిరన్.

మాయ—చెలికాఁడా! యీదేశమునకేమిగాని యీమె ప్రభుత్వమువలన హిందూ దేశీయులు పడు సౌఖ్యమింతింతగాదు.

సీ. విడువలేదఁట మానముడుపకుండ మిటారిపడుచుఁగన్నెలు కంటఁబడినపట్ల
నడువలేదఁట సేలఁబడఁద్రోయకుండ దేవాలయంబులత్రోవ నడుచుపట్లఁ
గుడువలేదఁట బల్మిఁ గొనకుండఁ గడుఁగష్టపడి పెంచుకొనినకాపరుల పంటఁ
బొడువలేదఁట ధర్మమును దాఁటకుండఁ బోటరులౌచుఁ బగర సంగరములందు

తే. గీ. ముడువలేదఁట దస్త్రంపు మూట చేత
లంచమిడకుండ ధర్మపాలనములందుఁ
గటకటా! యెట్లు సహియింపఁగలిగిరొక్కొ
తురకబిడ్డలబాధ హిందువులు మున్ను.

సాయ—ఔను, నీవనినమాట నిజమే.

సీ. ఏనాఁడు దాఁటి రాహిందువు లుప్పట్టిమీఁగనెకాక యేళ్ళకంతెవలమీఁద
నేనాఁడు నాటి రాహిందువు లమ్మరుదేశముల సన్నపరి విత్తుమొలకగములు
నేనాఁడు చాటి రాహిందువు లుత్తమవారి యేల్బడిమించిన యేలుబడులు
నేనాఁడు మీటి రాహిందువు లాఁకనగోట హూణవిద్యాజయోద్యోగగిరుల

తే. గీ. దూరకాలమునుండి హిందూధరాధి
పతులపరిపాలనంబునఁ బ్రాఁతవడిన
భరతఖండమునకుఁ జక్రవర్తినియై య
నదగు విక్టోరియారాజ్ఞి నాఁడుగాక.

మాయ—మిత్రమా! "చక్రవర్తినియై యనఁదగు" నని యీయుత్ప్రేక్షయేల? నిక్కముగా హిందుదేశచక్రవర్తిని యనిపించుకొనుటకొఱకేగదా కొలఁది కాలములో ననేకపృథివీపాలసామ్రాజ్యాభిషేకసలిలధారోపనదీసమావృద్ధం బగు యమునానదిచే నలంకరింపఁబడిన హిందూదేశాలంకారం బగు ఢిల్లీపురం బున నఖిలసామంతనృపాలురం బిలిపించి కొల్వుకూటంబుఁ గావించెదరఁట,

సాయ—వాణిజ్యమిషంబునం బోయిన సాంఘికులవలనఁ జిరకాలమునుండి హిందు వులు పరిపాలించు దేశమంతయు నాక్రమించుకొనిన యిమ్మహాదేవి కొక కార్యమసాధ్యమా!

చ. అనుపద మేసుదైవము దయామయుఁడై కనుచుండ, నెల్లశా
సనములు రాజులెల్ల శిరసావహియించుచు నుండ, భాగ్యపుం
గని యగునట్టి యాభరతఖండము నేలెడు రాణికీ మెకుం
జనపతు లెవ్వరీడు? సువిశాలదయారసరమ్యవాణికిన్.

మాయ—మ. తెలిగొండ న్నగమేన నాలగుచు నేదేవుండు మున్నుండె, న
య్యలఘుండే తెలిదీవిఁ బూర్ణముగ నాలై చూపునందున్నని
వ్వలు ఖడ్గంబునఁ దాల్చెనో యనుతలంపు ల్గల్గియున్నారు లో
కులు విక్టోరియపట్ల నచ్చటను బెక్కుల్మాటలింకేటికిన్.

సాయ— సఖా! బాగుగ సమర్థించుకొనుచున్నారు. లేకపోయిన స్త్రీవ్యక్తి వి శేషమున కిట్టినిరంకుశాధిపత్యమెట్లు కలుగును?

మాయ—ఔను! పూర్వహిందూరాజుల రాజ్యంబుఁ దలంపించుచున్న యిమ్మహా దేవిస్వారాజ్యంబు నుతింపఁ దరముగాదు. ఏదెసఁ జూచిన నిరర్గళఘంటా పథంబు, లేదిక్కునఁ జూచిన నదీకుల్యాప్రవాహంబులఁ గలిగి సర్వదా సస్య పూర్ణయై భూమి రత్నగర్భానామంబు సార్థకంబు జేసికొనుచున్నది.

ఉ. వానలు లేక భూమి ఫలవంతముగా, కొకవేళఁ బండిన
ధ్యానలు లేనిదేశములవంకకు నచ్చటిపంట పోక నీ!

మానవు లెన్నిపాట్లు పడి మ్రొగ్గిరొ ము, న్నిపు డొక్కదేశ మెం
దేని ఫలింప నయ్యదియె యెల్లలకేగుచు నుండె నద్దిరే.

అనుచుం బ్రతిపట్టనంబునఁ గొల్వులు దీర్చి విక్టోరియాసౌరాజ్యంబును నుతించుచున్నారని పెక్కులు వార్తాపత్రికలవలన వినుచుంటిమిగదా !

మాయ—సాయణా ! నేనొక రహస్యము వింటిని; మనవిక్టోరియామహాదేవి యేండ్లు గడచిన దగుటను బెద్దకుమారుఁడు రాజ్యపాలన సమర్థుండగుటను ధర్మాచరణసభవారంద ఱెడ్వర్డునకుఁ బట్టాభిషేక మొనరింపఁ దలంచుకొన్నారఁట. ఇది సత్యమేనా ?

సాయ—మాయణా ! తప్పుమాట వింటివి. పెద్దవారుండఁగఁ జిన్నవానికిఁ బట్టము గట్టునాచారము హిందూరాజులకేగాని హూణరాజులకు లేదు.

మాయ—(మిన్నువంకఁ జూచి) సాయణా ! లేనిపోని యితరప్రస్తావనలవలన మన పని మఱచిపోవుచుంటిమి. అప్పుడే దేవిగారు అమాత్యపురోధఃపరివారసహితముగాఁ గొల్వుకూటంబునకు నచ్చియున్నారు. కావునఁ దైవార మొనర్చుటకై వేగముగఁ బోవుదమురా.

(అని వైతాళికులు నిష్క్రమించుచున్నారు).

(పిదప యథోక్తముగా విక్టోరియా ప్రవేశించుచున్నది)

పురో—(సంతోషముతో) తల్లీ ! దైవమునకు మీయందుఁ గలదయ మెండగుటచే,

తే. గీ. అఖిలరాజన్యకులమును నతిశయించి
కీర్తివహించె నేఁటికాంగ్లేయకులము,
ఆహిమాచలసేతుపర్యంతభూమి
కైవసముఁ జేసికొంటి వక్కజముగాఁగ.

క. కడిపెఁడుబిడ్డలఁ గంటివి కడలేనియశంబు మంచి గౌరవమునురా
నొడయులకు నొడయురాలను నుడువుంగై కొంటి వఖిలసత్యప్రౌఢిన్.

విక్టో—మహాత్మా ! నేఁటిరాత్రి స్వప్నమున నొకయద్భుతము గంటిని.

క. పొడవును లావును గల్గిన యొడలును గరుణారసంబు నొలికెడి కనులుం
గడు నబ్రపుఁదేజముగల యొడయం డగు దివ్యపురుషుఁ డొకఁడగపడియెన్.

పౌరగ్రాహిణి—తల్లీ ! దేవదూత కాఁబోలు. నిరంకుశమహిమ గలమీకు దైవము ప్రత్యక్షమగుట కబ్బము లేదు.

పురో—తరువాతఁ దరువాత ?

విక్టో—ఇట్లెదుటఁ బడినఁ బదంపడి యేనును నాస్వప్నమునందే లేచి నమస్కరించి తోడితెచ్చి యొక్క రత్నసింహాసనమునం గూర్చుండఁబెట్టితిని.

చామ—పెద్ద లెదుటఁబడిన మర్యాదయిచ్చి మర్యాదపొందు టలవాటగు తమకు స్వప్నము నందుఁ గూడ నాయాచార మెట్లుతప్పును!

పురో—ఆంగ్లేయరాజవంశ మనఁగాఁ బెద్దలకు గౌరవమిచ్చునదియు వారివలన గౌరవమును బొందునదియుఁ గదా! తరువాతఁ దరువాత ?

విక్టో—తరువాత. తే. గీ. శయ్యయొద్దనున్న చల్లనినీరంబుఁ
ద్రావనిచ్చి, మంచి సేవకులను
సేదదీర్పఁబనుపుసేసి, పణ్యారంబు
లొసఁగి, యిట్టులంటి సెసక మెసఁగ.

క. దేవర యెవరో? యేపనికై వచ్చితిరో? యటన్నఁ గడుకొనుదయకన్
గ్రేవలఁ దొలఁకంగా నా దైవం బిట్లనియె నభయదం బగుమతితోన్.

'వత్సా! ఆంగ్లేయకులప్రదీపమా!

క. తలదాఁటిన భూపుణ్యంబులవలనను ధారుణీతపోమాహాత్మ్యం
బులవలనఁ బ్రజలసుకృతంబులచే నీకుర్వియేలుపుణ్యం బబ్బెన్.

క. నీ పెద్దకొడుకు ధరకుంబ్రాపకుఁడై ప్రజల మేలువడయంగలఁడ
ప్పాపనికి నేలయేల్బడి లోపలి రుచిఁజూపు మెల్లలోకులు మెచ్చన్."

పురో—దేవీ! నీమనోరథమునకుం దగినట్లే దివ్యపురుషుండు సెలవిచ్చె. ప్రజలకుఁ గూడ నీమహోత్సవము క్షేమంకరమైయున్నది. కావున నిది యెల్లరకుఁ దేటపఱచి హిందూరాజ్యలక్ష్మి నెడ్వర్డుభూపాలుని భుజాశిఖరమునఁ గూడఁ గొంచెమెక్కింపుము.

చామ—తరువాత ?

విక్టో—ఆమాటలు విని హర్షముచే లోచనములు పల్లవింప హిందూరాజ్యలక్ష్మియుఁ గూడఁ బ్రక్కనే నిలువఁబడి యుండెను

చామ— దేవిహృదయము ననుసరించియుండు హిందూరాజ్యలక్ష్మి కిట్టిహర్షావిర్భావ ముచితమే.

విక్టో—పిదప నేనును నాంగ్లేయరాజుల మే లంతయు నీయధీనమే యని యూరకుంటిని.

చామి—పిమ్మటఁ బిమ్మట ?

విక్టో—తరువాత నద్దివ్యపురుషుఁ డింకొకమాట సెలవిచ్చెను.

పురో—ఏమని ?

విక్టో—తన్ను వరింప నిచ్ఛగించు హిందూరాజ్యలక్ష్మి చక్కఁదనమంతయు నరసి వచ్చుటకై ముందొకసారి నీకుమారు నక్కన్యాసమీపమునకుం బంపుము. దిగ్విజయయాత్రాకుతూహలియై మరలివచ్చిన పిమ్మట నీయభిమతముఁ దీర్పుమనియె.

చామ— / పురో— కుమారునకు యౌవరాజ్యపట్టాభిషేకము చేయుమనుటచే సంతసంబును దూరదేశమునకుఁ బంపుమనుటచే విచారమును గూడ మామనంబుల దొర్లాడుచున్నయవి.

విక్టో—ఇట్లుపదేశించి యాదివ్యపురుషుఁ డంతర్ధానముం జెందెను.

మంత్రులు—ఈ వృత్తాంతము ధర్మాచరణసంఘమువారికిఁ గూడఁ దెలియఁజేసి వారి యనుజ్ఞంగూడఁ బొందవలసినది కదా ! అదియునుంగాక హిందూదేశమంతయుఁ దిరిగి ప్రజల మంచిచెట్ట లారసినపిదప నే మన యెడ్వర్డునకుఁ బట్టాభిషేకముచేయుట యుక్తము.

పురో—మంత్రుల యాలోచన మిగుల చక్కనిది.

విక్టో—అట్లయిన ధర్మాచరణసభవారి కీవృత్తాంతముం దెలిపి వారియభిప్రాయముఁ గూడఁ దెలిసికొనుందు. వా రీవిషయము విచారించునపుడు.

చ. అవనిభరించి యుందనుక నక్కట ! భర్తృవిహీననయ్యు మం
త్రివరులు మీరు సాయమొనరింపఁగ నేలితిఁ, బెద్దవాని కై
దవపదివచ్చె, రాజ్యభరమంతయు నాతని కిచ్చి నేను హిం
దువులను వారిదేశము గనుంగొనఁ బోయెద సమ్మతింపరే.

అని కుఱ్ఱవాని ప్రయాణము మాన్పించుటకును నేను భరతఖండమును జూచుటను గుఱించియుఁ జర్చింపుఁడని చెప్పుఁడు.

మంత్రు—తల్లీ ! నీవనిన పల్కులు విచారమునకుఁ దేఁదగినవియే కావు. నీవు హిందూదేశమునకుఁ బోవుటకాని యువరాజునకు మూర్ధాభిషేకము చేయుట కాని నేఁడొనర్పఁదగినపనులు కావు.

తే. గీ. ఆహిమాచలసేతుపర్యంతభూమి
కైవసముఁ జేసికొంటి పక్కాజముగాఁగ
జయముజయమంచుఁ బ్రజలెంచఁ జక్రవర్తి
నీపదముఁ బొందవలయు దానికి నిజంబు.

చిరకాలము హిందూచక్రవర్తులకును బిదపఁ దురుష్కప్రభువులకును రాజధాని యగు దిల్లీపురంబున నొక్కకొల్వుకూటంబుగావించి యచ్చటికి హిందూదేశాధిపతుల నందఱ రావించి వారిసమక్షమున హిందూదేశచక్రవర్తిని యను బిరుదంబు దేవిగారికిఁ దటస్థింపఁ జేయవలయునని యిదివఱకే నిశ్చయించుకొని యుంటిమి. హిందూదేశీయు లందఱకును ద్వీపాంతరీయుల ప్రభుత్వము మొదట దుస్సహ మని తోఁచకమానదు. ఇట్టి సమయంబున వారి సమక్షంబునకుఁ దమరు పోవుట మంచిదికాదు. అచ్చోటికిం బోయినఁ బ్రమాదము గల్గునేమోయను సంశయ మింతలో విడువరాదు. ఇతర మతస్థు లితర దేశస్థులు తమదేశమును పాలించుచున్నారను దుఃఖము మనముచేసిన యుపకారము లనుభవించినకాని వదలరు. కావున భవిష్యచ్చక్రవర్తి యగు మనయువరాజునే హిందూదేశమునకుఁ బంపుట మంచిది.

చ. తురకలయేల్బడి న్మిగుల దుఃఖముఁ బొందినవారుగాన లోఁ
బఱచిరి రాజ్యము ల్మనకుఁ బాపము హిందువు, లట్టివారి నే
ర్పరితన మొప్పఁ బూర్వసుఖపద్ధతులం దలదాఁటు వట్టు లే
లిరి యనిపించుకొన్నఁ బ్రబలింతుము నాఁటికి నాఁటి కచ్చటన్.

చ. మతముల జోలికేఁగక సమానముగా జనులందఱి న్సుఖ
స్థితిగనఁజేయుచు న్జదువు దేశముల న్మిగులంగఁజేయ ను
న్నతదశఁజెంది హిందువు లనారతము న్మనయందు భక్తిసం
గతులయి సేవసేయుదురు కార్యములన్నియుఁ జక్కఁ జేయుచున్.

కావున యువరాజప్రయాణమునకై ధర్మాచరణసంఘమువారి యనుమతిం బొందుటకుఁ బోయెదము. ( అని మంత్రులు నిష్క్రమింతురు )

( ఇది ముఖసంధి )

( తెరలో )

శా. లోకాలోకగిరీంద్రకందరతమోలోకంబునేకాలముం
బోకార్పందగు నీప్రతాపమున కేభూము ల్నివాసంబు లే

లోకంబుల్ తగునాటచోట్లనుచు నాలోకించుచుందంబుగా
నాకాశాగ్రముఁ జేరె సూర్యుఁడు సమగ్రాంశుండు విక్టోరియా !

ఉ. శారదచంద్రచంద్రికల చఁదముగల్గు భవద్గుణంబు లెం
పార నుతించుచుండ్రి మలయాచలచందనకుంజమండలో
దారఫణీంద్రకాంతలు తదక్షరగీర్ణసుధారసంబు నిం
డారఁగఁగ్రోలి వాయ్వశనజాయలు ముక్తి విదళించుకై వడిన్.

విక్టో—( విని పరివారముపంకఁ జూచి ) మీరందఱ అభిమతాచరణమునకై పొందు నేను నంతఃపురమునకుఁ బోవుచున్నాను.

( అని యథోచితముగా నందఱును నిష్క్రమింతురు)

ఇది... తిరుపతివేంకటేశ్వరప్రణీతంబగు నెడ్వర్డుపట్టాభిషేకం బనునాటకంబునఁ గళ్యాణస్వప్నం బను ప్రథమాంకము.

---

-

శ్రీరస్తు

# ఎడ్వర్డు పట్టాభిషేక నాటకము

## ద్వితీయాంకము

(పిదప వృద్ధకంచుకి ప్రవేశించుచున్నాఁడు)

కంచు — (సంతోషముతో) చిరకాలమునుండి పనిచేయుచు ముదుసలినై యుండియు నేను యువరాజరాజ్యాభిషేకమహోత్సవాలోకనభాగ్యంబునకై బ్రతికియుంటిని.

క. అడుగడుగునందుఁ జేష్టలు తడఁబడ వాక్కులును గద్గదంపడ నోడలు
వ్వడఁకఁగ నడిచెడు ననుఁగని యొడయం డెడ్వర్డు నవ్వుచున్నాఁ డెపుడున్.

తే. గీ. దేవి నత్తగ భావించి తివిరి హూణ
రాజ్యసంపద మాయువరాజువంకఁ
జూచుచున్నది కడకంటి చూపులోలయ
మూలవేశ్మంబులోఁ గిటికీలగుండ.

పరిక్రమించి ముందుఁజూచి) వీఁడె! రాజపుత్రపరిచారకుఁడగు దారకుఁడు వచ్చుచున్నాఁడు.

దార — (ప్రవేశించి) ఆర్య! కంచుకీ! నమస్కారము.

కంచు — (కనుబొమ్మలమీఁదఁ జేయిపెట్టిచూచి) దారకుఁడా! నాయనా! శుభముల నొందుచు వర్ధిలుము. మనవిక్టోరియా చక్రవర్తినిగారు యువరాజును హిందూదేశమునకంపుట కంగీకరించిరఁట. ధర్మాచరణసంఘమువారుగూడ సమ్మతించిరా?

దార — నిన్నరాతిరి నిండోలగంబు గావించి యావిషయమ్ము చర్చించి సభవారందఱు యువరాజు హిందూదేశమునకుఁ బోక తీరదని నిర్ణయించిరి.

కంచు—దేవియే హిందూదేశమునకుఁ బోవుటకై సన్నద్ధకాఁగా యువరాజు తానే యేగుటకుఁ బ్రయత్నించెనఁట కాదా? కావున మనయువరాజున కిది బలవద్గమనముకాదు.

తార—నిజము. కాని, ఆర్యా! అతిసుకుమారుఁడు రాజపుత్త్రుఁడు, హిందూదేశము మిగుల నుష్ణదేశమఁట! యెట్లు తిరిగి రాఁగలుగునో!

కంచు—నాయనా! సందేహింపకుము! గొప్పవారి చరిత్రములు మిగుల నద్భుతములు. వారి కసాధ్యకార్యము లుండవు. కాక రాజకుమారుఁడు భగవదంశసంభూతుఁడుగాని సామాన్యుఁడు గాఁడు.

తార—అవును. భవితవ్య మెట్లు కాఁగలదో యెవరికిఁ దెలియును?

కంచు—ఇప్పుడు యువరాజుగా రెక్కడ నున్నారు?

తార—మంగళ ప్రస్థాన మాచరించి మతాచార్యులకు మ్రొక్కి దేవాలయంబులో నిష్టదైవముం బ్రార్థించి సముద్రప్రాంతవినివేశితస్కంధావారుఁడై మంత్రులతో నేమేమో మాటలాడుచు స్వప్రాసాదములో నున్నాఁడఁట. నేను ద్వరగాఁ బోవలయు నాజ్ఞయిమ్ము.

కంచు—పొమ్ము. నేనును రాజకులమునకుం జనియెద. (యిరువురును నిష్క్రమించిరి)

(ఇది చూళిక)

---

(పిదప మంత్రులతో యువరాజును బరిజనముఁ బ్రవేశించుచున్నారు)

యువ—మంత్రులారా!

ఉ. తల్లి నయంబు మీఱఁగ సుదారగతిం జగమేలుచుండఁగాఁ
బిల్లనిభంగి సౌఖ్యములఁ బెంపువహింపక దోషరాశి పు
ట్టిల్లగు రాజ్యభారము వహింపఁగ నాకిపు డేమి వచ్చె? నా
యుల్లము యౌవరాజ్యమునె యొల్లకపోయె మఱింతయేటికిన్.

కావున, విక్టోరియామహారాజ్ఞీభుజపరిఘనిష్కంటకీకృతంబు లగు హిందూదేశదిగంతములందు విజయయాత్రికుతూహలముచే సుఖముగాఁ గాలము గడపెదను.

మంత్రులు—రాజపుత్త్రా! ఇది హూణరాజకృతాచారము కాకపోయినను ముదుకతనముచేఁ దల్లిగారు ధురంధరుఁడ వగు నీయందుఁ గొంచెము భారముంచ

వలయునని తలఁచినదిగాని నేఁడే రాజ్యభారమంతయు నీతలయందుంచుట యామెతలంపుగాదు. స్వప్నమునఁ గూడ నామెకొక దివ్యపురుషుఁ డిట్లే సెలవిచ్చినాఁడఁట. పెద్దలయాజ్ఞ జవదాఁటుట యుచితముగాదు.

యువ— అట్లయిన నవశ్యము తల్లిగారి యానతి శిరసావహింతును.

మంత్రులు— ఇట్టి వినయము మీవంశస్థుల కందఱికి సహజగుణమే.

పరిజనము— స్థవిర యగు నమ్మగారే రాజ్యభారమును వహించువారు. తాను రాజ్యలక్ష్మిని దొడమీఁద నిడుకొని లాలించుచుండఁగఁ జూడవలయుననియె యామె యుద్దేశము.

యువ— (నవ్వుచుఁ బరిజనము వంకకుఁ జూచుచున్నాఁడు)

పరి— చిరకాలమునకు మేదిని చరితార్థ మైనది,

క. కులగిరుల తలలు మోయుట వలనం దచ్చిలలు దాఁకి వసివాడిన యీ
యిల కెడ్వర్డమహీభృల్లలితభుజాశయ్య సుఖవిలాస మొసంగున్.

గీ. మును హరిశ్చంద్రభూపాలముఖ్యరాజ
భుజములం దెల్ల సౌఖ్యము ల్పొందినట్లు
సప్త మెడ్వర్డభూపభుజంబునందు
రమణవహియించు హైందవరాజ్యలక్ష్మి.

యువ— (బాహుస్స్ఫురణ మభినయించుచు నధోముఖుఁ డగుచున్నాఁడు.)

మంత్రులు— రాజపుత్ర !

క. వివిధవిచిత్రవితానం బగు తనశయనాలయంబు నమరించుచు హైం
దవరాజ్యలక్ష్మి నేఁటికి యువరాజాగమము గోరుచుండెఁ దనంతన్.

పరి— క. యువరాజునకున్ విద్యాయువతీమణియందుఁ గలిగియుండినప్రేమం
బవలోకించుచు లక్ష్మియు భువియుం దడ నీర్ష్య నెట్లు పొందక యుండున్.?

మంత్రి— ఎవఁడురా యక్కడ? సేవకు లింకను బయలువెడలరేమి? మేము కేవలము మంత్రపాణులమేగాక శస్త్రపాణులమైకూడ స్వామి నారాధింపఁ గలవారమే.

పరి— ఈదేశయాత్ర యేలవచ్చెనో, పట్టాభిషేకమున కాలస్యమగుచున్నది.

దౌవారికుఁడు— (ప్రవేశించి) జయము జయము యువరాజా! సేవకులందఱు సముద్రతీరమున దేవరరాకం బ్రతీక్షించుచున్నారు. సేనాపతులతో సేన యిరుదెసల బారుగట్టి నిలిచియున్నది.

యువ—ఇదిగో వచ్చుచున్నాము.

వైతాళికుఁడు—(ప్రవేశించి) జయము జయము భవిష్యన్మహారాజా! యువరాజ!

సీ. సామంతరాజన్యసంఘముల్లోని తెచ్చి యొడుగర లీక్రిచ్చుచుండు గాత
మంబానగరముఖ్యముఖ్యపురలక్ష్మికు నన్ని కన్నులపండువగును గాక
దేహంబునకు సుఖస్థితి యిచ్చి మిమ్ముఁదదుష్ణంబు బాధింపకుండుఁగాత
కాఁబోవుమారాజు కరుణామయుఁడటంచుఁ బ్రజలమెప్పులుపొందఁబడును గాత

తే. గీ. గద్యపద్యప్రబంధవాక్కల్పనముల
రేఁగి కవులెల్ల మిమ్ముఁ గీర్తింత్రు గాక
డంబుమీఱంగ భరతఖండంబుఁ జూడఁ
బోయిరావయ్య, యెడ్వర్డుభూమిపాల.!

దౌవా—(మరలఁ బ్రవేశించి) దేవా? సేనాపతులు దేవరదర్శనమునకై మొగసాల వేచియున్నారు.

యువ—శీఘ్రముగఁ బ్రవేశపెట్టుము.

సేనా—(దౌవారికునితోఁ బ్రవేశించి యథోచితముగా నమస్కరించి) దేవా! సర్వతోముఖాటోపముగల మావాహినులు శౌర్యోదన్వంతుఁడవగు నిన్నుఁ గలయవచ్చినవి, కావున వీరిని నయనాంచలమునం గటాక్షింపుము.

మంత్రు—రాజపుత్ర! వేగఁ దులితావాస్కరరథం బగునీకర్ణీరథ మారోహింపుము.

యువ—(రథమెక్కుట యభినయించుచున్నాఁడు).

మంత్రులు, పరిజనము—(సంతోషముతో)

ఆ. వె. ఉరక నవకరగ్రహోదగ్రతేజంబు
పెంచి దెసలనాక్రమించునూర్యుఁ
డుదయనగముమీఁద నొప్పెడు గతి యువ
రాజు వెలుఁగుచుండె రథముమీఁద.

(అందఱును గూడ నడచుచున్నారు).

మంత్రు—సారథీ! కర్ణీరథము మెల్లమెల్లనఁ దోలుము. రాజపుత్రు లిరుదెసల నుండు సేనాసౌష్ఠవమును విలోకింపఁ గలరు.

సేనా—(కర్ణీరథము నొకచేతఁ బట్టుకొని నడచుచు) మహారాజ్ఞీపుత్రా! యీ దెసకు దృష్టిప్రసరింపఁ జేయుము.

చ. కదలినరేఁగి పైకెగయుకాల్బడబంటుల పాదధూళి తో
యదములు గాఁగఁ, జంచలలయందము కత్తులు చూప, భూమి గ్ర
క్కదలుచు భేరికారవము గర్జితరీతి వహింప, నేన్గుపె
న్మదములు వృష్టిగా నటఁ గనంబడు సేనలు వానకాలమై.

మఱియు నీవంకకుఁ జూడుము.

క. అడుగు లిడువేళ శేషుఁడు పడగలు వంచుచును వానిపై కెత్తిన య
ప్పుడు పైకెత్తుచునుండఁగ నడచుం గజఘటలు చూడ నగములపగిదిన్.

దేవా! యీప్రక్క విలోకింపుము, యువరాజహిందూదేశప్రస్థానసంతోషమున నొడలెఱుంగక యుప్పొంగి నడచిపోవు భటుల యాటోపము.

చ. ప్రతికరమందుఁ గత్తులు తుపాకులు నమ్ములు తోమరమ్ము లు
న్నతగదలుం ముసుంఢులు ధ్వనద్ధనురాదికసాధనంబు లు
న్నతిమెయిఁ దాల్చి రూపము గనంబడు నట్లు చరించు విక్రమా
ద్భుతరసమూర్తులో యనఁగఁ బొల్చుచున్నవి సేనలచ్చటన్.

మంత్రులు—అయ్యారే! తురంగతరంగముల చాకచక్యము! అద్దిరే! విదళితవరబలమనోరథంబు లగు రథంబుల సంభ్రమము! వహ్వారే! యేకవర్ణకంకటోష్ణీషధారులై నలికఁబులు బుజంబులఁ దాల్చి యడుగులం దడుగు లిడుచు బారులు తప్పక నడచుచున్నపదాతుల నైపుణ్యము!

యువ—(నాలుగుదిక్కులు కలయం జూచి) సైన్యము లన్నియు సమగ్రసాధనంబులై యున్నవి! బృంహమానగజాకీర్ణయు హేషమాణహయాకులయుఁ గ్రీడమానస్యందనయు నగు నీవాహిని నా కమితానందముం గూర్చుచున్నయది.

సేనా—రాజపుత్ర! హిందూదేశయాత్రాకుతూహలులగు దేవరవారి యనుజ్ఞ నీసేనలన్నియుఁ బరిపాలించుచున్నయవి.

యువ—(అనుగ్రహముతో మంత్రులవంకఁ జూచుచున్నాఁడు)

మంత్రు—(ఉత్సాహముతో) సేనాపతులార! త్వరగ సేనల నన్నింటిని మరలించి స్వస్థానమునకుఁ గొంపొండు.

సేనా—మంత్రుల యానతిప్రకారము చేయుచున్నారము.

యువ—(ముందుఁజూచి) ఏలాకో యమ్మగారి సేవకుండు పరుగెత్తుకొని వచ్చు చున్నాఁడు!

సేవ—(ప్రవేశించి వినయముతోఁగుడిచేయెత్తి) రాజపుత్రా! జయము, దేవాలయములోని ముఖ్యాచార్యులిచ్చిన యాశీఃప్రసాదములు దేవర కిమ్మని యమ్మగారు పంపించినారు.

యువ—(వినయముతో గ్రహించి)

గీ. అఖిలరాజాధిరాజవంద్యాంఘ్రియైన
తల్లియాశీఃప్రసాద మాదలధరించి
నట్టికతమున భరతఖండాతిశయము
చూచి వేగమ మరలివచ్చుట నిజంబు.

మంత్రు— నిరర్గళపరాక్రమక్రమసంపన్నుండవై యనేకదేశయాత్రలు గావించి వచ్చిన దేవరకు హిందూదేశప్రయాణమననెంత!

సేవ— యువరాజ! హిందూదేశమందలి వార్తల నెప్పటికప్పుడు తెలియఁజేయు మండుమని యమ్మగారు సెలవిచ్చిరి. ఈమాట మఱవవలదు.

యువ—గురుజనవాక్యము శిరసావహించితిని. అమాత్యులారా! సేనాపతులారా! నాతో రానివారందఱు నిలువుండు.

అందఱు— యువరాజుగారికిఁ బ్రయాణము శుభప్రదమగుఁగాక! జయము! జయము!

యువ— అందఱయొద్దను సెలవు, శీఘ్రముగా హిందూదేశముం జూచి వచ్చెదను. (అని సపరివారుఁడై ధూమనౌకాధిరోహణమాచరించుచున్నాఁడు)

(అందఱును సెచటివారచటికిఁ బోవుచున్నారు)

గద్య

ఇది...శ్రీతిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబగు నెడ్వర్డుపట్టాభిషేకనాటకంబున హిందూదేశ ప్రస్థానమను ద్వితీయాంకము



శ్రీరస్తు

# ఎడ్వర్డు పట్టాభిషేక నాటకము.

## తృతీయాంకము



(తరువాత నిరువురు సేవకులు ప్రవేశించుచున్నారు)

ప్రథముఁడు— ఏమీ! యెడ్వర్డు భూపాలుని నైపుణ్యము! చూచినంతనె సమస్త హిందూదేశసామంతప్రభువులవలనను విశేషగౌరవము సంపాదించెను.

ద్వితీయుఁడు— ఇష్టదైవప్రసాదము వజ్రకవచమైయుండఁగా రాజపుత్రునకు లోపమేమి?

ఉ. శూరుఁడు రాజమాన్యుఁ డనసూయుఁ డుపాయవిదుండు త్యాగి వి
ద్యారతుఁ డాత్మకార్యపరతత్వవిధాయి ధరాభృదన్వయా
చారపరుండు ధీరుఁడు ప్రజాపరిపాలనదక్షుఁడైన వి
క్టోరియ తీర్పుగల్గిన పటుప్రతిభాచణుఁ డాతఁ డల్పుఁడే!

ప్రథ— (మార్గాయాస మభినయించుచు) ధూమనౌక దిగి యిదిగో! లండను పురంబుఁ బ్రవేశించితిమి. (అని ప్రవేశము నటించుచు) నిరతిశయ మగు నీ విక్టోరియాంబ యౌదార్యమును నుతింపఁదరముగాదు. స్వభావరమణీయం బగు ప్రతిధ్వనిచే భోగావళీప్రముఖంబు లగు స్తోత్రపాఠంబుల నీ వైతాళికులు బిగ్గరగాఁ జదువుచున్నారు.

ద్వితీ— (ఆదరముతోఁ జూచి యచ్చటి జనులం గాంచి గుర్తించినట్లభినయించుచు) సఖా! చూడుచూడుము.

ఉ. చేలములం ధరించుట త్యజించి బుజంబులమీఁద నుత్తరీ
యాలును మాని యౌదలలయందును పాగలు లేక హూణభూ
పాలురభంగి కాళ్ళకు హిజారులు మేనులఁగోట్లు నెత్తి టో
పీలు ధరించి వీథులను వీఁగుచునుండిరి వీరు హిందువుల్?

ప్రథ—బాగుగ నానవాలు పట్టితివి! వీరు కరగాగ్రిహిన్యాయవాద్యధ్యక్ష ప్రముఖోద్యోగంబులకుం దగిన పరీక్షలిచ్చుటకును శ్రీవిక్టోరియానుగ్రహము వడయుటకును వచ్చిన హిందూదేశస్థులు, 'యథారాజా తథాప్రజా' యను న్యాయమున హూణభూపాలుర వేషములే ధరించి తిరుగుచున్నారు.

ద్వితీ— ఇటు చూడుము. ఈ శౌరులకు యువరాజహిందూదేశయాత్రావృత్తాంతమును వినుటయందలి సంతోషము. మన మచటినుండి వచ్చినవార మని తెలిసి మనల ననుసరించుచున్నారు. కావునఁ దద్వృత్తాంతము నిఁక వెల్లడి చేయుదము.

ప్రథ— మంచిది. ఓ లండనుపురవాసులారా! మిత్రులారా! యువరాజహిందూదేశపరిభ్రమణ వృత్తాంతములు సంక్షేపముగా వినుండు.

శా. ఔదార్యాకరుఁడైన రాజతనయుం డాసేతుశీతాద్రి హిం
దూదేశంబును జూచె భూపతుల యస్తోకోపదల్ గాంచె నా
సాదించె న్నిజకీర్తి నల్దెసల వీక్షాసత్సుధాధార లా
పాదించెం బ్రజలందుఁ బుచ్చికొనియెం బద్యప్రబంధంబులన్.

ద్వితీ—నిశ్చయముగా నీదినములలో సర్వదా వృద్ధామాత్యపురోధఃప్రభృతులు బలసికొలువ విక్టోరియామహాదేవి యువరాజవిజయవార్తనే వినఁగోరుచుండును గావున మన మచ్చటికిఁ బోవుదము.

ప్రథ—నీయాలోచన యుచితమైనదియే.

ద్వితీ—(సంభ్రమముతో) మనమాటలు విని విక్టోరియతో విన్నవించుటకై యెవ్వఁడో యమాత్యపుత్రుఁ డొకఁడభ్యంతరమునకై పరువెత్తుచున్నాఁడు. ఇఁక మొదటనే శుభవార్త మనము వినుపించుట తటస్థింపదు. కావున మనలం బిలువనంపువఱకు నిచ్చటనేయుండము. (అని కూర్చుండి యుందురు)

అమాత్యపుత్రుఁడు—(ప్రవేశించి) ఏమీ నాపుణ్యము! ఇట్టి సంతోషవార్త రాణిగారితో మొదట విన్నవించుటనాకుఁ దటస్థించినది. నేవిన్నవించిన శ్రవణప్రియంకర మగువార్తామృతముచేత నమితానందముఁ బొందఁగలదు. నాకును మిగులఁ బారితోషికము రాఁగలదు. (అనిపరిభ్రమించి)ఇదిగో! మహారాజ్ఞి మంత్రులతోను దక్కిన పరివారముతోను గూడ నాస్థానమంటపమునందే యున్నది. కాఁబట్టి నేనును సమీపించెదను.

(యథోద్దిష్టముగ విక్టోరియా ప్రవేశించుచున్నది.)

విక్టో—మంత్రులార! మనచిరంజీవి చిన్నతనమైనను నెంతటియౌచిత్యము కల వాఁడో చూడుఁడు. నాసంరక్షణమునకని కదా సేననంతయు వెంటఁ గొనిపోకయే దేశాంతరమున కేగినాఁడు!

మంత్రు—తల్లీ! యాశ్చర్యమేమి, యువరాజునకు విద్యాబుద్ధులు నేర్పినవారెవరు? తమరుకాదా!

పురో—యువరాజు హిందూదేశమున కేగినది మొదలు నుశకునములగుచునే యున్నవి. కావునఁ జిరంజీవి విజయుఁడై వచ్చుట కేమియు సందియములేదు.

పరిజనము—ఆంగ్లేయరాజన్యవంశము చేసిన పుణ్యములలో నేపుణ్యమును దక్కువలేదు.

విక్టో—చిరకాలమైనను జిరంజీవిరాకుండెను. వార్తాహరులనైనఁ బంపకున్నవాఁడు.

మంత్రు—ప్రతిదినమును నుత్తరములును దంతివార్తలును వచ్చుచునే యున్నవిగదా!

విక్టో—అందులకై కాదు. కావ్యము కవిముఖముగానే వినినదానందము హెచ్చగును.

అమాత్యపుత్రు—(కొలువులోఁ బ్రవేశించి) తల్లీ! యువరాజుగారిచేఁ బంపఁబడినవార్తాహరులిరువురు వీథిలో నిలచియున్నారు.

అందఱు—(సంతోషపడుదురు)

మంత్రు—ఎవఁడురా? అక్కడ. ఈమంత్రిపుత్రునితోఁ గూడఁబోయి హిందూదేశవార్తాహరుల నిటకు శీఘ్రముగాఁ దోడుకొనిరండు.

మంత్రిపుత్రుఁడు—చిత్తము. (అని నమస్కరించి సేవకునితోఁ గూడఁ బోయి మరల వార్తాహరులతోఁ గూడఁ బ్రవేశించును)

వార్తా—తల్లీ! జయము జయము! అప్రమేయమహిమ కలిగి పదిమంది మెచ్చుకొనఁదగిన సంతానముచే వృద్ధిబొందుదువుగాక.

విక్టో—(మంత్రులవంకఁ జూచి) తలఁచికొనినతోడనే వచ్చిన మనోరథములవలెనున్న యీయిరువురకును మంత్రిపుత్రునకును విలువగల వస్తువులు పారితోషికముగా నిప్పింపుఁడు.

మంత్రులు—ఎవఁడురా యక్కడ! యీచీటి కనకాధ్యక్షుని కిచ్చి యిచ్చినవస్తువులు తెండు.

సేవ—దేవా! చిత్తము (అనినిష్క్రమించి వస్తువులతోఁ బ్రవేశించును)

మంత్రులు—(పుచ్చుకొని ఆమువ్వురకు నిత్తురు)

ముగ్గురు—(నమస్కారముతో గ్రహింతురు)

మంత్రి—భద్రులారా! యువరాజప్రయాణవృత్తాంతము నీసభాసదులకుఁ గర్ణాభరణముగఁ జేయుఁడు.

వార్తా—మహారాజ్ఞి! సభాసదులార! సావధానముగా నాలకింపుఁడు.

ప్రథ—తమయొద్ద సెలవుగొని కుమారమహిపాలుఁడు పొగయోడయెక్కి సముద్రమార్గమున నిరువదియెనిమిది దినములు ప్రయాణముచేసిన పిమ్మట—

గీ. సప్తభూమికసౌధవిస్తారితంబు
ధూమనౌయానవప్రబంధురదిశంబు
యోజనశ్రావ్యజనరవభ్రాజితంబు
దాఁపునం జూడఁబడియెఁ ముంబాపురంబు.

ద్వితీ—ధూమనౌక ముంబానగరముం జేరుసమయమున—

సీ. వేలకు వేలు జీతాలుగైకొని ధర్మమరయు పురస్థేయపరులతోడఁ
గోట్లకుఁ బడగెత్తుకొని వణిగ్ధర్మంబుఁ బ్రకటించుసంఘవర్తకులతోడఁ
దనచేయురాజశాసనవిధులందు బాసటయగు జనసభాసదులతోడఁ
బలుప్రదేశములవార్తలు లోకులకువ్రాసి ప్రకటించు పత్రికాపతులతోడఁ

గీ. భిక్షువులను జూడఁ దగినసేవకులతోడ
దారిసేద నడచు పదార్థములతోడ
నెదురుగావచ్చెఁ బొగయోడ యెక్కి దేవి!
తనయుఁగన్గొన రాజప్రతినిధి యటకు.

మంత్రులు—తరువాత ?

ప్రథ—తరువాత యువరాజుగారు రాజప్రతినిధిదత్తంబు లగు నర్ఘ్యపాద్యంబులు గ్రహించి క్రమముగా సపరివారముగ నప్పురమునందలి నౌకాతీర్థమున దిగునంతటిలో—

పురో—ఏమి జరగెను ?

ప్రథ—మరేమియు నుపద్రవము జరగలేదు.

మ. ధరణీచక్రము దిద్దిరందిరిగెఁ బాతాళంబు ఘూర్ణిల్లె నం
బరమల్లాడె సముద్రమంతయును నభ్రస్ఫూర్తియై మించె న
ప్పురిలో రాజసుతుండు నేఁడిటకు రాఁబోనుండెఁగాయంచుఁ ద
త్పరులై ప్రేల్చిన మేల్ఫిరంగుల యపూర్వస్ఫీతరావంబునన్.

పరి— జెండాలు మొదలగునవి కట్టి పురమంతయుఁ బచ్చతోరణములచే నలంక
రించి వీథులన్నియు సింగారించిరా ?

ద్వితీ— నాఁడా యలంకరించుట ! యువరాజు వచ్చుచున్నాఁడని వినినది మొదలు
కొనియే యలంకరించిరఁట.

ప్రథ— తరువాత రౌతులచే నధిష్ఠింపఁబడిన తురంగములఁ గట్టిన యొక్క
ముత్యాలకర్ణీరథమెక్కి యువరాజుగారు రాజవీథిం బోవుచుండఁగా—

సీ. వీఁడఁటే ! మనరాజ్ఞి విక్టోరియాదేవి కడుపుపండినరాజకాస్తుభంబు
వీఁడఁటే ! యతినిష్ఠతోడ నలెగ్జాండ్రి యార్జించుకొన్న పుణ్యములపోగు
వీఁడఁటే ! భారతోర్వికిఁ జక్రవర్తియై మనలఁ బాలించుసామ్రాజ్యమూర్తి
వీఁడఁటే ! లోకైకవీరులెల్ల నుతింప నగు ప్రతాపంబు దిక్కైనవాఁడు

గీ. వీఁడఁటే ! యెల్లవిద్యలవీడనంగఁ
దగిన ప్రోడతనంబుచే నెగడుజాణ
యనుచు నున్నతసౌధంబులందు నిలిచి
వరుస సేసలు చల్లిరి వనజముఖులు.

విక్టో— ( సంతోషగద్గదస్వరముతో ) తరువాత ?

ప్రథ— తరువాత, మణిమయాలంకారశోభితంబై యిచ్చటి రాజభవనంబునకంటె
నందమైన యొక్క దివ్యభవనంబున విడిసి యెడనెడ సందర్శనార్థము వచ్చు
సామంతరాజులకు దర్శనమిచ్చుచు వారుదెచ్చిన యుపాయనంబులు గ్రహిం
చుచుఁ గొన్నిదినంబులుండి తత్పురంబునందలి ధర్మస్థానంబు లన్నియుం విల
కించి పరీక్షించెను.

విక్టో— మరిబాపురము తీరును సౌరును మేడలును కొనియాడఁ దగినవేనా ?

మత్రిత— కొనియాడఁబడుట కేమితక్కువ ! మనము వార్తాపత్రికల వినుచుంటిమి
టలేదా ?

ద్వితీ— నిక్కముగ హిందూదేశమంతెచ్చటను నట్టి చక్కని పట్టనము లేదనియే మానమ్మకము.

సీ. తలమీఁది పాగ భూతలికి జాఱు టెకాని మేడపైభాగంబు చూడఁబడదు
మిఱుమిట్లు గొని యున్న మిసిమిపోవుటెకాని కనులు గోడలడాలు గానలేవు
కాళ్ళనొప్పులెగాని కాంచిన చిత్రప్రదేశమ్ములకు మదిఁదృప్తి పడదు
కొనునాసయేకాని ధనముచాలదు ధనదునకైన నచటివస్తువులుకొనఁగ

గీ. దానివర్ణింపఁ దరమె యెవ్వానికైన
నమితవిక్రయికజనాకులాపణంబు
వార్ధి వీచీమరుద్బాలకర్ధియుతము
భానురాకారకంబు ముంబాపురంబు.

విక్టో— (ఆత్మ్యాస్థతో) అచటినుండి చిరంజీవి యేగిన స్థలంబులును దద్విశేషంబులుం జెప్పఁడు.

ప్రథ— తరువాత నోదేవీ! సపరివారముగఁ గచ్చి బరోడా నవంతవారీ ప్రముఖ దేశాధినాథులచే గౌరవింపఁబడి తదుపహారంబులు కైకొనిన పిదప.

మ. లలితాకారులు శూరు లాప్తులు కృపాలంకారు లార్తావనో
జ్జ్వలవిక్రాంతులు సాహసాత్మ లసమస్థైర్యంబుతో రాజపు
త్రులు పాలించెడు భూమికేగెను భవత్పుత్రుండు సోత్సాహదో
ర్బలసంపన్నుఁడు కార్యవాది కరుణాపారీణచారిత్రుఁడై.

మంత్రు— వీరివలన మెప్పువడసి వచ్చుటయే బుద్ధిమత్తకుఁ బ్రబలదృష్టాంతము.

విక్టో— వారంతటివారా?

మంత్రు— ఔను. తొల్లి డిల్లీ రాజధానిగ హిందూదేశమంతయు నేలిన పృధివీరాజుకైనను దద్దేశపరిపాలనము నొనరించిన మహమ్మదీయులకైనను లోఁబడని వారీ రాజపుత్రస్థానమునందలి మహారాజులే.

ప్రథ— మన యువరాజుగా రారాజపుత్రస్థానమున మొట్టమొదట జయపురమునకు వెళ్ళిరి.

విక్టో— వెళ్ళినతరువాత నేమయ్యెను?

ద్వితీ— భటుభక్తులతోఁ బరిపాలనోపద్రిష్టయగు మనయుద్యోగితోడం గలసి జయపురాధీశుఁ డెదురుగావచ్చి తోడ్కొనిపోయి నిజభవనంబున విడిది యొసఁగి సమస్తోపచారంబుల సంతుష్టునిం జేసి—

చ. గజములు వారువంబులును గానుక యిచ్చి ధనంబొసంగి య
క్కజమగుప్రోలునం గల జగాపను లన్నియుఁ జూపి బాంధవా
త్మజసహితంబుగా ననుపఁ దత్పురరాజను వీడియేగ నా
త్మజనముతో భవత్సుతుఁ డుదారుఁడు చేరుక జోతిప్రోలికిన్.

మంత్రు — తరువాతఁ దరువాత ?

ప్రథ — ఆజోత్‌పూర్ చేరినపిదపఁ దదధీశునిచేఁ గానుకలతో నుచితసత్కారముల నొంది యచ్చటినుండి మరలి యుదయపురాధినాథులను రాజపుత్రాధీశులఁ బరిపాలనోపదిష్టతోఁ గూడి గౌరవించెను.

విక్టో — పిమ్మటఁ బిమ్మట ?

ద్వితీ — పిమ్మటఁ బంజాబు దేశంబుఁ జొచ్చి-

గీ. ఝిండు భావలపురమును సీకురాజ
ధానియగు పట్టియాల సంస్థానమరసి
ప్రాక్తనాధీశ్వరులకెల్ల రాజధాని
యైన దిల్లికిఁబోయె ననంతరమున.

ప్రథ — ఢిల్లీపట్టనముఁ జొచ్చినపిదప-

సీ. ధర్మరాణ్ముఖపురాతన భూపతులనాఁటి పాండవదుర్గమును వప్రములు చూచి
ద్వితీ — ఉద్దిఁగాంచని కుతుబుద్దీనుఖ్యాతికి సాక్ష్యమీఁదగు జయస్తంభ మెక్కి
ప్రథ — యమునాతరంగతోయమునఁ బెంచినపుర్కోద్యానభూతలకు వాహ్యాళి వెడలి
ద్వితీ — రాజాధిరాజులై ప్రజనేలిన తురుష్కరాజగోరీమందిరమ్ములరసి
ప్రథ — గీ. సకలరాజన్యమూర్ధాభిషవనసలిల
ధారలం దోల్లి తడిసినస్థలములు గల
సుందరాస్థానముల సొరుచూచి సంత
సించె నెడ్వర్డుభూపాలశిశుకరుఁడు.

మంత్రు — హిందూదేశమునకెల్లఁ దప్పక చూడఁదగినపుర మిదియే.

విక్టో — (సంతోషదుఃఖములతో) నాకింకఁ డాదృశప్రదేశములంగాంచు భాగ్యంబు తటస్థింపదు.

పురో — అమంగళము ప్రతిహతమగుఁ గాక.

పతి — తరువాతఁ దరువాత ?

ప్రథ—తరువాతఁ దద్దేశమునందలి లాహోరుంగని యాత్రగాపుం జని యందుఁద్రిలోకాతీతసౌందర్యముగల తాజుమహాలు గాంచి యానందించి ధూమశకటీమార్గంబున నాగపురరాజధానీకంబగు దేశంబుఁ గటాక్షించుచుఁజనిచని యెడనెడ నారోహణావరోహణస్థానగృహంబులకుఁ జనుదెంచి యుపాయనంబు లర్పించు నృపాలుర నుచితసంభాషణంబుల గారవించుచు—

క. గంగయు యమున సరస్వతియుం గలసినచోటు మోక్షదోర్వియనుచుఖ్యా
తిం గన్నతావు యువరా జంగీకృతిఁజూపె నాప్రయాగం జూడన్.

విక్టో—అందుం బడి మడిసినఁ దమతమకోరుకులు సఫలంబులగు పుట్టువుగలదని భరతఖండవాసులకుఁ గట్టినమ్మికముగల తావదియేనా ?

పురో—అచ్చటిజలమును బ్రశస్తమైనదై యెన్నిదినములు దాఁచినను జెడదఁట కాదా ?

మంత్రు—నిక్కము. అచ్చటివా రది తత్క్షేత్రమహిమయందురు.

విక్టో—తరువాత ?

ద్వితీ—అనంతరమచ్చటనున్న కోట్టంబుగాంచి చతుష్షష్టితీర్థవిరాజితంబును గంగానదీ తీరస్థంబును బంచక్రోశపరిమితంబును విశ్వేశ్వరజ్యోతిర్లింగసందర్శనార్థము సర్వదా యనేకేతరదేశస్థులచే సేవింపఁ బడునదియు నగు వారాణసీపురంబు దాఁటి.

క. రాజప్రతినిధిధాని విరాజత్సౌధంబు చూడ రమ్యము త్రిచతు
ర్యోజనమితంబు చూడంగాఁజనె యువరాజు కాళికాపురియంతన్,

విక్టో—చిరంజీవి యింకఁ దిరుగవలసినదేశము చాలఁ దక్కువయైనది.

మంత్రు—చెన్నపురీఖండ మొండుదక్క నితరమంతయుఁ జూచెను.

పరి—అనంతర మనంతరము ?

ప్రథ—అనంతర మాపురమునందలి ప్రతికర్మస్థానములం జక్కఁగఁ బరికించి యచ్చటి పౌరుల నాగరికతకు మిగుల నచ్చెరువంది.

తే. గీ. 'అమ్మపరిపాలనమ్మున నమ్మచెల్ల !
యెంతసిరివచ్చె విఖ్యాతి యెంతకలిగె
నెంతమతిహెచ్చె లభియించె నెంతచదువు
హిందువుల'కంచుమిగులనానందపడియె.

విక్టో—(స్వోత్కర్షాసహనమభినయించుచు) పిదపఁ బిదప ?

ద్వితీ—పిదపఁ గలకత్తాపురంబు వెడలి యిందూరు సింధ్య రీవ మున్నగు దేశాధిపతుల యాతిథ్యము పరిగ్రహించి.

ఉ. చూచితి ముత్తరాపథము చూచితి మింద్రునిదిక్కటంచు బి
ట్టేచి నిజప్రజ ల్తన యతీందుయశంబు నుతించుచుండ రా
జోచితభక్తితోఁ బ్రభవదున్నతితోఁ జనుదెంచె నున్నత
శ్రీచణుఁ డౌభవత్సుతుఁడు చెన్నపురింగల రాచకోటకున్.

ప్రథ—ఉ. అచ్చటి కయ్యనంతశయనాధిపుడుం బుదుకోట నేతయుం
గొచ్చిను భూతలేంద్రుఁడును గోరికలీరికలెత్తఁ జూడఁగా
వచ్చిరి చూచి తెచ్చిన యుపాయనరాసులు స్వామిభక్తితో
నిచ్చిరి మెచ్చి రెంతయు నహీనచరిత్రుని రాజపుత్రునిన్.

మఱియు నొక్క విశేషంబు వినుఁడు.

తే. గీ. ఏన్నృపతి దేశమునఁ గానరాని మంచి
కానికనొసంగెఁ జిన్నిపూఁదేనెఁ బీఠి
కాపురీపాలకుఁడు కీర్తికాముకుండు
రావుకులవార్ధిచంద్రుండు రామరావు.

విక్టో—ఇంతకు హైదరాబాదు చూడఁబోయెనా లేదా ?

ప్రథ—తరువాతఁ దత్రత్యంబులగు కార్యస్థానంబులు పరిశీలించి—

చ. అనితరభోగభాగ్యవిభవాకరమై తనరారుశాలివా
హనకులరాజధానియగు నమ్మహిశూరపురంబు నేలుచు
న్ననృపతిచామరా జిడు ననర్ఘములైనయుపాయనంబులం
గొనుచు నిజామురాజ్యమునకుంజనె నంతట గోలకొండకున్.

ద్వితీ—క. సెగకన్నుఁ ద్రిశూలముగల భగవంతుని కైనభయముపడునే! ధక్క
న్నగరింద్రుఁ డట్టివాఁడు నుడుగరసమర్పించె నీకొడుకునకుఁ బేర్మిన్.

ద్వితీ—ఈగతి దక్షిణాధిపతులును మహీశూరపురాధిపతియు భరతఖండసామంతభూపాగ్రగణ్యుండగు ధక్కనాధీశ్వరుండును నిచ్చిన యుపాయనంబుల గ్రహించిన పిదప నీవృత్తాంతము సవిస్తరముగా మాజనయిత్రికిం దెలుపుఁడని మమ్మిరువుర నిచటికిం బనిపె. ఇప్పటికి మరలి ముంబానగరమునకు రాఁగలఁడు.

(విక్టోరియతప్ప తక్కినవారు జయము జయమని నుతింతురు).

విక్టో— భద్రులారా !

గీ. నీరు భర్జించెనే ? మేనిసౌరు నీర
సింపకుండెనె ? మనచిరంజీవి కచట;
నసప్రమత్తులకైన దూరసప్రియాణ
కలన బడలికలేకుంట కానఁబడదు.

ప్రథ— సమస్తోపచారసంపన్నముగ నడుగులకు మడుగులొత్తు నిజసామంతనృపాలుర దేశమ్ములు తిరుగుచున్న రాజపుత్రునకు బడలికయన నెట్టిది !

గీ. తొంటికంటెను బలమునఁ దూఁగుచుండె
నినుమడించెను గాంతి ముఖేందునకును
హైందవావని యనురాగమతిశయిల్లఁ
గోరుకొన్నట్టి పెండ్లికుమారుఁ డనఁగ.

మంత్రు— త్వరలో మరలి మనదేశమునకు వచ్చునా, ఇంకను యువరాజుగా నుండుటయే యతని ముఖ్యాభిప్రాయమా?

దౌవారికుఁడు— (ప్రవేశించి) దేవీ ! భరతఖండకార్యనిర్వాహకుఁడు ద్వారమున వేచియున్నాఁడు.

విక్టో— శీఘ్రముగా లోనికిం దోడితెమ్ము. (దౌవారికుండు నిష్క్రమించును)

కార్య— (దౌవారికునితోఁ బ్రవేశించి) దేవీ ! జయము జయము.

విక్టో— (భ్రూసంజ్ఞచేఁ గూర్చుండ నియోగించును)

కార్య— నేఁడు రాజప్రతినిధియొద్దనుండి తంత్రీవార్త వచ్చినది.

క. 'గౌరవముతోడ హిందూధారుణియంతయును దిరిగి తమపనికంగీ
కారముచేకొని మరలెఁ గుమారుఁడు నిజపురికి నేఁ డమాత్యులతోడన్.'

(అని చదువును)

అందఱు— జయము జయము !

మంత్రి— తరువాతఁ దరువాత ?

కార్య— (మరలఁ జదువుచున్నాఁడు)

క. 'కొలఁదిదినంబులలో నొడయుల నెల్లరఁ బిలువనంపి యుత్సాహముతోఁ
జలికించెద సమ్రాట్టీ యిలకని మన ప్రభ్వి నఖిలనృపతులచేతన్.'

తదర్థంబుగ దిల్లీపురంబుననొక పేరోలగంబు గావింప వలయునని యింతకు మున్నె నిశ్చయించుకొని యుంటిమిగద. కావునఁ దత్సభాముఖంబున మన్ముఖంబున మహాదేవిగా రానతీయవలసిన విషయమును నాకుఁ దెలుపవలయును. తద్విలోకనార్థంబు చనుదెంచు నస్మద్దేశీయులనెల్లరఁ బురికొల్పి పంపవలయును.'

మంత్రిలు—అవసరముగలపనియే యిది. కావున దేవీ! తదర్థంబును నవిషమార్థంబునగు యుష్మదభిప్రాయమును దెలుపవలయు నని కోరుచున్నారము.

విక్టో—అందులకై యింతకుమున్నే యాలోచించుకొనియుంటిని. మీరందఱును సావకాశముగ విని మంచిచెడ్డలరసి సాంఘికులచేతఁ గూడ నంగీకరింపఁజేసి పంపుఁడు.

(తనయొద్దనున్న పెట్టెలోని కాగితముందీసి చదువుచున్నది).

సీ. ఏను గ్రిస్తుమతంబు దాననైనను మీమతములజోలికిరాను, తాముపదవి
నందఁగాఁ దగువారలైన నిచ్చెదఁగాని తరతమవర్ణభేదంబుఁ జూడ,
వీరు మావారనుభేదంబులేక యుందఱుపైసమంబుగా దయనుంచెద
మీతృప్తినాతృప్తి మీవృద్ధినావృద్ధి మీకృతజ్ఞపుఁ జేఁత నాకుగొప్ప
తే. గీ. బహుమతియౌఁగాన నాకు మీవలని ప్రేమఁ
గలిగియుండుటయును నాయెడలను మీకు
భక్తిగలుగుటయును జేయవలయు ననుచు
దేవునకు మ్రొక్కుచుండెద దినదినంబు.

మంత్రి—చక్కఁగనే యున్నది. సమస్తవిద్యాపారంగతురాలవును బ్రజలకష్టసుఖంబు లరయుదానవునగు నీవంటిప్రభ్వికి మేము దెలుపవలసిన దేమున్నది.

కార్య—నేనిప్పలుకులు సాంఘికుల యభిప్రాయముతో నేకీకృతముగావించి రాజప్రతినిధికిఁ బంపవచ్చునా?

విక్టో—నామనోవాక్కాయకర్మములతోఁ జెప్పినదిగాని యొకటికాదు.

మంత్రి—అవశ్యము పంపవచ్చును.

కార్య—అట్లయిన నాకు సెలవిండు (నిష్క్రమించును).

(తెరలోపై తాళికుఁడు)

మ. ఎఱుపద్దించినపట్టునూలువలె నెంతేమీరునస్రాళిచే
నెఱసంజందివిఁబెంచి పూష కనుఁగొంటే! నీటిరావైపుపెర

వలరత్నాకరవీచులకా ముసుఁగఁబోనాసించుచున్నాఁడు భా
స్వరవాత్యాదళితాంబుజాతజరజశ్ఛత్త్రాయమానాకృతిన్.

సీ. అంజనాచలకూటకుంజపుంజతలేషు ఘూర్జరకామినీకుంతలేషు
ద్రావిడీవక్షోజధారుణీభాగేషు కాశ్మీరయోషిదంగప్రభాసు
హస్తినాపురపతీశస్త్రోత్తమాంగేషు గౌడాంగనాముఖాగ్రగతమాసు
యమునానదీతరంగమనోహరశిఖాసు లాటనారీగల్లపేటికాసు

తే. గీ. కుసుమతల్పంతి కుందంతి కుచపటంతి
కోమలత్వంతి సిచయానకుంతనంతి
చంద్రఖండంతి హంసంతి చందనంతి
ప్రిభ్వివిక్టోరియాంబ! తావకయశాంసి.

విక్టో—మంత్రులార! నే వాహ్యాళి వెడలు సమయమైనది గానఁ బోయివచ్చెద. మీరు నభిమతంబులాచరింపఁబోండు.

( యందఱును నిష్క్రమించుచున్నారు )

* గద్య *

(ఇది... శ్రీతిరుపతివేంకటేశ్వర ప్రణీతంబగు నెడ్వర్డుపట్టాభిషేకనాటకంబున హిందూదేశసంచారంబను తృతీయాంకము.

శ్రీరస్తు

# ఎడ్వర్డుపట్టాభిషేకనాటకము

## చతుర్థాంకము

(ఆంగ్లేయదేశ ప్రతినివృత్తుండగు దేశోపకారి యను హిందూదేశవాసి ప్రవేశించుచున్నాఁడు)

దేశో—(తనలో) చిరకాలమునకు మరల హిందూదేశము చూచితిని. జన్మదేశమైనను నాకిదిపరదేశమువలెం గాన్పించుచున్నది. (ముందుకుఁ జూచి గుర్తించి) వీఁడె! నాప్రాణమిత్త్రుండగు జానపదుఁడు వచ్చుచున్నాఁడు (పరిక్రమించుచున్నాఁడు)

జాన—(ప్రవేశించి) ఆర్యా! నమస్కారము. చిరకాలమునకు మాకన్నులు సఫలమైనవి. లండనుపురమున రాజకీయసభ్యపదవి వహించి తాము భరతఖండోపకారమునకుఁ బాటుపడుచున్నారని తమదర్శన మెప్పుడు లభించునాయని యువ్విళ్లూరుచున్నారము. (సంతోషముతో) మిత్త్రమా! ఆంగ్లేయదేశమునందలి విశేషములేమి ?

దేశో—విశేషములేమియున్నవి! భరతఖండమంతయు నేకచ్ఛత్త్రముగా నేలుచు మనల నేలిన విక్టోరియామహాదేవి కీర్తిశేషురాలయ్యెనని మీరిదివఱకే విని యుందురు.

జాన—ఆఁ. వింటిమి. ఆమెపుఁ గాలమాసన్నమైనదని వినినదిమొదలు మనదేశమంతయు నలజడిపాలైనది. ఆదినములలో నందఱును తంత్రీకార్యస్థానముల యందే యుండిరి.

దేశో—ముదుసలిదిగాయియఱువదినాలుగు సంవత్సరము లిల యేలిన యామెమరణమంతగా శోచనీయము గాదుగాని తదీయపరిపాలనకాలమున భరతఖండమునకుఁ గలిగిన యుపకారమును మాత్రము దలఁచుకొనిన విచారము రాకపోదు.

జాన — ఇఁక ముందు మనకు రాజుగాఁగల యేడ్వర్డుభూపాలుఁడైనఁ దల్లివలెనె పరి పాలించువాఁడేయని విందుము. వెనుక మనదేశమునకు వచ్చినపు డతని యోగ్యతలు చూచితిమి గదా!

దేశో — ఔను. మనకేలోపములును జరుగఁ గూడదు.

జాన — రాణిగారు గతించినపిదప నచట జరగిన విశేషము లెవ్వి? కొంచెము దయ యుంచి సెలవిండు?

దేశో — ఆమె మృతినొందిన పిమ్మట, దద్దేశప్రభువులందఱు వచ్చుదనుకను నామెకుఁ బెద్దకూఁతుకొమరుఁడు జర్మనీచక్రవర్తి కూడ వచ్చుదాఁకను బదునొకండు దినంబులు తైలద్రోణియందుంచి కాపాడిరి.

జాన — తరువాతఁ దరువాత?

దేశో — ఆంగ్లేయరాజులలో రాజెప్పుడు బ్రతికియుండు ననునొక న్యాయము కలదు. దానంజేసి వెంటనే ధర్మాచరణసభవారందఱు నెడ్వర్డుభూపతిచేఁ గర్తవ్యం బులు చేయించినపిదప లఘురాజ్యాభిషేకము గావించిరి. తరువాతఁ దన్మృత కళేబరము నొక రథంబునందుంచి —

సీ. నీలిదుస్తులవాహినీసంఘములతోడ సేనాధిపతులిరుచెంతఁ గొలువ
నాంగ్లేయదేశరాజాధిరాజులు వెంటఁ గాల్నడ సేవకాకారమూన
వారువంబులనెక్కి వరుసగా వేలకువేలు ముంగల సవారీలు నడువ
లెక్కింపరాని మేలిఫిరంగులరవంబు దిక్కులాకాశంబు మక్కళింప,

తే. గీ. మనుమలును గొడుకులు నినుమనుమలు మొద
లైనగంపంతబలగము ననుసరింప
భర్తగోరికి నొకప్రక్క వసుధతోడ
నైక్యమును బొందఁజేసిరి యుబ్బురముగ.

జాన — (విచారముతో) ఎట్టిరాజులకైన నను దుదకిట్టిదశ రాకమానదు.

శా. భూలోకంబును రాజులెల్ల 'జయ భోభో'నాఁగఁ బాలించి యా
ర్వీలోకంబును బాసిపోయినది మావిక్టోరియాదేవి మా
మాలోకమ్ముల కేగుచెమ్మనుచు సంభావింపఁ దత్రత్యు లం
దేలోకమ్మున నున్నదో యొచటఁ దానెట్లెట్లు వర్తించునో.

దేశో — (నిర్విచారముతో)

చ. చదివెను మేటివిద్యలు ప్రజాపరిపాలన మాచరించెఁ గీ
ర్తి దెసల నించె సేవనుమతీధవులుం బొనరించినట్టి భా
గ్యదశ వహింపఁగా భరతఖండము నంతయుఁ జక్రవర్తినీ
పదమున నేలె నామె కొకపట్టునకైనను లోపమున్నదే!

కావున నామెకై వగచుట తగనిపని. మహాత్ము లెంతకాలమైనను బ్రతికియుండ వలయుననియే యుండును గాని విధాతమితి కాయుర్దాయము దాఁటదు గదా!

జాన— కొలఁది దినములలో నెడ్వర్డుమహీపాలునకుఁ గిరీటధారణోత్సవము జరగును గదా. తమ రామహోత్సవమును జూడకయే వచ్చితి రేమి?

దేశో— కొన్ని దినములకిందట నే యమ్మహోత్సవము జరగునని తదాలోకన కుతూహలినై యిచ్చటి కార్యాతిపాతములం దలంపక నిలిచియుంటిని గాని కొన్ని కారణములచేఁ దత్కాలమున జరగకపోయెను.

జాన— ఔను శ్రేయస్సులకు విఘ్నములు మెండు. పిమ్మట?

దేశో— తరువాత నయ్యుత్సవము జరగునంతవఱకుండుటకు వీలులేక మరలివచ్చితిని.

జాన— అట్టి మహోత్సవమును జూచుటకు నదృష్టముగూడఁ దోడుపడవలయును.

దేశో— అగును.

జాన— కిరీటధారణోత్సవ మెప్పుడు జరగును?

దేశో— నేఁడే. ఈదినమున లండను పురమునందంతటఁ జంద్రోదయోజ్జృంభమానంబగు పారావారము పోల్కిఁ గన్పట్టఁగ వేత్రంబులు ధరించి దౌవారికు లట్టిటుదిరుగు చుందురు.

జాన— అయ్యో! చెప్పకుము. వినినఁ జూడలేకపోయితి ననువిచారము మెండగును.

దేశో— మీరెన్నఁడును జూచుటకువీలులేనివారే. కలిగియు నేఁ జూడలేకపోతిని.

జాన— ఇప్పుడేమి, రేపు ఢిల్లీపురంబున జరగఁబోవు పట్టాభిషేకము చూడరాదా? మావంటివాండ్ర కేది చూచుటయుఁ దటస్థింపదు.

( యిరువురును నిష్క్రమించుచున్నారు)

(ఇది ప్రవేశకము)

(పిదప జనకోలాహలము సహింపక బెత్తములు జడిపించుచు దౌవారికులు

ప్రవేశించుచున్నారు)

దౌవా— సీ. కాన్కగాఁ దెచ్చిన కరిఘటల్వరిబైట నిల్పుఁడో ధారుణీనేతలార
ప్రోలివీథుల నొక్కపొంతనేకాని మీసేనలావకుఁడు సేనానులార
దోళలుడిగ్గిన తేర్లుదరలించుకొని వీథిఁ దిరుగాడకుండు సాదివరులార
వారువంబులు దూరదూరంబునందుంచి రయగతుల్నేర్పుఁడో రాతులార

తే. గీ. అధికమయ్యెను ప్రజలసమాగమంబు
లిఱుకగుచుఁ బురమెల్లఁ గిక్కిఱిసియుండె
మరలుచున్నారు వచ్చినమనుజగణము
బైటఁబెట్టుండు మీమొగమోటమిపుడు.

(బిగ్గరగా)ఓసమస్తదేశీయధరాపతులారా! ధర్మాచరణసంఘమువారిమాట వినుండు.

చ. విలియముఁ డాదిగాఁగఁ బృథివీపతు లేయిలరేలి, రేయిలం
బలియఁగఁజేసె నారొలిజబత్తు సురాణియు, దేవ నిత్యపుం
గలిమివహించె విక్టొరియ, గర్వవిదూరుఁడు సత్యసంధుఁడా
యిలకిపు డేలికొను మనయెడ్వరుడుక్షితిపాలుఁ డున్నతిన్.

(సాటోపముగాఁ బరిక్రమించుచు) అధికారులారా! యేమిచేయుచున్నారు? ఇష్టదైవసమారాధనవిధు లన్నియు నాయత్తపఱచితిరా? పట్టాభిషేకాగార మలంకరించితిరా? పుణ్యతీర్థసలిలమ్ములు బంగారుకుండల నించితిరా? అభిషేకతైలము తెచ్చితిరా? మఱియుంగావలసిన సంభారము లన్నియు భద్రముగా నుంచుకొంటిరా? మంగళముహూర్తకృతావధానులగు మతాచార్యులను సన్నద్ధపఱచితిరా? వసుమతీపాణిగ్రహణోచిత మంగళాచారవేషసంపన్నుండగు నెడ్వర్డునరనాథుఁడు పత్నియగు నలగ్జాండ్రా మహారాజ్ఞితోఁగూడ వెస్టుమినిస్టరు భవనంబున నిన్నరాత్రి యంతయు మేల్కొని నేడు వచ్చుచున్నాఁడు. త్వరపడుఁడు త్వరపడుఁడు!

రెండవ దౌవారికుఁడు— (కనుబొమ లదర ముందుఁ జూచి) ఓజనులారా! మీరు కోలాహలము మానకున్నారు! నే సహించిన నాబెత్తము సహింపదు. (బెత్తము నాడించుచు) ఏమి! నాపరిభావము! జగమంతయుఁ దృణముగా దలఁచు రాజాధిరాజులచేఁ గూడ మాటలాడుట సహింపనివాఁడ!

మూఁడవదౌవారికుఁడు— (పటాక్షేపముగావచ్చి) ఏమిరా, దేశకాలము లెఱుఁగక యుండ భూపతుల నివారించుచున్నావు! అందఱును గిరీటధారణమహోత్సవ సుఖమనుభవింపవలసినదె. ఇట్టి యసంగత కృత్యము లాచరించిన శిక్షింపఁబడుదువు. ( కొట్టఁబోవును).

రెండ— విక్టోరియ చిన్ననాఁటనుండి యున్న దౌవారికుఁడను నన్ను దేశకాలము లెఱుంగవనుచున్నావుగదా !

మూఁడు—ఎవఁడవైన నేమి ? అందఱుఁ జూడవలసినదనియే మహారాజులయాజ్ఞ.

రెండ— నాకు నీతో వివాదమేల? ఈ వృత్తాంతమంతయు వెస్టుమినిస్టరు భవనమున నున్న మంత్రిపురోహితాదులతోఁ గలసియున్న రాజుగారితోనె విన్నవించెదను.

( యందఱు నిష్క్రమించుచున్నారు )

(పిదప యథానిర్దిష్టముగా దంపతులు ప్రవేశించుచున్నారు)

పురో—మహారాజా ! నీవుయువరాజవై యున్నప్పుడు సమస్తదిక్కులు జయించి భూమికిఁ బట్టభద్రుఁడవగు మని మేము దీవించిన దీవనలు నేఁటికి యథార్థములయ్యె.

తే. గీ. అధికవిఖ్యాతిగనె నేఁటికాంగ్లకులము,
తీఱుచున్నది మాకు విక్టోరియావి
యోగదుఃఖంబు, ప్రజలు వీతోపసర్గు
లైరి, రాజన్వతీనామ్నియయ్యెనుర్వి.

మంత్రులు—మ. అలకేంద్రుం బురుడించులక్ష్మిగల మీయాంగ్లేయరాజన్యులం
గొలువంజాలిన మంత్రిపుంగవులు తక్కంగల్గుభూపాలమం
త్రులతో నీడగునాయటన్న విమలాస్తోకక్రమఖ్యాతియుం
బలమై వర్ధిలఁజేయఁగావలయు నెడ్వర్డక్షమాపాలకా.

పరిజనులు— గీ. నిన్ను సేవించుభటులమై నీకటాక్ష
మునకుఁబాత్రులమైయుంట భూతలేంద్ర
సభలయం దెల్లఁ బ్రఖ్యాతిసంభవింపఁ
బోలుఁ గాంచెద మెడ్వర్డుభూమిపాల.

పురో—మహారాజా ! కిరీటధారణసామగ్రియంతయు సిద్ధమైనది. ఆంగ్లేయనరేశ్వరక్రమాలంకృతంబగు కిరీటంబు దేవరమూర్ధంబలంకరింప వేచియున్నది. భవదీయభద్రసింహాసనారోహణంబు సర్వజనాదరణీయంబు.

దంప—మతాచార్యుల యానతి నిదిగో శిరసావహించుచున్నాము.

పురో—తదర్థంబగు ముహూర్తం బాసన్నంబగుచున్నది. కావున దంపతులు వేగము దయచేయవలయును. మేము కార్యశేషంబు నిర్వహింపఁ బోయెదము.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

గద్య.

ఇది...శ్రీతిరుపతి వేంకటేశ్వరప్రణీతంబగు నెడ్వర్డుపట్టాభిషేక నాటకమునఁ బట్టాభిషేకప్రయత్నమను చతుర్థాంకము.



శ్రీ ర స్తు

# ఎడ్వర్డుపట్టాభిషేకనాటకము

## పంచమాంకము



( ధాత్రియుఁ జేటియుఁ బ్రవేశించుచున్నారు )

ధాత్రి—( రోషముతో ) ఓసి! వందలకొలఁది చేయఁదగిన కార్యములుగల యిట్టి మహోత్సవకాలమున రాత్రికి రాత్రియంతయుఁ గంటికిఁ గనఁబడకుండ నెవరియొద్ద నుంటివి? మంచివిలువఁగల యానగలన్నియు నీతాత యొవ్వఁ డిచ్చెను? వెస్టుమినిష్టరు భవనమునందుండి మహారాజదంపతు లప్పుడే పట్టాభిషేకమందిరమునకు బయలుదేఱిరి. విక్టోరియాదేవి కడుపుచలువ వలనను భూమియుఁ బ్రజలుఁ జేసికొనిన పుణ్యముచేతను బురోహితుల భాగ్యమునఁ జేసియు మావంటివాండ్ర యదృష్టమునను మాయెడ్వర్డునృపాలుఁడు పుట్టెఁడు రోగమువచ్చియు బ్రతికి నేఁడు పట్టాభిషిక్తుఁడగుచుఁడు సమయమున కెక్కడికో లేచిపోయితివి.

చేటి— ఒడయురాలా! నాయపరాధము సహింపుము. ( కాళ్లమీఁదఁబడఁ బోవుచున్నది )

ధాత్రి— ( భ్రుకుటిభంగముతో ) రండకాన! పాముకాటు బట్టతోఁ దుడిచి వేయుచున్నావు!

చేటి— నీవెప్పుడు నిట్టి దుస్స్వభావము గలదానవే! కావుననే నేను నీకుఁ బరిచర్య చేయలేక యేడ్చుచున్నాను.

ధాత్రి— ( కోపముతోఁ దలకంపించుచు ) వక్రశీలురాలా! నీపండ్లు రాలఁగొట్టి ముక్కు చెవులు తెగఁగోసి కారాగారములోఁ బడవేయించెదను.

చేటి— తల్లీ! రక్షింపుము రక్షింపుము. నాయందేమియు నపరాధములేదు. మా పెద్దప్ప పనియున్నదని సముద్రతీరమునకు లాగికొనిపోయి త్వరగా రాక యాలస్యము చేసినది

ధాత్రి— (రోషహుంకారములతో) ఏమిపని ? ఏతాదృశమహోత్సవముచూడక యచ్చట రాళ్ళతోఁ దల పగులఁగొట్టుకొనుచున్నారా యేమి ?

చేటి— స్వామిని ! నాయాలస్యము సైఁపుము. నీవు చేయఁదగినపనులన్నియు నొక్కత్రుటిలోఁ గావించెద (మరల నమస్కరించుచున్నది)

ధాత్రి— (అనుగ్రహముతో) లెమ్ము లెమ్ము.

చేటి—(సంతోషముతో లేచి చేయూఁతయొసఁగి) పూజ్యురాలా! ఇటురమ్మిటురమ్ము.

ధాత్రి— (పరిక్రమించుచు ముందుఁగాంచి) వీరే మతాచార్యులు! కిరీటధారణోత్సవమున కింక నెంత తడవున్నదో కనుంగొని నీరాజనమొసఁగుటకుం దగిన యత్నము గావించుకొందము, రా. (నిష్క్రమింతురు)

(ఇది విష్కంభము)

---

(అంతట మతాచార్యుఁడు ప్రవేశించును)

మతా— (ప్రవేశించి) మంత్రులారా! ముహూర్తము సమీపించుచున్నది. రాజదంపతులను త్వరగాఁ దోడ్కొనిరండు. (విమర్శాశ్చర్యములతో) ఆహా! హూణకులాదృష్టరేఖ! విశ్వాతిశాయి యగునతిశయము వహించుచున్నది!

ఉ. ఆనతి యిచ్చె దివ్యపురుషాకృతి స్వప్నము నందు దైవ మెం
తేని ధరాపురంధ్రి తనయిచ్చ వరింపఁదలంచె వేడుక
న్మానవనాథులంద అధినాథుని జేయఁదలంచి వచ్చిరో
మానవులార! చూడవలె మాయెడవర్డుని పట్టబంధమున్.

(ఉల్లాసముతోఁ గొంచెము బిగ్గరగా)

ఉ. భూతము లిచ్చుఁగాత శుభము ల్విజ యంబిడుఁగాత దైవత
వ్రాతము లుచ్చకూటములఁ గ్రాలునుగాత నవగ్రహంబులు
స్మితకరార్కతారకలు చేయునుగాత శుభోచ్ఛ్రయం బిడుం
గాత ప్రవృద్ధపఙ్క్తి శుభశంఠరవంబున మంచిదీవనల్.

(వేగముగఁ బరిక్రమించుచు) అతఁడే యెడ్వర్డుభూపాలుఁడు! ధర్మపత్నీ సహితంబుగ నుత్సవాగారంబునకు విచ్చేసె.

ఉ. ఆర్యులతోడ నమ్రవసుధాధిపలోకముతోడుతన్ మతా
చార్యులతోడ బంధుజనసంఘముతోడను వందిమాగధా.

వార్యముఖోదయజ్జయరవంబులతో యువరాజు భార్యతో
నర్యమతేజుఁడై కొలువునందువసించె జయప్రదాకృతిన్.

కావున మేము నయ్యాస్థానికిం బోయి కర్తవ్యమాచరింతుము.

( నిష్క్రమించుచున్నాఁడు )

( పిదప యథానిర్దిష్టముగా రాజు ప్రవేశించుచున్నాఁడు )

మంత్రు— ( సవినయముగ నెదుటికివచ్చి ) దేవా! దక్షిణద్వారమున నీదేవాలయము లోనికిం దయచేయుఁడు. కులదేవతల మనోరథములు విలంబము సైఁపవు.

పురో— ఓకులామాత్యులార !

క. ఆలస్యమేలాకో శుభకాలము చనుదెంచునొక్క గడెలోపల దే
వాలయమునకు న్నృపభూపాలుని దోడ్కొని చనుండు త్వరపడవలయున్.

పరి— ముహూర్తము సమీపించినను మంత్రులేలాకో తడవుచేయుచున్నారు.

మంత్రు— దేవా! యవధారు! దేవాలయమునకుం జనుదెమ్ము.

దంప— ఇదిగో! వచ్చుచున్నాము. మేము చేయవలసిన పనియేదో సెలవిండు.

( యాలయములోనికిం బోవుదురు )

పురో— మహారాజ! కిరీటధారణోచితంబులగు నీవస్త్రంబులు ధరియించి యి
త్తపనీయవేదికపై నారోహింపుఁడు.

దంప— చిత్తము ( యాయరఁగుపైఁ గూర్చుండుచున్నారు )

రాజులు— ( లేచి చేతులెత్తి ) మహారాజ! జయము జయము!

పరిజనము— పూర్వాద్రితటము నధిష్ఠించిన ఛాయాసూర్యులవలె మేరుదరీభాగమందున్న శచీదేవేంద్రులరీతిఁ బక్షిరథమారోహించిన లక్ష్మీనారాయణుల వలెఁ గనకవేదిక నలంకరించిన మారాజదంపతులు కన్నులకుఁ బండువొనరించుచున్నారు.

మహా— ( తూర్పువంకకుఁదిరిగి ) రాజులారా! ఈరామోద్వర్ధనరపాలుఁడు నేఁడు మీకందఱకు నేలికయగుచున్నాఁడు. ఇది మీకంగీకారముగా కాదా! ( అని యడుగును )

దంప— లేచి తూర్పుదిక్కునకుఁ దిరిగి నమ్రులై నిలిచియుందురు )

రాజులు— ( ఆవంక వారందఱును లేచి చేతులెత్తి )

మ. అకలంకంబగు తావకీనభుజమధ్యంబెక్కి యీభూమి సౌ
ఖ్యకలం జెందుటకై సదా మనములం గాంక్షించుచున్నాము. ది
వ్యకృపాలోకనపాలితాఖిలజనప్రఖ్యాతచారిత్రుఁ ని
న్నిఁక మే మేలికగాఁదలంతుము నిజం బెడ్వర్డుభూపాలకా.

( అందఱును గరతాళములను వాయింతురు )

వైతాళికులు—మ. జనులారా! వినుఁడయ్య వీనుల సుఖశ్రావ్యంబు మామాట, యు
ర్వి నిఁకెడ్వర్డు మహీధవుండు కరుణస్విక్టోరియాదేవి యే
లినచందంబున నేలుచుం బ్రజలనోలిం బ్రోచు నీనాఁటనుం
డి సముద్భాసితశస్త్రమస్తగతకోటీరాంకుదీప్తాంఘ్రియై.

మంత్రి— ( పడమటి వంకకుఁ జూచి ) " రాజులారా? ఈయెడ్వర్డు... " (అను
వాక్యమును మరల ననుచున్నాఁడు)

దంప— ( పడమటివంకకుఁ దిరిగి నమ్రులై నిలిచియుందురు )

రాజు— (ఆవంక వారందఱు లేచి చేతులెత్తి)

మ. జలజాగారముఁ బోలఁగాఁ దగు నల్జాండ్రామహాదేవితోఁ
గులముప్పొంగఁ దనూజులం గోడుకులం గోడండ్రు సేవింప, బౌ
త్త్రులకుం బౌత్త్రులు గల్గుదాఁక లసదస్తోకప్రభావంబుతో
విలసేలంగలనీకు భృత్యులము మే మెడ్వర్డుభూపాలకా.

వైతాళికులు— ( లేచి చేతులెత్తి )

సీ. నీశాసనంబు లత్యాశతో సామంతధరణీశవర్గ మూదలధరింప
నీకీర్తికాంతాలోకనాంచలము లోకాలోకశిఖరంబు లాశ్రయించ
నీవిశిష్టక్షాధరణీసాధులు దిగంతరస్థపర్వతకందరములఁదూఱ
నీశాసనంబులను .... లోకాలగోపాల మఖిలలోకప్రజలాదరింపఁ

తే. గీ. బూర్వరాజక్రమాగతాపూర్వహీర
కోటిశాలింగిరీట మొయ్యనధరించి
[illegible]
భూమిపాలింపు మెడ్వర్డుభూమిపాల!

మతా—(దక్షిణదిశకుఁ జూచి) రాజులారా! (ఈవిద్వద్ర...అనువాక్యమును మరల ననుచున్నాఁడు)

దంప—(దక్షిణదిశకుం దిరుగుదురు)

రాజు—(ఆవంక వారు లేచి చేతులెత్తి)

క. మాకేమగడవుగ, మ్మంగీకారముగలిగె నూకుఁ గీర్తి...లదా
శాకాంతా! యెద్వద్ధమహీకాంతా! గురుపమాసహితసుస్వాంతా!

వైతా—( చేతులెత్తి )

మ. తలలాడించుచు సర్వరాజు నిజకాంతా గానమాలించు, భా
ర్యలతోఁ గూడి దిశాగజంబులును వప్రక్రీడ గావించు, నా
థునికి న్వక్షముఁజూపుఁ గూర్మపతి యాటోపంబుతో నీబుజం
బిలుగా భూలతితాంగియుండుతటి నోయెద్వర్ధభూపాలకా!

మతా—( ఉత్తరదిశకుఁ దిరిగి ) "రాజులారా! ఈయెద్వర్ధ..." (అని మరల ననుచున్నాఁడు)

దంప—(ఉత్తరదిశకుఁ దిరుగుచున్నారు)

రాజు—(ఆదిశవారందఱు చేతులెత్తి)

క. వెనుకటి రాజన్యులు నీ జననియుఁ బాలించినట్టి క్ష్మాతలమునకీ
వును రాజవు గమ్మెద్వర్ధనృపాలా! నిజభుజాధరోశిప్రశీలా.

వైతా—( చేతులెత్తి )

తే. గీ. కులగిరులమించి దిగ్గజకులముమీఱి
పాఁపరాయుని దాఁటి పీఁపుదాఁటి
ప్రబలు నీబాహువుల సుఖనసతి గాంచుఁ
బుడమి నిజముగ నెద్వర్ధభూతలేంద్ర!

పురో—దంపతులారా! ఈదేవునిపీఠము దగ్గఱకుఁ బోయి సాష్టాంగదండప్రణామ మాచరించి యీజకీచీరలును సువర్ణఖండములు నందుంచి దక్షిణభాగము నం గూర్చుండుఁడు

దంప—( పురోహితులు చెప్పినట్లు చేయుచున్నారు )

మంత్రు—ఓమతాచార్యులార! ఈదుస్తులన్నియుఁ బుచ్చుకొని యాపీఠమునం దుంపుఁడు.

మతా— మంచిది ( యట్లు చేయుచున్నారు )

మంత్రు— ముఖ్యాచార్యా! కిరీటధారణమహోత్సవకాలము సమీపించినది కావునఁ దమరీదుస్తులు ధరియించి యుచితాసనమునఁ గూర్చుండుఁడు.

ముఖ్యా— ( ధరించి పీఠమునకుత్తరభాగమునం గూర్చుండును )

పురో— ( సభవంకకుఁ దిరిగి ) ఆర్యులార !

తే. గీ. వరుస నాంగ్లేయరాజులందఱు ధరించి
రే కిరీటము దాని నీయెడల మనము
చేరి యెడ్వర్డుభూపాలు శిరమునందుఁ
దొడుగుచున్నాము పట్టభద్రుండటంచు.

అందఱు— జయము జయము, ప్రియము ప్రియము !

ముఖ్యా—మహారాజ! నీవీపీఠమునకుం దాపున మోకరించి కూర్చుండి యీసత్యవేదముం జేతధరియింపుము.

రాజు— ( అట్లు చేయుచున్నాఁడు )

ముఖ్యా— ( పత్రిక చేతఁబట్టుకొని ) మహారాజ !

" క. ఏలుదు ధర్మము దప్పక నేల, ననత్యంబువలుక, నిఖిల ప్రజలం
బాలింతుఁ గుమారులగతి, నాలించెద మంత్రివరుల యాలోచనముల్."

అని యీపత్రికను యుష్మన్నామాక్షరముద్రాంకితముగావించెదవా ? (యిచ్చుచున్నాఁడు)

రాజు— ( పుచ్చుకొని ) ముఖ్యాచార్యుల యానతికి బద్ధుఁడనగుచున్నాను ( 'ఏలుదు' నను పద్యముచదివి ఎదుటఁజూచి ) ఈశ్వరా! నీవును నాయుద్దేశమునకుఁ దోడగుచుండుము ( సత్యవేదము కన్నుల నద్దికొని పత్రికపై వ్రాలు చేయుచున్నాఁడు)

జనులందఱు— ( మంగళఘోషణమాచరింతురు )

ముఖ్యా— దంపతులార ! ఆంగ్లేయరాజన్యకరిమాధిష్ఠియమానంబగు నీభద్రపీఠముల నధిరోహింపుఁడు.

దంప— ( అట్లు చేయుచున్నారు )

మంత్రి— పురోహితులారా ! ఇదిగో! అభిషేకతైలము. ఇదిగో! గృధ్రితుండము. ఇదిగో! బంగరుగరిటె ! ఇదిగో! ఖడ్గము. ఇదె కిరీటమును, ( అందించుచున్నారు)

పురో— (గ్రహించి దేవునియెదుట పీఠమునం బడిలపఱచి) ముఖ్యాచార్య! ఇది యభిషేకతైలము (అని యిచ్చుచున్నాఁడు)

ముఖ్యా— (పుచ్చుకొని యభిమంత్రించి రాబందుముక్కుతో గరిటెలోనికిందిసి యాతైలమును దంపతులపై నభిషేకముచేసి)

తే. గీ. అతులితైశ్వర్యమస్తు రాజ్యాభివృద్ధి
రస్తు ధనధాన్యబలచతురంగవృద్ధి
రస్తు నీతల్లి యేలినయన్నినాళ్లుఁ
బుడమి పాలింపు మెడ్వర్డుభూమిపాల.

(అని దీవించును)

మంత్రి— ముఖ్యాచార్య! ఇదిగో ఉంగరము. (చేతికందిచ్చును)

ముఖ్యా— (గ్రహించి) మహారాజ! యీముద్రిక నీవ్రేల ధరింపుము (అని చేతికిచ్చును)

రాజ— ప్రసాదము (ధరించును)

ముఖ్యా— మహారాజ! 'దైవాదేశమున నీఖడ్గము నేను ధరించుచున్నా' నని యీఖడ్గము చేతఁబట్టుకొమ్ము (యిచ్చును)

రాజు— (అట్లు చేయుచున్నాఁడు)

ముఖ్యా— మహారాజ! ఇదిగో! రాజదండము.

క. దండింపఁ దగనివారల దండించిన, దండ్యజనుల దండింపమి నీ
రెండింటఁ బాతకంబులు మెండగు నిదియెఱిఁగి యెపుడు మెలపుము ప్రజలన్.

(చేతికిచ్చి దేవునియెదుటనున్న కిరీటములు చేతంబట్టుకొని లేచి సభ్యుల వంకఁజూచి)

మ. కనుఁగొండో నరనాథులార సుచిరఖ్యాతంబు విక్టోరియా
జననీమూర్ధచిరప్రతిష్ఠితము విశ్వప్రష్ఠమాణిక్యకు
ట్టనవిభ్రాజితమైన యీమణికిరీటం బౌదలం దాల్చుది
గ్వనితాకీర్తితకీర్తిశాలి మనయెడ్వర్డక్షమాపాలుఁడున్.

(దంపతుల శిరములనుంచి)

మ. జనులంగాసిలనీక బందుగులవిశ్వాసంబువోనీక దు
ర్జనులం జేరఁగనీక శత్రువుల నుచ్చంబొందఁగానీక బు

ద్ధిని బల్మ్రోవలఁ ద్రిప్పఁబోక తగురీతి నీవ్రపురాపాలకా
వనినాథుల్బలె రాజ్యమేలు మిఁక నెడ్వర్డ్భూపాలకా!

అంద-- ( జయశబ్దము నుచ్చరింతురు )

రాజులు— ఉ. ఎంపఱుపూర్వులీధరణి నేలిరి వారలలోన నేరికీ
చండముగాఁగ రాజ్యము లొసంగిరి తల్లులు రాజమండలీ
వందిత యామె పోలిక ననారత ధారుణియేలుమయ్య' మే
మందఱము స్వభక్తిమతియందలి యంశము సన్నుతింపఁగన్.

నైతా— ( చేతులెత్తి )

సీ. జయలక్ష్మియన నల్జ్రాండ్రామహాదేవి యనిశంబు తోడునీడై భజింప
భూభారమునకు నీపుత్రకుం డగుజార్జియాంగ్లరాజ్యమ్ము సాహాయ్యమొసఁగఁ
దండ్రియందుం బోలెఁ దావకీనోద్యోగు లందఱు నీదు శ్రేయస్సుగోర
న్యాయమార్గంబీవు నలుసంత దప్పకుండఁగ మంత్రులాలోచనంబు సెప్ప

తే. గీ. ధరణిపాలింపుమయ్య! సోదరులు నెయ్య
మునఁ బ్రవర్తింప నీప్రజ ముదము నెంప
శ్రీకరోదార! విక్టోరియాకుమార!
ధర్మనిస్తంద్ర! యెడ్వర్డుతారకేంద్ర!

కవీంద్రులు— మ. కడగంటంగననీదు నీకనులలోఁ గాపున్న యాలక్ష్మి, పేర్మి
ముడిమాటాడఁగనీదు శారదయు నీమోమందగాపుండి, పో
రెడు నేరీతిగవారితో సవతిపోర్లేకుండఁ బాలింతువో
పుడమిం గీర్తిపడంతినీవు సుఖసంపోష్యంబుగా భూవరా!

వృద్ధులు—క. ఏడవపదియేండ్లంగల వాఁడవు, నీరాజ్యలక్ష్మి పడుచుది, యేయే
జాడలఁ గరఁగింతువొ నూఱేఁడులకుం గోరుచుంటిమిదియె కుమారా!

మంత్రు— ( వినయముతో నెదుటికివచ్చి ) దేవా! నీవు రాజసగుటచే సంతసించు నృపాలురందఱును నిండోలగంబున సింహాసనం బధిష్ఠించియున్న మీవిభవంబుఁ జూడఁదలఁచుచున్నారు.

పురో— మహారాజులందఱును బట్టాభిషేకానంతరమున నిట్టిసభం గావించుట యాచారమే.

ముఖ్యా— భరతఖండమునకుఁ గూడఁ బట్టాభిషేకముగావించిన పిదప డిల్లీనగరమున నిట్టిపేరోలగము గావించిన బాగుండును.

రాజు— మంచిది! రాజప్రతినిధి కీయుదంతము దెల్పి సర్వమాయత్తపఱపింపుఁడు.

మంత్రు— చిత్తము. ( నిష్క్రమింతురు )

ముఖ్యా— మహారాజదంపతులు రాజకులంబునకుఁ బోయి బడలిక యపనయించుకొందురుగాక.

( అందఱును మంగళారాత్రికలిప్పించి జయధ్వనులతో నిష్క్రమింతురు )

* గద్య *

ఇది... శ్రీతిరుపతి వేంకటేశ్వరప్రణీతంబగు సెడ్వర్డు పట్టాభిషేకనాటకమందుఁ గిరీటధారణోత్సవమను పంచమాంకము.

---

శ్రీరస్తు

# ఎడ్వర్డుపట్టాభిషేకనాటకము

## షష్ఠాంకము



(పిదప రాజానకుఁడు ప్రవేశించుచున్నాఁడు)

రాజా— (సంభ్రమాశ్చర్యములతో)

చ. విడిసిరి ప్రోలునిండఁ బృథివీపతులందఱు ముందువచ్చి వా
రొడయుని కక్కటా! విడిదికొక్కకుటీరముగాని చిక్కలే
దుడుగర యెంతయిచ్చినను నొక్కపటీగృహమైనఁ జాలుగం
చెడపకఁ దంతివార్తఁ బిడునేలి కేమని విన్నవింతునో.

(ఆలోచించి) కానీ, యన్నవిక్రయసంఘమువారైనఁ దగిన సుఖవసతి చేయఁగల రేమొ. (ముందుఁగాంచి) వీఁడె చతురోపాధ్యాయుఁడు వచ్చుచున్నాఁడు. (సమీపమునకుంబోయి) అయ్యా! మీయోజించినచో నెక్కడనైన మారాజునకు సుఖవసతి దొరకునా?

చతు— (చేతనున్న తంత్రీలేఖలన్ని చూపి) ఇవె! నామిత్రులనేకులు బసలకై పంపిరి వానికొఱకే నేనును బరిభ్రమించుచున్నాను.

క. ఒకచిన్నిగదియుఁ బడుకకు నొకశయ్యయు నొసఁగి తత్తదుచితం బన్నా
దిక మిడుట కొకదినంబున కకటా! వందలకొలంది యగునఁట ధనముల్.

చ. కనుమ తిలాంశమైన విడిగాఁగన రాదు పురోపభూమినె
ల్లను నగరిం బటీగృహముల న్రచియించిరి వానిసందుసం
దున దొరలెల్ల నిండి వసతుల్గొని; రిప్పుడు రాజరాజు వ
చ్చిన వసియింపఁగా గృహము చేకుఱు దింత నిజంబు మిత్రమా.

ఇంక నన్నవిక్రాయికసంఘాగారములందు విచారింతుమేని—

ఉ. పందకు రెండువందలకు వచ్చినవారికి విందుసేయఁగా
ముందె సమస్తవస్తువులు ముంగిళుల న్నెలకొల్పుకొన్న యీ

యందఱు భక్తవిక్రియసమాజమువారలయిండ్ల కప్పుడే
వందలవంద యొక్కపగవచ్చి రిఁకేమియొనర్పఁగాఁదగున్.

రాజా — ఔను, వారుమాత్రమేమిచేయఁ గలరు!

సీ. పదియాఱువన్నెపసాంబట్టుతో సరితూఁచి యిన్మన్నఁ గలవయ్యె నింధనములు
ఫాదుషాకైనఁ గావలయుఁ దెమ్మన్నచో దొరకకపోయె గోదుమలపిండి
యితరదేశమునుండి యెంతెంతవచ్చిన నిలువకురాదయ్యె నీతిచుక్క
సమయంబువేచి వేసరక తెప్పించుకొన్నను బాలుపెరుఁగును నాస్తియయ్యె

తే. గీ. ఏపదార్థములాటు డిల్లీపురమున!
నొక్కరా, యిద్దఱా! ప్రజయొక్కకోటి
యైనవచ్చిరి లెక్కింప, నందఱందు
రాజరాజులెకాని నీరసులు లేరు.

చతు — ఇట్లు సమస్తపదార్థములు ప్రియమని యెఱింగియే యింకను సామాన్యభూస్వా
ము లనేకులు రామానిరి.

రాజా — తండోపతండములుగా సమస్తదేశపదార్థములును ధూమశకటీముఖంబున
వచ్చి పసుకాలమునందె యిట్లుండెఁ గదా! తొల్లిధర్మరాజాదుల పట్టాభిషేక
మహోత్సవము లెట్లు జరగెనో!

చతు — ఆకాలమునం దిందఱురాక రాజాధిరాజులు మాత్రమే వచ్చుచుండిరి —

తే. గీ. బలిమిగలయేనుఁగులమీఁద బండ్లమీఁద
నుష్ట్రములమీఁదఁ దెప్పించుచుండిరపుడు
ఒక్కదేశమునుండి యింకొక్కదేశ
మునకుఁ దేఁగలుగుపదార్థములు నిజంబు.

రాజా — ఔను. అందులకై సపరివారముగ వలయువస్తుసామగ్రి యంతయు నిప్పు
డును నేనుఁగులమీఁద నే ముందుఁగాఁ బంపించిన నైజాముఫాదుశాహియే
దృష్టాంతము.

చతు — కాని యొక్క విశేషముమాత్రము కలదు.

క. నెలలకు రాఁగలయది దినములకే రాఁగలిగె ధనము మునుపటికంటెన్
బలిసె నృపజలకు నాంగ్లేయులరాజ్యమువలన భారతోర్వర నెందున్.

రాజా — నిజభుజాపరిపాల్యంబగు నీభరతఖండమునందలి పట్టాభిషేకోత్సవమునకుం
జక్రవర్తియేలరాకుండెనో!

చతు—మనకీపుణ్యమొక్కటియే తక్కువ.

రాజా—యువరాజైన వచ్చునా ?

చతు—వారువచ్చుటకే మొదటఁ గొన్నిప్రయత్నములు జరిగెంగాని మరల నేకతమ ననో మానిరి. చక్రవర్తిగారి తమ్ముఁడును దమ్ముని భార్యయు మంత్రికొంద అుద్యోగులును మాత్రము వచ్చిరి.

రాజా—ఇప్పుడు చక్రవర్తిమర్యాద లన్నియుఁ గర్జనుప్రభునకు జరిగవలసిన వేనా ?

చతు—ఔను, రాజప్రతినిధిగదా యతఁడు.

రాజా—(సంతోషముతో)

చ. ప్రతినిధులౌచు హిందువుల రాజ్యము నేలినవార లెందఱు
న్నతిగని, రిట్టి గౌరవమునం దులలేని యశంబుఁ జెందిరే !
క్షితిపతులంద టిప్పగిదిఁ జేరిభజించిరె కొల్వులోన! న
ద్భుతమగు కర్జనుప్రభువుపున్నెముఁ బోలిన పున్నెమున్నదే !

చతు—ఔను, ఇతఁడు రాజప్రతినిధి యగుకాలమున నె యిట్టి మహోత్సవము వచ్చుటకుఁ బుణ్యమే ప్రథమకారణము. నిన్నటిదినమున నమ్మహాత్ముని పురప్రవేశమహోత్సవము చూడలేదా ! అపరదేవేంద్రునివలెఁ బ్రకాశించెను.

రాజా—ఔనఁట, నేను మారాజుగారికిఁ దగిన బసకై పరిశ్రమించుచుంటిని. ఛీ ! సేవకులజన్మమెంతయుఁ బరాధీనమె నాకట్టిమహోత్సవము చూచుభాగ్యము లేకపోయెను, సరికదా, బసదొరకమిచే మాయొడయునికిఁ గూడ లేక పోయెను.

చతు—యోగ్యులగు సేవకులకు రాజకార్యములకంటె నితరకార్యము లెక్కుడు గావు.

రాజా—ఆర్య ! దయయుంచి యాయుత్సవమురీతి సంక్షేపముగా సెలవిండు.

చతు—నేనా చెప్పువాఁడను! అదివర్ణించుటకు మహాకవీంద్రులుం జాలరు. సమస్త రాజాధిరాజులు ధూమశకటావరోహణస్థానంబునకుం బోయి సుప్రభాతంబులు సల్పినపిదప రాజప్రతినిధిసమాగమసూచకంబు లగు నూఱ్ఱొక్క ఫిరంగులు పేల్చిరి. తరువాత—

చ. తెలిమహతాబుక్రొంజిగులఁ దెల్లముగా వెలియేన్గుభాతిఁ గ
న్నులకు ముదంబుగొల్పుచు మనోహరభూషణభూషితాంగమై

యలరు నిభంబు నెక్కి యమరాధిపుఁడో యన సోయగంబుతోఁ
గలకలలాడుచుం దనరెఁ గర్జనుభూపతి ముందు భార్యతోన్.

ఆకర్జనుప్రభునిదంతావళేంద్రమునకు వెనుక —

చ. కనకనగంబుతో నెనయు గంధగజేంద్రముమీఁద నెక్కి వ
చ్చెను గులకాంతతోడ ఋతశీలసమేతుఁ, డుదారమూర్తి, రా
జనిభుఁడు, చక్రవర్తి కనుజన్ముఁడు, మాన్యుఁడు, భ్రాతృభక్తికిం
గనియగువాఁడు దొల్లి మనఖండమెఱిఁగినవాఁ డుచగుప్తుఁడై.

ఆగజేంద్రమునకు వెనుక రెండుచాలులుగా మొదటఁ దక్కనాధీశ్వరుండును వాని కభిముఖంబుగ బరోడామహారాజును వారివెనుక మహీశూరానంతశయన ప్రభువులును వారికి వెనుక నొక్కచాలుగఁ గాశ్మీరేంద్రప్రముఖసామంత నరేంద్రులందఱు నధిష్ఠించినత్రిశతకరివరంబులు బలిసికొలువఁ గర్జనుప్రభుండు

ఉ. ముప్పదియేడువేలబలముం బదివేలతురంగమంబులుం
దప్పనిపద్ధతిం బలువితంబుల బారులుదీర్చి వెంటరా
నొప్పుగ నూరుఁజేరిన మహోత్సవమెన్నఁ దరంబె యేరికే!
నప్పుడు చూడఁగావలయునయ్య! యిఁకంబలుమాటలేటికిన్.

సీ. దీనాననంబుతో దేవనాథునివంక లోఁతుగాఁ జూచెఁ బులోమతనయ
యమరేంద్రునొద్ద నృత్యము చేయురంభయు నిలువుననీరయి నిలిచిపోయె
భూలోకమున కేనుపోయివచ్చెదనంచు సెలవుగోరెను లక్ష్మి జలజనయను
అశ్వనీనక్షత్రమతిభీతిచేతఁ గుటుంబవైరంబు చేటునకుఁ దలఁకె

తే.గీ. నలజయంతుని యక్షరాజాత్మజాతు
సాంగమదనాశ్వినేయుల సౌరుగాంచి
ప్రతినిధిపదంబునం జక్రవర్తిపగిదిఁ
గర్జనుప్రభు పూరేగుకాలమందు.

(తెరలో)-రాజులారా! నిండుపేరోలగంబునకు రాజప్రతినిధి చక్రవర్తియనుజన్ము నితోఁ గూడ దయచేయుసమయమైనది. ఇంకను రావలసినవారున్నయెడల రండు. ఇప్పటికిఁ బదునాలుగువేలమంది యుచితాసనంబులం గూర్చుండి యుండిరి.

చతు — ఆర్య! నీతో మాటలాడుచుండుటచేఁ వడవైనది, నేఁబోయివచ్చెద.

( ఇరువురు నిష్క్రమించుచున్నారు. )

(అంతట యథానిర్దిష్టుఁడగు కర్జనుప్రభువును జక్రినర్తిభార్తయు సభాసదులును ప్రవేశించుచున్నారు.)

వైతా—(సంతోషముతోఁ దనలో)

మ. బల ముత్సాహము పెంపు తెంపు ధనము న్భాగ్యంబు సౌభాగ్య మె
ల్లల నెల్ల న్విదచల్లి హిందువుల నేలం ప్రోచె విక్టోరియా
లలనారత్నము; తత్తనూజునకుఁ దల్లాఘంబు నేకూర్పఁ గొ
ల్లలుగా వచ్చిరి రాజు లెల్ల భృతలీలావల్లికిం ఫల్లికిన్.
(చేతు లెత్తి ప్రకాశముగ బిగ్గరగా)

శా. ఏవారుం గనఁజాల రేసుదినమం దీపాటి నేత్రోత్సవం
బావారంబున నప్పుడే గడచెఁబో యామద్వయం బాదర
శ్రీవిశ్వాసము లాత్మచిత్తములఁ బ్రేరేపింప నేతెంచిరో
దేవా! కర్జనుభూప! యందఱుధరిత్రీనాథు లాస్థానికిన్.

కార్యనిర్వాహకుఁడు—

క. మన కెడ్వర్డునృపాలుఁడు పనిచినవాక్యములఁ దనయుపన్యాసముఁ గ
ర్జనువిభుఁడు నుడువుఁ గావున వినుఁడవధానమున నృపులు వీనులలరఁగన్.

కర్జ—(లేచి నలుదెసలుం బరికించి బిగ్గరగా)
నాప్రియస్నేహితులగు హిందూమహారాజులారా! ప్రజలార!

సీ. మనల నేలినతల్లి మహనీయ స్మరణీయయై పోయె విక్టోరియామతల్లి
ప్రజల మేలుంగోరుఁ బలుమాఱు చింతించు లోకాంబ చనె దేవలోకమునకుఁ
బలు దేశములభూమిపతు లౌదలల మోయు నారీశిరోమణి జాతిపోయె
జనులకోర్కులు కొనసాగించు దేవతాకుజవల్లి జీర్ణమై కూలిపోయెఁ

తే. గీ. ప్రజలఁ దనయంతవానిఁ బుత్రకుని సదయుఁ
బెద్దవానిని రాజుగావింపఁ జేసి
వెడలె నేకాధికేశోనవింశమితశ
రన్ముఖంబున దేవతారాజ్యమేల.

తరువాత నిప్పటికైదుమాసములవెనుక నింగ్లాడుదేశప్రభువును భరతఖండ
చక్రవర్తియునగు సప్తమైడ్వర్డునృపాలునకు యథావిధిఁ గిరీటధారణ

మహోత్సవముజరగి, రాజదండము హస్తమున కలంకరించినప్పు డయ్యుత్సవము జూచుభాగ్యంబు హిందూదేశనరపాలురయందుఁ గొందఱికిమాత్రమె తటస్థించుటంజేసి—

సీ. పాండుపుత్రాగ్రేసరుండు మున్నేచోట రాజసూయముచేసి తేజుగాంచెఁ
బ్రథితతేజఃకీర్తి పృథివిరాజేచోటఁ జక్రవర్తిపదంబు సంతరించెఁ
దరువాతయవనుఁ డగ్బరుశాహి యేచోట సమ్రాట్పదవినంది సంతసించె
మఱియును నింకెందఱో మహనీయులేచోటఁ బట్టాభిషేకసంపదలు గొనిరి

తే.గీ. నేఁటి కిరువదియాఱవయేఁట మొదటి
చక్రవర్తినియను పేరెచటవహించె
భారతీదేవివంటి విక్టోరియాంబ
లీలఁదనరారు నిట్టి డిల్లీపురమున.

హిందూరాజ్యసింహాసనంబు నిలుపుచున్న స్తంభములవలెనున్న హిందూరాజాధిరాజుల నందఱిం బిలిపించి నిండోలగంబున మదీయపట్టాభిషేకమహోత్సవంబుఁ జాటించుమని శ్రీమదెడ్వర్డుసార్వభౌముండు నాకాజ్ఞాపించుటంజేసి నేనును మిమ్మెల్లం బిలువనంపితి—

తే.గీ. ప్రభువునెడఁగల్గు భక్తివిశ్వాసములను
జూపుటకు నేఁడె సమయమంచును దలంచి
దూరమని యెంచఁ దలఁపక మీరు వచ్చి
నందులకు నేను మిగుల నానందపడితి.

క. తనతమ్మునిఁ బ్రతినిధిగా మనయెడకంపించె నిటుఁ దమకుఁగల మోహం
బును దెలుపుటకై యెడ్వర్డునృపాలకసార్వభౌముఁడుం దయతోడన్.

ఆ. వె. ఆఱుకోట్ల ప్రజలనరయుచుఁ బాలించు
కొనుచునున్న నూఱుగురస్వతంత్ర
ప్రభువు లిచటి కిపుడు వచ్చుటఁగన్గొన
రాజునెడల భక్తిరసమకాదె.

చ. ఇరువదిమూఁడుకోట్ల ప్రజ యేర్పడిసౌఖ్యము పెంపుఁజెంద భా
స్వరవిభవంబు విద్యయును సర్వసమృద్ధముగాఁగ నాల్గుసా
గరములు హద్దుగా భరతఖండమునం గల యైకమత్యమీ
వరుసఁగనున్న యీజనసభాసదులందఱిరాక తెల్పెడున్.

తే. గీ. మూఁడునిరువదిలక్షల మూలబలము
నందుఁగల్గినయధిపతులందఱిటకు
వచ్చియుండిరి వీరిదోర్బలసమృద్ధి
కావె మాకిట్టి వృద్ధికిఁగారణంబు.

ప్రైత — తే. గీ. జయము జయము! విక్టోరియాచక్రవర్తి
నీతనూభవుఁ డెడ్వర్డునృపతిమణికి,
జయ మలగ్జాండ్రి, కిచటిప్రజలకు జయము!
జయము! కర్జనురాజ్ఞానుజన్ములకును.

కార్యనిర్వాహకుఁడు—

క. మనయేలిక మనతెయ్యఁడు మనకుంగలతోడునీడ మానని చేర్మి
న్మనయెడకంపినవార్త ను వినుఁడయ్య నరేంద్రులింక వీనులలరఁగన్.

కర్జ—ఓ హిందూదేశవాసులారా! మదీయముఖంబున సప్తమెడ్వర్డుచక్రవర్తి
మీకందఱకు సంతోషావహముగ నీవార్త వినుపించుచున్నాఁడు:—

"నాప్రజలు ఢిల్లీపురంబున మామకపట్టాభిషేకమహోత్సవము జరగించు
చున్నపుడు వారికీవార్తను బంపుట నాకువేడుకగా నేయున్నది. లండను
రాజధానియందు జరగిన మదీయకిరీటధారణోత్సవమునకు భరతఖండమునం
దలి రాజులలోఁ గొందఱే వచ్చిరి. తక్కిన స్వతంత్రాధిపతులును బ్రజ
లును నుద్యోగులును జూడఁదగునట్టిది ఢిల్లీపురంబునఁగొల్వుకూటంబుగావించి
యావేడుక యనుభవింపఁ జేయుమని మత్ప్రతినిధియగు కర్జనుప్రభుని నియో
గించితిని. పంచసప్తత్యధికాష్టాదశశతమితంబగు హాయనశకాబ్దంబున
నేను భరతవర్షమంతయుఁ గాంచితి. అందలి ప్రజకు నాపైఁగల భక్తి
విశ్వాసము లరసితి. మాసింహాసనముపైఁగల విధేయతయుఁ దెల్లముగా నెఱిఁ
గితి. ఇదియునుంగాక కడచినయేఁట హిందువులకు నాయందుఁగల యను
రాగమును దేటపఱచు నిదర్శనము లనేకములు నాకుఁ జూపట్టినవి. మేము
విజయముచెందిన దేశములలో హిందూసేనయే యెన్నఁదగిన సాహాయ్యము
చేసినది. మా యువరాజును నతనిభార్యయును నింతటిభక్తివిశ్వాసములు
గల మీదేశమును జూడఁగోరియుండిరి. కావునఁ బంపింతును. నాకట్టి
యదృష్టము లేకపోయినదిగాని మీరుచేసిన యిమ్మహోత్సవమున నేనే
ఢిల్లీపురమునకు రావలసినది. ఐనను రాజకులప్రతినిధిగా ప్రియసోదరుఁ
డగు డ్యూకాఫ్ కానాట్టును భార్యతోఁ గూడ వంపితిని. హిందూదేశప్ర

థము చక్రవర్తినియగు మాతల్లి దయతో న్యాయ్యముగా నేయే విధులఁ బ్రజలయు రాజులయు గౌరవప్రేమలను సంపాదించెనో యాసింహాసనము నధిష్ఠించినది మొదలు నాకు వచ్చిగిది నే పరిపాలించుటయుఁ బ్రవర్తించుటయు ముఖ్యాభిప్రాయమై యున్నది. మఱియు నాసామంతస్వతంత్రహిందూరాజులయుఁ బ్రజలయు స్వాతంత్ర్యమును గాపాడుటకును మర్యాదయు గౌరవమును నిల్పుటకును నామొదటితలంపు. ఇదియే నాపరిపాలనావిషయ మని ప్రకటించితిని. ఇట్టిసత్పాలనముపలన భగవంతుఁడు హిందూదేశమున కితోధికప్రజాసౌఖ్యముం గలుగఁ జేయుఁగావుత.

(జయము జయము అని యందఱును గరతాళములు వాయింతురు)

కర్జ—ఇవియే మనచక్రవర్తిగారు మనకంపిన వాక్యములు. (కూర్చుండును)

ప్రథమవైతా—

సీ. సూర్యచంద్రులకైన మన కున్నయోగ్గ నీకెండాపు దూరమైయుండుఁగాత
ధ్రువమండలంబైనఁ దుదిఁజెందుక్రీడు నీమండలంబు వహింపకుండుఁగాత
పసివాడులేక సర్వద్వీపములయందు నీజయస్తంభము ల్నిలుచుఁగాత
నేలయున్నందాఁక నీవంశమునయంద నీరాజదండంబు నెగడుఁగాత

తే.గీ. నీజననిఁబోలె నీవును నిన్నుఁబోలె
క్షితిని నీరాజులెల్ల రక్షింతురుగాత!
పొసఁగ నిన్నేసుదైవంబు పోచుఁగాత !
సప్తమైడ్వర్డుభూపాలచక్రవర్తి!

రెండవవైతా—

సీ. హిందూజనము వృద్ధిఁజెందునేలీల నాలీలగా భూమి పాలింపుమయ్య
ధర్మసంఘమువారు తరిచినవిషయ మలీకంబు చేయకాలింపుమయ్య
దేశకాలంబులస్థితిచూడ కాత్మకే యింపైనపనులు చాలింపుమయ్య
నీలెంక లెవ్వరేని మ దుష్టులైన గాలించి యవ్వలకుఁ దోలింపుమయ్య

తే. గీ. తల్లివలెఁ బ్రోచుచుంట నాతలఁపటంచు
నభయమిచ్చిన నీతోడ నట్టిటంచుఁ
జదువు చదువుట చర్వితచర్వణంబు
సాధునుతకీర్తి ! యెడ్వర్డుచక్రవర్తి!

ప్రథమవైతా—

సీ. శాసించె రామరాజ్యముగాఁగ నీతల్లి నీనాఁడు నామాట నిల్పుకొమ్మ
పాలించె వారిభావముదోఁప మీయమ్మ మఱవరాదది నీతరమునందుఁ
బ్రోచెఁ గాంతయశంబు సొంపార మీయమ్మ గణియింపుమదియు నీకాలమందుఁ
బోషించెఁ గల్గిన పుణ్యాలు దోఁప మీమాత స్మరియింపుమదియు నీసమయమందుఁ
తే. గీ. బ్రజలకుం బోలె నీయేలుబడికిఁ గూడ
మహితఘంటాపథంబు లమర్చియుంచె
నీజనని ; నీవు నాత్రోవనే నడుపుము
రమ్యగుణసాంద్ర ! యెడ్వర్డు రాజచంద్ర!

రెండవవైతాళికుఁడు—

సీ. ప్రజలఁ బ్రోవుట యనుపవిత్రమైననీత్రోవ ననువాద మనుఁ బ్రోవుమాయటన్న
వసుధకంతకుఁ జక్రవర్తిని నా నీతోడఁ బౌనరుక్త్యంబు నీవారమునుట
తల్లివోలె జగంబుఁ దనియించు నీతోన రుక్త్యంబు పుత్రతుల్యులమటన్నఁ
గనికరంబున లోకమును బ్రోచు నీతోడ సిద్ధసాధనము నీచిత్తమనిన
తే. గీ. కలుములన్నియుఁ గొల్లగాఁ గలుగునీకు
అస్తనుచుఁ జేతు లెత్తుట యనవసరము
శ్రీకరోదార! విక్టోరియాకుమార !
శత్రుజనభీమ! యెడ్వర్డుసార్వభౌమ !

కార్య—( సంతోషముతో ) మహారాజులారా ! నేఁటికి మనము చేయవలసినపని ముగిసినది. కర్జనుప్రభువును స్వామికార్యము నిర్వహించె. జనులందఱుఁ గృతార్థులైరి.

క. వరుఁడెడ్వర్డున్నృపాలుఁడు తరుణీమణిపుడమి వీరి తగులము హిందూ
నరపతులకు జనులకు సుఖకరముగ సమకూర్చె ఘటనకారుఁడు బళిరే.

విద్వాంసులు—( వినయముతోలేచి ) సర్వాశీఃఫలములు గలమహారాజుల క్షేమని యాశీర్వదింతుము !

శ్లో. ఇతోప్యధికసంపత్తి, రితోప్యధికసంతతిః
ఇతోప్యధికకీర్తిరస్తు, భూయాదెడ్వర్డుభూపతే !

ఆంధ్రకవులు—( వినయముతోలేచి ) మహారాజ ! త్రిలింగదేశాధీశ్వర !

సీ. భయములేదని యొక్కపల్కు పల్కినఁ జాలుఁ బాకారిసిరి తృణప్రాయమనఁగ
నతిభక్తిగలరంచు నాదరించినఁజాలు ధనదునిసిరి యదెంతటిదనంగ
మావారలని పేర్మిఁ జేసఁజూపినఁ జాలు పశుపతిసిరి గడ్డిపరక యనఁగ
మనసుదీఱఁగ నొక్కమాఱు చూచినఁజాలు కురురాజుసిరి గోటికొనకనంగ

తే. గీ. ననుచు జనులెంచు నుతికి యోగ్యునిఁగ నాంధ్ర
దేశమున కెప్పుడు త్రిలింగదేశమనుచు
గణనదెచ్చిన త్రిశివలింగము లొనర్చు
విశ్వజనమిత్ర ! హైందవోర్వీశశత్రు !

సంస్కృతకవులు—( వినయముతో లేచి ) హిందూదేశచక్రవర్తిన్ ! మహారాజ
సార్వభౌమ !

శ్లో. శీతాంశో రపి భాస్వతశ్చ విహితే ధాత్రాపురా యేకులే
తే యాతేద్య గుణోత్తరే విజయిని శ్రీహూణరాజాన్వయే
చంద్రిస్యాపిచభాస్వత స్సదృశయా కీర్తిప్రతాపశ్రియా
తావకాల్యత ఇమే పునశ్చ విహితే యెడ్వర్డు భూమీపతే !

జనసభాసదులు—

ఉ. చారుయశంబుతోఁ బ్రజలసౌఖ్యముచెందఁగఁజేసెఁ గాని వి
క్టోరియ రాపు మాజనులకుం గనుభాగ్యము లేకపోయె; నా
కోరిక దీఱ మున్న కనుఁగోలభియించెను నిన్ను మాకు మా
వారికి సార్వభౌమపదపణ్యకృతీ ! యెడవర్డు భూపతీ !

కర్జను—( అన్నియువిని ఆనందముతో లేచి )

తే. గీ. సార్వభౌముండు భూమికీశ్వరుఁ డటంచుఁ
బేరుమాత్రమ యెడ్వర్డు భూమిపతిది
సార్వకాలికసంపన్న సర్వసౌఖ్య
భరిత హైందవరాజ్యానుభవము మీది.

అందఱును—రాజప్రతినిధులు తమరిట్లు పల్కుట న్యాయమే.

కార్యని—(లేచి) ఓ భక్తసాక్షీశ్వరా! మనచక్రవర్తిగారు తమకిచ్చిన జి. సి. బి.
బిరుదముంగొనియాడఁ బ్రత్యేకసభగావించెదము. ఓ తిరువాన్కూర్ శిరో
హి నభా మహారాజులారా !

క. నరపాలశిరోమణి యెడ్వర్డుఁడు క్ష్మానేతసార్వభౌముఁడగుతఱిన్
గరుణం 'జీ. సీ. ఐ. ఈ' బిరుదము మీకొసఁగె విశ్వవినుతముగాఁగన్.

ఓ దర్భాంగ చర్ఖారీ షహాపుర మహారాజులారా !

క. నరపాల శిరోమణి యెడ్వర్డుఁడు క్ష్మానేత సార్వభౌముఁడగుతఱిన్
గరుణం 'గే. సీ. ఐ. ఈ.' బిరుదము మీకొసఁగె విశ్వవినుతముగాఁగన్.

క. మానుగఁ గొచ్చిన్పురవసుధానాయక! నీకొసంగెఁ దగు జీ. సీ. యస్.
ఐ. నామము నెడ్వర్డు మహీనాథుఁడు రాజరాజయినసమయమునన్.

ఓ ముంబాపురీ ప్రముఖరాజప్రతినిధులారా ! మీమీమండలంబులయందున్న కారాగృహనివాసులను వందకుఁ బదేసుండ్ర పగిది విడుపుఁడు ! బందీలకు నధమర్ణుల ఋణంబు నూటికి మించదేని యాద్రవ్యము మీరిచ్చి వారిని వదలింపుఁడు.

వైతా—( చేతులెత్తి )

క. బిసరుహమిత్రుఁడు పడమటి వెస పర్వతకుహరమునకదే । చేరఁ బో
వుసమయము వచ్చె మీమీ బసలకు దయచేయుఁ డోసభాసదులారా !

మఱియుఁ జక్రవర్తి దంపతులపట్టాభిషేక మహోత్సవకాలంబునఁ బలువురకు నొసంగిన బహుమానంబులును బిరుదంబులును బత్రికాముఖంబున వెలువడును. రాజులందఱును సెలవు గైకొందురుగాక.

నైజాముపాదుశాహి—( సమీపించి కానుక సమర్పించి నమస్కరించుచున్నాఁడు)

కర్జ—( రాజసోదరుని వంకఁజూచి శాహినుద్దేశించి )

ఉ. కప్పము గట్టురాజు లధికారులు దేశమునిండఁ గొల్వఁగా
గొప్పగ దేశపుంగరము కోట్లకొలందిగ వచ్చుచుండఁగా
నప్పతిఁబోలె ధైర్యమున నాకరుఁడై జగమేలుచున్నవాఁ
డిప్పతి గోలకొండ నగరీంద్రుఁడు చూడుము రాజసోదరా.

అనంతసేనమహారాజు—( కానుకసమర్పించి నమస్కరించును )

కర్జ—( రాజసోదరునకుఁజూపి )

సీ. పద్మనాభస్వామి పాదారవిందంబు లెవఁడు నిచ్చలు జపియించుచుండు
విద్వాంసు లగువారి విద్యపరీక్షించి గండపెండార మెవ్వండొసంగు

నేకాలమరసిన నేలాలవంగాదు లెవనిదేశము ఫలియించుచుండు
నెవనిరాజ్యము తనూభవులకుఁగా కనుజాతనూజులయందు సంక్రమించు

తే. గీ. ధనముసగపాలు వచ్చునాదాయమందుఁ
బాలువారలతృప్తి కెవ్వఁడు వ్యయించు
నతఁడనంతశయనసగరాధినాథుఁ
డరయుమా వీని విక్టోరియాకుమార !

మహిశూరమహారాజు— ( కానుకసమర్పించి నమస్కరించును )

కర్జ— ( రాజసోదరునకుంజూపి )

తే. గీ. శాలివాహననరపాలసార్వభౌము
గద్దెపైనెక్కి పాలించు క్ష్మాధవుండు
చూడుమా బాలుఁడమ్మహీశూరపురికిఁ
గైకొనియెఁ బట్టమును నిన్నగాక మొన్న.

కాశ్మీరమహారాజు—( కానుక సమర్పించి నమస్కరించును )

కర్జను—( రాజసోదరునకుంజూపి )

మ. అలకేంద్రుం దలమీఱు కశ్మీరయును బుణ్యక్షేత్రము లెన్కు వి
ద్యలు తచ్ఛింధునదీసమాగతవితస్తాంభోనదీమాతృకం
బులగుంభూములు గల్గి యొన్నఁదగుచు న్భూలోకనాకంబునాఁ
జెలువౌ దేశము నేలు రాజితఁడు కాశ్మీరేంద్రుఁ డీక్షింపుమా.

( మఱియుం దక్కిన మహారాజుల నిర్దేశించి )

సీ. ప్రజలఁ దండ్రింబోలెఁ బాలించు నేర్పరి కాంచుమా సింధుహోల్కారితండు
కరుణామయుఁడు రాజకార్యనిర్వాహకుం డరయుమా యితనిరీవాధినాథు
విద్వాంసులనుబ్రోచువిధమెఱింగినయొడయఁడు చూడుమితనిదర్భాంగరాజు
రాజమాన్యుఁడు రాజరాజతేజుండు గన్గొనుమా యితఁడు పుదుకోటధర్త

తే. గీ. శూరులగు రాజపుత్రులు వీరు జయపు
రంబు జోత్పూరు భరతపురం బుదయపు
రంబు ముస్తైనపురములు రాజధాను
లైన రాజులు విక్టోరియాకుమార !

వైతాళికులు — ఆసేతుశీతాచలమధ్యవర్తి సామంతనరపాలనుతనామా ! శత్రుజనభీమా ! కీర్తికామా ! లండన్పురీధామా ! పరశ్శతాక్షౌహిణీపరిమితబలస్తోమా ! సకల ద్వీపవసుంధరాప్రతిష్ఠాపిత జయరమారామా ! ఎడ్వర్డుసార్వభౌమా ! జయము జయము !

తే. గీ. భాస్కరుని కస్తమయమనుపల్కులేని
యంతదేశంబు జయముజయం బనంగ
లోటులేకుండఁ బాలించు లోకవిభుఁడ
వీవు పొందంగలుగు ప్రియం బేదియింక.

కర్జ — భగవదనుగ్రహంబున హూణసౌరాజ్యంబు సర్వసమృద్ధంబై యున్నను నిట్లు కోరుకొందము.

తే. గీ. అవని బహుసస్యసంపన్న యగును గాక
ప్రభువులకు న్యాయ్యమగుబుద్ధి వఱలుఁ గాక
యఖిలజనము నిరామయం బగునుగాక
ప్రజలకోర్కులు పండుచుఁ బ్రబలుఁగాక.

అందఱును —

తే. గీ. జయ మలగ్జాండ్రకు జయంబు జయముజయము
జయము శ్రీసప్తమైడ్వర్డు చక్రవర్తి
కందఱకు జయము జయమీయందఱికిని
జయము యువరాజయావరాజ్యంబునకును.

( అందఱును నిష్క్రమించుచున్నారు )

— గద్య. —

ఇది శ్రీ కింకవీంద్ర ఘటాపంచానన విద్వత్కవి బాలకలానిధి బాలసరస్వతి శతావధాని తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబగు నెడ్వర్డు పట్టాభిషేక నాటకంబున హిందూదేశపట్టాభిషేకంబను సర్వంబును షష్ఠాంకము.

శ్రీమత్పరదేవతాయైనమః.

---

శుభమస్తు

# పండితరాజము

## ప్రథమాంకము

(నాంది)

ఉ. శ్రీయు యశంబు నున్నతియుఁ జెల్వు నిహమ్ముఁ బరమ్ము విద్యయై
యే యుగమందు నెల్లెడల నే యనఘాత్ముల కొప్పు నట్టి వి
ద్యాయతనంబులై కవిత కాస్పదులై ప్రళయాంతమందునుఁ
బాయని కీర్తి నొప్పెసఁగు పండితరాజుల కేను మ్రొక్కెదన్.

(నాంద్యంతమందు సూత్రధారుఁడు ప్రవేశించి తెరవంకఁ జూచి)

సూత్ర— ఆర్యురాలా! యేమి యీయాలస్యము. ఇంతకున్నైన నీ యలంకారము కాలేదు కాఁబోలును.

నటి— (ప్రవేశించి) ఆర్య! ఇదె వచ్చితి. అలంకారమున కేమున్నయది? కురులు దువ్వికొనుటయుఁ బూలు ముడిచికొనుటయుఁ గాటుక దిద్దికొనుటయుఁ దక్క నగలవలని వగలు దెచ్చికొనునంతటి భాగ్యమున కేను నోఁచినదానఁ గానుగదా?

సూత్ర— అహా! వంశపరంపరగా వచ్చుచున్న యీనాట్యవిద్యచే జీవించుమనకు నెల్లరకుం బోలె, మణిభూషణంబులును, పట్టుపుట్టంబులును నెక్కడివి? అదిగాక, యీప్రపంచము పుట్టినయది మొద లిప్పటికి విద్యాజీవనుల కైశ్వర్య మెక్కడ వినఁబడ్డది?

నటి— (కోపముతో) తే. మాతృగుప్తకవీంద్రునిమాట వినవొ?
కాళిదాసాదికవుల సంగతులు వినవొ?

విద్య గలవారి కెల్ల నివ్విధముగా ద
రిద్రతయె నిక్క మన్న నేరికి హితంబు?

సూత్ర— సుప్రసిద్ధస్ను విషయమే మఱచితిని. కాళిదాసాదుల యైశ్వర్యమున కేమిగాని విక్రమార్కు ననుగ్రహమ్మునఁ గాశ్మీరమండలమ్మున కేకచ్ఛత్రాధిపత్యమ్ము వహించిన మాతృగుప్తునివంటి వారల కైశ్వర్య మనుభవింపఁ జెల్లదియె?

నటి— ఆర్యా! ఇవి యేటిమాటలు?

తే. నేల నాలుగుచెఱఁగులు నేలె నెవ్వఁ
డెవని కరిగాపు లైరి భూమీశు లెల్ల
నట్టిఁడగు ఢిల్లిపాదుషా కల్లుఁ డైన
యట్టి పండితరాయలయశము వినవొ?

సూత్ర— అవు నవును. కర్ణాకర్ణికగా నమ్మహానుభావునిచరిత్రము వినుచున్న యదియే. చక్కనిప్రసంగములోనికి దింపితివి. అయిన నేమి, సభ్యులు నాటకారంభమున కెదురు చూచుచుందురు. పత్రిక వచ్చి చాలసేపైనది. (విప్పి చూచి) ఏమి నీ భావికార్యాభిజ్ఞత? సభ్యులయనుశాసనమునకుఁ దగిన ప్రసక్తి దెచ్చితివి.

నటి— "మాతృగుప్తచరిత్ర మాడుఁ" డని యాజ్ఞాపించిరా యేమి?

సూత్ర— కాదు కాదు. "సుప్రసిద్ధులును, ననేకగ్రంథవిధాతలునునగు తిరుపతి వేంకటేశ్వరులచే నూత్నముగా రచింపఁబడిన పండితరాజమను నాటకము ప్రయోగింపవలయు" నని,

క. కృతికర్తలా ప్రకృష్టులు
కృతినాయకు నంతవార లిల లేరిఁక ధీ
యుతులు ప్రయోక్తలు సభ్యులు
నతులితు లిటువంటిభాగ్య మబ్బఁగవలయున్.

"ఆలస్యా దమృతం విష" మ్మనుటచే నయ్యది దేనికిని బనికిమాలినది. కావున వైళమ యొక్కింత గాన మొనరింపుము.

నటి— ఏఋతువు ననుసరింతును?

సూత్రి— వెఱ్ఱిదానా! కనులకుఁ గట్టిన ట్లగపడు నీ వసంతముకన్న నన్య మెందులకు వెదకవలసివచ్చెను?

నటి—

సీ. పూలగుత్తులు చిన్నిపూఁపపిందెలు పొల్పు గల్పింప నామ్రముల్ కలిమి నలమె
వాని యాశ్రయణంబు నూని కోయిలలు పొగ ర్వట్టి రేయుంబగల్లు కూసె
నాకూజితముల కత్యాకులత్వము నంది పథికు లెల్లరు నూరిబాటఁ బడిరి
వచ్చినభర్తలఁ గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి ప్రోషితభర్తృకల్ ప్రోదినూఁది
రక్కఁతమ్మున మదనున కలఁతిగాని
యుత్సవము లెల్లెడల నొప్పె నొక్కఁడేల?
యలరెఁ బండితరాయలయశమువోలె
సకలలోకసుఖంబు వసంతుచేద్ది.

(తెరలో)

ఎవ రక్కఁడ, నారాక దాదాఁపగుట యెఱింగియుంబోలె వృథా మిథ్యాస్తవంబు లొనర్చుటకు మొదలు వెట్టిరి!

సీ. పరదేశములు దివ్యతరదేశములు గాఁగఁ బరులగ్రామములు కాఁపురముగాఁగఁ
బరగేహములు సౌఖ్యకరగేహములు గాఁగఁ బరులసంపదలు సంపదలు గాఁగఁ
బరసజ్జనావళుల్ పరమబంధులు గాఁగఁ బరులయన్నము పుష్టికరము గాఁగఁ
బరులు కష్టసుఖమ్ము లరయువారలు గాఁగఁ బరు లెల్లకృతుల నపరులు గాఁగఁ
సంతతప్రవాససంజాతఖేదంబు
తనకె కాక శిష్యజనములకును
గలుగఁ జేయునట్టి కష్టుండు పండిత
రాజు వానియశ మరమ్య మెందు.

నటి— (చెవి యొగ్గి) ఆర్యా! ఏదియో మేఘగంభీరనిస్వనంబున వినవచ్చుచున్నయది.

సూత్రి— నీతమ్ముఁడు మాధవుఁడు పండితరాయభూమిక ధరియించి సశిష్యుండై ప్రవేశించుచుండంబోలు. మన మనంతర విధానమ్ములకుఁ బోవుదమురమ్ము.

(నిష్క్రమింతురు)

(ప్రస్తావన)

(అనంతరము పండితరాయలును శిష్యులును బ్రవేశింతురు)

రాయ— (విసువుతో నిట్టూర్పు నిగిడ్చి)

మ. అతినిమ్నోన్నతమైన దేశములఁ బండ్లాడి గ్రుంగ్గంగఁ దా
మతుకుల్ వాసె శరీరసంధు లకటా! యాహారమా, నీరమా,
మెతుకుల్లగ్గినఁ దక్రిమా! శివశివా! మే నెల్ల శుష్కించెఁ "బం
డితరీతిః పరదేశ" యన్నపలుకే నిక్కమ్ము ముమ్మాటికిన్.

శిష్య— గురువరా! ఇదిపఱ కెన్నండును లేనివిసువు మీ కీనాఁటఁ గన్పట్టనేల? మే మేదేని యపచారం బొనరింపముకదా? తమయశం బరమ్యమని యుగ్గడించుటయు శిష్యులకును ఖేదంబు గలుగఁ జేయుచుంటి మనుటయు మా కీ యనుమానమ్ము గలిగించుచున్నయవి. తాము వచించినవాక్కు లసత్యము లెట్లయ్యెడి? నిజముగాఁ దమయశంబ రమ్య మెందు.

రాయ— ఈ సాంద్రపల్లవవేల్లితంబగు కానుగునీడకుఁ బోవుదమురండు. చండకిరణుండు తన తైక్ష్ణ్యమెల్లఁ బూర్వయామమ్మునన వినియోగించుచున్నవాఁడు.

శిష్య— గ్రీష్మర్తు వాసన్న మగుటంజేసి క్రమముగా నుదయించుటయె తడవుగా నెండ మెండగుచున్నయది.

(ఎల్లరును జెట్టునీడ నిలుతురు)

రాయ— (స్పర్శసుఖము నిరూపించి)

ఉ. ఎక్కడి కేగెఁ దాప, మిఁక నెయ్యెడఁ బోయెఁ బథశ్రమం, బదే
చక్కని డాఁగె డప్పి, యెటు సాగెనొ యాఁకలి! స్వేదబిందువుల్
గ్రిక్కిఱు లారఁ గ్రోలుచు మరుచ్ఛిశువుల్ మెయి నిండఁ బ్రాఁకి యే
దిక్కునఁ జూడఁ దామ యయి తీఱనిమోదము వెల్లిగొల్పెడిన్.

శిష్య— దేశికోత్తమా! ప్రవాసం బని కొందఱు నిందింతురే కాని నిజమ్మున కిట్టి యఖండసౌఖ్యమ్ములు కూపకూర్మమ్ములవలె నిండ్ల ప్రగ్గడి యజ్ఞులకుఁ దటస్థించునా?

రాయ— సత్యమే, అయినను, యిప్పటి కించుమించుగ నాఱునెలలనుండి రేయనక పవలనక యెండయనక కొండయనక పులియనక భూతమనక యెండ

తెగని పయనంబుల బడలిన, "డిల్లీనగరం బొకటిరెండు దినంబులకుఁ బోనగు" ననియెడి వార్తమాత్రము విన వచ్చుచున్నయది.

శా. వేఁగీదేశమునన్ జనించితిని దేవీపాదసంసేవనో
ద్యోగంబున్ బొనరించి "విద్యలను నెందున్ వీనికిన్ దుల్యుఁ డే
భాగమ్మందును లేఁ" డటన్నయశముం బ్రాపించి పై నేకసం
ధాగ్రాహిత్వ మశేషభాషలను సంధానింపఁగా నేర్చితిన్.

చ. చదు వటు లుండ నెల్లరప్రశంసకు నెక్కిన మేటిధాటి నొ
ప్పిదముగఁ జెప్ప నేరతుఁ గవిత్వ, మెవండును నన్నెదుర్ప లేఁ
డెదిరిన చోఁ బరాభవము యేర్పడు వానికి, నిట్టి నాకునున్
గుదురదు పొట్టకుం దగినకూ డిహిహీ మఱి వేయు నేటికిన్ ?

(ఇంచుక యోజించి) ఓహో ! యేమి యీదారిద్ర్యప్రభావము ? మార్గాయాసమ్మునకుఁ దోడై నన్నాత్మశ్లాఘాపరాయణుంగా నొనరించు చున్నయది తప్పేమి ?

ఉ. త్రిప్పు ననేకదేశములు తీవ్రపుఁగోపము పుట్టఁ జేయుఁ జే
రప్పుల పా లొనర్చుఁ బరమార్థమువంకకుఁ బోవ నీయ దే
గొప్పయు దక్కనీదు తనకుంగల మానము వమ్మొనర్చుఁ దా
నుప్పన కేని మారఁ డెవఁ డొందు దరిద్రత వాఁడు శూన్యుఁ డై.

శిష్యు— దేవా ! యేల దేవర యాత్మశ్లాఘాదోషదూషితు లయినట్లు కుందుచున్నారు. తాము వచించువిశేషము లన్నియు నించుకయు స్వభావోక్తికి మించవు. తమ కేటి కీపరితాపము ? కొలఁదికాలముక్రిందట నవరాత్రమహోమహమ్ము నందలి యష్టమీదినమ్మున నర్ధరాత్రమ్మున నెల్లరిసముఖమ్మున వినఁబడిన యాకాశవచనంబులు స్మరింపుఁడు.

మ. "కురుదేశమ్ములదాఁక నేగు మెదురై కోపించి నీతోడ నొం
డొరుఁ డెవ్వండును నిల్వఁ డిందులకు నీ వొక్కింతయున్ శంకచొ
ప్పరయం బోకు వరం బొసంగితిని వత్సా ! సర్వశాస్త్రమ్ములన్
బరిశీలించి యొనర్చు వ్యాఖ్య" లని యంబాదేవి వాక్రుచ్చదే ?

రాయ—అవును- మనయందు జగదీశ్వరియనుగ్రహం బట్టిదియ యైనను నీయకాండతాండవం బెరు సంతసింపఁ దగినయటె?

క. విద్వత్త్వము దారిద్ర్యము
నద్వైతమునందుఁ బోలె నాత్మేశ్వరులై
యీద్వీప మొక్కఁ డేల, న
వద్వీపము లేని దాఁటు ననములు మీఁటుల్.

శిష్య — సత్యమే. అయినను, దూరస్థపర్వతన్యాయముగా మన మిట్లనుకొనుచుంటిమే కాని మనమండలమునందేమి చుట్టుపట్టుల నేమి యుంబుంజీవనాన్యులగు రాజన్యులెందఱు లేరు ?

రాయ — ఓహో! యేమి యీసత్తిపనము. మనదేశపురాజుల నాశ్రయించెడి పండితుల కిప్పుడ కాదుగదా, సప్తజన్మంబులకేని దారిద్ర్యభారమ్ము వాయదు.

శా. ఈగి న్నేరఁ డొకండు, నేర్చెనను దా నీఁగల్గు భోగాలకున్
రాగిన్ దక్కఁ గవీంద్రులన్ దనుప కీ రాజన్యముఖ్యులం, దట్టి యీ
త్యాగం జేసియుఁ బన్నికాలములఁ దీర్ఘాలంముఁ గన్పట్టు, నే
నేగంగావలె, నీయఁగా వలయు డిల్లీశుండు నే డేటికిన్.

క. డిల్లీశుఁడో, జగదీశుఁడో,
యుల్లమ్మునఁ బొడముకోర్కు లొడఁగూర్చెడి నీ
చిల్లరరాజు లొసంగుట
కల్ల యొసంగినను గూరకా? యుప్పునకా?

ఇంతియ కాదింకను వీరలయవ్యవస్థ లనేకములు గలవు చూడుము.

సీ. తమకు రాఁదగిన యాదాయమ్ము నెఱుఁగరు; వ్యయ మెఱుఁగరు; లేమదయకుఁ బాత్రులగు మంత్రు లొనరించు నన్యాయము నెఱుంగ; రాత్మ రాజ్యాభివృద్ధ్యాదికారణములగు రైతు లన్నములేక చచ్చుచున్నను నొకింతయు వారిఁ గనరు; పన్ను హెచ్చొనర్చినవాఁడె యిష్టుఁ డుద్యోగులం; దిట్టులార్జించియు నేమిఫలము?
పండితుల కొక్కసంస్థానపతియు వత్స
రమున కొకకొంతయేని ద్రవ్యము వ్యయింపఁ
డిదియు నిట్లుండఁ బయి పెచ్చుబుణము వీరి
నెప్పటికి నప్పుడే క్రమ్మంగ నెసగుచుండు.

ఔరా! వీరిదురవస్థ.

సీ. తప్పులెక్కలు వ్రాసి తమమంత్రు లం దర్థమపహరింతురు కొంద ఱప్పుడపుడు
పై నిచ్చు లంచాలపాలగు మఱికొంత సౌకర్య చౌర్యమ్మున హరియింత్రు

రాజబంధువుల మర్యాదల కొక్కింత పష్టుగఁ గోడిపందెమ్ములకును
గొఱ్ఱెపందెమ్ములకును గొంత బూదిలోఁ బోసిన యాజ్యమై పోవుఁ దుదకు,

దమకుఁ దిండికి నున్న సంభము లొనర్ప
బొత్తిగా నుండ దప్పు దప్పును బొనర్చు
రడియు నిప్పించువాని కందర్థ మేని
యీక మానదు బహుమాన మింత నిజము.

మనరాజులజాగరూకతయు మనమంత్రుల స్వార్థతత్పరతయు నెన్నఁడెఱుఁగరు
మన మెట్టియిక్కట్టులకేని యోర్చి డిల్లీచక్రవర్తిన్ దర్శించితిమేని నిక్క
ముగా నీయకించనత యకించిత్కరమ్ముగాఁ గలదు.

శిష్యు—చిత్తము, దేవర యానతిచ్చినవిధం బెల్ల నిక్కంబ యైనను జన వుండుటం
బట్టి వినినతెఱంగు విన్నవించుకొనుట మన్నింపఁ దగు.

శా. హుక్కా త్రావుచు రాత్రియుం బవలు రాజోద్యోగముల్ మాని కై
పెక్కింపన్ దగు వస్తువుల్ మెసవుచున్ హేలావినోదమ్ముగా
నక్కల్ చక్కనిరో నెలందుకలకై యర్పించి తా మెప్పుగో
లెక్కింపన్ మతిలేని యానవిభుల్ సేవింపఁగా నర్హులే ?

క. మనకున్ గోబ్రాహ్మణపూ
జనమున్ విధి, యించు క్రుతులు చంపి తినుట కొ
ప్పును గోవుల యావనమత
మనఘా ! సరి వడుట యెట్లు లవ్వారలతోన్ ?

ఉ. ఇచ్చిన నీయకున్న మనయిచ్ఛకు సిద్ధము రా రొకింతయే
నిచ్చటిరాజు ; లాయవను లెప్పటికిన్ మనవిప్రు లన్నచో
మచ్చర మెక్కి పల్లకులు మానక మోయఁగఁ జేతు రంచుఁ బై
పెచ్చుగఁ జెప్పు చుంద్రు మనపెద్దలు ; వార లసత్యవాక్కులే ?

రాయ—ఈచెప్పిన చొప్పంతయు నిక్కంబ కాని,

తే. గీ. దుండగులు వారిలోఁ గల రంత వచ్చు
మనమతమ్మునఁ బెక్కు ; రజ్జనులఁ బట్టి
మతము నెల్లను దూషింప మనకు నోపల
కాను దగదు యోగ్యులగువారిఁ గనఁగవలయు.

నిష్పక్షపాతముగఁ బరిశీలించిన మనమతమ్మునను నిటఁ గొన్నిదోషమ్ములు విద్వదాచారసమ్మతంబు లై యున్నయవి.

ఉ. యాగములందుఁ ద్రావుటయు నాల వధించుట గాఢిమ్యాకర్మసం
యోగము వేదయోగ్య మని యొప్పటయుఞ్ మఱి యెన్నియేనియుఞ్
యోగము లెయ్యొప్పి నిర్మించుపయోగము మాన్పఁగఁజాలువారలుఞ్
బాగన, నోగునాఁ జనరు, పై శ్రుతివాక్యము లట్లు లుండుటఞ్.

క. శ్రుతిరేనియు నది బాధిస
స్మృతికిఞ్ వెలియేని చాని మానంబగు న
స్మృతి కెక్కినయది శ్రుతికిఞ్
బ్రతికేనియుఁ గొనఁగ నొప్పుఁ బ్రజ్ఞానిధుల్.

శ్రుతు లన్నియును మనకు ప్రమాణమ్ములగుఁ దెచ్చికొంటి మేని మనకన్న నెవ్వరేనియు మేలుఁ గనరేరు. విద్వజ్జనసమ్మతంబగు శిష్టాచారం బొక్కటి మనలఁ గాపాడుచున్నయది. ఐననేమి, యాయాచారమ్మును బరస్పరద్వేషమూర్తితులగు పండితాభాసులచే ననేకమార్గమ్ముల బోవుచున్నయది.

తే. గీ. సాత్త్వికులు పిష్టపశువిశసన మొనర్తు
రని పురాణమ్ములందుఁ జెప్పిన విధమునఁ
గొంద ఱిగఁగ వేదముల్ కూలునను చు
నితరు లొనరింతురి ప్రత్యక్షహింసనంబు.

శ్రుతిస్మృతిపురాణేతిహాసమ్ములు చూడఁ జూడ నతిచిత్రమ్ములుగను దురూహమ్ములుగను గన్పట్టెడి. తురకలకును నిట్టివిపరీతార్థబోధకమ్ములగు వేదమ్ములును దత్తదంగమ్ములును గూడ నుండక మానవు. వానిం బట్టియే వారలొనరించుకార్యములలో ననేకములు మనవంబోలె నుసాధంబులు ఏది యెట్లయినను.

మ. మనకే, మన్యుల కేమి, యావనవిభుల్ మన్నించి తా మిచ్చు నా
ఘనవృత్తుల్ మఱియుఞ్ జవీనులును లెక్కల్ జూడఁగాఁ జేయుభో
జనమే వారల దంచుఁ జెప్పనగు రాజ్యం బెట్లు శాసించినన్
జను దాతృత్వము వారి సొమ్మయి ప్రశంసఞ్ జేయఁగాఁ జెల్లదే ?

అదియునుంగాక,

శా. ఏదుర్వృత్తులతో మునింగి మఱి యే దేరీతి వెచ్చించినన్
గాదా ద్రవ్యము శూన్య మెంతయు నహీనంబౌట, హిందూవిభుల్
మీఁదున్ జూడక వెచ్చపెట్టినను దామేఁ యన్నవస్త్రాలకున్
లేదో వా, కనునంతసేగి త్వరలోనే కాంతు రత్యల్పులై.

శిష్య— ఆర్యా! ఇది యంతయు నిక్కంబు, వార లెంతతఱుఁగని చాతలైనను,

శా. యోగం బొక్కటి మంచి దైనయెడ నేయూ రేగినన్ జక్కఁగా
యోగించున్, విపరీత మైనయెడలన్ యోగింప, దెం తేల, మీ
రేగుం డంబుధిఁగాని కూపమునఁగానీ తుల్య మానీటినే
తేఁగల్గున్ గలశం, బదృష్టపరముల్ ధీమార్యసంపాదనల్.

రాయ— స్వప్నమ్ములను నిక్కమే యగుఁ గాని,

మ. పయనం బైన దినంబు నుండియును స్వప్నమ్ముల్ భుజస్పందముల్
నయనస్పందము లాదిగా మనసునఁ గానన్ బుట్టు; నీసూచనల్
హయవేదండమహాగ్రహారబహుమానాధిక్యమున్ దెల్పు; నిం
తయు నిక్కం బగుఁగాక; యెందును నిమిత్తంబుల్ ముఖ్యంబుల్ గదా.

శిష్య— ఆర్యవర్యా! ప్రాకృతజనులంబోలె దేవర స్వప్నమ్ములనియు శకునమ్ములనియు విశ్వసించుట కరం బాశ్చర్యమ్ము కలిగించు చున్నయది.

తే. నిదురపట్టమి స్వప్నముల్ నెగడు నొక్కొ-
కప్పుడు ప్రకృతివశమ్మున నదరు భుజము
లేమి నయనమ్ము లేమి యొం డేమి దీన
నగుఫలమ్మును లే దన్య మరయ రాదు.

రాయ— ఇయ్యదియుఁ గొంతవఱకు నొప్పుకొనఁ దగినదే కాని, చిరపరిచితానుభవమ్ము ననకదా! పెద్దలియ్యెడల శాస్త్రమ్ములఁ గల్పించియుందురు. వాని నింతమాత్రన త్రోసివేయఁ జెల్లునా? ఇది యిట్లుండనిచ్చి నిష్కలంక బుద్ధితో విశ్వసింపఁదగిన దింకొక్క రహస్యమ్ము వచించెద.

శా. నాకున్ జాతక మొప్ప వ్రాసె విధికన్నన్ మిన్న మాతండ్రి, యం
దేకచ్ఛత్రవిభుండు గాఁతు నిదు నంచిం తింత సూచించె, ఢి
ల్లీకాంతుండు వినాఁగ యాదృశవిభుల్ లే, రేమికా నున్నవో?
**యేకాలమ్మున కేమి వచ్చునో? నరుం డెవ్వాఁడు దైవేచ్ఛకున్?**

శిష్య— ఇది మఱియు విచిత్రముగ నున్నయది. విశ్వసించుట యెటుండనిండు. తురుష్కకన్యాపాణిగ్రహణంబు లగ్రజాత్యుద్భవుల కేయుగమ్మునఁ జెల్లెడిని; అందులోఁ దమవంటి మహానుభావు లెట్లు సైకొందురు ?

రాయ— ( ఇంచుకతడవు పూరకయుండి ) ఆచక్రవర్తికిఁ గూఁతు నిచ్చినయా శాహా మన మెఱుంగముగదా, ఉండుటయే నిక్కం బేని,

మ. కొనకే మిచ్చిన? నేఁటిసద్గతులు లౌకికుల్ కట్టుఁబాట్లు న
చ్చినయట్లుం బొనరించి “దెయ్యని కదుం ద్రిగుంత మా వస్తువే”
నని శ్రీకృష్ణుఁడు గీతలన్ నుడువఁడే? ధూతం బసత్యమ్ము న
ల్పునె? లోకేశుఁడు భేదబుద్ధిగలఁడే? క్రూరుండె? వైరాగ్యుఁడే?

ఉ. దేశము లెన్ని? యొక్కఁడె సదీశ్వరుఁడు గద్దె మఱొక్కచోట లేఁ
డే? ప్రభు లమ్మహామహనిశే యయినన్ మఱి పక్షపాతని
ర్దేశము లేల కన్పడు? విదేశమునాఁడికి ముక్తిలేదె? యే
దేశపువారు ముక్తులని తెల్పఁగనౌ? సటుచేసి చెప్పుమా.

శా. పాండిత్యం బనఁ దుల్యదృష్టియగు; సంభావింప నవ్వాఁడు వే
దండంబున్ శునకంబు నొక్కగతి, నీచాత్మప్రగల్భు నొక్కంత నే
రం డేనిన్ మఱి వాని కెక్కడిది సార్వజ్ఞత్వ? మింతేటికిన్
“చండాలోస్తు సతుద్విజో” స్తనుచు నాచార్యుల్ ప్రశంసింపరే.

ఇంతవట్టును శాస్త్రవిషయం బగుటచే నుపన్యసించితింగాని, ప్రకృత ప్రసంగమ్ము లోనిది కాదు.

ఉ. ఎంతయు రిక్తులైన మన మెక్కడ? మన్యమలోకపుజ్ఞాత చీ
కాంతునికూఁతు రెక్కడ? యుబ్బండుల బుద్ధులు సైతు మొక్కట
వింతవిధమ్ముగాంచు, నవివేకము చెడ్డది, దానిఁ ద్రోయునే
ర్పెంతటివానికేని జనియింపదు, కోర్కు లనన్ బిశాచముల్.

ఈప్రశంస యంతయుఁ ‘దెట్టఁగలబచ్చలపాదు’ సామెతవంటిది. (ఆకసము వంకఁజూచి) సుఖముగ నున్నయదికదా యని యిద్యోడఁ గూర్చుంటిమి. కాలమతిక్రమించుచున్నయది.

క. అంబరమధ్యంబును జే
రెం బంకజవల్లభుం డరిగెఁ జల్లఁదనం

బుం బహుదూరమ్మగ నెం
డం బడి తాళంగలేక నగగుహాలు సారన్.

శా. కాఁగన్ జొచ్చెఁ దటాకనీరములు, వృక్షశ్రేణిమూలమ్ములన్
డాఁగె న్నీడలు, ధూళి బిట్టెగసె, గాఢం బయ్యె సంతాప, ము
ద్యోగమ్మున్ దిగఁద్రావి హాలికులు పోనూహించుచున్నారు, వే
వేగన్ దగ్గరపల్లె కేగఁ దగు నీ వెట్టి న్నివారింపఁగన్.

(అందఱును నిష్క్రమింతురు)

ఇది... శ్రీతిరుపతి వేంకటేశ్వరవిరచితంబగు పండితరాజమ్మునఁ

ప్రథమాంకము.



# ద్వితీయాంకము

(తరువాత విదూషకుఁడు ప్రవేశించును)

విదూ.— (తనలో) రాయలవారితో స్నేహమైనది మొదలు పాదుషాయొద్ద కేగుటయే యిష్టము లేకున్నయది. "రాజాను జూచినకళ్లె మొగుణ్ణి చూస్తే మొత్తుకో బుద్ధి వేస్తుం" దన్నట్లున్నది. ఆహాహా! సౌందర్యవిశేష మట్లుండ నాయన వాఙ్మాధుర్యము! ఎంతసేపు వినినను తనివితీఱదు. దీని కేమి? ఆశక్తియెట్టిదో. ఒకసారి విన్నంతనే యేభాషయైనను తూ,చా తప్పకుండఁ జదువును. పాపము! ఈప్రజ్ఞచేతనే కదా మొన్న గుజ్జుపుట్టుసుదాయఁడును నేనుఁగు మావటీఁడును పెట్టికొన్న కలహములో నిష్కారణ మాయనకు సాక్ష్యము వచ్చినది. దిక్కుమాలినవిగవలు నీళ్లకుఁ బోలీకొనిపోయినవా ళ్లొకదానిమీఁద నుండి యొకదానిని దాఁటించుకొనుట యెందునకో? గుఱ్ఱము లాఘవము కలది గనుక దాఁటును గాని, యేనుఁ గెట్లు దాఁటుననుకొన్నాఁడో? పోనీ యెవరును దొరకనట్లు లీ పండితుని సాక్షిగా నెందుకు వేసికొనవలెనో? అయిననేమి? అదియుఁ బ్రభువర్శనాకాంక్షియగు నియ్యనఘునికి ఫలకారియే యయినది. ఇంతకుఁ గడనుఁ డైనను దండనాధికారి బహుమానించినాఁడు; తాఁగనుఁ గొన్నవెంటనే యీయద్భుతశక్తిని పాదుషాకుఁ దెలియఁ బఱచినాఁడు. పరోపకారపారీణులయుపాయము లిట్టివియే కదా! లేనిచో నితఁడు పండితుఁడని యెంతకాలము చెప్పినను దర్శన మగునా? ఇప్పుడో! యెందునకో చెప్పినట్లుండినను విధిగా దర్శనము కాఁగలదు. (కొంచెమునే పూరకొని) లవంగి కెట్లు తెలిసినదో యీతనిసంగతి? ఎట్లైనని యొకసారి తనయుద్యానవనమ్మునకుఁ దీసికొనిరమ్మని తన చెలికత్తియ మల్లికచేఁ గబురు చేసినది. కొంపతీసి చూచినపిమ్మట మోహింపదుకదా! (స్మృతినభినయించి) అయ్యో! నామనస లాగ్రిబుద్ధి కాలినట్టే యున్నది. అప్పటికప్పుడే మఱచితినే. 'ఆపెకలలో నెవరో పొడకట్టి యచ్చొత్తినట్లేయన విగ్రహమునే చూపి పిలువని పేరంటముగా దూతికాత్వ మొనరించి మోహము కలిగించినదఁట!' యని కూడ నిన్న సా భౌనిసకూఁతురు నాకుఁ జెప్పియేయున్నది. ఇఁక నేమి? సర్వవిధముల చేతను నీ బ్రాహ్మణుని రొట్టె నేతనే పడ్డది. అదృష్టకాలము వచ్చినప్పటి కన్నియు నిట్లనుకూలించును కాఁబోలును; కాని, యుగ్రకులజుండును నఖండ పండితుండునునగు శతం డీనీచురాలి నంగీకరించునా? అంగీకరించ కేమి?

ఘాదుషాకూఁతుకన్న నెక్కడు సంబంధము దొరకెడినా యేమి యీ బ్రహ్మచారికి ? ధారాళముగా వివాహము చేసికొనఁ డేమో కాని రహస్యమున కభ్యంతర ముండదు. ఏది యెట్టయినను నియ్యది నా ప్రాణముమీఁదికి వచ్చినది. ఘాదుషాకుఁ దెలిసినచో నే నేమి యుత్తరము చెప్పఁగలుగుదును ? "నంహో రాజాభవిష్యతి " తల్లిగండ ముండపలెను పిల్లగండ ముండపలెను గాని మంత్రి సానిగండ ముండమకదా; ఎట్లయినను నొకసారి యుద్యానవనమునకు మాత్రము తీసికొనిపోవుట నాకుఁ దప్పదు. అట్లు చేయనిచో నిప్పుడే నా కాపెవలనఁ జిక్కు తటస్థించును "అటునుండి నరుక్కురా" మన్నట్లు, పయిదానికిఁజూచుకోలేక పోదునా ? పోయి యాయనతో నీవిషయమును గొంత ముచ్చటించెదను (కొంతనడిచి) అదిగో ! రాయలవారిశిష్యులు అందఱును నొకసారియే బయలుదేరినారే (శిష్యులు ప్రవేశింతురు) వీరినడిగెదను (పరికాశము) అయ్యవారేమి చేయుచున్నారు ? పాఠములు చెప్పుకొనుట యైనది కాఁబోలును.

శిష్యు— లేదు, గురువుగా రేదో యాలోచించుచుఁ బిలిచినను పరాయత్తచిత్తులై నిన్నటి సంధ్యాకాలమునుండియుఁ బ్రత్యుత్తర మే యీయరు.

విదూ— ( తనలో ) కారణ మేమయి యుండునో ! ( పరికాశము ) మీరిప్పుడెక్కడికి ?

శిష్యు— ముగ్గురమును వేర్వేఱుగా పను లుండియే బయలుదేరితిమి. ఒకరు కూరలకును మఱియొకరు తండులములకును, వేరొకరు స్వకార్యమునకును.

విదూ— మీకు రొక్కమే దినవెచ్చ మిచ్చుచున్నారు కాఁబోలును. సరే, ఇవి స్వకార్యములు కావా ? " తృప్త్యర్థ " గా మీరే భోజనము చేసెదరు, పేరు మాత్రము గురువుగారిది.

శిష్యు— పుస్తక మొకటి కావలసియున్నది. అది స్వకార్యమన్నాను ; అంతే అన్నియును స్వకార్యములే, కాకేమి ?

విదూ— ఉత్తరగీతలా ? రతిరహస్యమా ? దాని పేరేమి ?

శిష్యు— ( నవ్వి ) మహాపండితుఁడవు, నీ కన్ని పేరులును వచ్చునే ! మేము త్వరగా వచ్చి వంటఁ జేయవలె మమ్మును విడిచిపెట్టుము.

విదూ— వెళ్లుదురుగాని " విధవానాం విలంతూనాం కాగతిః పురుషోత్తమ " తరువాత " అహం విద్యార్థిరూపేణ " అనియా ? లేక " సన్యాసిరూపేణ" అనియా పాఠము ? కొంచెము చెప్పిపొండి.

శిష్యు— ఇది యెందులోనిది ? మే మెన్నఁడును విన లేదు.

విదూ— (వెనుదిరిగి) ఇదో విహారించితివా? ఈ సంగీతములోఁ గన్నట్టిమూర్తి సన్నిధిఁ బడుగఁగా నన్నుఁ బోసిభానుఁడు దప్పక నిను గానకు.

శిష్యు— సరే, మమ్మును పోనిమ్ము ప్రొద్దుపోవుచున్నది. (నిష్క్రమింతురు.)

విదూ— (తనలో) ఇప్పుడు నాకు మఱియు వీలుగ నుండును. "లంజెను పిల్ల తగులాట" మన్నట్లు శిష్యులేకపోవుటయే మేలు. ప్రొద్దుగాఁ బోయి శిష్యు వచ్చినందులోఁగాఁ గార్యము నెఱవేర్చవలెను (ముందునకువచ్చి) ఇదిగో! అయ్యవారు నివసించు మేడుగు; (చెవియొగ్గి) లోపల నాయన యేమియో ప్రలాపనుయనుగఁ జదువు చున్నట్లు లున్నది. అది యిక్కడనుండి వినరానేమి మాయింగు గాని దగ్గర కేగితి నేని యాయన మానివేయునేమో! (ఒక్కెడ దాగి వినును) (యథా నిర్దిష్టముగా రాయలు ప్రవేశించును)

రాయ— తే. గీ. యవని నవనీతకోమల నహహా! యొక్క
సారి శయ్యాతు రాఁడియఁ జాలువాఁడ
నేని నందనవన మేల? యితర మేల?
యవనియే హెచ్చు దీని కేదైన లెమ్ము.

విదూ— (తనలో) వెదకఁ బోయినతీవ కాళ్ళకుఁ దగిలిన ట్లీయన పడుచుఁ జపవుబాధ చెల్లఁబోయుచున్నట్లు లున్నదే. ఈయన యని యేయవని గ్రైయుండునో? (మరల వినును)

రాయ—

శా. ఏ దంతస్థులమేడపై కలిసి తా నేహేతువో వచ్చె, నేఁ
జూడన్ గూడునె నిష్కళంకుఁడగు నజ్బుం బోలె జా ట్టింత తో
కే డాల్గుల్కెడి దాని నెమ్మొగము? పోనీ నన్నోకింతేనిఁ దాఁ
జూడన్ జాలెనె? చక్రవర్తి సుత చూచుం బాటియే మాదృశుల్.

విదూ— (తనలో) నిక్కముగ నీయయ్యవారిబుద్ధి వెడతలఁ బట్టుటకు మనచక్రవర్తి కూఁతురే కారణము. పాప మీయన "చూపెతన్నుఁ జూడలే" దని భ్రమించు చున్నాఁడు. స్వప్నదర్శనమే కాక ప్రత్యక్షదర్శనముకూడ నైనది. (మరల వినును)

రాయ—

శా. నన్నుం బోలెడివారలెందఱిల నుండన్ బోరు? వారెల్లరున్
దన్నేఁ జూచెను నన్నె చూచె ననుచున్ దర్కింపఁగాఁ జెల్లునే?

యస్నారీమణి చూచె నేనియును నాయక్షిపరిసారంబు సం
పన్నాకూతమొ ? కాదో ? యన్యులమతుల్ ప్రత్యక్షముల్ కావుగా.

తే. గీ. కవు లతిశయోక్తి వర్ణింత్రు కావ్యముల న
టందు రెఱుఁగమిఁ గొంద, ఱయ్యతిశయోక్తి
యిప్పురముచొప్పు నిక్కమై యొప్పఁగనిన
కవి యలంకారములనుండి కడకుఁదోయు.

విదూ—(తనలో) ఇంక నేనెంతయుఁ గృతార్థుఁడనే, రాచకన్నియ చీవాట్లు నాకుఁ దప్పినవి కాని యితనిం గొంతసేపు చమత్కరించి కికురించెద (దగ్గఱఁగాఁ జని ప్రకాశము) సాధు! సాధు! జగమ్మునఁ బెక్కండ్రు పండితశ్రేష్ఠు లుండి నను బండితరాయలను బిరుదమ్ము నీకే యొప్పఁ దగినది.

రాయ—(తత్తరపాటుతోఁ జేరఁజూచి) చెలికాఁడు కాఁబోలును. ఏమి, యీవేళ నింత యాలస్య మొనరించితివి?

విదూ—నే నిప్పుడే రాలేదు, వచ్చి చాలసేపైనది. మీ రెవ్వియో యొంటిపాటున శృంగారపద్యములు చదువుచుండుట విని యంతరాయం బగుదునని లోపలికి రానొల్లక యీగవాక్షము దరిఁ గూర్చుంటిని.

రాయ—(తనలో) ఇఁక నీపరిహాసకునకు సర్వము నరఁటిపం డొలిచి చేతి కిచ్చిన ట్లయినది. "మర్మజ్ఞం న ప్రకోపయేత్" అనుటవలన వీనితో మునుపటికన్న నెక్కుడు స్నేహ మొనరించు టట్లుండ, నీమనోరథంబు వీనివలన నెఱవేర్చి కొనఁ బ్రయత్నింపవలయు. (ప్రకాశము) (చేయి పట్టికొని) సఖా

శా. ఏవైదేశికుఁడన్, జిరమ్మునకు నా కీవీట నీ నెట్టులో
దైవప్రేరణ మిత్ర మైతివి, సమత్వం బాపదన్ సంపదన్
భావింపన్ దగు మైత్రి యున్నయెడ, నాభావంబ నీభావ, మెం
దే వేఱొగతి నూహ చేసెదునుమీ? దేహం బొకండున్ వినా.

విదూ—కవిశిఖామణి! రహస్యగోపన మొండుదక్క, నావలన మీ కేకార్యమ్ము గానున్నను నయ్యది సాధ్యాసాధ్య విచారమ్ములేకయే సమకూర్చెద. ఇందులకుఁ బ్రమాణపత్రికఁ గూడ నీయఁగలను.

రాయ—చెలికాఁడా!

తే. గీ. తనరహస్యంబు నోరులు కైకొనకయుండ
దాఁచుగతి నెవ్వని దెవండు దాఁచునో? వి

ననుకొనఁగూడదు ; కాని నమ్మకముమాత్రము కుదురదు. "హాస్యగానికిఁ దేలుగుట్టె" నన్నట్లున్నది. కానిమ్ము. మాటలసందర్భముంబట్టి చూచిన నిజ మెంతో తెలియకుండెడినా ! (ప్రకాశము) ఘోటకపాయెుద్దఁ జనవుం డుటంబట్టి యతనివలనం గాపాడినను గాపాడుదువుకాని మన్మథుఁడు నీకెట్లు వశుఁడగును.

విదూ — (తనలో) ఇఁక నాయెఱిఁగినవిధమ్ము చెప్పి యితనిం గొంత యూరించెద. (ప్రకాశము) అపరమన్మథావతారుండ వనఁదగిన యో పండితాఖండలా ! నిన్నొకసారి తనయుద్యానవనమ్మునకుఁ దీసికొనిరమ్మని నీమనఃప్రియసి యిదివఱకే సఖీముఖమున నన్నుఁ బ్రార్థించుచున్నది.

రాయ — (తనలో) ఇతనిమాట లెంతవఱకు సత్యములో నిర్ణయించుట కడుఁ గష్టము కదా ! (ప్రకాశము) సంతతపరిహాసాదరముగల యోమిత్రమా ! నీమాటలు నే సేవని నమ్మ నేర్తును.

ఉ. ఇంతకుముందుఁ గొండొకయు నీవిషయమ్ము నెఱుంగ నట్లు నా
చెంతనటించు టేఁ ? యిపుడు చెప్పెడిమాటలచంద మేమి ? యా
వంతయుఁ నీదువాక్యములయందలి యర్థ మెఱుంగఁజాల, న
న్నింతకుఁ బాల ముంచెదవొ ? యేటను ముంచెదొ ? నీయధీనుఁడన్.

(తన్నుద్దేశించుకొని)

ఉ. ఎక్కడివేఁగిదేశ ? మిట కేటికి వచ్చితి ? నెందుకోసమై
యక్కట ! యిప్పు డిక్కరణి యత్న మొనర్చుచునుంటి ? ఘోటపా
యెక్కడ ? కూఁతు రెక్కడ ? మహీసురవంశకళంకమైన నే
నెక్కడ ? నాదు పాండితి యదెక్కడ ? మోహ మదెంతకున్ దగున్.

(నిట్టూర్పు నిగిడించి)

చ. కులము నతిక్రమించు టొక గొప్పగఁదోఁచ, దఖండపాండితిన్
గలిగిన తెల్విఁ బోనడఁపఁ గల్గుట కా దొకగొప్ప, మానమున్
దొలఁగుట కోర ముందడుగు దూఁగెడిఁ బ్రాణము గడ్డిపోఁచకున్
జులుకననయ్యె నియ్యువనసుందరినిన్ దర మే నుతింపఁగన్.

విదూ — ఓహోహో ! యివియేటిమాటలు ? నాలుకచిగురునుండి వచ్చెడివో ? లేక నాభీస్థానమునుండియే బయలువెడలినవో ? చతుస్సముద్రముద్రితధరావల యమ్ము నేకచ్ఛత్రమ్ముగా నేలు ఘోటకపుఁతురు తనంతన పలువనంపె నన్న మాట యీతలగోత్రములన్ దెచ్చిపెట్టినయది కాఁబోలును.

యని నాయశస్సు జగములఁబడి వెలుఁగుచున్నయది. మీకంతనమ్మిక లేనిచో నన్నుగుఱించి యెవరి నేని కొంచెము ప్రశంసించి చూడుఁడు. నాకుజ్యోతిశ్శాస్త్రమునఁ బూర్ణపాండిత్యము. అందులోఁ బ్రశ్నభాగము మఱియును ముఖ్యమైనది. విచారించిచూడఁగా నక్కన్నియ మిమ్ము మన్నించుననియు ఘోదుషాకూడఁ గిక్కురుమనక యందుల కంగీకరించుననియుం బొడకట్టినది.

రాయ—(నవ్వి) మిత్రమా! నీవు ప్రశ్నశాస్త్రమునఁ బండితుఁడవు కదా. నేను నిన్నడుగనిదే యెట్లు విచారించితివి?

విదూ— ఇది మఱియుఁ జక్కగానున్నదే. ఇంత సేపటినుండి వెళ్లఁబోసిన సోదె యంతయు నేమాయె? నన్నే నే నెఱుఁగను. నిన్నెల్లెఱుఁగుదు నన్నట్టు లున్నది.

రాయ— అది కాదు. ప్రశ్నకు దక్షిణాతాంబూలసహితముగా వచ్చికదా పృచ్ఛచేయవలసినది.

విదూ— ఇదా! ఇవి యన్నియును దానివలన జీవించు మీవంటి కుక్షింభరులకుఁ గాని జగదేకచక్రవర్తి యెవరో యెఱుఁగనివారు సహితము నన్నెఱుఁగునట్లు ప్రభుత్వ మాచరించు మహారాజనుఁ; నాకా?

రాయ— ఎన్నివిధములఁ జూచిన నొకమాటయైనఁ బరిహాసములేక చెప్పవు కాఁబోలును, ఐన నేల కాదనవలయును. "మంచిమాటలకుఁ జెవు లొగ్గవలయు" నని కదా పెద్దలు చెప్పుదురు. కాని

క. జాతియు నొక్కటి కా దఁట
నీతియునుఁ భిన్నమఁట గణింపఁగ నతఁడే
కూఁతు న్నాకిడు నఁట యిది
యేతీరున నమ్మవచ్చు నెవరు నొడివినన్.

విదూ— ఓహో! యింత వెఱ్ఱివానిని నేనెందును జూడలేదు. మీశాస్త్రపాండిత్య మేమైనదయ్యా? మొదట స్త్రీపురుషులకుఁ బరస్పరజాతిభేద మున్నదా, లేదా? అట్టివారి కెట్టు లైక్యము ఘటించుచున్నదో?

రాయ— చెలికాఁడా! చక్కఁగాఁ జమత్కరించితివి. చదువుకొనినచో నెంత బుద్ధిమంతుఁడవేని యగుదువు.

విదూ— చమత్కరించుటే యనుకొంటిరా యేమి? మనకు వారితో సంబంధము తగునా? యని సంశయించుట మాని "వారు మనకుఁ గన్నియనిచ్చుట కంగీకరింప" రనుట కేవలము పొరబాటు.

[4]

రాయ— అగును, నీవన్నమాట సత్యమే.

క. మనలోన సన్యాసస్థ
మ్మునికికి సంగీకరింప, నొకఁ డేమియుం
తన యెల్లకులములను బ్రమయ
తనమునఁ గలిపికొన నెంచుట తాను చూచెన్నాఁడో.

విదూ— వహ్వా! మీరనుమాంచిలోకజ్ఞాన మేమున్నది! నాయను సంశయముఁ బురా
తనపు శాంతి పండితుల సైతం కాదు.

రాయ— మన కేనియు నంతధైర్యము కాదుసుమా!

తే. గీ. శూద్రకన్యకఁ దనుకన చూచె మనువు
వేంకటేశ్వరుఁ డంతటివాఁడు యవన
కన్యకను బెండ్లియాడె మార్గమ్ము నట్టి
పుడమివేలుపు లంత నెక్కుడై చెలంగ.

విదూ— శేష్, ఇఁక నేమి! శాస్త్రముకన్న మనకుఁ గావలసినది శిష్టాచారమే కదా! ఇందు సందియ మెక్కడ?

రాయ— ఎక్కడనా?

తే. గీ. శాస్త్రములు నుండు నాచారసరణు లుండు
లేక యుండిన నిపుడు గల్పింప వచ్చు
నెందుచేత ఘటనంబు నిక్కమై మొనసె నేని
యడ్డు నేయవి? యట సందియమ్ము గాని.

విదూ— ఘటనంబునకుం గాక యక్కన్నె నిన్నేల వలపు సంపించెనో?

రాయ— మిత్రమా!

మ. పిలుపే సందియ, మంత నిక్క మయినన్ వేఱొప్పరింగూర్చెయో!
కలయే గంటివొ! నా మదమ్మునకు బొంకన్ బూనితో! నింటఁ బూ
వులు జన్మించునె? యెండమావుల జలంబున్ గల్గునే? గర్భరి
క్తులకెల్లన్ దలమానికంబ నగు నాకుం గోర్కెలీడేఱునే!

తే. గీ. పుట్టునంతంతన యడంగుఁ బొడము మరల
నంతలోనన నశియించు వింతకోర్కె
లతిదరిద్రుల కెందు, బాల్యమునఁ గురుల
కుం జెడిన కులకాంతల కులుకు లట్టు.

విదూ— మీరీసంశయము లిట్లుఁ జెల్లఁబోయుచునే యుందురు. నాకు భుక్తికి వేళ కావచ్చినది. "ఈనాఁటిసాయంకాలమునకు మిమ్ము వెంటఁ బెట్టుకొని వచ్చెద" నని రాకన్నియకు వార్తనంపించెదను. (తెరవంకఁ జూచి) మీ శిష్యుఁడు మిమ్ము స్నానమునకు లెండనుటకుఁ గాఁబోలును వచ్చుచున్నాఁడు.

(శిష్యుఁడు ప్రవేశించి)

శిష్య—(తనలో) ప్రతిదినమును నీవేళకు సభ్యవహార మగుటయేకాక యొక్కింతవిశ్రమించుట గూడ నయ్యెడిని. ఈదిన మీవఱకు స్నానమునకే లేపక ప్రచండ మిశ్రునితో నేదియో యాలోచించుచుఁ గూర్చున్నారు. పోయి విన్నవింతునా? పదార్థములు చల్లనారిపోవుచున్నవి. ఇంకను పార్థివలింగార్చనము మిగిలియే యున్నది. (సమీపమునకు వెళ్లును)

రాయ— (విదూషకునితో) మావిద్యార్థి వచ్చుచున్నాడు. ఇఁక నీప్రసంగము మన కుచితము కాదు. అల్లె యొనరింపుము పొమ్ము. (శిష్యునిం జూచి) ఇదిగో వచ్చుచున్నాఁడను; నీవు రా" నక్కఱలేదు, వెళ్లుము.

శిష్య— చిత్తము. ఇంకను దమరు యమునకు దయచేయవలయును గాఁబోలును. పార్థివ లింగార్చనకుఁ బుష్పములు సిద్ధము చేసియుంచితిని.

( నిష్క్రమించును )

విదూ— ( మెల్లఁగా ) మీ రీవిద్యార్థుల నెందునకుఁ దీసికొని వచ్చినారు? వీండ్రు మీసాయంకాలపుఁ బ్రయాణమునకు నంతరాయము గాకుండ మాత్రము చేసికొనుఁడు. నేను బోవుచున్నాను. ( నిష్క్రమించును )

రాయ— ( తనలో ) నాకు స్నానమును దోఁచదు, పానమును దోఁచదు. వీఁడతి వంచకుఁడు, అయినను గడు నమ్మిక గలవానివలెఁ జెప్పుచున్నాఁడు. ఏదో వీని యొద్దకుఁ గొంచెము నావిషయమై వార్తమాత్రము వచ్చియుండుట తప్పదు. లేనిచో నంతఃపురజనులు సంచరించు నుద్యానమ్మునకుఁ గొంపోనేర్చునే! కానిమ్ము. "యద్భావి తద్భవత్యేవ" ( నిట్టూర్పు నించి)

ఉ. ఈవిషయమ్ము మానుకొనుటే కడుసౌఖ్య మటంచు నెంచి లో
నావిధిచేయ నిశ్చయమునందిన యంతన మోహ మగ్గలం
బై వెనువెంటనంటు నటులైనను జేయుదునన్నఁ దోడనే
భావము వేనవేలు ప్రతిబంధకముల్ గనఁజేయు నద్దిరా!

(నిష్క్రమించును)

గద్య

ఇది శ్రీ... తిరుపతివేంకటేశ్వరవిరచితంబగు పండితరాజమ్మున
ద్వితీయాంకము.

## తృతీయాంకము

(తెర యెత్తఁగా)

మ. అదె సంధ్యాసతి సానురాగ యయి తా నంభోజబంధుం గదిసె, నె
మ్మది దానిన్ గుఱుతించెనో యనఁగ సంబంధించె జ్యోత్స్నాకృతిన్
యదనున్ వమ్మొనరింప కర్ణ్యుఁడు, తా సన్న్యాసిమోహాంధుఁడై
పద మూరించెనో నాఁగఁ జీఁకటియుఁ బర్వెన్ గొన్ని నక్షత్రముల్.

(ఇది చూళిక.)

(అనంతర ముద్యానవనమునకు లవంగియును, జెలికత్తియ మల్లికయును, రాయలును విదూషకుఁడును వెనువెంబడి వేఱువేఱుగా బ్రవేశింతురు.)

లవం.—(తనలో) హృదయమా! కాలమతిక్రమించుచున్నది. ఇఁక నీయాశ నిరాశ యగుట కేమి సందియము! (ప్రకాశము) చెలీ! మన మింటికి వెనుక కేల మరలఁ గూడదు?

మల్లి— ఏమి, ఇంత తత్తఱపడియెదవు? మనప్రపంచమున్ దప్పించితి సార్వభౌము నియ్యెడకున్ దోడ్కొని వచ్చువేళ కాఁవచ్చినది. ఇఁకఁ గొండొక తాళి పోవుదము.

రాయ— సఖా! అటు గనుఁగొనుము.

ఉ. చీఁకటి పోవుచున్న యది, శీతకరుం డుదయించుచున్నవాఁ;
డేకడఁ జూడ వెన్నెలలు హెచ్చఁదొడంగె; నిఁకేటిమాట, యా
కోకకుచం గనుంగొనెడికోర్కె ఫలించునె? యింతసేపు తా
రాకేటు లూరకుండు? ననురాగము గల్గుట నిక్కమేనియున్.

విదూ— మన మిప్పుడకదా! యిందులకు వచ్చితిమి. ఇంతలోనే యింతతత్తఱపాటా! ఎంత యనురాగము గల దైనను బ్రథమసమాగమమున "భర్త వెదుకొనవచ్చు" ననినేను వినలేదు. మీరు మహాకవీశ్వరులు, మీ రెక్కడనేని యట్లు చదివియుందురేమో!

రాయ—సఖా! నాతాత్పర్యము చక్కఁగాఁ దెలిసికొనక యేల వృథా పరిహసించెదవు?

తే. గీ. సంజపొద్దున కిటకు నక్కసకియ తోడి
తెమ్మనుచు నీకు వార్త నందించె నంటి

పదియ నిజమేని యబల దా నంతకన్న
మున్న రావలె నదియ ప్రేమునికి గుఱుతు.

విదూ— వచ్చియేయుండునుగాని యెయ్యెడల సేవినోదమ్మునఁ బ్రొద్దు పుచ్చుచున్న దియో! నలుదెసలు సరికించినఁగాని మనకెట్లు తెలియును?

రాయ— ఇంతవఱకుఁ ద్రిప్పినది చాలకా యేమి?

విదూ— ఇది యంతయు నాకే యుపకారముగా నున్నదే!

రాయ— (తనలో) వీని నూఁతఁజేసికొని యిమ్మహావిషయమునఁ బ్రవర్తించుట కుక్కతోఁక పట్టుకొని గోదావరి కడ్డుపడినట్లున్నది. (ప్రకాశముగ) త్రోవ దీయుము, నీ వెంబడి వచ్చుచున్నాను.

విదూ—ఇదిగో యీ సంపంగివృక్షముల చాలు ననుసరించి పోవుదము(పరిక్రమింతురు)

లవం— (తనలో) ఓహో! యేమి యీవెన్నెలలు నాకు మిగుల నవళత గలిగించుచున్నయవి. వీనికిఁ దోడు మలయానిలము లెందులకో! (నిట్టూర్పు పుచ్చి ప్రకాశము) చెలీ! స్వప్నము నిజ మని యెంచికదా మన కీవెఱ్ఱియడియాస.

మల్లి— ఏ మట్లనుచున్నావు! ఇంతలో నసత్య మేల కావలయును?

లవం— నిశ్చయముగా నసత్యమే కాని స్వప్నమైన తత్క్షణము మాత్రము నిదుర లేచు లోపల నంతయుఁ బ్రత్యక్షానుభవమువలెఁ బొడకట్టెను.

మల్లి— అగునుజామీ! నాటకముగూడ నిదేమాదిరి; చూచుచున్నంతసేపు నిజమైన కథానాయకులు సుఖదుఃఖము లనుభవించునట్లె యాత్మ తన్మయమై తదనుగుణ భావమ్ము లనుభవించును. పిమ్మట నిట్టులే క్రమముగాఁ బరిణమించెడిని.

లవం—నాటక మనిన వేఱె యున్నదా, మనబ్రతు కంతయు నిట్టిదే; ఐనను నేదో శాశ్వత మని వెఱ్ఱివెఱ్ఱిప్రయత్నములు సలుపు చుందుము. తనకు పైత్యభ్రమము గలిగి జగము దిరిగినట్లు బొడకట్టినను నిజమున కయ్యది నిశ్చలమే సుమా!

మల్లి— అట్లేల యనవలయును? ప్రాప్తికాలమునకుఁ గాకతాళీయమ్ము కాఁగూడదా? అది కాక నీవంటి జగదేకసుందరిచే స్వయముగ నాకాంక్షింపఁబడియు వికృతినొంద కుండుటకు నాయన మనంబేమి శిలయా?

లవం— (కోపముతో) దుర్మార్గురాలా! అయ్యనఘు నట్లేల యనవలయును?

ఉ. జననము నందితిఁ గడుఁ బ్రశస్తము గాని తురుష్కజాతియం,
దనఘుకులోద్భవుం డతఁ; డహో! యెటు నాచపలాంతరంగవ
ర్తన కనుకూలుఁడౌ? నిది వృథాశ్రమ; మింతకుఁ జాలెమ్మ్యముల్
మన మెఱుఁగంగ నీయ, దనుమానము మాన; దిఁకేమి సేయుదుఁ,

మల్లి— సఖీ! యింకను గాలాతిక్రమణమ్ము కాలేదు. నీవేల యిట్టి తత్తలపాటు చెందెదవు. ఈనాఁటి మన ప్రేమంపుమిత్రోదయ్యానమునకు నాథుఁడు వచ్చి యుండవలెను. నిన్నదినమందే యాతఁడు చూచి నిలిచి గొని యున్నవాఁడనికదా నాతో నాతఁడు చెప్పి యున్నాఁడు. నిష్కారణముగ వృథా నిందించుకొనియెదవు. సంక్రీడాసరోవరము నొద్దను నుండి వలువెసలు నికేతనింతము రమ్ము (అట్లొనరింతురు)

రాయ— (విసువుతో) నన్నుఁ సుజనునిగా నెంచి నాఁబోలుచు మిన్నక యీకుజనులవెంటఁ ద్రిప్పుచున్నాఁవేవు. నీవంటి మిత్రులవలన నీప్రాయశ్చిత్తము నాకుఁ గావలసినదియే.

విదూ— ఓహో! ఇది మఱియు బాగుగనున్నదే! వచ్చినది యుద్యానవనము కదా? ఎయ్యెడల నే క్రీడామృగమ్ములఁ గాంచుచు నీరసవినోదమ్ముల మసలుచున్నదియో యొక్కింత పరికింపక యిట్లు కష్టపడితిని.

రాయ— ఇదివఱ కొకసారి యిట్లు పలికితివి. అప్పు డందులకని యూరకుంటిని కాని యిపుడు నీ రసవిహీనతకు నాకుఁ గోపము పుట్టుచున్నయది.

చ. దయితు నధీనమైన మదిఁ దాల్చు నెలంతల కెందు నొండుగో
ర్కె యుదయ మంద, దెయ్యెడలఁ బ్రీతి జనింపదు వేయు నేల? ని
శ్చయముగ స్వర్గలోకసుఖసంపద తాఁ గాదు రోసి దెంచినఁ
గయికొన నిచ్చవుట్ట, దొకకాంతుని సంస్మరణంబె సర్వమున్.

విదూ— అసత్యవాదులగు మీవంటి కవీశ్వరు లంత యిట్లిగా వర్ణింపుమాత్రమే కాని నిజమ్మున కంతయుం గనవట్టదు "ఇదిగో పులియంటే, అదిగో తోఁక" యన్నట్లు, ఒకరినిఁ జూచి యొకరు మఱింత యననుగుణముగ వ్రాయుదురు. కాని యవి యన్నియును ననుభవవిరుద్ధమ్ము లగుటం జేసి యనాదరణీయమ్ములు. పలువురు నెలంతలు కోరి యుండిరి; కాని మీరు చెప్పినంత కాదుకదా, అందులో శతాంశమేని వెఱ్ఱితనము నాకయ్యెడఁ గనవట్టలేదు. ఇంతయేల, ఇట్లు చెప్పుచుంటిరి కదా! మీరీదినమ్మున సర్వసంగపరిత్యాగ మేల చేయలేదో?

రాయ— నన్ను నీ వేమి తెలిసికొంటివి?

ఉ. వచ్చినశిష్యులం గనియు వారికిఁ బాఠము సెప్ప నైతి, లో
హెచ్చినతాపపుంగరిమ నించుకయుం భుజియింప నైతి, నా
పచ్చనివింటిజోదుపయి భారము నైచితి, నంతలోన నీ
యచ్చకము న్నిజం బనుచు నే నొనరించితి సబజ కంజలుల్.

విదూ—అవును. బీదబాపనయ్యకు రాచకన్నియ దొరకొన నున్నప్పుడు క్రోఁతికిఁ గొబ్బరికాయ సామెత గలిగినను, "చూచినకళ్ల వెత్తి" యన్నట్లాపె మహారాజు పుత్త్రి, యేదో కారణమున ననునుగుణానురాగమ్ము నందినను నయ్యది యేవినోదమ్మున నైనను మఱపుం గన వచ్చును.

రాయ—(కోపముతో) ఐనచో సమ్మతమే. ఇంత యెఱిఁగియుండియు నన్నెందుల కిక్కడికిఁ దోడ్కొని వచ్చితివి? కడచినదాని కేమి గాని నా కాకన్నియయు నక్కఱ లేదు. మఱి యొండును వలదు. నీపుణ్య మాయె నిక్కడ వేఱొం డవమానమ్ము లేకుండ యథాస్థానమ్మునకైనఁ గొనిపొమ్ము.

తే. గీ. మొదలఁ బరిహాసమున కాదిమూర్తి వనుచు
నిన్నెఱింగియు నీవల నేను బడితి;
దాని కేమి, పురాకృతమైన కర్మ
ఫలము తప్పఁగఁ జేయ నెవ్వరితరంబు.

విదూ—(వినుట యభినయించి) బ్రాహ్మణోత్తమా! ఇంచుక తడవు సైపుము. నే నిదె కొంచెము పోయి వచ్చెదను.

రాయ—(చేయి పట్టుకొని) చెట్టెక్కించి నిచ్చెన దీసిన ట్లిదికూడనా?

ఉ. కత్తులబోనుకన్న నధికమ్మిది, న న్నిట డించిపోయి నే
వత్తు నటంచుఁ బల్కెదవు! వైఖరియే యిది? యెవ్వరేని న
న్నిత్తఱి సేవకుల్ గనిన నేమని యుత్తర మిచ్చువాఁడ? నీ
పొత్తున ముప్పు మూఁడె, సరిపో యిఁక బుద్ధిజనించె నాకొగిన్.

విదూ—(నవ్వుచు) తెలుఁగుదేశపు బ్రాహ్మణులు మిక్కిలి పిరికివాండ్రని వినుటయే కాని నేఁటికిఁ బ్రత్యక్షము కూడ నైనది. ఈఁగకేని చొర నశక్యమ్మగునంతిపురమ్మున జగదీశుపుత్త్రితోఁ గలయ నుంకించుచుంటివికదా! నీ కట్టిమహాయోగము చేకూరినను "పిరికితనము తుద నెగ్గించెడినా" యని నాకు సందేహముగా నున్నయది. కొంచెమేదో అలుకుడు వినవచ్చుచున్నది చూచివత్తునని నేఁ బోనీకున్న నే నెట్లు కార్యము పొసఁగింపఁ గలను?

రాయ—(చెవియొగ్గి) నీకేమివిననైనదో కాని నాకాయాతటాకమ్ములదరిన్ గూయుచున్న మండూకమ్ములును, గీచురాళ్లును దక్క వే ఱెయ్యదియుఁ గానరాదు. వృథాగా నన్నిట డించిపోకుము.

ఉవర—చెలీ! నిక్కముగా నాస్వప్నమునఁ జూపట్టిన మహానుభావుఁడు మన ప్రభుండమిత్రునికి మిత్త్రుఁడనియేనా నీనమ్మకము?

మానము వచ్చినను యుక్తమే. అయినను నియ్యెడ నీదోసమేమున్నది ? నావిధి యిట్లున్నది.

మ. శిరసే యూడెడినో ? శిరోజములకే చేట్పాటు వాటిల్లునో ?
మరియాదే చెడునో ? మఱేమి యగునో ? మానానకే మోసమో ?
పరమే వోయెడినో ? యిహమ్మె తెగునో ? పాపంబె చేకూరునో ?
పరకీయాసుఖవాంఛలోన నను దూర్పన్నీకు మేలే ? విధీ.

విదూ— ఊరకే యన్నాను గాని మిమ్ముఁ జూచినను వారేమియు ననరు. మీర నిన నెంతో ఫాదుషాగారికి గౌరవము. వీరె వారని యెఱుఁగకున్నలోటు తీర్చుటకు నేనుండియే యున్నాఁడను గదా.

రాయ— ఛీ ! అడుసుఁ ద్రొక్కనేల ? కాలు కడుగనేల ? నీవు సంకేతము మఱియొక్కచోట నెందున కేర్పాటు చేయఁగూడదు?

ఉ. "స్త్రీలకుఁ దక్క వేఱొకరు చేరఁగ రానిప్రదేశ మంచు నీ
వేల యెఱుంగ ? వియ్యెడకు నేటికి వచ్చితి" వంచు నెవ్వరేఁ
దూలఁగ నాడ నుత్తరము దోఁపమిఁ గల్గెడి సిగ్గుకన్నఁ బ్రా
ణాలకు భంగ మున్నది ఘనమ్మగు నే యభిమానశాలికిన్ ?

విదూ— అందునకే మొట్టమొదట నొక యాలోచన చేసినాఁడను; గాని చేయ నిది యిప్పుడు చెప్పిన లాభమేమున్నది ?

రాయ— అది యేమి యాలోచనము ?

విదూ— చిన్నయుపాయము చేసినచో మీకును నాకునుం గూడ భయముండక పోవును. దానికేమంత విశేషప్రయత్న మక్కఱయే లేదు. ఒకగాగరాయును ఒకమైఁకయుఁ గండువాయును ఉన్న సరిపోవును.

రాయ— అప్పుడు మాత్ర మియ్యంగన యెవరన్న నేమిచెప్పఁగలవు ?

విదూ— ఇప్పుడు మీతో నేల చెప్పవలయును ? ఏదో నాపాట్లు నేను పడఁగలను. "నాయుంపుడుకత్తె యొకసారి యిక్కడకుఁ దీసికొని పొమ్మని కోరినద"న్న నన్నేమియు ననక పైపెచ్చు మనయిరువురంజూచి కొంతసేపెంతో యానందించును. ఇదివఱ కిట్టి గండము లిక్కడ నే నెన్ని తప్పించుకొనలేదు ?

రాయ— ఛీ ! మూర్ఖుఁడా.

చ. గెలిచితి నెల్లపండితులఁ గీర్తివహించితి నెల్లదిక్కులన్
గులమున వర్తనమ్మునను గొంకొక యించుక లేనివాఁడ ని

త్తలఁ బొకఁడే కళంకమును గూర్చిన నార్చెడి నిట్టి సన్నిటుల్
పలుచఁగఁ జూచి చుల్కనసుఁ బాత్రునిఁ జేయఁగ నీకుఁ బాడియే.

విదూ.—సర్వము నెఱింగిన వారలయ్యు నిట్టుల కోపగించెదరు? కార్యానుసారమ్ముల పట్ల నప్పటి కనుగుణమ్ముగ మెలఁగుట గౌరవభంగకమ్ము గానేరదు. వసు దేవుఁడు గాడిదకాళ్ళు పట్టుకొనుట యెఱ్ఱ నెఱుఁగనిది.

రాయ.—(శాంతించి) అగును. "భక్షితేపి లశునే నశాంతిః" యన్నట్లెన్ని పాటులు పడినను ఫలకారి గాని యప్పు డెంగుల కీయవమానములు?

చ. తురకని యంట, విప్రుఁడంట! దుర్జయుఁ డౌకవి యంట! బాన్స్వై
పరు వెడసేసి తాఁబడినపాటుల కెల్ల సహించె నంట! త
త్తఅపడుమాత్రమే తనకుఁ దానదియుక్ లభించు దంట! యం
చఱతురు లోకు లిట్టియడియాసయుఁ జెల్లునె నన్నుఁబోటికిన్.

విదూ.—(నవ్వి) ఆర్యవర్యా! నిక్కముగ నీయుద్యానవనము బాదుషా రాఁ జగినది యనియే నమ్మితిరికదా! అంతచక్రవర్తికి నెన్ని యుపవనము లుండునో మీరాలోచింప రైతిరి. అంతఃపురచారిణులకై యేర్పఱుపఁ బడినవి వేఱే, తమకు వేఱే, యుభయులకును వేఱే, కూఁతులకు వేఱే, కొమరులకు వేఱే; మొత్తము చేసినచో నొక్క యంతఃపురమునకే కొన్నినూఱులు క్రీడా వనమ్ము లుండును జూఁడీ!

రాయ.—(ఆశ్చర్యముతో) అయిన నీప్రభువునకు భార్యలు సందలకొలఁది కాఁబోలు.

విదూ.—లెక్కేమిటి? కంటి కింపుగాఁ గనఁబడిన దేవర్ణమైనను దీసికొనివచ్చుటయే వీరియాచారము. ఏనాఁటికానాఁడు వీరలసంఖ్యకు వృద్ధియేకాని క్షయములేదు.

రాయ.—ఇందులోఁ గొందఱు బ్రాహ్మణస్త్రీలు గూడ నుందురు కాఁబోలును,

తే. గీ. "బలవిహీనుని కన్యనిభార్య యంచుఁ
దనకళత్రం బటంచు భేదమ్ముగాని
సొగసుగలదెల్లఁ దనచేతిసొమ్మె కాక
బలము గలిగినవాని కేర్పాటుగలదె."

అని చంద్రుఁడు బృహస్పతిగారి భార్య నపహరించి తన్ను మందలింప నుంకించు నింద్రున కుత్తరము చెప్పినట్లున్నది. వీరికిఁ జంద్రుఁడు దైవము గనుక నతని సిద్ధాంతమునే యవలంబించి పరభార్యల నందఱను స్వభార్య లుగఁ జేసికొనుట యాచారమైయుండును.

శా. "ఆరాజేంద్రుఁడు రాత్రియుం బవలు కామాసక్తుఁడై యారిలో
నీరేజేక్షణలన్ బలాత్కృతిగ నెంతే బాధపెట్టంగ నా
యారన్ గాఁపురముండువార లొకనాఁ డొక్కొక్కఁ డాత్మీయయా
దారన్ బంపెదనన్న నొప్పెనఁట, యాతం డెంతధర్మాత్ముఁడో."

ఇది వీరలచేతిక్రింది చిన్నిచిన్ని జమీనులు పాలించెడిరాజుం గూర్చి వెనుకటి కెవరో చెప్పినదఁట. వారికిని నిట్టి దుర్వృత్తి వీరలవలననే యలవడి యుండనగు. "యథా రాజా తథా ప్రజాః" "రాజానుమతో ధర్మః" అనుట కల్ల యెట్లగును ?

విదూ— ఎవరో యన నేల ? మీ చే నిప్పుడు కోరఁబడెడి కన్యక బ్రాహ్మణస్త్రీ యందు జన్మించినదే యని చెప్పుదురు ; కాని పాపము ఈమె గర్భమున నున్నయప్పుడే యేనో యొక యుద్ధపు టలజడిలో నామెను జెఱఁ దీసికొని వచ్చుకతన నీమె యిర్యోడనే జన్మించుటచే నిది యంత స్పష్టముగా లోకు లెఱుఁగరు.

రాయ— (సంతోషముతో) చెలికాఁడా! నీమాట మున్మాటికిని నిక్కమే. ఏమనిన,

చ. పరమపవిత్రుఁడై మిగులఁ బండితుఁడైతగు పేరుభొట్లకున్
పరగుణరాశియైన లక్ష్మమ కపత్యము వీఁడెటు లంత్యజాతియౌ
తురకవెలందిఁ గోరెడి, విధుపత్రిమానన బ్రహ్మజాతియే;
స్థిరమిది నమ్మనయ్యోడిని క్షేత్రియునుం దగు బ్రహ్మజాతియై.

ఇదివఱ కెన్ని సారులో యీపత్రశంస వచ్చినను జెప్పవైతివి కారణమేమి?

విదూ— (వికవికనవ్వి) మీరు కల్లు ద్రావుటకు మడి గట్టుకొనుచందమ్మున నిట్లు సంతసించుచున్నారేకాని యీమె తల్లిని ఫాదుషా నిఖా చేసికొన్నాఁడు. ఏవర్ణమైనను నొకటే, అదియైన పిమ్మట వీరిలోఁ జేరుట యాచారము.

రాయ— అంతకు మున్నే యీకన్నియను గన్నయట్లు కదా నీమాటవలనఁ దేలినది, నాకంతే చాలును. దీని కేమిగాని "నేనిక్కడ నొంటిగానున్నను భయము లే"దని జెప్పితివి గాన నీవేగి త్వరలో వత్తువా ?

విదూ—మీరీమావిగున్నక్రింద నుండుఁడు. ఇంతలోఁ బోయి వారలు వచ్చి యెచ్చట నేని యుండిరా సరియే, లేనిచో నంతఃపురమున కేనిపోయి వెంటఁబెట్టుకొని వచ్చుచున్నాను. మీకియ్యోడల నించుకయు భీతిలేదు.

రాయ— మాట లెక్కడనో వినవచ్చినవని మరల నిట్లనియెదవేమి? దీనిలోనేదో

మోస మున్నదని నాకు సంశయము, ఆకన్నియయే దైనయపుడు నేను గూడ వచ్చిన నేమగును?

విదూ—— రానేవచ్చును గాని, కామినుల చిత్తములు క్షణక్షణములని యూహింపఁగ నిది కాదు. అందులోఁ బ్రభుకన్యక, ఎటుపోయిన నెటు వచ్చునో! ముందుఁ బోయి చెప్పఁదగు సంగతులు చెప్పి వెంటఁబెట్టికొని పోయెద.

రాయ—— అట్లయిన నీయిష్టము వచ్చిన ట్లొనరింపుము పొమ్ము.

విదూ—— (నిష్క్రమించును)

లవం—— (నిట్టూర్పు విడిచి) చెలీ! యిఁక నెంతసేపు చూతుము? పోవుదము రమ్ము.

మల్లి—— సఖీ! వచ్చెడివేళ యతిక్రమించ లేదు, ఇయ్యది యుపవనమని పేరుగాని మహారణ్యమంత యున్నది. యిక్కడికి వత్తుమనియే చెప్పితిని గాని స్థల నిర్ణయముచేయ మఱచితిని, వచ్చుట మాత్రము నిశ్చయము.

లవం—— ఎవరు! ప్రచండమిశ్రుఁడా?

మల్లి—— కాదు, ఇరువురును.

విదూ—— ఇదిగో నేను వచ్చితిని (ప్రవేశించును)

లవం—— (చూడనియట్లు నటించి తాపమునూచించి)

మ. అనురాగం బది కన్నుఁ గానదు, మనం బా మిత్తుపల్లమ్ములన్
గన కెచ్చోటకు నైన నేగు, నిఁక వేడ్కల్ మంచియున్ జెడ్డయున్
మునుపే నేరవు, మన్మథుండు చపలాత్మ్యుం డెంతయున్ మూర్ఖుఁ డం
గనలన్ లోకువఁ జేసి మీఁదఁబడు శక్యంబె నివారింపఁగన్!

(మూర్ఛిల్లును)

విదూ—— భర్తృదారికా! నాతోఁ జెప్పుము వాఁ డెవఁడో యీదుడ్డుకఱ్ఱతోఁ బడమోఁది వదలిపెట్టెదను.

మల్లి—— (తత్తఱపాటుతో) తరువాత మోదవచ్చును గాని రాజపుత్రి కతివ్యామోహ మ్మున నిట్టియవస్థ సంభవించినది. అదిగో ఆ సరోవరము నొడ్డుదరి నున్న లేఁతతామర పాకులు రెండు తీసికొనిరమ్ము.

విదూ—— ఇదిగో వెళ్లి వచ్చుచున్నాను (నిష్క్రమించి ప్రవేశించును)

మల్లి—— సఖీ! (అని పిల్చుచు మెల్లగా వీచును)

లవం—— (కొంచెము మూర్ఛ దెలియుచున్నది.)

మల్లి—— (సంతోషముతో) చెలీ! అదిగో వచ్చినాఁడు చూచితివా! నే నసత్య మాడ లేదు కదా!

లవం—— (కను లటువిప్పి మరల మూయుచున్నది.)

విదూ—— భర్తృదారికా! నీమనోహరుం గూడ వెంటఁ బెట్టికొనియే వచ్చినాఁడను.

లవం—— (మరల కనులు విప్పి నలుదెసలు చూచి వైమనస్యము నభినయించును)

మల్లి—— చెలీ! సంతాపము తగ్గినదా?

విదూ—— చెలియొకతోవ యగుటచే నొక్కింత యాలస్యమగుటకు సహింపవలయు. అదిగో! ఆమావిగున్నక్రింద నీప్రియతముఁ డున్నవాఁడు.

లవం—— (లజ్జయును బ్రేమమును సూచించుచున్నది)

మల్లి—— ఆర్యా! మధ్యవిడిది యేలచేసితివి! ఇయ్యెడకే తీసికొని రాకపోతివా!

విదూ—— నీకేమి! బానిసకూఁతురవు, చెప్పెదవు. ఇది అంతఃపురపు వ్యాపారము. "నిన్నుఁ జెప్పకుండనే యెవరు తీసికొనిరమ్మన్నా" రనినచో నేమి చేయుదును ఎఱుఁగనట్లు మాటాడితివి కాని, యెఱుఁగవా! ప్రతిదినము ఫాదుషా గూడ వార్తనంపి సెలవైన పిమ్మటనే యంతఃపురికిఁ బోవుట? అందులో నెన్నివార్తలు! ఫారాయొక్కంటికి సెలవులు మూఁడు కావలయును.

మల్లి—— అవును. అదియును నిజమే.

లవం—— (వినుగుతో) ఓహో! మీయిద్దఱ యుత్తరప్రత్యుత్తరములు కడు రమ్యముగా నున్నవి. అతఁడు చెప్పుటకును నీవు వినుటకును సరిపోయినది. మన కీ తురకసంప్రదాయమే కావలెను కాఁబోలును.

మల్లి—— మనకాసంప్రదాయము కాక మఱియొక్కటి యెట్లు వచ్చెడిని. మనము మాత్ర మెవరము?

విదూ—— భర్తృదారికా! నీపుట్టువును గూర్చి నాయెఱిగినంత యాతనికిఁ జెప్పినాఁడను జుమీ.

లవం—— (తనలో) జుగుప్సాకర మని యెఱుఁగక చెప్పినను నిక్కడ నిది గొంత యుపయోగమే అగును.

మల్లి—— సఖీ! అది యేమిటి, ఇతఁ డేదో చెప్పితి ననుచున్నాఁడు?

లవం—— ఏ మున్నది, నాదురవస్థయును, మాతల్లి తలవ్రాఁతయును! పరిశుద్ధ మగు కాశ్మీరదేశమునకు నొక్కఁడే సచివుఁ డనిపించుకొన్న కుమారభట్టునకు నపజయ మొదవించిన భగవంతుని కెంత యక్కటికము లేదో?

విదూ—— ఆయన పేరిదియా? నే నిదిమాత్రము చెప్ప లేదు.

మల్లి—— సరి తెలిసినది. అట్లయినచో నిక్కడ నందఱును బ్రాహ్మణకన్యకలే. ఎల్లరును మా లెతలే! ప్రక్కృతము చూచుకొనవలె! మనము వెనుకజన్మమున

మోస మున్నదని నాకు సంశయము, ఆకన్నియయే స్థైనయప్పుడు నేను గూడ వచ్చిన నేమగును?

విదూ — రానేవచ్చును గాని, కామినుల చిత్తములు క్షణక్షణములని మీరెఱుంగనిది కాదు. అందులోఁ బ్రభుకన్యక, ఎటుపోయిన నెటు వచ్చునో! ముందుఁ బోయి చెప్పఁదగు సంగతులు చెప్పి వెంటఁబెట్టికొని పోయెద.

రాయ — అట్లయిన నీయిష్టము వచ్చిన ట్లొనరింపుము పొమ్ము.

విదూ — (నిష్క్రమించును)

లవం — (నిట్టూర్పు విడిచి) చెలీ! యిఁక నెంతసేపు చూతుము? పోవుదము రమ్ము.

మల్లి — సఖీ! వచ్చెడివేళ యతిక్రమించ లేదు, ఇయ్యారి యుపవనమునఁ జేరుగాని మహారణ్యమంత యున్నది. యిక్కడికి వత్తుమనియే చెప్పితిని గాని స్థల నిర్ణయముచేయ మఱచితిని, వచ్చుట మాత్రము నిశ్చయము.

లవం — ఎవరు! ప్రచండమిశ్రుఁడా?

మల్లి — కాదు, ఇరువురును.

విదూ — ఇదిగో నేను వచ్చితిని (ప్రవేశించును)

లవం — (చూడనియట్లు నటించి తాపమునుసూచించి)

మ. అనురాగం బది కన్నుఁ గానదు, మనంబా మిట్టిపల్లమ్ములన్
గన కెచ్చోటకు నైన జేగు, నిఁక వేడ్కల్ మంచియున్ జెడ్డయున్
మునుపే సేరవు, మన్మథుండు చపలాత్ముం డెంతయున్ మూర్ఖుఁ డం
గవలన్ లోకువఁ జేసి మీఁదఁబడు శక్యంబే నివారింపఁగన్!

(మూర్ఛిల్లును)

విదూ — భర్తృదారికా! నాతోఁ జెప్పుము వాఁ డెవఁడో యీదుడ్డుకఱ్ఱతోఁ బడమోఁది వదలిపెట్టెదను.

మల్లి — (తత్తఱపాటుతో) తరువాత మోదవచ్చును గాని రాజపుత్రి కతివ్యామోహమ్మున నిట్టియవస్థ సంభవించినది. అదిగో ఆ సరోవరము నొడ్డుదరి నున్న లేఁతతామర పాకులు రెండు తీసికొనిరమ్ము.

విదూ — ఇదిగో వెళ్లి వచ్చుచున్నాను (నిష్క్రమించి ప్రవేశించును)

మల్లి — సఖీ! (అని పిలుచుచు మెల్లగా వీచును)

లవం — (కొంచెము మూర్ఛ దెలియుచున్నది.)

మల్లి — (సంతోషముతో) చెలీ! అదిగో వచ్చినాఁడు చూచితివా! నే నసత్యమాడ లేదు కదా!

లవం—— (కను లఱవిప్పి మరల మూయుచున్నది.)

విదూ—— భర్తృదారికా! నీమనోహరుం గూడ వెంటఁ బెట్టికొనియే వచ్చినాఁడను.

లవం—— (మరల కనులు విప్పి నలుదెసలు చూచి వైమనస్యము నభినయించును)

మల్లి—— చెలీ! సంతాపము తగ్గినదా?

విదూ—— చెలియొక్క త్రోవ యగుటచే నొక్కింత యాలస్యమగుటకు సహింపవలయు.
అదిగో! ఆమావిగున్న క్రింద నీప్రియతముఁ డున్నవాఁడు.

లవం—— (లజ్జయును బ్రేమమును సూచించుచున్నది)

మల్లి—— ఆర్యా! మధ్యవిడిది యేలచేసితివి! ఇయ్యెడకే తీసికొని రాకపోతివా!

విదూ—— నీకేమి! బానిసకూఁతురవు, చెప్పెదవు. ఇది అంతఃపురపు వ్యాపారము.
"నిన్నుఁ జెప్పకుండనే యెవరు తీసికొనిరమ్మన్నా" రనినచో నేమి చేయు
దును ఎఱుఁగనట్లు మాటాడితివి కాని, యెఱుఁగవా! ప్రతిదినము పాదుషా
గూడ వార్తనంపి సెలవైన పిమ్మటనే యంతఃపురికిఁ బోవుట? అందులో
నెన్నివార్తలు! ఘారాయొక్కంటికి సెలవులు మూఁడు కావలయును.

మల్లి—— అవును. అదియును నిజమే.

లవం—— (విసుగుతో) ఓహో! మీయిద్దఱ యుత్తరప్రత్యుత్తరములు కడు రమ్య
ముగా నున్నవి. అతఁడు చెప్పటకును నీవు వినుటకును సరిపోయినది. మన కీ
తురకసంప్రదాయమే కావలెను కాఁబోలును.

మల్లి—— మనకాసంప్రదాయము కాక మఱియొక్కటి యెట్లు వచ్చెడిని. మనము
మాత్ర మెవరము?

విదూ—— భర్తృదారికా! నీపుట్టువును గూర్చి నాయెఱిఁగినంత యాతనికిఁ జెప్పి
నాఁడను జుమీ.

లవం—— (తనలో) జుగుప్సాకర మని యెఱుఁగక చెప్పినను నిక్కడ నిది గొంత
యుపయోగమే అగును.

మల్లి—— సఖీ! అది యేమిటొ, ఇతఁ డేదో చెప్పితి ననుచున్నాఁడు?

లవం—— ఏ మున్నది, నాదురవస్థయును, మాతల్లి తలవ్రాఁతయును! పరిశుద్ధ మగు
కాశ్మీరదేశమునకు నొక్కఁడే సచివుఁ డనిపించుకొన్న కుమారభట్టునకు
నపజయ మొదవించిన భగవంతుని కెంత యక్కటికము లేదో?

విదూ—— ఆయన పేరిదియా? నే నిదిమాత్ర మాసు చెప్ప లేదు.

మల్లి—— సరి తెలిసినది. అట్లయినచో నిక్కడ నందఱును బ్రాహ్మణకన్యకలే.
ఎల్లరును మాలెతలే; పరిస్థితము చూచుకొనవలె; మనము వెనుకజన్మమున

నేమృగములవో యేపక్షులవో! ఇప్పు డామాట లేటికి? దీని నేమి, మనమే యమ్మహామహుని దర్శనమునకుఁ బోవుదమా ? మాయపరాధమునకు క్షమా ర్పణగా నుండును.

లవం— ( ఊరకుండును )

మల్లి— ఆర్యా! అయ్యోడకు మున్ముం దీసికొని పొమ్ము.

విదూ— ఇదిగో, ఈసురపొన్న చెట్టుల చాలువెంబడిని పోవుదము రండు.

మల్లి— చెలీ! నన్నుగలంబించి మెల్లగా నడువుము.

లవ— (అట్లొనరించుచున్నది) (అందఱును యథోచితముగా పరిక్రమింతురు)

రాయ— (విసుగుట సూచించి)

క. చెలికాఁ డెచ్చటికేగెను ?
చెలి యెయ్యెడ నాదురాక చిత్తమునం దు
మ్మలిక మెయిఁ గోరుచున్నదొ ?
కలుగునొకో ? యింతనేని కలికిం గనఁగన్.

(నలుదిక్కులు చూచి) ప్రియురాలా! నే నిక్కడఁబడెడి యవస్థ యొకిం తేని నీకుఁ దెలిసిన నింతయాలస్య మొనరింపవుకదా!

శా. రా నుద్యోగము చేయుచుంటివొ, వడిన్ రాఁబోయి రాలేక శం
కానిర్విణ్ణత గాంచుచుంటివొ! యొరుల్ గామింపఁగా రాదు త
ప్పౌనంచున్ మది నెంచుచుంటివొ? సగంబాయె న్నిశాభాగ మె
ట్లైనన్ ధైర్యము పాదుకొల్పి యిటు రమ్మా! పూర్ణచంద్రాననా.

శా. ఏ నెన్నం డిటువంటి కార్యములపై నిచ్చన్ బ్రవర్తింపఁగా
నీ, నీమోహము నిక్కమే యనుచు నిక్లైతెంచితిన్; దీనిలో
నానందం బిసుమంత, యిందులకు నాయాసంబు బల్మెండు; మా
మైనన్ జాగుదు గాని వేగ నిటురమ్మా! పూర్ణచంద్రాననా.

అయ్యో, మన్మథా! నీ వెంత నిర్దయుఁడ వైతివి. రసాభాసాను రాగము గల్పించుట నీకు మెప్పగునని యెంచితివా? ఇంతకు నీ నేమి చేసెదవు? నావంటి దరిద్రుని కట్టియదృష్టమా! నాప్రియురాలు నన్ను నుగ్ర హించినచో నీలత్ను మెవరికి? నిన్నుఁ బతిమాలికొనుటకన్నఁ దాప మార్పఁ గల యక్కలికిమిన్న నే స్మరించుకొనియెదను.

శా. సంకేతమ్మునుజేరి యచ్చటఁ బ్రియాసాక్షాత్కృతిం గోరి యా
శలన్ జెందుచు లోనఁగుందుచు ధృతిన్ జాలించుచున్నంత నా

రంకూద్యచ్చకితాయతాక్షి యరుదేరం గాంచు భాగ్యమ్ము సూ
నాంకాశీర్వచనాభిషిక్తులకుఁ గాదా ? కల్గు వల్గుస్తనీ.

( నలుదెసలు పరికించి )

ఆహా! యితఁ డేగి యెంతసేపైనది, ఎయ్యెడను నలుకు డైనను విన రాలేదు. ప్రియురాలు రాలేదనుటయే నిక్కవము, అయినచో నితఁ డేందు నకు రాకుండెడిని? అవును, అంతఃపురమున కేని చని వెంటఁబెట్టుకొనివచ్చెద ననికదా అన్నాఁడు( పెదవి విరచి)ఇదియంతకంటె సంభవింపదు. ఎంతయంతి పురములో రాకపోకలు గలవాని నైనను నర్ధరాత్రిమున నడ్డక పోనిత్తురా ? అక్కటా ! యీచిగురుటాకులమధ్యనుండి ప్రసరించెడు వెన్నెల గూడ నింత వేఁడిగ నుండుటేమో ? ఏమైనను సరియే. ఇఁక నిక్కడ నుండిన లాభము లేదు. ఈస్థలము విడిచి యింటికే పోయెదను (కొంచెము నడిచి) అయ్యో! వెనుకటితోవ గానరాదే! ఇది యేమో యింద్రజాలముగా నున్నది. (కొంత నిలిచి) కాదు, కాదు, నేను వచ్చినత్రోవ అది కావచ్చును. (మఱియొక వై పునకుఁజని) ఇదియును గానట్టు లున్నదే ! (దూరముగాఁ జూపు నించి) అక్కడ నేదో యొక చిన్న మిద్దెవలెఁ గానవచ్చుచున్నది. తటస్థించినచో నయ్యెడఁ బ్రియురాలే తటస్థింపవచ్చును. (ముందునకు నడిచి) ఓహో ! నిండుగాఁ బూచిన యీపెద్దపొదరిల్లు పైపెచ్చు వెన్నెల సహాయము కాగా నావ్యామోహమునకుఁ బ్రచండమిత్రిని మోసము తోడయి చేసినదని నే చేసినది. (మరలఁజూచి) ఇక్కడ నేదో తటాకము గాన వచ్చుచున్నదే ! పోయి చూచెదఁగాక. ఆపొదరిల్లు దీని యావలియొడ్డున నున్నది. అవును, అక్కడికిఁ బోయి విశ్రమించెదంగాక. (నడచి అందుఁజొచ్చి) ఇదిగో! ఇయ్యెడల నళినీదళమ్ములు పాడకట్టుచున్నవి. కారణ మేమై యుండునో ! (విచారించుచుఁ గూర్చుండును.)

లవం— (ఆయాసముతో) చెలీ ! యింక నెంతదూర ముండునో కనుఁగొమ్ము.

మల్లి— ఆర్యా ! ఎక్కడ మనరాకన్నియ మనోహరుఁ డుండుతావు ?

విదూ— (వ్రేలుచాచి) అదిగో ! ఆపొగడచెట్లచాలు దాఁటుపై నశోకపంక్తి కెడమప్రక్కనున్న తియ్యమావిగున్న.

మల్లి— దగ్గరకు వచ్చితిమి.

లవం— (అభిలాషముతోఁజూచితనలో) అదిగో ! ఆర్యపుత్రుఁ డక్కడ నాకెదురు చూచుచున్నాఁడు. ఏర్పాటుగాఁ దెలియకున్నను గొంచెము తెలియవచ్చు చున్నది. (ప్రకాశము) చెలీ! మీరిరువురునుజనుఁడు (అక్కడనిలువఁబోవును)

మల్లి— పెండ్లికూఁతురు "పెండ్లికి నేనుఁ గూడ నెందు" కన్నట్లు చేయుచున్నావు.

విదూ— (తొందరగాఁ జెట్టుకిందదిగి నలుదెసల పరికించి డిల్లపడి చుట్టుపట్టుల నెదక మొదలు పెట్టును.)

లవం— చెలీ! అమ్మహాత్ముని యెదుటకు రాఁజాలక యన్నమాట కంతసామెత చెప్పవలెనా?

మల్లి—సఖీ! వెనక నీవంటిసిగ్గరి చేయఁబట్టిరే యిప్పుడది వాడుకగాఁ జెప్పుకొను చున్నారు.

విదూ—(దైన్యముగా పరుగున వచ్చి కోపముతో) మీరు మెల్లగాఁ బెండ్లినడకలు నడువ మొదలుపెట్టినారు. సరే నాకేమి, పెండ్లికొడుకును బిల్లి యెత్తుకొని పోయినది.

లవం— (తనలో) అయ్యో! దైవమా! నాకుఁ గనుపడుట భ్రాంతియేకాఁబోలును. ప్రత్యక్షముగా నాకుఁ బొడకట్టినది పట్టియూకాశమే యైయుండునా? (ప్రకాశము) మల్లికా! నీవు పోయి చూచిరమ్ము. ఇతనిమాటను నమ్మఁ గూడదు.

మల్లి— (అట్లొనరించి) సఖీ! నిక్కమే చెప్పినాడు. సందియము లేదు.

లవం— అయ్యో! మందభాగ్యనగు నాకతన నమ్మహామహున కెంతయవస్థ వచ్చినదో.

మల్లి— అవస్థ కేమున్నది? ఎక్కడనో నీకై వెదకుచుండునని తోచెడిని.

లవం— త్వరగాఁ బోయి చూచిరమ్మని యితనితోఁ జెప్పుము.

మల్లి— ఆర్యా! డిల్లపడి పులుసుకాయ తిన్నకోతివలె నట్లుచూచెద వేమి? ఇది యుం జెప్పవలెనా? యేమి నీతెలివి? నేను వచ్చునంతవఱకు నీవిక్కడనే యుండఁదగునని చెప్పి రాలేకపోతివా?

విదూ—నేను చెప్పకపోవుటచేతనే కాఁబోలు నతఁడు వెళ్లుట! ఏదో మదపిచ్చి యెత్తి తిరిగెడివాండ్రకు మనమాటలు జ్ఞాపక ముండెడినా? నన్నాక్షేపించెదవు కాని నీతెలి వేమంత తగులఁబడినది, "ఫలానాచోట నుందు" మని మొదట నాతోఁ జెప్పినచో నీచిక్కులుండవు కదా. మీకేమి యిది యంతయు నాకుఁ బట్టుకొన్నది. పోయివచ్చెదను, ఇక్కడనే యుండుఁడు (నిష్క్రమించును.)

లవం— (విదూషకుని పోయినమార్గమునే చూచుచు నుండును.)

రాయ— ఆహా! యీపొదరిల్లు తనపుష్పములపరిమళ మట్లుండ నేదియో విలక్షణ మైనయొత్తరువుం గూడఁ బూసికొన్నట్లు తోఁచుచున్నదే. కాదు కాదు. ఈచిహ్నములంబట్టి నాకై ప్రియురాలియొద్దడల వేచి విసివి యెయ్యెడ కేనియుఁ

జనినట్టు లూహింపనయ్యెడిని. అంతవ్యక్తముగాఁ గాకున్నను నియ్యెడఁ గొంచెము పాదచిహ్నములు గూడఁ గానవచ్చుచున్నయవి. ఇఁక నెందులకు నేనిచ్చట నుండవలయును?

శా. సంకేతమ్ము లటంచు నచ్చటఁ బ్రియాసాంగత్య మంచుఙ్ గవుల్
బొంకుల్ బొంకిరి గాని యెట్లుపొసఁగుఙ్? బోరాదు, పోఁగల్గినఙ్
బంకేజాక్షి యొకంట నేగు, నొకటఙ్ బ్రాణేశ్వర్వం డేగు నా
తంకం బందుటదక్క నిందు సుఖసంధానమ్మునుఙ్ గల్గునే?

( వినువు సూచించి )

చ. కవులకు బుద్ధిలేదు పలుగాకులఁ జేయుదు రెల్లరఙ్ మరల్
దవులఁగఁ జేయుకబ్బములు తా రొనరింతు రవే నిజమ్ములం
చెవఁడు మదిఙ్ దలంచు నతఁ డెందులకుం గొఱగాఁడు; నాకు నీ
యవిధికిఁ గారణం బటుల నాత్మఁ దలంచుట కాక యున్నదే.

పోనిమ్ము చెలికాఁడేనిఁ గానరాఁడే? పాపము! మోసము చేసె నని యనుకొంటిని గాని నాయదృష్టలోపమున కతఁ డేమి చేయును.

విదూ—— ఇదిగో, నేను వచ్చుచున్నాను ( ప్రవేశించి ) చక్కఁగఁ జేసితిరయ్యా! ఏమి యింతలో మునిఁగిపోయినదని యయ్యెడ విడువనలయును?

రాయ—— ( అభిలాషతో ) ప్రియురాలు నీకుఁ బొడకట్టినదా? నీరాకకుఁ జూచి చూచి యింటి కేనియుఙ్ బోవ నెంచి త్రోవఁ దప్పి యియ్యెడకుఁ జేరితిని.

విదూ—— బాగుగ నేయున్నది "కుక్క దొరికితే బెడ్డదొరకదు; బెడ్డదొరికితే కుక్క దొరకదు; రెండూ దొరకితే రాజుగారికుక్క" అను సామెతవలె నున్నది.

రాయ—— ( తనలో ) ఏమి వీని వాక్పారుష్యము! శుద్ధనీచుఁడే. దిక్కుమాలిన నీచోపమానములకు విధియు విరామమును లేదు. తప్పేమి? ఇదియంతయు జారులకు బుద్ధిచెప్పుట కాని మఱియొకటికాదు.

ఉ. మానము పోవు, స్వాంత మవమానమునుఙ్ సహియించు, రాగియే
గానికి మారనట్టి పలుగాకియు గౌరవపాత్రుఁడై తనుఙ్
న్యూనతపాలుచేయు, నొక నూతన చింతఘుటిల్లు; నెందునుఙ్
దా నఘముండ దుర్లభపుఁదన్విఁకిఁ లోఁగు నెవం డధీరుఁడై.

( ప్రకాశము ) ఇంతకు నిప్పుడు మన మెక్కడి కేగుదము?

విదూ—— ఎక్కడికన్నఁ జేయున్నది! మునుపు మన మెక్కడనుంటిమో అక్కడికే పోవుదము.

( ఇరువురును యథోచితముగాఁ బరిక్రమింతురు. )

లవం— ( తాపమును సూచించి ) చెలీ! అక్కడివిచంద్రుండు నాకల నిట్టివగాన మొనర్ప నెంచెనేమో కదా. కానిచో నిర్భ్యపతిఁ గీటిఁబోనా స్వప్న మని చెప్పిన ప్రచండమును ప్రినిమాటఁ జీరికిం గొనక యేల యరిగెడిని?

తే. గీ. దుర్లభజనానురాగంబు దొడరు నాకు
నిదియ యొకయసమాన మంచెంచరాదు
ఇయ్యని యెట్లింగనేని మాయయ్య యేమి
సేయనున్నాఁడొ? యేనేమి సేయుదాన.

( కొండొక యోచించి )

క. పోనిమ్ము ప్రాణమేనియుఁ
దా నిది శాశ్వతమె? యెట్టిదశ వచ్చినను౯
రానిమ్ము; నాకు నొకపరి
కాని మ్మయ్యనఘుఁ జూడఁగల భాగ్యమ్ము౯.

మల్లి— భర్తృదారికా! అన్నిటికిని భగవతియే యున్నయది. ఏటికి భయపడె దవు. స్వప్నమునఁ బొడకట్టి మీ యిరువురికి వివాహ మగు నని చెప్పి పాదుషాకు నంగీకార మేల కల్పింపదు?

లవం— ( విసువుతో )

ఉ. ఎక్కడిదేవి! స్వప్నమున నేటికిఁ దాఁ బొడకట్టె? నంటఁ బో
కక్కవితల్లజు౯ దెలిసి యాకృతి నేటికిఁ జూపెఁ? జూపుఁ గాఁ
కక్కట! నీకితండు మగఁడౌనని చెప్పఁగనేల? చెప్పెఁబో
యిక్కడి కాగతుండయిన యిష్టు మతొక్కడ కంప నేటికి౯?

మల్లి— సఖీ! ఇట్లొనర్చుట యంతయును మీ శ్రేయస్సునకే. ఏమన నతిప్రయత్నలబ్ధమ్ము లగు వస్తువులయందుఁ గదా యాదరాతిశయము మానవులకు!

లవం— నన్నానందింపఁజేయుటకు సమయోచితముగ నట్లాడెదవు. చింతితార్థ సిద్ధి యెంత యదృష్టవంతులకుఁ జేకూరెడిని?

మల్లి— ( దూరముగాఁ జూచి ) చెలీ! వచ్చుచున్నట్లు లున్నారు గాని యిప్పుడు మనమిచ్చోట నుండక కొంచెము తొలఁగి నిన్నుఁ గూర్చి యాయన యెట్లు తలఁచునో యెట్లు పరితపించునో చూడవలయు.

లవం— (తనలో) అయ్యో! మరల నంతరాయ మొనర్చుచున్నదే! వలదనినఁ జిన్నఁ బోయెడిని. ( ప్రకాశము ) కానిమ్ము. నాకును నది సమ్మతమే.

మల్లి— అట్లయిన నీపొదరింటిచాటునకుఁ బోవుదము రమ్ము. (అట్లొనరించు చున్నారు)

రాయ— (విదూషకుం జూచి) ఇదియేకదా? మనము రాఁదగినచోటు.

విదూ— (లేఁతపొదఁ జూచి తనలో) ఇది యేమి యాశ్చర్యము? కదలవలదని గట్టిగఁ జెప్పియుంటినే. (ప్రకాశము) అగును. మనల వంచింప నిక్కడనే సమీపమున డాఁగియుందు రని తోఁచెడిని. (బిగ్గరగా) మల్లికా! మల్లికా (అని పిలుచును)

మల్లి— (లవంగితో) మనము మాటాడ వలదు. ఏమి జరుగునో చూతము.

లవం— జరిగెడిదేమిటి? పాపము. అతనిపై నమ్మహాత్మునకుఁ గోపమువచ్చును. నీకేమి? "పిల్లికి చెలగాటమును, యెలుకకుఁ బ్రాణసంకటమును" ననుటిట్టిదే.

రాయ— (తనలో) వీఁడు నిక్కముగా నన్ను మోసమేచేసెను. కానిమ్ము వీనినిఁక సహింపఁగూడదు. (ప్రకాశము కోపముతో)

ఉ. ఎంత యసత్యమాడునరుఁడేని యొకానొకవేళ నైనఁ గా
సంతయుఁ గాని సత్యమకటా పొరపాటునఁ జాఱనాడు; నీ
వంత మదెట్టిదో యెఱుఁగఁ! బల్కుచు నుంటివి పూసఁ గ్రుచ్చిన
ట్లింతయుఁ గల్ల గాఁగ నిది యచ్చెరువైనవిశేష మెమ్మెయిన్.

విదూ— (వికృతముగా నవ్వుచున్నాఁడు)

మల్లి— (లవంగితో) అదిగో! నీప్రియుని వాగ్వైభవము.

లవం— (తదేకచిత్తయై వినుట నభినయించును)

రాయ— (విశేషకోపముతో) ఓరి దుర్మార్గుఁడా! నాయవస్థకు నవ్వువచ్చుచున్నదేమి!

ఉ. పండితరాయలన్న నొకపాటిగఁ జూచితివేమొ? నేఁడు నీ
గం డడఁగింతు శాపమిడి, కాదని దానిని ద్రిప్ప నీవు న
ట్లుండఁగ నిన్ను నేలెడిమహోన్నతుఁడౌ విభుఁ డట్టులుండ బ్ర
హ్మాండము నేలునట్టి పరమాత్మతర మ్మగునేమొ చూడుమా.

విదూ— [నిరుత్తరుఁడై వడవడవడంకును)

లవం— తత్తఱపాటుతో) చెలీ! ఇఁక నాలస్య మొనరించితి మేని విరసముగా నుండును.

మల్లి— నేనుపోయి ప్రచండమిశ్రుం గాపాడెద. నీవు నావెంట వచ్చి యయ్యొన ఘుని దర్శింపుము (అని యథోచితముగా నెదుటికి వచ్చుచున్నారు)

రాయ— (విస్మయంబుగాఁ జూచి తనలో) ఓహో! నిష్కారణముగా "నాకబలి నిష్ఠురమునకుఁ" గడంగితినే.

మల్లి— (వినయముగావంగి) మహాత్మా! చతుస్సముద్రముద్రిత ధరావలయమ్ము నేకచ్ఛత్రమ్ముగా నేలుపాదుషాకూఁతురు లవంగి నాముఖమ్మున నమస్కరించుచున్నది.

లవం— (లజ్జతో శిరమువంచి తనలో) నేను పాదుషాకూఁతురనుగాను. అగుదుంగాక ఏపాదుషాలకునులేని నిరంకుశప్రాభవముగల యార్యపుత్రునియొద్ద నీపెత్తినుతి యెంగులకు ?

రాయ— (తనలో)

తే. గీ. ఎంతసోయగ, మెంతటివింతతళుకు|
కంతు నాఱవబాణమే కలికిమిన్న
యింతసొగసుండి యంతభూమీశుకూఁతు
రయ్యు నెటు నేర్చె నీవినయంపుగరిమ.?

(స్మృతి నభినయించి) కోయిల కాకులచేఁ బెనుపఁబడినను స్వజాతియోగ్యత పోవనేరదుకదా. ఇప్పటికేనియు నిక్కలికియెడ బ్రిస్మృతేఃమ్మించుకయు నుడివోక చెన్నుమీఱుచున్నయది. (ప్రకాశము) అభీష్టావాప్తిర్భూయాత్,

విదూ— (వికవికనవ్వుచు) మీయాశీర్వచనము నీకే ఫలించుచున్నయది. నన్ను శపించుట యేమిచేసితిరి? ఎందుకని యూరకున్నాఁడను గాని మీమాత్రము శాపము నాకును జేతనగును. ఇదిగో బ్రహ్మసూత్రము. (పెడవిఱచి) ఇప్పటి బ్రాహ్మణుల యాశీర్వాదములును, ఇప్పటికవుల శాపములును నేనెఱుఁగనివికావు.

లవం— (విదూషకునివంక నివారించునట్లు చూచును)

రాయ— (నిరుత్తరుఁ డగుచున్నాఁడు)

మల్లి— ఇప్పుడేమిటి అప్పుడేమిటి వస్తువులయొక్క సహజశక్తు లెన్నటికినిమాఱవు.

విదూ— మల్లికా! అటుచూచితివా! నేను నామిత్రు నేదియోయనిన మనరాకన్నియ కెందుకో ?

లవం— (మఱింత తలవంచి వృష్టిపరికించుచున్నది)

మల్లి— ఇతఁడు నీమిత్రుఁ డాయనయుం గాఁడు, నాసఖురాలీకెయుం గాదు: ఇంతటంతే మన యావశ్యకత.

రాయ— (చిఱునవ్వు సూచించును)

లవం— (తనలో) కలలో నా కప్పురదేవత ప్రసాదించిన ప్రతిమకును నిమ్మహాత్మునకును లవమైన భేదముకన్పట్టదు.

విదూ— అవును "దూతికా సూతికా చైవ కార్యాంతే" అని మన మింతట నవలకుం బోదము రా.

లవం— (మెల్లగా) నీవు పోవలదు.

మల్లి— (చిఱునవ్వుతో) ఇఁక నేనెందుకు ? నీ కతఁడు చెలియుం గాఁగలఁడు.

రాయ— (ఉత్కంఠతో)

క. చెలిఁ జేసెదో ? దాసునిఁగాఁ
జలిపెదో ? నీసఖికి నన్నసాధ్యప్రజ్ఞా
కలితమతి వైననీవే
గల వన్నిటికింక మాకుఁ గళవళమేలా ?

విదూ— ఈబానిసకూఁతురే కాఁబోలును చేసెడిది. నేను మన్నుగొట్టుకొని పోయెడి వాఁడనే ?

రాయ— (చేయి పట్టికొని) నీవే నేను.

విదూ— (మల్లికకేసి చూపి) "త్వమేవాహం త్వమేవాహం త్వమేవాహం నసంశయః" (చేయిపట్టుకొఁబోవును)

మల్లి— (పరిహరించి) ఓహో! దుష్టబ్రాహ్మణా! ఏమి నీయాగడము.

విదూ— ఆగడమేమిటి? మన మిద్దఱమును దూతలమని తెలుపుటకుఁ జదివితిని.

మల్లి— ఓహో! యెంతసందర్భముగానో యున్నది.

రాయ— మల్లికా! కోపగించుకొనకుము. ఈ మహాబ్రాహ్మణునకువచ్చిన కారికలన్నియు నర్థము తెలిసినవి కాకపోఁబట్టి "కుర్వీత బుధసోమయోః" అన్నట్లుపచరించుచుండును.

మల్లి— ఈతఁ డెప్పుడును మాయంతఃపుర పరిచారికలచే మొట్టికాయలు పడుటకు సంశయింపఁడు. కానిండు. సర్వజ్ఞులగు దేవరకు నీమూఢురా లొక విజ్ఞాపనమున కాజ్ఞవేఁడుచున్నయది.

విదూ— (తన్నుఁగాని యట్లూరకుండును.)

రాయ— నీ వేమిచెప్పినను సంగీకరించువాఁడనే.

లవం— (తనలో) తెల్లవారునంతకు నేదో యిట్లు గొడవపెంచునుగాఁబోలును.

మల్లి— నేను చెప్పవలసిన దేమియును లేదు. స్వప్నమున నిమ్మూర్తిఁ జూచి పరశక్తి సంబంధనిశ్చయము చేసినదఁట. అది యెట్లున్నను ఇప్పుడు గాఁక యిపుడు గాంధర్వ వివాహ మొనరింపఁబూనుచో మీరు ప్రత్యక్షసాక్షి నుండవలయును!

లవం— (తనలో) కాలయాపన మొనర్చినను మంచిప్రసక్తిఁ దెచ్చినది.

రాయ— (తనలో) ఆహా! సన్నులతాంగి కలలోనా చూచినది! (ప్రకాశముగ) ఇది పునరుక్తి, యింతకుమున్నే గ్రహించినప్పుడు మనమేమనుము?

లవం— (తనలో) హృదయమా! ఇక్కడికి నీవు సగము కృతార్థమవు. ఇక్కడనుండి సదుపాయానుగ్రహమునఁ గావలయును.

మల్లి— ఊరక యట్లనుట కాదు. మా చెలిచేతిలోఁ జేయివేయ వలయును.

రాయ— (సంభ్రమముతో) ఇదిగో వేసితిని. (అభినయించి స్పర్శసుఖమును సూచించి)

తే. గీ. బ్రాహ్మణోత్తముఁ డెల్లను బంక్తిబాహ్యుఁ
డనుము నేఁ జెట్టఁ గుడుపుగాక, యంతఁబోక
పరువుచెడుఁగాక యేమైన వచ్చుఁగాక
అబలరో! నిన్ను నేను బెండ్లాడువాఁడ.

లవం— (లజ్జతో స్పర్శసుఖమును బ్రకటించును).

విదూ— ఇదిగో! నే నిక్కడ బ్రాహ్మణోత్తముఁడ నుండఁగా సామంత్రితంత్రములు లేకయే మీరు పాణిగ్రహణము నెట్లు నెఱవేర్చికొన్నారు. (పండితరాయల కండువా చెంగు మాత్రము పట్టుకొనును).

లవం—(కొంచెము దూరముగాఁ దొలఁగును).

మల్లి—నీకుం దగుబహుమతి నే నిప్పించెదఁ గాని యిఁక నిక్కడనుండి తొలఁగుము.

విదూ—నేనే కాదు! నాకు నీవా యిప్పించెడిదానవు? బానిసమూఁకరా!

లవం—(మెల్లఁగా మల్లికతో) ఎవరో వచ్చుచున్నట్టు లున్నది.

(అంతట మాతంగియను వృద్ధపరిచారిక ప్రవేశించును)

మాతం—(తనలో) దేవిగారు నా కాజ్ఞ యిచ్చి యెంతసేపో కావచ్చినది. ఎక్కడ వెదకినను భర్తృదారిక జాడ గానరాకున్నది. ఎప్పుడు నుండని దియ్యెడ నీదిన మింతమసలునా? ఇదివఱకే వెళ్లియుండునా? లేక మఱియొక క్రీడావనమునకేఁ జెళ్లినదా? (దెసలు పరికించును).

విదూ— (మెల్లగా) మల్లికా! ఇక్కడికిఁ గుదిరినదా మీజ్వరము!

మల్లి.— (తేజపాలుఁజూచి) చెలీ! మఱియేమియును లేదు. చూచిరమ్మని మాతంగిని కాఁబోలును బంపినారు. అది మనల గుఱుతింపక మఱియొకప్రక్కకుఁ బోవుచున్నది. ఇక్కడకుఁ దిరిగియువచ్చునాలో నార్యపుత్రునియొద్ద నిప్ప టికి సెలవు వేడుకొనుము.

లవం.— (తనలో) ప్రొద్దుపోయినది కాఁబోలును. అయ్యో! శ్రేయస్సుల కన్నియు విఘ్నములే.

రాయ.— (లవంగికై చూచి) సఖీ! మరల నినుఁ గనుభాగ్య మెప్పుడోకదా!

లవం.— (విచారముతో నిరుత్తర యగుచున్నది.)

మల్లి.— పరమాత్ముని కృపవలన శీఘ్రమున నే కాఁగలదు.

విదూ.— తథాస్తు.

లవం.— (తనలో) ఇతఁ డెట్టివాఁడైనను నిప్పట్ల సత్యవచనుం డగుఁగాక.

మల్లి.— చెలీ! మనము దానికెదు రేగి తత్సహితముగా నగరి కరిగితిమేని పిదప వీరు పోవుటకు వీలుగా నుండును. సెలవుతీసికొనినట్లే. పోవుదము రమ్ము (అని ముందుకు నడతురు.)

మాతం.— (సమీపించి) ఏమమ్మా! యీనాఁడింతతడ వుంటిరి? కోళ్లు కూయు చుండుట యైనను వినఁబడుచున్నదా?

మల్లి.— పోవుదమురా. త్రోవలోఁ జెప్పెదము. (నడచుచు) ఈవేళ మేమొక యుత్సవము చేసికొన్నాము; తెలిసినదా! అది కోడికూఁతవఱకును గావలసి నదని యీకాలపు బాలికల యేర్పాటు.

లవం.— (తనలో) బొంకినను దడవికొనకుండ బొంకవలెను.

మాతం.— ఏమో మానాఁటికర్మ మెఱుఁగము; మీవన్నియుఁ గ్రొత్తక్రొత్త యాటలు! క్రొత్తక్రొత్త పాటలు! పోనిండు త్వరగాఁ బోవుదము రండు దేవిగా రెదురుచూచు చుందురు. (ముగ్గురును నిష్క్రమింతురు)

రాయ.— (వారలు పోవుపైపునకు దృష్టి జొన్పి దైన్యముతో) చెలికాఁడా!

మ. తగుకాంతన్ దగుకాంతుతోఁ గలుపఁగాఁ దాత్పర్యమున్ బూనఁ డ
త్తగు లెట్లే మది నొప్పినొన్నఁ బ్రతిబంధమ్ముల్ శత మ్ముందుఁ బు
ట్టఁగఁ జేయున్ సహియింపలేక విధి కట్టా! యిట్టిదుర్మార్గ నే
మిగ భావించి పరాంబ లోకగురుఁగా మీఁదెన్న కే చేసెనో!

విదూ.— రాజపుత్రి మచ్చుమందు చల్లినట్లు మీకు వశయైనది. ఇఁకెక్కడికిఁ బోవఁగలదు. అబ్బో! ఈపిల్లకు వివాహమునకై ఘాటుపా టెంతయుండి

యుపరాజుల పటములు తెప్పించి చూపుచున్నాఁ డనుకొంటిని! మీవంటి బీదబాపని కింతలో లోఁబడినది. మీయదృష్టము మంచిది. మీకు గొప్ప జహగీరు కూడఁ దొరకును. మన మీపాటికిఁ బోవుదము రండు.

రాయ—

తే. గీ. పాదుషా కూఁతు హస్తసంపర్కమున నె
కలిగెఁబో నాకు లోకాధికారగరిమ
అదియు నెడరైనయంత నే యరిగెఁ గాక
సకలమును లేకయున్నట్టి చందమయ్యె.

విదూ— అదిగో, నే నేమి చెప్పితిని. దర్శనమాత్రమున కదా సంతసించెద నంటిరి. స్పర్శనము గూడ సంఘటించితిని. మీ రెంత పండితులైనను నేననుభవజ్ఞుఁడను.

రాయ— (అనాకర్ణితముగా)

తే. గీ. అందమటులుండఁ జందమ్మునట్టులుండ
సోయగమటుండ సొగ సొక్కచోటనుండ
నహహ తన చెలితోడ నయ్యబల పల్కు
ప్రౌఢతన మంత యింతని పొగడఁదరమె.

విదూ— మనమ్మునకు నచ్చినపట్టున నన్నియును రమణీయములే యగును. మీరు వినుచుండఁగా నాపిల్ల యొక్కమాటయైన మాటాడక బెల్లముగొట్టినరాయి వలె నుండెనుగదా. అదే కాఁబోలును! ప్రౌఢతన మని పెద్దగా వర్ణించుచున్నారు. అందము, చందము, సోయగము, సొగసు అని నాల్గు పర్యాయపదముల నొక్కచోట మీరు ప్రయోగించి నామాటసహితము వినక వర్ణించినను మీప్రియురాలి కొక్క చెవినున్న కుట్టుకాడల గుట్టె వర్ణనముకైనను నవి చాలవుకదా. అథమపక్షము రెండింటిపదులు నలుబది పదములైన నొకటే యర్థము నిచ్చునవి యుండకతప్పదు.

రాయ— ఓయి రసవిహీనుఁడా! ప్రౌఢతన మనఁగా మితభాషిత్వ మగుఁగాని నీవూహించినట్లు పటపట వాగుట కాదు. ఇఁకఁ గుట్టుకాడలఁగూర్చి పరిహసించుట బొత్తిగాఁ బొరబాటు. ద్రామిడాంగనల కతిస్థూలతాటంకమ్ములంబలె యవనాంగనలకివి సామాన్యములు. తావన్మాత్రమున సహజలావణ్యగణ్యలకు వికారమారోపింప నొప్పదు.

విదూ—— అవును. ఆలాగు సంతోషింపవలెను. "తావలచినది రంభ, తామునిఁగినది గంగ" పోనిండు రెండవకోడికూఁత వినవచ్చెడివేళ కావచ్చినది. మన మీపాటికిం బోయినిద్రింతము.

రాయ—— సఖా! నీకు నిద్రపట్టినను బట్టుంగాక

చ. చెలి యరుదేరఁ గాంచితిని జే యొకభంగి స్పృశించితిన్ మరున్
నెలకొలుపంగఁ జాలునలనీరజలోచన ముద్దుగుల్కు ప
ల్కుల నొకకొన్ని వింటి సమకూరె సుఖం బనుకొంటి నింతలోఁ
గలిగెను విఘ్న మెక్కరణిఁ గాంచెద నిద్దుర? నెట్లు నిల్చెదన్?

విదూ—— (చేయిపట్టుకొని) పోవుదము రండు. మీకిప్పుడే యచ్చేడియతో సఖ్యమ్ము గలిగించెద.

రాయ—— (అభిలాషతో) ఇంతలో నెట్లు పొసఁగింతువు. (ఇరువురును బరిక్రమింతురు)

విదూ—— దానికి సులువైనయుపాయ మాలోచించితిని.

రాయ—— సులువే కానక్కఱలేదు.

శా. స్త్రీవేషమ్మును వేసికోవలయునో? సిగ్గింతయున్ లేక య
య్యావాసమ్మును జేరుపొంటె ఘనమౌ ప్రాకారపుంగోడ నెం
తే వేగమ్మున దాఁటఁగావలయునో? నీచత్వమున్ జూడకే
యానాల్గంటి యనుంగుదాసి నెవతెన్ బ్రార్థింతునో? తెల్పుమా.

విదూ—— ఇంతపని కక్కఱలేదు.

రాయ—— ఇఁక నెయ్యది?

విదూ—— మహాయోగు లీశ్వరుధ్యానించున ట్లమ్మృగువ నంతరంగమ్మున నిడికొని కొంచెము కనులుమూసికొని పరుండవలయు.

రాయ—— నిక్కమే! అయ్యది చక్కనియుపాయమేయైనను "శ్లో. యద్దుష్కరం యద్దురాపం యద్దుర్గం యచ్చదుస్తరం। తత్సర్వం తపసా ప్రాప్యంతపోహి దురతిక్రమం." అన్నట్లున్నది. ఒక్కచో నట్లిదైనను సాధించితినేనియు మందభాగ్యుఁడనగు నాకక్కన్నియ యప్పట్టునను బొడకట్టదు. పొడకట్టినను నేదియో యంతరాయము మూఁడక మానదు.

విదూ—— సకలాంతరాయమ్ములను నివర్తించుటకు లంబోదరునంతవాఁడను నే నుండఁగా మీకేలోపమును రాదు. నాయుపాసనము మాత్రము మఱవక యుండవలె.

రాయ— అంతవాఁడ వననేల? సాక్షాత్తుగా లంబోదరుఁడవే కదా? "మాతృ రహితా ఇవ తేన కామినీమనసి నిర్గతం" నీవు లేకున్న నాకెయ్యెడ గతియేలేదు.

విదూ— అదిగో! నన్నాఁడుదానిగాఁ జెప్పుటచేఁ గోపము వచ్చుచున్నది. యిప్పటి కోపుకొనెదను గాని యిఁక నెన్నఁడును నట్టిప్రసంగము పనికిరాదు.

రాయ— ఆఁడువారల కోర్వలేకదా యిన్నిపాటులు పడుట?

విదూ— ఇఁక మీనక్షత్రసమర్థనలు కట్టిపెట్టుఁడు "అయ్యవారిని చేయుమన్నా రంటే అబద్ధాలాడి దిద్దుకొనుచున్నారఁట". మీపండితులపస్సు మగ్లక్షణమే యిది. అదిగో తూర్పు తెల్లవాఱుచున్నది. పోవుదము రండు.

రాయ— (చూచి)

ఉ. నామనమందునుంబలె ఘనంబగురాగము దోఁచుచున్న దీ
యామిని నన్నుఁబోలె గననయ్యెడు రిత్తగ రిక్కలుం ద్యుతి
గ్రామములై ననుం బలె నొకానొకఁడై కనుపట్టె, ఘూకముల్
దా మినభీతిఁ బోఁదొడఁగె దద్దయు నీకవిఁబోలెఁ గుందుచున్.

(ఇరువురును నిష్క్రమింతురు.)

ఇది శ్రీ... తిరుపతివేంకటేశ్వరవిరచితంబగు పండితరాజమ్మునందుఁ

తృతీయాంకము.



# పండితరాజము - చతుర్థాంకము.



(అంతట నిరువురు వైతాళికులు ప్రవేశింతురు.)

ప్రథ— చెలికాఁడా మనకు వేళ కావచ్చినది. మనవిూపాటికిఁ బోయి మనకృత్యమేల నెఱవేర్చికొనఁ గూడదు ?

ద్వితీ— కావచ్చినదనుచున్నావేమి ? అయినది (వినుటనభినయించి) అదిగో ! గడియారము వినవచ్చెడిని; నాలుగుకాఁబోలును కొట్టుచున్నాఁడు.

ప్రథ— (తూర్పుకేసిచూచి) నాలుగేకాదు. సూర్యోదయమే యగుచున్నది. ఈపడమటివైపునఁ గొంచెము వెలవెలఁ బోవుచందురుని తేజ ముండుటంబట్టి రాత్రి యున్నదనుకొన్నారము గాని యాటుఁ జూడుము అయినదని తోఁచుచున్నది.

ద్వితీ— అయిన నేమి మునిఁగిపోయినదిలే; త్వరగాఁబడ; ఏవో రెండుపద్యములు చదివి వత్తము. వినువారెవరు ? మనకుఁ గాలాతిక్రమణశంక కవకాశ ముండదు.

ప్రథ— అవును. నీవనినట్లు తురకదర్బారు. మనలో మనమాట, ఎవఁ డేమిచేసినను సరే. చూచువారేలేరు. ఇంతగుడ్డిరాజ్యము మఱియొకటి యుండదుసుమా!

ద్వితీ— ఆసంగతి మన కెందుకుఁగాని అదియే మనము కూర్చుండుచోటు. పోయి యాసాబత్తు గోడవతోపాటు రెండుపద్యములు చదువుదము పద (యథోచిత ముగా పరిక్రమింతురు )

ప్రథ— (కంఠమునవరించి)

సీ. అభిసారికాంగనా వ్యభిచారములుతగ్గఁ దమముతూరుపు పర్వతమ్ముడిగ్గ
కువలయమ్ములరంగు ధవుదవ్వులముడింగ వెడవింటివానియాగడ మడంగ
పద్మినీకాంతకుఁ బ్రాయంబు నిండారె నంబుజారికి వైభవంబు తీరె
నేకీభవించుచుఁ గోకముల్ చెలరేగ గుడ్లగూబలు కొండగుహలఁ డాఁగ

తే. గీ. రంగుమెఱయు మత్తువస్తువుల్ మిఱింగిమిఱింగి
యొడలెఱుంగని రతముల బడలిబడలి

ఘాదు—అయినచో నీకు సంబంధమే కుదురదుకదా? ఉన్నయువరాజుల పన్ని యును వ్రాయించి తెప్పించితిని.

దేవి—అగును. అయిననేమి, యేదో వెట్టిగాఁ గూర్చుండి యాలోచించుటయే కాని యేది చూపినను నిష్టమున్నట్లు కన్పట్టదు. పోనీ అని విసువెత్తి నేను చాల దినముల క్రిందటనే యీగొడవఁ దలపెట్ట మానితిని.

ఘాదు—తనయక్కలకు చెల్లెండ్రను జూచియైన నేర్చుకొనరాదుకాఁబోలును (కూఁతునుద్దేశించి) నీరీతిఁజూడగా నీవు వివాహమే మానునట్లు తోఁచు చున్నదే?

లవం—(తనలో) నాకాతురక బీబీ లెక్కడి యక్కలు? (ఊరకుండును)

ఘాదు—(దగ్గఱగాఁదీసికొని) తల్లీ! యెల్లలోకమ్ము లేలెడినాకుఁ గొమిరెనై యేదో యుల్లమ్మునఁ దీఱరానికోర్కె యున్నదానిం బోలె నన్నేల కృశించెదవు?

లవం—(తనలో) హృదయమా! నీలోనీవు గుందవలెఁ గాని నీవికారమును బైటికిఁ గూడ నేల సూచించెదవు? (ప్రకాశము) జగదీశు ననుగ్రహమ్మున నాకు సకలమ్మును గలదు. తీఱరానికోర్కె యెట్లుండును?

ఘాదు— పోనీ, యెవరిని బెండ్లాడవలెననియో నాకుఁ గొంచెము చెప్పుము. అతం డెవఁడైననుం దెచ్చి యొసంగెదను.

లవం—(తనలో) నాకుఁ బరాంబికయే యనుగ్రహించియున్నది. నీవు నిమిత్తమా త్రము కావలెను.

(అంతట నొకపరిచారికప్రవేశించి కాగితము చేతికిచ్చును).

ఘాదు—(చదువుకొని స్మృతినభినయించి) అవును. మఱచి పోయితిని. ఓసీ! నీవు పోయి నే నిప్పుడే వచ్చుచున్నాననియు నప్పండితకవీంద్రునిం బిలిపిం పుమనియును మంత్రితోఁ జెప్పుము.

పరి—చిత్తము. (వెళ్లఁబోవును)

దేవి—ఆర్యపుత్ర! యెవరాపండితుఁడు?

ఘాదు—తెలుఁగుదేశమునుండి యొకపండితుఁడు కొన్ని నెలలక్రిందటనే దర్శనా ర్థమై వచ్చియున్నాఁడు. ఆయనశక్తి మిగుల నద్భుతమని చెప్పుచున్నారు. ఒకసారి చదివినతోడనే తనకు రానిభాషయైనను దిరిగియు హెచ్చుతగ్గులు లేకుండఁజదువునఁట

దేవి—ఓసీ! కొంచెము నిలువుము పోవుదువు గాని (ఘాదుషాపంకదిరిగి) ఆసభ కేఁ డియ్యెడఁ గాఁ గూడదా?

పరి—(ఆగుచున్నది.)

లవం—(తనలో) ఈనాఁటిసభలో నామనోహరుఁడు తనశక్తికి బహుమానముగా నన్నే కోరుకొనుఁగాక (ప్రతినభినయించి) నిన్న నేమాట చెప్ప మఱచితినిగా! అప్పుడు సిగ్గు నాకేమియు నోటికి రానిచ్చినదికాదు.

ఘాదు—అట్లే కావచ్చును. ఓసీ! వారినందఱిని సభకువచ్చుటనే జరుగునని చెప్పి వచ్చునట్లు చేయుము.

పరి— చిత్తము (నిష్క్రమించును.)

లవం— (తనలో) ఇదియంతయు జగపంబ చేయుచున్నసంఘటన మే; లేనిచో సభ యంతఃపురమున నెందులకు జరగడిని ?

పరి— (ప్రవేశించి) మహాప్రభూ! అందఱును వచ్చుచున్నారు.

ఘాదు— దేవీ! నేను సభకుఁ బోదునా ?

దేవి— చిత్తము. (అందఱును నిలిచియుందురు.)

ఘాదు— (దగ్గఱనే యున్న సానడిలో నుచితాసనముసఁ గూర్చుండును.)

పరి— ఓసీ! మాతంగీ! యీతెరను కొంచెము పట్టుకొనుము.

(దేవికిని లవంగికిని ఘోషాగా సన్నతెర గట్టుచున్నారు.)

(అంతట మంత్రులును, కవులును, మఱికొంద ఉద్యోగులును ప్రవేశింతురు. అందఱును సలాములు చేయుదురు కూర్చుందురు.)

ఘాదు— (కవులవంక దిరిగి) పండితరాయలం గుఱించి మీయభిప్రాయ మేమి ?

కవు— వారికి శాస్త్రము వచ్చునఁట. కవిత్వమునకుఁ బెట్టినపేరే కదా! ఏకసంధాగ్రాహిత్వ మన్నిటికంటె నత్యాశ్చర్యకరము.

మంత్రు—మనభాషలోఁగూడఁ గొలఁదిదినములలోఁ గవియగుటని నాడుకగా నున్నదే ?

కవు—కాకేమి ? త్వరలోనే యభ్యాసము కావచ్చును. భాష వచ్చినపిమ్మట ధారయున్నవారికి నన్నిటిలో నొకటే రీతిగా నడచును.

దేవి—(కొమిరెం జూచి) అమ్మా! నీ కీపండితరాయలను బెండ్లిచేయుదుమా ?

లవం—(తనలో) "బుద్ధిః కర్మానుసారిణీ" అని యూరకే యన్నమాటయైనను నిది వ్యర్థముకాదు. (ప్రకాశము) నా కెవ్వరును నక్కఱలేదు.

దేవి—(మెల్లగా) మల్లికా! అందులోఁ బండితరాయ లెవరో యెఱుఁగుదువా ?

మల్లి—అమ్మా! ఇంకను రాలే దని తోఁచుచున్నది. వీరందఱును నిక్కడివారే.

లవం—(తదేకదృష్టితోఁ జూచుచుండును)

మల్లి —(లవంగి ప్రక్కనే కూర్చుండును).

ఫాదు—మనలో ననాదిగాఁ గవులున్నారుకదా! ఇట్టిశక్తి గలవారున్నట్లు మీరు వినియున్నారా ?

కవు—కవిత్వమున కేమి చెప్పవా రున్నారు గాని ఏకసంధాగ్రాహిత్వమునకు మాత్రమున్నట్లు వినము.

ఉద్యో— కవిత్వమునకైనను నంతవా రుండురని నమ్మ వలనుపడదు. ఆయనప్రతిజ్ఞ మీరు విన్నట్లు తోఁచదు. ఇదిగో!

చ. అమరగిరీంద్రమాది మలయాచలమంతముగాఁ జతుస్సము
ద్రములకు మధ్యఁ గల్గిన ధరాతలమందలి మేటిసత్కవుల్
గుమిగొని రండు నేనొకఁడ లోకమునన్ గవి నంటి నొప్పరే
ని మదిని దాఁప నేల? నను నెట్టన గెల్వఁడు వాదసంగతిన్.

చ. కవు లని పేరు పెట్టుకొని కంపురుకూతలతోడఁ బద్దెముల్
చివుకని తాటియాకులను జెక్కకుఁ డూరక, చెప్పఁగల్గినన్
జవి గలుగంగఁ జెప్పుఁ డటుసాగనిచోఁ దమయంతఁ జేయు పా
పవిధులు వోలె లోపలనె పాఁతఁబవేయుట కొంతమేలగున్.

ఫాదు— ఓహో! ఇట్టి ప్రతిజ్ఞతో నీతఁడు మనరాజధాని వఱకు నున్నకవుల నందఱను జయించుకొనుచునే వచ్చెను గాఁబోలును.

ఉద్యో— అట్లుచేయుటచేతనే కదా, దేవరచేతిక్రింద నుండిన క్షత్రియ సంస్థానాధిపతులందఱును పండితరాయ లని బిరుదు నిచ్చియుండిరి.

కవు — (అసూయతో) అది స్వమతాభిమానముచేఁ జెప్పెడిసంగతియేకాని నిజమని దేవరవారు నమ్మఁదగియుండదు.

మంత్రి—విద్యకును మతమునకును సంబంధమేమి! అయినచోఁ గావచ్చును. మన మతములోమాత్ర మిట్టివా రిదివఱలో లేకపోయినను ముందు బయలుదేరఁ గూడదా ?

ఫాదు—అవును విద్య యొకరి సొమ్ము కాదుగదా.

ఉద్యో—తినఁబోవుచు రుచులడుగనేల ? వీరు ప్రత్యక్షములోనే చూచి సర్కారుతో మనవిచేసికొందురు గాక.

(అంతలో నొకనౌకరు ప్రవేశించి సలాముచేసి)

నౌక—అయ్యా! ఎవరో యొక పండితుని వెంటఁబెట్టుకొని ప్రచండమిత్రుఁడు వచ్చియున్నాడు.

ఘోదు—ప్రవేశింపఁ జేయుము.

లవం—(తనలో) ఆయన నామనోహరుఁడే యైయుండును. ప్రచండసూర్యుఁ డెవరిని వెంటఁబెట్టుకొని వచ్చెను? హృదయమా! ఒక్కింత తాళిన వరాంబ నిన్నుఁ బవధీనునిగాఁ జేయుకాలము సమీప మగుచున్నది.

నాక—(నిర్గమించి సహితముగాఁ బ్రవేశించును).

(సభ యావత్తును లేచి గౌరవించును.)

లవం—(తెరలోనుండి తదేకదృష్టిగాఁ వలపంచుకొని చూచినయట్లు చూచును.)

మల్లి—(జనాంతికము) సఖీ! అదిగో నీమనోహరుఁడు, రాత్రి నిద్రలేమిని సహజారుణమ్ములగు నేత్రములు మఱింత యెఱ్ఱఁబారిన నాగిరీన మేనితో సభ నలంకరించినాఁడు.

లవం—(వినన ట్లూరకుండును.)

(అందఱును కూర్చుందురు.)

ఘోదు—(తనలో) ఆహా! ఏమి యీమూర్తివిశేషము! ఎవరో మహారాజున కుండఁదగిన లక్షణములన్నియు నియ్యెడనే పొడకట్టుచున్నయవి.

రాయ—(నిల్చి)

శ్లో. శ్రీరస్తు శ్రితరక్షణక్షణగుణశ్రీ రస్తు నిత్యోత్సవ
శ్రీ రస్తు ప్రథమానకీర్తి విభవశ్రీ రస్తు గీ రస్తు తే
శ్రీ రస్త్వ త్యతివేలపండితవచ శ్శ్రీరస్తు భూర స్త్వహో
శ్రీడిల్లీశ! శహాబదీన! విపులస్థేమాభిరామాకృతే.

(అందఱును కరతాళములనుగొట్టి యానందమును సూచింతురు.)

ఘోదు—(తనలో) నా కీభాషలో స్వల్పజ్ఞానమున్నను ఈమహాకవిశైలి యానంద మిచ్చుచున్నయది. పరిపూర్ణజ్ఞానముకలవారి కెట్టిసంతోష మొసంగెడినో?

విదూ—తథాస్తు.

మంత్రి—మహాపండితుఁడవు నీ వాశీర్వదింపవలసినదే.

రాయ—

శా. ఏభూమీంద్రునిఁ జూడఁ బోయినను నీవే పద్యముల్ చెప్ప నీ
వే భావమ్మును జెప్పికోవలయు; నిం కీభూవిభుండన్నఁ దా
నే భావమ్ము గ్రహించువాఁ డగుట నీ కీకష్టమీడేఱె నా
హా! భో సత్కవిపూర్వజన్మసుకృతంబా! నీకు దీర్ఘాయువౌ.

(పుష్పము లొసఁగి యుచితాసనమునఁ గూర్చుండును.)

కవు—మహాప్రభూ ! సంస్కృతమున నంతవిశేషపరిశ్రమము లేకపోయినను దాని మాధుర్యమున కితరభాషలు చాల వని మాయభిప్రాయము.

ఫాదు —సంశయమేమి ? అన్నిభాషలును దానినుండియే కదా యుద్భవించినవి. ఏదైనను నాశ్రియముంబట్టి యెక్కుడు శోభించును.

విదూ— మీరు పెద్ద కవీశ్వరులని పేరుపెట్టుకొని జహగీర్లనుభవించుచున్నారు కదా ! రెల్లుకలములును, పీచు కాగితములును లేకుండ నిట్లు ఆశుగా గవనము చెప్పఁగలరా.

మంత్రి— ( సంజ్ఞచే వారించును. )

ఫాదు— పండితాఖండలా ! మీరేభాషయైన నొకపరి వినినతోడన చదువుదురఁట. నిజమేకదా ?

రాయ— నాకట్టిశక్తి యింతకుము న్నున్నది, లేదు దానికేమి ? దేవరసాన్నిధ్య బలముననైనఁ జదువఁగల నని మనవిచేసికొనుచున్నాఁడను.

కవు— వినయము విద్యకు భూషణమేకదా ! అయినను దమ కట్టిప్రజ్ఞ నిరాఘాటముగా నున్నయెడలనే వచియింపుఁడు లేనిచో మీకు నిది విధియాయేమి ?

లవం— ( తనలో ) వినయమును బ్రకటించుటకుఁ జెప్పినమాటయని యెఱిఁగియును గవినని పేరుపెట్టుకొని యీమూర్ఖుఁ డేమో పానకములోని పుల్లవలె నడ్డు వచ్చుటకుఁ బ్రయత్నించుచున్నాఁడు.

రాయ— ప్రభు వగుటం బట్టి యట్లు మనవిచేసికొంటిని. ఇదిగో చెప్పుచున్నాఁడ. నిరాఘాటముగా నేభాషయైనను నెన్నిపుటలైనను నొక్కపరి విని నిరాక్షేపముగా తూ, చా తప్పకుండఁ జదువఁ జాలుదు. ఇందులకుఁ దప్పిన నాకున్న పండితరాజబిరుదము నిక్కడనే తీసివేసికొనియెదను.

లవం—(తనలో) అమంగళము శాంతించుఁగాక.

ఫాదు—(వినయముగా) కవివరా ! మీకు ఫార్సీగాని, ఉరుదుగాని, అరబ్బీగాని వచ్చునా ?

రాయ—సంస్కృత మభ్యసించినభాషయే కదా. ఇఁకఁ దెలుఁగు దేశభాష. ఇక్కడికి వచ్చినది మొదలు తఱచు వినుచుండుటచే మీభాషయును దగుమాత్రము వచ్చెడిని.

మంత్రి—ఖురా నరబ్బీభాషలో నున్నదికదా, దానిలోఁ గొంత వినిపింతమా ?

ఫాదు—అవును. దానికిని దేశభాషకును విశేషభేదమే యుండును ( రాయలవంశ

చక్కఁగా వింటిరికదా ?

రాయ—వినలేమి. మఱి కొంత చదువుఁడు. ఈకొంచెమునకు నేను చదువుట యెందుకు ? మాదేశమున సామాన్యముగా బడులలోఁ జదివికొనెడిపిల్లలే వ్యస్తాక్షరి యని ముక్కలమీఁద నంకెలువేసి యిచ్చినచోఁ జదువుచుందురు.

ఘాదు—ఇంతే చాలును. మీ దేశ అంకెలు వేయవలయునని యంటిరికదా, వరుస నెంబడిగనా ?

రాయ—అట్లను కాని ఇచ్చినప్పుడు వరుస అక్కఱలేదు. మీకు దైవము తోఁపించునది యీవచ్చును

ఘాదు—ఇదియును నాశ్చర్యమే. కానిండు; పాపము మీకు వేఱుప్రసంగములవలన ధారణకు భంగము కల్గునేమో ?

రాయ—(కన్నులు కొంచెము మూసికొని యోజించుచున్నాఁడు).

కవు—(తమలో మెల్లగా) పైకి ధైర్యముగానే చెప్పినను మాటలా. ఇది చదువుట ? నేగు తెగును.

(అందఱును నొకరితో నొకరు గుసగుసలాడుదురు.)

లవం—(తనలో) అయ్యో ! తప్పఁజదువు నేమో గదా. జగజ్జననీ ! నీ సాహాయ్య మిప్పు డావశ్యకము.

రాయ—(కనులువిప్పి) ఇదిగో ! చదువుచున్నాఁడను. మీరు పుస్తకము చూచుచుండుఁడు.

కవు—(కడు శ్రద్ధగా వినుచుఁ బుస్తకము చూతురు).

(అందఱును నిశ్శబ్దముగా విందురు).

రాయ—బిస్మిల్లా.....సైనాహుకితాబ. (మొదటినుండి చిగురువఱకును జదువును).

(అందఱును విని కరతాళములు వైచుచున్నారు.)

లవం—(పరమానందమును బొందుచుఁ జూచును).

మల్లి—సఖీ ! యింక నిన్నుఁ గోరుకొనెడి వేళ వచ్చుచున్నయది.

రాయ—(చేయెత్తి వారించి) మరల వినుఁడు. దీనినే తలక్రిందుగాఁ జదివెదను.

(అని పదముల వెంబడిని గాక యక్షరముల వరుసగాఁ జదువును.)

ఘాదు—(పరమానందమును బొందుచు స్వయముగా లేచి వచ్చి కౌఁగిలించుకొని సింహాసనముమీఁదఁ గూర్చుండఁ బెట్టుకొనుచున్నాఁడు).

(అందఱును కరతాళములు వైచి యానందింతురు.)

చక్కగా వింటిరికదా ?

రాయ—వినలేము. మతి కొంత చదువుడు. ఈకొంచెమునకు నేను చదువుట యెందుకు ? మాదేశమున సామాన్యముగా బడులలోఁ జదివికొనెడిపిల్లలే ప్రస్తాక్షరి యని ముక్కలమీఁద నంకెలువేసి యిచ్చినచోఁ జదువుచుందురు.

ఘోషు—ఇంతే చాలును. మీ దేశో అంకెలు వేయవలయునని యంటిరికదా, వరుస నెంబడికనా ?

రాయ—అప్రను కాని ఇచ్చినప్పుడు వరుస అక్కఱలేదు. మీకు దైవము తోఁపించునది యీవచ్చును

ఘోషు—ఇదియును నాశ్చర్యమే. కానిండు; పాపము మీకు వేఱుప్రసంగములవలన ధారణకు భంగము కల్గునేమో ?

రాయ—(కన్నులు కొంచెము మూసికొని యోజించుచున్నాఁడు).

కవు—(తమలో మెల్లగా) పైకి ధైర్యముగానే చెప్పినను మాటలా. ఇది చదువుట ? నేగు తెగును.

(అందఱును నొకరితో నొకరు గుసగుసలాడుదురు.)

లవం—(తనలో) అయ్యో ! తప్పఁజదువునేమొ గదా. జగజ్జననీ ! నీ సాహాయ్యమిప్పు డావశ్యకము.

రాయ—(కనులువిప్పి) ఇదిగో! చదువుచున్నాఁడను. మీరు పుస్తకము చూచుచుండుఁడు.

కవు—(కడు శ్రద్ధగా వినుచుఁ బుస్తకము చూతురు).

(అందఱును నిశ్శబ్దముగా విందురు).

రాయ—బిస్మిల్లా.....హైనాహుకితాబ. (మొదటినుండి చివరువఱకును జదువును).

(అందఱును విని కరతాళములు వైచుచున్నారు.)

లవం—(పరమానందమును బొందుచుఁ జూచును).

మల్లి—సఖీ ! యిఁక నిన్నుఁ గోరుకొనెడి వేళ వచ్చుచున్నయది.

రాయ—(చేయెత్తి వారించి) మరల వినుఁడు. దీనినే తలక్రిందుగాఁ జదివెదను.

(అని పదముల వెంబడిని గాక యక్షరముల వరుసగాఁ జదువును.)

ఘోషు—(పరమానందమును బొందుచు స్వయముగా లేచి వచ్చి కౌఁగిలించుకొని సింహాసనముమీఁదఁ గూర్చుండఁ బెట్టుకొనుచున్నాఁడు).

(అందఱును గరతాళములు వైచి యానందింతురు.)

లవం— (పరవశయై తెరదీయుచున్నది.)

మల్లి— (ఎఱుఁగనియట్లు మరల దాని సవరించును).

రాయ— (సింహాసనమునుండి లవంగిని జూచి తనలో) నాప్రియురాలు సఖీసహితయై యచ్చటనే యున్నదే! కానిమ్ము; కోరుకొమ్మన్నచో మఱియొకటిఁ గోరుకొనక యీనిధానముం గోరెడు.

పాదు— (రాయలవంక దిరిగి) మీ కింతకుమున్నే మాసామంతరాజు లొసంగిన పండితరాజబిరుదమును మరల నేనొసఁగుటను నిర్ణయించుచున్నాఁడను.

మంత్రి— అట్లేల యనవలయును? బిరుదు లిచ్చుటకు నాకు నరుహ? ఒకసారి యిచ్చినను అది యిక్కడ స్థిరపడవలయును. కనుక తాము స్థిరపఱచుట పునరుక్తము కాదు.

కవి— దేవరవారు మున్ను మమ్ము వర్ణింపుఁడని యాజ్ఞాపించిన విషయము మిమ్మహో [illegible] కవివరున కిచ్చిన నెట్లు పూర్తియగునో?

విదూ— ఇహిహీ ఇదేకదా! చిటికెలోఁ బూర్తి చేయించఁగలను. మీకు లక్ష్యము కాని మాకు లక్ష్యమా? అయ్యా! వినుఁడు. స్త్రీలకు శృంగారసాధకగణము లగు నవయవములెల్లఁ బురోభాగమందున్నయవి కదా, జడమాత్ర మట్టిదియే యగుటచే నదివెనుక నుండుట కేమికారణమని యడిగియున్నారు.

పాదు— (నవ్వి) మనప్రచండమిశ్రునకు సర్వమును హాస్యగతమే. అందులో నిట్టి సంగతులు బొత్తిగా మఱవఁడు.

మంత్రి— (వారించి) నీకేమి బుద్ధియున్నదా? లేదా? ఇయ్యది గోచ్చటనగుచున్న సభయని నీతాత్పర్యము?

పాదు— వీరి నడిగి తెలిసికొనఁ దగినదే యైనను నింక శ్రమ కలుగఁజేయుటకు నామన సొప్పకున్నయది.

కవి— శ్రమమైనను నియ్యది వారికి నాశుధారాసిద్ధికి గొప్పనిదర్శనము కదా?

రాయ— ఇదిగో వినుఁడు.

సీ. పురుషాయితమొనర్చు పూఁబోఁడి కటిమీఁద నాట్యమ్ము సల్పు పుణ్యమ్ము కొఱకొ
ఘననితంబస్థలమ్మను పెన్నిధానంబు బహుభద్రముగను గాపాడు కొఱకొ
తానాశ్రయించు కాంతకు వెన్కభాగమ్మ నను గాఁడ సౌందర్యమును జూచుకొఱకొ
పదిమంది దృష్టులు పడినఁ గంటకమంచు నూహించి కనుపడకుండు కొఱకొ
తే. గీ. వేణి కాంతల వెన్నంటి ప్రేలుచుండె
శేషయుండిన నిధువనలీల కుపచ

రించు నంగమ్ము లెదుటనే సంచునించ
దాని కట్లుండ నేయుపద్రవము వచ్చె!

(అందఱును సంతసించుచున్నారు.)

ఘాదు— పాపము, దానికేమి యుపద్రవము వచ్చినదో! మన మెట్లు గుర్తింతుము?

రాయ— (తనలో) అఖండరసికుఁడు గదా ప్రభువు! (ప్రకాశము) గుర్తింపకేమి?

మ. ఎదుటన్ వర్తిలునట్టి యంగముల కెంతేని న్నఖాదిక్షతా
పద పల్మారును గల్గుసంగతిని దాఁ బ్రత్యక్షమున్ జూచి నె
మ్మదిలో భీతిలి చాటుచోటనుచు సంభావించి వెన్నంటుచున్
బొదలన్ బోలును వేణి లేకనికిఁ దాముందుండ కట్లుండునే?

(అందఱును మఱింత సంతసింతురు.)

ఘాదు—(సింహాసనమునుండి లేచి) పండితరాయా! నీవు మనుష్యమాత్రులలోఁ బరిగణింపఁ దగినవాఁడవు కావు. నన్ను నీ వేమికోరుకొనినను నిచ్చుటకు సిద్ధముగా నున్నాఁడను.

(అందఱును లేచి నిల్తురు.)

లవం— (తనలో) దేవీ! నీ వియ్యెడల నన్నుఁ బ్రతికింపుము.

రాయ—(లేచి) నే నేమి యడిగినను మీరిచ్చువారే కదా?

లవం— (తనలో) అవును ఇట్లు ముమ్మాటికి ననిపించుకొన వలసినదే!

ఘాదు—ఈసార్వభౌమపదవి యిమ్మన్నను నిచ్చుటకు నాకు సంశయములేదు.

రాయ—

చ. గజముల నొల్ల మేటితురగమ్ముల నొల్లఁ బురమ్ములొల్ల నీ
భుజపరిపాలితం బఖిలభూమియు నొల్ల మఱొండు నొల్ల భూ
భుజ! విను మాడియెన్నఁటికిఁ బొంకనివాఁడవయే నొసంగుమ
య్య! జగదతీతమైన సొబగంది చెలంగు లవంగి నీసుతన్.

ఘాదు—(ఆశ్చర్యమును నొకింతకోపముం గూడ సూచించును.)

(ఎల్లరును విస్మయాకులు లగుచున్నారు.)

లవం— (భయసంతోషములతోఁ దండ్రివంకఁ జూచుచున్నది.)

రాయ—

చ. నరవరులెల్ల నెవ్వనికనత్పదపీఠము నాశ్రయింతు, రే
ధరణిపుఁ జూచు మాత్రమునఁ దాఁజను లేమి, దివంబునేలు నా

సురపతి యెన్ననిన్ వినినచోఁ దలయూఁచు నఖండు మామరై
పరఁగుటకన్ననుం గలదె? భాగ్యము భోగ్యము లేక యోగ్యముల్.

ఫాదు— (చిఱునవ్వు నవ్వుచున్నాఁడు).

రాయ—

శా. ఢిల్లీ యేలెడిరాజధానియఁట! ధాటిన్ విన్నవారిప్పుడున్
గొల్లల్ వోలె నృపాలకుల్ దలఁకుచున్ గోటానకోట్లబ్బురాల్
సల్లాభమ్ములు తెచ్చిపెట్టుదురఁట! యీసామ్రాజ్యముల్ గావు నీ
యుల్లం బన్నపదమ్ముతోడ సరి నా యుల్లాసమల్లింపులన్.

సీ. అన్నమాటకుఁ దప్ప కడిలిచ్చిన హరిశ్చంద్రభూపాలుతోఁ బోటి గనము
ఆడితప్పక భూమి నఖిలమ్ము నొసఁగిన బలిచక్రవర్తితోఁ దులఁ జనము
కొంకక దేహమ్ము కోసి తా శ్రితునకుఁ దూచి మాంసమిచ్చిన శిబిమానితోఁ బనము
వెనుకదీయక తన వెన్నెముక నిచ్చిన యలదధీచి ప్రశస్తిఁ గనము

తే. అన్నిటను వారికెల్లర నగ్రశ్రేయ
జాలి యిప్పట్టునందు నీసాహసంబు
జతముగాదని యెంచి గౌరవింపు
మనుపమితమానదాన! శహాబదీన!

సీ. పరదేశసంపాదనరతి మీకు నరేంద్ర! పరదేశసంపాదనరతి మాకు
లసదుత్తమపదాభిలాష మీకు నరేంద్ర! లసదుత్తమపదాభిలాష మాకు
సకలసుశ్లోకసక్తి మీకు నరేంద్ర! సకలసుశ్లోకసక్తి మాకు
మనుమార్గవర్తనం బనువు మీకు నరేంద్ర! మనుమార్గవర్తనం బనువు మాకు

ఆ. మీకు రాజపదము మాకును గవిరాజ
పదము గల దిఁకెందుఁ గొదవ లేదు
గాన సామ్య మిచ్చి మానించుటొప్పదే!
యమితదాన! యో శహాబదీన!

సీ. ఒకరాజు మున్నిచ్చె నకలంక చరితయౌ కన్నెమిన్నను మాయగస్త్యమునికి
మఱియొక్కరా జిచ్చె మహిళాశిరోరత్నము నాత్మజాత నాచ్యవనమునికి
నింక నొక్కరా జిచ్చె నిందిరాసుందరాకృతిఁ గూఁతు మాఋశ్యశృంగమునికి
వేఱొక్కరా జిచ్చె వెలలేని చెలువ నింపగుకూఁతు మాజమదగ్నిమునికి

తే. మొన్న మదనాభిరాముఁడౌ భూపుఁడొసఁగె
సాటిఁ దనకూఁతు మాబిల్హణకవిమణికి

ద్విజుల కిలఁజకృవర్తు లాత్మజల నిడుట
అపుడు గల దెప్డుగలదు శహాబదీన.

షాదు—కవిసర్వభౌమా! నీకుఁ గన్నియనిచ్చుటకు సందియము మాకెంగుకుఁ గలుగ పలయును. ఇదిగో! యిచ్చితిని.

మంత్రి— పరిగ్రహింమటలో వారికి సంశయ ముండనిచో నియ్యది సర్వోత్తమమే.

క. రూపమున నిస్తులుండు గ
దా! పాండిత నసదృశుండు తరుణవయస్కుం
డీపురుషోత్తముఁ డేమిట
లోపం, బక్కన్నెయైన లోశంకింపన్!

లవం—(తనలో) మంత్రి చక్కగాఁ బలికినాఁడు. నన్నిదివఱకే యిచ్చుకొంటిని. వీరు నిమిత్తమాత్రులు.

మల్లి—(జనాంతికము) ఇక్కడికి నీకోర్కె ఫలించినదికదా? పెండ్లియాడుట కొప్పుదువో, లేదో యని మీతండ్రిగారికి సంశయము బాధించుచున్నదేమో అది నేను పోయి తీర్తునా?

లవం—(చురచురచూచుచున్నది.)

రాయ—(కూర్చుండును.)

షాదు—(ప్రక్కనే కూర్చుండును.) (అందఱును గూర్చుందురు.)

విదూ—(లేచి) అయ్యా! వరుఁడు మాజాతివాఁడు గనుక వివాహము మామతోను సారముగా జరగవలెను జుడీ! (అందఱును నవ్వుదురు.)

లవం—(తనలో) ఈవెడగు బాపఁడీమాటలలో గుట్టు బయలఁబెట్టఁడుకదా!

విదూ—అయ్యా! నవ్వకుఁడు! నాదొక్క చిన్నమనవి; ఈయన మీపిల్లను బెండ్లాడు చున్నాఁడు కదా! పెండ్లిలో మీరు పులావు చేయించినప్పుడు వద్దను నేమో!

కపు—మాకన్యను బెండ్లాడునపుడు దానినిమాత్రి మేలకైకొనఁగూడదు?

మంత్రి—ఎవఁడురా అక్కడ?

ప్రతిహారి—(ప్రవేశించి) ఆజ్ఞాపింపుఁడు.

మంత్రి—

మ. నిలుపన్ జేయుఁడనంటికంబములు, పన్నీరత్తరుల్ కోటలోఁ
గలయన్ జల్లుఁడు, తోరణమ్ములకు వే గట్టుం డొగిన్ దోరణాల్

పిలువన్ బంపుఁ డమీరులన్, బుద్ధిమనన్ వేర్వేఱ సాధింపుఁడే
కలిగె నేఁటికిఁ జక్రవర్తితనుజాకళ్యాణముల్ గూడఁగన్.

ఇట్లు నేనానతిచ్చితినని యాయా యుద్యోగులకు వేర్వేఱుగాఁ జెప్పుము

ప్రతి—చిత్తము. (నిష్క్రమించును).

విమా—సరే! మీ రప్పుడే మాహింమామతములోఁ గలియుచున్నారే. ఇంతకు మున్ను మమ్ము మీలోఁ గలిపికొనుటయే కాని మీరు మాలోఁ గలియుట లేదు.

మంత్రి—ఇది హిందువులకును దురకలకును జరగువివాహ మని తెలియుటకే యిట్లేర్పఱచితిని.

(తెరలో).

క. ఇటులైన యొత్తగు మేడల
వరుసల నలరారు సందుపట్టులఁ గూడన్
సరసిజబాంధవ కిరణో
త్కర మది వాహ్యాళిఁ జేయఁగాఁ దొరఁకొనియెన్.

ఫాదు— (చూచి) మధ్యాహ్నముగూడ నతిక్రమించుచున్నదే, ఇఁక నిప్పటికిఁ గచ్చేరి చాలింతము.

(అందఱును నిష్క్రమింతురు.)

గద్య

ఇదిశ్రీ...తిరుపతి వేంకటేశ్వర విరచితంబగు పండితరాజమ్మునందుఁ
జతుర్థాంకము.



# పండితరాజము
## పంచమాంకము



(అంతట గోదావరియుఁ గంపయుఁ బ్రవేశింతురు.)

గోదా—సఖీ! కంపా! మీఅప్పయ్యదీక్షితులును, భాగీరథిగారి భట్టోజీదీక్షితులును గలసి మాజగన్నాథపండితరాయలను వెలిఁబెట్టినారఁట.

కంప—మావాఁడేమియు నెఱుఁగఁడఁట, భట్టోజీదీక్షితులే దీనికి ముఖ్యకారకుఁడు.

గోదా—పోనీ యెవరు కారకులైననేమి? వంశపరంపరగా నాయొద్దున నుండి స్వతః పవిత్రతఁ గాంచియు నొప్పెడికులమ్మునఁ బుట్టి యేమో చిన్నతనముచే నొక్కింత లోపము చేసినంతమాత్రమున నామొగమైనఁ జూడక వెలిఁబెట్టించుట భాగీరథికి నంగీకారముగా నున్నది కదా!

కంప—అయినను గాక పోయినను మనవానిని మన మనుకొనఁగూడదుగాని ముట్టుకొనినచోఁ దనువు గోసికొనఁ దగు పతితులపిల్ల నేమనికట్టుకొనవలెను? ఆబిడయైనను మనకన్నఁ గొంచె మెక్కుడు మహత్త్వము గలదికాని, యిట్టి పాపాత్మునిఁ బవిత్రునిఁ జేయఁగలిగినదా? అదిగాక, యీయుగమందు నదులయందేమి, దేవతలయందేమి మహత్త్వము తగ్గునని విశేషజ్ఞులు చెప్పుచున్నారు.

గోదా—ఆసంగతిలో గంగను వదలివేయవలెను జుమా.

కంప—పోనిమ్ము, ఆలాగైనను నొకరా? యిద్దరా? అందఱును నపాత్రులే బయలుదేరుచుండుట నీవెఱుఁగనిది కాదు గదా, ఎందఱనని పవిత్రులఁ జేయఁగలదు. పాపము! అదిగాక నీవిట్లు చెప్పుచున్నావు కాని భాగీరథినిఁ గూడ సెలయేటితోఁ బాటుగానే తలఁచువారు నీయొద్దుననే యున్నారని విన్నాను.

గోదా—ఇఁక నాయవస్థ తలపెట్టకుము. "కడుపు చింపుకొంటే కాళ్లమీఁదఁ బడుతుంద" న్నట్లున్నది, ఏమి సేయుదును? అందులో నీమధ్య నొక కొందఱు దుండగులు బయలుదేరినారు. మడిలేదు, మైలలేదు. గ్రహణపుష్కరాదులలోఁగూడఁ దాము మునుఁగరు సరికద, పూర్వాచారపరాయణు లెవరేని యక్కడివారుగాని దూరదేశస్థులుగాని వచ్చుటకు యత్నించిన వేదొయొక ప్రతిబంధము కల్పింతురు. మనకును నూతినీటికిని భేదమేలేదని వారలవాదము.

కంప—అట్లయినచో నిప్పుడు నీయుపయోగమే వారలకు లేనట్లున్నది.

గోదా—లేకేమి, నేను లేకపోతినేని నాఁడే చత్తురు. వివేకించి ప్రవహించిన ప్పుడు చెరువులలోఁ బెట్టుకొని పంటలు పండించుకొందురు. కొన్ని మెట్ట భూములు నా సంపర్కమున బలమెక్కి మిక్కిలిగా పండును. పంట చేఁతకు తీసికొని నిలువచేసి కొందురు. ప్రయోజనము నాలో నున్నది. భక్తి విశ్వాసములు మాత్రము లేవు.

కంప—"రోలొచ్చి మద్దెలతో మొఱపెట్టుకొంటె" అన్నట్లు నేను చెప్పినచో నాశ్చర్య పడవలసివచ్చును. నాయొద్దనను నిదియే కర్మము. మొన్నఁ గావేరియుఁ, గృష్ణయు నొకదినమున నిదే సంగతిని గుఱించి మాటలాడి కొన్నారు. ఇందులో నిప్పటికి మనమే మెఱుఁగు. కావేరిపని మఱియుఁ దేలికగా నున్నదఁట, అక్కడివాండ్రిందఱును సకలకర్మలములను దన లోనే కలుపుదురని విచారింప మొదలుపెట్టినది.

గోదా— అభిమానముచేత దాఁచిపెట్టుచున్నావుగాని యీదురాచారము నిన్న మొదలుకొనియే ప్రారంభము. భాగీరథికి మాత్ర మీకర్మ మిప్పటికి లేదు సరికదా ముందైన నుండదు. వారలకు భక్తియెక్కువ, మునుపు లేదుగాని యిప్పుడు నాకును, గృష్ణకునుగూడ నిట్టిదురవస్థ వచ్చినది.

కంప—బాగుగ నెఱుఁగవుగాని కాశిలోఁ జూడవలెను గంగదురవస్థ! తలఁచుకొని నచో నొడలు పులకరించెడిని. ఏమైనను నీవన్నట్లు వారలకు భక్తియెక్కువ. ఆభక్తిమావైపు వాండ్రకును గలదు. కావేరివాండ్రకుఁ జెప్పనే యక్కఱ లేదు. అడుగ మఱచితిని; నీయొద్దననిప్పుడు యజ్ఞశాల లేమైన నున్నవా?

గోదా—"కలిపోసినను నుట్టివంక కేచూచిన" ట్లున్నది. ఎక్కడనో యొకయజ్ఞము జరిగిన నేమిలెక్క; నాయవస్థయడుగకు. సిగ్గువొడముచున్నది.

కంప—అట్లయినచో నీవు మావలె నసమర్థురాలవు కావుగదా యెందు కూరకుంటివి?

గోదా— అనాదిసుప్రసిద్ధలమగు మనకు వీరల దురాచారములతో నేమిపని? ఊరక యట్లంటినిగాని పట్టణములలోఁ దప్ప పల్లెలలో నింకను నాయెడల మునుపటివలె భక్తి గలవా రనేకు లున్నారు. కొందఱు మూర్ఖు లున్నంత మాత్రన తక్కినవారి మొగము చూడవలదా? ఇఁకఁ గొంతకాలమునకు మాత్రము సర్వశూన్యమగునని తోఁచుచున్నది.

కంప—ఈదురాచారములు సహింపలేకయే కాఁబోలుఁ గృష్ణయొకసారి నాథునితోఁ

జెప్పినదట. అప్పుడు లోలోపల మండిపడి దానియొద్దుననున్న యాళ్లు కొన్ని దిబ్బచేసెనఁట.

గోదా—వెఱ్ఱిపని చేసినది. మనమే కొంచెము జెదరించవలెను గాని అట్లుచేయ వచ్చునా? తల్లికున్నంతయోరుపు పిల్లలయెడఁ దండ్రి కుండునా? నేనప్పు డప్పుడు కొంచెముద్రేకము చూపఁగా నంతకే సకలమైన చిక్కులును బడి యెదరు. అట్టిసంగతిలో నాథుని యుద్రేకము సహింప వీరలెంతవారలు!

కంప—మన మెంతదాఁచిపెట్టినను దుడకాయనకుఁ దెలియకపోవునా! అప్పుడెట్లును బ్రపంచము సళించును.

గోదా— పోనీ, అంతనలు కుండునుకదా. అది యింతలో జరగదులే. పండ్రెండు వత్సరము లేకరీతిగా వేదశాస్త్రప్రచారము బొత్తిగా లేక యుండవలయుననికదా పురాణములు చెప్పుచున్నవి. దీనికేమి, అంతగాఁ జిక్కి యున్నావేమి?

కంప—"ఏనుఁగు లేటఁ గొట్టుకపోఁగా నక్కపాటు రే వడిగిందఁట" మీవంటిస్థూల విగ్రహాలే చిక్కి తిప్పలఁ బడెడియీమందు వేసవిని మామాటయడుగవలయునా

గోదా—మనమాట లేమిగాని పుట్టింటిచలువను బట్టి కాఁబోలును గంగమాత్ర మింతశుష్కింపదు. ఈపాటి కప్పుడే తండ్రి మంచిమంచుగడ్డ పంపించు చుండునఁట. నాలుగడుగులు పోయివత్తము రా. భాగీరథితో మా రా యలను గుఱించి కొంచెము మాటలాడవలసియున్నది.

కంప—నేనును బోయి చాలకాలమైనది, పచ్చెదను. బహిష్కారావమానమునుసహిం పక తనలోఁ బడఁబోయినప్పుడేనిఁ గరుణింపుమనియేగా నీవు చెప్పవలసినది.

గోదా—అంతపని చేయఁడు గాని, యేదోవిధము గాస్తుతిచేసి ప్రసన్నురాలనుజేసి కొనఁగలడు. నేను వేఱే చెప్ప నే అక్కఱలేదు. ఎందుకేనియు నొకసారి పోవలెననియున్నది. తెల్లవారుజాము కావచ్చినది. స్నానసమయమునకుఁ బోగలుగుదుమా?

కంప—పోకేమి పద. (అనినిష్క్రమింతురు)

(ఇది విష్కంభము)

(అంతటరాయలు లవంగితో సౌధసమీపమున సోపానము...

గూర్చుండి ప్రవేశించును.)

రాయ—తరువాత, తరువాత?

లవం—వెనుకఁ దమతోఁ జెప్పినచొప్పున నే యంబిక పొడకట్టినది.

రాయ—పునరుక్తిగా భావింపక యారూపమును విస్తరించి వచింపుము:

దురుష్కకన్యాసమాగమము దొడరుఁగదా యని చింతించి దాని కిది వఱలోఁ బ్రచండమిశ్రునివలనఁ దాము వినినవిధమ్ముగనే సంఘటింపఁజేసె ననియును జెప్పి యంతర్హిత యయ్యె.

రాయ— (తనలో) ఇందు సందియ మే ముండును? (ప్రకాశము) చెలీ! నేనిప్పుడు నీకు వేఱే చెప్పనక్కఱలేదు గాని మనయాథార్థ్యము ప్రపంచమునకు వెల్లడించి వచ్చిన యపయశముం బోఁగొట్టుకొన నే నీగంగామహాదేవిని సాక్షిగాఁగోరుచున్నాఁడను. ఆమె యొకవేళఁ గలుగఁజేసికొననిచోఁ బ్రాణత్యాగంబొనరించెదను. ఇందులకు నీకును నంగీకారమేకదా.

లవం— నే నని వేఱుగ నున్నచోఁ దమ రట్లుసెలవీఁ దగును. సూర్యుని విడిచి కాంతి యెచ్చట నుండును!

రాయ— (తేఱిపాఱఁ జూచి) అదిగో, భట్టోజీదీక్షితులును. అప్పయ్యదీక్షితులును, శిష్యులును, మఱికొందఱు మహావిద్వాంసులును స్నానార్థమరుదెంచుచున్నారు. దీని కిదియే సుసమయము.

(అంతట పైవారు ప్రవేశించుచున్నారు.)

లవం— నాథా! వేసవియగుటచేఁ గాఁబోలు గంగ కడుఁజిక్కియున్నయది.

రాయ— ఆలోపమే యిప్పుడు నేను దీర్పఁబూనినది. ఏకాగ్రచిత్తురాలవై యమ్మహాదేవిని స్మరించుచుఁ గూర్చుండుము. (బిగ్గరగా)

శా. గంగాతీరనివాసు లెల్లరుఁ బ్రతిజ్ఞా జక్క నాలింపుఁడీ!
శృంగారాంగిఁ దురుష్కకన్యకను నే నిల్లాలిఁగాఁ గొంటినం
చుం గాలుష్యము నిర్ణయించి నను శిష్టుల్ బాహ్యుఁగాఁ జేసినా
రంగీకారమె నాకు; స్వర్ధునికి రాదా, లోప మిప్పట్టునన్?

(అందఱునువిని వారివంకచూతురు.)

భట్టో— (అప్పయ్యదీక్షితులతో) ఆదిగో, రాయలు సిగ్గులేక తానేకాక యాతురకదానిన్ గూడఁ దగుదునంచు దగ్గఱఁ గూర్చుండఁబెట్టుకొనియున్నాఁడు.

అప్ప— ఆహాహా! బ్రాహ్మణ్యమున కేమిగాని, ఈయనకు వ్రతముచెడినను ఫలము మాత్రము దక్కినదనుటకు కించుకయు సందియములేదు. ఏమి యీ చక్కఁదనము!

రాయ— (దోసిలిఘటించి)

తే. గీ. అవనిపాలకోటి భాగ్యంబు శివుని రేఖ
ఆగమధనంబు కవుల భాగ్యాతిశయము

క. ఏ నీదరికాకమ్ముల
కేనిఁ స్వర్గేచ్ఛలేమియే నిక్కెము నా
కా నీతీరము జనిమర
ణానంత్యాహరమ్ము శ్రీమము నడఁపదె జననీ.

క. శ్రుతివాక్యాతీతమ్మై
మతికి నగోచరమునై స్వమహిమహృతతమో
గతియై శుద్ధంబగు నా
త్మతత్త్వ మననీవ యింతతథ్యము జననీ !

భట్టో—(ఆశ్చర్యముతో) ఇది యేమో, గంగ నేఁ డకాలమ్మున నింతవృద్ధి చెందుచున్నది!

అప్ప—ఈ వేసవియెండలకు హిమగిరినుండు మంచుగడ్డలుకరఁగి యిట్లగుటకలదుకదా?

భట్టో—అదియే యైనచో నింతలో నింతవృద్ధికిఁ గారణముకాదు. చూడుఁడు, ఒకటియా! రెండా! అప్పుడే పదిమెట్లెక్కినది.

అప్ప— అగును. కారణ మేమైయుండునో!
(అందఱును క్రింది మెట్లనుండి పైకితప్పుకొనుట నభినయింతురు).

రాయ—

తే. గీ. జన్మములు చేసి, తపములు సలిపి, దాన
ములు పొనర్చియుఁ బడయనిముక్తిపదము
సర్వసాధారణముగా నొసంగునిన్ను
నెవరితోఁ బోల్ప నేర్తు లోకైకజనని!

క. ఏ నిన్నర్ధాంగికొకిం
తేనిఁ దలఁకుగొనక నెత్తినిడుకొనె హరుఁ డీ
శానాశితకల్మష మం
బా! నీమూర్తి మహిమ మది వాచ్యంబగునే.

తే. గీ. వ్రాత్యులకును వాతులులకుఁ బతితులకును
భిక్షులకుఁగూడ నేవమ్మ పెంచు పాత
కము లొనర్చునీచులఁ బ్రోవఁగా నొకప్డు
విసువు గాంచని దానవీవే మదంబ !

తే. గీ. జనులతాపంబు హరియింప జగతి కురుకు
నిన్ను బంధించె జడలలో నీలకంఠుఁ

డంబ! యదినీదుగుణములయందుఁ గలుగు
దోసమేకాక లోభియే యాసనారి!

తే. గీ. జడులు కొందలగువారల శక్తిహీను
లగుచు నుర లూగకున్న నయ్యాపనుఁ జూచి
నరకమునఁ బడకుండఁ గ్రన్నన సుగతికి
ననుపమాస్పదంబ వోయంబ! నీవు.

తే. గీ. సహజశీతలమును శుద్ధిబహుళమునగు
నీజలంపు మహత్త్వ మనీదృశంబు
కిని నేకద! సగరజుల్ దివి నుతింతు
రిప్పటికి మేనఁ బులకము లెసక మెసఁగ.

ఉ. ఇంతలు నంతలుఁ గా దొసఁగు లేనటులే నొనరించి యేనదీ
ప్రాంతముజేరి యేనియును బావనతన్ గనవచ్చు నంబరో!
యెంతకు నెంతలో దొసఁగు లెట్టిప్రతిక్రియకున్ నశింపవు
న్నంతటి వాచరించుఖలులందఱకీ వొకయాప ప్రోపఁగన్.

తే.గీ. ధర్మనిధి, మోదదాయి, తీర్థమణి,
త్రిభువనీసతికి తెల్లచీర, మనీష తెఱవు,
దుర్మతి వినాశకాలంబు, దూత సిరిక
నంబ! నాతాప మడఁచు నీయంగకంబు.

తే.గీ. ధనసురాపానమత్తుల ధరణిపతుల
నాశ్రయించుచు నినువీడి యఖిలవిధము
లైనఖేదమ్ము లందుచు నాత్మహితము
నెఱుఁగనిజడుండు వీని సహింపు మమ్మ!

తే.గీ. గాలిచేఁ దూఁగుతరఁగలఁ గదలుతమ్మి
పుష్పాదుల నొప్పి యచ్చరపూవుఁబోండ్ల
గుబ్బలందలియగురున గుబుగుబొనెడి
నీజలము సాజననబాధ నీఱుసేయు.

అప్ప— (పరమాశ్చర్యముతో) దీక్షితులుగారూ! చూచుచున్నారా, యెంతలో నిదు వది మెట్లెక్కినదో! పర్వతములలో నొకప్పుడకాలవర్షములు గురియుట చేతఁ జూడుండీ యిట్లు తటస్థించుట.

భట్టో—అకాలమేకాదు. తొలకరి సమీపించినదికదా! కొంచె మించుమించుగా ఋతుధర్మములు పూర్వులు వ్రాసియున్నారు గాని, అందులోఁ గొన్ని వెనుకముందు ఋతువులలోఁ గూడఁ గన్పట్టుచునే యుండును. తాని నీటియందుఁ గాలుష్య మించుకయుఁ గన్పట్టదు.

అప్ప—అవును. తా మనినట్లు బహుస్వచ్ఛముగా నున్నయది. ఇదియేదో విచిత్రముగా నున్నదే!

లవం—(మెల్లఁగా) నాథా! అప్పుడే గంగ యెన్ని మెట్లెక్కినదో చూడుఁడు. జనులందఱును బైకిఁ బరుగులెత్తుచున్నారు.

రాయ—(వినక తదేకదృష్టితో)

ఉ. పుట్టినపుట్టువా! జలధిభూధవపాదవఖాగ్రసీమ, పై
మెట్టినచోటు సాంబునియమేయజటాభవనంబు! వర్తనం
బెట్టియఘమ్ములేని హరియించి దురాత్ములఁబ్రోపు! నీకు నె
వ్వట్టున గొప్పలే దఖిలపావని! దేవనివాసధావనీ!

చ. నగములనుండి తా మనుదినమ్మను బాఱునదీగణమ్ము లె
న్నిగలవు, సాంబుశీర్షమున నిల్వఁగ నేర్చెనొ? శ్రీశుపాదప
ద్మగతరజంబు వోఁ గడుగుధన్యత గాంచెనొ? యెక్కడేని, నీ
బాగడినసోట నేనదిని బోలు నుతింప? నదీశిరోమణీ!

తే.గీ. అజునిఁ దపమాచరింపని, మ్మహిశయనుని
నిద్రఁ బోనిమ్ము, హరు నాడనీ, ప్రతిక్రి
యలును దానయజ్ఞాదులు నడుగుఁబట్టు
నిమ్మఖిల మిచ్చు నీవ మాయమ్మ! చాలు.

సీ. అనదలలోన నేనగ్రగణ్యుండ నీహృదయంబు ప్రేమసంపదకుఁ దావు
ఎందును గతిలేని హీనుండ నేను దివ్యగతిప్రదంబు నీదైనపట్టు
పడుచు లేచుచు నున్నవాఁడనే నీవు విశ్వోద్ధారణమ్మున బద్ధదీక్ష
బాధిబాధాభగ్నశాంతరుండను నేను సిద్ధౌషధంబు నీసేవనంబు

తే.గీ. తృష్ణచేఁ బీడితుఁడనే నమృతమ నీవు
నేను బుత్రుండఁ దల్లివి నీవు నిన్నుఁ
జేర వచ్చితి నెటునేయఁజెల్లు నట్లొ
నర్పఁగద పమ్మ! దేవి! జాహ్నవి! మదంబ!

తే.గీ. అణఁగెఁ గోటి పాపములమ్మ యనేకలయమున,
నెందుఁబోఁ జాలని ఘటులు దుష్కృతములనడఁచి
నీదుకథ భూమి నెప్పుడు పాపకోటి నిగ్రహ
నప్పుడె యణుకదయ్యోనంబ! స్వర్గపురనిర్ఝ.

క. కామక్రోధ జ్వరముల
చేమలమల మఱుఁగుమమ్మ శీతలనాయము
శ్రీమహితము గంగాజల
మోమున్ సంతాపమెల్ల నుక్కడఁచి కృపన్.

తే.గీ. అఖిల భువనమ్ములందు బ్రహ్మాండమెచటఁ
దుమికి పందునుబోలె ఖంగముల నడుమఁ
బొరలు శీఘ్రకంబుజడల నొప్పఁగను నా ప్ర
వాహము హరించు నాదుతాపంబునంబ!

మ. ఎవనిన్ నైశము పూతుఁ జేయమికిఁ దీర్థేంద్రమ్ములెల్లన్ ద్రిశా
ఖనసం బయ్యె, భవాదిదేవత "లహో! పాపాత్ముఁ డే" ట్లంచుఁ గేల్
చెవి సంధించిరి, దేవలోకఘని! యీ చెట్టన్నమున్ సృష్టఁజే
సి విదారించెను వారివారి యఘవిచ్ఛేదంపు దర్పమ్ములన్.

ఉ. కుక్కలఁజంపి భక్షణము కొంకకచేయఁగ రోయ కెవ్వ రా
పక్కనవాసులున్ సలుపఁ బాల్పడలేని యఘమ్ములెల్ల నే
నొక్కటిఁ దక్కకే సలిపియుంటి ననున్ బరిశుద్ధుఁ జేయ నీ
వెక్కటిఁ గట్టుచుంటి నడుమీపను నంబ! నిను న్నుతించెనే.

ఉ. "చూచుచునుంటి నెన్నఁడును జొప్పడఁ డెక్కడు పాపశాలి యే
నీచుని బ్రోచి యీజగము నేను బళీ! యని మెచ్చఁజేతు నం"
చే చిర మున్న నీమనసునిచ్చ ఫలింపఁగ వచ్చినాఁడ నన్
బ్రోచుట నీకుఁ బెద్దయశొ మో జగదంబ! బహూక్తు లేటికిన్.

భట్టో— (వినుట యభినయించి) అప్పయ్యదీక్షితులు గారూ! ఆ ప్రవాహధ్వని వినుచున్నారుకదా! యేమి యీపరమవిరుద్ధము, కలియుం జెల్లరన్ బోలె నదులును గట్టునకుం దప్పనుకాఁబోలును!

అప్ప— బహుసంరంభముమీఁద వచ్చుచున్నయది. ఆదరినిఁ బైకినీడ్చి బాగుచేయఁ బడుపడనలన్నియుఁ గొట్టుకొని పోవుచున్నవి. మనమింకను పైకిఁ బోవ

డము రండు. (లెక్కించి) అప్పుడే ముప్పదిమెట్లు మునిగినవి. (అట్లొనరింతురు.)

రాయ—

మ. సునకమ్ముగా బలెఁ బొట్ట పేద్చుట సయాశూన్యత్వముగా సూనృతం
బునకుఁ దక్కుటయుగా సతర్కములతోఁ బోరాట దుర్మార్గవ
ర్తనముగా నాసుగుణంబు లియ్యవి చెవిగా దాఁకించి నిన్ డక్కనో
క్కని పేసమ్మను నామొగమ్ము గనఁ డొక్కండు న్నిజం బంబరో !

తే.గీ. కన్ను లెంతలుగల్గినఁ గార్య మేమి?
నిన్నొక క్షణిఁ జూడఁగ నేరవేని;
నీదుకలకలమును విననేరకుంట
చెవ్వుల కవి వంచనం బంబ ! సిద్ధ మింత.

చ సుకృతమొనర్చువారు చనుచోటు దివం బసుముల్ పొనర్చువా
రికి నరకం బ టంట యురరీకృతమాట భవత్ప్రచారనా
స్తికమగు దేశమందు నినుఁ జెందినదేశము లీవిభాగ మొ
ప్పకయ చరింపుఁ బాపములు వాపెడిశక్తివి నీవు గల్గుటన్.

తే.గీ. విప్రులను దున్నించి గురుసతీవిటత మించి
కల్లు చెడఁగ్రోలి కనకతస్కరతఁదూలి
యును దుడకు నీదరినిఁ దనువూడ్చి జనుదు
రంబ !సోమయాజులు చనునట్టిగతికి.

క. సుమనస్సౌరభచోరుం
డు మనోజార్తానుహారుఁడుగా గద ! యనిలుం
డనులంబగు నీసంప
ర్కమున జగము శుద్ధిచేయఁ గలిగెడి నంబా !

ఉ. ఈధరఁ గొంతమంది పరమేగఁ బరోపకృతుల్ పొనర్తు రా
స్థాస్ఫృతి యజ్ఞకర్మములు సల్పుదు రింకొకకొంచ తీజగ
న్నాథుఁడుమాత్రి మంబ ! భువనవ్యయభారము నిన్నుఁబూన్చి యే
గాధయు లేక దా సుఖముగా నివురించుచు నున్నవాఁ డహో!

తే.గీ. వాత్రిత్య్వ లథములు నగునట్టివారిఁ జేరి
**పావనము సేయ నీ కెంత పట్టుదలరొ**

నాఁటి నంతియు నాఁడు మెఱుఁగుప్పసక్తి
సకలగుణ మేఁగతేని దుస్త్యాజము గనని !

తే.గీ. సంగపట్టుస నటియించుచంద్రమౌళి
జడలఁ దనవారిపోలిక సరిగ లహరు
లనెడిభుజముల నభినయం బమర నీ ప
నస్పునటనంబు నాతాపమోర్చుఁ బల్లి !

ఉ. అన్నిటి కీవ యుంటివి పని యాగడముల్ కడుఁ జేసిచేసి నా
పన్నెడ నైతి నీవిషమసర్గనపుందడీయందు నాకు నీ
మన్నన సున్నయేని యిల మ్రిగ్గెద నమ్మిక ! నిర్భలానుకం
పోన్నతి మన్నుగాదె ! జగమూడదె ! నీప యొఱుంగుడంబగా !

చ. హరునికపర్దమందు నవయాడుచు నాడుచు మధ్యమధ్య స్నే
హరసమిళత్తదస్థితనువాసల పార్వతిపాపటజ్ఞ గతి
స్ఫురణముచూప నాపెయు నసూయ కనుంగొనలందుఁ బోవఁ గే
ల రవిూ నదల్చు నీలహారుఅజ్ఞ జయసీమల నెంతు నంబరో !

అప్ప—ఓహోహో! పట్టణ మంతయు మేడలనెక్కి చూచుచున్నది. ఇయ్యది యకాలప్రళయమో యనునట్లు తోఁచుచున్నది. ఇప్పటికి నలుబది మెట్లెక్కినది.

భట్టో—అవును, ఇయత్త లేకుంటచే నెవరును స్నానమొనరింప జంకి వెనుక కేగుచున్నారు కాని అటుచూడుఁడు! రాయలుమాత్ర మాతురకబీబీతోఁ గదలక యేదో పెద్ద నిష్ఠాపరునివలెఁ బఠించుచు నాఘట్టమునఁ దన మేడపరిం గూర్చుండి యట్లే చలింపక యున్నవాఁడు. ఇంతకు నిది యాయనకవిత్వ మాహాత్మ్యము కాదుగదా ?

అప్ప—( అటుచూచివిని ) గంగమీఁద నేవో శ్లోకము లిదివఱలోఁ జేసినవో యిప్పుడు జేయుచున్నవియో కాని పఠించుచున్నాఁడు. ఇది యేఁటి పనునా? ప్రతిదినమును మహర్షిప్రవరులచే రచింపఁబడినశ్లోకములచే నెందఱు నుతించుటలేదు.

భట్టో—అట్లనకుఁడు. చూడుఁడు. ఆయన మొగమున నెట్టిదీక్ష గానఁబడుచున్నదో.

అప్ప—ఆయనదే కాదు. ఆతని మొగము నందు నట్టిదీక్షయే కన్పట్టుచున్నది. సమీపమునకుఁ బోయి విని పరికించెదము గండు. ( ఆట్లొనరించి యుచ్చైస్స్వరముగా వినుచున్నారు.)

రాయ—

క. ఎందఱు రా రిచటికిఁ గో
ర్కెం దీర్తువటన్న యాసఁ గృత్రిమరక్తిన్
జెంద స్నీతోడే నీ
యం దిది సహజంబ నాకనాదిగ జననీ!

క. ఏనీమ్మృత్తికఁ దామ
జ్ఞానహృతికి నుదుటఁ దాల్పఁగా విధిలిఖితం
బై నయనిష్ఠ మ్మడుఁగునొ
దానన నాతాపమెల్లఁ దఱలున్ దల్లీ!

చ. జనపదసక్తులన్ గని యొసంగెడిహాసము నాఁ జెలంగుతె
ల్లనికుసుమంబులం దగి విలాసగతిన్ మలినాళిపుంజమున్
దనతనదివ్యసౌరభవిధమ్మునఁ బూతముగా నొనర్చు దే
వనదికి దాపునం దనరుపాదపముల్ చెలికాండ్రు నాకగున్.

ఉ. ఎంతకునుంగరంగని దురీహలు దేవతలన్నఁ గర్మముల్
సంతతనిష్ఠలన్ సలుపఁజాలిన మేటులుఁ జేయరాని నీ
చింతలఁ గొంద ఱుందు రిఁకఁ జీరికినిన్ గొననీ జగంబు జ
న్మాంతము సేయు నీస్మరణమందు సమస్తము గాంచితల్లిరో!

ఉ. పుట్టిన దాదిగాఁ దనువు వోయెడునంతకుఁ బుణ్యకర్మముల్
గట్టినవారిఁ బ్రోవఁ దగుకారుణికుల్ శతముల్ సహస్రముల్
పట్టొకయింతలేని గురుపాతకులన్ గడతేర్చుపాంటె నీ
యట్టికృపాధికుల్ పృథివియందు మఱెందును లేరు జాహ్నవీ.

చ. జనని పయస్సు గ్రోలి జడసంగతి నాటల నాడఁబోయి శ్రాం
తి నెఱుఁగకే చిరమ్ము వెనుఁదీయక యాడితి బుద్ధివచ్చె ని
ద్రను గొనవెంతు నంకమునఁ దారిచి పూర్తిగ వాయువీజనం
బున నిదురింపఁజేయు మిటుమున్నరకం బొనరింప నెన్నఁడున్.

ఉ. గాథలకేమి వే నడుముగట్టుము లేనెలతోడ గూఢపా
ప్నాథుని మాలిఁ దాల్పు మొకనాఁటికి "నా కిదియెంత" యంచు నీ
వీధరతోడిపాటు మది పేలు మొనర్పకు మంబరో! జగ
న్నాథుని నుద్ధరించెడిక్షణం బిది యూతడ వేల? జాహ్నవీ.

చ. వర మహియందు కుంభమును బమ్మము నాలుగు మోములం [illegible], సుధా
కరశకలంబు ఫాలము, సుగంగ గాఢముపుట్టుచు, ఘూర [illegible]
రరుచికి వన్నెఁ బెట్టి మకరమ్మున నెక్కుడు [illegible]
బరగతిఁ గాయునికిఁ బలుకుచునారు పరాకు [illegible]!

ఉ. అంతటఁ [illegible] వ్రాలయునాస్యరుచుల్ [illegible]
క్రాంతుల తాప మార్గ నెటుగాంచినఁ [illegible]
త్వింతగ నింతయంతనని పన్నుల నొల్కఁగఁ [illegible]
శంతనుభార్య నా కిఁక [illegible] సౌఖ్య మనంత [illegible].

ఉ. మందులు [illegible] మంత్రములు మాన్పవు [illegible]!
సందుల నొందులకుఁ బడు సహారమునకు [illegible] ?
రంబు గరుత్మదశ్వములు వ్యర్థములౌ [illegible]
గండెడి నాదుతాపము [illegible] నిపయటేక [illegible]!

భట్టో—(నమ్రతతో) చూచితిరా? యిఁక [illegible] మోట్టు
గూడ మునిఁగెడిని.

అప్ప-అవును. ఆయనకుఁ గాని, యామెకుఁ గాని యీ [illegible] నున్నట్లు లేదే?

భట్టో—వారికెందుకు భయముండవలయును? ఇవి నాకల [illegible] కదా.
ఆపద్యములు వింటిరా? అవి విని గంగయే యనకుండు, ఎవ్వ [illegible] యుండ్వంగ
వలసినదే.

అప్ప—యవనంతరన్యాయముచేఁ దమకన్నట్లూహింపవలసినదే యున్నది గాని
నిజమునకు మాత్రము సంగీతమునకుఁ జింతకాయలు రాలవు.

భట్టో—మన మసూయచే నట్లనుకొనుమాత్రమే కాని గంగకు నిజమైన పతితపావను
రాలన్న బిరుదున్నచో నమ్రహాకవిశక్తి తెలియుచున్నంగదు? అట్లయినచో
వేద శాస్త్రాదు లసత్యములే కావలసివచ్చును.

అప్ప—అవును, మొన్న మొన్ననే కదా! విద్యారణ్యులవారు కనకధారాస్తవ మొన
రించి బంగారువర్షము గురిపించిరని వినుచున్నారము కాని ఆయనకును
ఈయనకును యోగ్యతకేమి పాండిత్యమునకేని సామ్యమెక్కడ [illegible].
నక్కెక్కడ? దేవలోకమెక్కడ?

భట్టో—ఇంకను మీయసూయ మొదలంట నశించినదికాదు. భక్తికిని పాండిత్యము
నకును గడుపవ్వ. ఏపుట్టలో నేపామున్నదో యెవరికెఱుక! పయి కిట్లున్న
వారలే మహానుభావులు కావచ్చును. దత్తాత్రేయులవారిని వినుచుంటిమా?

లేదా? మన మిట్లు మీనమేషములు లెక్కించుచు నుంటిమేని యిఁక నొక క్షణములోఁ గాశి గంగపాలు కాకతీరదు. దానంజేసి మనకిరువురకును నప్రతిష్ఠ తప్పదగును. మన మొనరించిన యవమానమునకు రోసికదా! యీయన నస్మాత్తుఁ జిల్లొనరించుచున్నాఁడు. గంగయుఁ బ్రత్యక్షముగాఁ జెప్పకున్నను మహానుభావుఁడే యని మనకు బోధించుచున్నది. ఇప్పటికి నేఁబది మెట్లెక్కినది. యిఁకఁ దక్కిన వానికి లక్ష్యమా?

అప్ప—కాశి కెప్పుడును భంగముండదు. ఉన్నచో నానామము నేతిబీరకాయయే కదా! కాశ్యతే ఇతి కాశీ, అను వ్యుత్పత్తికిఁ బ్రళయకాలమందు సయితే మిట్లున్నయెడల నే సార్థక్యము.

భట్టో—మీశాస్త్రార్థములు గట్టిపెట్టుఁడు. భక్తులఁబోఁచుపట్ల భగవంతుఁడు శాస్త్రములు చూచువాఁడు కాఁడు. మన మీపాటికి నయ్యనఘునిఁ బ్రార్థింతము పదుఁడు.

(బలవంతముగాఁ జేయిపట్టుకొని దగ్గఱగాఁ దీసికొనిపోవును.)

రాయ—

మ. తనచర్మమ్మును బాములుఁ శశియు రుద్రాక్షల్ మొదల్ సర్వ మొ
క్కని మేషమ్మున శంభుఁడోడి లవముఁ గన్పట్టమిఁ గౌరి నొ
డ్డను నంకింపుడు నాపె నవ్వోలయుఁ జూడఁ జూడ జూదంబు గె
ల్చినయానాఁటి భవన్మహానటన ముచ్ఛేదించు నాకర్మముల్.

భట్టో—అప్పుడే పాదములున్న మెట్టెక్కి పాఱుచున్నయది. కాశిక పోకపోయి నను నితఁడైన నిప్పట్టున నీపాదుపాపట్టితో నట్టేటఁ గలయక తప్పదు.

అప్ప—అవును. అట్లే పాడకట్టుచున్నయది. ఉపాయమేమి?

భట్టో—ఇతఁ డీసమాధిలో మనమాటలను వినిపించుకొనునట్లు తోఁచదు. ఈపెను బ్రార్థింతము. (ఆపె నుద్దేశించి) అమ్మా! మహాపతివ్రతా! నీకు మే మందఱమును నమస్కరించుచున్నారము. నీభర్త నెట్టైని యీగంగామహో పప్లవము వారింపఁ బ్రార్థింపుము.

అప్ప—బాగుసేయక యిట్లొనరింపక తప్పదు.

లవం—(తనలో) అయ్యో! నీచురాలనగు నన్ను వీరిట్లు బ్రార్థించెదరే! నేనేమి సేయుదును (ప్రకాశము) నాథా! నాథా! (శరీరము స్పృశించి పిలుచును)

రాయ— (వినవిధమున) క. గంగ విభూషితలింగ వ
రాంగ సకృత్కృత్తపాతకాపాంగ లస
ద్భంగ సరోజప్రాంచ
ద్భృంగ మదీయాంగములు పవిత్రము సేయుఁ౯.

లవం—(గంగ కంజలిఘటించి) అమ్మా! నీవైన నామనవిచేకొని నన్ను నీరభ్యర్థించిన దానికి ఫలము గల్పింపుము.

గంగ— (అంతటితో నాఁగుచున్నది) (అందఱును నాశ్చర్యపడుచున్నారు.)

రాయ—(తనలో) ఏమిది!

ఉ. "గోపికతాళనాన్వయజఁ గొంకక యీశతపత్రనేత్రి నీ
కాపురుషుండు గట్టికొనెఁగా?" యని శంక యొకింత లేక మా
దాపున కేగుదెంచితి వృథా మరల౯ జనదేల జాల? మీ
యేపున లోనఁ జేర్చికొను మిందఱు నివ్వెఱఁగంద జాహ్నవీ.

శా. శుద్ధాంతఃకరణుండ నేనిఁ గవితాశూరుండ నేని౯ గళా
రాద్ధాంతమ్ములఁ బ్రోడ నేని నిను నారాధింతు నేనిన్ ఋత
శ్రద్ధాపద్వచనుండ నే నుపనిషత్సారస్వరూపుండ నే
నుద్ధారం బొనరింపుమా! నను మహాయోగీంద్రచూడామణీ.

ఉ. ఎన్నఁడు నించుకేని దొసఁగెట్టిదొ నేరనివారు నీవు లే
కున్నఁ బవిత్రులే కడు నయోగ్యులఁ బ్రోచినపోత్రపు పోత్రపు సం
పన్నుల కే రొసంగవలె! భాగ్యవిహీనులఁ కీగి యీగి ము
న్నున్న ప్రతిష్ఠ నిల్పుకొను మోజగదంబ! బహూక్తు లేటికి౯.

ఉ. శ్రీ ధరియించు టెప్పుడేఁక? గ్రీవ; శిరమ్మునఁ జంద్రుఁ డేడి? గం
గాధరముల్ జటావళులు గల్పనసేయ పదేమి? నీకు నా
భూధరరాజకన్యకకుఁ బోరడప న్వలదే! కటా! జగ
న్నాథుని నుద్ధరించెడిక్షణం బిది యీతడ వేల? జాహ్నవీ.

గంగ—(అట్లే హెచ్చక యుండుటను అందఱును నిశ్చేష్టులై యుందురు.)

రాయ—(కొంచెము కోపముతో లవంగిం జూచి)

శా. ఇంకను౯ గాల మటంచు నెంచ కేటులో యీనిన్నును న్నన్నని
స్నులకావేళలఁ జేయఁబూని కృప నాభాగీరథీదేవి రా

సుంకించెదేని మన కేమి కేల్మోగిచి యిట్లుండగా దగుంగాక యే
ణాంకాస్యా! బ్రతు కెంత శాశ్వతము? లో నారాట మింతేటికిన్?

లవం—(భయముతో) నాథా! వీరిమాటకుఁ బ్రతిచెప్పఁజాలక యే నిట్లు ప్రార్థించితిని.

రాయ—వీరెవరు? (దెసలుపరికించి) ఓహో! వీరా, అట్లయిన వీరి యెదుటనే మన యాథార్థ్య మీగంగాముఖమునఁ దేలుంగాక.

(తెరలో)

గంగ—(రత్నభూషణసహితమగు కరద్వయము పైకెత్తి)

తే. గీ. ఈజగన్నాథుచే రచియింపఁబడిన
యట్టి పీయూషలహరిఁ దా మహరహంబు
పఠన చేసెడివారికి భాగ్యమబ్బు
సౌఖ్యముల్ గల్గు దుఃఖముల్ శాంతిఁజెందు.

(అందఱును నాశ్చర్యముతోఁ జూచుచు విందురు.)

రాయ—(తనలోసంతోషముతో) ఓహో! అంబిక తన దేవతాత్మత్వము గూడ వెల్లడి చేయుటయేకాక నాయీగంగాలహరీస్తోత్రమునకుఁ బీయూషలహరి యని కూడ బిరుద మిచ్చినదే!

(మరల దెరలో)

వత్సా! జగన్నాథ!

శా. సాక్షాద్బ్రహ్మవు నీవు, నీసతి సరస్వత్యంశసంజాత, మి
మ్మాక్షేపించెడివారునుం గలరుగా! యైశ్వర్యపర్యాప్తికై
యీక్షోణీస్థలి పాదుషాగృహమునం దేణాక్షి పుట్టెన్ సతీ
త్వక్షోభం బదిగాక యుండుటకుఁ దాత్పర్యంబు నీరాకకున్.

(భట్టోజీదీక్షితాదు లొకరిమొగమువంక నొకరుచూచికొనుచు నిశ్చేష్టులై విందురు.)

రాయ—(తనలో) స్వప్నమునఁ జెప్పినట్లే యిప్పుడును జెప్పుచున్న యాదేవి కిట్టి యాయా భేదమ్ములచే ననేకగతుల నుండినను దుదకు నొక్కటియే కదా!

లవం—(తనలో) గృహమందుఁ బుట్టినది యనియే చెప్పుచున్నది. కాని సాక్షాత్పుత్రిక యని చెప్పలేదు, సర్వజ్ఞయగు నామె కొకరహస్యము దాఁగునా?

(మరలఁ దెరలో)

తల్లీ! లవంగి!

ఉ. పుట్టినదాది యాపయిని బుద్ధియెఱింగినదాది యెన్నఁడున్
ముట్టదయు మాంసభక్షణము చేసియెఱుంగవు నీదుతండ్రి యా

పట్టపురాజు కాఁడు నుమి, బ్రాహ్మణవర్యుఁడు, మిమ్మునున్ వెలిన్
బెట్టిరిగా! అయైన, నను బెట్టరె? సాహసికుల్ బుధాగ్రిణుల్.

లవం—(తనలో) ఇప్పటికి నన్నుఁగూడ విస్పష్టముగాఁ బవిత్రురాలిఁగా సమర్థించినది.

(మరలఁ దెరలో)

జానోయి! భట్టోజీ! ఏమోయి? అప్పయ్యా!

ఉ. చదివితి రేటి కీచదువు, సత్త్వము లెవ్వరో, యేరితేజ మె
ట్టిదియొ, యెఱుంగఁగావలదె! డీకొని వాద మొనర్చుటే మహా
పదవియొకో! జగత్త్రియము పావన మెవ్వరికల్మి నట్టివా
ఙ్మదవతియున్ విధాతయును మాన్యతకున్ దగరో కొ! యిక్కటన్.

(ఇరువురును నంజలి ఘటించి వడవడ వణఁకుదురు.)

(మరలఁ దెరలో)

తే. బ్రాహ్మణక్షత్రియులయందుఁ బరఁగు తేజ
మెల్ల యవనులయం దిప్పుడిమిడె నింక
హూణులనుబొందుఁ గలియుగ మొక్క కొంత
జరగుపిమ్మట మీయాటసాగు టెట్లు?

శా. పమి నేనో, సిరియో, సరస్వతియొ, యంబాదేవియో పేర్మి నిం
చేయకున్ రాణిగ హూణవంశమున జన్మింపన్ వలెన్ నాఁడొకిం
లేము వర్ణాశ్రమధర్మముల్ నడువ "వీధార్ష్ట్యమ్ములన్ మానుఁడ
య్యా" యటంచున్ లిఖియింపుఁ దీరలు భవిష్యద్గ్రంథసందర్భముల్.

ఉ. తురకలఁ బోలె హూణు లొకతుందుడుకున్ గలిగింప రూరకే
నరులు కులానువర్తనలు నాశ మొనర్తురు వారిమీఁద నె
వ్వరుఁ గనలంగరాదు యుగవైఖరు లట్టటులౌను దైవతా
దరమడుగంటు సర్వమును దప్పు నొకండని చెప్పనేటికిన్.

ఉ. బడుల నెపమ్మునన్ బని నెపమ్మునఁ బాట నెపమ్మునన్ ధనం
బుడుగక యబ్బు హేతువున నూరక బ్రాహ్మణు లొక్క పెట్టుగాఁ
జెడి మతమేదియున్ గనక చేయని చెట్ట యొకింతలేక పో
విడుతురు సర్వకర్మములు, వేదము లప్పుడు దుర్వివాదముల్.

శా. పూర్వాచారపరాయణత్వమున నే పోవంగ మీకిచ్చరో
పర్వాచీను లొకళ్లజోలి యదియేలా మీకు? మీయంత మీ

గుర్వర్థమ్ములు సాగఁ జేసికొనుఁ దేగుం డుత్తమంపుంగతుల్
గర్వంబుగా గని యొడ్డనెంచకుఁ డిదే కార్యమ్ము గాకుండెడుగా.

ఉ. ఇంత వచింపనేల ? యిపు డిందటునుగా విను చుండ నేను మీ
చెంతనచించుసంగతులె చెప్పెదు రింకొక ఫక్కి మార్చి "త్వా
నంతము నందె రాయలును నంగనయుగా నదిలో" నటంచు రీ
వింత లనేకముల్ వొడము నెక్కుస మందకుఁ డయ్య వెఱ్ఱులై.

ఉ. కొంపలు "రాయ లుంచుకొనెఁ గోమలి నొక్క తె యావనాన్వయగా
మందులు దానిసే యనిరి మానవనాయకు పుత్రియంచుఁ" దా
మందురు, నాదురాక యిదియంతయు రిత్త యటంచు నవ్వుదుర్
గుందకుఁ డిట్టిపట్టులను గ్రూరయుగం బిది దీని చైదముల్.

ఉ. ఏమన ? మాకు నీగతిని నీయుగమం దగుటే హితమ్ము మా
కీమెయి సంచరించు ద్విజాలే కడునిష్టులు, కాల మాపుదు
గ్ధీమహితుల్ భవాదృశులు ద్వేష్యులు పుణ్యయుగంపురాకకే
మే మొనరింపఁజేయుదుము మీఱినదుష్కృతులెంతలెంతలుగా.

తే. గీ. ఐదువేలవత్సరముల కగును సంక
రం బటంచు వచించుపురాణవాక్య
మెఱుఁగుడప్పటి కాచార మెల్లఁబోవు
నిలుచుఁబల్లెల నెక్కడేనియును నొదిగి.

శా. విద్యావంతులుగూడ ద్రవ్యములనే పేర్మింతు రాచారముల్
సద్యస్త్యాగ మొనర్తు రంటకు సరస్వత్యంబయే సాక్షి యీ
యుద్యోగమ్మునకే కదా ! యవనియా టొప్పెగా వచోమాత, యే
విద్యల్ నేర్చిన పొట్టకే ! యిఁక వృథా వేదమ్ములుగా శాస్త్రముల్.

లవం—(తనలో) నాచాపలమునకు మృదువుగనే చీవాట్లు వైచినది.

భట్టో— దేవీ ! మాయపరాధము సైఁచి యనంతర్ధిగా దర్శన మొకపరి ప్రసాదింపఁగోరెదము.

అప్ప—అంబా ! దుర్భాగ్రహమ్మున నీభక్తుల కపచార మొనర్చు టట్లుండ నీకింత శ్రమమిచ్చినందుకుఁ గూడ క్షమింప వేఁడెదము.

రాయ—జననీ ! ఆ ట్లొనరింపవేని యప్పుడు చూచినదానినే కొంతసేపటికి లేదనెడి యీయుగమునందు "నిక్కముగా గంగ వచ్చిచెప్పెనా, యేదో యిందుఁ గపటమున్నది" యని గేలి సలుపక మానరు.

గంగ—ఇదిగో! ఇచ్చుచున్నాను నిరీక్షింపుఁడు (పటాక్షేపమ్మునఁ బ్రవేశించును).
(ఎల్లరు నంజలిఘటించి భక్తిపారవశ్యమును గనుపఱతురు).

గంగ—

ఉ. అల్లుఁడ వైతి వీజగమునంతయు నేలెడి పాదుషాకు, నీ
కూళ్లతఁడిచ్చెగాదె ప్రతిభోన్నతికై కడుమెచ్చి, యాజమీ
నెల్ల నరేంద్రశబ్దమున కింకొకయర్థ మిదేల? యేలు మీ
వల్లకపాణియుక్ గవిత యైదువులై నినుఁ గొల్వ నొప్పుగన్.

తే.గీ. అవయిని మీరిరువురు సత్యభువనమ్ము
చేరదురుగాత నీచేతఁ జేయఁబడిన
గ్రంథములు భువియున్నంతకాలమును స్మ
రింపఁ జేసెడిఁగాతఁ గీరితి యిదెల్ల.

నీకింకను నావలనఁ గాఁదగు మనోరథం బేమి?

రాయ—కృతార్థునిం జేసితివి. ఐనను ఇదియగుఁగాక.

(భరత వాక్యము.)

తే.గీ. రాజులకు వృద్ధి, యగ్రవర్ణస్థులకును
బుద్ధి, వేదాల నాసక్తి, బుధుల శక్తి,
సకలజనుల కారోగ్యంబు జగతిభాగ్య
మెల్లెడల నుల్లసిల్లు దురిచ్ఛ డొల్లు.

(అందఱును నిష్క్రమింతురు)

గద్య.

ఇది శ్రీకింకవీంద్ర ఘటాపంచానన విద్వత్కవిబాల కలానిధి బాలసరస్వతీ
శతావధాని తిరుపతివేంకటేశ్వర విరచితంబగు
పండితరాజంబునఁ
బంచమాంకము
సర్వమును
సంపూర్ణము.
శ్రీ. శ్రీ. శ్రీ.

---

## —♦ పండితరాజము ♦—

### శుద్ధపత్రము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 7 | 17 | విధ్యియుంచు | విధియించు |
| 19 | 26 | జాలుకొనవర్యో | జాలుకొనయర్యో |
| 22 | 9 | కన్యకం | కన్యక |
| 28 | 22 | ఏకైకవను | ఏకైకను |
| ,, | 25 | అయుత | ఆయుత |
| ,, | 29 | ఉన్మత | ఉన్మత్త |
| 29 | 6 | సుఖకాంత | సుఖకాంభ |
| 34 | 3 | క్షమాళ్వగ | క్షమావగ |
| 35 | 5 | ఆయుతవో | అంయుతవో |
| 37 | 8 | ప్రాసోకర్య | బ్రాణోక్యరు |
| 39 | 14 | పారకాటునం | పారకాటున |
| 47 | 22 | గుహాలం | గుహాల |
| 59 | 8 | పాండిత | పాండితి |
| 74 | 10 | నపారమగుట | నసాగమగుట |
| 76 | 11 | జవచేల | జనచేల |
| 77 | 14 | సోత్రము | స్తోత్రము |

శ్రీమత్పరదేవతాయైనమః

# వ్యసనవిజయము

—:0:—

## ప్రథమాంకము

మ. సిరి సౌభాగ్యము నెవ్వ తేజమున వరించెన్, దేనిమూలాన సు
ర్వర సేవ్యుండున నీశుఁ డంచితసౌభాగ్యత చరిత్రశ్లాఘ్యుండై పర్వె, శం
కరుఁడున్ భార్గవి దేని నాశ్రిత జయాకాంక్షల్ ప్రవర్తిల్ల స
ర్వరసాన్నిధ్యము ద్యూతనామ పరబ్రహ్మమ్ము మిమ్మేలుతన్.

సూత్ర— (ప్రవేశించి) సభాస్తారులారా! సాంజలిబంధంబుగ నాయొనర్చు విన్నపం బాలించి నేఁడు ప్రదర్శింపఁబోవు కేవలాపూర్వమగు రూపకంబునకు మీశాంతిని వహించవలయు. ఏమందురేని యీనాటకమునందలి యితివృత్తము మీలోఁ బలువురికిఁ గ్రోధోత్పాదకమగునేమోయని నామతి కొంకుచున్నయది. పూర్వకాల మెట్లైనను ప్రస్తుతకాలమున దుర్వ్యసనాసక్తులు మెండు. దానంజేసి తన్నివారణార్థంబుగా మేమిప్పుడు ప్రదర్శింపఁబోవు శ్రీ తిరుపతి వేంకటీయంబగు వ్యసనవిజయంబున మీలోమీ 'ఇది నన్నుం గూర్చియె, నన్నుం గూర్చియే' యని యనుకొని మాపైకి దాడివెడలుదురేమో? అట్లు భావించుకొనక యిట్టిది లోకము బాగునకై గ్రంథకర్తలొనర్చిరనియు నందులకే మేము ప్రదర్శించుచుంటిమనియు మీరు దృఢముగా విశ్వసింపవలయు. వ్యసనములు సప్తసంఖ్యాకములైనను, తక్కిన యాఱును నొకతల నిదియు నొకతల యనుకొనుటకుఁగూడ వీలుగానిది యగుటచే దీని నివారణంబునకై శక్తివంచనలేకుండ నెల్లరును బ్రవర్తింపవలసినపని యని నమ్ముకొనియెదను. ఇది పరమచండాలమనుటకు దీనికి నైషధులిడిన దురోదరమను నామమే మనకుఁ బ్రథమసాక్షి. (అనియేమో చెప్పుచుండఁగాఁ దెరలో )

ఎవఁడురా యుక్కుడ? మహారాజాధిరాజులచేఁగూడఁ గృతయుగమునాఁటి నుండియు గౌరవింపఁబడుచున్న ద్యూతము నింతగా నీసడించుచున్నవాఁడు?

(నిట్టూర్పు పుచ్చి) నిర్ధనపురుషుం డెందుకును బనికిరాఁడుకదా ! గ్రహబలము తక్కువగానున్నప్పుడు సర్వమును బ్రతికూలించుచునే యుండును.

చ. సిరికడ కేగినన్ ధనము చేకుఱు, డింగ్రిని యొద్ద కేగినన్
గలుగు, నక్కుబేరు సముఖమ్మున కేగిన నాస్తిపాత్రమున్,
హరునకునైన హరికినైన విరించికినైన సిద్ధియున్
సరిపడ దించుకేని గ్రహచారము చాలనినాఁడు మిత్రుఁడా !.

(దెసలు పరికించి) ఇక్కడ మిత్రుఁడెవ్వఁడు ? క్రమముగా నాకు మతిపోవుచున్నట్లున్నది. స్త్రీవ్యసనమునకు దశావస్థలనియు ద్వాదశావస్థలనియుఁ గొండొక పరిమితి యున్నదిగాని యీవ్యసనమునకుఁ బరిమితియే లేదు. అందులో నేఁడు గోరుచుట్టుపై రోఁకటి పోటు చందముగా

గీ. సోమలింగంబు సిద్ధాంతి సూరిగాఁడు
కమ్మతండును దీక్షయ్య తమ్మిరాజు
నేఁటిరే నత్తురఁట! పెద్దయాటకొఱకుఁ
గమ్మచను దెచ్చెఁ గుంటిగోనమ్మ కొఱకు.

( విచారించుచుఁ గన్నీరు విడుచును )

అప్పయ్య—(ప్రవేశించి) మామా ! తెల్లమొగముపడిన దేమి ? మొన్నరాత్రి పెద్దాట జరిగినదఁట కాదా ? ఇట్టిసమయంబున భగవంతుఁడు నాచేత డబ్బులేకుండఁ జేయుచున్నాఁడు కాని పదిరూపాయలేని చేతిలో నున్నచో

ఉ. వెంగలియాటలాడు నలవెంగలిరాయని రూపుమాపనో
దొంగపరాబుగానిఁ బెడతోవ్రకుడింపి ధనంబు దోచనో
లింగముగింగము న్నలిపి లేదనిపించనో యింతయేటికో
సంగడికాఁడ! నేన పెలుచన్ గడియించెద సర్వవిత్తమున్॥

మామ—అప్పిగా ! మనము దురదృష్టవంతులము కానిచో

ఉ. తక్కువవాఁడనా ? ధనము దగ్గఱనుండిన నున్నవారిలో
నెక్కునిగెల్వఁగాఁదగిన నేరుపులన్నియు లేనివాఁడనా?
నిక్కముగాగణింతు గణనీయముగాఁదగునాటి మాటలో
నక్కట! యొక్కవేటయిన నాదటలే దదియేమి పాపమో ?

వలసినదే! లేకున్న నంతదురాశ యెందుకు? పడియో యిచ్చియో కాయ రాదా? మామా! నాకు న్యాయ్యాగారమునఁ బనియున్నది. పోవలయును. రాత్రి యెందేనిఁ గొంతధనము సేకరించి తెచ్చెదను. (నిష్క్రమించును)

దీక్షి— మామా! నీవు మఱియొకలాగున వింటివేమోకాని నాఁడు వీధిలో నేను గెల్చినకే కల్పెదనంటిని. గెల్చినకుఁ గల్పక నాచేయిచంపుకొందునా యేమి? నేను వెళ్లిపోయినతరువాత నాట యెంతసేపు జరిగినది, యెవరెవరు గెల్చిరి?

మామ— ఎవరు గెల్చిననేమి? ఎవరు గెల్వకయున్ననేమి?

ఉ. వెళ్లఁగ బుద్ధిరాదు కనువేదురుగా ధనముండె నాటలోఁ
గాళ్లను వేళ్లనుం బడినఁ గానియు నెవ్వరొసంగరైరి; నే
కళ్లుచుఁ గంటవత్తి నిడికొన్నటు లూరక చూచుచుండఁగా
భళ్లనఁ దెల్లవారె నలుపంచల నోడినవార లేడ్వఁగన్.

చం. గెలిచెనరాబు కొంత, దొర గెల్చిన వారలలోన లెక్క, ని
చ్చలు గెలుపేకదా? ముసలిచచ్చినవానికి, గెల్చె శాస్త్రియున్,
గెలిచిరి తెంచి తమ్ముఁడును, గెల్చెను కొంచెము దొంగనాయఁడున్,
గెలిచెను చాలఁగమ్మతిఁడు గెల్వని వారలె తక్క నందఱున్.

దీక్షి— మరల వారంద ఱెప్పుడు వత్తురు?

మామ— (సోమలింగంబు సిద్ధాంతి అను పద్యము మఱలఁజదువును)

దీక్షి— ఈనాఁడు మరలఁ బెద్దయాటయే జరుగును.

మామ— పెద్దయాటయిన నేమి? చిన్నాటైన నేమి?

ఉ. 'పైకములేనివాఁడు పెలభామలకుం గొడు' కన్నయట్లు నే
నేకడనున్న నేమి యొక యెబ్బనికానియు నొద్దలేదు; ఛీ
కాకుగనుండె నాబ్రతుకు; కాఁదగువారలనెల్ల దోచి దు
ష్పాకుఁడనై దురోదరము పాలొనరించితి మందబుద్ధినై.

ఇఁక స్వామి వచ్చెనని వింటిని. నా కప్పిచ్చువారలలో నాయనయొక్కఁడే మిగిలి యున్నారు. (ఎదుటఁజూచి) ఆయనయే వచ్చుచునేయున్నవారు.

(అంతట స్వామి ప్రవేశించును)

మామ— అయ్యా! నమస్కారము. మీ రెన్నఁడు వచ్చినారు?

స్వామి— రెండుదినములైనది కాని మఱల గ్రామాంతరమునకుఁబోయి నేఁడే వచ్చితిని.

మామ— మూఁడు నాలుగు దినములుండునా ?

స్వామి— ఆ ! పదిదినముల వఱకుండును.

మామ— స్వామీ !

ఆ. వె. గురజనుంచి బొమ్మ కూడెమ్మునుండి యే
లూరునుండి సాతులూరునుండి
పెక్కుమందివచ్చి పెద్దాట యాడెద
రంట నేఁడు మన్నటింటియందు.

మీరుఁగూడ దయసేయుదురా ?

స్వామి— ఏమి దయసేయుటోయి ?

క. అందఱు బదులో బదులో యుందురు పుణ్యకొని యీరు, రది యెట్లుండన్
గ్రిందటి పరియాయము పదివందల రూపికలు నాకు ధ్వస్తంబయ్యెన్.

మామ— (తనలో) ఓహో ! ఈయన ముందఱికాళ్లకు బంధము వేయుచున్నాఁడే. నాకప్పిచ్చునా ? అయిన నడిగి చూచెదను. (ప్రకాశముగా) స్వామీ !

క. పోవుం బోవలసినచో, రావలసిన యప్పుడు వచ్చు, రాకేమి సదా
యేవాఁడోడును? మీరును రావలసిన మాట నేఁటిరాత్రి కైనన్.

దీక్షి— కలిమి లేములును సుఖదుఃఖంబులును సంసారులకెట్లు సహజములు కావో యట్లే పేకాటలో గెల్పోవుడులును సహజంబులు గావని మీవంటి యనుభవజ్ఞులకు వేఱే తెల్పవలయునా ? ఏమైనను నేఁటి మాటకు మీవంటివారు రానిచో నది శోభించదని నాయభిప్రాయము.

మామ— బాగుగఁ జెప్పితివి. అదియునుంగాక పోయిన ద్రవ్యము రావలసిన నిట్టి యాటయుండే రావలయును. ( తనలో ) ఏకాంతముగా నడుగుట కొంత కార్యసాధకము కాన వీని నవలకుఁ బంపుసాధనము చూడవలయును. (ప్రకాశము) దీక్షితులూ ! మొన్న నేవో ప్రసక్తి మీఁద మీయింట నేదో నైమిత్తికమని చెప్పినట్లున్నావు. నేఁటి రాత్రిమాటగదా ? దానికిందగిన సామగ్రిని సమకూర్చుకొంటివా ?

దీక్షి — బాగుగ జ్ఞప్తికిఁ దెచ్చితివి. భోక్తలను జెప్పుటకై వచ్చి మిమ్ములనుజూచి యీప్రసక్తిలో నది మఱచిపోయితిని. నేను ప్రస్తుతమరిగి రాత్రి తప్పక యాటవేళకు వచ్చెదను. (నిష్క్రమించును)

స్వామి — నేనును వీలున్నచో రాత్రికి వత్తును (అని పోఁబోవఁగా)

మామ—(సంశయించుచు) స్వామీ! ఒక్కమాట! ఈరాత్రి నాచే మీరాడింప వలయును.

ఉ. ఉమ్మడియాట యాడెదను హాయిగ; నిం డొకవంద రూపికల్
సొమ్ముడివోయి యిట్లడుగఁ జొచ్చితిఁగాని నుడొండుగాదు; శా
శ్వమ్మని నాదుసొమ్మయిన పమ్మయిపోవును; మొన్న నేను లా
భమ్మడినాఁడ వందలకు వందలు వేంకటరావుగారికిన్.

స్వామి—మామా! నీకు దురాశ మెండు, గెల్చినను గెల్చి నిల్పుకొనఁజాలవు.

ఉ. అందఱియొద్దనున్న ధనమంతయు రావలెనన్న యాశతో
వందలుగెల్చి నీయెదిరివారల దగ్గఱఁ గాని యున్న దా
నిం దిగమ్రింగ నెంచెదవు నీయవివేకముకాల! వారు దా
నం దమలావుజూపి వచనం బొనరింతురు నున్ననున్నగన్.

మామ—స్వామి! మీరు మాయదియు మర్మమెఱుంగనివారు. ఈయాట సంద ర్భము మీకుఁ దెలియదు. తెలియదన్నానని కోపము వలదుసుండీ! అది ఆటగాని లక్షణము.

గీ. నదులనీరెల్ల వారాశినడుమకేగు
చందమున నున్నధనమెల్ల నిందొకనికి
వచ్చునందాఁక మానరు, పుచ్చవక్క
యైన మిగిలిన లేచిపో రాటగాండ్రు.

స్వామి— అవును! నీకుఁ జెప్పుచుంటినిగాని నేనెన్నిసారులో గెల్చియుఁ దుదకు సర్వస్వముఁ దగులఁబెట్టుకొనకుండ లేచి పోఁగల్గితినా ?

మామ— ఇంతకు నామనవి యేమిచేసితిరి ?

స్వామి— కానిమ్ము! చూతములే!

మామ — చూతమన్నఁగాదు. మీదగ్గఱ బలాత్కారముగాఁ బుచ్చుకోఁగలిగిన స్వాతంత్ర్యమున్నది. (స్వామి జేబులోఁ జేయివెట్టి యందున్న నూరురూపాయల నోటొకటి తీయును)

స్వామి— (మొగమోటముచే నూరకుండును)

మామ— (పరమసంతోషముతో)

గీ. ఏను గెల్చెద నిజముగా నీవమూనఁ
బంచియిచ్చెద మీకును బహుధనము
సెలవొసంగుఁడు చనుచుంటి శీఘ్రముగ నె
ర్రాతి చనుదెందు, నెందు ప్రాప్తముగ ధనము.

స్వామి— వినవగోల ! నాకీమాటలో నంతప్రావీణ్యము లేదాయె ! వట్టివాని చేతి రాయి. రన్నారంటివా నీచిత్తమువచ్చినట్లాడెదవు. నైనా నిజముగాని రన్నారునందు మాయలును మర్మములును లేవు. సరియందు పెద్దమాయలు కలవందురు.

మామ— కలవుగాని మాయఁజేసినవారెన్నఁటికిని బాగుపడరు.

స్వామి— బాగుపడుటకేమిలే ! ఈయాట యాడినవారే బాగుపడరని నానమ్మకము.

మామ— అట్లనవేలా ? బాగుపడినవారెందఱులేరు ?

సీ. చింపి చొక్కాయయుఁ జిన్నగుడ్డలుగట్టు బచ్చులచ్చన దీన బాగుపడఁడె?
తాగ గంజియులేక తపియించువాఁడుగాదె మొన్నటికి దేంపట్రిపవిగాఁడు?
తిరుగఁడే జంగముదేవర ముష్టికై యిల్లిల్లు గంటవాయించుకొనుచు?
శవవాహకుఁడుగాఁడె చాగంటివీరన్న దత్తపుత్రుఁడు కంఠీరత్తిగాఁడు?

గీ. ఎన్నిభూములు గొన్నారొ ! యెంతలేసి
సౌధములఁ గట్టినారొ ! విస్మయము; వాండ్ర
బాగుసర్వంబు పేకాటవలనఁ గాదె?
మానుకొన్నార లీమాటమాట నేఁడు.

స్వామి— ఆస్తిలేనివా రీయాటవలన బాగుపడిన బాగుపడవచ్చునుగాని యాస్తిగల వారు మాత్రము బాగుపడుట సున్న. ఏమంటివా ?

సీ. లంచాలగొండియై లక్షలార్జించిన హోరి లచ్చారావుగారికొడుకు
చేరసారంబులఁ జేసుకూసిన ఘనులూరి కన్నయసెట్టిగారికొడుకు
ప్రగడయై చాలసొమ్ము గడించిపోసిన బారుబూరు సరవ్వగారికొడుకు
విద్వాంసుఁడై చాలవిత్తమార్జించిన కంచి పాపయశాస్త్రిగారికొడుకు

తే. గీ. నన్నవస్త్రంబులకు లేకయనదలగుచుఁ
దిరుగుచున్నారు వారికీతీరు ముష్టి
చెంబుగాని చేతికిచ్చిన చెనఁటిదుర్గు
ణంబు తెలపోయ మాయజూదంబుకాదె.

ఈసంగతి నెఱింగియు నీదిక్కుమాలిన వ్యసనంబులం జిక్కుకొని డెందంబును మరలింపనేరకున్నాను.

తే. గీ. ఆస్తికలవాని, కడిగిన నప్పువుట్టు
వానికిలెఁ గూడ దీపాడుపని నిజంబు ;
గెల్చితే నప్పుతీర్తువు, గెల్వవేని
మాకొసంగెడిదేమి? పైమాటఁజెపుము.

ఉ. పోయినసొమ్ము పోదు నిఁకఁ బోవలదంచుఁ దలంపఁజాల, మా
పోయినసొమ్ము వచ్చుననిపోయి మఱింతగఁ గోలుపోయి, యా
పోయినదానికై మఱలఁబోయి ధన మ్మఖిలమ్ము వమ్ముగాఁ
జేయుచునుందు రింతపరిశీలన జేయఁగఁజాలకక్కటా.

" గీ. పైడికొండనుండి పడఁద్రోసియు, నెక్కించు
జూద మెప్పుడాడరాదటంచు
నొట్టుపెట్టుకొనియు నాడుగఁడు కోకిలా
రవముఁబోలు నక్షరవము విన్న. "

అని మున్ను శౌదరికమహారాజు నుడివియున్నాఁడు. నేఁటికాలమునం దీగ్రామమునందీ వ్యసనంబునందగిలి పెక్కుమంది పాడగుచున్నారు, కొలఁదిమంది బాగగుచున్నారు. తక్కినవా రెనుగుఁబొదుగులులేక కనుబొమ్మలమీఁది వెండ్రుకలవలెనున్నారు.

మామ—స్వామీ! అదృష్టమను పదార్థముండవలెను గాని లేకున్న నే వ్యాపారముఁ జేసిన నావ్యాపారమునందే నష్టముగల్గును.

సీ. ఇంగ్లీషువిద్య బి. యే. దాఁకఁజదివిన మేటితిమ్మన్న యీయాటకొఱకు
న్యాయవాదిగనున్న యాపురంబుననుండి యీనగరంబున కేగుదెంచు,
నొకసారియేని రూపికయైనఁగోల్పోవు టెఱుఁగుదుమే' యింతయేల, యొక్క
నాఁడేని సరాసి జనంతుండు కేశవస్వామియు వెంకప్ప బాపిరాజు

గీ. నోడు టెఱుఁగుదుమే! యొక్కనాఁడు కొంచె
మోడుపోయిరా సొమ్ము మఱునాఁడె గెల్తు
రేమదృష్టమొ! నే నెన్నఁడేని గెల్తు
నేని పోఁగొట్టుకొనుదాఁక నిద్రపోను.

ఉ. పెల్చిన సాధనంబు గొని విక్రమసింహపురంబు పోయి నే
గెల్చితినాలుసంద లవిగెల్చిననెంటనె వచ్చి యంతె నీ
గెల్చినచేతగెల్తునని కేకచునాడితి, పస్తుపాటులో
గెల్చినగెల్పుకాక గొణిగించిరి దిగ్గజమన్నసంతయుఙ్.

స్వామి:— వారలయా టెంత? పాటెంత?

క. రూపికయొ రెండు రూపికలో పెట్టికొండ్ల నాటపోడినను, పో
నేపోవు; గెల్తురేనియు నాపోరనబట్టువారి లక్షలధనంబున్.

మామ— ఈమాటనిజమె! అసామ్ముపోగొట్టుకొనిన నాటిమాటలోఁ బెద్దాటగాఁ
డొక్కఁడును లేఁడు. నేఁడు పెద్దాటలన్నియుఁ జచ్చిపోయినవి!

ఉ. కల్పినమంచువచ్చెదరు కర్వ్యకుఁజచ్చినయంతమంది; యా
కల్పినవార లెవ్వరును గాసును దెచ్చెడివారుకారు; మా
కల్పులుపాడుసేయుదురు కాచెడువారలకడ్డుకోసి; యా
యల్పులతో వివాదపడ మల్లరి చేయుదురన్నభీతిచే.

ఇదియంతయునిల్లిచ్చిన మందరధరరావుగారికోసము.

క. ధననిచ్చునాటకుం జక్కన తేనీ ధనము, తేకపోనీ; దానం
బనియేమి? వారివలనన్ దనకున్ దలకొక్క రూకతప్పకగానన్.

ఈపాడు బికారిమూకచేతంబడిన సొమ్ము, మంటలరాదుకదా!

గీ. సానఁజేయించినాఁడఁట సానిదాని
కానడుమగెల్చి పొటున్నరిపానకాలు;
అంటుజోడును మురుగులు నాటలోని
గడనచేతనే కొనియె వెంకప్పగాఁడు.

సీ. పట్టుచొక్కాయయుఁ బట్టుకోట్లునుదాల్చి తిరుగఁగాఁడొడఁగె బాదర్లరాజు
అయిదువందల వఱకార్జించి పెట్టెలో భద్రమ్ముగాదాఁచె బాపిరాజు
ఉద్యోగమే మానియున్నాఁడు సుఖముగా నిద్రిపో మరఁగి నీలాద్రిరాజు
జరపుకొంచున్నాఁడు చక్కఁగా గృహకృత్యములయనంతాచార్యులనుదినంబు

గీ. కేశవస్వామి మొదలు తక్కినగృహస్థు
లార్జనముచేసికొన్న వారంతొయింతో,

కొడుకునకుఁ బెండ్లియే చేసికొనియె దీన
సార్జితంబుగ మొన్న దామోదరుండు.

గీ. కష్టపడకుండ వచ్చెడిగడన కాన
వ్యయము గావించు నొగి గడ్డిపరకవోలె,
జెట్టిపూల్యమ్మునకుఁ గొంత చేరు నష్ట
హమ్ము కోమటివాఁడ జనమ్ము కడకు

గీ. ఇన్ని పాపంబులం బోవుచున్న దకట!
మనమొగడియించిపోయిన మా యడబ్బ;
కాన మనబోఁటి పెద్దాటగాండ్రె పుడు
మూఁగనీరాదు చిల్లరిమూక నటుకు.

గీ. ప్రతిదినము నందుఁ దనవృత్తివలన గడన
సేయుద్రవ్యము నంతయుఁ జిల్లిగవ్వ
లైనదాఁచక యితరవ్యయంబు సేయు
కంతయును బెట్టు బ్రిక్కిగాఁ డాటకొఱకె

గీ. ఆస్తి కలవాఁడు తమ్మిరాజనఁగ వేన
వేలు తేఁజాలు నోడిన వేళయందు
మాన్యమో మడియో యమ్మి మఱల నాట
నాడఁగలిగినవాఁడు సిద్ధాంతిగాఁడు.

గీ. సోమలింగంబు వేంకప్ప సూర్యుఁడు మొద
లైన కంసాలిమూక యేయాడుముండ
లైన నగలకునై యిచ్చినట్టి కాను
లన్నియును దెచ్చి యీయాట యాడువారు.

గీ. గురజ నాగన్న యోడిన కోలఁది వేన
వేలు గొనితెచ్చి యాటఁగావించువాఁడె;
శాస్త్రిగారు సరేసరి సకలరాజ
మకుటమాణిక్యరారజ్యమానపదులు.

గీ. అన్ని పనులును గావించి యన్ని కూళ్ళు
గుడిచి యార్జించినట్టి సొమ్ముకొంటెకండో
వచ్చి తనయింటిలోపలఁ జచ్చుకతనఁ
గిష్టిగాఁడికి మరల నదృష్టమబ్బె.

సూను— స్వామీ! మందరధరరావుగారితో నేఁజెప్పుమనిన విషయము మాత్రము మఱవకుఁడు.

ఉ. అల్పధనంబుఁ జెత్తురని యందఱుఁ జిల్లరిఁ గూర్కకాదు, వా
దల్పులు గారు, కాక వలదన్నను గోష్ఠము రాకమాన రే
యుల్పులకైన సంఘమునకెల్లరి కాపలెనంచు రావు సం
కల్పము కాని వేఱొకటి కా; దది యంతయు నేనెఱుంగుదున్.

సూను— మొట్టమొదట నన్నుఁ గూడ నీసంఘమునందు జేర్చుకొనుట కెంత గందరగోళము జరిగినదియు మీ రెఱుంగనిది కాదు. మొదట మర్యాదస్థులందఱును గలసి నిర్వ్యాజపారంబగు భానువారంబునం దాడుకొనుట కారంభింపఁబడినది. కావుననే శాస్త్రిప్రభృతులందఱీయింటికి రాఁజొచ్చిరి. తరువాత నీరావుగారి ద్రవ్యాశచేతనే పేకాట జూదమగుటయుఁ బేఁటలేని విధవ చిత్తమూక వచ్చుటయుఁ దటస్థమైనది.

సీ. కలుద్రావి యొడలెఱుంగక కారుకూతలు వదరుచుఁ జను దెంచువాఁ డొకండు
వల్లమందు బిగించి యల్లనబుసుపో వాహ్యాళిఁ జను దెంచువాఁ డొకండు
దరగఁ బాటుగఁ బడి పైసలు లాగికోఁ బ్రక్కనుండఁగ వచ్చువాఁ డొకండు
'గ్రామదేవత బిడ్డఁగనె ధర్మ' మంచు డబ్బాఁ గొని యేతెంచువాఁ డొకండు

గీ. పనియుఁ బాటయు లేక యెవండు గెల్చె
నో యెవం డోడెనో జూచి యూరఁ జాట
వచ్చునని యెంచి యేతెంచువాఁ డొకండు;
నూరిసంతయ్యె మనరావుగారి యిల్లు.

స్వామి— ఇదియంతయు నిజమే! ఈవిషయంబున మనరావుగాని మనముగాని చేయవలసినది లేదు. ఆటయే మానిపించవలెను గాని వచ్చువారిని మానిపించినఁ జాల గందరగోళము జరగును.

శా. రండాగర్భము, 'నీవు రావలదు పోరా!' యన్న వాఁ డెంతయున్
గండాగొండి యొనర్చునేమొ యని పైఁ గాభీతి; పోనీ నిరా
ఘండై 'యల్లరి హెచ్చుగాఁ దొడఁగె నిచ్చోఁ బీలులే దందఱుం
బొండా' యన్న నడంగునాట; యెటు సామ్ముల్వచ్చు నట్లాడినన్?

మున్నొకసారి కారణాంతరమువలన రావుగారియింటిలో మాన్పించినప్పుడు,

గీ. కొండె దేవప్పయింటిలోఁ గొన్నినాళ్లుఁ
గోనమాచార్యు నింటిలోఁ గొన్నినాళ్లు

మున్న దామోదరుని యింటఁ గొన్నినాళ్లు
జరిగినదికాదె మాదిగ సంతసోత్తె.

ఉ. అల్లరిసేయ మోరకుఁడొకప్పుడు వచ్చిన వచ్చుఁగాక యీ
యిల్లన నస్మదాదు లొకయింతయు సందియమందకుండ రాఁ
జెల్లినయిల్లుకావునను చేష్పడకింతకు సాగుచున్న; దా
కొల్లగురప్పయింట జరిగించిన చర్యలు మున్నెఱుంగమే.

కాని రాత్రియుంబగ లీగతి నేకరీతిగా నాడుచున్న నెప్పటికేనిముప్పు రాకమానదు.
కావుననీయుద్యమంబు గొంతమాన్పింపఁ బ్రయత్నించెదఁగాని-

గీ. "మానఁగారాదె మీరు ? నేమానిపింప
వలయునే"యంచుఁ దా మాఱుపల్కునతఁడు;
పెండ్లియాడినపైఁగాని వెళ్లిపోదు
వెఱ్ఱికుదిరినపైఁగాని పెండ్లికాదు.

అదియునుంగాక

శా. తానుద్యోగము సేయఁబూనినను బత్తాయించె విద్యాధరా
ధీనుఁ డమ్మన్ని, డబ్బుచేఁదె నతఁడుం ధీశాలి నిత్యంబు సం
ధానించుఁ; బయివారొకప్పుపటుకుఁ రాకున్న నీయాట జ
న్మావఁ మాననివారుకొంత జన మున్నా రాట సాగింపఁగన్.

నాకు భోజనకాల మతిక్రమించుచున్నది. నీవునుంబోవుదువుగాక (వెళ్లఁబోవును)

సూమ—స్వామీ! తాముతప్పకరాత్రి దయచేయువలయుఁజుండీ! ఈరాత్రి "హేమా హేమీ" లందఱునువత్తురని వేంగళ్రాయనింగారు నాతో నింతకుమున్నే చెప్పి తామాటకొఱకు ధనమునకుకూర్చుకొనుటకు సానియింటికరిగినారు.

స్వామి— సరేమంచిది! తప్పక యట్లేవత్తును (నిష్క్రమింతురు)

గద్య.

ఇతిశ్రీ......తిరుపతి వేంకటేశ్వరులొనర్చిన
వ్యసనవిజయమునందుం
ప్రథమాంకము.

శ్రీమత్పర దేవతాయైనమః

# వ్యసన విజయము

—:o:—

## ద్వితీయాంకము

( అంత వేశ్యమాత ప్రవేశించి )

వేశ్య—అమ్మా ! అమ్మా! ( అని తలుపు దగ్గఱ బిలుచును )

మాణిక్యము—( విసుగుతో ) అబ్బా ! యెందుకే పడిపోయినట్లు పిలిచెదవు?

వేశ్య—ఆయనగారు రాలేదాయేమిటి? అప్పుడేనిద్రబోవుచున్నావు. ఆయన రారని తెలిసినచో జగన్నాధరావుగారికైనా కబురుపంపలేకపోయితివా? ఒక సారి తలుపుదీయుము.

మాణి—( తలుపుదీయును )

వేశ్య—( చెదరిపోయిన ముంగురులును జారిపోయిన పైటయుసవరించి ) అమ్మా! కాసులపేరు కన్పడదేమి? బీరువాలో దాచితివా ? నగలు తీసి దాచుకొను సమయమేటేయిది !

గీ. ప్రొద్దుగ్రుంక లేదు నిద్దురవోచుంటి,
వున్న నగలు తీసియుంటివకట !
బాగుపడుట యెట్లు ? భోగము దానవు
నిద్రయున్న నో గణించు టెట్లు?

పాప మా తెంచిరావు చాలదినములనుండి యాశ్రయించుచున్నాఁడు. ఇదిగో నాలుగు నారసులు తెచ్చియిచ్చినాఁడు. ఒక్కగడియ మాట్లాడి పంపుము. ఏదీ తాళము చెవి. కాసులపేరు దీసియిచ్చెదను.

మాణి—నన్ను సుఖముగా నిద్రపోనీ ! దిక్కుమాలినగొడవ యెప్పటికప్పటి కేదియో సిద్ధము చేసియుంచెదవు, ఇప్పుడు వీలులేదని చెప్పు.

వేశ్య— అమ్మా ! నామాటవినవే, ఇంటికివచ్చిన పెద్దమనిషి నూరకే పంపుటుచితముగాదు. కామన్నను నాల్గునారసులు దెచ్చియిచ్చినాఁడుగదా !

దబ్బగదొబ్బి ముష్కరప్రియులు శూన్యహస్తులుగాఁ గాలక్షేప మొనర్చు
వారుగాని నీకుఁ బలికిరారు.

ఉ. మొన్నటికుఱ్ఱగుంట యది ముష్కరవచ్చయు నాఁకలేదు, రాఁ
గొన్నది సర్వముక్ష హనుమకొండ గణేశ్వరరావు గారు సం
పన్నగృహస్థుఁడుం మకొనెఁ, బ్రాణము పోఁగొడు పాప తల్లిమా
టన్న నొనర్చ కొక్కయడుగైన నుబాఁటి పదేలు పుణ్యమో?

నీవీముసలిముండ యెప్పుడు చచ్చిపోవునా యని యాచముమందువు. నేనున్నన్ని నాళ్లే గాని నీబ్రతుకు కుక్కలకు నక్కలకుఁగూడఁ గాదు, నీవు బ్రతుకుఁ దెఱవెతెంగియున్న దానవేయైన,

కం. ఒడ్డాణ మొసఁగుమరఁటే! బిడ్డా! యాదరమున, కివె పెడ్డవె? నీకీ
చెడ్డపనియేలఁ? గాళ్లఁబడ్డాఁడన్నంత నూడిపడెనే చేపుమా.

చెట్టైకెనను దెచ్చి యీలేదుకదా? చెవి యంటుజోడును గాన్పింపదేమి?

గీ. గుండెలో రాయిపడినట్లులుండె నాకు
మొండిచండాలుఁ డిదిగూడ మోసపుచ్చి
పట్టుకొనిపోయెనా యేమె! మొట్టుపెట్టు
కొనుము నావిూఁద, నిజము పేర్కొనుము తల్లి!

శా. సంపాదించితి నోసి! గడ్డి తిని పీనం బేలపో నీకయీ
కొంపం గోడును నాల్గుగుల్లలును నీకుం గాక నాకోసమా?
గుంపుల్ గుంపుల్ గాఁగ నీకయి యనేకుల్ కాచుకున్నారు; నీ
సొంపుం బెంపును జేరు వమ్ముగుటకున్ సామ్ముల్లఁ జెల్లించితే.

శా. కాణాచీ! యిఁకరాఁడె చూతుపుకొడాకా! రత్నముద్గావు, క
ట్టాణుల్ గా, వొకకాని సొమ్మయిన జెట్టన్ లేము, పోనీ బహిః
ప్రాణం బేయనిసంతసించుచును మాయప్పన్ని గొంపోవునే
మాణిక్యస్థగితమ్ములైన చెవికమ్మల్ చేసు లెట్లాడెనో?

మాణి— ఊఁ! తెచ్చియివ్వరా యేమిటి?

గీ. ఆస్తిలేనివాఁడో యౌదార్యమేనియు
లేనివాఁడో యశము లేనివాఁడొ
పరువులేనివాఁడో పదివేలు కానిమ్ము
లంజదాన్నిసొమ్ము గుంజుకొనునా?

నీకింత యాందోళన మెందుకు? నేనిచ్చినదానికి రెండింతలు పుచ్చుకొనవచ్చు డందువుగాని

కం. "పెద్దాటజరుగునఁట నాయొద్దధనమ్మేనఁ గొంతయున్నది గానీ
యొద్దంగలిగిన మంచిది ముద్దియ" యని తీసె; నేమిమోసము చేసెన్?

ఒడ్డాణము వారమ్మాయికిఁ జేయింపఁదలఁచి మచ్చుకోసమై యిచ్చెనఁట, నాదగ్గఱ నున్నదని కంసాలికూడఁ జెప్పినాఁడు.

వేశ్య—ఓసీ! వెఱ్ఱిదానా! ఇదియుఁ గపటకృత్యమే. కంసాలివానిచే నట్లు చెప్పించెనే గాని.

కం. తమ్మునికూఁతున కొడ్డాణమ్మం జేయింపఁగలిగెనా? యితఁ; డొక య
బ్బమ్మాయె నుంచుకొని ని; న్నమ్మాయీ! యిచ్చినాఁడె యరకాసైనన్.

కం. బంగారువలామాచేయంగలఁడని నమ్మి నెత్తి మాడుటకై మే
నంగల నగలన్నియుఁ జక్కంగానడిపించు వారకాంతలు గలరే?

కం. జీతపురాళ్లిచ్చుటయే యీతనికమ్మక్క! యెఱుఁగమఁటె కూఁతుర! యీ
దాతృత్వంబదియును నాబూతుల నోర్విప్పకుండఁ బుట్టుటకలదే?

(వీధిలో చంద్రిప్ప తలుపు తలుపు అని యరచును.)

మాణి—చంద్రిప్ప కాఁబోలును (అని దడాలునలేచి తలుపుఁదీయును.)

చంద్రిప్ప—(ప్రవేశించును.)

మాణి—చంద్రప్పా! దొరగారు రాలేదా యేమి?

చంద్రి—రాలేదు. నేఁడేవో నాటకమాడుదురఁట. అది చూచుటకై వెళ్లిరి.

వేశ్య—ఆటదగ్గఱ నుండిరేమోనా?

చంద్రి—కాఁబోలును! నాకుఁ దెలియదు. బసదగ్గఱకు వచ్చి బండి దిగకుండఁగనే నన్నుఁ బిలిచి మీయింటికిఁబోయి యీమాటఁ జెప్పుమని చెప్పి వెళ్లిపోయిరి.

మాణి—(తనలో)

శా. కమ్మర్లాఁకుసుల పేరు పంతెముల పాల్గావించెఁగాఁబోలు, గూ
ఢమ్మౌచొప్పున నేఁడు నాటకము జూడంబోవునే లేనిచో!
నమ్మంబోలదు కాలమిట్టిది కటా! నాప్రాణముల్బాయు కా
లమ్మేతెంచె; నిఁకెట్టులో ముసలికూళం జెప్పి యొప్పించుటల్.

శా. నాదే భారమొసంగుమాయనుచు విశ్వాసంబుగాఁజెప్పియీ
జూదంబందు ధనాశఁగొల్పి తుదకున్ జూపించె నీరీతి; దా

బాగగు చీరయుఁ గనులపండువుగా ధరియింతు రీవునుఁ
బోగమ్ముదానవౌట సరిబోటులలో నగుబాటుకాదఁటే?

ఉ. కానుల పేరులేక చెవికమ్మలు లేక విటాళి కల్లఁగే
రాసలు గొల్పు దండకడియమ్ములు నానును లేక చుట్టునుం
దోసెడు మువ్వలున్న మొలనూలును పీలును జాలులేని నీ
వేసముఁ జూడ నెవ్వరికి వేడుక పుట్టు? బికారికూఁతురా!

ఉ. కోపము లేనివాఁడు తనకుఁ బ్రతికూలురు లేనివాఁడు చే
రోపికగల్గువాఁడు మొగమోడిన మానిసి దాత నేత వి
ద్యాపటిమంబుగల్గు దొరయంచు వచించుట లాలకించి యీ
చూపులగుజ్జముండవిలి సొమ్మును వమ్మొనరించితే? కూఁతురా.

ఉ. దొంగను దాఁగఁబోతుఁ బతితుం గులహీనుని లోభినైన వా
రాంగన యుంచికోఁదగు; ననంతధనంబిడఁగాక జూపగా
నిం గలనైనఁ జేరుచుట నింద్యము, హానియొవచ్చు నంచునో
వెంగలికూఁతురా! మును వివేకిని మా ముసలమ్మ తెల్పదే.

ఉ. కాముకుఁడైన తస్కరుఁడు కన్నము వారినఁ దెచ్చియిచ్చు తే
దా మును దెచ్చితానిడిన ద్రవ్యము దెమ్మనఁబోఁ; డెఱుంగవే
సాహితి! నష్టిలేని పని చౌర్యమటందురు; సాఁగివచ్చుచో
నేమియునైన మూలధనమేమియు లేనిది చౌర్యవృత్తియే.

చం. గెలిచినవాఁడు వచ్చి, కలికీ! యిదిగో! ననిమాటయిచ్చు, న
వ్వులు దనివార నీకులుకుఁబోఁకలు మెచ్చు, మఱొండు వాఁడు వె
ల్వెలని మొగంబుతోఁ గళవళించుచు నిచ్చిన సొమ్ముగాక నీ
విలిచిన సొమ్ములెల్లఁ జిడిపీ! నడిపించుఁ గ్రమక్రమమ్ముగన్.

గీ. త్రాగుఁబోతేనిఁ గొనఁడు నీధనము; దొంగ
యైన నీకున్న ధనమున కాసపడఁడు,
జూదగాఁడేని సొమ్మెల్లఁ జూఱవుచ్చు
నీవు ద్రవ్యాళి చే నెవరిచ్చుకొలఁది.

క. ఎమరిచ్చి కూఁతురా! యిటుఁ జవరంగమ్మాడి తుదకు సంసారమ్ముఁ
బసటన్ గల్పితి; విఁక నీకె మనోమ్మునఁ బుంపటి యితఁ డెఱుఁగునో లేనో!

కేంగ— (తనలో) ఈముండ నన్నేదో దెప్పి పొడుచుచున్నది. (ప్రకాశము) ఇదియా పట్టింపు?

గీ. మచ్చుకోసముగొనిపోయి మఱచిపోతి;
నున్నదీపొరపాటు నాయొద్దనరయు;
నిపుడుకంటెయుఁ గమ్మజోడింటికడనె
యున్న; వొడ్డాణ మగసాలియొద్దఁగలదు.

వేశ్య—బాబూ దానికొఱకుఁగాదు, మీయొద్దనున్న నెచటికిఁబోవును? అవిగాక పోయిన వానితాలినగలు చేయింపఁగలరు, నేనీయర్ధరాత్రమున నెరవు లెచ్చోటదొరకునని విసుపుకొంటిని, నాటకమీనాఁడు కాకపోయినరెండొక నాఁడు చూడవచ్చును. బాబూ! మీపాదసాక్షి. మిమ్ముంగుఱించియన్న మాటకాదునుండీ! బాబూ! ముసలిదానను గావునఁ జెప్పుచుంటిని కోప పడకుఁడు.

గీ. నెలదినంబులనుండి మానిలయమునకు
నిద్రకై రారు, వచ్చిననిముసమేని
యుండ, రీరీతి నిద్రలేకున్న జబ్బు
చేయదా? యింతవ్యసనంపుఁ జేటుకలదె?

ఉ. అల్లుఁడుఁగూఁతురుం దగినయందముఁ జందముగల్గియుంటచే
నుల్లములోనఁబొంగుచు నహోయని తోడి నెలందు లెన్న, మా
కెల్లను గంటఁ జూడఁబడ దెక్కడనుందురొగాని, యీచెవుల్
చిల్లులుపోవుచున్న, వదలింపఁగ నెంతటిదాన మిమ్ములన్?

గీ. ఉబుసుపోకకుఁ జదరంగ మొక్కొకప్పు
డాడుకోవచ్చు, వేఁటకు నఱుగవచ్చుఁ
గోడిపందెంబులేనియుఁ గొంత మెఱుఁగు
జూదమాడుట మనకు మర్యాదగాదు.

ఉ. ఈయవివేక మేటికుదయించెనొ మేటివదాన్యమాళికిన్
మాయ దురోదరంబుతగవా! తగువాఁడవు, కుబ్జదాని కే
దోయొక్కగుల్లకొట్టి నుదమొందఁగరాదొకో? జూదమాడి యా
దాయము సర్వమున్నదపి యప్పులపాలగుచుంట న్యాయమే.

గీ. లక్షరూపాయ లప్పుయ్యో నతురాల
నిత్యకేదారములు విక్రయింపఁబడియె

దరిద్ర్యవ్యాప్తికి వేఱుకారణము, సాని
వలనఁబాడయ్యెననుచుఁ బ్రివాద మాకు.

గీ. పండుగో లేకపబ్బమో వచ్చినపుడు
సరసులాడింప వేశ్యకోసరము పేక
లాడుకొనువారమేగాని యకట! తొల్లి
యిట్టివ్యసనంబులం బడుకొనఁగలదె ?.

వేంగ — నీకెవ్వరుచెప్పిరోగాని నేనెన్నఁడిట్టి యాటలసంగతియే యెఱుంగను, ఈ నడుమ రాజకార్యంబులకై న్యాయవాదులయింట్లకుఁ దిరుగుచుంటినిగాని వేఱుగాదు. ఇప్పటికైననిఁకముందిట్టి కొండెగాండ్ర యుపదేశములు నీవు నమ్మకుము, (చంద్రప్పదిక్కు) చంద్రప్పా! నీ వాకిలిపుదగ్గఱఁబరుండుము, (చంద్రప్పనిష్క్రమించును)

వేశ్య — బాబూ! లేపుదయమిక్కడనే యుందురుకాదా! నాకునిద్రవచ్చుచున్నది. సెలవు. (నిష్క్రమించును)

(వేంగళాద్రియనింగారును మాణిక్యముఁ బడకటింటఁబ్రవేశింతురు)

వేంగ — (తనలో) తిరుగలేక కాళ్లునడిపోయినవి. (పైబట్టసగము ప్రక్కగా నిడుకొని సగముపైఁగప్పుకొని పరుండును.)

(తలుపుదగ్గఱఁ జంద్రప్పా! చంద్రప్పా! యనిపిలుతురు)

చంద్ర — (లేచితనలో) అబ్బా! నాప్రాణానికి యమదూతవలె నెవ్వరోవచ్చినారు! (ప్రకాశముగా) ఎవ్వరయ్యామీరు?

(తలుపుదగ్గఱ) నేను నారాయణమూర్తిని, తలుపుతీయుము. (తలుపుతీయగా)

నారా — (ప్రవేశించి) దొరగారినొక్కసారిలేపుము. పనియున్నది.

చంద్ర — లేపినచోఁ గోపపడుదురేమో?

నారా — కోపపడరు. నీకెందుకు లేపుము.

చంద్ర — వారు కోపపడకున్నను (చెవిలో) మాణిక్యంతల్లి నామీఁదఁగోపపడును

నారా — (కొంచెము మెల్లగా) ముసలిముండకు వినపడకుండ మెల్లగలేపుము.

చంద్ర — (సంశయించుచుండును.)

వేంగ — (వినుటనటించితనలో) ఏవో గుసగుసలు వినవచ్చుచున్నవి, (తలుపుకడకేగి) చంద్రప్పా! ఎవ్వరా మాట్లాడువారు?

చంద్రి— బాబూ! మందరధరరావుగారి తమ్ముఁడు

వేంగ— (తలుపుదీసి) ఏమినారాయణమూర్తిగారు! ఇప్పుడువచ్చితిరి?

నారా— మాఅన్నయ్య మిమ్ములను దీసికొనిరమ్మని పంపించెను.

వేంగ— ఏమిసమాచారము?

నారా— (జనాంతికము) ఏమియునులేదు.

సీ. రూపికలొకసంచిరొక్కంబు, సొగలును గ్రిమ్మఱఁగొనివచ్చెఁ దమ్మిరాజు
పైనుండుగాని యేఁబదికిఁ దక్కువలేవు నారనుల్ సిద్ధాంతిగారియొద్ద
గెల్చినసొమ్ముల్ల గెల్చినట్లేయున్న, దింటికిఁ బోలేదు కుంటిమామ
సొమ్ము దెచ్చెదనుండుఁ డమ్మతోడనిపోయి మాటకారి సరాబు మఱల వచ్చె

గీ. స్వామిగారికిఁ గబురేగె, శాస్త్రిగారు
మఱల రాలే మనిరిగాని మానలేరు
చిన్నవారంద ఱక్కడే యున్నవారు
రాయనింగారలిఁక దయసేయవలయు.

శా. గంటల్నాయఁడు దొంగనాయఁడును రంగస్వామి కంసాలియుఙ్
గంటుల్నెందిరిగాన వచ్చెదరు మీకై వత్తురాయేమి! యే
తంటాల్లేవొకసారి రండు మఱలఙ్ ద్రివ్యంబు రావచ్చు మీ
కంబెల్ గానులపేర్లఁ గ్రమ్మఱఁగొనంగావచ్చు నొక్కప్పుడిఙ్.

నేను పోయి యింకను గొంతమందిని పిలువవలయును మీరుదయసేయుఁడు.

వేంగ—(జనాంతికము) బంగారమేమైనఁ దెచ్చిన ద్రవ్యముదొరకునా?

నారా— కావలసినంత ద్రవ్యము. మాయన్నయందులకే మార్వాడీకొట్టు మీఁదికరిగె. వడ్డీ కొంచె మెక్కువయిచ్చినఁ గావలసినంతసొమ్ము.

వేంగ— మఱింక నెవ్వరికొఱ కేగెదరు?

నారా— ముసలికొఱకును గోనమాచార్యులవారి కొఱకు నేగవలయును.

ఉ. ఏఁబదియేండ్లు దాఁటె నిపుడేనియు వీడఁడు సానికొంప నా
బాబును బిల్వఁ బుండినఁ గ్రుబ్బారమునం బడివచ్చిపోవుఁ, దా
నాబిడయింటనుండు నిపు డక్కడ కేఁజని పిల్వఁగావలెఙ్
డాబులెకాని పట్టుమని నాలుగుడబ్బులు తేఁడు వచ్చినఙ్.

వేంగ— నిశ్చయమే! ఆయనకొఱకు మీరంతకష్టపడి పోనక్కఱలేదు. ఇకఁ గోన మాచార్యులంటిమా?

మ. పదిరూప్యంబులఁ దెచ్చి మక్కువడి లాభశాస్త్రిగా నున్నచోఁ
బదులుఁ బందలు గొండిఁ బెట్టుకొనిపోవంజూచు, లేదేని యా
పదిగోల్పోవుటె కాక యల్లరియొనర్పన్ గొంతుకోయ్యండి యె
ల్లిదమై నిప్పులుద్రొక్కు వానరముపోల్కిన్ దాండవంబాడెడిన్.

వీరిరువురు రాకున్న నాట బాగుగా జరుగును:

నారా— కోనమాచార్లయితే నాసాటకు రానేరాఁడు. అతఁడు చిన్నతనంబున జాల దరిద్ర్యముతగులఁబెట్టిరియే యీమాటమానుకున్నాఁడఁట నేనుశాస్త్రి గారికి మాత్రము కబురు చెప్పివచ్చెదను. మీరు దయసేయుఁడు.

వేంగ— నేనువచ్చెదను. మీరుశాస్త్రిగారిని బిలువఁబోవుఁడు.

(వేంగశాస్త్రియనింగారు లోనికిఁబోవుదురు)

నారా— (నిష్క్రమించును)

మాణి— వారెవ్వరు? మరలనాటకుఁ బిలువవచ్చిరాయేమి?

వేంగ— నీవు గ్రహింపలేవా యేమి? నిజము చెప్పెదను నన్నుమన్నింపుము. (చుబుకమెత్తి)

క. ఈనాఁ డేనాఁడుఁ బలెనే నాడన్లేను లాభ మెట్లున్నను నో
చేడె! యొకతెల్వితక్కువ పాడుంబనిఁజేసి గెల్పుపడయకపోతిన్

గీ. ఇమ్ముపజాగ్రిలనత్తు మీయమ్మతోటుఁగ
కుండఁ; బెద్దాటజరుగుచు నున్నదచటఁ
జెల్లవారకమున్నె నీయెల్లపగలుఁ
దెచ్చియిచ్చెద నీతోడు మచ్చెకంటి!

మాణి— మీకీవెఱ్ఱియేల? పోయినసొమ్ము పోయినదింక మీకీయాటకుఁబోవలదని నాయభిమతము. అంతేగాని నగలిచ్చివరావను భయముచేఁగాదు.

క. నిక్కమగుమాటచెప్పెద, లెక్కించుక ద్రేవు లావులించిన మాయ
మ్మెక్కడ! దాచుట యెక్కడ! చక్కని పజాగ్రిలనత్తు చన నెటువచ్చున్?

ఇంతకుము న్నిచ్చినవానికొఱకే భారతమంతకథ జరిగినవి.

గీ. పసర, మేమియుఁ దెలియదు ముసలిదాని
కెవ్వరేరీతివారలో యెఱుఁగలేదు
పెఱబెల్లము నొక్కటే; పాడు డబ్బుఁ
దాచుకొనుఁగాని మర్యాదఁజూడఁబోదు.

గీ. బీరువా తాళముఁదీసి, పెట్టె దెఱచి ప్రతిదినముఁజూచుకొనుచుండుఁ బాఁతనగలు
మరల మీరేగినారనుమాట వినిన వెంటనే మాకు సంశయం బంటియుంట.

కావున నాబ్రదుకు నిల్పుఁడు.

శంగ—నీవు సంశయింపక సంతోషపూర్వకముగా నిచ్చి పంపుదువేని నేఁడు తప్పక గెల్తును. అప్పు డాశ్చర్యమంతయుఁజూచి మీయమ్మ పరమానందభరితయై నిన్నును నన్నునభినందించును. పూర్వము రాజులుయుద్ధములకుఁబోవునప్పుడు ప్రియురాండ్రుత్సాహపూర్వకముగాఁబంపించుటయు దానికిఁ గారణముగా వారు విజయంబంది వారికి సంతోషదాయకులగుటయు నీవు కబ్బముల యందుఁ జదివినవిషయమేకావున నీకు విస్తరించి వచింపనక్కఱలేదు. సంశయింపకుము. ఈసారిమాత్రము నాముద్దుఁజెల్లింపుము. నీకుఁగాని నగలకుఁగాని యేవిధమైనలోపమును రాదు. ఒకవేళ దైవికముగా నన్యథాగాజరిగినను నీవిచ్చిన నగలకన్న మిన్నలగునగలను మద్రాసునకంపెనీలకు వ్రాసి తెప్పించియిచ్చెదను. జాగుసేయకుము, మాటవేళ దాఁటిపోవుచున్నది. (బ్రతిమాలును)

మాణి— (తనలో) ప్రస్తుతమీయన ఋణగ్రస్తుఁడైయున్నను భూధనమువిశేషించి కలవాఁడు. సరిగాఁజూచికొనక కాని రెండు మూఁడేండ్ల యాదాయమైనచో నీఋణమెల్లఁ బూర్తిగాఁదీరిపోఁగలదు. అదిగాక 'యేనుఁగు నిచ్చి యంకుశము నిచ్చుటకు వెనుదీసి' నట్టు లెన్నో నగలనిచ్చి యీయుంగరమిచ్చుటకు వెనుదీసినఁ బ్రయోజనమేమి ? ఈకున్నచో గతమంతయు వదలికొనినట్లే యగునుగదా ? ఏమన నీకారణమున నీయనమనస్సు వికలమై యిచ్చుటకువచ్చుటయే మానినఁ బిమ్మటఁ జేయునదేమున్నది? అట్లగుట నెట్లో ముండ్లకంచెమీఁది బట్టవలె నత్త ద్రవ్యమును లాగికొనువఱకు నీయనమనస్సును వికలపరపఁగూడదు (ప్రకాశము) సరియే! మీచిత్తము. 'సానియేని మందలింపఁగూడదా' యనిలోకులును, మీయింటిలోనివారును నన్నునిందింతురని యింతవఱకేనిఁజెప్పితిని. (పెట్టెయొద్దకరిగి తాళముదీసి) ఇదిగో నత్తు. తమకుజయమగుఁగాక !

శంగ—(సంతోషముతోఁ గౌఁగిలించుకొని) ఈసారితప్పక నేను గెల్తును. ఇది నీయాశీర్వచనప్రభావము గావున నేఁడుగెల్చినదానిలో నొక్కపైసయేని నే నిందులకు నుపయోగింపక నీకే పారితోషికముగా నిచ్చుచున్నాను. ఇదివఱలో నోడిపోయిన నగలను నాస్వంతద్రవ్యముతో విడిపించియిత్తునుగాని యీ పాఁటిసంపాదన దానికై వినియోగింపను. నీవుపరుండుము, నేఁ బోయి వచ్చెదను. (నిష్క్రమింతురు)

ఇది ద్వితీయాంకము.

# వ్యసన విజయము

## తృతీయాంకము

---

( మందరధరరావుగారు ప్రవేశించి గడియారమువంకకుఁ జూచి )

గీ. రెండుగంటలు కొట్టిరి రంపు కాల
యాపనం బేల? ఇప్పు నాయనుఁగు లేగ
రాఁదగినవారు వత్తురు, రాని
వారు రారు, చిటికంతలోఁ దెల్లవారిపోవు.

( తెరపంకఁ జెవియొగ్గి )

'మామగారికై యెదురుచూచుచున్నాము. పెద్దవందెములు కాచుటకుఁ గొనుటకుఁదగిన వాండ్రు లేకున్న నాటగాండ్రకుఁ గష్టమనుచున్నారా'?

గీ. తమ్మిరాజుండె, నుండె సిద్ధాంతిగారు,
వచ్చియున్నారు గోరుగూరివారుగూడ
మొదలిడుం డాట, పేకచప్పుడు రవంత
వినఁబడఁగ లేచి తలయూచు పెట్టిమామ.

మామ— (ప్రవేశించి) నాకొఱకే యెదురుచూచుచున్నారు గాఁబోలును. సభ్యులందఱును లోనికి దయచేయుఁడు.

(అంతటసభికులందఱు దురోదరాగారము బ్రవేశింతురు)

మందర— సర్రాజు గారూ! మీ రాటకాయలు వసూలు చేయుఁడు. నేను పరుండెదను.

ఉ. ఉదయమునందఁ లేఁడు కొలువుం డెద రమ్మని యానతిచ్చె; దు
ర్వ్యాధుఁ డొకఁ డెవ్వఁడో వినిచె నేలికతో మనయాటసంగతుల్
నిదుర కనుంగవంబొడల నే చనిసం గని 'మేలుకొంటివే
మది' యనియొక్కసక్కియను లాడు నతం డనుమాన మారఁగన్.

దోషా— పోనీలే. నీకుద్యోగ మెందులకు ?

చ. నెలకొకరెండు వందలు కనీసపుఁ బత్తెమువచ్చుచున్న నేం
దులకిఁక మాయజీతపుఁబనుల్, నెలయంతయుఁ గొల్వు సేయుటల్?
గెలిచినగెల్వయున్న గతిలేని సరప్పకుఁగూడఁ దప్ప వా
ఖులుపదులైన నీకొసఁగురూకలు కన్నుగనిద్రపొమ్ముఁ కన్.

**మామ**— ఓరీదోషాకరా! ఎందుల కీయసంబద్ధప్రలాపములు. వచ్చినది మొదలు మాయు గందరగోళమే. ఒక్కనిముషమైనను నోరూరకుండవు. అల్లరి ముందును తరువాత నీవును బుట్టితిరి. నీవంటి యల్లరివిగవల కందఱి మూరక యిల్లిమ్మంటె వారేమి?

**దోషా**— ఏమంటివి! అల్లరిసేయనివారెవ్వరు? ఒక్కనాఁడైన నీయొద్దనుంకము వసూలుచేయఁడుగావున నీవీశ్రీరంగనీతులు చెప్పుచుంటివి. ఇందులో నెక్కువ తక్కువలుఁ బక్షపాతమెందులకు?

**స్వరా**— ఓరీ! ఇచ్చినవాఁ డిచ్చితివి, లేని వాఁడు లే; దూరుకోరా నీపుణ్యమాయె!

**దోషా**— నేనివ్వని చెప్పుడు?

గీ. ప్రతిదినమువచ్చి పదియొ యిర్వదియొ రజత
భస్మమొసఁగరించుచున్నాఁడ; బలువె యొక్క
పావలా? పదిటోపలఁ బదునొకండు;
చాలు మామయ్య కంత పుస్సేల చెప్పుమ?

నవ్వులాటకంటినిగాని నేనుమాత్రమిచ్చుట కిష్టములేనివాఁడనా?

**మందయ్య**— ఇష్టములేకున్నఁ దప్పునా?

సీ. మర్యాదగల్గిన మగవాండ్రు వినరాని బండబూతులు గూయుచుండు నొకఁడు
ఆకంఠపూర్తిగా నయిదారు పెగ్గులు కలుదార్వి నట్టింటఁ గ్రక్కునొకఁడు
ధూమపత్రికఁ దార్వి ధుమ్మించు నలువంక సమయంబుఁజూడక యుమియునొకఁడు
మాటిమాటికి గోలమాద్రిగాఁ బిలుచుచు మంచినీళ్లకు నియోగించునొకఁడు

గీ. అన్నియునునోర్చి యాటకిల్లిచ్చువాని
కొక్కరూపికయిచ్చుట యక్కజంబె!
ఇతఁడుగాకున్న నింకొక్కఁ డీపురమున
నిక్కటికతూటి కాసించు నెవఁడుచెప్పుమ?

**మంద**— అయ్యా! ఏలపెనఁగులాడెదరు. ఈఁదలఁచినవా రిండు, లేని వారు లేదు,

సీ. పోలీసువారుపల్వురు చేరియీలలువేయుచుండిరి నడివీధియందు
ఇంతకుముస్నె యీయింటిపై కనువైచి యున్నార లే ముప్పు లుప్పతిలునో?
కొట్లాడకుండ జాగ్రత్త నామర్యాద నిల్పుఁడు మీదియు నిల్పుకొనుఁడు
అల్పాచమానమ్ము నాచరించుకొనుండు వీధికేఁగక యింటిపట్టునంద

గీ. పేరుఁజెప్పినపైఁగాని వీధితలుపు
తెఱచుటందునఁ, జెప్పినఁ దెఱచు తలుపు

మూరయుటందును బొరపాటు సేయవలదు
రామచంద్రుండు కలఁడు సర్వమునకింక.

ముసలి:— పోవోయి! పోలీసువాండ్రేమి చేయఁగలరు? నేను వచ్చినప్పాట్లు వాండ్రె భయమించకయు నుండరు. నేనుసర్కిలుఇన్స్పెక్టరుతో స్పష్టముగా రహస్యముగాఁ జెప్పియుంటిని. మనవంటిపెద్దమనుష్యులాడునది జూదమేగాదు.

సుందరయ్య:— అదేమిమాట? జాగ్రత్త మంచిదగునా కాదా?

ముసలి:— మంచిదేగాని మనకట్టిభయ మేమియును లేదు.

రామ:— రావుగారూ! నేఁటియాట చాలాగందరగోళముగా నుండునేమో? ఇప్పటికే గది చాలకున్నది. మీరుగూడనిచ్చట నే యుండవలయును. ఎవరిని గల్పవలదనిన వారికే కోపము.

సుందర:— నేనుండిమాత్ర మేమిచేయఁగలను? మీలోమీరే సర్దుబాటుచేసికొనవలయును. (నిష్క్రమించును)

రామ— పెద్దలందఱును వచ్చినట్లేయున్నది. ఆలస్యమెందుకు. ఏదీ పేక!

ఉ. పందెలు గోలుపోవుటయు పందెలుగెల్చుట నీయధీన, మే
మందఱముఁ ద్వదీయపరమాదరమున్నది కోరుచుంటి, మే
చందముగానొనర్చెదవో! చాలదరిద్రుఁడఁ బేకతల్లి! నా
వందనముల్ గ్రహింపుము కృపారసనీరధిలోన ముంపుమా.

ఉ. కాలగణించిపోసినది తండ్రిగడించిన ద్రవ్యమంతయుఁ
నాతరమందు బూడిదయొనర్చితిఁ, గాఁపురముండు కొంపయుఁ
లాఁతులకప్పగించితిఁ, గనంబడదేమియు నీవుతప్పు; నా
కేతరిచూపెదో జగదధీశ్వరి యీవిపదబ్ధిదాఁటఁగన్.

గజపతి— (తనలో) అమ్మా! జూదమ! నీకివే పదివేల వందనములు.

సీ. బళ్లారిపురమందుఁ బదియాఱువేలుభస్మంబుగావించె రమ్మారుతల్లి
మదరాసుపురమందు మణిమయాభరణముల్ తగులఁబెట్టించె కైలాసుతల్లి
గుంటగల్లునకొక్కగంటలోఁ బదివేలుతగిలించె రాగిడబ్బెగరవేత
రాజమహేంద్రివరంబులో బూడిద గావించెఁ బదివేలు గవ్వలాట

గీ. రొంపటికేగిన ముందుగ సేగియఁట
నమ్మఁగన్నమ్మ పెద్దమ్మ నెమ్మదట్టుఁ;

గాక పురి నేమిచేయింపఁగలదో తిప్పా!
పట్టినదియెల్ల భస్మమౌపాడుచేత.

ముస— గజపతీ! ఏది! పేకనొకసారి చేతితోఁబట్టుకొనినన్నుఁగూడఁ బ్రార్థింపనిమ్ము.

సీ. తునిలోని కంపాలితోయజాక్షికి జరీచీరలిచ్చితి నొక్కసారిగెల్చి
ఓరంగిలోని జక్కుల సిద్దిసానికి నాకుగొంటి మఱొక్కనాఁడుగెల్చి
కనికి కిచ్చితి కమ్మికంటె కాసులపేరు నెలదినంబుల గెల్పుకలిపియుంచి
పద్మగంధివరుండు పడుకటింటికి హంసుకావించితిని నూఱుకానులొసఁగి

గీ. నేను గెల్చితి నేనియు నిశ్చయముగ
నూరిలోనున్న సానులపేర్మిఫలము ;
ధనము తెచ్చించు బొజుఁగన్న ఘనముకమ్మ
దక్కఁజేయఁగదమ్మ జూదమ్మ ! నాకు.

పెద్దయ్య— నీకుఁగూడ ప్రార్థన మెందుకులే. నీవన్న నెప్పుడును దయయే కదా ?
( ముసలి చేతిలోని పేక యందిపుచ్చుకొని తనలో)

శా. చాగల్నాటఁగలట్టి కర్షకులు విశ్వాసంబుతోఁబంపఁ బ
ణ్యాగారంబున నిల్వఁబోసి వెలరానమ్మించు వ్యాపారమున్
భాగస్థుండను నేను చేయుచును దద్వ్యాపారలబ్ధంబు ము
ఖ్యాగాదాయము బంచియిచ్చితిని నీపాల్గాఁగ నో జూదమా!

మ. ఇవముష్ణంబునుజూడ కొక్కమొగిగా నేఁడాది కేఁడాది శే
బవలార్జించినరొక్క మొక్కఁగడెలోఁ బాప్తింపుటల్యాపి, నీ
వ్యవసాయమ్మును గొంతమంది రుచిమప్పక నీసమూహంబులో
దివఁగాఁ గొంపయు గుండమై దొసఁగు ప్రాప్తింపఁజెంగదే జూదమా.

మ. ఒకనాఁడేఁ బదివోరమనంచు మదిలోనూహించి వైరాగ్యమం
దక, ఘర్మాఁడఱుదేర వందలకు వందల్ వచ్చు; సంతృప్తిఁజెం
దక రా, మూఁడవనాఁడు వందలకు వందల్ పోవు; నీరీతి నా
శకు లోఁజేయుచు వేపుచుంటివిగదే చల్పాదివై జూదమా.

మ. నిల వేఁగానియు లేక యప్పిడెదువానింగాన కంధున్నఁగం
డుల బస్తాలొకవందచేరమిడి సంతోషమ్ముతో సొమ్ము కా
సులుగా మారిచితెచ్చి యాడితి వృథానూయాపరుండైన నూ
కలరాయుం డవిమిళ్ళింగె నీకు దయయేకన్పట్టదో జూదమా!

సీ. పరుజులోనున్న రూపాయలన్నియుఁగెల్చి నొక్కనాఁడాచంటిమొక్కలీఁడు
ఒకమాఱు నీకృపయుండుట దొరగారు సన్నసన్నగ సహస్రంబుగెలిచె
అయిదన్న నయిదురూప్యములప్పుగొని గెల్చె గంటలోఁ బదివేలు కుంటిమామ
చేతిలోపలనొక్క చిల్లిగవ్వయులేక ముసలిబాపఁడు సంచిమూటగట్టె

గీ. నీకటాక్షంబుగల్గిన నిముషమునను
వేనవేలుసంపాదించు వీలుగలదు
కోటిరైయైనను దృటిలోనఁ గూలిపోవు
నది వశస్సమమైన దుష్టాశ్రియంబ!

మ. అని పెన్వార్త సహోదరుంబనిచి నేఁడాఁబెద్దయాటంచు, ని
న్ననుగోల్పోయితి జాలవిత్తమనుచున్, నాపైదయన్ జూపెదీ
వనుచున్ వచ్చితినాశచే మరల భార్యావస్తువుల్ గ్రాంచు నా
శనిగాఁ జేమియొనర్చునో నను దురాశాబద్ధునింజూడమా!

రంగ— (పేకఁ జేతఁబట్టుకొని తనలో)

ఉ. మంచితనంబు సంపదభిమానములుంగల వంశమందు జ
న్మించితిఁ బెక్కుభూపతుల నేస్తముగాంచితి నున్నభూము ల
మ్మించితినమ్మ! నెమ్మి ఋణమే మిగిలెన్ చెడిపోయెఁగీర్తి వ
మ్మించితి నేమిచేసెదవొ? మీదటి దిక్కుఁక నీవె జూడమా.

ఉ. పుండలుఁ గోడిపందెములు మున్నగు దుష్కృతు లాచరించువా
రుండిరిగాని నావలె దురోదరకృత్యమునందు సర్వమై
నుండన మాచరించుకొను మూర్ఖులు మాకులమందు లేరు నీ
యండకుఁజేరినాఁడ శరణాగతుఁడన్ గరుణింపు జూడమా.

సీ. పోలీసుబంట్రోతులీలపైచినయంత గగ్గోలుపడి గుండెదిగ్గురనఁగ
గెల్పుకోసము కల్పు కల్పినయెడ మొట్టమొదటానుపడి తెల్లమోముపడఁగ
గలహంబు పెరిగి యమ్మలదాఁకఁ దిట్లాట పెరిగినంతట మేను విఱిచబడఁగ
మాడుపుపోయినమీఁదఁ బుల్కుపుల్కునఁజూచు దృష్టి జీవచ్ఛవాకృతినిఁదెల్ప

గీ. గడియకొకవేయి భావముల్ గాంచుయుక్త
దీయభక్తుని ముఖకళసోయగంబు
శిల్పికైనను జిత్రింపఁజేతఁగాదు
సత్తమా! కవియైన వర్ణింపలేఁడు.

మ. ధనవంతుండగు కామి కోరఁదగు కాంతన్, జెంతకే తెంచు న
ట్లొనరింపంగఁ జెల్లభంగుల, నిఁకన్ యుష్మత్సపర్యార్థి నీ
చుని గేహంబున కీగతిన్ విగతలజ్జుండౌచుఁ దాఁబోవలెన్
బెనుభూతంబులు తోడునీడఁగఁ గడున్ బెంపొందు పెన్జీకటిన్.

శా. ప్రారబ్ధంబున నేఁడు నాబ్రతుకు నీపాలయ్యె, మేలైన సం
సారం బప్పుల పాలుగాఁ దొడఁగె, నాసక్తిన్ జనానాయలం
కారంబుల్ దెగనమ్మి పైచితిని, పైఁగా రెండుమూన్నాళ్ల కా
ధారం బేమియు లేక నీదయకుఁ బాత్రింబైతి నో జూదమా.

సీ. మార్పించుచుంటిని మఱియొక్క యింటికి దొసఁగువచ్చునటంచుఁ దోఁచినపుడు
చేర్పించుచుంటిని చెడఁగొట్టఁదలఁచిన గొంటుచెయ్వాలఁ గొల్వుకూటమునకు
నేర్పించుచుంటిని నీతులెల్లను గ్రొత్తక్రొత్త సభ్యుల కాసగొల్పు కొఱకు
దూర్పించుచుంటి రాత్రులయందు నీయిల్లు కొమ్మ కేన్గులవంటి కోవిదులను

గీ. నీకపాయము రాకుండ నిచ్చలుఁ గని
పెట్టువారికి లంచ మిప్పించుచుంటి
నెట్లు సేవించుచున్న నాపట్లకరుణ
రాదు లేదుకదమ్మ దురోదరమ్మ!

శా. నాసంపత్తునకబ్బు దుర్గతికి సంతాపంబు లేదమ్మ! వి
శ్వాసంబుంచిన సానిదానినగలు న్వమ్మయ్యె నీనాఁడు; నీ
దాసుండంచు గృపాబ్ధి తేల్చనియెడన్ దక్ష్యంబ యే నూయిరో
గాసున్ వీసము లేని వీనికిని దిక్కెవ్వఁ జుమ్మిఁకన్ జూదమా!

సీ. నీదాసుఁడొకఁడు కళాదకాంతను లేవనెత్తి యింకొకయూరికేగినపుడు
నీబంటొకం డనిందితయైన సతిని రమ్మంచుఁ గన్నైగ గావించినపుడు
నీభక్తుఁడొక్కండు నిర్భీతిగా జూదమాడరండని వీధినరచినపుడు
నీవాఁడొకఁడు సాని నిదురించుతఱి దాని వస్తువుల్గొని యాడవచ్చినపుడు

గీ. రచ్చలకు నెక్కకుండ సారద్ధిమాపి
నీకు భంగంబు రాకుండ నిలిపినాఁడ
నెట్లు సేవించుచున్న నాపట్లకరుణ
లేదు రాదుగదమ్మ దురోదరమ్మ!

నూఱురూప్యంబుల నోటైన జేబులో లేకుండ సభకు గాల్వెట్టఁబోను
అడలివచ్చినఁగాని యప్పుదీయను వేగ సొమ్మింటికేగి తెచ్చుటయె గాని

గీ. జరుగుచున్నది తల్లి! యీవరుస తావ
కవ్రత మ్మొక్క రీతిగాఁ గలిమియెల్లఁ
బోయిన న్బోవఁగానిమ్ము భూమియెల్ల
మాసిన న్మాయనిమ్ము నిన్మానఁజాల.

మందయ్య — (తనలో)

శా. కాపీస్టాంపులువ్రాసి గైకొనిన కాన్కల్, సాక్షి వాఙ్మూలముల్
గాపాడం గయిగొన్న లంచ, మటుపైగాఁ గాగితాల్ గొన్నిటిఁ
మాపఁ గొన్న ధనంబు, జీతములు, పై మా వ్యాలపై శిస్తులున్
నీ పాల్జేసితిఁగాని నీకరుణ లేనేలేదుగా జూదమా.

సీ. తివియసందెడుకు సందెడు పేర్లుగలిగిన భార్యకుత్తుకనుండెఁ బసపుకొమ్ము
సరిగరూప్యంబులే సారపోతపోసిన టర్కికలో మిగిలె నుఱ్ఱాకుచీటి
మణ్యంగుళీయకమయమైన వ్రేళ్లులనుండెఁ గొబ్బరిచిప్ప యుంగరములు
మెయినిండ నగల క్రొమ్మించుమించెడు శిశువులకు దీపస్తంభకలన మిగిలె

గీ. హంగులన్నియుఁగల్గు గృహమున మిగిలెఁ
బ్రిదిలిపోయిన యద్దాల బీరువాలు
దేవి నెత్తమ! యుష్మదధీనమగు మ
నంబుగల్గిన నాకుఁ బ్రాణములు మిగిలె.

సీ. దుఃఖించి, నాకు సద్బుద్ధిజెప్పిన మిత్రవరులందఱిని దిట్టివచ్చినాఁడఁ
'గులగౌరవముకూలెఁ దులువవైతివిదేల' యన్నసోదరునకు వెన్నుపగిలెఁ
బరువుమాలినయట్టి బ్రతుకేలయని వెచ్చనూర్చు భార్యకు నొడల్ హూనమయ్యెఁ
'ఏగదురాతండ్రి! జూదమ్మనీకనియేడ్చునమ్మ యెమ్ములు నున్నమయ్యె నేఁడు.

గీ. నీసపర్యనొనర్చుటకోస మిట్టు
లకట! యెంతయు లోకకంటకుఁడనైతి
నెంతకాల మీ నిర్దయ? యిప్పుడైన
దేవి నెత్తమ! కరుణఁ జిందింపుమమ్మ.

స్వామి :— (తనలో)

గీ. అప్పుగైకొన్నవార లీరైరి మరల
నప్పులిచ్చినవార లీరైరి మరలఁ
దిరిగి వేసారి యొకవందతెచ్చినాఁడ
నాదరింపఁగదమ్మ దురోదరమ్మ.

గీ. జీవికోపాధి చెడుసన్న చేయుమైన
నాకు నీవ్యసనంబున లేకపోయె;
నొక్కపనియును చేయనే నోపయరాలు
మరల నామోము జూచునే మమతతోడ.

సీ. మదిరానునకుఁబంపుమాయన్నకొక్కమ్మ పంపకుండఁగ నీవె పంపినాఁడ
మంగయాంబకొసంగుమాయన్న నాసొమ్ము లొసఁగకుండఁగ నీవె యొసఁగినాఁడ
నూనెవారలకీయుమాయన్న సొమ్ముల్ల నీయకుండఁగ నీవె యిచ్చినాఁడ
నప్పువాండ్రకుఁ దీర్చుమాయన్న ధనమెల్లఁ దీర్చకుండఁగ నీవె తీర్చినాఁడ

గీ. నేమిగ్రహచారమోగాని యిన్నిదినము
లాశ్రయించితి నొక్కనాఁడైన నీదు
ననుగ్రహముదచ్చు పుణ్యంబు నోచనైతి
నోసి దుష్టాశయంబ దురోదరంబ!

ఉ. ఎప్పటికప్పుడే మరల నేదియొ సోద యొకండు చెప్పి, నా
తప్పులు కప్పిపుచ్చి, మమతన్ జెడనీయక కాచుకొంటి నా
తిప్పలు ముందుముందెఱుక దేవున; కిప్పటి జూదగాండ్ర ప్రా
తప్పులు తీర్చియైనను కృతార్థుని జేయఁగదమ్మ జూదమా!

గీ. అన్నియును లక్షరూప్యములాటలోనఁ
గలవు. నేఁడైన నీయనుగ్రహము కలిగి
నాకుఁబోయిన పదివేలు రాకపోయినన్ని?
నీకుఁ బదివేలు ప్రణతు లో సేకతిక్షి!

శాస్త్రి— (తనలో)

మ. ధనమానంబులు వోవుచున్నయవి నిందా వృత్తిపైకెక్కె దు
ర్జనమార్గమ్ములతోడి చెల్మి కతనన్ సత్కార్యనిర్మాణబో
వనవిశ్రాంతికి శాంతిపాడితిని విద్వన్మౌళిరత్నంబన
య్యును "మేలబ్బెను మ్లేచ్ఛభాష తుద" కోహో! నీవ మూమూలమై.

కాదు కాదు! పొరబడితిని. చిన్ననాఁటినుండియును నీసేవకుఁడనే.

చం. జనకునిభీతిచే బడికిపోయెడునట్టులె చేతఁబొత్తముల్
గొని చని తోడిబాలురొక కొందఱఁ బ్రోవొనరించికొన్న వెం
టనె గుడిమూలఁజేరి యకటా సమయంబగునంతదాఁక నీ
చనవున గోరువాఁడను విచారమొకింతయు లేక జూదమా!

( అసంపూర్ణము. )